తెనుఁగులెంక తుమ్మల

సమగ్ర సాహిత్యము – 3

# ఖండకావ్యములు

ప్రచురణ

తుమ్మల శతజయంతి ఉత్సవ సంఘము

గుంటూరు

**ఖండకావ్యములు**

తెనుఁగులెంక తుమ్మల సీతారామమూర్తి

**తుమ్మల శతజయంతి ప్రచురణ**

24 డిసెంబరు, 2001



మూల్యము **రూ. 150/-**

ప్రతులకు

1. **డా॥ కొండబోలు బసవపున్నయ్య**
   1, నలందానగర్, రింగ్‌రోడ్
   గుంటూరు
   ఫోన్ - 350461

2 **తుమ్మల శ్రీనివాసమూర్తి**
   విద్యానగర్, నిడుబ్రోలు - 522 124
   ఫోన్ - 46567

3 **తుమ్మల నారాయణ**
   305, స్వగృహ మోతీ అపార్ట్‌మెంట్స్
   మోతీనగర్, హైదరాబాద్ - 18
   ఫోన్ - 3834437

ముద్రణ

**శ్రీలక్ష్మీ ప్రెస్**

14/2 అరండల్‌పేట, గుంటూరు

ఫోన్ - 230643

# తుమ్మల శతజయంతి ఉత్సవ సంఘము

గుంటూరు

గౌరవాధ్యక్షులు

**శ్రీ వై.వి. రావు**

పార్లమెంటు సభ్యులు

అధ్యక్షులు

**డా॥ కొండబోలు బసవపున్నయ్య**

ఉపాధ్యక్షులు

**శ్రీ పోలిసెట్టి ఏకనాథగుప్త**

**శ్రీ పొన్నెకంటి హనుమంతరావు**

కార్యదర్శి

**శ్రీ కాకరపర్తి వెంకటేశ్వర్లు**

కోశాధికారి

**శ్రీ పాలడుగు లక్ష్మణరావు**

కన్వీనర్

**డా॥ ముద్దన హనుమంతరావు**

తెనుఁగులెంక తుమ్మల

# సమగ్ర సాహిత్యము

మూడవ సంపుటము ప్రచురణకు

**భూరి విరాళము లొసగిన**

వదాన్య శేఖరులు

## వికాస్ విద్యా సంస్థలు

**గుంటూరు**

## జి.యస్.ఆర్. విద్యా సంస్థలు

**గుంటూరు**

# శతజయంతి సమర్పు

తిక్కన పలుకుబడులను పుణికిపుచ్చుకొని తెనుఁగుదనమును రంగరించిన తమ కవితలో గాంధీయమును వెలయించి ధన్యజీవులైనవారు తెనుఁగులెంక శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారు. జీవితమంతయు నైతికములయిన విలువలకే మీదుకట్టిన మహనీయు డాయన. రాష్ట్రసిద్ధి కొఱకు రక్తమ్ము గార్చిన గాంధికవి. బడలి బడలి తల్లి బాసకూడెము సేసిన దేశికవి, మేడిబట్టి నాగలి దున్నిన కర్షక కవి.

అమరజ్యోతి యగు గాంధీ సంపూర్ణ జీవితచరిత్రను మహావీరకావ్యాలుగా తీర్చిదిద్ది మహాత్ముని ఆస్థానకవి యని పేరొంది, సిసలైన గాంధీ అనుయాయిగా బ్రతుకును పండించుకొనిన మహనీయులు తుమ్మల వారు. చక్కని చిక్కని తెనుఁగుదనపు గుట్టు తెలిసి, నుడికారమునకు మారుపేరైనది తుమ్మలవారి సాహిత్యము. తెలుగుసీమ పల్లెపట్టులు కన్నులకు గట్టినట్లు చిత్రించిన మేటి కైసరులు వారు. మాతృభాషాభిమానము, ఆంధ్రరాష్ట్రాభిమానము వీరి కావ్యములకు జీవగఱ్ఱలు. జీవితము వేఱు, కవిత్వము వేఱు అని వారేనాడును భావింపలేదు. నీతిని ఊతగా గొని బ్రతికిన వారికి మాత్రమే తమ కృతులను అంకితమొనర్చి కృతార్థులైనారు.

మేనెంత నలగినను, తమ మనుగడ లోకసేవనమ్మున కొసంగి, నవ్య భవ్య కవితా సృష్టి ద్వారా సామాజిక కల్యాణము కామించిన తుమ్మలవారి శతజయంతి ఉత్సవమును (24-12-2001) పురస్కరించుకొని వారి సమగ్ర సాహిత్యమును సంపుటములుగా ప్రచురింపదలపెట్టినాము. ఈ బృహత్కార్యము వ్యయసాధ్యము. అయినను గుంటూరు నగరమునను, ఆంధ్రదేశమందంతటను గల సహృదయశేఖరులు తెనుఁగులెంకపై గల అపారమైన ఆదరాభిమానములతో భూరి విరాళములొసగి ఈ కార్యమును సఫలీకృతము చేసినారు.

వీరెల్లరకు మేము కృతజ్ఞతాంజలి ఘటించుచు తెనుఁగులెంక సమగ్రసాహిత్యమును ఆంధ్ర పాఠకుల కరకమలములందు అర్పించుచున్నాము.

ఇట్లు

**డా॥ కొండబోలు బసవపున్నయ్య**

అధ్యక్షులు

**తుమ్మల శతజయంతి ఉత్సవ సంఘము**

గుంటూరు

# కృతజ్ఞతలు

తెనుఁగులెంక శ్రీ తుమ్మల సీతారామమూర్తి దాదాపు ఇరువదియైదు వేల పద్యములు విరచించినారని ప్రతీతి. అంత విస్తృతమైన తుమ్మలవారి సమగ్రసాహిత్యమును ప్రచురించుట అలఁతిపని కాదు. ఆత్మకథ, మహాత్మకథ అను మహావీరకావ్యములు వీరి రచనలలో సింహభాగము నాక్రమించుచున్నవి. కనుక వానిని వేఱు వేఱు సంపుటములుగా ముద్రించితిమి.

తుమ్మలవారి ఖండకావ్యములన్నిఁటిని మఱి రెండు సంపుటములుగా వింగడించి ప్రచురించితిమి. వారి కైతలోని క్రమవికాసము తేటపడుటకు వీలగు విధమున ఆ ఖండకావ్యములను కాలానుపూర్విగ కూర్చి వెలువరించితిమి. ఇట్లు వారి రచనలు మొత్తము నాలుగు సంపుటములుగ తేఱినవి. మొదటి సంపుటము – ఆత్మకథ, రెండవ సంపుటము – మహాత్మకథ, మూడవ సంపుటము – ఖండకావ్యములు, నాలుగవ సంపుటము – ఖండకావ్యములు.

ప్రచురితములైన వారి తొలి రచనలలో 'నామదేవచరిత్రము' అను హరికథ లభింపలేదు. రామశతకము, రామలింగేశ్వరశతకము, మహాత్మాగాంధి తారావళి, రామకృష్ణస్మృతి, మాహేంద్ర జననము – అను గ్రంథముల నెట్లో సంపాదించి ఇందు చేర్చితిమి. తుమ్మలవారి తొలి కృతులను భద్రముగా ఉంచి, పునర్ముద్రణ నిమిత్తం మాకు ఎరవుగా నిచ్చిన అమృతలూరు, గోవాడ, వేటపాలెం గ్రంథాలయాధికారులకు కృతజ్ఞతాభివందనాలు.

చక్కని చిక్కని తెనుఁగుదనము తొణికిసలాడు తుమ్మలవారి కవిత్వమును ముద్రించు పట్టున ప్రూఫ్ సరిచూచుట పండితజనైకసాధ్యము. ఈ మూడవ సంపుటమునకు ప్రూఫ్ సరిచూచిన శ్రీయుతులు ఆచార్య యస్. గంగప్ప, గుండవరపు లక్ష్మీనారాయణ, రామడుగు వెంకటేశ్వరశర్మ, చిటిప్రోలు సుబ్బారావు గార్లకు కృతజ్ఞత వెల్లడించుచున్నాము.

ప్రచురణలో తమ అమూల్యమైన సలహాలనిచ్చి తోడ్పడిన సుప్రసిద్ధ విమర్శకులు శ్రీ నాగళ్ళ గురుప్రసాదరావు గారికి, శ్రీ సూర్యదేవర రవికుమార్ గారికి, విద్వత్కవులు శ్రీ యార్లగడ్డ వెంకటసుబ్బారావు గారికి, కవివతంసులు శ్రీ కొల్లా శ్రీకృష్ణారావు గారికి, శ్రీ తుమ్మల శ్రీనివాసమూర్తి గారికి ధన్యవాదములర్పించుచున్నాము.

సంపాదకులు

గుంటూరు
24-12-2001

పులిచెర్ల సుబ్బారావు
వెన్నిసెట్టి సింగారావు

# తెనుఁగులెంక శ్రీ తుమ్మల సీతారామమూర్తి
# జీవితం - కృతులు

**జననము** : 25-12-1901, కావూరు, రేపల్లె తాలుకా, గుంటూరు జిల్లా; తల్లిదండ్రులు: చెంచమాంబా నారయ్యలు; **కుటుంబము** : 1930లో శ్రీమతి అన్నపూర్ణమ్మతో వివాహము. ఒక కుమార్తె, నలుగురు కుమారులు. **గురువులు** : శ్రీయుతులు కావూరి శ్రీరాములు, జాస్తి సుబ్బయ్య, తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రి, దువ్వూరి వేంకటరమణశాస్త్రి; **విద్య** : ఉభయభాషా ప్రవీణ (ప్రథమశ్రేణి), ఆంధ్రవిశ్వవిద్యాలయము - 1930; **వృత్తి** : సేద్యము, తరువాత అధ్యాపనము; 1924-29 తిలక్ జాతీయ పాఠశాల - కావూరు, 1930-57 గుంటూరు జిల్లా బోర్డునందలి దుగ్గిరాల, బాపట్ల, నిడుబ్రోలు, అప్పికట్ల - ఉన్నత పాఠశాలలు, 1920-30 కాంగ్రెసు సేవ, శిక్ష - 1922.

**అభిమాన విషయములు** : గ్రామజీవనము, గాంధీతత్త్వము, సర్వోదయము, ఆంధ్రాభ్యుదయము, తిక్కన కవితామార్గము, చిన్నయసూరి సిద్ధాంతము.

**కృతులు** : **గాంధీకావ్యాలు** - ఆత్మకథ, మహాత్మకథ, అమరజ్యోతి, సర్వోదయగానము, గాంధీగానము, మహాత్మాగాంధీతారావళి. **రాష్ట్రకావ్యాలు** - రాష్ట్రగానము, ఉదయగానము. **ఖండకావ్యాలు** - పఠిగపంట, పెద్దకాపు, శబల, పైరపంట, సమదర్శి, కదంబకైత, చక్కట్లు, దివ్యజ్యోతి. **కథాకావ్యాలు** - ఆత్మార్పణము, ధర్మజ్యోతి. **సామాజికకావ్యాలు** : ఎక్కట్లు, సందేశ సప్తశతి. **స్వీయచరిత్ర కావ్యాలు** - నేను, నాకథలు, తపస్సిద్ధి. **వేదాంతకావ్యాలు** - గీతాదర్శము, భజగోవిందం, లక్ష్మీనృసింహస్తోత్రము, హనుమాన్‌చాలీసా. **నీతికావ్యాలు** - తెనుఁగునీతి, నీతికుసుమము. **స్మృతికావ్యాలు** - రామకృష్ణస్మృతి. **శతకములు** - పురాంతకశతకము, రామ శతకము, రామలింగేశ్వరశతకము. **జంగంకథలు** - బిల్హణీయము. **నాటకాలు** - గిరిజా పరిణయము, హనుమద్విజయము, మాహేంద్రజననము. **హరికథలు** - అన్నదాన మహత్త్వము, సాత్రాజితీ పరిణయము, నామదేవచరిత్రము.

**సమ్మానములు** : 1949 నిడుబ్రోలులో - గజారోహణము, గండపెండేరము, కనకాభిషేకము, సువర్ణకంకణము. 1960లో అఖిల భారత తెలుగు రచయితల మహాసభ సత్కారము. 1967లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ విశిష్ట సభ్యత్వ ప్రదానము. 1969లో కేంద్ర సాహిత్య అకాడమీ బహుమానము, ఆంధ్ర విశ్వవిద్యాలయము "కళాప్రపూర్ణ" బిరుదుతో సత్కారము. 1985లో నాగార్జున విశ్వవిద్యాలయము "డాక్టర్ ఆఫ్ లెటర్స్ (డి.లిట్)" బిరుదుతో సత్కారము. విశాఖ పట్టణములో సహస్ర చంద్రదర్శన మహోత్సవము. నెల్లూరు, అప్పికట్ల, ముక్త్యాల, తెనాలి, గుడివాడ, మద్రాసు, గుంటూరు, విజయవాడ మొదలగు తావులలో. 1987లో గుంటూరు, విజయవాడ పట్టణాలలో భారత ఉత్సవాల సందర్భంగా ఘనసన్మానం.

**జయంతి మహోత్సవములు** : 1952 నుండి పెక్కుచోట్ల

**బిరుదులు** : ఇతరుల దృష్టిలో "అభినవ తిక్కన", తన దృష్టిలో "తెనుఁగులెంక"

**నిర్యాణము** : 21-3-1990 అప్పికట్ల, బాపట్ల తాలుకా, గుంటూరు జిల్లా.

# తెనుఁగులెంక సమగ్రసాహిత్యము
# మూడవ సంపుటము నందు
# ప్రచురింపబడు ఖండకావ్యములు



'తెనుఁగులెంక'

శ్రీ తుమ్మల సీతారామమూర్తి

శ్రీరస్తు

# శ్రీ రామశతకము

ఇది గుంటూరుజిల్లా రేపల్లెతాలూకా కావూరుగ్రామ నివాసియగు

తుమ్మల సీతారామమూర్తి చౌదరిచే రచియింపబడి

మహారాజ శ్రీ తుమ్మల నాగయ్యాచౌదరి,

సుఖవాసి గోపాలరాయచౌదరిగార్ల ద్రవ్యసహాయమువలన

బెజవాద వాణిముద్రాక్షరశాలయందు బి. కే. స్వామి చే ముద్రించబడియె.

1919.

# పీఠిక

చదువరులారా !

నేను కవిత్వము చెప్ప నారంభించి యిప్పటి కేడు సంవత్సరము లైనది. అనగా నాపదునొకండవయేటనే యులవడినది. నాట నుండియు నేటివరకేవియో చాటు పద్యములతో గడిపితిని గాని గ్రంథ మొక్కటియు వ్రాయలేదు. కారణము నే నత్యల్పవిద్యావంతుడనగుటయే. ఇట్లుండ నొకనాటి సాయంకాలమున శ్రీరామ భజనమందిరమున మన్మిత్రరత్నములగు మహారాజశ్రీతుమ్మల నాగయ్యచౌదరి, సుఖవాసి గోపయ్యచౌదరిగార్లతో గూడియుండగా పైవార లిరువురు నన్ను గాంచి మిత్రమా! నీ వీ రాముని మీద నొక కందశతకమును వ్రాయుము. తద్గ్రంథ ముద్రణవ్యయ మంతయు మే మిచ్చెదమని నన్నెంతయు గ్రంథరచనకు, బురికొల్పగా నా రాముని దయచేత నెట్టులో యీ శతకము పూర్తిగావించితి నిందు తప్పులు కుప్పలుగా నున్నవని నేనే యొప్పుకొనుచున్నాడను గాన నాయందు పుత్రవాత్సల్యముంచి మన్నింతురుగాత యని మిమ్ముల బ్రార్థించుచున్నాడను.

శ్రీ సీతారామాంధ్ర
గ్రంథాలయము,
కావూరు, 13-9-19.

ఇట్లు విధేయుడు,
తుమ్మల సీతారామమూర్తి చౌదరి.

# శ్రీ
# రామ శతకము

(కందపద్యములు)

శ్రీకరచరణ ! కృపార,త్నాకర ! ముఖబింబజితసుధాకర !పరద
ర్వీకరశయన ! పితామహ, నాకరమణవినుత ! సద్గుణాకరరామా. 1.

దీనత్రాణపరాయణ ! భానుకులాంభోధిచంద్ర ! పాపహరణ ! ధా
త్రీనందనా మనోహర!, దానవసందోహదండధర ! శ్రీరామా. 2.

శతపత్రపత్రలోచన !, యతిహృదయాంతరవిహార ! యమదమనసతీ
నుతనామ ! దశరథాత్మజ, సితేతరశరీర ! సురవశీకర ! రామా. 3.

శరనిధిగర్వవిభంజన ! భరతాగ్రజ ! విమలచరిత ! భామాజనశం
బరవైరి శౌరి ! మిహికా, ధరణీధరధైర్య ! చక్రధర శ్రీరామా. 4.

అందములై విలసిల్లెడు, కందంబులఁగూరిచి శతకంబొక్కటి యా
నందమున వ్రాయుచుంటిని, బృందారకవరద ! నీదు పేరిట రామా. 5.

దీనం గల దోషంబుల, మానసమున దలఁపకెంతొ మక్కువ నాపై
బూని కృతి స్వీకరింపుము, గానప్రియచిత్త ! దురిత ఖండన రామా. 6.

జనయిత్రివనుచు జనకుఁడ, వనుచు గురుడవనుచు రాజవనుచు హితుడవం
చును బంధువనుచు దలఁచితి, గనకాంబర నన్నుఁగరుణ గావర రామా. 7.

మనుజునకు భవన్నామా, ర్చనమే దురితార్ణవోత్తరణమై వెలయఁ
నినుపూజ సేయకుండెడి, మనుజుండిల నేల నగ్ని మాడ్చున రామా. 8.

చింతింపగ సంసారము, సంతకుసరివచ్చునట్టి సంసారముపై
నింతభ్రమయేల నరునకు, కంతుజనక భక్తలోకకల్పక రామా. 9.

కరిరాజు నేలినాఁడవు, కరుణించితి పల్లధ్రువుని ! ఘనుబ్రహ్లాదుఁ
సరగున ననుఁగాపఁగదే, పరమాత్మ ! దరిద్రహరణ ! పావన ! రామా. 10.

మునిదార నేలితివి శబ, రిని గాచితి వర్కసుతుని బ్రేమించితివ
ద్దను జేంద్రానుజు బ్రోచితివని నినుదలంచితిని గావుమా ! జయరామా. 11.

ఖగ రాజెప్పటియాప్తుం, డగచరు దేనాటిచుట్ట మారయఁగా బం
క్తి గళానుజుఁడెట్టిహితుం,డగరాట్సుధీర ! నేస యుస్యుఁద రామా. 12.

నేరంబుల నెన్నకు నా, భారంబంతయును నీదు పైఁబెట్టితి నీ 13.
వారిన్ జేర్పుము నన్నతి, కారుణ్యముమీర సురసఖా ! జయరామా.

దశవదనానుజుమీఁదన్, శశిముఖి, భూజాతమీఁద సౌమిత్రిపయిన్
బశుపతిసతిపైఁగల కరు,ణ శుభాంగా ! నిల్పుమయ్య నాపయి రామా. 14.

ధరఁగల సమస్తజీవుల, కరయఁగ నీ పాదపంకజార్చన లేమిఁ
దొరకునె గైవల్యం బే, కరణినయిన శీతకరముఖా ! జయ రామా. 15.

ఏమంత్రంబు పఠించుట, చే ముక్తిలభించె దనుజ, శిశుముఖ్యుల కో
స్వామీ నీదగు పదసే, వామాత్రము చేతఁగాదె భవహర రామా. 16.

వేదములు నిజమయిన నీ,వే దైవంబైన పాపవిధ్వంసంబే
నీదగు మంత్రమయిన నిం,కేదీ సందియము ముక్తి కెన్నగ రామా. 17.

నీ పాదసేవ సేయుచు, నీ పుణ్యకథ ల్వినుచును, నీదగు నామం
బేపున బఠించువారలె, శ్రీపతిఘను లట్టిదుల భజించెద రామా. 18.

తారుణ్యం బిహసౌఖ్యము, లారయ సంపదలు నిత్యమా ! కావివి నీ
తారమణ ! నిత్యమని యె, వ్వారేనియుఁ గలను నమ్మవలదుర రామా. 19.

ధన విద్యా కుల బల యౌ,వన గర్వోన్నతిని నిన్ను, బ్రార్థింపక జ
న్మను విఫలమొనర్తురు ధా,త్రిని మూర్ఖులుకొంద ఱర్కదీపిత రామా. 20.

తలపఁగఁ బగలని రేయని, నెలయని యేడనుచు మూర్ఖ నివహం బెదలో
దలఁచెదరెకాని దలఁపరు, జలజేక్షణ యాయువెల్ల సమయుట రామా. 21.

తన సాటిమనుజు లెందఱొ, తనమ్రోలను జచ్చుచుంటఁ దాఁగాంచియు ధా
త్రిని మూర్ఖుడట్లె నేసుౝ, జనువాఁద నటంచుఁ దలఁపఁ జాలఁడు రామా. 22.

కాయమును నిల్పఁగాదర, మే యెవ్వరికైనఁగాని మేదినిలో నీ
కాయమునదీతటస్థం, బై యలరు మహీజ మట్టి దారయు రామా. 23.

మంత్రంబు లౌషధంబులు, తంత్రంబులు నిల్పఁగలవె తనువును వాణీ
కాంతు లిఖితంబు దుడుచునె, యంతకుతోఁదాఁకి జగడ మాడునె రామా. 24.

తన పూర్వార్జితపాపం, బున మానవుఁడెపుడు వెతలఁ బొందునుమఱియున్
దన పూర్వార్జితపుణ్యం, బున నిరతము సౌఖ్యతతిని బొందును రామా. 25.

ఒరునింట గాపురము ఖల, సరసేవయు వైరముదన జ్ఞాతుల తోడౝ
శరనిధిసంచారంబును, నిరతము సేయంగఁదగదు నిక్కము రామా. 26.

పరదేశ మేగుదెంచిన, గిరిగుహలోదాగియున్న గీలాలములో
జొరబడినఁగాన దాగిన, వరదా ! విధికృతము దప్ప వశమే రామా. 27.

చోరులకును దాయాదుల, కారయ నృపతులకెగాని యవనీస్థలి దా
గూరిచిన ధనము చచ్చెడి, చో రా దొక రూకయేని శుభకర ! రామా. 28.

తలఁచెదను నిన్నె భాగ్యం, బలవడిన లభింపకున్న నమిత జ్ఞానం
బు లభించినఁ జేకూరిన, జడమతి నీ సేవ మానఁ జాలను రామా. 29.

శరణాగతసంరక్షణ, బిరుదముగలదనుచు నీకుఁ బెద్దలు పల్కౝ
శరణని నీ దరిజేరితిఁ, గరుణింపఁగదయ్య నన్నుఁ గ్రక్కున రామా. 30.

చతురంభోనిధివలయిత, కుతలేశత్వంబు తనకు గూడినదమికిౝ
మితిలే దదేమి చిత్రమొ, శతపత్రముఖీలతాంత సాయక ! రామా. 31.

దానంబులు జప తపములు, నానాక్రతువులు వ్రతములు నారాయణ ! నీ
ధ్యానమునకు సరివచ్చునె, మానసమునఁ దలఁప సుగుణమందిర రామా. 32.

తమ పాదాంబుజసంప,ర్కము చేత వధూటియయ్యె కఠినోపలయో
కమలాక్ష ! తత్పదమహ, త్వము, నజునకునైన నెన్నవశమే రామా. 33.

మది భక్తిలేక నెప్పుదు, చదివిన వేదాంతకోశ సముదాయము నం
బుదవర్ణ భక్తమానస, సదనా ఫలమేమిలేదు సత్యము రామా. 34.

శ్రీదములై సకలాఘ,చ్ఛేదములౌ నీదుపాద జీవనజములన్
నాదగుహృదయంబున స, మ్మోదమలర నిల్పుమయ్య మునినుత రామా. 35.

పానకము నావుపాలున్, దేనెయు నమృతంబు గుణనిధీ ! క్షారములౌ
నీ నామ సుధాస్వాదన, మైనట్టి మదీయజిహ్వ కారయ రామా. 36.

దురితకరి కేసరి విప,చ్ఛరదభ్రానిలము రోగ శైలభిదురమై
బరగెడి నీదగునామ,స్మరణం బొనరించు వారె మాన్యులు రామా. 37.

ఎంగిలిఁ బెట్టగఁజాలను, గంగాపిత కాలఁదన్నఁ గాఁజాల నురం
బుం గడుభక్తి దనరని, న్నుంగొలువఁగఁజాల నెటు నినుఁ గనుదు రామా. 38.

ఉపవాసంబులు జపములు, తపములు యాగములు కనకదానంబులు చే
సి పటుతరభక్తి లేకన్, విపులాస్థలి ఫలముగాంచ నేరదు రామా. 39.

మన్నింతు రాలుబిడ్డలు, నన్నలుఁదమ్ములును ద్రవ్యమార్జించెడుదా
కన్నా ! దరిద్రదశలో, కన్నులఁజూదరు తలంపఁగా జయరామా. 40.

నాయొనరించెడు తప్పుల, బాయనిదయ నొప్పులనుచు భావింపుము నే
జేయు ప్రసంగములన్నియు, ధీయుత నీజపమె యనుచుఁ దెలియుము రామా. 41.

పరవనితాసక్తుండగు, పరధనరక్తుఁడగు నొరుల భాగ్యంబునకై
గురుచింతఁజెందు దోషము, లరయు నొరులపట్లఁ గుజనుఁ దనిశము రామా. 42.

కొడు కేతప్పులు జేసిన, గడు నెయ్యంబూని తండ్రిఁ గరుణించెడి కై
వడి తప్పులొనర్చిన ప్రే,ముడి భక్తులఁ గాతువయ్య బుధనుత రామా. 43.

తనువుపయిఁ ధనముపయిఁ, వనితలపై సుతులపైని వాంఛలుగలయ
ట్లనఘా! భవత్పదారా, ధనముపయిఁ లేదువాంఛ, తథ్యము రామా. 44.

జనియించినదాదిగనే, యొనరించినపాపమెంతయో పూర్వభవం
బునఁజేసిన దదియెంతయొ, యనఘా ! యీ యఘములెప్డు దడగుర రామా. 45.

కోపంబూనక మది నా, పాపంబులనెల్లనడచి పజ్జకునన్నుఁ
జేపట్టుమయ్య సుఖముల, బ్రాపింపఁగ జేయుమయ్య భవహర రామా. 46.

దోసిలినొగ్గితి నాదగు, దోసంబు లడంపుమనుచు తోయజనయనా
దాసునితప్పులు దండము, తో సరి యని పెద్దలాడుదురుగద రామా. 47.

సుతులున్నవారికే స, ద్గతి చేకుఱునంద్రుగద శుక మరుత్సుతులే
సుతులఁ గాంచిరయా స, ద్గతికిఁ గారణము భక్తిగావలె రామా. 48.

అనయంబును నిన్నెదలో, వినుతించుచునుందువారు వెఱువగనేలా
దినరాజసుతుని బాధకుఁ, గనకాంబరధార దళితఖలజన రామా. 49.

పరుదోషంబులనెన్నెడి, తఱి నాల్కలు వేయియగును దర్కింప పరాం
బురుహాక్షుల జూచెడువడి, నరయఁగ ద్విసహస్రములగు నక్షులు రామా. 50.

ఎన్నఁదగుఁ దారకాతతి, నెన్నఁదగు తుషారకణము లెన్నఁగఁదరమా
యన్నలువకైన నింతకు, మున్నెనెత్తిన భవములు మునినుతరామా. 51.

మొసలిగలట్టి తటాకము, కసవుపయిఁ గల్గుబావి కాకోదరము
న్న సదనమీ సంసారము, కుసుమశరాకార ! పుషితకుంజర ! రామా. 52.

పెనుదుఃఖమబ్బు నొనరిం,చిన పాపంబుల దలంపఁ జిత్తంబున నం
త్యనరక వేదనలెన్నఁ గను దుఃఖంబినుమడించుఁ గద రఘురామా. 53.

అన్నా యీదుఃఖంబుల, గ్రన్ననఖండింప నెవరుగలరింకను నీ
కన్నను నాకాప్తులు మది, నెన్నఁగ వినుతాఖిలావనీశ్వర రామా. 54.

మొఱవెట్ట మకరిబాధకు, కరిరాజు సహింపలేక గావుమనుచుచె
చ్చెరవచ్చి బ్రోచితి వనుచు, మొఱవెట్టితి గావుమయ్య మోహనరామా. 55.

కోరిన వరముల నొసఁగెడి, ధీరుఁడవని యాశ్రయించితిని నిన్ను గృపా
పారావారా ! యిపుడేఁ, గోరితిఁ గైవల్యమొసఁగు గొబ్బున రామా. 56.

పలుకవదే మెన్నివిధం, బులవేడిన నిటులు కిన్క బూనగ దగునా
జలజాక్ష నీవె కినిసిన, నిలలో నాకరయ దిక్కి కెవ్వరు రామా. 57.

ఏలర యీరీతి పరా,కేలర నామీఁద నీకు నెంతయు దయరా
దేలర జాలంబఁకఁ జా, ల్చాలుర, రవివంశవార్ధిచంద్రా రామా. 58.

లేవేర ! దిక్కు నాకు, న్నీ వేరా ! తగునెతగునె నీకిటులింకన్
గావర ! నను జనకతనూ, జావర ! రిపులోకభీమసంగర రామా. 59.

ప్రాకటముగ నీచరితము, లోకంబుల కెఱుఁగఁ జేయ శ్లోకంబుల వా
ల్మీకివలె వ్రాయుదమనన్, నాకంతటిప్రజ్ఞ లేదు నగధర రామా. 60.

ఘనభక్తితోడఁ గమలా,సనతనయునిలీల గానచాతుర్యముచే
ననయము నీచరితంబుల, వినుతించెడిప్రోడఁగాను వినుమా రామా. 61.

బాలేందుశేఖరుని గతిఁ, జాలంగా నీదునామ సారమెఱుంగన్
జాలినవాఁడనుగాను సు,శీలా కరుణాలవాల శ్రీరఘురామా 62..

కూడున్నీరును నిద్రయు, వీడి మునులరీతినిన్నుఁ బెంపగుభక్తిన్
వేడంగఁజాల నృపకుల, చూడామణి ! కపటహరిణసూదన ! రామా. 63.

ఇఁక నేఁజేయున దేమన, నొకదండము బెట్టుటయె బుధోత్తమ ! సుతుపో
లికఁజూచి నన్నుఁగావుము, సకల జగద్రక్ష ! దనుజశాసన ! రామా. 64.

వేధాదులకెల్లను నీ, వాధారుఁడవనుచు కోవిదానీకమనన్
బాధోధిశయన కరుణాం, భోధీ ! దరిజేరినాఁడ బ్రోవుము రామా. 65.

కులవృత్తివీడిన యజా, మిళుఁడు ఖలుఁడునిన్నుఁదాను మృతినొందుతఱిఁ
దలఁచిన నొకపరి మోక్షం,బు లభింపఁగఁజేసితయ్య బుధనుత ! రామా. 66.

దారులగొట్టుచు మిగులఁ, గ్రూరుండయినట్టి పుట్టకొమరుండు భవ
చ్చారిత్రంబు రచించిన, కారణమున ముక్తికేగఁ గల్గెను రామా. 67.

ఎంగిలిపండ్లను దెచ్చియొ, సంగినఁ దిని సంతసించి శబరికి కరుణా
పాంగ ! దయఁజూపితివిగద, మంగళకరమైనముక్తిమార్గము రామా. 68.

ఎటువంటి క్రూరుఁదయినను, పటుభక్తినుతింప నిన్నుఁ బరమపదంబుఁ
జిటుకున నిత్తువుగాదే, పుటభేదనవైరిశక్రపూజిత ! రామా. 69.

ఏ రాజు లెత్తనేనియు, నేరని హరుకార్ముకమును నీ వెత్తి బలో
దారత విఱిచితి విల నె, వ్వారికి నీ బలము నెన్న వశమగు రామా. 70.

లోకంబుల నన్నిటి న,స్తోకదయఁ గాన నీవెసూ ! తల్లివి నా
ళీకదళసమనయన ! సక,లాకీర్ణాకార ! భూమిజాధిప ! రామా. 71.

హితమార్గము నెఱిఁగించియు, పిత వీవే పెద్దచేసి ప్రేమింపగ నో
యతులితగుణాఢ్య ! మునిహృ,చ్ఛతపత్రోష్ణకర ! హతనిశాచర ! రామా. 72.

అనుకంపయనెడు నౌషధ,ము నొసంగియు జన్మరోగముల నడగింపం
గను వైద్యుఁడ వీవె దయా, వనధీ దశకంఠమదనివారణ ! రామా. 73.

శ్వేతాగము చింతామణి, రీతిఁ సంపదలనెల్ల బ్రేమ నొసంగఁ
దాతవు నీవెగదయ్యా, నా తండ్రీ సర్వలోకనాయక రామా. 74.

నీ పూజ నేను మానఁ, దాపసనుత ! నిన్ను బోలు దాతనుగానఁ
పాపంబులఁ బాపఁగదే, కోపంబును వీడి కుసుమకోమల రామా. 75.

మన్నించి నాదు తప్పులఁ, గన్నులఁ గనకుంటివేని కరుణామతి నో
యన్నా ! సన్నేలఁగ నెవ,రున్నా రెన్నంగ దక్షులుర్విని రామా. 76.

నిన్నేగాని యొరుల నే,నెన్ననుచు వేడుచుండ నెంతటికిని నీ
సన్నిధికిఁ జేర్చవేలర, పన్నగరాట్శయన ! సుప్రభాయుత ! రామా. 77.

నను నీవు గావలేదని, విన నవ్వరె లోకు లెల్ల విధ్వంసంబై
చనదె భవద్యశమెల్లను, అనుమానము యింక నాశ్రితావన ! రామా. 78.

భయములు నిను వేడినచో,రయమునఁ బాఱుం దమిస్రరాసులలజగ
న్నయనుని గని పాఱెడుగతి, సుయశోనిధి ! దశరథేంద్రసుత ! జయరామా. 79.

స్మరకోటి సుందరంబై, పరగెడి నీ రూపు నొక్క పర్యాయము నా
కరవిందనయన జూపుము, మఱిమఱి నే గోరుచుంటి మనమున రామా. 80.

విదితప్రపత్తివేడిన, మది కరుగదదేమి వజ్రమా లోహంబా
మదనారివినుత! శిలయా, యెదియైనది తెలియదయ్య యినకులరామా. 81.

పిలిచిన వెంటనె చెంతకు, గులుకుచు నరుదెంచి సుధలు గురిసెడిపలుకుల్
పలుకుటను నోటిముత్తెం,బులు చిందియు నిటునటెగిరిపోవునె రామా. 82.

మణిఘటితకిరీటము కం,కణములు నా కీయవలదు కనకాంబరముఁ
దనువునఁ గప్పవలదు కాం,చనచేలా! ముక్తియొండె చాలును రామా. 83.

ఎచ్చోట నిన్నుఁగాంచెద, నెచ్చటనున్నాఁడవనుచు నే వెదకెద నా
పచ్చవిలుతుమామకు సరి,వచ్చు మొగము జూపు మొక్క పరి శ్రీరామా. 84.

విధుదర్శనంబునకు నెదు,రెదురుగను జకోర మట్లు లేను భవత్స
ద్వదనావలోకనంబున, కెదురెదురేచూచుచుంటి నెపుడుఁ రామా. 85.

మందరగిరిధర సనకస,నందనవినుతేందిరామనఃకమలరవీ
మందాకినీజనక ని, న్నెందాకనుతింతు నేలుమింకను రామా 86.

ఎంతటి మహానుభావుడ, వెంతయు నందంపువాడ వెన్నఁగ మదిలో
వింతలు నీ చరితంబులు, సంతతకల్యాణ ! దివ్యచరితా ! రామా. 87.

ప్రోచిన నను గినుకను విడc, జూచిన నిను గొల్తుcగాని శుద్ధాత్మా ! కే
ల్సాచి నను గావుడీ యని, యాచింపcగcజాల నిక్క మన్యుల రామా. 88.

వరద ! పరాత్పర ! జలచర, వరకమఠకిటీ ! నృసింహ ! వామన ! భృగురా
మ ! రఘూద్వహ ! కంసాసుర, హర ! బౌద్ధ కలికి మనోహరాకృతి ! రామా. 89.

వేదముల దొంగిలించిన, యాదనుజుని సోమకాఖ్యు నదచి నిగమముల్
మోదమున నిచ్చితివి వా,ణీదయితున కఖిలసన్మునిస్తుత రామా. 90.

కమఠాకృతి మందరగోత్రము వీపున దాల్చితివి సురదనుజులుపయో
ధి మథించువేళ నవ్యయ !, నమనీయాకార ! వైరిఖండన ! రామా. 91.

ధరనెల్ల చాపజుట్టిన, కరణిని జుట్టంగ హేమకశిపానుజుండా
కిరిరూపమూని వానిc, బరిమార్చితివయ్య లోకబాంధవ రామా. 92.

కంబమునబుట్టి ప్రహ్లాదుం బాలనజేసి మిగులదోహేరమున
మాంబకుని యన్న నదచితి,వంబరతటినీపితా నృహరివై రామా. 93.

అదితికి వామాకృతినీ, వుదయంబయి దానవాన్వయోత్తము బలిని
బదమునద్రొక్కితి వడుగున,కదితిసుతులు బొగడ భీకరాహవ రామా. 94.

జమదగ్ని తనూజుండవై, క్షమగల భూపతులనెల్ల చంపితివి కురా
రము బూని యిరువదొకపరి, సమదాసుర విపినవాయుసహచర ! రామా. 95.

రాముండవై జనకసుతా, కాముండవై పంక్తివదనుc గదనస్థలిలో
భూమిc గూల్చితివి సుగుణ, ధామా ! క్షితిభృల్లలామ ! దశరథరామా. 96.

వసుదేవ తనూజుండవై, రసభారంబెల్ల నదపి రాజిల్లితి విం
దు సమానవదన ! హాటక, వసనా పాతకహిమప్రభాకర వారిద రామా. 97.

జీవహరణంబు వలదని, దేవుండొక్కండెయనుచు దెలియcగబల్కc
శ్రీవర ! బుద్ధుడవైతివి, భూవలయంబందు బుధులు బొగడcగ రామా. 98.

మిగుల దురాచారంబులఁ, నెగడెడి కలియుగము మిగుల నిర్మలముగ జే
యఁగఁ గల్కిరూపమందితి, వగణితగుణనిలయ ! వందితామర ! రామా. 99.

వీడక నినువేడిన సమ,కూడునుగద సత్పదవి శకుంతలగమనా
యీడెవ్వరయ్య నీకీ, రేడుజగంబుల సతామరేశ్వర ! రామా.! 100.

వందనము భక్తచందన, వందన మఖిలాధినాథ వందనము హరీ
వందనము జానకీవర, వందనము సమస్తలోకవందితరామా. 101.

నీపాదసేవయున్మతి, నీపాదార్చకులపొందు నేవిడువ ముకుం
దా పుణ్యపురుష ! ఖండిత, పాపా! రవివంశదీప ! పావన ! రామా. 102.

కమ్మకుల ప్రభవుండను, తుమ్మలనారయ్య వరసుతుఁడఁ గావూర్గ్రా
మమ్మున వసించువాఁడ శు,భమ్ముగు నవనోళగోత్రభవుడను రామా. 103.

వనజాతపత్రసమలో,చన ! సీతారామమూర్తి చౌదరి యనువా
దను వ్రాసితి నీశతకం,బనఘా ! పదునెనిమిదేడు లప్పుడు రామా. 104.

పదునెనిమిదివందల నలు,బదియొకటవయేట శాలివాహన శకమం
దిది సిద్ధార్థిని వ్రాసితి, ముదమారగ నీదుకరుణ ముద్దుల రామా. 105.

ఎంతటి ఖలుఁడైనను గదు, సంతసమును దీనివినినఁ జదివిన వ్రాయఁగ
గంతుజనక నీదయచే,నెంతయు విమలుడగునిక్క మియ్యది రామా. 106.

మంగళమంగజజనకా, మంగళమినపుత్రమిత్ర మంగళమనఘా
మంగళము జానకీవర, మంగళమఖిలామరారిమర్దన రామా. 107.

సంపూర్ణము



'తెనుఁగులెంక'

శ్రీ తుమ్మల సీతారామమూర్తి

శ్రీ

# రామలింగేశ్వర శతకము

ఇది

గుంటూరుజిల్లా, రేపల్లె తాలూకా, కావూరు గ్రామనివాసియగు

**తుమ్మల సీతారామమూర్తి చౌదరిచే**

రచియింపఁబడి

**మ. రా. శ్రీ భువనగిరి కోదండపాణి, బి.ఏ.,**

(చెరుకుపల్లి సబ్ రిజిస్ట్రార్)

గారిచేఁబరిష్కరింపఁబడి

బెజవాడ వాణీ ముద్రాక్షరశాలయందు

**బి. కే. స్వామిచే**

ముద్రింపఁబడియె.

ప్రథమముద్రణము 500 ప్రతులు.

1919

# పీఠిక

పాఠకమహాశయులారా!

నేను రెండునెలల క్రిందట రామాంకితముగా నొక కంద పద్యశతకమును వ్రాసి యచ్చొత్తించితి. దానినిజూచిన పిమ్మట నామిత్రరత్నమగు మ. రా. శ్రీ నాగళ్ళ తాతయ్యచౌదరిగారు నన్నుగాంచి మిత్రమా! నీవు మరల మనయూరగల శ్రీరామ లింగేశ్వరస్వామి వారి కంకితముగ నొకశతకమును వ్రాయుమని నన్నెంతయు గ్రంథరచనకుఁ బురికొల్పగా నీ శతకమును రచియించినాడ. ఇందు నాయవివేకముచేత ననేక దోషములుండ వచ్చును. గాన వాని నన్నింటిని దయయుంచి నాకు తెలియఁ బరచినచో ద్వితీయముద్రణమునందు సవరించుకొనియెద.

ఇట్లు

గ్రంథకర్త.

01-12-1919



# రామలింగేశ్వర శతకము

(శార్దూల మత్తేభవృత్తములు)

శా॥ శ్రీమద్గోత్రవరాత్మజాహృదయ రాజీవోదయాదిత్య! నా
నామౌనిస్తుతపాదపంకజ! నిశానాధావతంసేందిరా
భామానాయకసాయకా! దళితపాపస్తోమ! కావూరుస
ద్గ్రామాగార! శరత్పయోధరసమాంగా! రామలింగేశ్వరా॥ 1

మ॥ పశురాడ్వాహ! నిరీహ! భక్తజనకల్పా! నాగకేయూర! భా
నుశతాభద్యుతిరాజితాంగ! గిరిశా! నూనప్రభావాన్వితా
విశదాహార్యనివాసదాసవరదా! వీరాగ్రగణ్యా! లతాం
తశరాహంకృతిభంజనా! విమలచిత్తా రామలింగేశ్వరా॥ 2

శా॥ శ్వేతక్ష్మాధర శీతభూధర శరజ్జీమూతకంజాతసం
జాతాబ్జాతముఖీసితాబ్జమిహికా జైవాతృకాదిత్యభూ
జాతవ్యోమధునీపటీరదరకాశవ్యాళదుగ్ధార్ణవ
శ్రీతన్వీసుతవాహవర్ణజితకీర్తి 3

మ॥ కరిచర్మాంబర! ఫాలలోచన! శివా! కారుణ్యరత్నాకరా
హర! భూతేశ! గిరీశ! శంకర! మహేశా! ధూర్జటీ! పూర్వని
ర్జరవంశాభ్రమహానిలా! విబుధవర్యా! మేచకగ్రీవ! భా
స్కరచంద్రానలనేత్ర! మారమదభంగా॥ 4

మ॥ వరకాకోదరహార! ధీరవినుతా! బాలేందుఖండావతం
స! రసాస్యందన! బాహులేయజనకా! స్వర్ణాద్రిబాణాసనా!
గిరిరాడ్ధీర! దయాసరిద్వర! పినాకీదివ్యచారిత్ర సా
గరతూణీర! వియద్ధునీయుతవరాంగా॥ 5

శా॥ శర్వా! సర్వకళాప్రవీణ! మృదుభాషా మందహాసాననా
గర్వోద్రిక్తవిపక్షరాణ్ణిచయశిక్షాదక్ష! గానప్రియా!
సర్వజ్ఞా! ప్రమధేశ! ఖండపరశూ! శాంతాత్మ! శూలాయుధా!
నిర్వాణాధిపతీ! నుతాద్రిపరిపంధీ! 6

మ॥ హరిణాంకా! విషభక్షణా! భృతకపాలా! ఫాలనేత్రా! పరా
త్పర! గోరాజపతాక! యాగహరణా! పద్మాక్షసన్మిత్ర! యం
బరకేశా! పురభంజనా! కదనభీమా! భీమ! యోగీంద్రహృ
త్సరసీజాతనివాస! దాసజననాథా॥ 7

మ॥ అనుకంపారసపూరపూరితకటాక్షా! దక్షజామాత! దు
ర్జనసంహారి! భవాంబురాశితరణీ! జాయార్పితార్ధాంగ! స
ద్గుణవల్లీనిచయాలవాల! సురబంధూ! సుందరాకార! వా
రణనామానిమిషారిగర్వపరిహారా॥ 8

మ॥ గుణరత్నాభరణా! వినాయకగురూ! కుందేందుమందారహీ
రనదీరాట్తరళేక్షణాసమశరీరా! పండితోత్తంస! పా
వన! పంచానన! స్వప్రకాశ! వరదా! వాఙ్మనసాగోచరా!
వనజాత ప్రభవాండమందిర! సురాప్తా॥ 9

మ॥ వరశార్దూలమదేభవృత్తముల నీపైవ్రాయఁగాఁబూనితిన్
గరుణాత్మా! శతకంబొకందుమిగులన్ గౌతూహలంబొప్ప నిం
దరయన్ దప్పులు గుప్పలైదనరు సత్యంబైనఁ బాటింపకే
కరుణన్ మత్కృతిగైకొనంగదె సితాంగా॥ 10

మ॥ కలదే? మేదినిఁగోర్కెకున్ మితము సౌఖ్యంబ్ధ సంఘంబునన్
దలఁపన్‌రొక్కముగల్గువానికెదలో ధర్మేచ్ఛయున్ భోగపుం
జెలికిన్ సిగ్గును వెట్టికిన్ దెలివియున్ జిత్తంబునంబ్రేమ దొం
గలకున్ వీరునకాజివెన్కడుగు భర్గా॥ 11

శా॥ సాధుత్వంబునుబూనుశక్తిదరుగన్ సర్వజ్ఞ! విత్తంబులే
దా? ధర్మంబుదలంచుగీడుగలుగన్ దాఁగుందున న్యాన్‌ర్తికిన్
వ్యాధిగ్రస్తుఁడు సంతతంబు భగవధ్యానానురక్తుండగున్
బాధోరాశిసుతావతంస! హృతపాపా॥ 12

శా॥ పుంసత్వంబిసుమంతలేని నరు పూవుంబోడి తారుణ్యమున్
హంసానీకవిహీనమైనకొల నయ్యబ్జారిలేనట్టి రే
హంసాభావదివం బపుత్రకుని ద్రవ్యాధిక్యమున్ దానవ
ధ్వంసా! కోమలిలేనిగీము వితగాదా? 13

మ॥ వలపున్ జూపుదు రర్థమున్న దనుకన్ వారాంగనల్ ధారుణీ
శులు మన్నింతురు సేవజేయుదనుకన్ జుట్టంబులేతెంతురీ
యిలలో నారయ పెట్టునంతవఱకే యేణాంక! కాంతారతిన్
జెలగున్ బ్రాయముగల్గునంతదనుకన్ శ్రీ॥ 14

మ॥ అలివేణీజనరక్తి భుక్తియును నిద్రాసక్తిమెండైనచోఁ
గలుగున్‌రోగము నిక్కమియ్యది ఋణాంగారారిశేషంబులు
న్న? లలాటాక్ష! పొసంగుఁగీడు ధనమున్నన్ మిన్నయౌగర్వమ
ల్పులఁగూడన్ ఘనుఁడైనఁజుల్కనగు శంభూ॥ 15

శా॥ ఇల్లాలౌనె తలంచిచూడ వెలయా లెప్డందునే యౌవనం
బిల్లౌనే జగమందు బందిరి పయోభృత్తౌనె ఛత్రంబయో
వల్లీధర్మహరా! యథార్థమగునే స్వప్నంబు పుత్రుండనన్
జెల్లంజాలునె లంజబిడ్డదరయన్ శ్రీ॥ 16

శా॥ గోవున్‌గూలిచి రోగపీడితునకున్ గోరోజనం బిచ్చినన్
దేవా! చెట్టునుగొట్టిపండ్లిడిన ధాత్రీ దేవతా శ్రేణికిన్
దేవాగారముగూల్చి శ్రీతులసికిన్ దిట్టంబుగా గట్టినన్
శ్రీ విభ్రాజిత! తిన్నెనుంత ఫలమున్నే॥ 17

మ॥ అవమానంబును జెందుకన్న మృతిమే లాదేవతాహారమై
న విషంబై కనుపట్టు జాలమయినన్ సత్యంబు వీడంగరా
దవనిన్ బ్రాణముపోయినన్ గపటిస్నేహం బెప్పుడున్ గూడదో
భవనాశా! గిరిజేశ! దాసజనకల్పా!॥ 18

మ॥ అరణంబల్లునికిచ్చునే? సుతను ద్రవ్యాపేక్షతో నమ్మువాఁ
డరయన్ గన్నముద్రవ్వి వాడుకొననీయన్ జూచునే చెంబు త
స్కరుఁడన్యాంగన సెజ్జజేరి యటపై జారుండు దోషంబటం
చుఱుకన్ జూచునె పార్వతీరమణశంభూ॥ 19

శా॥ దేవబ్రాహ్మణవృత్తులన్ జెరుపఁజింతింపంగ రాదన్య రా
జీవాక్షిన్ బొడగాంచినంతనె తమిన్ జెందంగరాదెప్పుడున్
దావైరంబు గలానిమందిరములోనన్ మెక్క రాదింతికిన్
భావంబీయఁగఁగూడదో దళితపాపా! 20

శా॥ దీనత్రాణపరాయణంబుగలుగన్ దీర్ఘాటనంబేల? ధా
త్రీనాథత్వమదేల గైతగలుగన్ దిట్టంపుచుట్టాలిలన్
బ్రాణస్నేహితుఁడున్న నేటికి? తను త్రాణంబదేలా ప్రభా
భానూ! సాహసముండెనేని నగచాపా॥ 21

శా॥ కల్లున్ ద్రావెడువానితోడఁజెలిమిన్ గావింపరాదెప్పుడున్
దల్లిన్ దండ్రిని భక్తిగొల్వమి యిలన్ ధర్మంబుగాదర్థమున్
గొల్లంబెట్టక కీర్తిరాదు కవిపైఁ గోపింపగా రాదయా
ముల్లోకంబుల నెట్టివారికిని శంభూ! 22

శా॥ వేదాంతోక్తులు రెంటినేర్చుకొని యుర్విన్ వాగనాతండు సు
శ్రీదా! యోగివరుండుగాఁడు మధువున్ సేవించి ప్రేలంగనే
రాదొక్కింతయు గౌరవంబరయ ధీరశ్రేష్ఠుఁడంచస్త్రమున్
జేఁదాల్పంగనె గాఁడు వీరుఁడభవా! శ్రీ! 23

మ॥ అధికంబీశు నెఱుంగనట్టిముని కయ్యద్వైతవాదంబుల
త్యధికంబల్ల నపుంసకావళికిఁ గాంతాసక్తి శోభాచయం
బధికంబారయఁగల్ల పుత్తడికి సారాచారముల్మెందు స
ద్బుధలోకార్చిత! అంకులాఁడి కిలయందున్ 24

శా॥ ఆలిన్వంచఁగలేక చెప్పుదురు రండయ్యా యటంచన్యులన్
జాలిన్ వేడెడివాని జీవనమిఁక న్నాట్యాంగనల్ చెంగటన్
దాళంబుల్ దగగొట్టువాని బ్రదుకున్ దర్కింపఁగా నేటికో
శైలశ్రేష్ఠసుతామనోబ్జహరిదశ్వా॥ 25

మ॥ నగుబాటున్ ధనమెల్లఁగుల్లయగుటల్ నానాజనుల్దిట్టుటల్
దిగులున్ జెందుట దుర్బలత్వమపకీర్తిన్ బొందుటల్ నిద్రలే
కగడున్ జెందుట సిగ్గులేమియు చికాకల్లాడుటల్ గ్రుంగుట
బ్బుగఁదా యన్యవధూరతుండయిన శంభూ॥ 26

మ॥ పొదరింటన్ బులియున్నటుల్ మొగలిమేల్పూలందు ముండ్లట్లువా
రిదమందున్ బిడుగుల్జనించుగతి వార్ధిన్ బుట్టినట్లవ్విషం
బుదయంబందుచునుంద్రు సజ్జనుల కీయుర్విన్ మహానీచులో
సదయాంతఃకరణా! రణానిలతనూజా!॥ 27

మ॥ రతనంబుల్ జనియించున ట్లురగహారా! మంటిలో సజ్జనుల్
కుతలంబం దుదయించుచుందురు ఖలుల్కుక్షిన్ మహాదుష్కృత
వ్రతతీలోకలవిత్ర! గోత్రతనయాభావాబ్జరోలంబ! గో
పతివాహా! సితదేహ! మేరునగచాపా!! 28

తా॥ ప్రేమన్బామును ముద్దుజేసినటులుర్విన్ వ్యాఘ్రరాజంబుతో
సామున్ జేయదలంచినట్టిగతి పాషాణంబు సింగంబుపై
గామద్వేషణ! ఱువ్వినట్లు దలఁపంగా వైరముంబూనుటల్
భూమిన్ దా బలవర్ధణంబు పయిశంభూ 29

మ॥ పరవిత్తంబును గాంచి కుందుటలు చివ్వన్ బారుటల్ మూర్ఖతో
సరసంబాడుట లప్పుజేసి మిగులన్ సౌఖ్యంబుగా మెక్కుటల్
పరువేమాత్రము లేనిచో నిలుచుటల్ పాషండులన్ గొల్చుటల్
ధరనెవ్వారికిఁగూడ దర్ధిసురసాలా!॥ 30

శా॥ కోరున్ శూరవతంసు డెప్డు దురమున్ గోమాయువేవేళలన్
గోరున్ బీన్గుల రోగపీడితుల దా గోరున్ గువైద్యుండిలన్
గోరున్గీరితి సజ్జనుండు మరియున్ క్షోణీశ్వరుండెప్పుడున్
గోరున్ రాష్ట్రసుఖంబు కాంతిజితభానూ!॥ 31

మ॥ తనకున్నంతటిలోన యాచకులకున్ దానంబు నీకున్న వా
నిని వైశ్వానరుసాక్షి పెండ్లయినరాణిన్ బాసి యన్యాంగనా
శ్యనురాగంబుగలాని భూరమణు ద్రవ్యంబంతయు న్మెక్కుచున్
బనిరాఁబాఱెడు వాని జీల్చఁదగు సుమ్మా!! 32

మ॥ చతురంభోధిపరీతమైన ధరణీచక్రంబు బాలించు భూ
పతి గోష్పాదముమాత్రమేని గొనిపోవంజాలడీ ధాత్రి చ
చ్చుతతిన్ వెంబడినెందునున్న యది యచ్చో నిల్చునే గాని యీ
గతి మూఢాత్ము లెఱుంగజాల రమలాంగా!॥ 33

శా॥ ఆదాయంబును జూడకే ఋణము సేయన్రాదు వాక్రువ్వఁగాఁ
రాదుర్విన్ దనపుణ్య మింతయనుచున్ ద్రవ్యంబులేదం చెదన్
ఖేదంబందఁగరాదు దానొరులకున్ ఖేదంబుచేకూఱఁగా
మోదంబందఁగరా దుమారమణశంభూ॥ 34

మ॥ కులహీనుండగువానితోడ సరసోక్తుల్ బల్కఁగారాదు రా
కలునుంబోకలులేని చుట్టరికమున్ గావింపరాదారయన్
గొలువున్మన్ననలేమి గొల్వజనదీ క్షోణీతలంబందు దీ
ర్పుల వీడందగు లంచగొండులను శంభూ!॥ 35

శా॥ కాలడ్డంబుగ నిల్పినన్నిలచునే గంగార్ఝరం? బింటిలో
మూలన్ దాగిన దప్పునే? పిడుగు లంభోరాశి శుష్కించునే
శూలీ! వర్షములేకయున్న? హృదయేశుండెంతయు న్గట్టిగా
నాలిన్ బాయునె యున్నముందబ్రదుకయ్యా! 36

శా॥ చేయంజాలని కార్యసంచయములన్ జేయంగకాల్చాప రా
దీయుర్విన్ జెడువానికెన్నదును మేలేమాత్రమున్ జేయరా
దీయంగూడదు పాపకర్మునకుఁ దండ్రీ పారుపత్తెంబు దా
జేయంగూడదు శిక్ష దప్పరయకేశ్రీ॥ 37

శా॥ లేదాయెంగద వేదశాస్త్రముల నాలింపంగ నింపెంతయున్
లేదాయెంగద వావియున్ వరుసయున్ లేశంబు నీభక్తియున్
పోదాయెంగద బుద్ధి ధర్మముపయిన్ బోయెంగదా జ్ఞానమున్
శ్రీదా! యిక్కలికాలమందు జగతిన్ శ్రీ॥ 38

శా॥ కాకంబా సురధారుణీధరము శృంగంబెక్కి తెక్కార్చుచున్
కాకాయంచును గూయగానె పికమౌనా కాలుగుఱ్ఱంబిలన్
శ్రీకంఠా! కదుకందబట్టఁ గరియౌనే? మేటియౌ గుఱ్ఱమౌ
నే కుక్కెంత బలంబుచే నలరినన్ శ్రీ॥ 39

శా॥ దారిద్ర్యంబున నందను న్మిగుల బ్రాప్తంబైనచోఁబిన్న యౌ
నారీరత్నముగల్గ వృద్ధదశలోనన్ వానకాలంబునన్
గౌరీనాథ! ప్రయాణమైనఁ జలిదీక్షన్ బూనినన్ జూడఁగా
వేటలేదుగదయ్య చావికను పృథ్విన్ 40

శా॥ బీదల్కొంపలుదీయఁగోరునెప్పుదుర్విన్ భాగ్యవంతుండు సు
శ్రీదా! తేదెపుడున్ దలంచుఁ బగరన్ జెండాడఁబోతెప్పుడున్
బీదల్మిక్కిలి కల్మినుండదలచున్ బేరంపువాడెప్డు క్షా
మాధిక్యంబుదలంచు పంచశరభంగా 41

శా॥ దానంబిచ్చెడువేళజింతిలుట యుద్ధంబందుఁబెన్భీతియున్
భోనంబుం దినువేళ శంకయుఁ దపంబున్ జేయుచో కోపమున్
నానంజెందుట మారుకేళి నిలలోనన్ గూడదెవ్వారికిన్
దీనస్తోమసురావనీజ! కరుణాబ్ధీ 42

శా॥ పూవుందేనియలోనితీపి భ్రమరంబుల్ గన్గొనంజాలుగా
కావంతేనియు మక్షికల్దెలియునే యట్లే భవత్పాదరా
జీవధ్యానము నిర్మలార్యమతులే చేయంగజాల్గాక నో
దేవా! పాపులు చేయజాలుఁదురె ధాత్రిన్ 43

శా॥ తానెంతో మొనగాఁడనంచుఁ దనమీఁదన్ గాసువీసంబునిం
పైన లేనిసతీమతల్లి రతిదా నర్థించినన్ జచ్చుఁజు
మ్మా! నాఁడా మహిజాతఁగోరి రఘురామాస్త్రానలజ్వాలలన్
మేనుంబాయఁడె పంక్తికంధరుఁడు స్వామీ! 44

మ॥ కలుగున్ లాభ మదృష్టవంతున కిలన్ గష్టంబులేకుండగన్
జలధిన్ ద్రచ్చినదేవదానవులటుండన్ భార్గవీదేవియున్
విలసత్కౌస్తుభరత్నమున్ నడుమలో వేంచేసియున్నట్టియా
జలజాతాక్షునకబ్బెఁగాదె నగవాసా! 45

మ॥ తనకున్ బ్రాప్తములేనిదెద్దియు బ్రయత్నంబెంతగావించినన్
దనుజారీ! సమకూడనేరదరయన్ దైత్యుల్ సురౌఘంబుతో
ఘనకష్టంబునఁ గొండతెచ్చి కడలిన్ గవ్వంబుగానిల్పి ద్ర
చ్చిన నేమాత్రముపొందిరయ్య ఫలమున్ శ్రీ 46

మ॥ ఇలలో నీచులకబ్బునే? శ్రమనుదామేరీతిఁగావింప శ్రీ
గలవారిన్ గల భోగభాగ్యములు విఖ్యాతేభకుంభస్థలిన్
గలమాంసంబు లభించు సింగములకున్ గాకెట్లుచేకూఱు? న
క్కలకున్ గుక్కలకున్ దయాన్వితకటాక్షా! 47

శా॥ క్రూరుండెచ్చటనున్న వానికడకే క్రూరుండు బల్కోరికన్
జేరున్ సజ్జనుచెంతకెన్నఁడును దాఁ జేరంగబోఁ డీఁగవే
జేరున్ జీముగలట్టిపుండుకడకున్ జేరంగబోదున్న గ
స్తూరిన్ బెట్టిన బొట్టునెన్నొసటియందున్ 48

మ॥ అతిబాహాబలుఁడాచరించు ఘనకార్యంబేనియున్ బూర్వమా
ధృతరాష్ట్రాత్మజుఁడెన్ని సైన్యములతో నేతెంచిమత్స్యేశుగో
వితతిన్ బట్టినఁబాఱఁదోలఁడె మహావీరోత్తముండా మరు
త్పతి పుత్రుండొకఁడే సువర్ణనగచాపా!॥ 49

మ॥ ధరలోఁ ద్యాగి పరోపకారమునకై ద్రవ్యంబులేకున్న ద
గ్గఱనెందైనను దెచ్చియిచ్చుమిగులన్ గారుణ్యచిత్తంబుతో
శరదం బంబుధికేగి తెచ్చి జలమున్ సస్యోపయోగంబుగా
ధరవర్షింపదె మౌనిలోకనుతపాదా! 50

శా॥ దానాసక్తివిహీనుఁడైన నరుఁడర్థంబున్న లేకున్నగా
సైనన్ దీనులకీయఁడెట్టులనఁగా నంధుండు రేవేళయం
దైనన్ దాఁబవలైనఁగన్గొనఁగలం డాలోకమట్లే సుమీ
దీనానీక విపన్నగౌఘబలభేదీ!॥ 51

మ॥ తనభోగంబును భాగ్యమున్ జెడినమీఁదన్ గూటికిన్ గుడ్డకొం
డ్లను యాచించుటనింద్యమౌనె? సిరినెల్లన్ బాసియాపాండవుల్
జననిన్ గూడియు నేకచక్రపురి బిచ్చంబెత్తి జీవింపరే
కనకక్ష్మాధరధీర క్రూరజనభంగా!॥ 52

శా॥ దారిద్ర్యంబుననున్నవాని నెవరున్ దాక్షిణ్యభావంబుతో
జేరందీయరు పల్కరించరుగదా చింతింపఁగైలాసనం
చారా! యెండనువాడి తావిచెడి పుష్పంబున్న నామీఁద నె
వ్వారున్ దాఁకరుగాదె దానినిల శర్వా!॥ 53

మ॥ వరుసన్ వావియువీడి దేవతలు పూర్వంబందు వర్తింపఁగొం
దరటుల్మానవు లిప్పుడు న్నదువఁగా ధర్మంబె? పాథోధిశం
బరమెల్లన్ దనపుక్కిటంగొనియె లోపాముద్రహృన్నాథుఁడీ
నరులందెవ్వరొనర్తురట్లు బుధవంద్యా! 54

శా॥ ఉన్నన్ దాఁజెడు కారణంబువినఁడీ యుర్విన్ బుధాలాప మె
ట్లన్నన్ రామునకెగ్గు సేయఁదగునే యాసీతనర్పింపుమో
యన్నా! యంచువిభీషణుండనిన దైత్యాధీశుఁడాలించెనే?
తన్నెంగాని, శశాంకభూష! సురవంద్యా! 55

శా॥ ధీరవ్రాతముసత్సభన్నిలువ భీతిన్ వీడి నీచుండు పీ
రారూఢుండయి నంతమాత్రమున లోటా? వారికెంతేనిఁ గాం
తారంబందుఁగుజాగ్రసీమఁగపులుండన్ గ్రిందం సింహంబులున్
వీరవ్యాఘ్రమదేభసంఘములు లేవే? 56

మ॥ ఘనగర్వంబునఁ దన్ను దానెఱుఁగకే కయ్యంబు గల్పించియున్
దనకన్నన్ బలుఁడైన మానవునితోఁ దాఁబోరఁజేటబ్బు నె
ట్లనఁ బొట్టేలెదిరించి భూధరముతో నత్యుగ్రతన్ దాఁకినన్
దనపుస్కంతయు నుగ్గుగాదె మృదుపాదా! 57

మ॥ క్షితిలో మూర్ఖుఁడు దుష్టకార్యములఁదాఁ జేయంగరాదంచునే
మతిమంతుండొ వచింప వారిపయి సామర్షాత్ముఁడై మండు నే
గతినంచన్నను తప్తతైలముపయిన్ గాండంబు బొట్టుంచినన్
సితవర్ణా! వెసభగ్గునన్ వెలుఁగదే? శ్రీ 58

శా॥ మేలున్ జేయఁ గృతఘ్నుమానవునకామీఁదన్ గడున్ గీడగున్
బాలంబోయుచు నిందుకూరిమిని బెంపన్ బాముకూనన్ విసం
బేలాపోవును వృద్ధియే యగునుగాకేమాత్రమున్ దగ్గనే
నాళీకప్రభవాండపూరితపిచండా! 59

మ॥ తనతోఁబుట్టువునైన ధర్మపథమున్ దప్పంగ నవ్వాని వెం
టనె దా వీడినఁగూడు లాభమెటులన్నన్ గ్రూరుఁడైనట్టి రా
వణునిన్ బాసి విభీషణుండు ధరణిన్ బాలింపగా నర్హతన్
గనెగాదే? రఘురాము జేరి విశదాంగా! 60

శా॥ క్రూరస్వాంతుఁ డధర్మబుద్ధియుఁ గృతఘ్నుండైన యా నీచుతో
గౌరీనాయక! మంచివాఁడు చెలిమిన్ గావింప వాఁడట్లెయౌఁ
బారావారమునందుఁ దియ్యని నదీ పానీయముల్ చేరినన్
క్షారంబందవె వెంటనే దనుజశిక్షా! 61

మ॥ తనకార్యంబును నిర్వహించుకొన నిద్ధాత్రిన్ ఘనుండల్పు సే
వనుఁ గావించినఁ దప్పులేదుసుమి పూర్వంబందు శ్రీకృష్ణుర
క్షణచేయన్ వసుదేవుఁ డల్లఖరమున్ గాళ్ళంటి ప్రార్థింపఁడే
ఫణిరాడ్భూష! మరందభాష! హృతపాపా! 62

మ॥ ఘనుఁడన్నట్టులఁ దానొనర్చక తిరస్కారంబు గావింప నా
తనికిన్ గీడొనగూడుఁ బాండవులకున్ ధాత్రీతలంబర్ధ మి
మ్మని దుర్యోధనుతో ముకుందుఁడన దానట్లొప్పకే కూలఁడే
యనిలోనన్ దన మిత్రబాంధవ యుతుండై 63

మ॥ తన పూర్వార్జితమైన పాపఫలమున్ దావెన్క జన్మంబునం
దనఘా! పొందకతీర దేరికిని దానా వాలినిం గూల నే
సిన పాపంబున రాఘవుండు శబర శ్రేష్ఠాస్త్రపాతంబునన్
దనువుం బాయఁడె కృష్ణజన్మమున శ్రీదా! 64

మ॥ మిగులన్ గష్టముతోడఁ జీమలిడు వల్మీకంబు లూహింపఁ బ
న్నగ సంఘంబుల కాలయంబులగుచందం బుర్వి వీసంబులో
సగమున్ బెట్టుటలేక లోభిధనమున్ సర్వేశ! యార్జింపఁగా
దిగ్రమింగున్ దుదకెవ్వఁడో విమలకీర్తీ! 65

మ॥ క్షితినాధాళికి సత్యమే తొడవు చర్చింపంగ సీమంతినీ
తతికిన్ మానమె భూషణంబుతొడవౌ తర్కింప చేదోయికిన్
సితగోత్రాలయ దాన, మందరి కిలన్ జింతింపఁగా విద్యయే
రతనంపుం దొడవౌజుమీ కుధరధీరా! 66

మ॥ నలకందర్ప జయంతులన్ గెలుచు సౌందర్యంబుచే నున్నల
క్షలుఁగోటుల్ దనచేతనున్నను మనోసంజాతుశాస్త్రంబు దా
నలఘుప్రజ్ఞను నేర్చియున్న నవనీశాగ్రేసరుండైన న
వ్వెలయాలబ్బదు రొక్కమీయకయె నుర్విన్ 67

మ॥ తనకేనాఁడు సుభోగభాగ్యములు ప్రాప్తంబౌనొ యానాఁడె వ
చ్చును బిల్వంబనిలేకయే గడువడిన్ జుట్టంబు లెట్లన్నఁ జెఁ
ర్వునకున్ నీరముజేర వానగురియన్ బూర్ణంబుగా భేకముల్
ఘనమోదంబునవచ్చి చేరవె? శుభాంగా! 68

మ॥ పెఱవానిన్ మదినెంచునట్టి నెలఁతన్ వేవేగవీడందగున్
ధర యుద్ధంబన భీతినొందుభటునిన్ దాఁగొల్వులోనుంచరా
దరయన్ నిల్పఁగ రాదు శత్రునృపమిత్రామాత్యునిన్ జారత
స్మరమిత్రత్వము చేయరాదు భవనాశా! 69

మ॥ ధరణీనాథునిచెంత నెంతయును మేధావంతుఁ డౌ మంత్రి శ్రీ
కర! లేకుండిన రాజ్యకార్యములు సాగన్ జాలవేమాత్రమున్
ధరణిన్ దుండము లేకయున్న యెడఁ గద్దా లాభమాహస్తికిన్
బురవైరీ! మురవైరిబాణ! శివ! శంభో! 70

మ॥ శిరమందుండు విషంబు సర్పములకున్ జింతింపఁగాఁ దోఁకలన్
గరళంబుండును వృశ్చికౌఘమునకున్ గౌరీమనోవల్లభా!
శిరమున్ బుచ్చమటంచు దుష్టతతికిన్ జెప్పంగవీల్గాక సు
స్థిరమైయుండును కాయమెల్ల విషమో శ్రీ! 71

మ॥ పరవిత్తంబులఁ జిత్తమందును విషప్రాయంబుగా నెంచుచున్
బరకాంతాతతి నెల్లదల్లులగతిన్ భావింపుచున్ మిత్రుఁడై
ధరలో నందతికిన్ బరుల్కనియఁగాఁ దాగోపమున్ జెందకే
పురుషుండుండునొ యుత్తముండతఁడె శంభూ! 72

శా॥ నమ్మంగూడదు బోగపుంజెలి ప్రమాణమ్ముల్ నిజంబంచెదన్
నమ్మంగూడదు భోగభాగ్యములు స్వప్నంబందుఁ దాఁగాంచినన్
నమ్మంగూడదు మేఘమాకసమున న్గన్పట్టఁగా వచ్చు వ
ర్షమ్మంచున్ బవమానభక్షణవిభూషా! 73

మ॥ తనభోగంబును భాగ్యమున్ జెడినమీదన్ దాను బోరాదు బం
ధునిశాంతంబుల కంతకన్న నిలయందున్ నీచమింకెద్దిలే
దినచంద్రానలనేత్ర! గాత్రరుచిజైత్రైణాంక! వీణాంకచా
రణ సిద్ధామరసాధ్యకీర్తిత చరిత్రా! 74

మ॥ తనవీటంగలయట్టి తాపసిమహత్వంబున్ నిజాబ్జాతలో
చనరూపాతిశయంబు నాత్మజుమనీషాసారవిస్తారమున్
దనదొడ్డిన్ గలమ్రాఁకుమందు దనయొద్దన్ గల్గు విత్తంబు నె
మ్మనమందెంచరు మానవుల్ సుగుణధామా! 75

మ॥ తనకున్ శత్రువు వేఱెలేఁడు తన క్రోధంబొక్కటే చూడఁగన్
దనకున్ రక్షకుఁడొండులేఁడు తన శాంతంబొక్కటేగాకిఁకన్
దనకున్ స్వర్గము వేరెలేదు తనమోదంబొండె యూహింపఁగా
దనకున్ ఖేదమె దుర్గతింకొకటికద్దా? 76

మ॥ నలినవ్రాతములేని నిమ్నగ శ్రుతిజ్ఞానంబులేనట్టి పా
ట లసచ్ఛాలహతాతిగర్వితనిశాటా! పుణ్యచంద్రాననా
వలిలేకున్న వివాహమున్ వసుమతీవర్యుండు లేనట్టి వీ
డిలలో దీపములేనిగీము వితగాదే? 77

మ॥ మృదువాగ్జాలములేని కావ్యమును స్వామీ! దేశికాభావమౌ
చదువున్ వేదమురానివిప్రుఁడు విలాసంబెంతయున్ లేని నీ
రదజిద్వేణి, పటుత్వహీనకుచముల్ ప్రాజ్ఞుండులేనట్టి కొ
ల్వు దయన్ జూపనిఱేఁడు వ్యర్థమె కృపాళూ! 78

మ॥ ఘనవిద్వజ్జనులెంతచెప్పిన సితాంగా! మూర్ఖుఁడేమాత్రమై
నను దుర్బుద్ధినివీడనేరఁ డెటులన్నన్ గంధమున్ బోయుచున్
ఘనసారంబునఁ బాదుజేసిపెనుపంగా నుల్లినింబాయునే
మునుపున్నట్టిగుణంబులేశమును శంభూ! 79

మ॥ తనయిల్లాలు నిజాజ్ఞమీఱి పరభర్త స్వైరి తన్నాత్మలో
దృణతుల్యంబుగ నెంచుచున్న నలనాతిన్ గూడియుండంగ రా
దనఘా! వెంటనె దానివీఁడి తమపాదాంభోజసేవానుర
క్తిని నిల్వందగు సంతతంబుఁ బుషితార్థీ 80

మ॥ విమలాత్మా! జలహీనకూపమును నైవేద్యంబు దీపంబు ధూ
పములేకుండిన దేవుఁడున్ దినక సంపాదించు విత్తంబు వి
క్రమమున్ ధైర్యములేనిభూపతి చమత్కారంబులేనట్టి బో
గమువాల్గంటియు నేల నేలను శుభాంగా! 81

శా॥ ఏనాఁడున్ సిరిలేనిమానవునకెట్లెట్లో ధనంబబ్బినన్
దానిందించును పెద్దవారి, నిశిలోనన్‌దాల్చు ఛత్రంబిఁకన్
బూనున్ జెప్పులనీట, బట్టుమనునో భూతేశ! దివ్వెల్ పగల్
గౌనున్ జూడఁగగోరునద్దమును భర్గా! 82

మ॥ ధరణిన్ దానములేకయున్న సిరియున్ ధాన్యంబులేకున్న మం
దిరమున్ నిర్జలమౌతటాకమును పృథ్వీదేవతాభావమౌ
పురమున్ జ్ఞానములేకయున్నచదువున్ బుత్రుండులేనట్టి యా
నరుజన్మంబును వ్యర్థమే గుణనిధానా! 83

మ॥ పరదేశంబునకేగుదెంచిన నకూపారంబులోమున్గినన్
ధరణీధ్రంబున డాఁగియుండినను కాంతారంబులో దూరినన్
సరసీజాసనువ్రాఁతదాఁటుటకిలన్ శక్యంబె? యెవ్వారికిన్
గరిచర్మాంబర! శంబరారిమదభంగా! 85

శా॥ కారంబారయలేనికూరయును నోంకారంబులేనట్టిమం
త్రారంభం బుపకారహీనజననం బజ్ఞానసంహార! శ్రీ
కారంబాదినిలేని గ్రంథము చమత్కారంబులేనట్టిప
ల్కీరంపుంగుమిలేని తోట వితగాదే? 86

మ॥ గుణవంతుండగునట్టివానిగుణముల్ గుర్తింపఁగాశక్యమే
గుణహీనుండగువానికిన్ సుగుణియే గుర్తింపగానోపు స
ద్గుణరాశీ! భ్రమరంబు పద్మగుణమున్ గుర్తింపఁగాఁజాలు జా
లునె మండూకమెఱుంగ నాశ్రితదయాళూ! 87

మ॥ కలరూహింపఁగఁ గల్మిలేములనెఱుంగన్ జాలకేమాత్రమీ
యిలలో నేవురు వారలెవ్వరన నుర్వీశుండు జామాతయున్
వెలయాలున్ దనయుండు యాచకుఁడొగిన్ విశ్వంభరాభారధీ
ర! లలాటాక్ష! మహోక్షవాహ! ఫణిహారా 88

మ॥ ఉఱుముల్పెక్కు లవర్షవత్సరమునం దూహింపఁగొఁద్రాలికిన్
దఱచౌఁగోరిక లాకలెక్కువ మహద్దారిద్ర్యమందెక్కువౌ
ధరణిన్ వాదములల్పబుద్ధికి మహాత్మా! పొట్టికిన్యోచనల్
దఱుచైయుండును సర్వమౌనిజననంద్యా 89

శా॥ వేలున్లక్షలుఁ గోటులర్బుదములున్ విత్తంబునార్జింపదా
శూలభ్రాజితహస్త! సాటియగునే శుద్ధాత్ముదౌజ్ఞానికిన్
నేలన్వన్నెలు పెక్కులున్న నెనయౌనే మేలిరత్నంబుతో
ఫాలాక్షా! గురిగింజ భక్తజనకల్పా. 90

మ॥ ఇలలో లోభిని నీవు చంద్రుఁడవటం చింద్రుండవం చెన్ని రీ
తుల బ్రార్థించిన యాచకుండు సురబంధూ వీసమేనీయునే
జలమున్ దెచ్చి ఘటంబునన్నిలిపి ద్రచ్చున్ వెన్న యొక్కింతయున్
గలుగన్జాలునె యంతెసుమ్మి భవభంగా! 91

మ॥ ప్రసవంబుద్భవమైనవెంటనె దిశల్ బ్రాఁకున్ సుగంధంబటుల్
వసుధన్ సజ్జనుఁడుద్భవిల్ల సుగుణవ్రాతంబుతో రాజిలున్
విసమో పుట్టినదాది చేదటులె జన్మింపంగనే దుర్జనుం
డసమాక్షా! కుగుణంబులన్ జెలఁగునయ్యా 92

మ॥ దొరుకన్నేరదు వెన్నయున్ దఱువకే దుగ్ధంబులన్ గుంపటిన్
దఱుచున్ గాగియుసుత్తెదెబ్బదినకే తళ్కబ్బదాపైఁడికిన్
నెఱికష్టంబుల నందకున్ననణువేనిన్ గీర్తిరాదో దయా
శరధీ! భాగ్యనిధీ! సుధాకిరణభూషా! 93

శా॥ సత్యంబెన్నఁడు వీడరాదు కడుఁగష్టంబబ్బినన్ దాననౌ
న్నత్యంబందుఁ ద్రిశంకురాజసుతుఁడా నాడెన్నియో కష్టముల్
నిత్యానందద! లభ్యమైననణువేనిన్ గల్లమాటాడకే
నిత్యంబైన యశంబుగాంచి వెలుగండే? 94

మ॥ తనవారెవ్వరు లేనితావునను సత్యంబెంతయున్ లేనిచో
టను సత్సంగతిలేనిచోట ఋణమున్ టంకంబునీనట్టిచో
చనువేమాత్రము లేనిచోటఁ దనకున్ సందేహభావంబు గ
ల్గినచోఁ గాపురముండఁగూడదు పినాకీ! 95

మ॥ పొదుగున్ లావును గొమ్ములున్ ఫలములున్ బూవుల్ గడున్గల్గుటన్
వడిగాఁగీరముఁజేరి బూరుగను బల్వాంఛామతిన్ ముక్కుతోఁ
బొడువన్బండును దూదిరేగుగతి లుబ్ధుండైన భూమీశునిన్
గడుసేవింప ఫలంబులేదు ఖలభంగా! 96

శా॥ ఏలా! పద్దెము లుబ్ధమానవున కూహింపన్ స్ఫురద్రూపయౌ
బాలారత్న మదేల? షండునకు బల్పన్నీరు జవ్వాజియున్
మేలౌగంధము నేల? కోలమునకున్ మృత్యుంజయా! దర్పణం
బేలా? చూడఁగఁ బుట్టుగుడ్డికి జితారీ! 97

మ॥ జనముల్మెచ్చఁ బరోపకారమునకై సత్పూరుషుండైనవాఁ
డనఘా! పూనునదెంతభారమగు కార్యంబైన గో గోపర
క్షణకున్ బూర్వము కృష్ణుఁడెత్తఁడె గిరిన్ జంభారితారాళ్ళవా
నను వీఁకన్ గురియింప సద్గుణనిదానా! 98

మ॥ ధనవంతుండగు వానికిచ్చుటను విత్తంబేమిలాభంబు? ని
ర్ధనికుండైనటువంటి వానికిడినన్ బ్రాపించు లాభంబు వా
ర్ధిని వర్షింప ఫలంబె మేఘమునకున్ జింతింపఁగా వాడియుం
డిన సస్యంబులమీఁదగాక నుతమౌనీ! 99

శా॥ దేవా! కమ్మకులప్రభూతుఁడను ధాత్రిన్ సర్వపుణ్యాళికిన్
దావౌ తుమ్మలనారయాత్మజుఁడ సీతారామమూర్త్యాఖ్యుఁడన్
కావూర్గ్రామనివాసుఁడన్ శతకమున్ గౌతూహలంబొప్ప నీ
పై విశ్వేశ్వర! వ్రాసినాఁడను నవద్వంద్వాబ్దమందున్ దయా
భావంబూనియు స్వీకరించి సుఖముల్ బ్రాపింపఁజేయంగదే
నీవే దైవమవంచునమ్మితిని తండ్రీ! రామలింగేశ్వరా! 100

స ం పూ ర్ణము

ఓమ్

వందేమాతరమ్

# శ్రీ మహాత్మాగాంధి తారావళి


గ్రంథకర్త

**తుమ్మల సీతారామమూర్తి చౌదరి**

కావూరు, రేపల్లె తాలూకా, గుంటూరు జిల్లా.



ముద్రణా ద్రవ్యసహాయకులు

**మ.రా.రా. శ్రీ నాగళ్ళ తాతయ్య చౌదరిగారు.**

ప్రథమ ముద్రణము ౧౦౦౦ ప్రతులు

శాలివాహనశకః దుర్మతినామ సంవత్సర ఆశ్వయుజ బ.౧౧

# పీఠిక

పాఠకమహాశయులారా !

నేనీ చిన్న పొత్తమును వ్రాయుటకు కారణము శ్రీమన్నారాయణావతారమగు మహాత్మగాంధిగారి యందలి భక్తియు, వారియుద్యమమునందుగల విశ్వాసోత్సాహమును దప్ప పాండిత్యబలము వలనగాదని నా కవిత్వమే చెప్పక చెప్పుచున్నయది. అట్టి గ్రంథమునందు దోషముల నెన్నుట సజ్జనలక్షణంబుగాదని వేఱుగా చెప్పనక్కరలేదు. దోషములెట్టివారికైన నుండకపోవు. యేమైనను సరేనని ధైర్యముతో నీతారావళి నాంధ్ర ప్రపంచమందు వెదజల్లితిని. గాన నా యందు దయయుంచి దోషంబులం బాటింపక మత్కవితయందాదరంబుఁ జూప బ్రార్థితులు మరియు నేనీ పొత్తమును వ్రాసి మాసము దినము లైనను ద్రవ్య లోపముచే నచ్చొత్తింపజాలనైతిని. యిట్లుండ నా మిత్రరత్నమగు శ్రీయుత నాగళ్ళ తాతయ్య చౌదరిగారు ముద్రణా వ్యయమొసంగి నా గ్రంథమునకును నాకును వికాసముందెచ్చినందులకు కృతజ్ఞతాపూర్వక వందన సహస్రము లాచరించుచు వారికి సర్వశ్రేయోభివృద్ధిగావించుటకు రమారమణుని నిరంతరమును బ్రార్థించుచున్నాను.

కావూరు
దుర్మతి నామసంవత్సరం
ఆశ్వీయుజ
బ.౧౧ గురువారము

ఇట్లు
విన్నవించు విధేయుడు
తుమ్మల సీతారామమూర్తిచౌదరి
గ్రంథకర్త.

శ్రీరస్తు

## మహాత్మాగాంది తారావళి

శా. శ్రీ మద్భారత వంశభూష ! గుణరాశీ ! సర్వ విద్యానిధీ !
హేమక్ష్మా ధరధైర్య ! నిర్మలమతీ ! హిందూమహీసేవక
స్తోమాగ్రేసర ! వాసరేశసమ తేజోరాజితాంగా ! భవ
త్సామర్థ్యంబు వచింపశక్యమె మహాత్మా గాంధినామప్రభూ. 1

మ. జనులందెల్లను సోదరత్వమును సంస్థాపించి ధర్మాభివ
ర్ధనఁగావించియు భారతీయులకు స్వాతంత్రంబుఁ జేకూర్పఁగా
జననంబందిన మాధవుండవని నా స్వాంతంబునన్ నమ్మి ని
న్ననయంబున్ వినుతించుచుండెద మహాత్మా గాంధినామప్రభూ. 2

మ. హరివిప్రాన్వయ మందునం బరశురామాభిఖ్య శ్రీరాముఁడై
ధరణీనాయక వంశమందు యదుగోత్రంబందు శ్రీకృష్ణుఁడై
ధరణీ భారమడంపఁబుట్టి కొఱతన్ దప్పింప నీవై సుహృ
ద్వర ! వైశ్యాన్వయమందుఁ బుట్టెను మహాత్మాగాంధినామప్రభూ. 3

శా. శ్రీ నారాయణుఁడంచు హైందవులు నిన్ సేవించుచున్నార లా
హూణుల్ క్రైస్తని యెంచుచుండిరిఁక ధర్మోద్ధారుడౌ బుద్ధుఁడం
చానందంబున బౌద్ధులెల్లఱును నిన్నర్చించుచున్నారు వ
హ్వా ! నీ ప్రాభవమేమి సెప్పుదు మహాత్మా గాంధినామ ప్రభూ ! 4

శా. నీవా శ్రీరమణావతార మగుటే నిక్కంబు గాకున్నచో
నీ విద్యాచక్షురత్వమీ సకల భూతేకత్వమౌ భావమున్
యీ వైరాగ్యము నీ ప్రశాంతమతియున్ యీ సిద్ధసంకల్పమా
హా ! విజ్ఞాననిధీ ! లభించునె ! మహాత్మాగాంధి నామప్రభూ ! 5

శా. ధీరుల్ నాయుకులెల్ల అయ్యమెరికా దేశంబునన్ నీ లస
చ్చారిత్రంబులెఱింగి సర్వజగతీచక్రంబునన్ సాటియౌ
వారెవ్వారలు లేరు, భారతమహీ స్వాతంత్ర సంపాదకుం
డై, రాజిల్లుచునున్న గాంధికని రార్యా గాంధినామప్రభూ ! 6

మ. గురుకాంతారతి సల్పుదుష్టుఁడయినన్ గోమాంసమున్మెక్కు దు
ర్నరుఁడైనన్ మెతుకమ్ముపాఁడయినఁగన్యావిక్రయుండైన నీ

పరమ బ్రహ్మ కళానివాసమగురూపంబున్ గనుం గొన్నవాఁ
దరయంగా గతదుష్కృతుండగు మహాత్మాగాంధినామప్రభూ ! 7

మ. సకల గ్రామములందు నీ భజనలే సాగించుచున్నారు, పు
ణ్యకరంబైన భవచ్చరిత్రములె ప్రాయంబూనెఁగైసర్లు, బై
క్షకుఁడున్ బాడెను నీపయింబదము లెచ్చోవిన్న "గాంధీ మహా
త్మకు జై" యంచనునట్టి పల్కులె మహాత్మాగాంధినామ ప్రభూ ! 8

మ. ధరణీనాథులలోన రాఘవుఁడు, గోత్రశ్రేణి శీతాద్రి, ని
ర్జరసంఘంబునఁ బాకశాసనుఁడు దారాకోటి నుద్యత్సుధా
కరబింబంబు విధంబునన్ భరతలోకంబందు వెల్గొందు ని
న్నర లేకే భజియింతు నెప్పుడు మహాత్మా ! గాంధి నామప్రభూ ! 9

మ. వికచాబ్జాక్షుఁడు తాపసప్రకరహృద్వీధిన్నితాంతంబుఁ బా
యక రాజిల్లు విధంబు భారతసుతస్వాంతంబులందెప్పుడీ
వకలంకంబగు స్ఫూర్తితో వెలయు దయ్యా ! కోవిదాగ్రేసరా !
మకరంద ప్రతిమానభాషణ ! మహాత్మా ! గాంధి నామప్రభూ ! 10

శా. ఏయే తీర్థములందుఁగ్రుంకి మఱి యేయే వేల్పులంగొల్చెనో
యేయే నోములు నోచెనో మఱియు నేయే దానముల్ సేసెనో
యేయే పుణ్యములాచరించెనొ గుణాబ్ధీ ! నిన్నుఁగాంచంగ నా
హా ! యీ భారతమాత శ్రీయుతమహాత్మా ! గాంధి నామప్రభూ ! 11

శా. పూతశ్రీపదబద్ధదాస్య నిగళంబుల్ ద్రెంపికన్నీటినిన్
జేతన్ జక్కఁగ నొత్తి తల్లి ! యిటులంజింతింప నీకేలసం
ప్రీతిన్ జెందుమటంచు దేశజననిన్ బ్రేమించి పూజించు లో
కాతీతా ! నినుఁ బోలరెవ్వరు మహాత్మా ! గాంధి నామప్రభూ ! 12

శా. రారా ! ముద్దులమూట ! సద్గుణనిధీ ! రారా కుమారాగ్రణీ !
రారా ! నా కనకంపు రాశి ! విలసద్రాకేందు బింబాననా !
రారా ! యంచును భారతాంబ నినుఁజేరందీసి ముద్దాడి యిం
పారం బెంచుచునుండె నిప్పుడు మహాత్మా ! గాంధినామప్రభూ ! 13

మ. వెలసెన్ గాంధిమహాత్ముఁడంట చెలియా విన్నావటే భారతీ
యులకున్ నాయకుఁడంట తాపసవరేణ్యుండంట తద్దేవునిన్

గొలువన్ మేలగునంట యంచుఁగనకాంగుల్ రాటముల్ ద్రిప్పుచున్
దలఁచున్ నిన్ననిశంబు భక్తిని మహాత్మా ! గాంధి నామప్రభూ ! 14

మ. ముదుపుం గట్టిన నీకు మృత్యువదనంబున్ దూఱు పూబోడి బల్
వడిజీవించి సుఖించెఁగాంచనము పోవన్ జిక్కె నిన్వేడఁగాఁ
బుడమిన్ నీవొక వేంకటేశ్వరుఁడవై పొల్పొందుచున్నాఁడవో
దళితాఘౌఘ ! జొహారిదేగొను మహాత్మా ! గాంధినామప్రభూ 15

మ. వరధర్మంబున కున్కిపట్టు, దయకావాలంబు, సత్యంపు మం
దిరమున్ శాంతినికేతనంబు, గళకున్ గేహంబు, సద్విద్యకున్
శరణంబున్, వినయంపు టెంకివగునీ సామర్థ్య మెన్నంగ వా
క్తరుణీ నాథునకైన శక్యమె ? మహాత్మా ! గాంధి నామప్రభూ ! 16

శా. మా రాష్ట్రంబున కెప్డు వచ్చును మహాత్మాగాంధి ? తద్దివ్యతే
జోరాశింగని ముక్తకల్మషులమై శోభిల్లుటెప్డంచు నా
యా రాష్ట్రంబుల వారలందఱును నీకై వేచియుండ్రెప్పుడున్
తారానాథునికై తొగల్వలె మహాత్మాగాంధినామప్రభూ ! 17

శా. దీక్షంబూని స్వరాజ్య బీజముల విత్తెన్ మొల్కలెత్తించెఁ జి
త్త క్షేత్రంబుల భారతీయులకు దాదాభాయి, గంగాధరుం
దక్షిణంబనుదీక్ష నమ్మొలక తామైపెంపుగావించెద
ద్వృక్షంబుల్ దమవల్లఁబొందె ఫలసిద్ధిన్ గాంధినామప్రభూ ! 18

శా. కామక్రోధముఖారిషట్కమును వేగంజంపి, ధర్మంబహిం
సామార్గంబును, శాంతిసత్య విభవస్వాతంత్ర్య విద్యాయశః
ప్రేమత్యాగములందఁజేయునదియై పెంపొందు నీ యుద్యమ
ప్రాముఖ్యం బెఱిఁగింప శక్యమె ? మహాత్మా ! గాంధినామ ప్రభూ ! 19

శా. హిందూపుత్ర మహమ్మదీయులకు పోరే ఘోరమై యెప్పుఁడా
చందంబుండెడు రెండుజాతులకు నీ సద్బోధచే నాశనం
బందంజేసితివయ్య తొంటిపగ నెయ్యంబెంతయో గూర్చుచున్
మందారేందు సమానసద్యశ ! మహాత్మా ! గాంధినామప్రభూ ! 20

శా. కారాగారము మారిపోయెఁగద లోకంబందు స్వాతంత్ర్య సం
చారాగారము రీతి దూషణము లెంచన్ స్తోత్రతుల్యంబులై

మారెన్ గొట్టుట పెట్టుటాయె గుణధామా నీయుగంబందు పా
పారణ్యానిల ! సద్గుణాకర ! మహాత్మా ! గాంధినామప్రభూ ! 21

శా. స్వాతంత్ర్యంబను బాలబానుఁడుదయింపన్ దాస్యపుంజీకటుల్
యే తీఱయ్యెనొ గానరావు భయమో యేదారినోబట్టె న
జ్ఞాతంబయ్యెను స్వార్థవాంఛ కలనైనన్ శాంతచిత్తంబె వి
ఖ్యాతింజెందిన హైందవాళికిపుడార్యా ! గాంధినామప్రభూ ! 22

మ ధనమే మూలముగాన లోకమునకున్ ద్రవ్యంబు లేకున్ననే
పనియున్ సాగదు, కోటిరూప్యములు సంపాదింపుడీ యన్ననో
యనఘా ! మాసమొకందు లోపలనె ప్రోగాయె గదా ! కోటి మీ
దనులక్షల్ పదిరూప్యముల్ బళి మహాత్మా ! గాంధినామప్రభూ ! 23

శా. సారాచారుఁడు స్వార్థదూరుఁడు కళాసర్వజ్ఞుఁడున్ ధీరుఁడున్
గారుణ్యాకరుఁడాంధ్రసింహుఁడగు కొండావెంకటప్పయ్య, వి
ద్యారాశీ ! తమ సవ్యహస్తమటు చెంతన్ నిల్వఁగా, సందియం
బా ? రాదా మనకున్ స్వరాజ్యము మహాత్మా గాంధినామప్రభూ ! 24

శా. ఆ పల్నాడు ప్రజావ్యధల్ దెలియఁగా నచ్చోటికింబోయి శ్రీ
గోపీనాధుని జన్మభూమికరిగెన్ గుంటూరు సీమన్ స్ఫుర
ద్రూపుండైన నృసింహసూరియును ధీరుండైన నారాయణుం
దా పుణ్యాత్ములె భాగ్యవంతులు మహాత్మా ! గాంధి నామప్రభూ ! 25

శా పన్నుంగట్టఁగ శక్తిలేక దొరలంబ్రార్థింప లాభంబులే
కెన్నో కష్టములందియంది తుదకిండ్లేవీడి పాకాలలో
నున్నారెంతటి త్యాగశీలు రహహో యూహింపఁ జీరాల వా
రన్నా ! యేరికి వింతగాదిది మహాత్మా ! గాంధినామప్రభూ ! 26

శా నీతిందప్పక ధర్మమున్ విడక, శాంతింబాయకన్, హింసపై
ప్రీతింజెందక, దాస్యజీవనమునున్ బ్రేమింపకన్ సర్వదా
స్వాతంత్ర్యంబున భారతీయులు వికాసంబంది లోకంబునన్
ఖ్యాతింజెందుచునుంద్రుగావుత మహాత్మా ! గాంధినామప్రభూ ! 27

సమాప్తము

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః



శ్రీ

# మాహేంద్రజననము

(ఐదంకముల నాటకము)


గ్రంథకర్త :

**తుమ్మల సీతారామమూర్తి చౌదరి**

**కావూరు**

**రేపల్లె తాలుకా - గుంటూరు జిల్లా**



ప్రథమ ముద్రణము 1000 ప్రతులు

**దేశీయ విద్యాలయ ముద్రాక్షరశాల న్ముదిత్రము**

**రాజమహేంద్రవరము**

**శాలివాహన శకమ్ 1234**

# తొలిపలుకు

చదువరులారా !

రేపల్లె వాస్తవ్యుడును శ్రీవిఘ్నేశ్వరదేవాలయ ధర్మకర్తయునగు పట్టూరు వెంకయ్య తన వంశచారిత్రము నెఱిగించునదియు, స్కాందపురాణాంతర్గతమగు శంకరసంహితలో 155వ యధ్యాయమున గల యితివృత్తము నాధారముజేసికొని బ్రహ్మశ్రీ నాదెండ్లపురుషోత్తమ కవి గారిచే నాంధ్రమున నొక చిన్న పద్యకావ్యముగా వ్రాయబడినదియునగు "మాహేంద్ర పురాణ" మను గ్రంధమును నాటక రూపమున వ్రాసి యిండని నన్ను గోరుటచే నేనీగ్రంధమును రచియించితి. కధ చిన్నదగుటచే మొదటి మూడంకములయందలి కధయు నిందు గలిపిన బాగుండునని తోచి యట్లొనరించితి. నిం దర్ధానుస్వారముల రేఫశకట రేఫల నంతగా బాటించి వ్రాయలేదు. నాటక రచనకు నాకిదియే ప్రధమ ప్రయత్నమగుట వలన నిందనేకదోషము లుండవచ్చును. గాన గుణగ్రహణపారీణులగు పండితశిఖామణులిందలి గుణంబుల మాత్రము గ్రహించి దోషంబులన్నియు మన్నించి తెలియజేసినచో ద్వితీయ ముద్రణమున సవరించుకొని యెదనని

విన్నవించు విధేయుడు,

**తుమ్మల సీతారామమూర్తి చౌదరి**

గ్రంధకర్త.

## ఈ నాటకము నందు వచ్చు పాత్రలు

### పురుషులు

| | | |
|---|---|---|
| ఈశ్వరుడు | : | కధానాయకుడు |
| దక్షుడు | : | ఈశ్వరునిమామ (సతీదేవితండ్రి) |
| హిమవంతుడు | : | ఈశ్వరుని మామ (పార్వతీదేవి తండ్రి) |
| నారదుడు | : | దేవముని |
| నందీశ్వరుడు | : | ఈశ్వరభక్తుడు |
| చంద్రశేఖరుడు<br>మృత్యుంజయుడు<br>గంగాధరుడు | } | శివాజ్ఞ చేటలనల్లుటకై మహేంద్రనగంబు నకు మానవాకృతితో వచ్చిన ప్రమధులు |
| బైరాగి | : | మాయాశంకరుడు |
| బ్రహ్మ | : | సృష్టికర్త |
| ఇంద్రుడు | : | స్వర్గాధిపతి |
| నారాయణభట్టు | : | పురోహితుడు |

(మరియు ప్రమధకుమారులు కొందరువచ్చుదురు)

### స్త్రీలు

| | | |
|---|---|---|
| సతీదేవి | : | కధానాయకి |
| పార్వతి | : | సతీదేవి ద్వితీయావతారము |
| మేనక | : | హిమవంతుని భార్య. |
| అరవింద<br>లలిత<br>సువర్ణమాల | } | దేవకన్యలు |



శ్రీ

# మాహేంద్ర జననము

(నాంది)

ఉ॥ శ్రీరఘువీర్య, దార్యజనచిత్తవిహారుడు, భక్తలోకమం
దారుడు, దుష్టరాక్షసవిదారు, డుదారుడు, సర్వసద్గుణా
ధారుడు, నిర్వికారు, దగతల్లజధీరుడు, విశ్వమోహనా
కారుడు, సభ్యసంతతి నఖండశుభంబు లొసంగి ప్రోచుతన్ ॥

(నాంద్యంతమున సూత్రధారుడు ప్రవేశించి)

సూత్ర – ఏమి ? నా ప్రియురాలగు నటియింకను రాకున్నది. (తెరవంకజూచి) ప్రేయసీ! నీయలంకారము పూర్తియైన నొకసారి యిటురమ్ము.

నటి – (ప్రవేశించి) ఆర్యపుత్రా! నమస్కారము. ఈ దాసురాలి కేమియాజ్ఞ.

సూత్ర – నేటిరాత్రిమనమెద్దియోనాటకముబ్రదర్శించి సంతోష పెట్టెదమని పూజ్యులగు నీసభాసదులందరు విచ్చేసిరిగాన మన మిప్పుడాలస్య మొనర్పక నూతన నాటకమగు “మాహేంద్ర జననము”ను ప్రదర్శించి వీరల కానందము గల్గించుదము.

నటి – మహాశయా ! రసిక శిఖామణులగు వీరి యెదుట నసమర్థులమగు మనము నాటక ప్రదర్శన మొనరించి మెప్పింపగలమా ?

సూ – గుణ గ్రహణ పారీణులగు వీరల గూర్చి మనము సందేహింప బని లేదు. మనయం దెన్నిలోపములున్నను మన్నించి పుత్రవాత్సల్యమున గుణాంజలినే గ్రహించి యానందింపగలరని నాదృఢ విశ్వాసము. ఒకవేళ వీరట్లుసేయక దోషనిరూపణగావించినను మనకదిమంచిదియే, ఎందువలననగా

ఆ॥ విరసులైనవారు వీక్షించి బళిబళీ
యనుచు మనల మెచ్చుకొనుటకంటె
సరసులైనవారు చక్కగా బరికించి
మెచ్చుకున్న నదియె మేలు మనకు ॥

నటి – మహాశయా ! ఈ నాటకము నెవరు రచించిరి.

సూత్ర – ఎఱుగవా ?

సీ॥ శ్రీకరంబై సద్గుణాకరంబగుచును
వాసికెక్కిన కమ్మవంశజుండు
విమలుడౌ "తుమ్మల వేంకటపతి"కి "మ
హాలక్ష్మి" కిని బౌత్రుడైనవాడు
"నార" యార్యునకు సాధ్వీరత్నమగు చెంచ
మాంబ"కు దనయుడై యలరువాడు
పొలతి! "సీతారామమూర్తి" సమాఖ్యుండు
నిరువదిమీద రెండేండ్లవాడు

గీ॥ భానుకులభూష రామకృపావిశేష
లబ్ధలసదాంధ్ర కవితావిలాసి వ్రాసి
నవ్యముగదివ్యమైన యీనాటకంబు
గదుముదంబున నాంధ్రలోకమున కొసగె ॥

నటి – మంచిది నాటకారంభమునకై సభ్యులు తొందరపడుచున్నట్లున్నారు.

సూత్ర – ఔనౌను నీవించుక ఋతుగాన మొనర్పుము పిదప గర్తవ్యకార్యమునకు గడంగుదము

నటి – ఏ ఋతువును గూర్చి.

సూత్ర – మనోజ్ఞమగు ఈ వసంతమును గూర్చియే !

నటి – చ॥ అమితసుగంధ మందమలయానిల మెల్లెదలందువీవ బు
ష్పములును పల్లవంబులును జక్కగ కండ్లకు విందొనర్ప భృం
గములు మరంద పానమున గౌతుకమందుచు ఝుమ్మటంచు గీ
తములను బాడుచుండ బ్రముదంబిడుచుండువసంత మెంతయున్ ॥

సూత్ర – ఆహా! నీవర్ణనాచాతుర్యము, నీగాన మాధుర్యము గలసి నాకును సభ్యులకును యుల్లంబులు రంజిల్ల జేసినవి గదా!

నటి – మీరెప్పుడు నిట్లే యెగతాళిసేయుదురు

సూత్ర – ఇందెగతాళియేమున్నది? కాని కాలహరణమగుచున్నది మాటలకిది సమయము కాదు గాన నాయత్తమొనర్ప బోవుదము రమ్ము. (ఇరువురు నిష్క్రమింతురు)

ఇది ప్రస్తావన

# మాహేంద్ర జననము

## ప్రథమాంకము

## ప్రథమ రంగము - ఈశ్వర భవనము

(సతీదేవితో నీశ్వరుడు ప్రవేశించును)

ఈశ్వ - ప్రేయసీ ! కలగంటినంటివి. ఏమని యా స్వప్నము.

సతీ - ప్రాణేశ్వరా ! విన్నవించెద. నా తండ్రియగు దక్షుడు ఎద్దియో యధ్వరంబు గావించుచున్నట్లు గడచిన రాత్రి నాకొక స్వప్నము వచ్చినది. అందలి సత్యాసత్యములు నిర్ణయింప మిమ్ముల బ్రార్థించుచున్నదాన.

ఈశ్వ - ఏమి యీవింత? మామామగారు యాగ మొనర్చుచున్నచో మనలం బిలువ కుండునా? నీ స్వప్నము నమ్మదగినది గాదు.

సతీ - నాథా ! అది యేమియో గాని యీ స్వప్నము నిక్కమనియే నామనస్సున మొదటి నుండియు నమ్మకము గలదు. తామీవిషయమై దివ్యదృష్టిం జూచి చెప్పుడని కోరుచున్నదానను. నాచిత్తంబునం గల సందియం బంతవరకును బాయునట్లు లేదు.

ఈశ్వ - (దివ్యదృష్టింజూచి) ప్రియురాలా! నీయుద్దేశమునకు దగినట్లు నీ తండ్రి విశ్వజిన్నా మకమగు జన్న మెనరించుచున్నాడు సుమా! మరియు తద్యాగదర్శనాసక్తులై బ్రహ్మేంద్రాది నిర్జరులును, నారదాది ఋషిపుంగవులను నభోమార్గంబునం దెట్లు తండోపతండములుగా బోవుచున్నారో చూడుము.

సతీ - (ఆకసమువంక జూచి) నాథా ! నా స్వప్నము నమ్మదగినట్లుండలేదని సెలవిచ్చితిరి. ఇప్పటికి నిజమని తేలినదిగదా? ఆహా! యేమి వారల ప్రయాణోత్సాహము!

**సీ॥ మిగుల నిర్మలము లై నెగడు కాయంబుల**
**లలిత విభూతి రేఖలను దిద్ది**
**తెలిపట్టు దోవతుల్ దీరిచికట్టి రు**
**ద్రాక్షమాలల మెడలందు దాల్చి**
**అలజపోసమయాసనార్థంబులైన కృ**
**ష్ణాజినంబుల జంకలందు బూని**
**వేదపాఠంబుల మోదంబు జిగురింప**
**భైకస్వరంబుల బాడుకొనుచు**

గీ॥ దండ్రి గావించునట్టి యధ్వరముజూచు
వేడ్క చెలరేగ వినువీధి వెడలినార
లహహ! యిమ్మునిముఖ్యుల నమరవరుల
బావనుల జూడ గన్నులపండువయ్యె !

హృదయేశ్వరా ! మా తండ్రి గా రీ యాగంబునకు మనల బిలువకున్న కారణమేమై యుండవచ్చును?

ఈశ్వ – అతని మూర్ఖత్వమే గాని వేరొండెద్దియు లేదు.

గీ॥ క్రతువుకోసము మీ తండ్రిగారు మనల
బిలువ నిటువచ్చి పటుతపోవృత్తినున్న
నన్ను బిలువంగ నే బల్కకున్న నలిగి
వెడలిపోయె నతం డవివేకి యగుట

అల్పబుద్ధులగువారికి దూరదృష్టి యెట్లుండగలదు? ఆహా! నీజనకు డింత తెలివిగలవాడన్న సంగతి నేనిదివర కెరుగనుసుమా ! తపోవృత్తి నున్న వానిం బిలువగా బలుకుట యెందైన గలదా? అట్టి నిశ్చలతపం బత డొనరించును గాబోలు ! లేకున్న నతనిపై ద్వేషమున దొంగనై కొంగజపము గావించుచుంటినని తలంచెనా ?

గీ॥ అధికులగునట్టివారి మాహాత్మ్య మెల్ల
నల్పబుద్ధుల కేరీతి నంతుపట్టు
నెన్నిదినములు సహవాస మున్నగాని
కప్ప గ్రహియింప గల్గనే కమలగుణము?

సతీ – (తనలో) కటకటా! నాజనకుం డెంత యవివేకపు బని జేసెను! నిష్కారణంబుగా సర్వేశ్వరుండగు జామాతతో వైరము దెచ్చుకొనియెగదా ! జనకా ! తపోనిష్ఠాగరిష్ఠులగు వారలం బిలిచిన బలుకుదురా? నిన్ను మన్నాథుడేల నవమానించును? నీవే లోపమొనర్చి యుంటివి. నా ప్రాణేశ్వరుం దలిగిన లోకత్రయం బల్లాడకుండునా ? అయ్యయ్యో! యెంత వెఱ్ఱివాడవు. ఇంతకును నాకును నా పుట్టినింటికిని ఋణము దీర్పవలెనని యీపని జేసితివా? నీముద్దుల పట్టిపై నికింత యాగ్రహ మేలగలిగె. దైవమా! నేనిప్పుడేమి సేయుదును? నేడు నా తల్లిదండ్రుల చెంతకు బోవుటకు నానాథుండు సెలవిచ్చునా ? మొన్న మొన్నటి వరకు నల్లారు ముద్దుగా బెంచిన పుట్టినింటివారిపై గల ప్రేమానుబంధము నెట్లు ఖండింతును. అయ్యో! నా యవస్థ "ముందు నుయ్యి వెనుక గొయ్యి" యన్నట్లున్నది గదా! కాని జన్మగృహంబున కీ సమయంబున బోకుండుటకు నాతరముగాదు. ఇందుల కెట్లయిన నా జీవితేశ్వరుని సెలవు గైకొనియెద.

(ప్రకాశముగా) ప్రాణపతీ! అట్లనెదవేల? యజ్ఞమునకు మనల నాహ్వానింపదలచి మానాయనగా రిటకువచ్చిరి గదా? పిదప నతని యవివేకమువలన నెట్టి లోపమైనను జరుగుగాక. దానిని లెక్కసేయుట పాడియా ? మా తల్లిదండ్రులను చూచి చాలకాలమైనది గాన నీ యర్థ్వ సమయమున మన మటకుబోయి తదుత్సవంబు గన్నులార గాంచి సంతసించుదమని నా కోరిక. కాన నీ దాసురాలి విన్నపము నంగీకరింపుదని ప్రార్ధన.

ఈశ్వ – (తనలో) ఏమి? ప్రియురాలు మంచిచెడ్డ లెరుంగక పుట్టినింటికి బోవలెననుచున్నది. ఔరా! ఆడువాండ్రకు బుట్టినింటిపై గల ప్రేమ వర్ణనాతీతము గదా! కానిమ్ము నా శక్తి కొలది బ్రయత్నించి పోకుండునట్లు చూచెదను. (ప్రకాశముగా) ప్రేయసీ ! యేమనుచుంటివి మీ తండ్రి గారి యాగమునకు బోవలెననుచుంటివా? ఎంత పిచ్చిదానవు! "రామాయణమంతయు విని రామునకు సీత యేమిగావలె" నన్నట్లు నీ తండ్రి దుష్ప్రవర్తనమంతయువిని మరల నిట్లనెదవేల? ఇచ్చటకు వచ్చి యింత ఘనకార్యము జేసిపోయిన నీజనకుడిక నచ్చటికేగిన నెట్లు గౌరవించునో యూహింపరాదా ?

**గీ॥ మూర్ఖులగువారు దుష్కార్యముల నొనర్చి**
**తగని పని యంచు దుదకైన దలపలేరు**
**పొరపడుంగాక నొకవేళ బుద్ధిమంతు**
**డతడు వెంటనె నిజమెల్ల నరయు నబల**

సతీ – ఆర్యా! మీరట్లనకుడు ! మా నాయనగారు శుద్ధమూర్ఖుడని భావింపకుడు. కర్మ వశంబున దురూహాపరతంత్రుడై మీపై నాగ్రహించి పోయెగాక. తత్క్రోధానలజ్వాల లింతదనుక జల్లాఱకుండునా ? మన మిప్పు డేగితిమేని తప్పక గౌరవించును. అదియుగాక నింతపని జేసిన మజ్జనకుడు మన రాక గని తన యవివేకమునకు జింతింపక మానడు. అతని కంతకన్నను బ్రాయశ్చిత్తము వేరొండెద్దిగావలయును?

ఈశ్వ – సతీ ! నీవు చెప్పిన దంతయు బుద్ధిమంతులగు వారి లక్షణమని మొదటనే జెప్పి యుంటిని. మీతండ్రి యన్ననో శుద్ధ మూర్ఖుడు గాన నతని విషయమై నీవూహించిన యూహలన్నియు నిరర్ధకములగును.

**గీ॥ జరుగనున్నట్టి గార్యంబు చందమిపుడు**
**తెలియబల్కితి వినుము నాపలుకులెల్ల**
**నెలత ! పిలువని పేరంటములకు బోవ**
**గూడదని పెద్దలాడు పల్కులను వినవె**

సతీ – స్వామీ ! తా మెంత చెప్పినను జన్మగృహగమనాసక్తమగు నా చిత్తము మరలకున్నది. మీరు వచ్చుట కిష్టపడనిచో సెలవిచ్చిరేని నేనైన బోయెద గాన ననుజ్ఞనీయ గోరుచున్నదానను.

ఈశ్వ – ఏమి నీ వెఱ్ఱి ?

చ॥ **పిలువని చోటికిన్ వినక ప్రేయసి ! నీవరుదెంచితే నినున్**
**బిలచినవా దెవండనుచు భీతియు నీతియు లేక మూర్ఖుడై**
**పలుకకపోదు నీగురు దబద్ధముగా దిది నీదురాక బి**
**ట్టలుక జనించి పావకుని యందున నాజ్యముబోసినట్లగున్**

కావున నామాట విని నీపయనం బాపుము.

సతీ – ఆర్యా! మీరట్లనిన నేమిసెప్పుదు? నన్ను జనకుండు తప్పక బ్రేమింపగలడు. పుత్రికా మోహము నింతమాత్రమున నెడబాయు కరినుడెందైన నుండునా ? మరియు మా తండ్రితో జగద్వంద్యుడగు యల్లుని బిలువక నలిగి యజ్ఞంబొనర్చుట పాడిగాదనియు, జుట్టములు రాకున్న శుభకార్యములు శోభిల్లవనియు గట్టిగా విన్నవించి మరల మిమ్మాహ్వానించునట్లు జేసెద గాన సెలవిండు.

ఈశ్వ – సతీ! యెంతపని జేసెదవు? పర్వతంబులు దూరంబునకు నున్నగానుండి సమీపించిన పిదప వెఱ్ఱిమొఱ్ఱి ఱాళ్ళతో నెగుడు దిగుడుగా గాన్పించుభంగి నీవిందున్నంతవరకును నీ తండ్రి ప్రేమించుననియే నమ్మెదవు. పుట్టినింటి కేగినగాని నా మాటలయందలి నిజము తెలియదు. కనుక పిచ్చిభ్రమను మాని గౌరవంబు గాపాడుకొమ్ము.

సతీ – ప్రాణేశ్వరా ! అట్లెన్నటికి జరుగదు. ముమ్మాటికి జరుగదు గాన సెలవిచ్చి నాకోరికం దీర్పుడు. మీయాజ్ఞయైన వెంటనే పయనమయ్యెద నంతియకాని మీ యనుజ్ఞ నుల్లంఘించి సతీధర్మ దూరనై యిహపరసౌఖ్యంబులం బాడుజేసుకొనునంతటి పాపురాలనుగాను. నాథా! వేయిమాటలేల? మీరీ దీనురాలికి సెలవొసంగక తప్పదు. గట్టిగా నేనుబోక తప్పదు. ప్రాణములు పుట్టినింటివద్దను శరీరము మెట్టినింటివద్దను నిలచియున్నవి. ఇంకను నాలస్యమేల? అనుగ్రహింపుదు.

ఈశ్వ – అవివేకురాలా ! నీవెన్నివిధంబుల జెప్పినను వినకుంటివి. పైత్యరోగికి బంచదార చేదగునట్లు నీకిప్పుడు నా యుపదేశములు రుచించునా ? అయినను నీకర్మ నిన్నీడ్చుచుండగా నేమిసేయగలవు.

గీ॥ **వనిత ! జన్నంపు పయనంబు వలదటంచు**
**బెక్కుభంగుల జెప్పిన వినవదేమొ**
**నిన్ననగ నేల నీకర్మ నీవుగాక**
**పరు లనుభవింతురే వేయి పల్కులేల ?**

సతీ – పురభంజనా ! మీరాగ్రహించిన నేనెంతదానను.

గీ॥ జననియును జన్మభూమియు ననెడు రెండు
క్షితిని "స్వర్గాదపిగరీయసీ" యటంచు
బల్కుచుందురు పెద్ద లేపగిది నిపుడు
బుట్టినింటికి నక్కటా! పోవకుందు

మరియు నోజీవితేశ్వరా !

గీ॥ కన్నవారింటికిని గురుండున్నకడకు
సజ్జనులచెంతకును రాజసన్నిధికిని
ప్రియముగల్గినవారలు బిలువకున్న
నరుగవచ్చుగదా! యిది యనుచితంబె ?

సతీ – జీవితేశ్వరా ! నన్నిట్లెంతకాల మేడిపించెదరు? అక్కటా! మీ యర్ధాంగిపై నింత యాగ్రహ మేలగలిగె? ఇంతకు నా దౌర్భాగ్యమే గారణము. (అని దుఃఖించును.)

ఈశ్వ – (తనలో) ఆహా ! స్త్రీలకు యుక్తాయుక్త వివేకము లేదుగదా! పిలువని పేరంటమునకు బోయిన నగౌరవంబు వచ్చునని యెన్నిభంగుల జెప్పినను వినక పైపెచ్చు దుఃఖించుచున్నది. నేనిప్పుడేమి సేయుదును? పుట్టినింటికి బొమ్మందునా తప్పక నాయవివే కియగౌరవించును. లేక బోవలదందునా యిచ్చట మనోవేదనచే గృశించునుగాన రెండును సమముగానే యున్నవి. అట్టితఱి నీకాంత కోరికదీర్చుటయే యుక్తమని తోచుచున్నది. (ప్రకాశముగా) దాక్షాయణీ !

చ॥ రయమున నీ కగౌరవము రాగల దేగిన నంచు నెంచి నీ
పయనము వద్దటంచు బలుభంగుల జెప్పిన నింతదాక సుం
తయు జెవిబెట్టవైతివిగదా సుదతీమణి! నీ మనంబునన్
బ్రియము గలట్టిచోటికిక వేగమె బొమ్మనుమాన మేటికిన్?

సతీ – ప్రాణపతీ ! మీదయకు బదివేల వందనములు. నేనిప్పుడే సెలవు గైకొనియెద.

ఈశ్వ – మంచిది పొమ్ము.

సతీ – (నిష్క్రమించును)

ఈశ్వ – (తనలో) అక్కటా నా యర్ధాంగి యెంతజెప్పినను వినక దుర్బుద్ధియగు దక్షునింటికి బయనమైనది. అందేమి జరుగునో గదా! కానిమ్ము విధివిధానము నడ్డగింప నెవ్వరు సమర్థులు? ఇంద్రాదులు నా దర్శనమునకు నిన్నటి నుండి వేచియున్నారు గాన వారలతో మాట్లాడబోయెద. (అని నిష్క్రమించును)

# ద్వితీయరంగము

## దక్షయజ్ఞశాల

సతీ – (ప్రవేశించి తనలో) ఆహా! ఏమిది నేనన్న బ్రాణాధికంబుగా బ్రేమించు జనకుండు నేడేలనో పలుకరింపదాయె. ఇందులకు నావలనగావింపబడిన లోపమేమున్నది? అయినను ముందుగా నేనే పలుకరించి చూచెద (ప్రకాశముగా) జనకా !

ఉ॥ పిన్నతనంబు నుండియును బ్రేమను బ్రాణముకన్న నెంతయున్
మిన్నగ బెంచినట్టి సుత మీకడకుం జనుదెంచి నిల్వగన్
గన్నుల నెత్తిచూచి కడుగారవమొప్పగ బల్కరించ రే
యన్నెము నేనొనర్చితినయా? వినుపింపగదయ్య చయ్యనన్ ॥

అక్కటా! యిప్పటికిని బలుకకున్నాడు. నానాధుండు చెప్పినదంతయు యథార్థమగునట్లున్నది. కానిమ్ము మరలబలుకరించెద. తండ్రీ !

గీ॥ వలుకరింపవు నామీద నలుకయేల?
గన్నబిడ్డలపై నింతకరిన మేల?
నింతవరకున్న గారాబ మెచటికేగె?
జనక ! నీకెట్టి యపకృతి సలిపి తకట!

దక్షు – (తనలో) ఈ సతీదేవి. పిలువకున్నను జన్నమునకు వచ్చుటయేగాక బలుకకున్నను బలుకరించుచున్నది. అయినను నన్ను బల్కరింపక నగౌరవపరచిన దురాత్ముడగు శంకరున కీపె యిల్లాలగుటచే నిపుడీమెను బ్రేమింపజాల. (ప్రకాశముగా)

అమ్మాయీ !

సీ॥ నేను తండ్రినిగాను నీవు గూతువుగావు
సంబంధమే లేదు సత్యముగను
అలనాటి నీవివాహముతోటి దీఱెను
పుట్టినింటిఋణంబు పట్టి నీకు
కులవిహీనుండు సద్గుణహీనుడగునట్టి
రుద్రుండు ప్రబల విరోధి మాకు
నాదురాత్మునకు నిల్లాలివౌట విరోధి
గణములో నీవును గలసినట్టి

గీ॥ అయిన బిలువక జనుదెంచినట్టి దాని
కింత సిద్ధాంతమేల రాద్ధాంత మేల?
కూటికై వచ్చితివి పెక్కుమాటలేల?
కూడుగూరలు దృప్తిగాగుడిచిపొమ్ము.

మరియు పరులయిండ్ల బిచ్చమెత్తి జీవించు పరమదరిద్రుడగు మగనిజేబట్టుట వలన నీవు పుట్టినిల్లువదలినదాది పొట్టనిండునట్లన్నము నొకపూటయైనను దినలేదని నాయభిప్రాయము కావున గాటుకబట్టిన పేగు లాప్యాయత జెందునట్లీ రెండుపూటలైన నిష్టమృష్టాన్నములను భుజించిపొమ్ము అమ్మాయీ! యిందుకు నీ కేమైన గోపమా ? పిలువక వచ్చిన నీప్రయాణమే యిందులకైనప్పుడు కోపమేలవచ్చునులే!

సతీ - జనకా! యూరకబ్రేలకము నీకీదుర్బుద్ధి యెందులకుజనించె నిజముగా నీవినాశమునకే జనించినట్లు దోచుచున్నది నాజీవితేశ్వరుని గులహీనుడనియు గుణహీనుడనియు ధనహీనుడనియు నిందింపుచుంటివా? దేవదేవుండగు శంకరుని నిందించిన నీనాలుక ముక్కముక్క లుగా ఖండించిన బాపమా? ఇకనైన బాగుపడ నెంచితివేని నాహితోపదేశము విని యాజగద్రక్షకుని పావనపాదపంకజములపై వ్రాలి క్షమాపణ పత్రము నర్పించి యధ్వరంబునకు దోడ్కొనిరమ్ము ఆశ్రిత వత్సలుండుగాన నీకభయ మొసంగకపోడు మరియు జగద్భర్తయగు నాభర్తలేకున్న నీజన్మమునకు గళయెక్కడ?

దక్షు - అమ్మాయీ ! ఏమనుచుంటివి అంతయు నీమగనితోనే యున్నదా ?

ఉ॥ మాటికిమాటికిన్మగని మాయెదుటన్ ఘనుడంచు జెప్పగా
నేటికి వాని గొప్పతన మెవ్వ రెఱుంగరు లోకమందు బ
ల్మాటలికేల బేల ? భయమా ? హరుడన్ననునిన్ను బొట్టునుం
గాటుక బెట్టి రమ్మనుచు గట్టిగ నెవ్వరు పిల్చి రిత్తఱిన్ ?

మరియు ముంజేతి కంకణమున కద్దమేల యన్నట్లు నీమగని ప్రభావ మెవ్వవెఱుంగరని నాతో జెప్పుచుంటివి?

సీ॥ తినగ గంచము లేక మనుజుని పుఱ్ఱెలో
దిరిపెంపు మెతుకుల దినెడువాని
గాపురం బొనరింపగా మందిరము లేక
గాటిలో గాలంబు గడపువాని
జిగిమించు రతనంపునగలు దాల్పగలేక
బెనుపాప తొడవుల బెట్టువాని

గట్టుకొనంగ జక్కని వస్త్రములు లేక
పులితోలు మొలజుట్టి పొంగువాని

గీ॥ యెక్కితిరుగాడుటకు మంచి జక్కి లేక
ముసలి బసవన్నపై నెక్కి మురియు వాని
దయ్యముల కెల్ల నొడయడై తనరువాని
నీ మగని నెవ్వరెఱుగరో నీరజాక్షి!

ఇట్టి మహనీయుండగు నీభర్త రాకున్నచో మా యజ్ఞమున కేమియు లోపము లేదుగాన నిక నీ యుపన్యాసములం జాలింపుము. పాప మిప్పటికే మిగుల దస్సితివి.

సతీ – దురాత్మా ! విపరీతార్థంబులగల్పించి మత్ప్రాణనాథుని ప్రవర్తన దెగడుచుంటివా? ఏపరమపురుషుని పవిత్రనామాక్షరద్వయము నొక్కపరి సంస్మరించిన బ్రహ్మహత్యాది మహా దోషంబులైన తృటికాలంలో నశించునో అట్టి శివుని నీచందమున నిందించునీకు మున్ముందెట్టి దుర్గతులున్నవో గదా! కానిమ్ము నీకర్మ నీవే యనుభవింతువు తొందరయేల ?

దక్షు – ఏమిది నీ వాగ్ధోరణి యంతకంతకు మించుచున్నదే? పుత్రికవని యూరకొందునను కొంటివా? నాకాగ్రహంబువచ్చిన బ్రహ్మేంద్రాదులైన నడ్డగింపలేరు గాన నికముందాదుష్టుని ప్రసంగము నా యెదుట నెత్తకుము జాగ్రత్త.

సతీ – దుష్టా! దక్షా!

గీ॥ పొంగి పడనేల నీభాగ్యమునకు నిటుల
నున్నదికముందు నీకు దుర్యోగమరయ
జంద్రికలు గాయు గొన్నాళ్ళు సాంద్రమైన
చీకటులుగ్రమ్ము గొన్నాళ్ళు లోకమందు.

(తనలో) అక్కటా! యీ దురాత్ముండు నన్నవమానించుటయేగాక సర్వేశ్వరుండగు మత్ప్రాణనాథుని సైతము గడుంగడు దూషింపుచుండ నీ సభాసదులగు దేవతాబృందమంతయు నోరుమూసికొని కూర్చున్న వారలుగాని తగదని యొకరైన మందలింపరు గదా! ఆహా! యేమి యీ విపరీతము? (ప్రకా) ఓ దేవతాబృందములారా ! మీరును ధర్మంబు నెడబాసి రాలేక మీకిది యుక్తమని తోచెనా ? కానిండు మీరిందులకుందగు ఫల మనుభవింపకపోరులే.

దక్షు–ఉ॥ ఎప్పుడు నిన్ను శంకరునకిచ్చి వివాహమొనర్చినాడనో
యప్పుడె తీరిపోయె ఋణమంతయు నీకును నాకు బూర్తిగన్

దప్పుడు మాటలన్ బలికితాపము గల్గగ జేసితేనిబల్
ముప్పు ఘటిల్లు నా వచనముల్ విని వచ్చిన దారిబొమ్మికన్.

సతీ – ఈ యవివేకి నా హితోపదేశము వినునట్లు లేదు. హా దైవమా ! నేనిప్పు డేమి సేయుదును మొదటి నుండియు బయనంబు మానుమని చెప్పుచున్న నా భర్త వాక్యంబుల వినక వచ్చినందులకుం దగినశిక్ష ననుభవించితిని. ఛీ ! నేడిందరియెదుట నిట్టి యవమానము నంది యీ దేహముతో బ్రజలమొగమెట్లు జూడగలను? అదియును గాక నా ప్రాణేశ్వరుండు వలదని యెన్నివిధంబుల బోధించినను వినక వచ్చిన యీ దేహము నుంచుటయు మంచిది గాదు గాన దీని నిప్పుడే యోగాగ్ని దగ్ధమొనర్చి పవిత్రవంతయు గావించెద!

ఉ॥ తప్పక గీడువచ్చు వనితా యని నాయకు డెన్నిభంగులం
జెప్పిన లక్ష్యపెట్టక విశేషదయన్ జనకుండు జూచు నే
ముప్పును రాదటంచు మఖమున్ గనవచ్చి ఫలంబుగాంచితిన్
దప్పగ శక్యమే విధివిధానము బ్రహ్మకునైన నారయన్

నార – జగజ్జననీ ! దుఃఖింపకుము దుఃఖింపకుము. సకల లోకారాధ్యుండగు నీభర్తను దూషించి లోకమాతవగు నిన్నవమానపరచిన యీ పాపాత్ముడగు దక్షుడు తప్పక గొలది కాలములో దగినశిక్ష ననుభవింపకబోడు. తల్లీ ! యూరడిల్లు మూరడిల్లుము.

సతీ – భాగవతాగ్రేసరా! భర్తగారి యాజ్ఞనుల్లఘించివచ్చి కన్నతండ్రిచే నవమానమంది యపవిత్రమైన యీగాత్రంబును వీతిహోత్రునిచే బవిత్రంబు గావింప నెంచితిని

నార – హరిహరా! యెంతమాట యెంతమాట! అమ్మా! దాక్షాయణీ ! నీవీయకార్యము నుండి తొలంగుమని నా ప్రార్థన.

సతీ – స్వామీ ! నా ప్రయత్నమును మీరడ్డగింపవలదు. ఇప్పుడు మీరు దాక్షాయణీయని నన్ను సంబోధించితిరి. అందలి యర్థము దక్షుని కూతురనని గదా! ఈ క్రూరుడు యీపాపుడు, యీనీచుడు, యీ ఈశ్వరద్రోహియగు దక్షునికి నేబుత్రికనని యిక ముందు బిలిపించుకొన జాల. వినజాల. దీర్ఘాలోచన మీదనే నేనీకార్యమునకు గడంగితిని.

నారా – సాధ్వీమణీ! క్షీరనీరన్యాయమున మెలంగు మీదంపతులలో నీవు నశించిన వెనుక నీవల్లభుండగు శంకరుం డీవియోగబాధ నహింపగలడా ?

సతీ – అట్లెన్నటికి జరుగదు. నేను మరల నేపుణ్యమూర్తి గర్భంబుననో యవతరించి నానాథుని మరల జేపట్టి సుఖించెద. కాన నామాటలుగా భర్తగారికిట్లు చెప్పుడు.

సీ॥ పతిమాట దాటిన పాపంపు గాయంబు
యోగవహ్ని బవిత్రమొందెననుము
విభునాజ్ఞ మీరిన వెలదుల కీరీతి
సమకూడు వెతలంచు జాటెననుము
ప్రాణేశు పాదసేవకు నిరీక్షింపుచు
నిల్లాలు సురవురి కేగెననుము
అవివేకినగుచు భర్త్రాజ్ఞమీరిన తప్పు
మన్నింపుడని బ్రతిమాలెననుము

గీ॥ చెలియ నెడబాసి దుఃఖించు జీవితేశు
చింత దీర్పంగ మరల జన్మింతుననుము
ధృతిని విడనాడ వలదంచు దెలిపెననుము
ధాతవ్రాసిన వ్రాతలు దప్పవనుము.

మరియు నో నారదా !

గీ॥ కూతు నవమానపరచి విఖ్యాతచరితు
నల్లునిందిట్టి గర్వించినట్టి దక్షు
మద మడంపక యున్న నెమ్మదికి శాంతి
చేకురదటంచు దుదిమాట జెప్పెననుము

(అని యోగనిష్ఠబూనును)

(తెరపడును)

# తృతీయ రంగము - ఈశ్వర భవనము

(ఈశ్వర నందికేశ్వరులు ప్రవేశము)

నంది - స్వామీ ! శంకరా ! నేడు విచారముగా గూర్చుంటిరి. కారణమేమై యుండవచ్చును?

ఈశ్వ - నే డన నేల ? నా యర్ధాంగలక్ష్మియగు సతీదేవి పుట్టినింటికి బోయినదాది విచారముగానే యున్నది.

నంది - విచార మెందుకు స్వామీ ?

ఈశ్వ - ఆ దుర్మార్గుడుగు దక్షునియింటి కీ యబలను బిలువకున్నను పుట్టినింటి పై గల ప్రేమచే వలదని నేనెంతవారించినను వినక బయనమైనది. అచ్చట నాతుచ్ఛు దేమేమి యవమానపుంబలుకులు బల్కెనో పిదప నేమయ్యెనో తెలియకున్నది.

నంది - చంద్రశేఖరా ! ప్రమాద మేమియు గలుగనేరదు. మీరిందులకై సందేహపడనక్కర లేదు.

ఈశ్వ - నందికేశ్వరా ! వాని సంగతి నీకు తెలియదు. దక్షుండన నెట్టివాడని యూహించితివి. మూర్ఖులయందును దుష్టులయందును నతడే మొదటివాడు. (పరికించి) ఆవచ్చువారెవ్వరై యుండవచ్చును?

నంది - మునివర్యుడగు నారదుడుగా దోచుచున్నాడు

ఈశ్వ - అట్లయిన నీవుశీఘ్రమే యెదురేగి వారల దోడ్కొనిరమ్ము

నంది - చిత్తము (అని నిష్క్రమించును)

(నారద నందికేశ్వరులు ప్రవేశించిరి)

నార-గీ॥ **అభవ! చంద్రార్ధభూష! సత్యస్వరూప!**
**తాపసావన! పావన! పాపహరణ!**
**ప్రవిమలచరిత్ర! శిఖినేత్ర! భస్మగాత్ర !**
**అతుల కరుణాస్వభావ ! జోహారుదేవ!**

ఈశ్వ - మునికంఠీరవా! ఇమ్మణిమయాసన మలంకరింపుడు.

నార - చిత్తము (అని పీఠముపై నాసీనుడగును)

ఈశ్వ - నారదా! ప్రస్తుత మెటనుండి వచ్చుచుండిరి?

నార - దయామయా! దక్షాధ్వరంబున కేగి వచ్చుచుంటిని.

ఈశ్వ - (ఆతురతతో) అట్లయిన నందలి విశేషములేమి ?

**చ॥ సవనము పూర్తిగా జరిగి చక్కగ నందఱు సంతసించిరే**
**యవగుణుడైన దక్షుడు తదాత్మజ నెంతయు గౌరవించెనే ?**
**యువిదను నీవు జూచితివె యున్నదె క్షేమముతోడ దాపస**
**ప్రవర! ప్రయాణ మెప్పుదనిపల్కె విశేషములేమి సెప్పుమా.**

నార - (తనలో) ఈ శంకరునకు సతీ మరణవార్త నెట్లు విన్నవింతును? కటకటా! ఎట్టి వారికైనను మరణవార్త నెఱిగించుట దుస్తరము గదా!

ఈశ్వ - భక్తపుంగవా ! ఏల సందేహించెదవు? (తనలో) ఇతని ముఖవైఖరిం బట్టి చూడ నెద్దియో దుర్వార్త వినవలసి యున్నట్లున్నది.

నార - దేవా ! తమకు దెలియనిదేమున్నది?

**శా॥ సర్వజ్ఞుండవుగావె నీవరయగన్ సాధ్వీమణింగూర్చి యో**
**శర్వా! నన్నిటు బృచ్ఛజేసెదవు నీచాతుర్య మేమందు సౌ**
**పర్వోద్యాన వనస్థమంద పవనవ్యావృత్తనిస్తాపయై**
**యుర్విన్ బాసి సుఖింపుచుండె సతి దక్షోదగ్రరీథాహతిన్.**

ఈశ్వ - హా! ప్రాణేశ్వరీ (అని మూర్ఛిల్లును)

నార - (తనలో) ఆహా! సర్వజ్ఞుడగు శంకరుని సైతము భార్యా వియోగ మెంత దురవస్థను గల్గించినది! అయిన నందలి కష్టంబులు నావంటి బ్రహ్మచారుల కంతుబుట్టుట దుర్లభము గదా!

ఈశ్వ - (మూర్ఛలేచి) హా ప్రేయసీరత్నమా! పరమదౌర్భాగ్యుడనగు నన్ను దుఃఖసాగరమునం బడద్రోసి నీవుమాత్రము స్వర్గసౌఖ్యంబుల ననుభవించుచుంటివా? నారదా! పరమదుర్మార్గుడగు తండ్రి గావించిన యవమానము చేతనే ప్రియురాలు నశించెనా ? ఔరా! నే ననుకొనినదంతయు జరిగితీరినది.

నార - మృత్యుంజయా ? దుర్మార్గుడగు దక్షుడు కన్నకూతురనియైనను కనికరము లేక సతీదేవి నెన్నియో దూషణభాషణంబులాడుటచే నాసాధ్వీమణి తదవమానంబు భరింపజాలక యోగానలజ్వాలలకు దన దేహంబు బలిగా నొసంగెను.

ఈశ్వ - ఎంతఘోర మెంతఘోరము!

ఉ॥ హారమణీమణీ ! వికసితాంబుజపత్ర విశాలనేత్ర ! దు
ర్వారవియోగదుఃఖజలరాశిని నన్‌బడద్రోసితే మహా
క్రూరుదు తండ్రి జన్నమునకు జనగూడదటంచు నేను వే
సారులు మొత్తుకొన్న వినజాలక నోటను దుమ్ముగొట్టితే?

ఉ॥ నీవలనన్ సుఖంబుల ననేకము బొందెదనంచు నెప్పుదున్
భావమునన్ దలంచి పలుభంగుల నుబ్బుచునుంటిగాని నే
డీవిధి నీకు నాకు ఋణమెల్లను దీఱునటం చెఱుంగ న
య్యో వనితామణీ! యెటులనుందును జీవముతోడ నేనికన్

సీ॥ అణుమాత్రమైన నాయానతిమీరని
పసిడిబొమ్మను నెడబాసినాద
సతతంబు నాసేవ జక్కగా నొనరించు
ఫుల్లాబ్జముఖి గోలుపోయినాద
నిత్యసత్యవ్రతనియతితో జరియించు
ప్రాణేశ్వరికి దూరమైనవాద
సకలసౌఖ్యంబుల సమకూర్చి ప్రేమించు
వెలదిమిన్నను నేదు వీడినాద

గీ॥ అకట చేదోడు వాదోడు నగుచు నెల్ల
పనుల నాకెంతయో సాయపడుచునుందు
పండువంటి లతాంగిని బాసినాద
మొండిసన్నాసి నగుచు నేనుండినాద.

సీ॥ నీమోము జూడక నిముస మోర్వగలేని
ప్రాణేశు నేరీతి బాసినావు
పద్మాక్షి ! యీమందభాగ్యు దేకైవడి
నికను జీవించునం చెంచినావు
అనుదినం బతిభక్తి నర్చించు సురమౌని
బృందంబు నేరీతి వీడినావు
మెఱువుదీవియరీతి మెఱయు నీనెమ్మేను
గటకటా యేరీతి గాల్చినావు

గీ॥ యెంతకష్టంబు గల్గి నీవింత ఘోర
కర్మమున కొడిగట్టితో కలికిమిన్న !
యెన్నిజన్మంబులెత్తిన నిన్నుబోలు
భామ నాకబ్బునే పురంధ్రీమతల్లి !

నెచ్చెలీ ! నేనీదుఃఖ మెట్లు భరింపగలవాడ. అక్కటా ! నీ మరణవార్త విన్న నాగుండె బ్రద్దలుగాకుండెను గదా! యిట్టి కఠినహృదయుండననియే నన్ను విడనాడితివి గాబోలు ! మృత్యుదేవతా! నేనెన్నిసారులు వలదని చెప్పినను వినునట్లు చేయక బంగారువంటి నాభార్యను దక్షాధ్వరంబునకుం దోడ్కొనిపోయి నీపొట్టబెట్టుకొంటివా? ప్రాణేశ్వరీ! రాకాసుధాకరబింబంబును ధిక్కరించు నీముఖమండలమును గన్నులపండుగ యగునట్లు గాంచి సంతసించు భాగ్య మీమంద భాగ్యున కిక లేదుగదా! కోమలంబులగు నీ బాహువల్లరులచే నొడలెల్ల బులక లొదవునట్లొక్క సారియైన నన్ను గౌగిలించుకొనవు గదా! చతురాననా ! నీ వెంత చుప్పనాతివాడవోయి! క్షీర నీరంబులట్లు గలసి మెలసియుండు మాదాంపత్యంబు జూచినంతనే నీకండ్లు గుట్టి మాక్రొత్త కాపురంబును గూలద్రోసితివా ? పాపీ! నీవిట్టివాడవగుట చేతనే లోకంబులో నీ కూరునుం బేరును లేకున్నది. సుందరీ ! ఎంతకాలమైనను హృదయసీమ యందే వసించెదవు గాని కండ్ల యెదుటబడి తాపము బాపగూడదా? అయ్యో! నాపై నింత కోపగించుటకు నీకే లోపమొనరించి తిని ప్రేయసీ ! ప్రేయసీ ! ఈశంకరుడు నిన్ను విడనాడి యిక జీవింపజాలడు. ముమ్మాటికి జీవింపజాలడు. స్వర్గంబునందైనను నిన్ను గలసి సుఖింపవలయునను నాసచే వచ్చుచున్నాడు. ఎదురుగా వచ్చి యొక్క ముద్దుబెట్టి కౌగిలం గ్రుచ్చి యెత్తుము. (అని మూర్ఛిల్లును).

నార – ఔరా స్త్రీ మోహమును మించినదీ లోకంబున లేదుగదా! అయ్యది సర్వజ్ఞుడగు శంకరు నంతవానిని సైతము జెవులు బట్టుకొని తోలుబొమ్మవలె దన యిష్టమువచ్చినట్లుగా నాడించుచున్నది. యేమి దీనిశక్తి? కావుననే

ఆ॥ అయ్యగారు జచ్చెనని సాని ప్రక్కలో
నున్న సుతునితోడ నొకడుజెప్ప
"జావనిమ్ము పీన్గు నీవీధినే దెత్తు"
రనుచుపల్కెనందు రబ్రమేమి?

సీ॥ యుద్ధంబు లెన్నియో సిద్ధంబులాయెను
తలప నీమోహంబు వలన గాదె!
సామ్రాజ్యములు వినాశమునందె నెన్నియో
దలప నీమోహంబు వలనగాదె!

నిరపరాధులుగూడ నీల్గినారెందఱో
దలపనీమోహంబు వలనకాదె?
సంపదబాసి బిచ్చమునెత్తి రెందఱో
దలప నీమోహంబు వలనగాదె!

గీ॥ జాతి నీతుల విడనాడి సంచరించి
రిలను కొంద ఱీమోహంబువలనగాదె
దిక్కులేనట్టి పక్షులై రక్కటకట!
తలప గొంద ఱీమోహంబువలనగాదె ?

మరియును,

సీ॥ కడు భయంకరములౌ కాంతారములలోన
నొంటిగా నివసించుచుండువారి
చలిచేత నెండవానల చేత గృశియించి
పదరాని కష్టముల్ బడెడివారి
నుప్పు బులుసు గార మొయ్యన వర్జించి
దుంప ధూళిని బొట్టనింపు వారి
నింద్రియాశ్వంబుల నెంతయు బంధించి
కఠిన తపోవృత్తి గడుపువారి

గీ॥ వేదముల దలక్రిందుగా వేయిసార్లు
వల్లెవేసి విరాగులై వరలువారి
నినుపగోచుల మొల బిగియించువారి
నాటలాడించె స్త్రీ మోహ మన్యులెంత ?

అద్భుతము, అసామాన్యము, అనంతము, అనామయము, అజరము, అమరము, అజేయము, అమోఘము, అనుపమానము నగు నీ స్త్రీమోహమున కేకొలదిమందియో దప్ప దక్కినవారందరు దాసానుదాసులే గదా!

సీ॥ కోడియై "కొక్కొరోకో" యటంచును గూసి
యయ్యహల్యను బొందె నమరభర్త
గురుపత్ని యనెడు సంకోచమైనను లేక
దారతో గూడె నాధవళకరుడు

మోహినీరూపంబు మురవైరి తాల్ప గా
విషకంఠు డాచెలి వెంబడించె
గన్నకూతురటన్న గమనంబు లేక వి
రించి భారతిని వరించె నట్లు

గీ॥ గొప్పవారంచు బిరుదుల గొన్నవారి
నిట్లు "దైతక్క" లాడించె నింక నొరుల
ముచ్చటల జెప్పనేల? స్త్రీ మోహ మెంత
జేయదలచిన నంతయు జేసితీరు.

ఈశ్వ – (మూర్ఛనుండి లేచి) నారదా! యిప్పుడిందున్న నా పెన్నిధాన మెటకేగె?

నార – దేవా! నేనుగాక నిం దెవ్వరుండిరి?

ఈశ్వ – హాసతీమణీ !

ఆ॥ కంటబడితివనుచు గష్టంబులన్నియు
నంతరించెననుచు సంతసించి
కౌగిలింపబోవ గాన్పింప వదియేమొ?
యెచట దాగియుంటి విందువదన!

త్రిపురసుందరీ ! నీవెందుంటివో కన్పింపవా? అక్కటా !

సీ॥ కళకళలాడు ముద్దులగుమ్మ నెమ్మోవి
జూడలేనట్టి యీచూడ్కులేల
ముకురంబుల హసించు ముద్దియ చెక్కిళ్ళు
ముద్దాడలేని యీమోవియేల
అలివేణి తేనె తేటలవంటి మాటల
వినజాలనట్టి యీవీనులేల
గుసుమకోమలమైన కులకాంత నెమ్మేను
గౌగిలింపగలేని కరములేల

గీ॥ బొంగి ప్రేమామృతరసంబు పొరలునట్లు
జెలువతో బల్కనట్టి యీజిహ్వ యేల
వలచి వలపించి సంతోషవార్థిదేల్చు
సకియ నెడబాసినట్టి యీజన్మమేల ?

నార - శంకరా ! యేమి నీవెఱ్ఱి ?

ఉ॥ అజ్ఞునిరీతి దల్లడిలి హా! యని యేడ్చెదవేల యిట్లు? స
ర్వజ్ఞుడవైన నీవు నభవా! ఫలమేమి? జగంబులోపలన్
బ్రాజ్ఞులు విన్న నీచరిత బక్కున నవ్వరె? లోకవంద్యులౌ
విజ్ఞుల కాపదల్ గలుగువేళల గొందలమందు టొప్పునే?

ఈశ్వ - మునికుంజరా! ప్రియురాలు నామాటవిని పుట్టినింటికి బోకున్నచో మరణింపకుండె డిది గదా?

నార - ఎంత పిచ్చిలోనుంటివి

చ॥ జలనిధిలోన మున్గినను శైలగుహాంతరమందు దూరినన్
దలపగ గానదాగిన విధాత లిఖించినవ్రాత దప్పగా
నలవియె ? యెట్టివారలకునైనను మీరలెరుంగనట్టి నీ
తులు నవినీతులుంగలవె ధూర్జటి ! పెక్కులు బల్క నేటికిన్

మరియు

ఆ॥ పైత్యరోగికావుపాలు జేదగునట్లు
దమకు గీడుమూడు తరుణమందు
బెద్దవార లెన్నిసుద్దులు జెప్పిన
జెవిని బెట్టలేరు క్షితిని జనులు

విశ్వనాథా! పామరుండనగు నేను మీకు బ్రపంచధర్మంబు లెఱిగించు నంతటివాడకాను భార్యా వియోగమునకై నీవే యిట్లు గోలబెట్టిన నికమాయామోహితులగు లోకుల యవస్థ యెట్లుండునో యూహింప దుస్తరము గదా? కాన మీరీశోకంబువదలి ధైర్యమవలంబింపుడు

ఈశ్వ - అక్కటా! ధైర్య మవలంబింపక జేయునది మాత్ర మేమున్నది నారదా ? నాయర్ధాంగి మరణించుతఱి నీకేమైన జెప్పెనా ?

నార - చెప్పినది.

ఈశ్వ - (ఆతురతతో) ఏమని చెప్పెనో కర్ణపేయముగా వినిపింపుము నారదా !

నార - దేవా ! అవధరింపుడు

సీ॥ "పతిమాట విననట్టి" (అను పద్యము జదువును.)

ఈశ్వ - నారదా ! నా వియోగదుఃఖము నెడబాపుటకై మరల బుట్టి నన్ను జెట్టబట్టెదనని చెప్పినదా? నిక్కముగా జెప్పినదా?

నార - స్వామీ! ఇందబద్ధమేమున్నది?

ఈశ్వ - అమ్మయ్య నా మనస్తాప మిప్పటికి గొంతవఱకు జల్లాఱినది. భక్తపుంగవా! ఇంకేమేమి చెప్పినది?

నార - అయ్యా! యామె కడసారిమాటగా మీతో నిల్లనుమన్నది.

గీ॥ 'కూతు నవమానపరచి" (అను పద్యము జదువును)

ఈశ్వ - మంచిది. నాయుద్దేశము నెంతయు బలపఱచినది. (రోషముతో) దుష్టా! దక్షా! మత్ప్రాణసతీమరణకారకుండవగు నీజన్నంబుభిన్నంబొనర్చి నీరూపు మాపునట్లు శూరాగ్రేసరుడగు వీరభద్రు నిప్పుడే సృజించి పంపుచుంటిని. దురాత్మా! నీకింతగర్వ మెక్కినదా? నా బారినుండి యెట్లు దప్పించుకొనగలవో కాచుకొమ్ము. ముల్లోకంబు లెత్తివచ్చినను నన్నడ్డగింపలేరని తెలియదు గాబోలు!

నార - దేవా ! ఆ కఠినచిత్తుడగు దక్షున కీప్రాయశ్చిత్తము జేయవలసినదే. నాకిక సెలవొసంగ వేడుచున్నాడను.

ఈశ్వ - మంచిది పోయిరమ్ము.

నార - (నిష్క్రమించును)

ఈశ్వ - (తనలో) నేనిప్పుడేపోయి వీరభద్రుని సృజియించి దక్షుని శిక్షింప బంపి పిదప నా యర్ధాంగికిని నాకును పునస్సమాగమ మగువరకును జిత్తశాంతికై శీతాచలంబున కేగి తపోవృత్తి నవలంబించెద. (అని నిష్క్రమించును)

ప్రథమాంకము - సమాప్తము

# మాహేంద్రజననము

## ద్వితీయాంకము

## ప్రథమ రంగము - హిమవంతుని గృహము

(మేనకాపార్వతులతో హిమవంతుడు ప్రవేశించును)

హిమ - ప్రేయసీ ! మన ముద్దులపట్టియగు పార్వతికి గన్యాత్వము ప్రాప్తించినది. తగిన వరుని విచారించి వివాహ మొనరింపవలసిన కార్యభారము మనపైకి వచ్చినది. ఇందువిషయమై నీవేమి యాలోచించుచుంటివి.

మేన - నాథా! నేను నదే తలంచుచుంటిని గాన,

**ఆ॥ చదువు సంధ్య గల్గి చక్కదనముగల్గి**
**కులము గూడుగల్గి గుణముగల్గి**
**వయసు వాసిగల్గు వరుని విచారించి**
**చిన్నదాని పెండ్లిసేయవలయు**

(వినుటనభినయించి) నాథా యెవరో రామనామసంకీర్తన గావింపుచు నిటు వచ్చుచున్నట్లున్నారు.

హిమ - ఇంకెవ్వరు? నారదమునీంద్రుడు గావచ్చును.

### కీర్తన

నార - **ధరాసుతాప్రియకరా! గుణాకర! సురార్చితా! పురుషోత్తమా!**
**సరోజలోచన! ఖరాదిదానవహరా! మహాద్భుతవిక్రమా! ॥ ధ ॥**
**మునీశ్వరోత్తమ మనోజ్ఞభాస్కర! ఘనాఘనాంగ! శుభాకరా**
**మనోజసుందర! దినేశ్వరప్రియతనూజమిత్ర! పరాత్పరా ॥ ధ ॥**

**పయోధిబంధన! దయామయా! శ్రితభయాంతకా! మృదుభాషణా**
**వియ న్నదీజనక! యోగిరంజన! జయప్రదా! రిపుశోషదా ॥ధ ॥**

(అని పాడుచు బ్రవేశించును)

హిమ - (ఎదురేగి) నారదమునీంద్రా! నమస్కారము

నార - సమస్తవాంఛా సిద్ధిరస్తు!

మేన – భాగవతాగ్రేసరా వందనములు.

నార – దీర్ఘసుమంగళీభవ

పార్వ – జడదారిరాయా ! దండములు.

నార – కల్యాణప్రాప్తిరస్తు. (హిమవంతుని జూచి) నగరాజా! యీ బాలికామణి యెవ్వరు? భవత్పుత్రికా రత్నమగు పార్వతియా? ఈమెయింకను నవివాహితయే గదా.

హిమ – అవును స్వామీ.

నార – వివాహ విషయమై ప్రయత్నించుట లేదా ?

హిమ – ఆవిషయమే యాలోచించుచుంటిమి.

నార – ఎవరికీయదలంచితిరి?

హిమ – ఇంకను నిశ్చయింపలేదు స్వామీ?

నార – ఈ కన్యారత్నము నమ్మహేశ్వరునకిచ్చి పెండ్లిజేసినచో సువర్ణమునకు సుగంధ మబ్బినట్లుండును గాన నందులకు యత్నింపుము.

హిమ – మహాత్మా! సర్వజగత్కర్తయగు మహేశ్వరుండెక్కడ? మేమెక్కడ? అమ్మహనీయుడు మాయింటి యల్లుడగుటెక్కడ?

ఉ॥ **అందని చెట్టుకాయలకు నఱ్ఱులజాచిన లాభమేమి? బా**
**లేందుధరుండు సర్వజగదీశుడు బ్రాకృత కన్యకామణిన్**
**పొందగ నిచ్చగింపునె? తపోధన నీచస్పృగాలమేద? బౌ**
**రందర లోకమేడ? నగరా? యిదిలోకులువిన్న ముందుగన్**

నార – అట్లనుకొంటివా? దేవదేవుండగు శంకరుండు నీకల్లుడైన నేమియోడెదవు పిచ్చివాడా! ఈబాలిక యెవ్వరని తలంచితివి?

గీ॥ **మొదట నీశ్వరుపత్నియై పుట్టినింట**
**మిగుల నవమానపడి తొంటి మేనువిడచి**
**పుత్రియై పుట్టె మీపూర్వ పుణ్యమునను**
**లోకమాత సతీదేవి నీకుమారి.**

దక్షాధ్వరంబున బితృలబ్ధావమానంబున కోర్వలేక యోగానలంబున నెప్పుడు సతీదేవి స్వీయదేహమును విసర్జించెనో తదాది భర్తయగు పరమేశ్వరుండు నిర్విషయాబిలాషియై పరాంగనా సక్తుండుగాక నిమ్మంచుకొండయందు నిరుపమాన తపోనిష్ఠాగరిష్ఠుడై యున్న వాడు అతండు కొలది కాలములో నీకన్యకామణిం బరిణయ మాడగలండుసుమా!

హిమ - తాపసోత్తమా! మీవాక్యంబుల విన్నదాది నామేనం బులకలొదవుచున్నవి. మీరిప్పుడు చెప్పినదంతయు నిజమే?

నార - హిమవంతా! నీతో బరిహాసములాడుచుంటినా? ముమ్మాటికి నిక్కము సందేహము లేదు.

హిమ - ఆహా! యేమి యీ దంపతుల భాగ్యము?

ఉ॥ సర్వజగత్ప్రభుండు బలశాసన ముఖ్య సుపర్వవంద్యుడున్
గర్విత చైత్యభంజను డఖండ యశోనిధియైన యట్టియీ
శర్వుని ధర్మపత్నియయి సన్నుతిగన్న సతీమతల్లి మత్
పూర్వభవార్జితానుపమపుణ్యవశంబున బుట్టె బట్టియై.

మేన-ఉ॥ అమ్మరొ! మేము పామరులమౌట నిను దెలియంగలేక, లో
కమ్ముల కెల్ల దల్లివయి గణ్యతకెక్కిన నిన్ను నింతకా
లమ్మును గూతువంచును దలంచిన దోసమునెన్నకే, దయా
ర్ద్రమ్మగునట్టి చిత్తమున రక్షణ జేయగదమ్మ! శాంకరీ!

పార్వ - ప్రియజననీ జనకులారా! మీరలు నన్నీరీతిగా శ్లాఘింపవలసిన పనిలేదు. మీరెంతయు బుణ్యమూర్తులగుటచేతనే మీ గర్భంబున బుట్టితిని

నార - అచలేశ్వరా! నీవల్లునికొరకు విచారింపబనిలేదు. కొలదికాలములో చంద్రశేఖరుండు పార్వతిం గ్రహింపగలడు. నేనిక సెలవు గైకొనియెద.

హిమ - చిత్తము స్వామీ! దయయుంచుడు (అని నమస్కరించును).

మేన - నాథా! యిక జరుగవలసిన కార్యక్రమ మేమని నిర్ధారణ జేసితిరి?

హిమ - నాకు నదియే దోచకున్నది. మహామహుండగు గంగాధరుం దడుగకమున్నె పట్టిం జేపట్టుడని మనము కోరినచో బరిగ్రహించునో లేదో యని సందేహించుచుంటిని. ఇందు విషయమై నీయుద్దేశ మేమి?

మేన - హృదయేశ్వరా! నాకొక్క యుపాయము దోచుచున్నది మన మమ్మహేశ్వరుని చెంతకేగి "శంకరా! మాపట్టిని నీకు బూజాద్రవ్యాదులందెచ్చి యిచ్చుచు బరిచర్య జేయుటకై నియోగింపదలంపు గలదు కాన దయతో నిందుల కంగీకరింపుడని ప్రార్థించిన నిష్టపడుననియే నా నమ్మకము పార్వతి యందుండుటయే తటస్థించిన యెడల నేడు గాకున్న రేపైన మనకోరికలు సిద్ధింపకపోవు

హిమ - ప్రాణేశ్వరీ! మంచియుక్తి బన్నితివి గావున మన మిప్పుడే యప్పశుపతిం దర్శింపబోవుదము అమ్మాయీ! రమ్ము

(అని అందఱు నిష్క్రమింతురు.)

## ద్వితీయ రంగము - బ్రహ్మ గృహము

(తెరలో) చతురాననా! రక్షింపుము రక్షింపుము

బ్రహ్మ - (ప్రవే) ఎక్కడిదో యార్తనాదము వినవచ్చుచున్నది. ఎవరై యుండవచ్చు

(ఇంద్రాదిదేవతలు ప్రవేశింతురు )

ఇం - (చేతులు జోడించి)

గీ॥ ఆశ్రితావన! మూర్తిత్రయస్వరూప
అప్రమేయ! సృష్టిస్థితిహరణకర్త!
నిగమకారణ! నిరుపమ! నిర్వికల్ప!
కరుణ మమ్మేలుమయ్య! యో కమలగర్భ!

బ్రహ్మ - సోదరులారా!

గీ॥ మిగుల జిన్నవోయె మీదు మొగమ్ములు
తొంటి తేజమెల్ల దొలగె నేడు
నెందువలన గల్గె నీ కష్టదశ మీకు
వేగ జెప్పరయ్య విబుధులార!

ఇం - దేవా! సర్వాంతర్యామివై సర్వసృష్టికర్తవై సర్వజ్ఞుడవగు మీరెఱుంగని దేమున్నయది? అయినను గోరితిరి గాన విన్నవించెద

గీ॥ మొదట దైత్యుల సృజియించి పిదప వారి
కీయరానట్టి వరముల నిచ్చెదీవు

**తుదకు గర్వించి వారు మాదుంపద్రెంచి**
**చెప్పరానట్టి వెతలపాల్సేయుచుంద్రు.**

బ్రహ్మ - మిమ్మిప్పుడట్లు బాధించు దుష్టదానవుండెవ్వడు?

ఇం - ప్రస్తుతము బాధించునది తారకాసురుడు. వాని దుష్ప్రవర్తన మింతింతయని చెప్ప దరముగాదు.

సీ॥ **మఖములలో వచ్చు మా హవిర్భాగంబు**
**లదరించి బెదరించి యపహరించె**
**వనవాసమున దపోవ్రత మాచరించెడు**
**జడదారిమూకల జావగొట్టె**
**సాధ్వీమతల్లులౌ సౌరాంగనల బిట్టు**
**బలిమిమై జెఱపట్టి బాధబెట్టె**
**స్వర్గీయులగువారి సర్వసంపత్తుల**
**గ్రూరస్వభావుడై కొల్లగొనియె**

గీ॥ **గటకటా తారకునివల్ల గలుగుచున్న**
**బాధ లిన్నియటంచు జెప్పగ దరంబె**
**అమర సముదయమెల్ల నే దడవులందు**
**దిక్కులేనట్టివారలై తిరుగవలసె.**

సన్నిపాతజ్వరగ్రస్తున కెట్టి దివ్యౌషధంబులైనను గుణ మీయజాలనట్లతని యందు మే ముపయోగించిన చతుర్విధోపాయములను వమ్మైనవి. శరణాగతత్రాణ పరాయణుండును చక్రాయుధుండును నగనారాయణుండు మా కష్టంబుల నీడేర్చు గదాయని గంపెడాసతో బోయి విఫలమనోరథుల మైతిమి. జగత్కర్తలగు మీరలు తప్ప నిక నెవ్వరును మా యాపదల బాప సమర్థులు లేరు గాన మా విన్నపంబు నాలించి యీ దీనుల దారకుని బారినుండి తప్పింపుడని ప్రార్థించుచున్నారము.

బ్రహ్మ - పురందరా ! మీ కష్టంబులువిన్న గుండె లదరుచున్నవి. తారకుం డింత మితిమీరెనుగా! కానిమ్ము. రాక్షసుల ప్రభుత్వ మెన్నటికిని జిర కాలము నిలువనేరదు. నిలువలేదు. వారి యధర్మవర్తనమే వారిని నాశమునకు దప్పక దోడగుచుండును. వేయేల.

గీ॥ **కమలనేత్రల మానభంగంబొనర్చి**
**శాంతమూర్తుల నదయుడై చావగొట్టి**

**పరధనంబుల హరియించి పాలితులకు**
**బాధ లొనగూర్చువాని సామ్రాజ్యమున్నె**

మరియు నోవజ్రపాణీ !

గీ॥ **అల్పునకు నధికారంబు నప్పగింప**
**దొంటి దుర్గుణముల నెట్లు గెంటగలడు?**
**కనకపీఠంబుపై శునకమును నిల్ప**
**బాదుకూళ్లెల్ల దినుబుద్ధి వీడగలదె?**

ఈదురాత్ముండు మడియుటకు నేనిప్పుడేమి సేయవలయునని మీ యభిప్రాయము?

ఇం – కమలాసనా! పురుషుండు సంసార బంధ విముక్తి కొరకు ధర్మమును గోరునట్లు సురకంటకుం డగు తారకాసురునిం బరిమార్చుటకు మహాబలశాలియగు సేనానాయకు నొకని నొసంగుడని మా కోరిక. కాన శీఘ్రమే మాయభీష్టము దీర్చి మనశ్శాంతి గల్గింపుడు.

బ్రహ్మ – వాసవా ! మీకోరిక బాగున్నది. నీ లోక కంటకుండగుతారకుని వధించు విషయమై నేనెట్టి ప్రయత్నమును జేయుటకు వీలులేదు. కారణమేమన నాదైత్యవల్లభుండు నన్నుం గూర్చి పెక్కువత్సరంబులు కఠినతపం బొనర్చిన నేబ్రసన్నుండనై కోరిన వరంబుల నెల్ల నిచ్చితి. అవ్వరప్రభావమువలననే వాడింత యభివృద్ధిబొందెను. అట్టివానిని నేను మరల వినాశన మొనరించుట సమంజసము గాదు. విషవృక్షమైనను దా బెంచి తాద్రుంచుట ధర్మమా? అదియునుంగాక,

గీ॥ **యుద్ధకుశలంబు నతులబలోద్ధతియును**
**గలిగి విలసిల్లు తారకు గండదంప**
**నభవరేతోంశసంభూతుడైనపురుషు**
**డొక్కడె సమర్థు డూహింప నిక్కముగను.**

అతండు మీకు సేనానాయకుండై నిర్వక్రపరాక్రమంబున శుక్ర శిష్యుల జెండాడి స్వర్గ రాజ్యలక్ష్మిని మీ స్వాధీన మొనర్పగలడు కాని యిందులకు మీరొక్క ప్రయత్నము మాత్రము చేయవలయును.

ఇం – దేవా! ఆప్రయత్న మెయ్యది?

బ్రహ్మ – లోకమాతయగు సతీదేవి దక్షయాగంబున మరణించుటచే భార్యావియోగదుఃఖ శాంతికొర కీశ్వరుం డిపుడు తమోగుణ శూన్యుడై హిమవన్నగంబున దపం బొనరింపుచుండె. దాక్షాయణియు మరల గొండలరాయనికిం గూతురైపుట్టి శంకర కరగ్రహణాపేక్ష నతనికడ

బరిచర్య నెఱపుచుండె అయ్యీశ్వర వీర్యంబును పార్వతి తప్ప నితరు లెవ్వరును భరింప సమర్థులు గారు. గావున శశిశేఖరుం దచలాత్మజను సత్వరంబున బెండ్లియాడునట్లొనరింప వలయును

ఇం - దేవా? మావలన కార్య మెట్లగును?

బ్రహ్మ - మీరు మన్మదునిం బ్రార్థించి యతని నందులకు నియమించితిరేని సుమశర ప్రయోగమున క్షణకాలములో నిందుశేఖరున కమ్మందయానపై డెందంబు దగుల్కొననుట్లొనర్ప గలడు ఇందులకు సందేహము లేదు గావున శీఘ్రుం బట్లు జేయుడు

ఇం - కమలాసనా! మంచి యుపాయము జెప్పితిరి మాకు సెలవొసంగిన నందులకు బ్రయత్నింతుము

బ్రహ్మ - మంచిది శుభమగు గాక!

(అందరు నిష్క్రమింతురు)

## తృతీయరంగము - ఈశ్వర తపోగృహము

(తపంబొనరించు నీశ్వరుడును సేవకురాలు పార్వతియు నుందురు)

పార్వ - పూజాకుసుమంబుల దెచ్చితిని నియమవేదికను బరిశుభ్రపరచితిని అనుష్ఠానమునకై పానీయముం దెచ్చితిని కాని ప్రాణేశ్వరుండు నేడింకను దపోదీక్ష నుండి లేవలేదు.

ఉ॥ ఎన్నడు నాప్రియుండు శివుడీతపమున్ విరమించు నక్కటా!
యెన్నడు మత్కృతవ్రతము లెల్ల ఫలించు బునస్సమాగమం
బెన్నడుగల్గు బుష్పశరు నెన్నడు ధిక్కృతుగా నొనర్తునో
పన్నగభూష! నాపయిని బంతమదేల ననుగ్రహింపుమా!

సీ॥ కడుపార నన్నమెన్నడు భుజింపగలేదు
నీమీద ప్రీతిచే నిర్మలాత్మ!
నిజముగా నెన్నండు నిదురబోవగలేదు
నీమీద వలపుచే నిగమవేద్య!
చెలగి యెన్నడు మంచిచీర దాల్పగలేదు
నీమీద వాంఛచే నిష్కళంక !

యితరవిచారంబు నెదదజేయగలేదు
నీమీద మమతచే నిర్వికల్ప !

గీ॥ నిన్ను విడనాడినది మొదల్ నేటివరకు
నాయవస్థను వర్ణింప నలువవశమె
జాలమిక నేల విరహంబు సైపజాల
నేలుకొనుమయ్య! నీదాసురాలినయ్య!

క॥ నన్నలయింపఁదపంబను
పన్నుగదంబన్నినావు పరమమునీంద్రుల్
నిన్నఖిలేశుదవనుచున్
సన్నుతిజేసెదరు నీదుజప మెవ్వరికో

గీ॥ భర్తమాటను విననట్టి పాపురాలి
మదమడంపగ నీదు నెమ్మదిదలంచి
యువతి నిట్లేడిపింపుచునుంటివేమొ
ప్రధమదోషంబు మన్నింప బాడికాదె?

ప్రాణేశ్వరా! నా యవస్థ లోకబాంధవు నెడబాసిన పద్మినీరమణివలె నున్నది. ఆదుదాన నగుటచే యుక్తాయుక్త జ్ఞానశూన్యనై నేనొనరించిన తప్పులన్నియు మన్నించి నన్నుం జేపట్టి ప్రాణదాన మొసంగుదు.

సీ॥ మునులార! సౌజన్యఖనులార! మీరైన
జీవితేశ్వరునితో జెప్పరాదె
సురలార! సత్కృపాకరులార! మీరైన
జీవితేశ్వరునితో జెప్పరాదె
నరులార! సుమవికస్వరులార! మీరైన
జీవితేశ్వరునితో జెప్పరాదె
ఫణులార! శీర్షస్థమణులార! మీరైన
జీవితేశ్వరునితో జెప్పరాదె

గీ॥ కీరమా ! నేనొనర్చిన నేరమేమి
భారమా? కోకిలా! నీకు, పదతి యేద్వ
గోరికా? శారికా! మంచుకొందపట్టి
బాధ దీర్పంగ నెవ్వరు బాలుపదరె?

అక్కటా మన్త్రాణనాథుని హితోపదేశము విని దుర్మార్గుడగు దక్షుని యింటికి బోకున్న నాకీ బన్నము లన్నియు రానేరవు గదా! ఎంత వెఱ్ఱిదానను? విధి యిట్లుండ నేనట్లు జేయ వశమా.

గీ॥ **కర్మఫలముల వడ్డితో గట్టికుడువ**
**వలయు గాకెట్లు తప్పింపవలనుపడును**
**"చేసికొన్నట్టివారికి జేసికొన్న**
**యంత" యనియెడు లోకోక్తి వ్యర్థమగునె.**

కీడులో మేలన్నట్లు తారకునిచే బాధింపబడుచున్న నిలింపులు బ్రహ్మ పాలికిం జని మొఱబెట్టు కొన నద్దానవునిం దునుముట కీశ్వరవీర్యసంజనితుం డొక్కడే సమర్థుం డనియు నందుల కన్యోన్యవియోగులై యున్న గౌరీశంకరులకు బునస్సమాగమమగునట్లు జేయుడని చెప్ప వార లా పనికై మన్మథుని నియమించినట్లు గాలివార్త దెలిసినది. ఇయ్యది నిజవార్తయైన నా ప్రయత్నమున కెంతయు సాయపడును. కాని యీ దురదృష్టవంతురాలి కంతభాగ్యమున్నదా? అదిగో చంద్రశేఖరుండు తపోదీక్షను వీడినట్లు దోచుచున్నది. నేనిక నిశ్శబ్దముగా నుండెద.

ఈశ్వ - (తపంబు జాలించి) యెవ్వ రీ జవ్వని! పొరపడితిని. పార్వతియే! ఏమి యీ యింతి సౌందర్యము!

సీ॥ **పూర్ణేందుబింబమో, ఫుల్లాబ్జమో, తటి**
**ద్దర్పణంబో, లేక దరుణి మొగమొ**
**చేపలో, వలరాజు తూపులో, జిగిమించు**
**కలువపూ రేకులో, చెలువ కనులొ**
**కోకంబులో, పుష్పగుచ్ఛంబులో హేమ**
**కుంభంబులో, లేక గొమ్మచనులొ**
**తొలకరిమెఱుపొ, కాంతులనీనుచుక్కయో,**
**కనకవల్లియొ, యట్లుగాక జవియొ**

గీ॥ **బళిరె! యేమని వర్ణింతు బడతిమిన్న**
**నీతళుకు, బెళ్కు, నీనిగ్గు, నీమెఱుంగు,**
**నీయొయారంబు, నీహొయ, లీవిలాస,**
**మీముఖవికాస, మూహింప నెందుగలదు?**

సీ॥ **అలినీలవేణి దేహచ్ఛాయ దలపోయ**
**నవలీల హేమాహ్వయంబు మాపు**

వనిత నవ్యోరులావణ్యంబు గణ్యమై
రంభాతిశయము నారంగజేయు
జవ్వని నాసికా సౌందర్యగరిమ తి
లోత్తమ నోరు బైకెత్తనీదు
తరుణేందుముఖి లసత్తరళేక్షణంబులు
హరిణమదోద్రేక మణగ్రదొక్కు

గీ॥ నంబుజాసనుడైన శేషాహియైన
నీమిటారి యొయారంబు నెన్నగలరె?
పరమయోగీంద్రులైన నీపడతిగాంచి
కామదాసానుదాసులు గాక యుంద్రె?

అబ్బబ్బా! చతురాననుం డీసుందరి నెట్లు సృజించె? నిక్కముగా నతండీ లోకత్రయంబున గల సౌందర్యమంతయు నొక్కచో జేర్చి కరగిపోత బోసినట్లున్నాడు. వహ్వా యీవాలుగంటి కేలుబట్టని జన్మము నిష్ఫలంబు గదా! (ఆశ్చర్యమునభినయించి) ఏమి యీచిత్తవికారము? ఓహెూ! తెలిసినది మన్మధా! ఎంతపనిజేసితివి? ఇతండు జితేంద్రియుండగు త్రిలోచనుం డన్నసంగతి నెఱుంగవు గాబోలును.

(అని రోషముతో జూచును)

(రంగస్థలమున నొకమూల మంటమండును)

దురాత్మా! మన్మధా! నేత్రాగ్నిచే భస్మమైతివా? మంచిది. తగిన శిక్ష ననుభవించితివి. ఛీ ఛీ తపోవిఘ్నకారిణులగు యువతీమణుల చెంత నివసించుట తగనిపనిగాన నిటనుండి వెడలి పోయెద (అని నిష్క్రమించును)

పార్వ - హా దైవమా ! యెంతపనిజరిగినది! నిర్జర ప్రేరితుండగు కుసుమాయుధునివలన నాకోర్కులీడేరు ననుకొంటిని గాని యింత దురదృష్టవంతురాలి కంతటి భాగ్యము లభించునా!

శా॥ ఉవ్విళ్లూరగ నాకు నీశ్వరునకున్ యుద్వాహమౌనంచు నీ
పువ్విల్తున్ మసిజేసి జవ్వనులతో బొత్తేల నాకంచు నా
జవ్వున్ జవ్వన మగ్గిలోగలపి రోషస్ఫూర్తి నేగెన్ శివుం
డెవ్వారి న్నుతియింతు నెద్ది తెఱు విం కేరీతి జీవించెదన్?

ఉ॥ ఇంతదరిద్రురాలు భువినెందయినంగలదే తలంప నా
చింతల కంత మెన్నటికి జేకురునొక్కొ నిజేశుబాసి యే
యింతులమిన్న యేద్భుతతతి నే గని నవ్వితినో మనోహరుం
డింతటి పంతమూనుటకు నేనొనరించిన దోస మెట్టిదో!

శా॥ చిత్తస్థైర్య పరీక్ష సేయ నిటులన్ జింతాంబుధిన్ ముంచితో
యిత్తస్త్రీమణి ఘోరపాపముల దానేమేని గావించెనో
చిత్తంబందిక రోతబుట్టెనో సతీస్నేహంబుపై చెప్పుమా
మత్తారాతి భుజంగ గారుడమణీ! మౌనీంద్ర చింతామణీ !

అక్కటా! నేనిట్లెంత విలపించినను లాభంబులేదు, ధైర్యంబు దాల్చి, యేజగజ్జెటిని మొట్టమొదట జెట్టబట్టి పట్టపురాణినై సకల సౌఖ్యంబులననుభవించితినో, యేలోకనాయకుం డెన్ని చెప్పినను వినక నవ్యక్తురాలనై పుట్టినింటికేగి యచ్చట నవమానవడి యోగాగ్ని జ్వాలలకు నాశరీరమప్ప గించితినో, యేపుణ్యపురుషునిం బెండ్లియాడదలచి మరల నీహిమవంతునికిం బట్టినై పుట్టితినో, యేతపశ్శాలికి నేటిదనుక బరిచర్య గావించి ధన్యతం జెందితినో యట్టి శంకరుడు తప్ప నాముప్పుల దప్పింప సమర్థు లెవ్వరును లేరు. గాన నమ్మహాత్ముని గూర్చి తపం బాచరించెద. (పరికించి) సమయమునకు తండ్రిగారుకూడ వచ్చుచున్నారు వారి యనుజ్ఞబొంది తపఃప్రారంభ మొనరించెద.

(హిమవంతుడు ప్రవేశించును)

పార్వ - (ఎదురేగి) జనకా ! నమస్కారము.

హిమ - కుమారీ ! చిరంజీవివిగమ్ము. (తనలో) ఏమి దేవదేవుండగు శంకరుం డిందు గానరాడాయె. పార్వతి దీనవదనయై యున్నది. ఇచ్చట నీభస్మరాశి యేమి? ఇదియంతయు నాశ్చర్యముగా నున్నది. (ప్రకాశముగా) పార్వతీ!

ఉ॥ పున్నమనాటి చందురునిబోలెడు నీముఖమం దదేలనో
విన్నదనంబు గానబడు వేల్పుల కెల్లను వేలుపైన యా
క్రొన్నెలదారి కన్పడడు గుప్పున లేచెడు బూది యేమిటో
యన్నులమిన్న! చెప్పుమిదియంతయు నెంతయు హితమయ్యెడిన్

పార్వ - చెప్పెడిదేమున్నది? ఇంద్రాదులు తారకుని దాడికోడి వేల్పు పెద్దతో మొఱబెట్టుకొన నతండు "గౌరీశంకరులకు బునస్సమాగమము గల్గజేసినచో వారలకుం బుట్టు నతండు మహా వీరుండై యారాక్షసుని శిక్షింపగలడని చెప్పెనట! వార లప్పనికై రతీనాథుని బంప నతండు

వచ్చి తన శక్తిచే మృత్యుంజయు తపంబు నాపి నాపై వలపుగలుగునట్లొనరించె. అంత నమ్మహాను భావుండు జితేంద్రియుండు గాన చిత్త వికార కారకుండు మదనుండు గదా యని చెంతనున్న కంతునిపై గోపించి ఫాలనేత్రము విప్ప బాప మతండు భస్మమైపోయె. ఈశ్వరుండంత నింతుల చెంత వసించుట తాపసలక్షణంబు గాదని యెచ్చటికో బోయినాడు.

హిమ – అక్కటా! యెంతపని జరిగినది.

గీ॥ **అఖిలలోకాధినాథుడై యలరునట్టి**
**శంకరుం డల్లుడగునంచు సంతసింప**
**నేటి కాయాసలన్నియు నేలగలసె**
**బామరున కెట్టు లుత్తమపదవి కల్గు?**

అమ్మా! నీవిక నిందుండనేల? ఇంటికిం బోవుదము రమ్ము.

పార్వ – ఇంటికివచ్చి మాత్రమేమిచేయుదును?

హిమ – ఇందుండి యేమి చేసెదవు.

పార్వ – నానాథునికై తపం బొనరించెద

హిమ – ఏమి నీ వెఱ్ఱి? నీవెక్కడ తప మెక్కడ? ఆ కష్టములన్నియు నీవు సహింపగలవా? అయ్యది సులభసాధ్యమగు పనిగాదు.

పార్వ – తండ్రీ! అట్లనెదరేల? ఎట్టివారైనను సమయము వచ్చినపుడు కష్టముల ననుభవింపక దప్పునా?

హిమ – పార్వతీ! నీకింత శ్రమ యేల?

పార్వ – శ్రమపడనిచో లాభ ముండునా?

హిమ – నీమూర్ఖవాదము మాని నామాట వినుము.

సీ॥ **చెలువైన పువ్వుదోటల వసించెదు నీవు**
**కాంతారవాసంబు గడపగలవె?**
**అతుల దివ్యాన్నంబు లారగించెదు నీవు**
**దుంపలచే బొట్టనింపగలవె?**

**జిలుగుబంగరువస్త్రముల ధరించెదు నీవు**
**నారచీరలగట్టి నవయగలవె?**
**చిలుక పల్కులు విన్న నలుకుజెందెదు నీవు**
**శార్దూలరవముల సైపగలవె?**

**గీ॥ ప్రియవయస్యలతో విహరించు నీవు**
**చెడుగు మెకములలో నివసింపగలవె?**
**పుల్లసుమతల్పముల నత్తమిల్లు నీవు**
**కటికి ఆనేల బవళింపగలవె? తల్లి !**

పార్వ - తండ్రీ! నేనెట్టి కష్టంబులైనను భరించుటకు సంసిద్ధురాలనై యున్నాను గాన నా ప్రయత్నము నడ్డగింపక సెలవొసంగుడు.

హిమ - అమ్మా! నామాట వినుము.

పార్వ - "మీరు నాయుద్దేశమునకు విఘ్నము గల్గించి నా మనస్సునకు దాపము నాపాదింపవల" దని ప్రార్థింపుచున్నదాన.

హిమ - నీకంత కోర్కెయున్న నేనేల గాదనవలయును! కాని నీవింటివద్దనుండియే తపం బొనరింపుము. భయంకరారణ్యముల కేగకుము.

పార్వ - తపోవృత్తి నవలంబించుటకు మున్ముందు విరాగము కావలయును. అట్టి వైరాగ్య మింటివద్దనున్న లభింపదు. విజ్ఞులగువారిందువలననే తాపసులు వనవాస మొనరింపవలయు ననిరి.

హిమ - (తనలో) ఈమె నావాదంబులన్నియు ఖండింపుచున్నది. నేనిక మాట్లాడిన బ్రయోజనము లేదు. (ప్రకాశముగా) పార్వతీ! నీయుద్దేశ మట్లున్న నింటికి వచ్చి మీతల్లితో మాట్లాడి పోదువు రమ్ము.

పార్వ - ఆలాగే వచ్చెదను.

(ఇరువురు నిష్క్రమింతురు)

ద్వితీయాంకము

సమాప్తము

# మాహేంద్రజననము

## తృతీయాంకము - ప్రథమరంగము

(పార్వతీ తపఃప్రదేశము)

పార్వ - (ప్రవే) అక్కటా!

ఆ॥ కఠిన దీక్షతోడ గరకంఠు గూర్చి త
పం బొనర్చుచుంటి బహుళ భక్తి
బెద్దకాలమాయె బ్రియునకు నామీద
గరుణ కల్గదాయె గర్మమేమొ?

సీ॥ ప్రియురాలి నీరీతి వెతలపాల్సేయుట
ధర్మమా? నీకిది దైత్యహరణ!
కఠినోపవాస దీక్షను దపం బొనరించి
కృశియింపుచుంటి నోకృత్తివాస!
పరమానురాగ మేర్పడ వచ్చి నన్ను నీ
కౌఁగిటఁ బొదువుమో గరళకంఠ!
పవలు రేయియు నీదు పదసేవ యెపుడంచుఁ
జింతింపుచుంటి నోజీవితేశ!

గీ॥ ఆడువారలపై నింత యాగ్రహంబు
చూపగానేలనయ్య యోసుందరాంగ!
తప్పులన్నింటి మన్నించి దాసురాలి
విన్నపం బాలకింపు మో విమలహృదయ!

(వినుటనభినయించి) ఎద్దియో చప్పుడగుచున్నది. (పరికించి) ఎవ్వరో బైరాగి వచ్చుచున్నాడు. ఇతనిజూడ నపరశంకరుని వలె దోచుచుండె.

(బైరాగి ప్రవేశించును)

పార్వ - మహాత్మా! నమస్కారము.

బైరా - కల్యాణసిద్ధిరస్తు

పార్వ - అయ్యా! తామీ పవిత్రపీఠము నలంకరింపుడు.

బైరా - ఆలాగే! (అని కూర్చుండి తనలో) ఆహా! లోకములోఁ బతివ్రతయన్న సతీదేవియే పతివ్రత. ఈనారీమణి జన్మమునకుఁ జన్నదాది పడిన కష్టము లిన్నియని చెప్పగలమా? ఈకాంత నిట్లింకను బాధించుట ధర్మముగాదు. కాన ముందుగాఁ గొంత కపటనాటకము జరిపి పిదప నీముద్దియ యుద్దేశము సిద్ధింప జేసెద (ప్రకాశముగా)

**ఆ॥ దొడ్డవారియింటి బిడ్డవిధంబున**
**గానుపింపుచున్నదాన వీవు**
**తల్లిదండ్రులెవరు తరుణి నీ పేరేమి?**
**యిచట నిల్వహేతు వెద్ది చెపుమ.**

పార్వ - మహాత్మా! నేను మేనకా హిమవంతులకుం గూతురను. నా పేరు పార్వతి యందురు. తపోవృత్తి నీవనంబునం దున్నదాన.

బైరా - ఎవ్వరిని గూర్చి తపంబొనర్చుచుంటివి?

పార్వ - జగత్కర్తయగు శంకరుని గూర్చి.

బైరా - ఇందులకు నీ కోరిక యేమి?

పార్వ - ఆ పరమపురుషునిఁ బెండ్లియాడవలెనని.

బైరా - ఎంతవెఱ్ఱిదానవు.

**ఉ॥ చూచితిఁ బన్నగాంగనలఁ జూచితిఁ గిన్నర కీరవాణులన్**
**జూచితి యక్షకామినుల జూచితిఁ నిర్జర కోమలాంగులన్**
**జూచితి మర్త్యభామినులఁ జూచితి ఖేచరపద్మనేత్రలన్**
**జూచి యెఱుంగనీపగిది సోయగమున్న వధూటి నెచ్చటన్**

ఇట్టి లోకైక మోహన సౌందర్యరాశివగు నీవు మగనికొఱకుఁ దపంబొనర్చుచుంటివా? ఈబుద్ధి నీకుఁ దోచెనా లేక నెవరైన నుపదేశించిరా ? పార్వతీ! మాణిక్యము పోయి నన్నలంకరింపుకొనుఁ డని యొకరి బ్రతిమాలవలయునా? అయ్యయ్యో! నిష్కారణముగా నెన్నికష్టములఁ బడుచుంటివి!

**సీ॥ పసిడిమేడలలోన వసియింపుటనుమాని**
**నిర్జనాటవులందు నిలచినావు**

ఖరకరప్రభ లెఱుంగక మెలంగుట మాని
మందు వేసవులందు మ్రగ్గినావు
సరిగంచు సన్నకోకలను గట్టుటమాని
యూడనారలచీర లూనినావు
చెలిమికత్తెలతోడఁ జెలగియుండుటమాని
క్రూరమృగావలిఁ గూడినావు

గీ॥ పువ్వుబోడిరొ! నీనిండుజవ్వనంబు
నడవిగాసిన వెన్నెలయట్లొనర్చి
మగనికై తపమొనరించి మిగుల డస్సి
యిలను జీవచ్ఛవంబవై నిలచినావు.

ఉ॥ గట్టులకెల్ల రాయడనఁగాఁదగు నా హిమవంతు పట్టివై
పుట్టి సమస్తసౌఖ్యములఁ బొందక నంటినఁగందునట్టి మే
నిట్టు గృశింపఁజేయఁదగునే తగు సోయగమున్న వానిఁ జే
పట్టి సుఖింపు మేటికి తపంబు జపంబు మరాళగామినీ

అదియునుంగాక నీశ్వరుం దేమంత మంచివాడని వరించితివి?

సీ॥ తఱుగనేరని మహాధనవంతు డందుమా
పరుల యాచించి తా బ్రతుకుచుండుఁ
జిన్నారి పొన్నారి చిఱుతవాఁడందుమా
యేనాడు పుట్టెనో యెఱుగరెవరు
కులగోత్రములలోన గొప్పవాఁడందుమా
తలిదండ్రులెవ్వరో తెలియరాదు
యలరువిల్తునివంటి యందగాఁడందుమా
యంత విరూపిలేఁ డరయ నెవడు

గీ॥ వనిత! నీవేమి మంచివాఁడని తలంచి
మఱిగినావమ్మ హరునిఁ బెన్మమతతోడఁ
దగదుతగదింక నీ వెఱ్ఱితనము మాని
తగినవరుని వరింపుమో తరళనయన!

అతని పుట్టు పూర్వోత్తరము నీ కొక్కరైనఁ జెప్ప లేదా?

సీ॥ చిలువపేరుల ధరించెడువాఁడు మణిహార
ములఁదాల్చు నీకెట్లు ముచ్చటాయె
వల్లకాట వసించువాఁడు హాటక సౌధ
ములనుండు నీకెట్లు ముచ్చటాయెఁ
బూదిఁబూసెడువాఁడు పునుగు, జవ్వాజియుఁ
బూయు నీ కేరీతి ముచ్చటాయెఁ
దోలు గట్టెడువాఁడు మేలి చీరలమేనఁ
బూను నీ కేరీతి ముచ్చటాయె

గీ॥ తరిపెమెత్తు దరిద్రుండు సిరులలోన
మునిగి తేలెడు నీకెట్లు ముచ్చటాయె
నెద్దుపై స్వారిజేయువాఁ డేన్గునెక్క
ముద్దుగుమ్మకు నీకెట్లు ముచ్చటాయె.

కాంతామణీ! నీ చరిత్రమంతయు వింతగానున్నది. ఇఁకనైన నాహితము బాటించి కాటికాపరిపై మోహంబు మాని నీకుం దగిన జవ్వనము చక్కదనము మొదలగు సకల సద్గుణములు గల్గిన యువకునిఁ బెండ్లియాడి సుఖింపుము.

ఆ॥ ఈశ్వరునకు నీవు నిల్లాలివైనచోఁ
దోయజాక్షి! మంచి దొండపండు
కాకి ముక్కునందుఁ గట్టినట్లుండును
సందియంబు లేదు సత్యమిద్ది

పార్వతీ! వివాహకంకణవిరాజితమగు నీ పాణిపల్లవంబుచేఁ గాలసర్పంబులు పెనగొనియున్న జన్నపువేటగాని చేతినెట్లు బట్టుకొనగలవు? మరాళ విగ్రహములతో నొప్పు నీ పట్టు చీరకును రక్తధారలు గారుచు బురవైరి మొలనున్న పులితోలునకును బ్రహ్మబంధములు వేయుటకు నీకిష్టమా? దివ్యభవనములలోఁ బువ్వుసెజ్జలపై విహరింపు నీపాదములను వెంట్రుకలతో నిండి యున్న శ్మశానవాటికలో మోపుటకు నీ వోర్వగలవా? చందనలిప్తములగు నీ చనుబంతులపై పీనుగల బూడిద బూయబడిన శంకరుని వక్షస్థల మంటుకొనుట కియ్యకొందువా? వేయేల నతనియందు మంచిలక్షణ మొకటియైనను గానరాదు. అట్టి మగనిఁ గోరుట తగదని వేరుగఁ దజెప్పవలయునా? ఎట్టి సాధువైనను శ్మశానమందలి కొఱతకంబమునకు వేదోక్తకర్మలం జేయడుగాన నా మాట విని బాగుపడుము.

పార్వ – అయ్యా, మీమాటలంబట్టి చూడ నీశ్వరు నెఱుంగనివాఁడవుగాఁ దోచుచున్నావు.

మరియు నీవు వివేకహీనుండవని తెల్లమగుచున్నది. లేనిచో సచ్చరిత్రుండగు శంకరుని సామాన్యునిగాఁ దలంచి దూషింపవు.

సీ॥ ఎద్దు నెక్కెడువాని నేన్గుపై నెక్కెడు
శతమఖుం డేల సంస్తుతి యొనర్చు
బిచ్చ మెత్తెడువాని లచ్చితోఁ దులదూగు
రాజరాజేల దాబూజ సేయుఁ
దోలుగట్టెడువాని మేలిబంగరు వల్వ
దాల్పు వాఁడేల సంస్తవ మొనర్చుఁ
బనికిమాలినవానిఁ బరమయోగీంద్రులు
మునివర్యు లేల భక్తిని భజింత్రు

ఆ॥ కడు గురూపియగుచు గాన్పింపు వానిని
జగములందునున్న జనములెల్ల
దనివి దీఱనేల దర్శింపుదుమటంచు
వేచియుందురయ్య వెఱ్ఱివాడ!

అయ్యా! నీవీశ్వరుని నిందింపదలచి, యతఁడు లేతవాఁడు కాఁడనియు నెప్పుడుదయించినదియు నెవ్వరు నెఱుంగరనియుఁ బల్కితిరి. నిజమే. స్వయంభువుడగు హిరణ్యగర్భునికి సైత మేపురుషుండు కారణమని వేదములు చెప్పుచున్నవో అట్టి అనాది పురుషుని జన్మవృత్తాంతము నీవంటి మందబుద్ధు లెట్లెఱుంగగలరు? పువ్వుదేనె యందలి మాధుర్యము నెలదేటి గ్రహింపగలదు గాని, తూనీగల కంతుబట్టునా?

బైరా – ఏమనుచుంటివి?

ఉ॥ భావమునందు నీదగు శుభంబునుగోరి యథార్థమంతయున్
నేవినుపింపగాఁ దెలియనేరక నన్నొక వెఱ్ఱివానిగా
భావన జేసి నీవిటులఁ బల్కుచునుంటి వహో "వినాశకా
లే విపరీతబుద్ధి" యని లేదె బుధోక్తి హిమాచలాత్మజా

పార్వ – అయ్యా! మీరంతగాఁ జెప్ప నవసరము లేదు. నేఁగోరి నట్టి పురుషుఁడు మీరు చెప్పిన ట్లయోగ్యుఁడే యగుగాక! త్రికరణ శుద్ధిగా నేనతనినే వరించితిని. అతఁడే నాభర్త. నాచిత్తం బతనియందే నిలచియున్నది; ఇందుకు మీయడ్డేల ? లోకములో నొకరి స్వాతంత్ర్య వాంఛ నొక రడ్డగింపగలరా ?

బైరా - (తనలో) ఆహా! ఏమి యీపార్వతి భర్తృప్రేమ. (ప్రకాశముగా)

ఉ॥ దాపరికం బదేల ? వనితామణి! నీవు వరించినట్టి వాఁ
డీపురుషుండె సుమ్మి క్షమియింపుము నాదగు దోసమెల్ల ని
న్నాపద పాలుజేసిన దురాత్ముఁడనంచు మనంబు లోపలన్
గోపము బూనఁబోకు మిఁక గొబ్బునఁ జేరుము నాకవుంగిటన్

పార్వ - (సిగ్గుపడి)

ఉ॥ వందనమయ్య! భక్తజనవత్సల! నిన్నొక వెట్టివానిగా
డెందమునం దలంచితి గడింది వివేక విహీననౌట ద
ప్పుం దయతోడ గాచి సతమున్ మిము గోరి తపంబొనర్చునీ
యిందునిభాస్య నీనగకులేశ్వరపుత్రి, ననుగ్రహింపుడీ.

(అని కాళ్ళపై బడును)

బైరా - ప్రేయసీ ! లెమ్ము. లెమ్ము (అని లేవదీసి)

ఉ॥ తొయ్యలి! నీదుచూపులను తూవులనాటి మదాత్మనయ్యయో
వ్రయ్యలు జేసె నౌషధము వైళమొసంగు మదెద్దియన్న నీ
తియ్యని మోవి తేనెయు, సతీ! కుచకుంకుమపంక లేపమున్
జయ్యనఁ ద్రాగి పూయుదును సంతసమెంతయుఁ గల్గునంతటన్

పార్వ - జీవితేశ్వరా! మీరంతగాఁ గోరవలసిన పనిలేదు. ఈ పార్వతి మీసొత్తయి యున్నది. కాన లోకాచార ప్రకారము వివాహమాడి సుఖింపుడు

బైరా - అబ్బా! ఎంతపని బెట్టితివి. గాంధర్వమున బెండ్లి యాడరాదా ?

పార్వ - ఆర్యా! అట్టి వివాహము తమవంటి వారికిఁ దగదు గాన సక్రమముగా కార్య నిర్వహణ మొనరింపుఁడని నా ప్రార్థన.

బైరా - అట్లయిన నీ వింటికి జని నీ తలిదండ్రుల కీవార్త జెప్పుము. నేనును దగువారి బెండ్లి రాయబారమున కంపెద.

పార్వ - చిత్తము సెలవు (అని నిష్క్ర)

బైరా - నేనిప్పుడే కైలాసమునకుఁ జని నందీశ్వరుని రాయబారిగా నంపెద (అని నిష్క్రమించును).

## ద్వితీయ రంగము - హిమవంతుని మందిరము

(పార్వతీ హిమవంతులు ప్రవేశము)

హిమ - పార్వతీ! ఈశ్వరుఁడు ప్రత్యక్షమై నీయభీష్టము నీదేర్పుదునని పల్కెనంటివి కాని శంకరుం డింకను వివాహవిషయమై యాలోచింపుటకుఁ దగువారి నిటకుఁ బంపని కారణ మేమైయుండును?

పార్వ - జనకా! ఆవిషయమై సంశయింపఁ బనిలేదు. రాయబారి త్వరలో రాకమానడు (వినుట నభినయించి) శివభక్తాగ్రేసరుఁడగు నందికేశ్వరుఁడు వచ్చుచున్నాఁడు. వీరి నప్పురారియే పంపియుండును.

(నందికేశ్వరుఁడు ప్రవేశించును)

హిమ - మహాత్మా! నమస్కారము.

నంది - ఈశ్వరార్పణమస్తు.

హిమ - అయ్యా ! ఈరత్నపీఠమునం దాసీనులుగండు.

నంది - (కూర్చుండి) పర్వతేశ్వరా! నేనీశ్వరభక్తుండ. నాపేరు నందికేశ్వరుడందురు. దేవదేవుండగు మహేశ్వరుఁడు నీ పుత్రికయగు పార్వతీదేవిని బెండ్లియాడదలంచి నన్ను రాయబారిగాఁ బంప నిటకు వచ్చితిని. ఇందులకు నీవేమనియెదవు ?

హిమ - ఏమి నా భాగ్యము నందికేశ్వరా !

ఆ॥ ఆదిదేవుఁడయిన యభవుండు నా ముద్దు
గూతుఁ బెండ్లియాడగోరినప్పు
డింకఁ జెప్పఁదగిన దేమి శ్రీరాఁ గాలి
నడ్డపెట్టువా ర లరయ గలరె ?

శా॥ ఏ యే తీర్థములందుఁ గ్రుంకితినొ యేయే వేల్పులం గొల్చితో
యేయే దానము లాచరించితినో యేయే ధర్మముల్జేసితో
యేయే నోముల నోచితో సకలలోకేశుండు నా కల్లుఁడై
హాయింగూర్చగ నిట్టిధన్యుఁడెవ డాహా! లోకముల్మూఁలోన్

నందికేశ్వరా! మత్పుత్రికయు శంకరుని వరించి యన్న పానాదుల విసర్జించి యహర్నిశంబు లీశ్వరుం డెప్పుడు నన్నుఁ జేపట్టునా యని కలవరింపుచున్నది. కాన సత్వరంబున వచ్చి పార్వతిం బెండ్లియాడుడని చంద్రశేఖరుతోఁ జెప్ప వేడుచున్నాడను.

నంది - హిమవంతా! శుల్క మేమి కోరెదవు?

హిమ - శుల్కమా ! హరహరా! యెంతమాట!

**ఆ॥ చంద్రశేఖరుండు సాంద్రదయాపూర్ణ**
**వీక్షణముల నన్నుక్షణంబు**
**జూచునదియె సుతకు శుల్కంబటంచు న**
**య్యనఘుతోడఁ జెప్పుమయ్య! నీవు.**

నంది - నగరాజా! నీబుద్ధికి సంతసించితిని. శంకరుండు నా రాక నిరీక్షింపుచుండుఁ గాన నేనిఁక నాలస్యము జేయదగదు. మరియు రేపటిదినమే పార్వతీ పరమేశ్వరుల వివాహమునకు సుముహూర్తము గానున్నది. కాన నీ ప్రయత్నమునం దప్రమత్తుండవై యుండుము నేనిఁకఁ బోయివచ్చెద (అని నిష్క్ర.)

హిమ - పార్వతీ! అవ్యవధిగా లగ్నము కుదురుటవలనఁ గావలసిన పనులన్నియుఁ ద్వరలో నెరవేర్పుటకుఁ దగువారిని నియమింపవలయును గాన బోవుదము రమ్ము. (అని నిష్క్రమింతురు).

## తృతీయాంకము - తృతీయరంగము

## ప్రదేశము - వివాహ మంటపము

(పెండ్లివారందరు నర్హస్థానముల నుందురు)

నారా - నగసార్వభౌమా ! సుముహూర్తము సమీపించుచున్నది గాన నమ్మాయిని రావింపుము

హిమ - చిత్తము

నారా - (వివాహశ్లోకములఁ జదువుచుండును.)

పార్వ - (లజ్జావనతయై చెలికత్తెలతోఁ బ్రవేశించి తెరచాటున నుండును).

హిమ - (ఈశ్వరుని పాదములఁ గడిగి యంజలిబద్ధుఁడై)

**శా॥ స్వామీ! శంకర! భక్తవత్సల! మహేశా! పుణ్యచరిత్ర! నా**
**మౌనిస్తుత పాదపంకజ! జగన్నాధా! దయాంభోనిధీ!**
**హైమగ్రావశరాన! నీ యర్ధాంగిఁ గామత్సుతన్**
**శ్రీమత్సద్గుణరాశిఁ బార్వతి నిదే చేపట్టు మీపట్టునన్**

నారా - దేవా! (అని యీశ్వరునకు మంగళ సూత్రము నిచ్చును)

ఈశ్వ - (సూత్రధారణ మొనరింపఁ బుష్పవర్షము గురియును)

(ముత్తయిదువలు వచ్చి మంగళహారతులఁ బాడుదురు )

(తెర పడును)

# మాహేంద్ర జననము

## చతుర్థాంకము - ప్రథమ రంగము - ఈశ్వరభవనము

(ఈశ్వరుఁడును పార్వతియు ప్రవేశము)

ఈశ్వ - ప్రేయసీ! నేడేమియు మాట్లాడక నేదియో విచారింపుచున్నట్లున్నావు. నీవిచారమున కుం గారణమేమి ?

పార్వ - జీవితేశ్వరా! వెదుకఁబోయిన తీగె కాళ్ళకుం దగిలెనన్నట్లు మీరే యడిగితిరి గానఁ జెప్పెద వినుఁడు.

చ॥ పురహర! మున్ను దక్షునకుఁ బుత్రికనై జగదీశ్వరుండవై
పరగిన మీకుఁ బత్నినయి భాసిలుచుండిన నేను దత్కళే
బరమును బాసి మిమ్మునెడఁబాసి హిమాద్రిని బుట్టఁ గారణం
బరయగ నెద్దియో? తెలుపుమయ్య వినన్ మనసయ్యెఁజయ్యనన్

ఈసందియంబు నాడెందంబునఁ జిరకాలము నుండియుఁ గలదు. దానినేడు వెలిబుచ్చితిని గాన నీదాసురాలి విన్నప మంగీకరించి సందేహముందీర్పుడని వేడుచున్నదాన.

ఈశ్వ-ఉ॥ చక్కని పృచ్ఛజేసితివి సంతసమెంతయుఁ గల్గె నిన్నినా
క్లెక్కరణింభరించితివి యింతిరొ! యియ్యనుమానమాత్మయం
దెక్కువ మేలుగల్గె నను నీవిటుగోరుట పువ్వుబోండ్లకున్
మక్కువ జెప్పెదన్ వినుము మానిని! తద్విషయంబు నంతయున్

చ॥ ఇహపరసౌఖ్య సంతతుల నిచ్చు వ్రతంబు లనేకముండె ని
మ్మహిని సతీగణంబునకు, మానిని! తద్వ్రతకోటిలోపలన్
మహిళల కెల్ల దుఃఖముల మాన్పి శుభంబుల నిచ్చు సద్వ్రతం
బహహ వశంబె దానిఁ గొనియాడగ "శూర్పపుటీ" సమాహ్వాయమున్

ఈవ్రతరాజంబు నేనారీమణు లాచరింపుదురో వారలకు సకలసంపత్సమృద్ధియు నాయురారోగ్యాభివృద్ధియు బుత్రపౌత్రాది సంతానసిద్ధియుఁ గల్గి సంతత సౌఖ్యంబుల ననుభవింపుచు హృదయేశ్వరు నెడబాయకుందురు.

సీ॥ ఏ ముద్దుగుమ్మల కోమలాంగంబుల
నవరత్నమయభూషణములు గలవొ

తులలేని పట్టుచీరలనే లతాంగులు
గట్టుచుందురొ మోద ముట్టిపడగ
నందంబులగు మేడలందే వధూటులు
వసియింపుచుందురో పసదలిర్ప
ద్యుతిమించు బంగారు దూగుటుయ్యేలలనే
తొయ్యలు లూగుచుందురొ సతంబు

గీ॥ బాడిపంటలు నిరతమే చేడియలకుఁ
దరుగు లేకుండునో మదిం దలచిచూడ
నట్టివారెల్ల నీవ్రతం బాచరించి
నట్టివారంచు నెంచు మా యబ్జవదన!

గీ॥ అన్ని వ్రతములకన్న నిందున్న యట్టి
యధిక మెయ్యది యనుచు నన్నడుగుదేని
ప్రియముతో నీవ్రతం బాచరించిరేని
ప్రాణనాధుల సతు లెడబాయ రబల!

అచలాత్మజా!

సీ॥ ఎవనిరూపముగన్న నింతికి దుఃఖంబు
నిముసంబులోపల సమసిపోవు
నెవనిసేవ నొనర్ప నిందీవరేక్షణ
కిహపరంబుల నావహిల్లు సుఖము
లెవని ప్రేమావచశ్శ్రవణంబుచేఁ బువ్వుఁ
బోడి నెమ్మేనునఁ బులకలొదవు
నెవనిచే నిరతంబు నిభరాద్గమన సర్వ
భోగభాగ్యంబులఁ బొందుచుండు

గీ॥ నెవని ప్రాణంబు దన ప్రాణమే యటంచు
నాత్మలోపల విద్యుల్లతాంగి తలచు
నట్టి నిజభర్త నెడబాయనట్టి భాగ్య
మెట్టిదని చెప్పవచ్చు రాకేందుముఖికి

ఇట్టి నిరుపమాన ఫలప్రదాయినియగు శూర్పపుటీ వ్రతంబునకన్న నుత్తమ వ్రతంబునితంబినీ మణుల కెట్టిదియు లేదని వాదింపవచ్చును. నాయకీ! ఏకాంతయైన నీవ్రతరాజం బొనరింపక

మున్ను మరణించినచోఁ దదుపరి యామె పేర సంబంధులగు వారెవ్వరైన నీవ్రతం బాచరించిరేని భవిష్యజ్జన్మంబునం దాయింతి కది ఫలంబు నొసంగగలదు గావున

ఉ॥ చేయఁగలేదు నీవు సరసీరుహలోచన! యీ వ్రతంబు
దాక్షాయణివైన కాలమునఁ గారణ మద్దియె నన్నుఁ బాసి త
త్కాయము వీడి పార్వతివిగా జనియింపఁ ద్రిలోక కర్తకున్
జాయవునైన మాత్రమున శక్యమె? కర్మఫలంబు దప్పగ

పార్వ - (ఆశ్చర్యముతో) కటకటా! నే నెంతమందమతిని! నా వంటి దౌర్భాగ్యురాలీ జగంబునం దెందైనం గలదా? ఓ శూర్పపుటీ వ్రతరాజమా! ఏమి నీ మాహాత్మ్యము? నిన్ను మరచినందులకుఁ దగుఫల మనుభవించితిని గదా.

చ॥ చెలఁగుచుఁ దొల్లి యీ వ్రతము సేసినచో జనకావమానమున్
జెలువునితో వియోగమును జింతల వంతలనంది కొండలో
పల మరలఁ జనించుటయుఁ బర్ణములైన భుజింపక గడు
నలిగి తపంబొనర్చుటయు నా కకటా! యివి సంభవించునే?

జీవితేశ్వరా!

చ॥ తెలియక మోసపోయితి సుధీజనసన్నుత! పూర్వమందు భూ
వలయములోన నాకు సరివచ్చు వివేక విహీనురాంద్రయో
కలరొకొ? యిప్పుడైన గదకన్ వ్రతరాజము నాచరింతు మీ
సెలవునొసంగుఁడయ్య! దయఁ జేకొనవయ్య! నతుల్ హితావనా!

ఈశ్వ - హైమవతీ! సత్కార్యము లొనర్చెదనని నీవు కోరినచో నే వలదందునా? "శుభస్య శీఘ్రు" మన్నట్లు వేవేగ వ్రతమారంభింపుము. అందులకుం గావలసిన వస్తువులన్నియు నిప్పుడే సంసిద్ధము జేయించెదను.

క॥ కుసుమంబులు బత్రంబులు
బసుపుం గుంకుమయు దివ్యఫలములు మేలౌ
వసనంబులు గంధాదులు
వెసగూర్తురు భటులొనర్పవే! వ్రతమబలా

పార్వ - మృత్యుంజయా! యీ వ్రతంబునకు ముఖ్యాంగములగు చేటలు లభించుటెట్లు?

ఈశ్వ - చేటలా? అవియన నెంత? (అని సర్పహారములఁ దీసి) ఓ పన్నగేంద్రములారా! మీరు సత్వరంబున మహేంద్ర నగరంబుపై వేణుద్రుమంబులై జనింపుడు (అని విసరును.)

పార్వ - నాథా! తద్ద్రుమంబుల ఖండించి శూర్పంబు లెవ్వరల్లుదురు?

ఈశ్వ - అందులకై వినాయకాది ప్రమథవర్యుల నియమించెద.

పార్వ - స్వామి!

ఉ॥ వాకిలిఁ బచ్చసేయుతతి బంధుహితాదులు లేకయున్న నే
జోకయు లేదుగాన దయఁజూచి సరస్వతి నిందిరాసతిన్
నాకపురాంగనామణుల నాదగు విన్నప మాలకించి యీ
శ్రీకర సద్వ్రతంబునకు జెచ్చెరఁ బిల్వగజేయుఁ డిత్తతిన్

ఈశ్వ - మంచిది. అట్లయిన నందులకుం దగువారిని నియోగించి పంపుదుము రమ్ము. (ఇరువురు నిష్క్ర.)

## ద్వితీయరంగము - మహేంద్ర పర్వతము

(చంద్రశేఖరుడు, మృత్యుంజయుడు, గంగాధరుడు మొదలగు ప్రమథులు కత్తులతో ప్రవేశింతురు.)

చంద్ర - మృత్యుంజయా!

సీ॥ సకలావనీజాత సముదయావాలంబు
సాధు మృగానీక సదనభూమి
శుక పికాది విహంగ నికర సంచారంబు
దివ్యకాసార సందీపితంబు
పూతగంధోపేత వాత విఖ్యాతంబు
బహు పుష్పఫలజాలబంధురంబు
పరమ తాపసవాస పావనక్షేత్రంబు
సుందరకుంజ సంశోభితంబు

గీ॥ నమర గంధర్వగరుడవాహ్యాళిసీమ
యప్సరోభామినీకోటి కాటపట్టు
ప్రోన్నత విశాలమంతమై వన్నెగన్న
యిమ్మహేంద్రాచల మహత్వ మెన్నదరమె?

మృత్యుం - చంద్రశేఖరా! స్వామియగు శంకరుండు సృజియించిన వేణుద్రుమంబు లెంత సొంపుగానున్నవి. ఆహా! యీ వృక్షములు సర్వజనోపయోగములు గదా!

సీ॥ ములుగఱ్ఱలగు సేద్యమును జేయువారికి
బిల్లనగ్రోవులౌ పిల్లలకును
గొలపాత్రలగు గృహస్థుల కెల్లవారికి
గురువృద్ధులకు నూతకోలలగును
క్షితి సర్వజనులకుఁ జేకఱ్ఱ లగుచుండు
బల్లకీ కాధారపడుచునుండు
వాసంబులగును నివాసంబులకు నెల్ల
దడులకు నుపయోగపడుచునుండు

గీ॥ నొనర గావడిబద్దల కుపకరించుఁ
జల్లలం జేటలను జాప జల్లెడలను
తట్టలం బుట్టలను మంచి పెట్టియలను
దిట్టముగ నల్లవచ్చు నీ చెట్టువలన.

గంగా - అన్నలారా! దీనియం దింకొక విశేషమున్నది సుమా! అదెద్దియనగా.

గీ॥ అరయ నడవులలో దిరుగాడునట్టి
కోయలును జెంచువాండ్రును గూటికొరకు
వండి భుజియింతురీ చెట్టుతండులములఁ
దాన రోగంబులెల్ల నంతంబునందు

మరియు

క॥ వనవాసంబును నిడివియు
నునుపును మెఱుగారు మణులనుం దాల్పుటయుం
గనుగొన నివ్వెదురులకు
మునుపటి ఫణిరాజచిహ్నములె కనుపట్టున్.

చంద్ర - సోదరులారా! కాలహరణమగుచున్నది. ఆలస్యము జేయక వేణుద్రుమంబుల ఖండించి పార్వతీదేవి కావించు మూసి వాయనవు నోమునకుఁ జేటల నల్లి సిద్ధము జేయవలయు గాన వేణు వనమునకుం బోవుదము రండు.

(అని నిష్క్రమింతురు)

## తృతీయ రంగము - మహేంద్ర పర్వతము

(అరవింద, సువర్ణమాల, లలిత మొదలగు దేవకన్యలు ప్రవేశము)

అర - సువర్ణమాలా! యేమి యీ నగాలంకారము! సహజ సౌందర్యవంతమగు యీ సానుమంతమున కీ వసంతసమయ మెంతయు గాంతి నొసంగెగదా!

సీ॥ పండుటాకులుపోయి బహు సుందరంబు గా
చిగురాకు లుదయించె జెట్లకెల్ల
గమ్మతావుల దిశల్ గ్రమ్ముచు బుష్పమ్ము
లెచ్చోట గాంచిన ముచ్చటాయె
నబలామణీ! శ్రవణానందమగునట్లు
గోకిలల్ గొమ్మల గూయుచుండె
బరిమళోపేతమై పవనంబు జల్లగా
వీచుచున్నది కడు వేడ్కగదుర

గీ॥ నెండయన నెట్టిదో మది కెరుగనీక
దట్టముగ నల్లియుండె లతాగృహాళి
సకలసంతోష సౌఖ్యభాజనమునగుచు
నింతిరో! విలసిల్లె వసంత మహహ!

సువ - అరవిందా! యిటు జూడుము.

సీ॥ సుమలతాఫలపత్రశోభితోర్వీజముల్
పెండ్లిపందిలిమాడ్కి వెలయుచుండె
బుణ్యాంగనాలాపములరీతి బికరాజ
శుకవచోనాదముల్ సొంపుగుల్కె
దూర్యధ్వనులలీల దోచుచుండె మయూర
శారికాసార వాక్సంచయంబు
హోమాగ్ని శిఖలయట్లుత్తమాంగంబుల
ద్రిప్పుచు జిగురాకు లొప్పుచుండె

గీ॥ గొల్లగా వ్రాలినట్టి యీ మల్లెమొగ్గ
లెల్ల సేసలపగిది శోభిల్లుచుండె
సకియ! కానన లక్ష్మీవసంతులకు వి
వాహమగుచున్నదాయేమి? వనమునందు

లలి - అక్కలారా! యీ లతాకుసుమాదులను గన్నులపండువ యగునట్లు జూచుదము రండు.

అర - మంచిది (అని అందరు ముందునకు నడచి) నే నీ మల్లె పువ్వులం గోసికొనెద మీరు రాకుడు.

సువ - నీకంత కఱవుగానున్న గోసికొనుము. మేము వాని కాశింపములే. మా కా పుష్పములు. లభించునా? ఇవన్నియు నేమిటి?

(అందరు బువ్వుల గోయుదురు.)

**లలి-చ॥ అమల సువర్ణ మౌక్తికమయాంబర భూషణముల్ ధరించి యా**
**సుమశరవైరి దేహమున శోభిలు పార్వతిభంగి నిమ్మహీ**
**జమునకు జట్లు నల్లికొని సౌరభ పుష్పవిరాజమానమై**
**యమరెడు బువ్వుతీగె నబలా! కనుగొంటివె చిత్రమయ్యెడిన్**

సువ - ఓహో లలితా? ఆ పువ్వుదీగ మిక్కిలి చల్లగానుండుటయే గాక నీ మనంబున దాంపత్యాభిరతిని సైతము బుట్టించెను గదా.

లలి - చెలీ! యెగతాళి సేయకుము. మనమందరము నవివాహితలమనుమాట మాత్ర మించుక జ్ఞప్తియం దంచుకొని యధిక ప్రసంగములకు బోకుము.

అర - అక్క! యీ రక్తవర్ణంబుగల పుష్ప మెయ్యది?

సువ - ఎఱుగవా? ఇది మోదుగపువ్వుగదా!

అర - ఎంత కాంతిగానున్నది! (అని కోసి వాసనజూచి)

ఏమిది?

**గీ॥ పురుషునకు నీతిహీనులౌ పుత్రులొదవి**
**మహి నిరర్థకులైనట్లు మందయాన !**
**పరిమళము లేక నీ పాదమునబూచి**
**నిష్ఫలములయ్యె నీపుష్పనివహమెల్ల.**

సువ - ఔనౌను ! సఖీ! అరవిందా!

ఉ॥ అల్లదె మల్లెచాలు కను మయ్యది చంపకభూమిజాతమా
పల్లవబంధురంబగుచు భాసిలు మామిడిగున్నజూడు మీ
సల్లలితంపు చందనకుజంబును గంటివె? వింతయయ్యె ను
త్ఫుల్ల సరోజనేత్రి! కదుబూచిన తంగెదు సొంపుగాంచినన్

లలిత – ఆహా! యేమి యీ పుష్పసౌందర్యము!

సీ॥ ఈ పుష్పములచేతనే గదా మదనుండు
పువ్వుబోదుల గదు న్నొవ్వజేయు
నీ గండుతుమ్మెదలేగదా స్మరధను
స్సూత్రంబులై మృగాక్షుల గలంచు
నీ కీరశారికానీకమేగద కంతు
బలగమై యబలల బారదోలు
నీకమ్మ తెమ్మెరలేగదా ననవిల్తు
నకు సాయమగుచు నంగనలనొంచు

గీ॥ నీచివురుటాకులేగదా యెంచిచూడ
శంబరారాతి ధనువులై సతుల నడచు
నొక్కొకప్పుడు బ్రియములై యొక్కొకప్పు
డప్రియములగు నివి మన కబ్జవదన.

సువ – కోమలీ! అప్రియము లెప్పుడగును ?

లలి – నీ వెరుగవా ?

సువ – నిజముగా నెఱుగను.

లలి – ఎఱుగని వారికిప్పుడు చెప్పినంత మాత్రమున నంతుబట్టునా ?

సువ – లలితా యేమి నీ చతురోక్తులు!

లలి – చతురోక్తులయందు మనలోనొకరికొకరు దీసిపోదురా? సువర్ణమాలా! అటు జూచితివా?

సువ – చూచితిని. అందేమున్నది!

లలి-సీ॥ బింబాధరీ! నిన్ను బిలుచుచున్నదిజూడు
మదిగో శుకంబు వృక్షాగ్రమందు
బల్లవపాణి! నిన్నుతిమాలుచున్నది
రమ్మంచు గోకిలరాజ మదిగొ
రాకేందువదన! నీరాక గోరుచునుండె
వన్నెగుల్కెడు చక్రవాక మచట
గుసుమగంధీ! నిన్నుగోరి రమ్మనుచుండె
మత్తద్విరేఫాళి చిత్తమలర

గీ॥ నోసరోవరనాభి! నిన్నాసతోడ
రాజహంసంబు "కొమ్మ! రారమ్మ" టనియె
నదిగొ ఘనవేణి! నీరాక కెదురుగనుచు
జిందులం ద్రొక్కుచున్నది చిన్ని నెమిలి

అర – ఈచతుర వచన రచనల కేమిగాని, మనము కాసారంబున కేగి, స్నానమాచరింపుదము రండు.

లలి – అరవిందా! యింకను గాసార మెంతదూరంబునందున్నది?

అర – లలితా ! కన్యవగునీకు నడకయన్న నంతకష్టముగానున్నదా?

వసంతుని పుణ్యమాయని సుమతల్పములమీదనే నడచుచుంటిమి గదా నీకింతశ్రమ యేలగల్గె?

లలి – ఇక నీ నర్మగర్భవాక్యంబుల జాలింపుము. ఎంతగప్పి పుచ్చినను నీభావంబుల గ్రహింపలేననుకొంటివా?

అర – లేదులేదు. నీకంత కర్మ మేల బట్టినది? నీవు మొదటి నుండియు దెలివి గల దానవేనమ్మా! కాని మా యందు దయయుంచి కొంచెము తొందరగా నడువుము.

లలి – నీ కన్న మందయాన లిం దెవరును లేరులే పద పద

సువ – నడచిరాక యేమివాదములమ్మా!

ఉ॥ చేరువయయ్యె నిర్మలవిశేష సుధాసమనీరసారకా
సారము, పోర నేల? నిక సాగు డదే వినవచ్చె నీరజ
స్ఫారమరందపానమున సంతసమందిన చంచరీక ఝుం
కారనినాద, మోవికచకైరవలోచనలార! వింటిరే

అర – నిజము. మరియు,

గీ॥ చాన ! మనరాక నెరిగి కాసారకాంత
యెదురు జని గమనశ్రమం బెల్ల బాపి
మనలగొని తెమ్మనుచు నిటకనిపినట్టి
దూతయో యన నీశీతవాత మలరె

ఆమె మన రాకకై యింత యెదురుచూచుచున్నపుడు మన మాలసింపక బోవుట ధర్మము గాన శీఘ్రమే రండు.

(అందరు నిష్క్రమించుచున్నారు.)

చతుర్థాంకము సమాప్తము

# మాహేంద్ర జననము

## పంచమాంకము - ప్రథమరంగము - మహేంద్ర పర్వతము

(ప్రమథులు ప్రవేశింతురు)

చంద్ర – మృత్యుంజయా! నేటితో నీశ్వరకృపావిశేషంబున లోకమాతయగు నగజాత గావింపు శూర్పపుటీవ్రతంబునకు గావలసిన చేటల నన్నింటిని నిర్మించి శంకరుం దంపగా వచ్చినవి యెచ్చరాళి కిచ్చిపంపి కృతకృత్యులమైతిమి గాని యింతటితో మన కార్యభారము తగ్గలేదు సుమా!

మత్యుం - ఎందువలన దగ్గలేదు?

చంద్ర - పార్వతీదేవి యుత్తమోత్తమంబగు యీవ్రతంబును కావింపుటచే నామెకు దన్మహత్వంబు వలన శంకరార్ధాంగమున గలసి ప్రాణనాథునితో శాశ్వతముగానుండు భాగ్యము గల్గె నీశ్వరుండు నాటి నుండియు నర్ధనారీశ్వరుండనబరగె. అది చూచి లక్ష్మి, సరస్వతీ, పులోమజాది దేవకాంతలావ్రతంబు దామును జేయదలంచిరట! వారలకు గావలసిన చేటలన్నియు మనమే పంపవలయును గాన నింక కొంతకాలమువరకు మన మిందుండక తప్పదు.

మృత్యుం - కానిమ్ము మనకంతకన్న కావలసినదేమున్నది?

గం – సోదరులారా ! మన మిటకు వచ్చిన దాది శూర్పనిర్మాణ కార్యమగ్నులమై యుండుట వలన నిద్రాహారంబులు సరిగా లభింపక మిగుల నలసితిమి గాన కొంత తడ వీచల్లగాలికి పొన్నగున్న నీడ విశ్రమించుదము.

చంద్ర - మంచి దట్లే జేయుదము.

(అని అందరు నిద్రింతురు)

(దేవకన్యలు మరల ప్రవేశింతురు)

అర – సువర్ణమాలా! జలక్రీడాసమయమున దడిసిన మన శిరోజములు చక్కగా నారునట్లు జేయుటకోయన బద్మబాంధవుండు చండ తేజంబున వెలుగుచున్నాడు. చూచితివా? కాని పాపమా ఖరకరుడు మనకెంత యుపకార మొనర్ప దలచినను ఈ మహేంద్ర నగమందలి లతా గృహంబు లతని మాట దక్కించుట లేదు గదా?

గీ॥ అవనిగుణవంతు లగువా రయాచితోప
కారముల జేయుచుందు రనారతంబు
గానివారల కది యేమికర్మ మకట
విఘ్నములు జుట్టుముట్టు నెవ్వేళలందు

సువ – అక్కా! ఈ నేలబడిన మల్లెపువ్వున కెట్టిగతి పట్టినది. పాపము దీనియం దిదివరకున్న సౌందర్యముగాని సౌరభముగాని కోమలత్వముగాని రవ్వంతయు గాన్పించక నెట్లెండి పోవుచున్నదో జూచితివా!

గీ॥ ప్రాణమున్నంతవరకు సెబాసనంగ
నలరి చచ్చుటతోడనే కళ దొరంగి
బిగిసి చూడ ననిష్టమౌ పీను గట్లు
మగువ ! గన్పట్టుచుండె నీమల్లెపువ్వు.

అర – ఇది యొక్కటియే యననేల ? ఈశ్వర సృష్టియంతయు నింతే గదా సోదరీ! ఆపొన్నగున్న నీడ నెవ్వరో బవ్వళించినట్లున్నారే! (సమీపించి) చప్పుడు చేయవద్దు. ఆహా! యీ మోహనాకారులగు బురుష సింహులెవ్వరై యుండవచ్చు? ఓహో! వీరు నిద్రలేచుచున్నారు గాన మనము వీరికి గాన్పించక నా లేమావి చాటునకుం బోవుదము రండు.

(అని చెట్టుచాటునకు బోవుచున్నారు.)

(ప్రమధులు నిద్రలేచి)

చంద్ర – గంగాధరా! యేమిది?

గీ॥ సారఘనసార తాంబూల సౌరభంబు
వరమృగీమదసంభూత పరిమళంబు
సాటిరానట్టి తావితో బోటియున్న
జాడ నెరిగించు గాలి వీచందొడంగె

గంగ – (పరికించి) మందయాన లిందెవ్వరును గాన్పించుట లేదే !

అర–ఉ॥ ఈయెలజవ్వనంపుపస, యీ సుకుమార శరీర కాంతి, యీ
కాయజు బోలు సోయగము గల్గిన వీరెవరక్కలార! నే
డీయటవీస్థలంబునకు నేటికివచ్చిరొకో, జగంబునం
దేయెడ జూడలేదు మన మిట్టి మనోహరరూపవంతులన్

సీ॥ మన్మథుడో వీడు మన్మథుండైనచో
సకియరో! పుష్పకార్ముక మదెద్ది ?
నలకూబరుడొ వీడు నలకూబరుండైన
దొరగని రంభావధూటియెద్ది ?
శీతాంశుడో వీడు శీతాంశుడైనచో
జివురుబోడిరొ! మృగ చిహ్నమెద్ది?
అలజయంతుడొ వీడహో జయంతుడెయైన
నయ్యనిమేషత్వ మరయనెద్ది?

గీ॥ రమణి! సుమకార్ముకము దీసి రంభబాసి
కందు నెడజేసి యనిమేషతం దొలంగి
వీరు నల్వురు బుడమికిన్ జేరినార
లం దొకడు గాకయున్న నీయంద మున్నె?

వీని విలాసము నెంత యని వర్ణింపుదు. ఇయ్యువకునిం గన్నదాది నాచిత్తంబునం దేమేమియో కోరిక లీరిక లెత్తుచున్నవి.

లలి – వీరిశరీరచ్ఛాయ నేమని వర్ణింతును? నిజముగా నాపరమేష్ఠి వీరల సృజియింపుతరి జంబూనదీపంకంబునం దంబుజాప్తుని సానబట్టిన చూర్ణము గలిపి పిదప సుధారసంబున జక్కగా బాక మొనర్చి యద్దానిచే నీయువకుల గాత్రంబు నిర్మించి యుండవచ్చు. లేకున్న నీతళ్కు బెళ్కులుండుట దుర్లభము గదా!

సీ॥ చుక్కలతేనితో జోడు సేయగవచ్చు
ముద్దైన వీరలమోము లహహ
సారసంబులతోడ జతసేయగావచ్చు
విలసిల్లు వీరల విప్పు గనులు
చిత్తజ సౌవర్ణ సింహాసనములతో
సరిసేయదగు వీరి యురములరయ
మృగరాజములతోడ నెనసేయదగువీరి
ఘన సూక్ష్మమధ్యభాగంబులౌర

గీ॥ అల్ల శేషాహిసాటి సేయంగవచ్చు
జానువులనంటు వీరి దోశ్శాఖలికను
మీసములయంద మేమందు మించుబోడి
త్రిభువనంబుల నీరూప మభినవంబు

అర-గీ॥ నాకు వీరలపై దమి నాటుకొనియె
నీవలెనె నేను నుంటినో నీరజాక్షి

సువ॥ మనల వీరలు ప్రేమించి మనుపకున్న
నికను మరుబారికోర్చి జీవింపగలమె

అర-సీ॥ భ్రమదీర నాలింగనము జేయవలదె యీ
హొయలుకాని కరంబులున్నఫలము
కులుకుచు నితని చెక్కులను ముద్దుగొనంగ
వలదె తియ్యని మోవిగలఫలంబు
మనమార నితనితో మాట్లాడవలదె యీ
జలిబిలిపల్కులు గల ఫలంబు
అతివేడ్క నితనితో రతిగూడవలదె యీ
చెలువైన ప్రాయంబు గల ఫలంబు

గీ॥ కూర్మితో వీని యురమున గ్రుమ్మవలదె
బలితవుం గబ్బిగుబ్బలుగలఫలంబు
కాల మీతనితో గూడి గడుపవలదె
వనిత! మహిలోన జన్మమెత్తిన ఫలంబు

లలి - అక్కటా! యీ కోడెగాండ్ల గన్నదాది మనపై మదనుండు పదనుశరమ్ముల హృదయంబు లదరునట్లు వదలుచుండె. నిప్పుడు వీరలజేరి మనల జెట్టబట్టుడని కోరిన నేమందురో గదా! కోరక నూరకొనుటెట్లు?

ఉ॥ వారల బల్కరించి మనవాంఛల నేగతి విన్నవింతు మే
దారియు దోచదాయె వనితామణులార! తెగించి పొందగం
గోరిన నేమిపల్కెదురొ, కోమలి తానె వరించి వచ్చినన్
ధారుణి జుల్కసేతురుగదా మగవారలు బెట్టుబెట్టుచున్

అక్కా! యీ స్ఫురద్రూపులు మనకుం బతులైన మన నోములన్నియు సఫలమైనట్లే గదా! అప్పుడు మన సౌఖ్యము, మన సంతోషము, మన భాగ్యము, మన జీవితము నిరుపమానములై ప్రకాశింపును గదా!

అర-శా॥ ఏమో యంతటినోము నోచితిమొ లేనేలేదొ యీకోరికల్
భామా! తీరునొ తీరకున్నొ మనదౌ భాగ్యం బదెట్టున్నదో
కాముం గూలికి బిల్వమే మనల జోకన్ వీరు చేపట్టిన
శ్రీమద్దుర్గ త్రిలోకమాత మహదాశీర్వాద మెట్లున్నదో!

సువ–సీ॥ భువనంబుల సృజింప బోషింప సమయింప
గర్తలైనట్టి త్రిమూర్తులార
విమల చారిత్రులై వినువీధి సత్ప్రభా
సాంద్రులై తగు సూర్యచంద్రులార
ధర్మంబు సుంతైన దప్పక ప్రజనేలు
బలహరాద్యష్టదిక్పాలులార
నిరశనవ్రతమున నిరత మీశ్వర తపో
నియతి మండెడి మౌని నేతలార

గీ॥ చిన్నతనమాది మాచేత సేవగొన్న
పరమకల్యాణి! శర్వాణి! కరుణజూచి
పతుల గావింపు డీ కళాన్వితుల నతుల
భక్తి వందన శతసమర్పణ మొనర్తు.

అర – అక్కటా! వీరికి మన మనోరథంబుల నెఱిగించువా రొకరైన లేరుగదా.

సీ॥ ఈ శుభాంగుల చెంత కేతెంచి మాస్థితి
జెప్పరే మీరైన జిలుకలార
పురుషసింహులతోడ బొందు గోరితిమంచు
వినుచరే మీరైన బికములార
మదనతుల్యులగాంచి మరులుకొంటిమటంచు
దెలుపరే మీరైన దేటులార
భానుతేజుల బ్రాణవతులగావింప మీ
రైన బోవరె శారికాళులార

గీ॥ జాలి నీవైన బాల రసాలసాల
రాజమా! మాయవస్థ వారలకు గరుణ
నెఱుకసేయగ రాదె సత్కృపను బూని
బ్రతుకలేమింక వలరాజుబారి కకట!

చంద్ర – గంగాధరా! ఇందెవ్వరో మాటలాడుచున్నట్లున్నారు. వారెవ్వరై యుందురు (పరికించి) ఈ లేమావిగున్న చేరువనెవ్వరో పువ్వుబోడి గాన్పించుచున్నది. ఈపె యిందేలనుండె? ఆహా ఏమి దీని లావణ్యము!

ఉ॥ ఎవ్వరొ యీలతాంగి యిట కేటికి దాకజనుదెంచె వేలుపుం
జవ్వనియో భుజంగమృగశాబక నేత్రయొ వాగ్వధూటి యో
పువ్విలుకాని కూర్మి వనబోడియొ లేక సురేంద్రుకాంతయో
యెవ్విధి సృష్టిజేసె నజు డీగజయానను జోద్యమయ్యెడిన్

అర – సోదరీమణులారా! వీరలకు మనమాటలు వినవచ్చె గాబోలు గావుననే నలుగెలంకు లకు దృష్టిప్రసార మొనరించి యీమాట్లాడువారెవ్వరా యని విచారింపుచున్నారు. కానిమ్ము. వీరేమేమి మాట్లాడుకొందురో నేనిందు నిలచి వినుచుండెద. మీ రీ చెట్టుచాటుననే గూర్చుండుడు.

గంగా – (అటుజూచి) అన్నలారా! యీ యింతి యొక్కటియే గాక నీ చెట్టుచాటున నింకను సుందరీమణులున్నారు. చూచితిరా!

చంద్ర – ఔనౌను నిజమేగాని వీరిలో మనము ముందుగా బొడగన్న వన్నెలాడి యెద్దియో గుర్తింపక వీలుగాకున్నది గదా! అయారే! కమలాసనుండు వీరినందర నొక్కటేయచ్చున నొత్తినట్లున్నాడు. ఏమి యీలావణ్యము!

సీ॥ కలకంఠివదనంబు గమలారిబోల్తుమా
కమలారిలోపల గందుకలదు
పైదలికందోయి బద్మంబుబోల్తుమా
పద్మంబు మురికిలోపలజనించె
మెలతమేనిమెఱుంగు మించుతో బోల్తుమా
మించుసుస్థిరముగా మెఱయదాయె
గొమ్మచన్నుల బువ్వుగుత్తులబోల్తుమా
పువ్వుగుత్తుల నంటబోవునదగి

ఆ॥ నింక నేమిపోల్తు మీ లేమమోముతో
గనులతోడ నొడలికాంతితోడ
చన్నుదోయితోడ జతురాస్యసృష్టిలో
గాంచనొకటియైన గంటబడదు

మృత్యుం–ఉ॥ చక్కదనంపుటిక్కలగు చక్కెర బొమ్మల గాంచినంతనే
చక్కెరవింటి బంటు సుమసాయకముల్ విడువందొడంగె నే
దక్కట నేమి సేయుదు లతాంగులగౌగిట బట్టువ్రాత నా
పొక్కిలిబిడ్డ నానొసట బూర్తిగ వ్రాసెనొ లేదొ దైవమా!

చంద్ర-గీ జగతి వీరల గూడని జన్మమేల

గంగా - కలదె మనకట్టి భాగ్యంబు తలచిచూడ

మృత్యుం - చెట్టబట్టుదుమో లేక తుట్టతుదకు
మట్టిగలుపుదుమో మనమమత లెల్ల?

చంద్ర - సోదరులారా! మనమువ్విళ్ళూరుచు నిట్లుండిన లాభములేదు గాన వారలందాసి యా యింతుల వృత్తాంతము నెఱుంగుట మంచిది. కాన సమీపింపుదము రండు (అని అందరు సమీపింతురు.)

మృత్యుం - కాంతలారా! మీరెవ్వరు? ఈ వనభూమికి రానేల? వచ్చియు నిట్లు చెట్లచాటున డాగనేల? మీవృత్తాంతమెద్దియో చెప్పగోరుచున్నాము.

చంద్ర - సిగ్గుపడక మీచరిత్ర మాద్యంత మెఱిగింపుడు.

అర - ప్రియులారా! మేము దేవతాకన్యలము. ఈ వసంత సమయమున గానన సౌందర్య సమాలోకనాపేక్ష నిమ్మహేంద్ర నగమునకు వచ్చితిమి. తామెవ్వరో యిందుండ గారణంబేమో దయతో సెలవిచ్చెదరా?

చంద్ర - మేము మహేశ్వర పాదారవింద సేవాధురీణులమగు ప్రమధులము. పార్వతీదేవి చేయు శూర్పపుటీ వ్రతంబునకు గావలసిన శూర్పంబులనల్లి పంపుటకా చంద్రశేఖరానుజ్ఞచే మానవాకారంబుల నిటవచ్చితిమి. మేమున్న చోటికి మీరేలవచ్చితిరి?

అర - రాదగదా ?

చంద్ర - పరపురుషులున్న చోటికి తరుణులు రావచ్చునా ?

అర - ఏమి మీమాటలు? వరుడు లేని చానలకు పరులను భయమేల? ఇంకను రహస్య మేల ?

శా॥ మీలావణ్యము మీకళాభవమున్ మీకోమలత్వంబు మీ
లాలిత్యంబును మీరసోక్తు లవలీల ముంచె మోహాబ్ధినిన్
జాలంబేటికి తుంటవింటి దొర రోషస్ఫూర్తి బూముల్కులన్
దూలంజేసె భయంబు మాన్పుడిక మీదుర్గస్తనాంతస్థితిన్

చంద్ర - కన్యామణులారా!

ఉ॥ మాదుతలంపు మీతలపు మానసమందు దలంపగా నొకం
దై దనరారెగాన నిక నందరు నెవ్వరి కెవ్వరిష్టమో
మోదముమీర గోరుకొని మోహముదీర లతాంతబాణసౌ
ఖ్యోదధి నోలలాడుదు పయోరుహలోచనలార ! గ్రక్కునన్

అర–సీ॥ ఈ మంగళాకారు నేగోరుకొంటిని
మీరాసపడకుడో మెలతలార
లలి – ఈలోకమోహను నే ముందుజూచితి
రాబోకు డిచటికో రమణులార
సువ – యీకళానిధిని నేనే బెండ్లియాడెద
నితని మీరంటకు డింతులార
చంద్ర – మా పూర్వభవపుణ్యమహిమచేత లభించి
రేమి మా భాగ్యమోయింతులార
మృత్యుం–గీ॥ బళిరె మిమ్ముల మమ్ముల గలపినట్టి
వేలుపుంబెద్ద కరుణకు న్విలువగలదె
గంగా – కుసుమశరు డింక మన సేవకుందుగాదె?
చంద్ర – రండు చెలులార మా కుటీరంబులకును.

(అని నిష్క్రమింతురు)

# ద్వితీయరంగము - మహేంద్ర పర్వతము

(ఈశ్వరుడును, పార్వతియు ప్రవేశించి)

ఈశ్వ - పార్వతీ! ఇదియే మహేంద్ర నగరము. నే నిచ్చటనే వెదురుల సృజించితి. నీ పర్వతమునందలి విశేషము గంటివా! అటు జూడుము.

సీ॥ మదగజంబులతోడ గొదమసింగంబులు
వేడుక జెల్లాట లాడుచుండె
లేడిగుంపులతోడ గూడి యీ సురపొన్న
నీడశార్దూలముల్ నిలచియుండె
రాగంబు జెలరేగ ఛాగంబులను గూడి
కుందేళు లిచ్చోట గునుకుచుండె
ఖగరాజ కోటి పన్నగరాజములతోటి
చెలిమిచే నిచ్చోట జెలగుచుండె

గీ॥ బావురంబులు దేగ లీపాదపమున
నొక్కచోటనె గూర్చుండియున్న వవిగొ
కంటివే వానినెల్ల నో కంబుకంఠి
వింటివే యిదివర కిటువంటివార్త.

పార్వ - నాధా ఇందులకుం గారణమేమి ?

ఈశ్వ - అగణ్యపుణ్యమూర్తులగు మునిచక్రవర్తులిందుగాపురం బొనర్చుటయే.

పార్వ - మహాశయా ! శూర్ప నిర్మాణమునకై తాము ప్రమధవర్యుల నంపిన నదిచ్చటికే గదా?

ఈశ్వ - అవునిచ్చటికే.

పార్వ - వారెందుండిరి?

ఈశ్వ - ఈ విశాలంబునం దేమూల నున్నారో !

పార్వ - అట్లయిన వారల వెదకిచూచుదము రండు.

ఈశ్వ - మంచిది పోవుదము పద. (అని నిష్క్రమింతురు)

## తృతీయరంగము - మహేంద్ర పర్వతము

(ప్రమథులు ప్రవేశింతురు)

చంద్ర – సోదరులారా! సదా శివాజ్ఞచే మనమిచ్చటికి వచ్చి పెద్దకాలమైనది. చేయవలసిన కార్యంబులన్నియు జేసితిమి. దయా సముద్రుడగు రుద్రుని కృపవలన నన్య సామాన్య సౌందర్య ధన్యలగు దేవతాకన్యల బెండ్లియాడి గుణవంతులగు పుత్రులంగాంచి సంతసించితిమి. మనకిక నేలోపమును లేదుగాన నెప్పటివలె కైలాసమునకరిగి భగవానుడగు శంకరుని పాదారవింద సేవ జేయవలయునని మనస్సు తిరిగినది. ఇందులకు మీ యుద్దేశమేమి?

గంగా - మీ యుద్దేశమెంతయు బాగున్నది.

మృత్యుం - నాకు నట్లేయున్నది.

చంద్ర - (ఆశ్చర్యముతో) ఈదివ్యతేజమెక్కడిది? (పరీక్షించి) ఏమి మన భాగ్యము? గౌరీ శంకరులు వచ్చుచున్నారు. ఎదురేగి నమస్కరించుదము రండు.

(గౌరీశంకరులు ప్రవేశింతురు)

చంద్ర–ఉ॥ శంకర! మౌనిమానసవశంకర! పంకరుహాప్త సౌమధూ
మాంకవిలోచనా! స్మరమారా! భవమోచన! క్రూరదైత్యనా
గాంకుశ! సర్వలోకవరదా! మురదానవభంజనాప్త! నీ
కింకరులైన మమ్ములను కిల్బిషదూరుల జేసిప్రోవుమా.

మృత్యుం–ఉ॥ శ్రీనగజాప్రియాయ సురశేఖరవంద్యపదాంబుజాయ వై
శ్వానరలోచనాయ మునిసంచయమానసమందిరాయ వి
ద్యానిలయాయ భక్తవరదాయ పురత్రయభంజనాయ గీ
ర్వాణ సరిద్విరాజితశిరాయ హరాయ నమోనమోనమః

గం–శా॥ కారుణ్యకర! లోకమాన్య! ఫణిరాట్ గ్రైవేయ! మృత్యుంజయా
సారాచారవిశారదా! పశుపతీ! సర్వజ్ఞ చర్మాంబరా
నీరేజప్రభవాండమందిర! శివా! నిర్వాణసంధాయకా!
వీరాగ్రేసర! చంద్రశేఖర! దయ వీక్షింపుమా మ్రొక్కెదన్

చంద్ర–గీ – సకలభువనమాత! శర్వాణి! జోహారు

గంగా – భక్తకల్పవల్లి ప్రణుతిశతము

మృత్యుం – నగకుమారి ? వందనసహస్రములు నీకు
గరుణజూడమమ్మ కన్నతల్లి.

ఈశ్వ - ప్రమథాగ్రేసరులారా! మీభక్తికి సంతసించితి. మీకు గుశలమేగదా?

చంద్ర - అయ్యా! సర్వజ్ఞులగు తమకు దెలియని దేమున్నది. మీ యానతి దలదాల్చినవారమై ꠰న్నగంబునకు వచ్చినదాది లోకమాతయగు సర్వమంగళాదేవికిని లక్ష్మీసరస్వత్యాది యితర ꠰ నారీమణులకును శూర్పపుటీవ్రతార్థమై చేటలనల్లి యిచ్చుచుంటిమి. ఇట్లుండ వేల్పుగన్నె ꠰కువచ్చి మమ్ము మోహించిన మేమును ననురాగులమై వారలం గలసి సుఖించి త్రరత్నంబులం గాంచితిమి.

ఈశ్వ - ఆ పుత్రు లెచ్చటగలరు ?

చంద్ర - వా రీవనంబునందే కలరు. పూజాద్రవ్యములకు బోయియున్నారు.

ఈశ్వ - ప్రస్తుతము మీ యుద్దేశమేమి ?

చంద్ర - తమసేవకై మరలగైలాసమునకు రావలెనని సంకల్పము.

ఈశ్వ - మంచిది. ఈవచ్చు బాలకులెవరు ?

(ప్రమథకుమారుల ప్రవేశము)

చంద్ర - వీరలే మా పుత్రులు. నాయనలారా! పార్వతీ పరమేశ్వరులకు నమస్కరింపుడు.

(ప్రమథకుమారులు నమస్కరింతురు)

ఈశ్వ - చిరంజీవ సుఖీభవ.

చంద్ర - నాయనలారా ! మిమ్ములం గాంచి పెంచి పెద్దవారల జేసితిమి కాన నికమీదట మా నివాసములకుంబోయెదము.

వకుమా - నాయనా! మేమును మీతోవచ్చెదము. మిమ్మెడ బాసి యుండగలమా ?

చంద్ర - బిడ్డలారా! అట్లుగాదు యే వ్రతంబు గావించుటచే హైమవతీదేవి తన భర్తయొక్క యర్ధాంగమును స్వీకరించి ధన్యురాలాయెనో యేనోమొనరించిన మించుబోడుల కెల్ల కోరికలు సిద్ధించునో అట్టి శూర్పపుటీవ్రతం బొనరించు చంచలాక్షులకుం గావలసిన చేటలనల్లి యిచ్చుచు మీరీ భూలోకంబునందుండుడు పురుషునకు ముఖ్యధర్మము పరోపకారము గదా! సర్వేశ్వరకృపచే మీకేలోటును రానేరదు

ఈశ్వ - బాలకులారా ! మీతండ్రి యాజ్ఞా ప్రకార ముండుడు. మీకు వచ్చిన భయ మేమియు లేదు.

సీ॥ శ్రీదేవిమీయింట జెలగుచుండునుగాత
యాయురారోగ్యంబు లమరుగాత
పాడిపంటలుమీకు బ్రాప్తంబులగుగాత
దేహబలంబు వర్ధిల్లుగాత
ధర్మకార్యాసక్తి తఱచుగల్గునుగాత
నిరతమీశ్వరభక్తి నిలచుగాత
సత్యవాక్పాలనా శక్తి చేకురుగాత
వంశాభివృద్ధియు వరలుగాత

గీ॥ మహిని మీ కెల్లరకు బదిమందిలోన
మంచి, మర్యాదలును లభియించుగాత
గురుజనంబులపై భక్తికుదురుగాత
మారసములార! ప్రమధకుమారులార

మరియు మీరు మహేంద్రనగవాసులు గాన మాహేంద్రులనియు, మేంధ్రలనియు దెలుగు బాసలో మేదరలనియు వంశనామములు గల్గియుందురు గాక !

ఈశ్వ - ప్రమధులారా ! మనమిక బోవుదము రండు.

చంద్ర - పుత్రరత్నములారా! మేమిక బోయివచ్చెదము. సుఖముగా నుండుడు.

భరతవాక్యము

ఉ॥ పాలక పాలితాళి తమ పాడిని దప్పకనుంద్రుగాత బల్
పాడియు పంటయు గలిగి భాసిలుగాత జగంబు వర్షముల్
గాలము దప్పకే గుఱియుగాక నిరంతర దైవభక్తిచే
గ్రాలుచు మర్త్యులుండెదరు గాత శుభంబగుగాత నిత్యమున్

(తెరపడును)

గద్య

ఇది శ్రీమత్కమ్మవంశ పయః పారావార రాకాసుధాకర
తుమ్మల వేంకటపతి చౌదరీ పౌత్ర నారయ్యా చౌదరీ
ద్వితీయపుత్ర బుధజనవిధేయ సీతారామ
మూర్తి చౌదరీ నామధేయ ప్రణీత
మాహేంద్రజననాటకము
సంపూర్ణము



'తెనుఁగులెంక'

శ్రీ తుమ్మల సీతారామమూర్తి



శ్రీ

# రామకృష్ణస్మృతి

గ్రంథకర్త :


బాలకవి తుమ్మల సీతారామమూర్తి చౌదరి,

కావూరు, రేపల్లె తాలూకా - గుంటూరు జిల్లా.



ప్రథమ ముద్రణము 500 ప్రతులు.

బెజవాడ వాణీ ముద్రాక్షరశాలయందు

డి.కే. పంత్‌చే ముద్రింపఁబడినది

రుధిరోద్గారినామ సం॥ మార్గశిర శు ౧ స్థిర వారము.

శాలివాహనశకమ్ 1845




వెల : 0-2-0

# తొలిపలుకు

చదువరులారా !

నాప్రాణమిత్రుడగు బ్రహ్మశ్రీ రావూరు రామకృష్ణశర్మగా రస్తమించుటచే మిత్రమరణ సంజనితదు:ఖాతిరేకమున నీచిన్న పొత్తమును నూఱు పద్యములతో వ్రాసినాఁడ. వారి జీవిత చరిత్రమంతయు నీపద్యములం దిమిడియున్నందువలన మరల నిందు వ్రాయుటమానితి. దుఃఖదశలో రచియించిన యీ కైతయందు దోషము లుండుట యందాశ్చర్యము లేదు గానఁ దజ్ఞులు మన్నింపఁ బ్రార్థితులు. కీర్తిశేషులగు శ్రీరామకృష్ణయ్య గారికి మనశ్శాంతియు, నీగ్రంథముద్రణాద్రవ్యసహాయముఁ జేసిన మిత్రుల కాయురారోగ్యభాగ్యాభివృద్ధియు నొసఁగుటకా సర్వేశ్వరుఁడగు నారాయణునకు గృతజ్ఞతాపూర్వకవందనసహస్రము లాచరింపుచున్నాఁడ.

ఇట్లు విధేయుఁడు,

బాలకవి

**తుమ్మల సీతారామమూర్తి చౌదరి,**

గ్రంథకర్త.

## శ్రీరస్తు

# రామకృష్ణ స్మృతి

శా॥ శ్రీరాముండు జగత్త్రయావనుఁడు రాజీవాక్షుఁడుర్వీసుతా
శ్రీరమ్యస్తనభాగలిప్త వరకాశ్మీరార్ద్రవక్షుండు మ
త్తారిస్తోమభుజంగగారుడము స్వీయాఖ్యాద్వయిఁ మించునిన్
జేరం జేయునుగాతముక్తిపురికిన్ శ్రీరామకృష్ణాహ్వయా ॥ 1

చ॥ కటకట పల్లపట్లయను గ్రామమునఁ బనిమీఁద నుండఁగఁ
బటుతరమైన యయ్యశనిపాతము భంగి మదీయ కర్ణసం
పుటములయందుదాఁకె హితపుంగవ! నీ మరణంపువార్త యెం
తటి కుటిలాత్ముఁడయ్యెను విధాత నిజాన్వయరాగహీనుఁడై ॥ 2

చ॥ ఇరువది తొమ్మిదేండ్ల వయ సింకను నిండకమున్నె దేవతా
పురవరనందనోపవన భూరుహమంజులతాయుతాలయాం
తరచిరగంధ దివ్యసుమతల్పనివాసవిలాసలాలసా
పరమతి నేగినాఁడ విది పాడియె నీకు ననుంగు మిత్రమా ॥ 3

క॥ చెవులందాఁకెడు కన్నుం, గవయును మోకాళ్ళ నంట గలచేతులు నీ
నవమన్మథాకృతియు మి, త్రవరేణ్యా! మాకు మఱవ దఱమే? చెపుమా? ॥ 4

ఉ॥ అన్నము నీరు లేక గహనాంతరమందున నెండవానలం
దెన్నఁగరాని కష్టముల నెల్లభరించి తపంబొనర్చినఁ
సన్నుతశీల! మద్హృదయ సారసఖేలన ! రామకృష్ణ నా
కన్నుల జూచు భాగ్యమికఁ గల్గునొకో నినుఁబోలు మిత్రునిఁ ॥ 5

ఉ॥ ఊరికిబోవువేళఁ దమ యొద్దకు వచ్చి శరీరసౌఖ్యమే
తీరుననుండె నంచడిగితిఁ భయమేమియు రాదటంచులో
నారసియంతటన్ జనితి నక్కట నాటి నిశీథ మందె ని
ష్కారుణికుండు లాగెఁ గద కాలుఁడు నీదగు ప్రాణవాయువుఁ ॥ 6

చ॥ కటకట యింక నీవు పది కాలము లుండెద వంచు నాత్మలో
దిటముగనమ్మిపోయి చెడితిం గద మిత్రమ ! కీడులోన మే
లటు లిహయాత్రమానుసమయంబున నీతుదినోటిమాటనొ
క్కటియు వినంగలేక చెలికానికి నేమని చెప్పువాఁడవో ॥ 7

గీ॥ అనుఁగుఁ జెలికాంద్ర మగు మన కప్పుదప్పు, దెట్టి పగవచ్చినను వెంటనే నశించె
ప్రాయమందలరారు దంపతుల ప్రణయ, కలహమట్టుల మఱవంగ గలనె నిన్ను॥ 8

ఉ॥ నెయ్యఁపు సంగడీడ నిను నే నెడబాసిన నాఁటి రేయికిఁ
జయ్యన ముత్తిపల్లి చని సాపడి మద్గురు బంధు గేహమం
దొయ్యన సుప్తతంబడసి యూరిజనంబులు దద్దరిల్లు న
“ట్లయ్యొ” యటంచుఁ గేకనిడి యంతట మేల్కొని సంశయంబునఁ ॥ 9

ఉ॥ ఈ కల యేలవచ్చె నిటు లేడ్చుచు గెవ్వున గేక వేయఁగా
నేకతమంచు శేషనిశి యెల్ల విచారముఁ జేసి చేసి య
వ్వేకువలేచి కేశవుని వేఁడుచు నప్పలపట్లఁ జేర నీ
భీకరవార్తవచ్చె విని పెన్వగ నేలనుగూలి సోలితిఁ ॥ 10

ఉ॥ అచ్చెరువందితిఁ మరణమా ? చెలికానికటంచు నాపయిఁ
జచ్చెనె ? రామకృష్ణుఁడిది స్వప్నముగావలె నంచు నెంచి యా
వచ్చినవానిచేత నిజవార్తయటంచు నెఱింగినంతనే
నెచ్చెలి ! యేమిసెప్పుదును నిల్వునీరయిపోయితిఁ గదా ॥ 11

చ॥ దినకరతేజ నేబయలుదేఱిన దాదిగఁ బల్లపట్లకుఁ
గనుపడుచుండె చెడ్డ శకునంబు లనేకము వానిగాంచి నె
మ్మనమున గాఢమైన యనుమానమునఁ సిలుగెద్ది మూఁడునో
యనుకొనుచుండ నక్కటకటా ! విననయ్యె భవద్వియోగముఁ 12

గీ॥ అకట కావూరులోన దేహంబు విడచి, పరమునకుఁ బోవుచు న్ముత్తిపల్లి నన్ను
నిద్దురనులేఁపి చనుచుంటి నేస్తకాఁడ! దిగులుఁబడఁబోకు మని చెప్పితివె? మహాత్మ! 13

ఉ॥ బోనముఁ బానము న్మరచి పోయిన కార్యముమాని తద్దినం
బేనెటు లెట్టులో గడపి యేడ్చుచు నమ్మఱునాఁటి కింటికిఁ
రానకటా ! శ్మశానమున రాశియొనర్చియు నీదుబూది దీ
నాననుఁడైన నీజనకుఁ డావలఁబోయుచు నుండె నక్కటా ॥ 14

ఉ॥ బోరన నీశరీరమును బూడిదఁ జేసిన రుద్రభూమిపై
జోరున నశ్రుతోయములు జొబ్బిలి కాల్వలుగట్ట రామకృ
ష్ణా ! రమణీయరూప ! హితసత్తమ యంచును వెక్కి వెక్కి నే
ఘోరున నేడ్చి యేడ్చి వగపుఁ దిగమ్రింగితి నెట్టకేలకుఁ ॥ 15

ఉ॥ మేరుసమానధైర్య ! కదు మెత్తనిసెజ్జల నత్తమిల్లు నీ
తీరగుమేను పాడెపయి దిట్టముగా బిగియించి కాటికిఁ
జేరిచి దావపావకునిచే మసిఁజేసెద రంచు నక్కటా !
కూరిమి చెల్మికాడ ! కలఁ గూడఁ దలంచి యెఱుంగనైతిఁగా ॥ 16

సీ॥ జిలిబిలి ముద్దు పల్కులఁ జిన్నతనమాది, నిశ్చలంబగు చెల్మి నిలచినాము
యొకతల్లి గర్భమం దుదయంబునందిన, వారిచందాన నొప్పారినాము
యెటకుఁబోవలెనన్న నిరువురమునుకూడి, పొంగుచుఁ బయనమై పోయినాము
యీవునేననుభేద మెంతమాత్రము లేక, నొక సెజ్జమీఁద బన్నుండినాము

గీ॥ అకట కృష్ణార్జునులరీతి నమితమైన, స్నేహభావంబుతో విరాజిల్లినాము
యింతలో నిట్టులగునటం చెఱుఁగనైతి, గటకటా! యెంత మోసంబు గల్గె సఖుఁడ॥ 17

ఉ॥ నెచ్చెలి ! నీవు స్వర్గపురినిఁ బొదగాంచిన దాది యన్న మం
దిచ్చు నశించె, నీటిపయి నేహ్యము గల్గె నొకింత నిద్రయుఁ
వచ్చుటమానె సంతసము వమ్మయిపోయె బలం బడంగె నే
పిచ్చియొ పెచ్చుమీరెగద పిల్చిన బల్కగఁ లేనివాఁడనై ॥ 18

గీ॥ చిత్తమందున్న చింత నశించదాయె, మరువవలెనన్న నదియేమొ మఱుపురాదు
కన్నులంగట్టినట్లెప్డు గానుపింతు, వక్కటా! రామకృష్ణ! మిత్రావతంస! ॥ 19

ఉ॥ ఇమ్మహిలోపలఁ జనన మెత్తినవారల కెల్లఁ జావుని
క్కమ్మగుగాని నిన్నిటు లకాలపు మృత్యువు పొట్టబెట్టియా
యమ్మనుఁబాసి బందుగుల నాప్తుల గొందలమందజేసి ద్రో
హమ్మొనరించు దైవమని యక్కట! యెన్నఁ డెఱుంగనైతిగా ॥ 20

చ॥ అరయగఁ జుప్పనాతి కమలాసనుఁ డీగతి నిన్నుబోలు స
త్పురుషుల నల్పకాలమునఁ బొట్టను బెట్టుకొనంగ వాని త
ద్దురితము చుట్టుముట్టుకొని తోయజలోచన శంకరాది ని
ర్జరులవిధంబునఁ జగతి సన్నుతి కెక్కకపోయె సుంతయుఁ 21

చ॥ హరిచరణాబ్జభక్తి బుధులందఱు మెచ్చిన నామదేవు స
చ్చరితము యక్షగానమను శైలిని నే రచియించునప్డు దా
హరికథలోని కీర్తనల కన్నిటికిఁ దగు రాగతాళముల్
కర మనురక్తి నేర్పరచి కబ్బము రాజిలఁ జేసి తీవెగా ॥ 22

గీ॥ మెల్లమెల్లన నేగైత నల్లువేళ, వలయునట్టి యమూల్యకావ్యము లొసంగి
యాప్తునకుఁ జేసినావు భాషాభివృద్ధి, శేముషీధుర్య! రావూరు రామకృష్ణ ॥ 23

సీ॥ కాలామృతము జాతకదివాకరం బాది, జ్యోతిష గ్రంథముల్ జూచినావు
బసవరాజీయాది వైద్యశాస్త్రమ్ములఁ, జతురత మెరయంగఁ జదివినావు
రఘువంశ ముఖ్య గీర్వాణ కావ్యంబుల, నింపుతోడం బరియించినావు
మనుచరిత్రంబాది తెనుగు కబ్బంబుల, భంగులన్నింటి నెఱింగినావు

గీ॥ తజ్ఞులౌననఁదగు కవిత్వంబు వ్రాయు, శేముషీవైభవంబు నార్జించినావు
వ్యావహారికుఁ డనెడు పే రందినావు, అక్కట ! హఠాత్తుగా దివి కరిగినావు ॥ 24

గీ॥ ఎద్దివిన్నను మఱపున కెపుడురాదు, చదివినట్టిది మఱచుట జన్మలేదు
పలుకుపల్కుల నన్నత మెప్పటికి లేదు, యెట్లుమఱచెదనయ్య నిన్ హితవతంస॥ 25

గీ॥ రాజుకళఁదప్పె నారతీ రాజుజనుల, కంటఁ బడసిగ్గుఁబడె వేయి కనులజెట్టి
పట్టి తన తెప్పవాల్పక నట్టె చూచె, లోకమోహనమైన నీ యాకృతిగని ॥ 26

గీ॥ అక్కటా! తెల్వితోడ మాట్లాడుచుండి, నడుమ సరసోక్తులాడుచు నవ్వుచుండి
చక్కఁగా దిరుగుచు నకస్మాత్తుగాను, ప్రాణముల వీడినాఁడవే పరమమిత్ర ! ॥ 27

గీ॥ పెద్దకాలంబు పుడమి నేభీతిలేక, బ్రతికెదనటంచు నెన్నియో పనులఁజేసి
తుద కకాలంపు మృత్యువు వదనమందుఁ, జిక్కుకొని మోసపోతివే చెలిమికాఁడ॥ 28

చ॥ ధనకనకాశ్వవస్తు వనితా తనయాలయబంధు మిత్రులన్
ఘనతరమైన రాగమున గ్రాలెద రెప్పుడు నట్టిమీరలో
యనఘ! తదీయరాగమెద యౌనటులం బొనరించి దేహ మె
య్యనువునవీడిరో కటకటా! యిహయాత్ర నదెట్లుమానిరో ॥ 29

ఉ॥ నీ పగవారలందఱును నిన్నులుభంగుల బాధఁబెట్ట న
య్యాపదలెల్లఁజింత నిసుమంతయు లేక నెదిర్చి యోర్చి కృ
ష్ణా! పురుషోత్తమా! భయహరాయని శ్రీరమణుం భజించి దుః
ఖాపగ ధైర్యనౌకఁ దుద నంటఁ దరించితివయ్య మిత్రమా ॥ 30

చ॥ తెలివియు ధైర్యమున్ గలుగు దిట్టవుగాన నఖండరీతిని
న్నలమినయట్టి కష్టముల నన్నిటినట్లె భరించినాఁడ వ
య్యలజడులెల్లఁ బోయిసుఖమందు దినంబులు వచ్చినంతనే
తులువలరాయఁడౌ నలువ త్రుంచెను నిన్దయమాలి మిత్రమా ॥ 31

ఉ॥ అన్నయగారిఁ జూడవలె నంచుఁ దలంచియు బల్జెపల్లికిఁ
గ్రన్నన నేగుదెంచి పది నాళ్ళచటఁ నివసించి మిత్రమా
నిన్నెదఁ బాసి యన్నమును నీరును మానితి నంచు గమ్మనా
సన్నిధి కంపినాఁడ వది చాలదొకో మన చెల్మిఁజాటగఁ ॥ 32

ఉ॥ మేలగుపొత్తముల్ బుధులు మెచ్చెదువానిని సేకరించి గ్రం
థాలయ మొందునిల్పవలె నందుకు నూటపదారురూప్యముల్
జాలగ గ్రంథరాజముల సాయమొనర్చెదనంచుఁ జెప్పి ర
క్కాలము రాకమున్నె తమ కాలముఁదీతె గదయ్య మిత్రుడా ॥ 33

ఉ॥ నీదగు మిత్రబాంధవులు నీకపు డప్పుడు లేఖలంప న
త్యాదర మొప్ప వారికడ కంపెదుజాబులఁ బద్యరూపముల్
గాఁదగురీతి వ్రాయుము సఖా! యనుచు న్ననుగోరుచుందువో
గాదిలి నెచ్చెలీ ! యిఁకను కమ్మనికమ్మలు వ్రాయగోరవే ॥ 34

గీ॥ అకట ! రావూరు రామకృష్ణయ్యగార, లస్తమించి రటంచు నా హస్తమునను
నీదు బందుగులకు నెల్ల ఖేద మొదవ, గమ్మవ్రాసెదనని యెఱుంగను గదయ్య ॥ 35

సీ॥ శైలేందు వసుసోమ సంఖ్యల శాలివా, హన శకాబ్దంబు లొప్పారుచుండ
వరమన్మథాఖ్య సంవత్సర జ్యేష్ఠమాసంబున శుద్ధ పక్షంబు నందు
దశమీ సరోజినీధవువారమున రాత్రి, నవనీతలంబు నం దవతరించి
మంచివాఁడ వటంచుఁ మాన్యుండవంచునుఁ, బదుగురిలోఁ బేరుఁబడసిమించి ॥

గీ॥ అక్కటా! రుధిరోద్గారి నాశ్వయుజంపు, బహుళ షష్ఠిని మంగళ వారమందు
రాత్రి తొలిజామునం దిహయాత్రమాని, దివికి వేంచేసినాఁడవే దివ్యపురుష ॥ 36

గీ॥ కంటఁబడ నొక్కొకప్పుడు కష్టమెల్ల, నంతరించె నటంచు నే సంతసించి
కౌఁగిలింపఁగఁ బోయిన గానుపింప వేల నీలీల పంతమో యిష్టసఖుఁడ ॥ 37

గీ॥ విమల మానసిక ప్రపంచమున నిపుడు, నీవు గనుపించెదవు గాని నిముసమైన
నంచితంబగు బాహ్యప్రపంచమందు, గన్పడవు రామకృష్ణ! మాకర్మమేమొ ॥ 38

ఉ॥ మేలగు చైత్ర శుద్ధ సప్తమిఁ బ్రతివత్సరమందు దైత్య ని
ర్మూల మొనర్చి నిర్జరుల ముప్పు లడంచిన రామమూర్తికిఁ
శ్రీ లలనావతారయగు సీతకుఁ బెండిలి నిండు వేడ్క మి
త్రాలినిగూడి చేసెడి హితాగ్రణి! నిన్మఱవంగశక్యమే ॥ 39

చ॥ అనుపమమైన సద్గుణము లన్నియుఁ దాల్చిన యట్టిమీరలొ
య్యనఁ జిరకాలముండెద రటంచుఁ దలంచితిగాని యట్టులె
య్యనువున మీరలుండగల రార్యజనుల్ "సుకృతీగతాయు" వం
చనియెడు సూక్తి వ్యర్థమగునా? జగతీవలయంబులోపలన్ ॥ 40

చ॥ నిరతమఖండభక్తి హరు నీలగళున్ ద్రిపురాసురాంతకున్
వరదు నగాత్మజాహృదయ వారిజ బాల సరోజబంధు సు
స్థిరముగ సేవ జేయుదువశేషదయామతి నాతఁడైన నీ
మరణము మాన్పఁదయ్యెగద మౌనికుమారునిఁ బ్రోచినట్లుగన్ ॥ 41

ఉ॥ బాలకవీ! యటంచుఁ బలుభంగుల నన్గరుణారసాంబువుల్
గాలువగట్టగాఁ బిలచిఁ బిలచి కమ్మనికబ్బములన్ రచించి భా
షాలలనాసపర్య గడుఁ జక్కగఁ జేయుమటంచు గైతకున్
జాల సహాయమిచ్చెదవు సజ్జనభూషణ! మంజుభాషణా ॥ 42

చ॥ అరయఁగ బంధుమిత్రజనులందఱిలోపల నీదుమాటకున్
దిరు గొకనాడు లేదదియె ధీరవరేణ్య! శిలాక్షరంబు గా
జరుగు నిరంకుశత్వముగ సాగెగదా భవదీయజీవితం
బిరువది యెన్మిదేండ్లు దమ కెవ్వరిలన్ సరిలేరు లేరికన్ ॥ 43

చ॥ చదువును సంధ్యయుండె నెఱ చక్కదనంబులభించె నిమ్మహిన్
సదమలకీర్తి గల్గె గుణసంపదలబ్బెను పాడిపంటకున్
గొదువయెలేదు ధైర్యమున గొండలరాయడ వాయువొక్కటే
గొదయయిపోయె నీకు సుమకోమలదేహ! తలంచిచూడగన్ ॥ 44

చ॥ జలజలయంచు గన్నుగవ జాఱఁగ నశ్రుజలంబు కాల్వలై
తలనిలవంచి హాసుగుణధన్య! కుమారవరేణ్య! ధీర! ని
ర్మలచరితా! యటంచునిను మక్కువగాంచిన యాంధ్రమాత నె
చ్చెలి! విలపించుచుండె ముఖసీమను దైన్యము తాండవింపగన్ ॥ 45

మ॥ అకటా! రావురు రామకృష్ణ! గుణధామా! సర్వవిద్యానిధీ !
యిఁక నీమిత్రుల జీవయాత్ర యెటులం చీవాత్మలోనెంచి తా
వకభవ్యాగమనంబుగోరు దివిషద్వర్గంబు సంతోషవీ
చికలందూగుచు నుండ స్వర్గపురి నిశ్చింతన్ బ్రవేశించితో ॥ 46

ఉ॥ ఉర్వినిఁబెక్కునాళ్లు నరుఁడున్నను లాభ మదేమిగల్గు నీ
చర్వితచర్వణంబెగద సంసరణం బఖిలంబటంచు నో
గర్వవిహీన! నెమ్మదిని గాఢముగాఁ దలపోసిరోసి సౌ
పర్వపురీనివాసమున భ్రాంతిజనించినదేమి? చెప్పుమా? 47

ఉ॥ దేవుఁడు లేని కోవెలయు దీపము లేనిగృహంబు నవ్వరా
జీవవిహీనమౌ కొలను శీతమయూఖుఁడు లేని రాత్రియుఁ
జీవములేని కాయమును చిల్కలు లేనివనంబువోలె ని
న్నీ విధిఁ బాసి యీపుర మహీనముగా రుచిఁ బాసెనక్కటా ॥ 48

ఉ॥ మోడులుగూడగన్నులకు ముచ్చటగాఁ జివురింప రాళ్ళుఁ దో
ద్తోడనె నీరుగా ముదముతో మధురంబగు కంఠమెత్తి యా
తోడి, ముఖారి, ముఖ్యమగు తోరపురాగము లెల్ల నెప్పుడుఁ
బాడుచు మమ్ముఁదన్పెదవు ప్రాణసఖా! మఱపెట్లువచ్చునో ॥ 49

ఉ॥ తాపముతీఱునట్లు దెలిదమ్ములఁబోలు విశాలనేత్రముల్
శ్రీపతిలోచనంబుల హసించెడు తేజము మోముసొంపులన్
జూపఱులద్దిరా యనుచు జొక్కెడు నీదగు రూపుఁ జూడ ఛా
యాపటమైన లేదు గద ప్రాణసఖా! యెటులోర్తు నీవ్యథఁ ॥ 50

ఉ॥ నన్నయభట్టు పేరిటను నవ్యముగానొక గ్రంథమందిరం
బున్నెలకొల్పి యప్డు హితపుంగవులెల్లరగూడి వేడ్క నీ
తిన్నని రూపపుంబటము దీయఁగఁ జేసెదనంచునంటి వో
యన్నయ! నీతలంపువృథ యయ్యెహరాన్మరణంబునొందుటఁ ॥ 51

గీ॥ ఎంతమందియొ బందుగు లిష్టసఖులు, మేటివైద్యులు గల్గియు మీమరణము
నడ్డగింప నశక్తులై రక్కటకట, విధివిధానంబుఁ దప్పింప వీరివశమె ॥ 52

గీ॥ అతులకోమలమాలతీలతనుఁబట్టి, త్రుంచి దావాగ్ని శిఖలకర్పించినట్టు
లకట యెలజవ్వనంబునం దలరు నిన్ను, బట్టి మసిచేసె దైవంబు ప్రాణమిత్ర ॥ 53

ఉ॥ పేరిమి చెంగలింప నినుబెంచి సుబుద్ధులుఁ జెప్పినట్టి వి
స్తారదయాసముద్రు, నిరతస్తుతరుద్రుని వీరభద్రునిన్
గూరిమితండ్రినిం గొలువ గోరిక గల్గి మనంబులోన నో
భూరిగుణాఢ్య! వేలుపుల ప్రోలికి నేగితివేమి ? చెప్పుమా ? 54

శా॥ లేరే భూసురులెందరో జగతిపై లేరే మహాపండితుల్
లేరే దానకళాప్రవీణులరయన్ లేరే దయాసాగరుల్
లేరే సూనృతవాక్యపాలురు గదున్ లేరే మహాధార్మికుల్
వారెవ్వారయినం గడించిరొకొ శుభ్రఖ్యాతి నీరీతిగన్ ॥ 55

గీ॥ ప్రాణమిత్రమ సకలసంపదలుగల్గి, గర్వమొక్కింతయైనను గాంచవుగద
తృప్తిలేదాయె నెంత వర్ణింపుచున్న, నరయ నీవంటిచెలికాడు దొరకగలఁడె ॥ 56

గీ॥ అక్కటా! బాల్యమాది వేదాంతశాస్త్ర, పఠనమందున నెంతయో భ్రాంతినీకుఁ
జూడఁజూడంగ వానిచే సుఖము లేదు, దేహి కిహయాత్రయనితోఁచి దివికిఁజనితె॥ 57

గీ॥ ప్రళయకాలాంధకారంబు పగిదిదిశల, గారుచీకట్లు నేడేల గ్రమ్మెనయ్య !
ప్రకృతియంతయు భీకరవికృతిఁదాల్చె, నక్కటా! రామకృష్ణ! నీ వస్తమింప 58

చ॥ అరయఁగ నుర్వి జెన్ననగరాదిపురంబులఁజూడజూడ సుం
దరనగరావలోకనమునఁ దమకెంతయునాసఁగల్గి ని
ర్జరవరరక్షితంబగుచు రాజిలు నయ్యమరావతీపురీ
వరమునుఁజూడఁబోయితివె ప్రాణసఖా ! నిజముఁ వచింపుమా ॥

ఉ॥ శ్రీరమణీయభూమిసురశేఖరుఁడై ఘనకీర్తి గాంచి రా
వూరికులాబ్ధిసోముఁడన నొప్పిన యా పెదవీరభద్రుఁ డిం
పారఁగఁగాంచినట్టి సుతులందరిలో నుతిగన్న సద్గుణా
ధారుని రామకృష్ణు హితతల్లజు గోల్పడినాఁడ నక్కటా ॥

ఉ॥ అన్నమునం దనిష్ట మిసుమంత భుజించిన జీర్ణహానియుఁ
గ్రన్ననవచ్చు దగ్గునను కాగుణముల్ జనియించి దేహమం
దన్న! క్రమంబునఁ బలము నంతయుఁ బీల్చి పదారు మాసముల్
నిన్నకటక్కటా తుదకునిర్జరలోకనివాసుఁ జేసెఁగా ॥ 61

ఉ॥ ఆయువుకన్న మిన్న యగునట్టి యనామయ మాఱసాగ దే
శీయభిషగ్వ్రతంసముల చెంగట నౌషధమున్ భుజించి యం
దేయుపయోగముఁ గనక నీవు నిరౌషధ నీర వైద్యముఁ
జేయఁదొడంగి మూన్నెలలుచేసిన నిష్ఫల మయ్యెనక్కటా ॥ 62

ఉ॥ వేలకు వేలు విత్తమును వెచ్చ మొనర్చి తెనాలి నాంగ్లవై
ద్యాలయమందున న్నిలచి యందు నమూల్యమహౌషధంబులన్
జాలభుజించి దేహమున సారముగల్గక యంతమీఁద నీ
ప్రోలికివచ్చి వేలుపుల ప్రోలికి నేగితివయ్యమిత్రుఁడా ॥ 63

ఉ॥ ఇంతకుమించు రోగముల నేడ్చుచునుండినవారు మందుచే
సంతసమందలేదె హితసత్తమ ! బత్తెము లేకయున్న నీ
కెంతటి వైద్యులైన ఫలమిత్తురె ? వారలు దేహరోగమున్
ద్రుంతురుగాని యాయువును తోరముఁజేయఁగలారె చూడగన్ 64

గీ॥ అకట కాలక్రమంబున నదియెతగ్గ, నీదు రోగం బటంచు నెంచితిని గాని
యిటుల నిన్ దిగమ్రింగునం చెఱుఁగ నైతి, గుణములకు నిక్క వైన నిన్ గోలుపోతి॥65

గీ॥ లోకమంతయుఁ జింతాబ్ధి లోనమున్గ, మ్రింగి మాలక్ష్మణామాత్య మిత్రమౌళి
రామకృష్ణుని మఱల గ్రూరతవధింప, గటకటా రుధిరోద్గారి! కరుణలేదె ? 66

ఉ॥ నెత్తురు గ్రక్కుదానవను నీదగు పేరుఁ దలంచినంతనేఁ
జిత్తము తత్తరిల్లెడు నిసీ దురితాత్ముల జంపకెప్పుడుఞ
బొత్తుగ చెడ్డ త్రోవలకు బోవని మాహిత రామకృష్ణము
ఖ్యోత్తమ పూరుషావళుల నుక్కడఁగించెద వెట్టిదానవే ॥ 67

చ॥ కొడుకులు లేక లేక వగ గుంది మనంబునఁ జిన్న వీరభ
ద్రుఁడు నిను దత్తుఁ జేసుకొని దుర్గతు లెల్లఁదొలంగు నంచుఁదా
గదుముదమందుచుండఁ గొడుకా! యని యేడ్చుచు దుఃఖవార్ధిలోఁ
బడి కృశియించుమం చతని ప్రాణసఖా! దివి కేగుటొప్పునే ॥ 68

చ॥ తనకొమరుండు రాఘవుఁడు దానటవిఞ జరియింపబోవఁ ద
త్తనయ వియోగదుఃఖమున దాశరథీ! యనికుందికుందియా
జి నరవరుండు మేనువిడచెఞ గదపూర్వము వీరభద్రుఁడే
యనువునఁ బ్రాణముల్ నిలుపు నక్కట నందనుఁ దస్తమించినఞ ॥ 69

చ॥ అరయఁగఁదన్ను నీ విమలహస్తముతో మసిఁ జేయుదంచు లో
నరసిన వీరభద్ర విబుధాగ్రణి కిప్పుడు నీశరీరముఞ
బురబురఁ బొక్కి నిప్పునిడి బూదియొనర్చు నవస్థవచ్చె హా
కరకరిదైవ చిత్రమెఱుఁగంగ సమర్థుఁడె మానవుండిలఞ ॥ 70

చ॥ ఇదివరకేడు తద్దినము లెంతయు గుందుచుఁ బెట్టునట్టికో
విదుఁడగు వీరభద్రయకు బెట్టుము నాదగు తద్దినంబు నె
మ్మిదియవదానిఁగా ననుచు మీరలు వారికనుజ్ఞ నిచ్చి త
త్త్రిదశపురంబుఁ జేరితివె ధీరవరేణ్య మహీసురోత్తమా ॥ 71

ఉ॥ హా విధియెంతఁ జేసెనకటా భవదీయ శిరంబునన్ "జిరం
జీవ" యటంచు మోదమున సేసలఁ జల్లిన యట్టిహస్తమే
పావకఖండమున్ శిరము పైనిదు నట్లొనరించె వీరభ
ద్రావనిదేవుచే నిది మహావిపరీతపు కర్మగాదొకో ॥ 72

మ॥ తనయా ! యిందుననందు సౌఖ్యములుఁ బ్రాప్తంబౌగదా
యంచు మజ్జననంబెంతయు సార్థకంబగును వంశం బెచ్చుచున్ వ
చ్చునంచును నిన్ బుత్రునిగా గ్రహింపనిటు సంక్షోభంబు గల్గించితే
యనిదుఃఖించెడి వీరభద్రుగనుమయ్యా ! రామకృష్ణాహ్వయా! ॥ 73

గీ॥ దుర్గమాటవి నడచు పాంథుండు మిగుల, నెండదాఁకఁ దరుచ్ఛాయ కేగుదెంచె
వర్షమున కద్రికుహర నివాసియయ్యె, భయద నిర్ఘాతమడఁచిన బ్రతుకు టెట్లు ॥ 74

చ॥ జనకుఁడునీల్గె తల్లియునుఁ జచ్చె సహోదరులస్తమించి రం
గనయు నడంగె నాదురితకర్మమదేమి? పరాత్పరా! యటం
చనయముఁ జింతఁ జెందు సరసాగ్రణియౌ పినవీరభద్రునిం
కను సుతశోకవహ్ని మసి గమ్మనుచు దివికేగితే సఖా! ॥ 75

ఉ॥ దత్తకుమారు నందనుఁ డితండని పెంపుదుతండ్రి కూర్మితో
నెత్తియు ముద్దుఁబెట్టుకొని యెంతయు సంతసమంద నోసుధీ
సత్తమ! మీకుదైవ మొక చక్కనిపుత్రునొసంగఁడాయెఁగా
యిత్తఱి పుత్రశోకమతఁ దేపగిదిన్ దిగమ్రింగునక్కటా ॥ 76

ఉ॥ శ్రీమదుమేశపాద సరసీజము లెప్పుడునమ్మి వారణా
సీముఖ పుణ్యభూములను సేవనొనర్చి పవిత్ర నిమ్నగా
స్తోమమునందు గ్రుంకిన విశుద్ధ చరిత్రుని వీరభద్రు ని
ప్ప్రేమ గుమారశోకమున బెట్టిన దైవము నేమిసెప్పుదున్ 77

గీ॥ దోసకారులకెంతయుఁ దోడుపడును, పుణ్యమూర్తుల కాపదల్ బొందఁజేయు
నెపుడు దైవంబనుచుఁ బెద్ద లెఱుకచేయు, చుందురయ్యది తప్పునే ? యూహసేయ॥ 78

మ॥ నవమాసంబులు మోసి గర్భమున నానా కష్టముల్ చెంది నా
ల్గవ పుత్రుండవుగా నినుంగని కడు న్గారాముతోఁ బెంచి యి
య్యవనిం బెక్కుదినంబులుండెదవటం చాసించి యున్నట్టి నీ
యవ నోటం దుముగొట్టిపోయితివె? మిత్రా! రామకృష్ణాహ్వయా ॥ 79

గీ॥ ఒక నిమేషంబు నిన్ బాసి యున్న యెడల, నంతరంగంబునం గడుఁ జింతఁజెందు
నిఖిలసుగుణసమేతయౌ నీదు మాత, ధృతి నిఁకేరీతి గడపునో దేహయాత్ర 80

సీ॥ సుమతల్పముల నిన్నుఁ జూచినకందోయి, పాడెపైఁ బడియుండఁ జూడవలసె
నిష్టాన్నములను వడ్డించిన హస్తముల్, బిండంపుకూటిని వండవలసె
"లాలి, లాలీ" యంచు జోలఁబాడిన నోరు, హాహారవంబుఁ జేయంగవలసె
నిన్నయో తొమ్మిది నెలలు మోసినపొట్ట, యష్మద్వియోగాగ్ని నుడకవలసె

గీ॥ అఖిల సుగుణావలంబయౌ అచ్చమాంబ, కటకటా యెట్టి విపరీత కష్టదశలఁ
జిక్కునట్టి యవస్థ వచ్చినది నేఁడు, యింక నాతల్లి పుడమి జీవింపఁగలదె ॥ 81

గీ॥ అక్కటా! వ్యాధివచ్చిన దాది నీకు, సేవలెన్నియొ రేబవల్ చేసి చేసి
నెతి గృశించెను వృద్ధయౌ నీదుతల్లి, మాతృఋణమునుఁ దీర్పక మరలఁదగునె॥ 82

ఉ॥ సంతతిలోన నీవు కడసారిజనించిన వాఁడవౌట ని
న్నెంతయుఁ గూర్మితోఁ బెనిచె నించుక బాధయు దాఁక నీక స
త్యంతముదంబునందెఁ దుద కయ్యయొ మీర లకాలమృత్యువ
క్రాంతరమందు దూఱి రిక నాయమజీవిత మెట్లు సాగునో ॥ 83

సీ॥ మా రామకృష్ణయ్య నారోగ్యవంతుఁగా, దయఁజేయుమయ్య సీతాహృదీశ
మాముద్దుపట్టిని ప్రేమతోఁ జూడుమో, పార్వతీహృదయేశ భవవినాశ
మాపైఁడికొండను గాపాడు మాపదల్, బాపిసుబ్రహ్మణ్య! భక్తవరద!
మాగొనంబులకుప్ప కేగోడు రానీక, కరుణింపుమమ్మ దుర్గాభవాని

గీ॥ యేడుకొండల శ్రీ వెంకటేశ్వరయ్య, చిన్నకొమరునిఁ గూర్మి వీక్షింపుమయ్య
యనుచు వేల్పుల నెల్ల మీయమ్మ వేడె, వారలొకరైన నీ ముప్పు వాపరాయె ॥

ఉ॥ వచ్చియు రానిము ద్దొలుకు వాక్యము లాడుచు నాయనమ్మరో
యెచ్చటికేగె బాబిపు దదేటికి గన్పడ దయ్యె నాకు న
ప్పుచ్చులుఁ బండ్లుఁదేఁజనెనె పల్కు మటంచన నామె దుఃఖ మ
హెచ్చయి సోమసుందరున కేమని చెప్పుదు నంచు నేడ్చెడిన్ ॥ 85

చ॥ పుడమిని సర్వసౌఖ్యములఁ బొందుదు నంచును గంపెడాసయే
ర్పడ నినుఁబెండ్లియాడి కడు భక్తిమెయిన్ భవదీయసేవఁ జే
సెడి సతినెట్లుఁ బాసితివి శ్రీహరి దిక్కెవరింక నామె కి
ప్పుడకట భర్తృశోకమునఁ బొక్కుచుఁ జీవము లాపనేర్చునే ॥ 86

సీ॥ కొదమతుమ్మెద చాలు నదలించు పెన్నెఱుల్, గొఱిగింపఁ బడెగదా కొమ్మ కిపుడు
రంగారు బంగారు చెంగావులంగట్టు, భాగ్యంబుచెడెగదా పడతికిపుడు
గళమందువెలయు మంగళసూత్రమునుఁ ద్రెంచు, గతివచ్చినది గదా గరిత కిపుడు
రమణీయముఖసీమ రాజిల్లుకుంకుమ, బొట్టువోయెను గదా పొలతి కిపుడు

గీ॥ ముదముతో నేడుపలుగురి యెదుటనిలచు, హక్కు నశియించినది గదా, యతివ కిపుడు
రామకృష్ణాభిధాన! నీ రామబ్రతుకు, యడవిగాసిన వెన్నెల యయ్యె నకట ॥ 87

ఉ॥ హారమణీయరూప! వికచాబ్జవిలోచన! ప్రాణనాథ! దు
ర్వార వియోగదుఃఖజలరాశిని నన్ బడఁద్రోసిపోతి వే
తీరునఁ బ్రాణపంచకము దేహమున న్నిలుపంగ నేర్తు నే
దారి యటంచు నేడ్చు వనితామణి శోకము దుస్సహంబుగా ॥ 88

చ॥ తలియునుఁ దండ్రి యన్నయునుఁదమ్ముఁడు నక్కయు ముద్దుచెల్లెలున్
జెలులును లేరు పుట్టినిలుఁ జెంగట లేదిక మీద నన్నియున్
జెలువుఁడెయంచు గాఢముగఁ జిత్తములోపల నమ్మినట్టి నీ
చెలువకు నోటదుమ్ము నిడఁ జెల్లునె ? నాయముఁదప్పి మిత్రుఁడా 89

గీ॥ అకట నీచాన యిఁక నేరి కడ్డమైన, నేఁడిసీ పాదుముందనుఁ జూడవలసె
ననుచులోలోనఁ దిట్టెద రవనినెల్ల, తెట్టిగతివచ్చె నిల్లాలి కిపుడు సఖుఁడ ॥ 90

ఉ॥ మూడవయన్న గారి శిశుముఖ్యుఁడు వెంకట సోమసుందరున్
వేడుకఁ "బిచ్చిరో" యనుచు వీఁడఁగ లేవు నిమేషమైన నే
గోడునుఁ జెందనీక గడు గూరిమి బెంచితి వింత కాల మి
ప్డేడుపుఁబెట్టి బాలకున కేగితివే ప్రియమిత్రరత్నమా ॥ 91

గీ॥ తండ్రి యొకనాఁడు సోమసుందరునిగొట్ట, బిట్టలుకఁ జెంది నీవిట్లుఁ బిల్లవాని
గొట్టఁ దగదంచుఁ జీవాట్లుఁ బెట్టిచెడ్డ, యొట్టు నిడినాఁడ వెటుబాసి తట్టి బాలు॥ 92

సీ॥ పెద్దన్నగారగు వెంకటప్పయ గారి, దుఃఖమేకైవడిఁ దొలఁగిపోవు
నదలందు రెండవ యన్నయ్య సుందర, రామయ్యకెట్లు ధైర్యంబు వచ్చుఁ
బొగులు లక్ష్మీపద పూర్వనారాయణా, ఖ్యతృతీయ సోదరుఁ దలరు టెట్లు
సదమలుండైన జ్యేష్ఠ భ్రాతసుతుఁడు వెం, కట సుబ్బయకు వేద్క గలుగుటెట్లు

గీ॥ బంధుబృందంబు దుఃఖంబు బాయుటెట్లు, చెలిమికాండ్రకు జీవంబు నిలచుటెట్లు
నగకులాధీశసమధైర్య! సుగుణధుర్య!, అనుపమౌదార్య! రామకృష్ణార్యవర్య ॥ 93

సీ॥ తలనేలకైవంచి తగని దుఃఖముఁజెందు, తండ్రియాపదఁ బాపఁ దలఁపవేల
కొడుకా! యటంచు పెన్గోలఁ బెట్టుచునున్న, తల్లి దుఃఖంబును దఱుమవేలఁ
చింతాంతరంగులై చీకాకుఁ జెందెదు, యన్నలతోఁద మాట్లాద వేల
దిక్కెవ్వరిఁక నంచు దిగులుఁ జెందుచునున్న, ప్రియురాలిగతి విచారింపవేల

గీ॥ యుష్మదీయ వియోగాగ్ని నుదుకుచున్న, యనుఁగు జెలికాండ్ర దుస్థితి నరయవేల
దిగులు నాకింక నేమంచు దివమునందు, సుఖముగా గూరుచుంటివే శుద్ధచరిత॥ 94

సీ॥ వెంకటసుబ్బయ్య వెక్కివెక్కియునీదు మృతికేడ్చుచుండె సంస్తుత చరిత్ర
పటుదుఃఖవార్ధి లోపలమున్గినది గదా, వెంకట సుబ్బమ్మ విమలహృదయ
అన్నపానములాపి యదలుచునుండె వెం, కటనాగరత్నమ్మ కలుషహరణ
బాబాయికోసమై పరితపించుచునుండె, వెంకటశేషమ్మ వినయనిలయ

గీ॥ కాకిగోలలతోఁదఁ జీకాకుఁబడిరి, ఘనుఁదు సుందరరామయ్య గారి పిల్ల
లక్కటా వీరి దుఃఖంబు వాపుటెట్లు, రామకృష్ణాభిధాన! ధీర ప్రధాన ॥ 95

సీ॥ బాల్యమాదిగ నిన్నుఁ బాయని మిత్రుఁడౌ, బసవయ్య నేరీతి బాసితయ్య
కూరిమి చెలికాఁదు గుణవంతుఁడైన ల, క్ష్మయ్య నేగతి విద నాఁడితయ్య
పుడమి లక్ష్మీపద పూర్వనారాయణ, నామునెట్లెదఁబాసినాఁదవయ్య
ప్రాణమిత్రుండైన బ్రహ్మయాభిఖ్యుని, సదమలాంగా! యెట్లు వదలితయ్య

గీ॥ మిగులఁ జేదోదు వాదోదు నగుచు నీకు, వెలయు యప్పయ్య నేరీతి విడచితయ్య
మిత్రులెవ్వరు? దేహికి బుత్రులెవ్వ రనెడి వైరాగ్యమున దివి కరిగి తయ్య ॥ 96

సీ॥ విజ్ఞానరాశియై విలసిల్లునట్టి సాం, బయ్యగారినిఁ బాయు టర్హమగునె
మిత్రరత్నంబయి మెలఁగుచుండిన సుబ్బ, యాభిఖ్య విడనాఁదు టర్హమగునె
నినుఁబాయలేని సునీతి వెంకటసుబ్బ, యాభిధానుని వీడు టర్హమగునె
ప్రియమిత్రుడగుచు నిన్విడని లక్ష్మీపెరు, మాళ్ళయ్య నెడబాయ మంచిదగునె

గీ|| అక్కటక్కట పెదపూడి యందు వీర, లంద రందెదు చింత దురంతము గద
హితుల నీరీతి శోకాబ్ధి కీడ్చివైచి, దేహ మెడఁబాసినాఁడవే దివ్యపురుష || 97

గీ|| స్వర్గలోకంబు విడనాడఁ జాలవేనిఁ, జిన్ని మా విన్నపంబును చిత్తగించి
ముచ్చటగ నీదు దర్శనం బిచ్చిపొమ్ము, చివర కొకసారియైన నో చెలిమికాఁడ || 98

ఉ|| అక్కట యెంతకాలమిటు హాయని యేడ్చుచునున్న గాని నీ
చక్కదనంపు రూప మొకసారియు నే గనజాల దీనికై
పొక్కఁగనేల ధైర్యమును బూని భవద్ధృదయప్రశాంతికై
యక్కమలాయతాక్షుహరినర్చనఁజేయుచునుందు నేనిఁకన్ || 99

గీ|| కన్నులనుగాఱు దుఃఖాశ్రుకణములెల్ల, గాల్వలైపాఱఁ దడిసెను కాగితంబు
కలము గంపించె మతిచెడె కండ్లుఁ దిరిగె, నాపుచున్నాడ నిఁక నీవిలాప కవిత ||
100

సమాప్తము

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః

# నివేదనము

అది విభవసంవత్సరము వడకారు, మునిమాపు, నెయ్యురతో నూరి వెలుపలి పచ్చిక బయళ్లలో నా యసివాఱు ముచ్చటలలో మునిఁగి తేలుచున్న మాయెలమి సోడు ముట్టుచున్నది. ఇంతలోఁ జెంతనున్న మావిగున్నపైఁ జెరలాడు పెంటిగువ్వ నొకయెఱుకు దంట-కంటితడి యెఱుం గని మొండికట్టె వాఁడికట్టియం బఱిపి తనపొట్టం బెట్టుకొనె, కట్టా ! యని మేమట్టె లేచితిమి ఘోషించితిమి రోషించితిమి దూషించితిమి మే లే మున్నది ? రిత్తకు రిత్త

తోడ్తోఁదిక్కనార్యుని "లుబ్దకపోతోపాఖ్యానము" మా తలఁపునం బాఱె. " ఈపిట్టకథకు వలయుమార్పులు చేర్పులుం గూర్చి యిట్టి కట్టిఁడితనంబుపై జనంబులకు నేవగింపు వొడమ నీవొక కబ్బంబు నుడువు టెంతయు లెస్సగదా" యని నెచ్చెలికాండ్రు నన్నెచ్చరించిరి ఆ యావేశములో నాదిటవులేమి న్మఱచి యే నందుల కియ్యకొని యపుడ గ్రంధారంభ మొనరించితి. వాణీకటాక్ష బలంబున నలఁతి ప్రొద్దునకే యీకృతి నిట్లు సంతరింప నయితి యైనది ఇందు మాకోరుకు లెంతవ ట్టీడేఱెనో చదువరులకే యెఱుక

ప్రాచేతసుని రామాయణరచనకుంబోలె నా యీ చేఁతకు విషాదజనక మగు నిషాదచేష్టితమే మూలకారణమనిన నౌపమ్యసూచనలో నధికోపమాదోష మున్న దని యాలంకారికు లపహసింతురు కాఁబోలు కానిండు ఎవరిబిడ్డ వారికి ముద్దు.

ఇయ్యది ముగియుటయే తడవుగ భారతీపత్రికలోఁ దత్సంపాదకుల యాదరాతిశయమ్మున ముద్రిత మగుటంజేసి తెలుఁగుమాగాణములో నెంతేని వ్యాప్తి నందుభాగ్యము వడసినది. దేశోద్ధారకుని యీ యుపకృతి మఱవఁజాల ఎసలిక యసదై యున్నను దల్లిపలుకుపైఁ గల తగులమునం జేసి వేసట నాక దీనికిఁ దగు ప్రస్తావన వ్రాసి యిచ్చిన ఆంద్ర శేషగిరిరావు, బి ఏ గారికిఁ గృతజ్ఞతాపూర్వకములు కేలుమోడ్పులు.

తెలుఁగువా రీ కృతికిఁ బ్రేమపూర్వక స్వాగతము పల్కి యితోధికభాషాసేవకు నన్నుఁ బురికొల్పుదురు గాత !

-రచయిత

# ప్రస్తావన

" కలదే యిమ్మెయి పౌరుషంబు జగతిన్ గారుణ్య మేపార ని
ష్ఫలుఁగిట్లిచ్చునె మేను నాదుచరితంబుల్ నిందకుం బట్టు లై
తలఁపన్ వచ్చిన నింత కీ డగునె యేతత్క్రూరతాఘోరచే
ష్టలు మానంగలవాఁడఁ బక్షి గురువై సంధించె సద్బోధమున్.

– కవిబ్రహ్మ

కథ ఒక దివము, ఒక రాత్రిలో సమాప్తమైనది. 'అక్కటికంబు లేని కలుషాత్ముఁడొకానొక బోయవాఁడు' వేకువను వేఁటకు బయలుదేరుచున్నాఁడు. రాత్రిముగియుసరికి 'పావన దేవత్వంబు వడసి వన్నియకెక్కి'న వాఁడైనాఁడు. వేకువను బోయ 'ధనుశ్శాతాశుగవాగురాదిసాధనుఁ డగుచు' వేఁటకుఁ జనినాఁడు. 'అహస్కరుఁ డేపున నడిమింట మండు నెండలఁ గాయు' సరికి అతని 'హింసావ్యాపార' మగ్గలమైనది. మఱి 'రెండు గడియలకాల' మునకు మిన్నెల్ల నీలమేఘచ్ఛన్నము. 'అబ్జబాంధవుఁడస్తమించు' సరికి వాన, వంగుడు, ఈదర, ఇవము. 'కొంతవడి కజ్జడి మెల్లన తగ్గెన్.' ఇక్కడి నుండియే కథయొక్క నిగ్గు.

మూఁడే పాత్రలు. బోయఁడు, కపోతము, కపోతి. బోయని మన:పరిణామ ప్రదర్శనముపైనే ఈ కావ్యమునందలి కళ ఆధారపడి యున్నది. ఊగుండెనైనఁ గరఁగింపఁజాలు పరిస్థితులు. 'దుర్గమారణ్యము' 'అదిగాక దుర్దినంబు' 'వెండియుం జడివాన' 'పై పెచ్చుమాస' అన్నిటికిఁదోడు ఆఁకలిబాధ' 'అక్కఱకు డెఱకుదొర' యుల్లంబుకూడఁ దల్లడిల్లినది. అయినను

'ఇచ్చవచ్చినపుల్లు ప్రచ్చి వెచ్చనిపచ్చి
పొలసు మెక్కెదుగీఁత తొలఁగు నొక్కొ'

అనియే అతని చింతనము, 'జీడిమామిడిపప్పు' 'కల్‌సారాలు' 'కూర్మిబిడ్డ' 'ప్రియురాలు' వీని యన్నిటి కంటె 'పచ్చిపొలసు'నే ఆతఁడు తొలుతఁ బేర్కొనినాఁడు. కాని యంతలో అతనిమనము క్రమపక్వమునకు రా నారంభించినది. 'ఇన్ని కంతులు కోసితిని గాని నా కంతి యంత నొప్పిలేదు' అను తత్త్వములోనికి వచ్చినాఁడు. తనదృష్టితో నితరులను గాంచు ఈ క్షుద్రగుణమును కూడ నాతఁడు త్వరలో విడనాడఁ గలిగినాఁడు. పాపపుంద్రోవలఁ ద్రొక్కి మిమ్మెపుడుఁ ద్రుంచు దురాత్ముని నన్ను నిట్లు సంభావనచేసి మంతె' అని పక్షితో నని ఇతరుల దృష్టితోఁ దన్ను చూచుకొనుటతో నాతని హృదయపరివర్తనము పూర్తినొందినది. తనకుఁగాఁ బక్షిమంటఁ బడుట చూచి–

**"లోక మీకరణిం బ్రాణిలోకమునకు, మేలు గావించుచుండుఁ గాఁబోలు సతము**
**పుట్టువుం దొట్టి యుపకృతిపొంతఁబోని, కట్టిఁడిని నేను నాకెట్టిగతులు గలవొ"**

అనుటతో నాతఁడు ప్రాణములతోడ జన్మాంతరము నొందినాఁడు. ఇఁక నాతని జన్మాంతరము సంగతి తడవనేల! బోయఁడు కథలోఁ దొలుత ప్రవేశించుచున్నాఁడు. తుదిని నిష్క్రమించుచున్నాడు.

కపోతము రెండవ పాత్ర. అర్థాంగియెడ ఈతని అనురాగము అవధియెఱుఁగనిది. భారతదేశ కావ్యములందు భర్తల కొఱకు విలపించిన భార్యలు పెక్కురుగలరు; భార్యల కొఱకు విలపించిన భర్తలు మిక్కిలి తక్కువ. ప్రమద్వర కొఱకు రురుని వలె నీ కావ్యమునందలి కపోతము కపోతి కొఱకు విలపించు.

**"కలిమిలేములలోన భాగంబుఁ గొనుచు, మంచిచెడ్డలలోనఁ బా ల్పంచుకొనుచు**
**మెలఁగునర్ధాంగి దూరమై తొలఁగెనేని, మగని కాధార మెవ్వరో మగువ ! చెపుమ"**

మగువ మగని కాధార మనిన ఈ మగపిట్ట తన భార్యయందు దేవీస్వరూపమును గాంచుటలో ఆశ్చర్యము లేదు. అతిథి సేవలో కపోతమునకు కపోతి ఉపదేశకర్త్రి. వానకారున కట్టెలు లేకపోఁగా నిల్లు పడఁగొట్టించి యింటిదూలములు చీల్పించి వంటలు చేయించి సంతర్పణములు సాగించిన మహాదాత కర్ణునివలె నీ కపోతము గూఁటిచితుకులను బోయవాని చలిమంట కిచ్చినది. ఇట్లు వాని చలిమంటకు గూఁటిచితుకుల నిచ్చుటలో లెక్కయేమి?వాని కడుపుమంటకుఁ దానే బలివోయెనుగదా ! అతిథిసేవకు భార్యవలన ఆదేశము నందిన యీ ఆదర్శకభర్త తాను అగ్నియందు దుముకుటకును భార్య ఆదేశము నర్థించినాఁడు.

**"నీ సహాయత లేక నాచేసినట్టి**
**గట్టికర్జ మొకండేనిఁ గానఁబడునె ?"**

అని బ్రతికియున్నపుడు కపోతము కపోతిని గూర్చి అన్న మాటలు.

కపోతి మొదటినుండి తుదిదాఁక భారతసతీత్వము గుబాళించుపాత్ర. మగఁడు తన్నుఁ గూర్చి యనిన వాక్యములు వాగురాబద్ధయై విని కపోతిపొందిన సంతోషమునకు మితిలేదు.

**"మగని నెమ్మదికి నిమ్మాడ్కి నెక్కుటయకా, కులకాంత సతతంబుఁ గోరుచుండు**
**నింక వలసినదేమి నా కీభవంబు, సార్థకత చెందె దుర్గతిప్రాప్తి దప్పె"**

ఉసుఱులు తొలఁగువేళ తలఁపని తలంపుగా మగని దర్శనము దొరకినందులకు కపోతి ఆర్తజనబాంధవునకు జోహారొనర్చినది. కపోతికి భారతాంగనకువలె దాంపత్య మెడతెగనిది; ఉత్తరలోకము కలదు; వైరాగ్యభావము హెచ్చు ; 'దుఃఖమన్ వాకిలి మూయుటకు ధైర్యకవాటము' కలదు. ఈకపోతి స్త్రీహృదయము బాగుగాఁ బ్రదర్శించు వాక్యములు -

**"మగఁడు నేఁడురాక మసలెన దేమొకో, దైవమా ! యటంచుఁ దల్లడిల్లి**
**యెఱుకునింతి యింట నెట్లేడ్చు చున్నదో, జాలిగొల్పు వీనిచరిత మకట !**

ఆఁడుదాని కష్టము ఆఁడుదానికి దెలియును. తన పుత్రులను చంపిన అశ్వత్థామను పట్టితెచ్చి యెదుటనిలుప ద్రోణకుటుంబిని 'పుత్రశోకజనితాకులభారవిషణ్ణచిత్త' కాకుంట కాతని విడిపించి తన సుస్వభావము చూపిన ద్రౌపది ఈసందర్భమున జ్ఞప్తికి వచ్చుచున్నది. భారతభూమి సహగమనములకు సారక్షేత్రము. ఇచట జనించిన పక్షులకును సహగమనమాచారమని ఈకపోతి చూపినది.

ఈకపోతియు కపోతమును దాంపత్యమునుగూర్చి ఉత్కృష్టాదర్శము గలవారు
"శబ్దార్థములభంగిఁ జంద్రికా చంద్రుల, ట్లన్యోన్యమైత్రి నొప్పారుచున్న
మన కాఁపురంబు" -అని కపోతము
"రమ్యకుసుమంబ వీవు సౌరభమనేను
నిండునెల వీవు పండువెన్నెలను నేను, పదమ వీవు తదర్థసంపదను నేను"
- అని కపోతి

ఇట్టి 'వెలితియెఱుఁగని' పిట్టల దాంపత్యముననే 'కపోతదాంపత్యము' అను కవిసమయమేర్పడినది

ఈ కథ ఆర్యవాఙ్మయమునకుఁ గీర్తిఁ దేఁగలకల్పన. పశువులను, పక్షులను పాత్రలనుగఁ జేకొని కథ నిర్వహించుట ఆర్యసాహిత్యమున చిరంతనసంప్రదాయము క్రౌంచపక్షుల మూలమున వాల్మీకి కవి యయ్యెను పక్షులకు ప్రత్యేకభాష కలదని కేకయ మహారాజు చరిత చాటుచున్నది నలదమయంతులకు, ప్రభావతీప్రద్యుమ్నులకు సంధానము పక్షుల మూలముననే ఇట్టి నిదర్శనము లనంతములు

పంచమవేదమైన సంస్కృతభారతమునం దీకథ గలదు తిక్కన తెనిఁగించినాఁడు దానిని ప్రబంధశైలిని పెంచి శ్రీతుమ్మల సీతారామమూర్తి చౌదరిగా రిట్లు క్రొత్త వెలయించినారు చౌదరిగారు బహుద్రష్ట లగుట ఘట్టప్రభువు, పోతన్న, నన్నయ మొదలగు ఆంధ్రకవుల పోణిమిపోకడ లిందుఁ బొసఁగినవి సీసపద్యమును వీరు ప్రబంధకవులవలె వర్ణనాంశమునకేకాక పురాణకవులవలె కథానివేదనమునకుఁ గూడ వాడిరి సందర్భము పొసఁగినపు డెల్ల ప్రపంచవిషయ ప్రస్తావముచేసి వీరు కావ్యమునకు ప్రయోజనమును కలిగించినారు కపోతము కర్షకజనమాన్యతను గూర్చిచెప్పినవాక్యము లిందులకు నిదర్శనము

ఈకబ్బము బాలురు బాలికలు సంకోచములేక చదువఁదగినది విద్యాధికారులు ఇందలి మేలెంచి విద్యార్థులకు దీని నందిచ్చి వారికి ఉన్నతాదర్శములు హత్తుట కవకాశము కలిగింతురుగాక!

మదరాసు
18-3-1939

ఆంధ్ర శేషగిరిరావు
సారస్వత సమాజము

# స మ ర్ప ణ ము

శా. నిండీనిండని జవ్వనంపుసిరితో నిర్భాగ్యతాపూర్ణమై
పండీపండని కోర్కితీవగమితోఁ బాధస్తరంగాభమై
యుండీయుండని మాయదారిబ్రతు కయ్యో! యేల సాగించి నన్
మండీమండని మొండిఁ జేసితి వధర్మంబౌని ప్రాణేశ్వరీ! 1

మ. తరుణీ! నీయనురాగనౌకఁగొని చింతాఘోరవారాశి ని
స్తరణంబున్ త్రుటిలో ముగించి పరితోషప్రాజ్యసామ్రాజ్య సు
స్థిరపీఠంబు నలంకరింప మది నెంతే నాసగొన్నట్టి నన్
దురవస్థావశుఁ జేసి వీడఁ దగునే దోషంబు వాటిల్లదే. 2

మ. పరిశీలించిన యుష్మదీయ మగు లోపం బున్నదే యిందు దు
ర్భర చింతాహతబుద్ధి నౌట నిను దూఱం జొచ్చితిం గాని యె
వ్వరికేనిన్ దురతిక్రమం బగు విధి వ్యాపార మాపైఁ బురా
దురితం బూరకపోదు శోకహత మెందున్ లోక మో రాఘవా! 3

గీ. నీకు - సాధ్వీవతంస వౌ నీకు-నిర్భ, రాత్మగౌరవసంపూర్ణ వైన నీకు
నిర్మలప్రేమచిహ్నమై నివ్వటిల్ల, నంకిత మొనర్తు నీకృతి నందుకొమ్మ. 4

క. నీ కిపు డే నర్పించిన, యీ కావ్యము సాధులోకహృదయంగమమై
యాకల్పము నవికల్పత, నీ కీర్తిరమా విలాసనిలయం బగుతన్ 5

(ఆంగీరస - వసంతోదయం)

# ఆత్మార్పణము

ఉ. ఆక్కటికంబులేని కలుషాత్ముఁ డొకానొక బోయవాఁడు పెం
పెక్కినకాననంబులకు నేగి ఖగంబుల కుచ్చు లొడ్డి చేఁ
జిక్కినవానిఁ గొన్నిటి భుజించుచుఁ గొన్నిటి విక్రయించుచున్
బెక్కుదినంబు లిట్లు గడపెన్ దనజీవిత మొక్కపల్లియన్ 1

ఆ. అతఁడొక వేకువం గృ, ష్ణాతటకాంతారములకుఁ జనియెను మృగయా
కౌతూహల మదర ధను,శ్శాతాశుగవాగురాదిసాధనుఁ డగుచున్ 2

సీ. కఱకుటుండల గుండె లురలించి జిగిమించు కొక్కెర ల్గొన్నింటి నుక్కడంచె
మొఱకుఁగోలలు గాత్రముల నుచ్చిపోనేసి, కొన్నిసాళ్వంబులఁ గూలఁద్రోసెఁ
జెట్లఁ బుట్టల రావిజిగురుఁ గండెలఁ బన్ని, కొన్ని గోర్వంకల మన్నిగొనియెఁ
గడఁగి యందందు నూకలఁ జల్లి వల లొడ్డి, పావురాల్ గొన్నింటిఁ బట్టికొనియె

గీ. జంగుపిల్లులఁ గుందేళ్ల ముంగిసలఁ గు, ళింగములఁ బట్టెఁ గొన్నింటిఁ జెంగలించి
వేఱ వర్ణింపనేల యవ్వేళఁ బ్రళయ, కాలసంప్రాప్తి యయ్యె నగ్గహనమునకు 3

క. ఈ పరమ కలుష హింసా, వ్యాపారం బంత కంత కగ్గల మగుటన్
గోపించె నన నహస్కరుఁ, డేపున నడిమింట మండునెండలఁ గాసెన్ 4

గీ. అఖిలసత్వశరణ్య మౌ నయ్యరణ్య, మట్టుడికినట్టు లుడికెఁ జండాతపాగ్నిఁ
గడచె నొక రెండుగడియలకాల మిట్లు, పీచుపీచుమబ్బులు మింట లేచువఱకు 5

క. తగవరిసిరి కైవడి న, మ్మొగుళు లొగిం బెరిఁగి గగనమున నెల్లెడలన్
నెగడుదుఁ జల్లని తెమ్మెర, నిగిడె నడఁగె నుమ్మదంబు నిముసములోనన్ 6

సీ. అంత సముద్దాంత మగుభంగిఁ గల్పాంత, తీవ్రవాయు వనంగ దిక్కదంబ
మల్లాడ గిరులు కంపిల్లఁ బెల్లుగ రేఁగి, పెనుగాలి సాగెఁ; దద్భీకరార్భ
టికి నయ్యడవి నున్న సకలమృగంబులు, ఖగములు నెంతయుం గలఁగి చెదరెఁ
బెళపెళధ్వనుల మ్రాఁకులు గూలె జొంపము, ల్గొనఁ బాఱె రోదసీకుహర మెల్ల

గీ. ధూళితో నిండె నిటు సముద్ధూతవివిధ, జంతుసంతానమును భయాశ్రయము నగుచుఁ
గొంతకాలంబు విసరి విశ్రాంతిసెందెఁ, జండవాతంబు భూతముల్ సంతసింప 7

ఉ. గాలి యడంగ మేఘము లఖండగతిం జెలరేఁగి గర్జితా
భీలములై తటిల్లత లభిన్నము లై తులకింపఁ బిడ్గులున్
రాలుచు నుండ దిగ్గజకరంబు లనం దగు వారిధారలు
ద్వేలము లై యెసంగ నటవిం గురిసెన్ జడివాన జోరునన్ 8

సీ. అది పల్ల మిది మిట్ట యను విభేదము లేక, యడవి వెల్లువనీట నడఁగిపోయెఁ
దొలుతఁ గూలినవృక్షముల నీడ్చికొనుచుఁ బ, ర్వెత్తె వాఁగులు గట్లనొత్తికొనుచుఁ
జటులధారాపాతసంపీడితాంగంబు, లగుటఁ గొన్ని పులుంగు లంతరించెఁ
జిలువ లందందుఁ గోమల వీడి గుమిగూడి, వేడుకమై జలక్రీడ లాడెఁ

గీ. గొండకోనలలోఁ దరుకోటరముల, నురునికుంజంబుల మృగంబు లొదిఁగియుండె
గడగడ వడంకఁ జలిగాలి కసరి విసరె, నబ్జబాంధవుఁ డింతలో నస్తమించె 9

గీ. దుర్గమారణ్య మదిగాక దుర్దినంబు, వెండియుం జడివాన పైపె చ్చమాస
నల్లవో ! యేమి సెప్పెద నాఁటిరేయి, కాటఁ గ్రమ్మిన చిమ్మచీకటులపేర్మి 10

వ. అత్తఱి నక్కఱకుటెఱుకుదొర వెఱపుగొలుపు నక్కానం గాంచి యుల్లంబు తల్లడిల్ల
వదనంబు పల్లటిల్ల నెద్దియుం దోఁపక రాపడి నిల్చి 11

ఉ. అక్కట ! యేమిసేయుదు మహాగహనం బిది కాఱుఁజీఁకటుల్
నెక్కొనె శీతవాతములు నిండె శరీరము గొంకుపోయె నీ
ది క్కిదియం చెఱుంగఁగల తెన్ను గనంబడదయ్యె వర్షముల్
నిక్కుచు నుండె వెల్లువలు నెట్టుకొనెం దుది కెద్ది మూడునో 12

క. ఇదియ జగమందు నాకుం, దుదినిముస మ్మనుచు మదికిఁదోఁచెడిఁ గాదే
నెదిరించునె యింతటియా, పదలు ననుం జుట్టిముట్టి బంధురభంగిన్ 13

సీ. ఇచ్చవచ్చినపుల్గు వ్రచ్చి వెచ్చనిపచ్చి, పొలసు మెక్కెదుగీఁత తొలఁగు నొక్కొ
జిడ్డుఁదేనెల నూరు జీడిమామిడిపప్పు, నారగించు నదృష్ట మాఱు నొక్కొ
చవులూరఁజేయు కల్‌సారాలఁ దెగఁద్రావి, మత్తిల్లు భోగంబు మడఁగు నొక్కొ
నెక్కొన్నకూర్మి నానిసువువజ్జకుఁ జేరి, ముద్దాడుభాగ్యంబు ముగియు నొక్కొ

గీ. బంగరుంబొమ్మఁబోనినాసింగిఁ గూడి, యెడఁద చివురింప సుగములకడలిఁ దోఁగు
నుత్తమోత్తమకాల మిం కుండ దొక్కొ, నేఁటితో నాకు నూఱేండ్లు నిండు నొక్కొ 14

శా. బోయం డార్తుఁడు రక్షణీయుఁడని సంపూర్ణానురాగంబుమై
నాయీయాపదఁ బాపు పుణ్యుఁ డెవఁ డున్నాఁడిప్పు డిచ్చోట నేఁ
జేయంగల్గినకార్య మెయ్యది యిఁకన్ జీవించు టేలాగు నా
యాయుర్దాయము నాహరించుటకు నీ వాసించితే దుర్విధీ ! 15

ఉ. నాకనుదోయిముందు మరణంబును గాంచిరి పెక్కు, రే నసం
ఖ్యాకవిహంగరాజములఁ గాఱియ పెట్టితిఁ జేతులార నే
శోకము లేదునా కపుడు చొప్పడు మన్మృతినేఁడటన్న ని
య్యాకులపా ట దేటి కదిరా! బ్రతు కెంతయు రుచ్యమౌఁగదా 16

సీ. వని కేగి తినుటకై వలయునంజుళ్లను, బడసి యెప్పటియట్ల ప్రాహ్ణమునకు
వచ్చెద నేనంచు నచ్చి నాదగురాక, కెదురుసూచుచు నాకుటింటిముందు
నిలచి యెంతకు రామి నిస్పృహ చెంది న, న్నేపాము కఱచెనో యేమెకంబు
విఱిచెనో యంచు భావించు నేఁడెన్నిభం, గుల నేడ్చుచున్నదో కోమలాంగి

గీ. పేర్మినల్లారుముద్దుగాఁ బెంచుచున్న, పిల్ల లిపు డెంతగా దురపిల్లుచుండ్రొ
యెవరిగతి వారిదే యటం చెఱుకగల్గు, పెద్ద లాడెడిపల్కు నిబద్ధి యయ్యె 17

గీ. కట్ట! దయ వీడి యీ పాడుపొట్టకొఱకు, నింతవఱ కెన్నిపుల్లుల నేసి చంపి
జంట లెన్నిటి నేడ్పించి యుంటినొక్కొ, కడకుఁ గుడువంగ వలదె తత్కలుషఫలము 18

క. అనిపెక్కు లగు తెఱంగుల, వనరుచుఁ దానుండఁ గొంతవడి కజ్జడి మె
ల్లన తగ్గెన్ జలదంబుల, పెను పఱె గాఢాంధకారభీతియు నడఁగెన్ 19

వ. అంత నజ్జడిపోకకుం గిరాతుఁ డొకింత సంతసించియు వ్రేఁకనియీఁదరతాఁకునకు లోంగి యంగము లెల్ల వడంక నింకనేమిసేయుదు నని పనవి నలుదెసలకుం జూడ్కులు నిగిడించి చేరువమిట్టనేల నింగి ముట్టి దట్టంపుగుబురులం గ్రిక్కిఱిసి పక్కి మొత్తంబుల కెల్ల నిక్కయై యలరునొక్కమఱ్ఱిమ్రాఁకుం గని దాని చాటునఁ దెల్లవార్ప నెంచి తా బట్టినపిట్టలపిందున న్గనియువలం దులకించుగనయంబును బిల్లగుబ్బలి యన నుబ్బి యబ్బురంబు గొల్పు దాపటిమూఁపును గీలించి మెల్లమెల్లన వెల్లువఁ గడవ నడిచి యత్తరువుం దరిసి తన్మూలంబునం గల కటికిఱాబండపైఁ దనమేను వైచి యేచినభయంబున 20

సీ. దిక్కుమాలిన బోయ దీనతం బాపరే, కాననదేవతాగణములార !
నిండారుకూర్మి మన్నించి రక్షింపరే, చటులకాంతారవృక్షంబులార !
పగవాఁడ నని తలంపక కూర్మిఁ జూపరే, సాధువిహంగ రాజంబులార!
యాపన్నుఁడను గాన లోపముల్ మఱవరే, భల్లాదిమృగకదంబంబులార !

గీ. సీతు విదిలించుచుండె హెచ్చెను బుభుక్ష, యసువు లేనింట మూఁడునా ల్గరిగెఁ దొఱఁగి
దుర్భరపుమృత్యుముఖమునఁ దూఱియుంటి, నెట్లు రక్షింతురో మీర లిపుడు నన్ను

వ. అని పులుఁగుదిండి యెలుఁగు రాల్పడ వేఁడి వేఁడి కన్నీరు మున్నీరుగా వటలసెగలం
బొగులుచుఁ బరుష పాషాణపర్యంకమున నొత్తగిల్లి యుండె - నత్తఱిఁ దడవులంబట్టి
యమ్మట్టితొఱ్ఱఁ గాలంబు పుచ్చు పావురం బొండు వఱుహాత నెరకొఱ కరిగిన తనయిల్లా
లెంతకుం గూఁడు సేరమి నరసి వెఱతఱచునఁ బరిపరి విధంబులఁ బొరింబొరి దురపిల్లుచుఁ
బల్లంబులకు డిగు వెల్లువనీటిజాళుల నుప్పతిల్లు "జలజల" మను చప్పుళ్లతో మేళగించి
మ్రోళులు చిగుర్ప దుర్భరవియోగగీతంబులఁ బాడుచు నిట్లు విలపించె 22

ఉ. వేకువ లేచి నాకెఱఁగి, వేడుకమై "హృదయేశ ! యిష్ట నా
యాఁకటిచిచ్చు నార్చుకొన, నయ్యెయితావులకున్ గమించి నీ
శ్రీకరపాదపంకరుహ, సేవకు వత్తు" నటంచు నేగి నీ
వేకడ నుంటివో తరుణి ! యింతకుఁ గన్పడవైతి వక్కటా! 23

సీ. అర్ధాంగి! నాహృదయం బెఱుంగఁ దలంచి, సురిఁగి యుంటివె వనాంతరమునందు
వనిత! ని న్నెడసి యుండిననిమేషంబు నా, కొకయుగంబుఁగ దోఁచుచుండుఁగాదె
కలికి ! ని న్నీ రేయి గాటంపుటడవి నే, పొదరింటఁగల వని వెదకనేర్తుఁ
దరుణి ! నా యీయవస్థ నొకింత గన్న నీ, హృదయంబు చిదురలై చెదరకున్నె

గీ. గరిత ! రాచిల్క లేనిపంజరముకరణి, నుండె మనగూఁడు నీవు లేకున్కి నిపుడు
తెఱవ ! నీతోడులేని నాదేహయాత్ర, జగతి నొక్కనిమేషంబు సాగఁగలదె 24

క. కడ లేనిసీతు వెంతయు వడఁకింపఁ దొడంగె వేగ వచ్చి నను న్నీ
పొదువారుగఱులఁ గప్పుము, పడఁతీ ! నాచింత లెల్లఁబాయును దానన్ 25

మ. కలదే ప్రాణము నీశరీరమున నో కాంతాలలామంబ!యే
వలలోనం బడి యుంటివో ! కొదమసాళ్వం బెయ్యుటం జిక్కితో
చెలి ! ఝుంఝూహతికిన్ గఱుల్విఱుగుటన్ జీవంబులం బాసితో
ప్రళయాకారపయోదముక్త కరకాపాతంబునం గూలితో 26

గీ. యువతిరో ! నీవు జీవించి యుంటి వేని, యేలరాకుంద వింటికి నింతదాఁక
లేవు గాఁబోలు జగతిలో నీవు బ్రతికి, రావు గాఁబోలు నిఁకఁ గోటరంపుదెసకు 27

ఆ. అలుమగలఁ జేర్చి యాడించి వెండియుఁ, జీలఁ దీయుచుండెఁ గాలపురుషుఁ
డబల ! వీనిడెంద మది యేగతి న్నిల్చెఁ , గనికరంబుపొంతఁ గఱకుఁదనము 28

ఆ. సకలదుఃఖరోగసంపీడితున కింతి, యౌషధం బటన్న నబ్బురంబె
యువిద! నిన్నుఁ గూడి యున్నంతవఱకు నే, యాపదల నెఱుంగఁ డయ్యె నిఁతడు 29

సీ. శబ్దార్థములభంగిఁ జంద్రికాచంద్రుల, ట్లన్యోన్యమైత్రి నొప్పారుచున్న
మనకాఁపురంబుఁ గన్గొనినంత విధి కెంత, కన్నుగుట్టెనొ జగత్కంటకునకు
నడవిమేఁతల మేసి పడియనీళులఁ ద్రావి, పరులపొమ్మున కాసపడక యొరుల
కొకకీడుఁజేతయు నొనరింపక మెలంగు, మనజీవనము దైవమున క దెంత

గీ. భారమయ్యెనొ పాపంబు పండె నిట్లు, విధివిధానంబు నెదిరించువిధము గలదె
కటకటా ! నేఁటి కెట్టిసంకటము వచ్చె, నెట్లు దీని భరింతు ది క్కెవ్వ రబల! 30

క. అఱలేని కూర్మిపేర్మిం, బొర పొచ్చెము లేనిదెందముం జూపి ననుం
గరము నలరించితి గదా, గరితా ! నిన్నెట్లు మఱవఁ గలవాఁడ నిఁకన్ 31

శా. నీమందస్మిత సుందరాస్యతలమున్, నీ నిగ్గులన్ జగ్గులన్
నీమైమవ్వము నీకనుంగవపసన్, నీ నెన్నడల్ – సొంపులన్
నీమర్యాదల నీమృదూక్తులను నీ నెయ్యంబు నీతియ్యమున్
భామా నే నెట్లు విస్మరింతుఁ జెపుమా !, ప్రాణంబుతో నుండఁగన్ 32

మ. సకియా ! మాపటివేళ ని న్గలసి కృష్ణావీచికాశీకర
ప్రక రాసేచిత నవ్యదివ్యసికతాభాగంబునన్ జేరి వా
తకుమారంబులు గంధబంధురము లాత్మప్రీతిఁ గావింప వే
డుకమై గొండిలిసల్పు నే సయిఁచు టెట్లో! నీవియోగవ్యథన్ 33

గీ. అతివ ! నీ విచ్చు మేఁతల నారగించి, నీమృదులపాణివల్ల వానీత పూత
సలిలముం గ్రోలి సంతోషజలధిఁ దేలు, భాగ్య మున్నదె నీమనఃపతికి నిఁకను 34

గీ. కలిమిలేములలోన భాగంబు గొనుచు, మంచిచెడ్డలలోనఁ బాల్పంచుకొనుచు
మెలఁగునర్ధాంగి దూరమై తొలఁగె నేని, మగని కాధార మెవ్వ రోమగువ ! చెపుమ 35

గ. ఓవనిత ! సకలసౌఖ్య, శ్రీవిరహిత మైన తుచ్ఛజీవిత మిఁక నే
లా వెల్లువలోఁ బడి నా, జీవంబుల విడుతు నెల్లచింతలఁ గడతున్ 36

వ. ఇట్లు పెద్దవగచు మగపావురంబు విలాపంబు, లబ్బోయవలఁ జిక్కికుములుచున్న
కపోతి విని 37

సీ. ధన్య నైతిని జగన్మాన్య నైతిని మహా, పుణ్య నైతిని సతీగణ్య నైతి
నాధుఁ దస్మద్వర్తనంబు నెంతయు మెచ్చి, ప్రకటించె నిర్మల ప్రణయగరిమ
నాయీయెడాటంబునకుఁ బొరింబొరిఁ గుంది, జోరున వేఁడికన్నీరు రాల్చె
మగనినెమ్మదికి నిమ్మాడ్కి నెక్కుటయ కా, కులకాంత సతతంబుఁ గోరుచుండు

గీ. నింక వలసిన దేమి నా ; కీభవంబు, సార్థకత చెందె దుర్గతిప్రాప్తి దప్పెఁ
బాపము లడంగె నోములపంట పండె, ననుచు మదిఁ బొంగి మగని కిట్లనఁ దొడంగె 38

ఉ. ఏల దురంతచింత నిటు లేద్చెద వో హృదయేశ ! నేఁడు దు
ష్కాలము దాపురింపఁ దొలు కర్మము నన్నొకబోయవాగురన్
గూలఁబడంగ వైవ నిటఁ గుందుచు నుంటి భవత్పదాబ్జముల్
వాలినభక్తిఁ గొల్చువిభవం బఖిలంబును దూరమైచనన్ . 39

క. ఒచ్చెంబు నెఱుంగక మన, మిచ్చో దంపతుల మై రహించితి మిన్నా
ళ్లచ్చెరు వగు సంసృతిఁ గన, విచ్చుచునున్నార మిప్డు విధియోగమునన్ 40

క. ఊగుండెదానఁ గానన్, వాగురలోఁ జిక్కి గాలివాన కలసి నీ
యోగంబు నెడసియు నసు, త్యాగం బొనరింపనైతి ననురాగనిధీ ! 41

గీ. ఉసుఱులు దొలంగ సిద్ధమై యున్నవేళఁ, దలఁపనితలంపుగా భవద్దర్శనంబు
నాకుఁ గల్గించినట్టి ప్రేమైకమూర్తి, కార్తజనబాంధవునకు జోహా రొనర్తు 42

గీ. ఎడతెగక మనదాంపత్య మింతవఱకు, నెన్నిపుట్టువులం దరియించెనొక్కొ
జీవితేశ్వర ! యిది యవిచ్ఛిన్నమగుచు, నెల్లకాలంబు నిట్లు భాసిల్లుఁ గాత! 43

క. నీకొఱకు నిరీక్షించుచు, నాకమ్మున నీదుచింతనము సేయుచు నె
ట్లో కాలము గడపెద నిట, నాకొఱ కోనాథ ! మనమునం గుందకుమా 44

గీ. నీకనులుగార్చు వెచ్చనినీటిసోన, కాల్చుచున్నది మన్మనఃకందరంబు
నేమి సేయుదు శోకంబు నెడసి మధుర, వాగమృతవృష్టి ననుఁ దన్పవా మనోజ్ఞ ! 45

క. ఆఁదుపులుం గిట్లనునెడ, గూఁదు న్విదనాడి వెఱఁగుఁ గొందలము నెదన్
జోడై కలంపఁ దలిరుం, బోఁడికడకుఁ బోతుపిట్ట బోరనవచ్చెన్ 46

వ. వచ్చి యురులం దవిలి యున్నయన్నుం జూచి 47

క. హా! రమణీ! పారావత, హారమణీ! నన్ను విడిచి యమరీప్రియ మం
దారోద్యానవనీ సం, చారంబును గోరి వెడలఁ జనునే నీకున్ 48

గీ. కటకటా! నేఁటికెట్టి దుర్ఘటన వొదమె, వనిత! యీకాలపాశంబువలన నిపుదు
నిన్ను విడిపించు వెరవు గన్పింపదయ్యె, నేఁటితోఁ దీఱునే పొత్తు నీకు నాకు 49

క. వీసంబును లాఁతులయెడ, దోసంబుఁ దలంపనట్టితోయలి వకటా!
నీసాధుచరిత కిది ఫల, మా సుదతీ ! దైవ మెంత కైనం దగదే 50

చ. ఒకపరి నిన్ను నన్ మృగయుఁ డొడ్డినవాగురలోనఁ గూలఁద్రో
యక నిను నొంటిఁగా వలకు నప్పనచేసి దయావిహీనతం
బకపక నవ్వుచున్ మన విపత్తులఁ జూచుచు గేలిసేయు న
ట్టి కటటిదైవ మెంతవికటీకృతశీలమహెూ ! మహెూనిధీ ! 51

క. వలలన్న జిగురులన్నన్, దెలివిమెయిం దిరుగుచుందు తెఱవా !యిపు డెం
దులకేగె నీవివేకము, కలయ న్నీకనుల మబ్బుగ్రమ్మెనె చెపుమా 52

గీ. గాటపుంగానఁ బయనించు బాటసారి, యాతపార్తిఁ దరుచ్ఛాయ నాశ్రయించె
వానసాగుడు నొకలోయలోనఁ దూఱెఁ, దుదకు నిర్ఘాతమ యడంచె బ్రదుకుటెట్లు 53

సీ. ఈమహాజలరాశిలో మునింగినవేళఁ, దెప్ప వై హర్షాబ్ధిఁ దేల్చితి గద
యీగాఢతిమిరంబు మూఁగి ముట్టినవేళ , దీపంబ వై తెన్ను సూపితి గద
యీదారి కర్దమం బెనసి యుండినవేళఁ, గోలవైనడిపింపఁ జాలితి గద
యీమహెూన్నతశైల మెదురువచ్చిన వేళ, గగనయానంబ వై కాచితి గద

గీ. నీసహాయత లేక నాచేసినట్టి, గట్టికర్జ మొకండేనిఁ గానఁబడునె
యఖిలమునకు నాధారంబ వైతి వీవు, వెలఁది! నిన్బాసి యెట్లుజీవింప నేర్తు 54

వ. అని చింతించుమగనిం గని కపోతి 55

సీ. హృదయేశ ! నిఖిలార్థవిదులు నాఁదగుమీర, లీరీతి వగగొన్న నేమిఫలము
దైవనియోగంబు దలఁగ బ్రహ్మేంద్రాదు, లగువేల్పులకు నైన నయితి యగునె
కఱకరిదైవంబు తెఱచిన దుఃఖమన్, వాకిలి ధైర్యకవాట మొత్తి
మూయంగవలెఁగదా ! బుధులు శోకహతంబు, లోకం బటంచుఁ బల్కుదురు వినవె

గీ. యిల మెలంగుశరీరధారులకు నెల్ల, జననమరణంబు లన్న నైసర్గికములు
కసిమసంగినమిత్తి గండెసఁగ నడఁచి, యెల్లకాలంబు నొకమేన నెవ్వ రుంద్రు 56

గీ. జీవులను సృష్టిగావించుశిల్పియెవఁడొ, ప్రాణులను గూర్మిఁ గాపాడుభర్త యెవఁడొ
వాఁడ వెండియుఁ గూల్చు విశ్వంబునెల్ల,నతని కిది నిత్యలీలావిహారసరణి 57

క. ఈలతయు నీకుజంబును, మేలుగఁ గొన్నాళ్లు కలిసి మెలసి మరలఁ బె
న్గాలికి విడివడుచుండుఁ గ, దా ! లోకం బెల్ల నివ్విధమునన సాగున్ 58

గీ. ఆపదలు కల్గువేళఁ గట్టా ! యటంద్రు, సుఖము లొనగూడువేళ మెచ్చుకొనుచుంద్రు
కానియెవరేనిఁ గష్టసుఖాలపట్లఁ, గడఁగి స్వాతంత్ర్యముం జూపఁగలరె చెపుమ 59

ఉ. కావున నీవు నాకొఱ కిఁక న్విలపించుట నిష్ఫలంబ నా
జీవములం దపేక్ష విడి, చిత్తమునం దగుశాంతిఁ బూని నీ
జీవనశేషమున్ విబుధ శేఖరు లెంతయు మెచ్చ ధర్మసం
సేవనబుద్ధిమైఁ గడవఁ, జేయుము కోయుము మోహబంధమున్ 60

ఉ ఆన నడంపు మోర్మిఁగొను, మార్యపథంబును ద్రొక్కు నిక్కపుం
బాసలువల్కు శాత్రవుల పైనయినం బెరిమంబ నిల్పు సం
త్రాసముగొన్న దీనుల సదా కరుణింపు మనంబు బెంపు మే
దోసము నాచరింపక బుధుల్-నుతి గాంచుము జీవితేశ్వరా ! 61

చ. శరణ మటన్నవాఁడు నిజ శాత్రవుఁ డైనను వాని నెంతయుం
గరుణ దలిర్పఁ బ్రోచుటయ కర్జము నుత్తమధర్మ మంచు స
త్పురుషులు పల్కుచుందు రిది బుద్ధిఁదలంచి కిరాతు వీని నా
దరమునఁ జూడవయ్య ! చలి తాఁకున కెంతయు దల్లడిల్లెడిన్ 62

క మనయండఁ జేరినవిప, న్ననకుం దోడ్పడెడినోము నోఁచనికతనన్
దన కిట్లు లయ్యె నీ వై, న నీతనికి సాయపడు మనాథుం డగుటన్ 63

ఆ. మగఁడు నేఁడు రాక మసలె నదే మొకో, దైవమా ! యటంచుఁ దల్లడిల్లి
యొఱుకునింతి యింట నె ట్లేడ్చుచున్నదో, జాలిగొల్పు వీనిచరిత మకట ! 64

క. విను మిల్లుత్రొక్కుకొని వ, చ్చిన యతిథికి శక్తికొలఁదిఁ జేయందగు మే
లనఘా ! నిరాశతోడం, జను టొప్ప దతండు ధర్మసార మిది గదా! 65

క. అతిథుల నభ్యాగతులన్, గుతుకంబునఁ బూజసేయుగుణ మీకర్మ
క్షితిఁ బుట్టినట్టివారికి, మతి నూహింపఁగ నవీనమా హృదయేశా ! 66

శా. ఆపత్సాగరవీచికాహతులచే, నల్లాడి యల్లాడి ప్రా
ణాపాయంబునకున్ దలంకి శరణంబం చేడ్చెడిన్ వీఁడయో
లోపంబుల్ గణియింప కీతనిఁ గృపాలోకంబులం జూచి నీ
వాపద్బాంధవుఁ డన్నకీర్తిఁ గొనవయ్యా ! ఖేచరగ్రామణీ ! 67

ఆ. భేదబుద్ధి విడచి విశ్వ మీశ్వరకళా, దర్పణం బటంచుఁ దలఁచి భగవ
దర్పణంబు గాఁగ నఖిలధర్మంబులు, సలుప కున్న ముక్తి కలదె చెపుమ 68

క. దీనుల మొఱ లాలింపని, వానిబలంబును ధనంబు వంశమును వి
జ్ఞానంబు జీవితంబు ద, యానిధి ! వ్యర్థంబు లగుఁ గదా పరికింపన్ 69

క. తనమానముఁ దనప్రాణముఁ, దనవిత్తముఁ దనబలంబుఁ దన సర్వస్వం
బును విశ్వశ్వశ్రేయస, మున కప్పనసేయువాఁడె ముక్తుఁడు సుమతీ! 70

శా. లోకంబ నేను నేనే లోకంబ నటంచు నాత్మలో నెంచిన సు
శ్లోకునకు నిందు నందున్ జేకూరు నఖండహర్ష చిరసౌఖ్యంబుల్
సమదృష్టి లేమి సంకుచితము లగుభావంబులకు నిదానంబు గదా
సుమహితచరిత్ర! విను సం, ఘమున కధఃపతనపీడ కల్గును దానన్ 71

క. పరమేశ్వరగురు తేజః, పరిపూరితమై వెలుంగుప్రకృతిని వికృతిం
బొరయని చిత్తంబున నీ, శ్వరతుల్య మటంచుఁ గొల్వవలయు మహాత్మా ! 72

వ. ఇట్లు ధర్మోపన్యాసము నొసంగిన 73

చ. విని మగపుల్గు విశ్రుతవివేకముఁగాంచి కపోతి మెచ్చి నె
మ్మనమున ధర్మతత్త్వసువిమర్శనముం బొనరించి కామినీ
జనధనపుత్రబంధుభటసౌఖ్యము లెంతయుఁ జంచలంబు లం
చు నెఱిఁగి సంసృతిం దెగడి శోకభయంబులఁ బాసి వెండియున్ 74

క. జీవుఁ డొడలిం దొఱంగెడి, చో వెంటం దోడువచ్చుచుట్టంబు మదిన్
భావింప ధర్మువ కదా, నీవాఁడనటం చెవండు నెయ్యము సూపున్ 75

వ. అని విచారించి సంచలించునంగంబులం గుందు కిరాతు దెనఁ బ్రసాదభాసురం బ
గు నపాంగావలోకనంబుం బఱపి మృదుమధురకంఠస్వరంబున మానుషభాషణంబు
లొలయ వాని కిట్లనియె 76

శా. అయ్యా ! తొల్లిటపున్నెపుంబలిమి నీ కాతిథ్యమున్ జల్పి నా
నెయ్యంబున్ బ్రకటించుభాగ్య మొదవెన్, నేఁడీగతి; న్నీ విఁకన్
దయ్యంగాఁ బనిలేదు నీదగు నభీష్టం బెద్దియో చెప్పితే
నియ్యల్పుం దనువైన సాయమును దా నింపారఁ గావించెడిన్ 77

క. మానవునకుఁ బులుఁగే చం, దానన్ తోడ్పడు నటంచుఁ దర్కింపకుమీ
మానవ మృగ ఖగ నగ మయ, మైనజగం బెల్ల నీశ్వరాంశంబ కదా ! 78

గీ. ఈశ్వరునిశక్తి నాయందు నింతొ యంతొ , కలదుసు మ్మట్లగుట నిట్లు పలుకు టౌదవె
వెండియున్ భారతోర్విలో వెలయుశిలయు, నతిథిపూజాపరాయణం బగుట వినవె 79

క. జాతి మత కుల గుణాదుల, నీతతి నరయం బ నేమి యెవ్వని కైనన్
జేత నగుమేలు సల్పుట, పాతకహరణంబు చువ్వె పరికింపంగన్ 80

ఉ నావుడు నక్కిరాతుఁడు మనంబున నెంతయు సంతసించి యో
హో! వెఱఁ గయ్యెడిన్ ఖగకులోత్తమ! నీనుడి విన్నఁ; బాపపుం
ద్రోవలఁ ద్రొక్కి మిమ్మెపుడుఁ, ద్రుంచుదురాత్ముని నన్ను నిట్లు సం
భావనచేసి మంతె ! తగు భంగి నినుం గొనియాడ నేర్తునే 81

క. జడివానం దడిసితిఁ జలి, గడగడ వడఁకించుచుండెఁ గాయం బకటా!
ముడుచుకొనిపోయె నియ్యది, విడివడున ట్లాచరింపవే ! వెర వున్నన్ 82

క. నీ వీసాయ మొనర్చిన, జీవించెద నిప్పు; డట్లు సిద్ధింపనిచోఁ
బావనగుణాఢ్య ! నాకుం, జావది తప్పక ఘటిల్లు క్షణకాలమునన్ 83

వ అని ప్రార్థించుటయు నక్కపోతరాజంబు వానికిఁదగు ధైర్యంబు చెప్పి
"యిదెవచ్చెదనుండుమన్నా !" యని 84

ఉ. చట్టుప లట్టె విప్పి రభసంబు భృశం బొనరించి చెట్టులన్
గుట్టల దాఁటి తుట్టతుదకున్ నది కవ్వలిచక్కి నున్న పెన్
పట్టణ మొందు సేరి వెలిపట్టున గిట్టినచెట్టు మింటికిం
దొట్టి వెలుంగుచుండఁ గని తోడన వాలెఁ దదంతికంబునన్ 85

క వాలినవేడుక నచటన్, వ్రాలి తుది న్మండు నింధనమ్మును నాసన్
గీలించి యార్తరక్షా, లాలస నేతెంచెఁ దనకులాయమ్మునకున్ 86

క. ఎందుంజిదుగుల నీటన్, నిండిన వనసీమఁ బడయ నేరక వెర వా
క్కొందును దోఁపమి భగవం, తుండా! యిపు డేమి సేయుదు నటంచు మదిన్ 87

వ కొంతతడవు వితర్కించి తుట్టతుద కోహో! పొరపడితి-నెట్టయెదుట నున్నగూఁటి
న్మఱచి యెందుఁ బుల్లలకు నల్లాడునావెటి నేమనవచ్చు- నార్తరక్షణంబునకంటె
నిక్కులాయంబు నా కెక్కుడే -వలయునే నిట్టిగూఁడులఁ బెక్కింటి నొక్క దినంబునన
నిర్మింప నేర్తు-నని తలంచి నీడముం దొట్టినుండిక్రిందికి నెట్టి యందు మెత్తగా
నమర్చినచెత్తం దాఁదెచ్చినకొఱవి నిడి యూఁది మంటచేసి దానిం
గులాయేంధనములఁ గడుంగడు నదరించి కిరాతుఁ గాంచి 88

క. అన్నా! దురంతశీతా, పన్నుఁడవై నీవు వగవఁ బని లేదిదె మం
ట న్నిగిడించితి లెమ్మిఁకఁ, గ్రన్నన చలిఁ బాపుకొమ్ము గడగడ లడఁగన్ 89

క. అనిన విని పుల్గుపల్కులు, తనదెందంబునకు నవసుధాధారా పా
తనిభంబు లగుడు బోయం, దనూనహర్షమున ముగ్గి యల్లన లేచెన్ 90

క. అహహో రవంబు లిహిహీ , యుహుహూ నాదములు సెలఁగ నొద లున్నతి నం
ద హుతాశనకీలలఁ బా, దహస్తములఁ గాఁచికొనె నతం దుత్సుకుఁడై 91

క. వెచ్చపడె నొడలు సీతువు, విచ్చె సమస్తాంగకములు విడివడె మోదం
బెచ్చెఁ గిరాతున కత్తఱి, నచ్చపుదెందమునఁ బుల్గు నాతఁడు మెచ్చెవ 92

క. పావుర మపు డిట్లనె న, య్యా ! పొగడం దగినవాఁడనా నే; నస్మత్
ప్రావీణ్య మెంత సెపుమా, నావిధి నేఁ జేయకున్న నవ్వరె గఱువల్ 93

క. ఓయన్న! చలి యడంగెనె, నీయంగము స్వాస్థ్యముం గనియెనే హర్ష
శ్రీయుతుఁడ వైతె నా కిఁక, నేయానతి నిత్తు వేగ నెఱిఁగింపఁగదే 94

వ. అనుటయుం గిరాతుఁడు వినయావనతమస్తకుఁడై 95

క. ఏగతి నీఋణభారం, బీఁగెదనో సదుపకార మిట్లు సలిపి నా
యీగండముఁ దప్పించితి, నీగొప్పతనంబు నెన్న నేరఁ బతత్రీ ! 96

క. ఈచిదుగు లెట్లు వడసితి, వీచిచ్చెటు లబ్ధమయ్యె నిందుల కై నీ
వేచిక్కులఁజిక్కితివో, నీచాత్మకు నివ్విధిన్ గణింతువె నన్నున్ 97

క. జ్ఞానము నుపకారేచ్ఛయు, మానవగణమంద కాదు మఱియును ఖగసం
తానమునందుం గల వని, నేనెఱిఁగితి నేఁడు భవదనింద్య చరిత్రన్ 98

క. కొంగరవోయిన నా స, ర్వాంగంబులు తిన్నపడియె నలజడి యడఁగెన్
భంగంబు నందె సీతు విఁ, కం గోరికి నా కొకందు గలదు ఖగంబా ! 99

క. నీకొలఁది యే నెఱింగియు, నాకక్కుఱితిం దలంచి నయభూషణ ! ని
న్నీకోర్కి కోరఁ దొడఁగితి, నేకరణిన్ దీనిఁ దీర్చి కృపఁ జూపెదవో 100

గీ. అనిన నక్కపోత మబ్బోయ కిట్లను, నేల సంశయింప నెఱుకుమిన్న !
యెద్ది నీయభీష్ట మెఱిగింపు మద్దానిఁ, దీర్తు నిపుడ పొసఁగు తెరువ యున్న 101

వ. అనుటయు నతండు పారావతంబునకు 102

ఉ. వందన మాచరించి శ్రితవత్సల ! యేమని విన్నవింతు మ
త్తుందమునం దమందగతితోఁ జెలరేఁగె క్షుధానలంబు దీ
నిం దగురీతి నార్పి కరుణింపుము పెంపుము నీయశంబు నే
మందును మేర కన్పడద యాసకు నెన్నివిధాలఁ జూచినన్ 103

గీ. రవి నభోమధ్యసీమకు రాకమున్న, వేఁట నుడిగి తొల్లిటియట్ల వెడలఁ దలఁచి
కుదువకయ వచ్చితిం జల్దికూటి నైనఁ, గడకు నాకోర్కి తీవ లిక్కరణిఁ దెగియె 104

క. "తా నొకరీతిం దలఁచిన, మానక దైవంబు వేఱుమార్గము ద్రొక్కున్
దీని నెఱుంగుఁ" డటంచు సు, ధీనిధు లనుపల్కు గుణనిధీ ! వృథ యగునే 105

క. ఆదరమేదురబుద్ధిన్, నాదీపము వెలుఁగఁజేసినాఁడ విపుదు నీ
వో దీనావన ! దీనింబ్రోదియొనర్పఁగదె యాఱిపోవక యుండన్ 106

క. అనవుడు నద్దీనుని మొఱ, విని గుండె గుభాలు మనఁగ విహగము ధైర్యం
బును గోల్పడి గద్గద ని, స్వనమున నీరీతిఁ బల్కె శబరునితోడన్ 107

క. మాకూడును మాగుడ్డయు, మాకలిమియు మా కొలంబు మరియాద లయో
నీకెఱుకలేక యున్నవె, యీకోరికి నెట్లుతీర్తు నిత్తఱి నతిథీ ! 108

క. ఏయెడఁ జిక్కినమేఁతల, నాయెడఁ గబళించి యచ్చటనచ్చట మడుఁగుం
దోయములఁ ద్రావి గూఁటికి, హాయిగ నేతెంచుఁ గద విహంగము లెపుడున్ 109

క. ఏపూఁటకూటివిషయం, బాపూఁటన తలఁచుఁ గాని "యవ్వలిపూఁటన్
లోపంబు లేక గడపుట, యే పగిది" నటంచుఁ బుల్గు లెంచునె చెపుమా 110

క. ఏవేళ యెట్టిదోయని, భావంబున నెంచి గూఁటఁ బట్టెఁదెరన్ జే
కావలి యుంతుమె మే; మ, ప్పా ! వినవో పక్షిజాతి బండారంబున్ 111

క. తాఁ దిన "దేహి" యటం చను, పేదకువడ్డింప నతిథిబృందమునం ద
త్యాదరము సూప నెల్లర, కాదరు వై వెలయు నితఁడు హాలికుఁడొక్కే 112

క. ఎండకు వానకు జంకక, పండించినధాన్య మెల్లఁ బాఁతఱలందున్
నిండించి తినుచుఁ బెట్టుచు, నుండెడి కర్షకుఁడె ధన్యుఁదూహింపంగన్ 113

క. అయ్యయిమ్రాఁకులకుం జని, తియ్యనిపండులను ద్రుంచి తెచ్చుట కకటా!
యియ్యది జడికారు కదా, యెయ్యది కర్తవ్య మిప్పు డెఱిఁగింప వయా 114

క. ఏదారిఁ ద్రొక్కి యైనన్, నీదుబుభుక్షానివృత్తి నెఱపనిచో నన్
గా దంచు నిందసేయ రొ, కో ధర్మాధర్మవిదు లకుంఠితరీతిన్ 115

చ. కలరవరాజ మిట్టులు మొగంబున దైన్యము తోఁప నాఁకటన్
మలమల మాఁడుచున్న కసుమాలపుబోయకు విన్నవించి తాఁ,
దలఁపున నివ్విధిం దలఁచె, దైవమ! యేవగ నీవిపన్నునాఁ
కలి దొలఁగింప నేర్తుఁదగు కర్జ మిఁ కెయ్యది పూని సేయఁగన్ 116

గీ. ఇట్టలం బగునాఁకట నిల్లుసేరు, నతిథికిం దగునన్నపానాదు లొసఁగి
లేశ మేనియు మేల్సేయలేనియనద, బ్రదిమి యేటికిఁ బుడమికి బరువుచేటు 117

చ. అతిథుల నాదరించి శరణార్థులభీతిఁ దొలంచి దీనసం
తతిఁ గరుణించి బాంధవజనంబులఁ బెంచి రహించువాని దౌ
బ్రతుకు భవంబు వంశమునుభాగ్యము భోగము యోగమున్ జగత్
త్రితయము మెచ్చు వానిన వరించుఁ గదా యపవర్గలక్ష్మియున్ 118

క. గూఁట నెర లేదు వే ఱొక, చోటికిఁ జని దానిఁ దేరఁ జొప్పడ దంచున్
గూటి కిటు దేవురించు వ, నాటు హతాశుని బొనర్చు టనుచితము గదా 119

క. కావునఁ దప్పక వీనికి, నీవలె నాహార మిప్పు డిందులకై యే
నావంతయుఁ జింతింప క, నావిలభావంబుతో మదంగము నిత్తున్ 120

ఉ. ఉర్విని బెక్కునాళు లిటు, లున్నను గల్గు ఫలం బదేమి సీ
చర్వితచర్వణంబ కద, సంసృతి? మిత్తియు వెంట నంటి తా
గర్వము మీఱ మ్రింగుటకుఁ గాచియ యున్నది భీకరాస్యమున్
సర్వము విప్పి; రేపయినఁ, జావున కొల్లక దాఁగ వచ్చునే 121

క. మలభూయిష్ఠం బతిచం, చల మగుమేనన్ బవిత్ర శాశ్వతతమ కీ
ర్తి లభించు నింతకంటెను, గలదే లాభంబు చక్కఁగా దలపోయన్ 122

క. పరహితమున కెవ్వఁడు తన, శరీర మర్పించు నతఁడె శాశ్వతలోక
స్థిరవాసి యంచు ధార్మిక, శిరోమణులు సెప్పరే విశిష్టచరిత్రుల్ 123

వ. ఇట్లు నిశ్చయించి తనప్రాణప్రయాణ సన్నాహంబు
నర్ధాంగికి దెలుప నెంచి వాగురాబద్ధయై తన మొగ
మ్మునంద చూడ్కి నిలిపి యున్న యిల్లాలిం జూచి 124

ఉ. ప్రేయసి ! బోయవాంఛితము వింటివె సీతు వదంపఁ గూటికిం
దోయిలిసాఁచె వీఁ డితనిదుర్భరపుం గొదఁ దీర్ప గూఁటియం
దేయశనంబు లేదు గద ! యింటికి వచ్చినవిందు నిస్పృహన్
బోయిన సర్వపుణ్యములుఁ బోవక నిల్చు నొకో తలంపఁగన్ 125

గీ. అట్లగుట నిక్కిరాతునాహారమునకు, నప్పన మొనర్తు నాదు హేయంపుఁదనువు
వగవకుము నావియోగంబు వగచి వగచి, పరమధర్మజ్ఞ ! నీకుఁ జెప్పం బనేమి 126

క. ఓవనిత! బోయచే నీ, వేవిధమున నేని సమసె దిపుడో రేపో
కావున నా వెనువెంటన, నీవును రాఁగలవు నీకు నెగు లిం కేలా 127

గీ. అస్మదక్షిద్వయీగళితాశ్రుకణము, లబల ! నీ కెతిఁగించు నాయరుగుసరణి
లలితశౌ క్తిక ముక్తాఫలంబులట్లు, చెలువుగుల్కుచు లేఁతపచ్చిక బయళ్ళ 128

వ అనిన నప్పెంటిగువ్వ దుస్సహ దురంత దుర్దాంత భర్తృ మరణ వృత్తాంతంబు
నాలించి వెనువెంటన 129

క. అతిదుఃఖప్రభవంబును, బ్రతిబద్ధేంద్రియము నగుచుఁ బర్విన మూర్ఛన్
బతిమరణంబుం జూడక, స్మృతిచెడివడియెన్ గృతోపకృతిచందమునన్ 130

వ అంత నమ్మగపావురం బిదియ యద నని తలంచి యతిథిం బొడగాంచి 131

శా. అన్నా ! తోఁచె నుపాయ మొండు భవదీయక్షుద్వ్యథన్ దీర్ప ; నిం
క న్నీ వించుకయుం దలంకకుము నా కాయంబు నర్పింఛి యా
పన్నున్ ని న్నలరింప నెంచితిఁ గృపా భావంబున్ దీనిఁ గొ
మ్మెన్నండే నిటువంటివంటకము నీ కేరే సమర్పించిరే 132

వ అని పల్కి 133

చ. తడయక మందునగ్గికిఁ బ్రదక్షిణపూర్వకమైనవందనం
బిడి భవబంధము లైగ నొకించుక జంకును గొంకు లేక న
ల్గడయును దేఱిచూచి విహ గంబు గుభాలున మంటలోపలం
బడె వనవృక్షకోటి హిమబాష్పకణంబులు విజ్జురాల్పఁగన్ 134

క. సర్వవలయాబ్జభవ కం, దర్పగురుప్రముఖదేవతాగణ మబ్రం
బేర్పడ మెచ్చ ఖగం బా, త్మార్పణ మొనరించె నిట్టు లతిథికి నదిరా ! 135

గీ అగ్గిలో నివ్విధిన్ బ్రెుగ్గి మగ్గుచున్న, పుల్గుఁ బొడగాంచి విస్మయంబున మునింగి
నిట్టనిలుచుండి బోయ నిర్నిమిషదృష్టిఁ, జేష్టలం దక్కి యొక్కింతసేపు గడపి 136

ఉ ఇమ్మెయి సాహసంబు గల, దేవిలసత్కరుణారసార్ద్ర చి
త్తమ్మున ని ట్లొసంగునె పతంగము స్వాంగ; మహెూ ! విహంగసం
ఘమ్మున దీని కీ డగు ఖగంబు జగంబున నున్నదొక్కొ ని
క్కమ్ముగ నొక్క వేలు పగుఁ గాక కపోత మనంగఁ జెల్లునే 137

గీ. కటకటా! జ్వలదగ్నిశిఖాకలాప, మెగసి తనకోమలాంగంబు నేర్చుచుండ
నెట్లు సైరించె నాబాధ నీపులుంగు, కొఱలునావేశమున మేను మఱచె నోటు 138

ఉ. అగ్గల మైనసీతువున నంగము కొంగరవోవ మృత్యువున్
దగ్గఱి యున్న న న్గని హుటాహుటిఁ బల్లెకు నేగి ముక్కుతో
నగ్గిని దెచ్చి కోటరము నందలి గూఁటిని గాల్చి నాచలిన్
దగ్గనొనర్చి కూర్చెను గదా! ముద మియ్యది నాకు ముందరన్ 139

క. కట్టా! దీనం దనియక, పెట్టుము నా కన్న మనుచుఁ బీడించితి లేఁ
బిట్టన్ దుట్టతుదకు నా, పొట్టం బెట్టుకొని నీచపుంగతిఁ గంటిన్ 140

గీ. లోక మీకరణిం బ్రాణిలోకమునకు, మేలు గావించుచుండుఁ గాఁబోలు సతము
పుట్టువుం దొట్టి యుపకృతిపొంతఁ బోని, కట్టిఁడిని నేను నాకెట్టిగతులు గలవొ 141

క. భగవంతుఁడు న న్నేటికి, జగమునఁ బుట్టించె నాదుజన్మంబునకున్
దగుఫల మెయ్యది యని లో, వగవక నాజీవనమ్ము వ మ్మొనరిచితిన్ 142

గీ. ధర్మశాస్త్రజ్ఞు లెల్ల రెద్దానిఁ బరమ, పాతకనిదాన మిది యని పల్కుచుందు
రట్టిహింసయ నావ్రతం బయ్యె నెపుడు, నకట! నాపాప మేనాఁటి కడఁగిపోవు 143

వ. పొదుగుశుకాంగనన్ జదిపి బుట్టను బెట్టితిఁ దల్లిదండ్రులన్
వదలనిగోరువంక మెడ వంచితిఁ, ద్రుంచితిఁ గుంజసీమలన్
బొదలు కపోతదంపతులఁ బొంగుచు నేసితిఁ జూఁడిమోపునన్
గదలని లేడిపిండుఁ బెఱ కల్మషముల్ దడవంగ నేటికిన్ 144

క. శాకాదుల మెసవి యసం, ఖ్యాకము లగుభూతములు సుఖస్థితిమై నీ
లోకమున లేవొకో యవి, వేకమ్మున నేన యిట్టివెంగలి నైతిన్ 145

క. ఉత్తమమానవజన్మం, బెత్తియు నేఁ జెడితి జ్ఞానహీనుఁడ నై; లో
కోత్తరచరిత్రఁ బుల్గు బు, ధోత్తంసస్తోత్రమునకు యోగ్యం బయ్యెన్ 146

గీ. స్వార్థమును వీడనాడి పరార్థమునకు, నర్థమును మానమును మేని నప్పగించు
పుణ్యమూర్తి చరిత్రంబపో సమస్త, జగతి కాదర్శమై సుప్రశస్తిఁ గాంచు 147

గీ. మంజులంబుగఁ బెక్కుధర్మములు పల్కి, చేఁతలం దొకఁడే ననుష్ఠింపలేని
వదరుఁబోతుల కిఁక సిగ్గువచ్చుఁ గాత, మేతదల్పకపోతవిఖ్యాతచరిత 148

క. క్షుద్రుఁడనై గాఢతమో, నిద్రారతి నున్న నన్ను నిర్వ్యాజకృపా
ముద్రితహృదయంబునఁ గడు, భద్రంబుగ మేలుకొల్పెఁ బక్షి గురుండై 149

క. తగుబుద్ధి సెప్పెఁబావుర,మిఁగ మానెద జీవహింస నెడఁబాసెద నీ
చగుణంబులఁ గామంబులఁ, దెగటార్చెద విడుతు సంసృతిన్ బాపగతిన్ 150

క. గురువుల సేవించెద నీ, శ్వరతత్త్వ మెఱింగెదన్ భవంబులఁ ద్రుంతున్
నిరుపమ నిరుపద్రవ సు, స్థిరతర కైవల్యసౌఖ్యసిద్ధి రహింతున్ 151

వ. అని పెక్కుభంగుల విచారించి యంతరంగంబునఁ బొంగిపొరలు వైరాగ్యభాగ్యంబునం జేసి హింసావృత్తమ్ము నెడఁబాసి తుచ్ఛంబు లగువిషయోపభోగంబుల రోసి తురీయ పురుషార్థంబునంద డెందంబు పదిలపఱిచి యుండె నయ్యవసరంబున 152

గీ. వలఁజిక్కి యున్న పుల్గులు, చలిగాలికి నదలి తాళఁజాలక జీవం
బులమీఁదియాస లెల్లం, దొలఁగన్ విలపించుచుండె దుర్భరచింతన్ 153

క. ఆయార్తనాదములు విని, బోయం డెద మివుల జాలి పొంగారఁగ నా
రాయణ! నారాయణ! నా, రాయణ! నాపాప మెక్కరణి రూపడఁగున్ 154

వ. అనుచు నవ్వలం గదిసి, 155

చ. మొలఁ గల కత్తిదీసి వలముక్కలుముక్కలు చేసి యుచ్చులన్,
బలితము లైనచిక్కములఁబట్టి రయంబునఁ గోసి కాల్వలై
జలజల నశ్రుతోయములు జాల్కొనఁ బుల్గుల నెల్ల నల్లవో!,
వెలలిచె నేఁటి కెంతటి వివేకము గల్గెఁ గసాయిబోయకున్ 156

వ. అంత నతండు తన కొదవినయెఱుకబలిమిం బార లౌకిక చింతాసాగరనిమగ్నుండయి యంద నిలువంబడి యుండెఁ - బదంపడి బంధవిముక్తిం గనిన విహగంబులు మెల్లమెల్లన ఱెక్కల నల్లార్చుచుఁ బరిసరతరుశాఖల నధిరోహించెఁ - బిదప మూర్ఛామగ్నయైు యొడ లెఱుంగక పడియున్న కపోతి యప్పుడ మేల్కొని యున్మిషితలోచనయై నలువలంకులఁ గలయం దిలకించి చెలువునిం గానక 157

క. జీవితనాయక ! నీ వు, న్నావొకొ జీవంబుతోడ; నాతికి యుష్మ
త్పావనరూపముఁ జూపఁ గ, దే ! వల్లభ! యంచు లేచె ధృతి దూరముగన్ 158

గీ. లేచి యనలంబుకడ వ్రాలి చూచె నందు, లీన మగుచున్న మగని సుజ్ఞానఖనిని
జూచినంతనె శోకంబు చుట్టుముట్ట, నిట్టు విలపించెఁ గానయు బిట్టు వగవ 159

క. వల్లభ! వల్లభ ! మంటం, బ్రెల్లితె యీదీనురాలి ది క్కెవ్వరుగా
నుల్లంబునం దలంచితి, చెల్లరె ! నీ కింతకఠినచిత్తము తగునే 160

క. ఇది భవదధీనజీవిత, కద! దీనిని డించి పోవఁగా నకటా! నీ
హృదయ మెటు లియ్యకొనె నా, కెదితెరు విఁకఁ జేయుకార్య మెయ్యది నాథా ! 161

క. నాకడుపు నిండుటకు మును, నీ కుక్షిం జూడ వెపుడు నే నించుక బా
ధాకలిత నైన నోర్వవు, నీకూరిమిపేరిమి న్గణింపఁ దరంబే 162

సీ. లలితలావణ్య పల్లవవితానలతాంత, సముపేతమంజుకుంజములయందు
గ్రావస్రవన్నదీకమలశీకరసిక్త, శీతలాద్రిప్లవశ్రేణులందు
బాలరసాలద్రుజాల కోమలలతా, స్తోమాంచితారామసీమలందు
సుందరవికచారవిందమందిర దీర్ఘి, కా మనోహరతీరభూములందు

గీ. నిరుపమవిశుద్ధహర్షవార్నిధితరంగ, డోలికాపంక్తులందు నూయేల లూఁపి
నన్ను మదిఁ దేల్చినట్టి నీనవ్యలీల, మఱతునే నాథ ! యెన్నిజన్మముల కైన 163

క. పతిమరణానంతర మీ, క్షితి నొక్కనిమేష మేని జీవనయాత్రన్
సతి గడపుట దుస్సాధం, బతిదుష్కర మని యెఱుంగవా హృదయేశా ! 164

గీ. కుసుమకోమలమైన నీగొనబుమేను, వీతిహోత్రున కెట్టు లర్పించి తకట!
యతిథిసేవాపరాయణం బైన నీదు, చిత్త మెంతకుఁ బ్రేరేచె జీవితేశ 165

గీ. నేన నీకంటెమును మరణింతు నంచు, నాకొఱకుఁ గుందితివి గదా నాథ ! నీవు
తుదకు నాకంటెమును నీవ త్రుంగి తకట!, యేగడియ కెద్ది మూఁడునో యెవ్వఁడెఱుఁగు 166

గీ. మూర్ఛయం దున్ననన్నుఁ గన్మొఱఁగి యిదియ, సమయ మని యెంచి క్షణభిన్నసౌహృదుండ
వగచు నన్నిట డించి నీ వమరపురికిఁ, జేరఁ దలఁచితె నీ కిట్టి,చేఁత తగునె? 167

మ. “సుదతీ! నామది నుండె దీ వెపుడు” నం, చున్ మత్ప్రియం బౌట కీ
వెది భాషించితి దానిఁ గైతవముఁగా, నే నిప్పు డూహింతు న
య్యది నాథా ! మెఱమెచ్చు గానియెడ నీ వంగచ్యుతిం జెంద నం
దదె నాదేహ మొకింతభంగము? నహో! తర్కంబులిం కేటికిన్ 168

వ. అని భర్తృమరణనంసజనిత దుఃఖాతిరేకంబునఁ బెక్కు భంగులఁ గొంతతడవు పనవి పనవి పదంబడి యెఱుక తఱచు గల దగుటంజేసి నాకింక నెద్ది కర్తవ్య మని యూహించి తామున్ను విన్న సతీధర్మంబుల సంస్మరించి 169

ఆ. మగని ననుగమించి మరణించునిల్లాలు, పతియుఁ దానుఁ బుణ్యగతుల కేగి
యతులసౌఖ్యపదవి నంది భవంబులఁ, ద్రెంచు నంచు బుధులు దెల్ప విందు 170

వ. కావున జీవితేశ్వరు నెయిదుటయ నాకిపు డవశ్యా,
చరణీయం బని నిశ్చయించి తేని నుద్దేశించి 171

గీ. నీయొడలిలోన సగపాలు నిలిపి బోయ, కప్పన మ్మొనరింతె శేషాంగ మిట్లు
దీనఁ గల్గనె పూర్ణాతిథేయసుకృత, మతిథి కర్థాన్న మిడుట నాయంబె నాథ! 172

క. నీయనుపమవితరణమున, బోయకు నుదయించె సుప్రబోధము దానన్
నాయురులఁద్రెంప నాతఁడు, పోయె దురంతబు నాదు పుణ్యముకతనన్, 173

క. సురుచిరనందనవిహగీ, పరిరంభణములకు నీవు పొల్పుదుటకు ముం
దరుదెంచి నిన్నుఁ గూడెద, నఱ లేనిమనంబుతోడ ననలాధ్వనన్ 174

క. నెలతో వెన్నెల దొలఁగున్, జలదముతో నరుగు మెఱపు చానలు తమభ
ర్తల ననుగమించువా రని, తెలిపెడిని విచేతనములుఁ దెల్లము గాఁగన్ 175

గీ. రమ్యకుసుమంబ వీవు సౌరభమ నేను, నిండునెల వీవు పండువెన్నెలను నేను
పదమవీవు తదర్థసంపదను నేను,కలదె యన్యోన్యవిప్రయోగంబు మనకు 176

వ. అని పలికి సన్నగిల్లున నలంబు చేరువచిదుగుల నెగఁ ద్రోచి దరికొల్పి
యావేశవికాసహర్షంబులు ముప్పిరి గొన నిప్పుం జుట్టివచ్చి 177

ఉ. ఉల్లమునం గపోతవిభు నుజ్వలమూర్తిఁ దలంచి నిల్వుమో
వల్లభ! పోకు పోకు మిదె, వచ్చితి వచ్చితి నంచుఁ బల్కుచున్
నల్లవొ ! మంటలో దుమికి నాథుని దాపటఁబవ్వళించి తాఁ
ద్రెళ్ళె జగంబునన్ నిజసతీత్వము నెల్లరు మెచ్చునట్లుగన్ · 178

వ. అంత నగ్గువ్వ జవ్వని 179

క. నవ్యప్రభావిభాసుర, దివ్యవిమానంబు నెక్కి దీపించుపతిన్
భవ్యగుణుఁ గూడి సజ్జన, సేవ్యం బగు నాకమునకుఁ జివ్వున నేగెన్ 180

క. అచ్చట నచ్చర లెదురై, వచ్చిరి స్వాగతము నడిగి వాలిన మోదం
బచ్చుపడ నమ్మిథునమున, కిచ్చిరి హారతులు విబుధు లెల్లఁ జెలంగన్ 181

క. నందనవన హరిచందన, మందారాదికసురద్రుమముల నమందా
నందంబు చింద నప్పులుఁ, గుందోయి సుఖించుచుండెఁ గూరిమిపేర్మిన్ 182

గీ. బోయఁ డిట నట్లు చనిన కపోతయుగళి, వర్తనమ్మును గాంచి వహ్వాయటంచు
మెచ్చి తానును నట్లుగా నిచ్చగించి, తుచ్ఛదేహాభిమానంబుఁ ద్రుంచివైచి 183

మంజరి

ఆలుబిడ్డలమీఁదియాసల విడిచి, పోల నైహిక బంధముల నెల్లఁగోసి
యఖిలేంద్రియమ్ముల నాత్మ నడంచి, నిఖిలేశు నెడఁదలో నియతిమై నిల్పి
ముక్త కేశుండయి మునివృత్తిఁ దాల్చి, ముక్తి కాంతాకరమ్మును బట్ట నెంచి
రయమున దుర్గమార్యణంబు సొచ్చి, పయనమయ్యెను మహాప్రస్థానమునకు 184

క. నిడు వాలిక ముండులు తన, యొడలిం గడుఁ జీల్ప నెత్తు రుడుగక నడవన్
దడుపుచు నుండ నతం డది, యెడఁ దడవక నడుచుచుండె నెడలనికడఁకన్ 185

వ. ఇట్టు లయ్యెఱుకుజెట్టి యెట్టిబెడిదంపుటిక్కట్టుల నేని సరకుగొనక దీక్షాబలంబున
గిరిసరిదరణ్యంబు లనేకంబులు గడచి పుణ్యభూమి యనునాస నుత్తరాశ
కభిముఖుం డై పోవం బోవ 186

క. దావానల మొక్క యెడన్, ద్యావాభూమ్యంతరమ్ము నలమికొని వన
శ్రీ వోవఁగఁ దీండ్రించుచు, నావిమలాత్మునకు బోయ కడ్డం బయ్యెన్ 187

వ. అతఁ డందుల కెంతయు సంతసించి 188

క. ఓ పరమేశ్వర మత్కృత, పాపంబుల నెల్ల సైఁచి భవసంబంధి
వ్యాపారము బాపఁగదే, నీపాలం బడితి దిక్కు నీవ దయాబ్ధీ! 189

క. అని ప్రార్థించుచు నించుక, యనుమానము లేక తద్దవానలమం దొ
య్యనచొచ్చి మైఁ దొఱఁగి పా, వన దేవత్వంబు వడసి వన్నియ కెక్కెన్ 190





'రాష్ట్రగానము' కృతిస్వీకర్త

చల్లపల్లి రాజాశ్రీ యార్లగడ్డ శివరామప్రసాద్

# విషయ సూచిక



# రాష్ట్రగానము

# మనవి

తెలుఁగుదేశము, తెలుఁగుభాష, తెలుఁగుచరిత్ర, తెలుఁగుప్రజ, తెలుఁగుప్రజ, తెలుఁగుసంస్కృతి అనినంతనే నాయొడలు పులకరించును. ఇవి నాకు ప్రాణకల్పవిషయములు. "నేను తెలుఁగువాఁడను" అను నహంకారము నా కెక్కువ. ఈ యహంకారమే నన్ను కవిని చేసినది. ఇట్టి నా జాతియు, నా భాషయు పరతంత్రములై పరకీయ సంస్కారము నాశ్రయించి ప్రాచీనగౌరవమును కోల్పోయినవికదా ! ఇది నా మనస్సులో అనుక్షణముగా రేఁగునట్టి యారాటము. ఈ యారాటమునకు నాజీవుఁడు కదలినాఁడు. ఆ కదలికయే రాష్ట్రగానము.

1937 అక్టోబరులో విజయవాడయందు అఖండవైభవముతో ఆంధ్రమహాసభ జరిగినది. ఆ సభలోపెద్దలు, పిన్నలు రాష్ట్రసంపాదనముపట్ల వెలువరించిన యుద్రేకము, పచరించిన యుత్సాహము ఈ కృతి యువతరించుటకు కారణములు.

ఆనాఁడు శ్రీ శ్రీ చల్లపల్లి రాజాగారు ఆహ్వాన సంఘమున కధ్యక్షులై సభావిజయమునకు ముఖ్యహేతువై సర్వాంధ్రప్రశంస లార్జించిరి. కావుననే వారికీ కావ్యమును ఉదుగరఁ గావించితిని.

దీని మొదటికూర్పు 76 పద్యములతో 1938 లో వెలువడినది. నేఁ డిది ఏడవముద్రణము నందుకొన్నది. పునర్ముద్రణములన్నిటియందును మార్పులు, చేర్పులు ఇంచించుక జరిగినవి. వస్తువు వర్తమానము. సంస్కారము వర్ధిష్ణువు. కాన నివి యనివార్యములు.

ఈ కావ్యము నొకమహాసభలో రాష్ట్రసేవాపరాయణులగు కృతిపతులకు సమర్పించుట సముచితమని, అది రాష్ట్రోద్యమమునకు దోహదమగునవి నా మిత్రులగు అప్పికట్ల (బాపట్ల తాలూకా) పౌరులకు తోఁచినది. వెంటనే వారు 1942లో ఉదాత్తమార్గమున కృతిసమర్పణసభను సాగించినాకును, నా గ్రంథమునకును పెద్దటికము చేకూర్చిరి. ఈ సందర్భమున శ్రీకుఙ్ఞ వేంకటసుబ్బారావు, శ్రీఇనగంటి వేంకటప్పయ్యచౌదరి, శ్రీ ఆచంటి బుచ్చిరాయఁడు, శ్రీ ఇనగంటి చౌదరి, శ్రీ ఆచంట నాగయ్య, శ్రీ కొదాలి చక్రపాణి ప్రభృతులు ప్రకటించిన సారస్వతాభిమానము మఱవరానిది.

ఈకృతిలో అటనటఁగల విసంధి కేమిగాని వద్దు, (వలదు) కద్దు (కలదు) అనుదా వ్యవహారిక రూపములు ప్రయుక్తములైనవి. వీని నిపుడు మన్నింపఁజాలను.

ఒక్కమాట - రాష్ట్రగానమును చదివిన తరువాత నా పాఠకులు "ఉదయగానము"ను తప్పక చదువుదురుగాక ! అది అక్క - ఇది చెల్లెలు.

తెనుఁగులెంక
**తుమ్మల సీతారామమూర్తి**

# కానుక

శా. దీక్షంబూనితి నాంధ్రరాష్ట్రమును సాధింతున్ దదీయక్రియా
రక్షన్ జేసెద నెట్టికష్టమయినన్ రానిమ్ము కానిమ్ము మా
తృక్షోణీయశ ముద్ధరింతు నని భక్తిన్ గంకణం బూను నీ
కక్షయ్యం బగు నేర్లగడ్డశివరామా ! చల్లపల్లీశ్వరా ! 1

ఉ. ప్రాకటర క్తిఁ బూని పలుబాముల కోర్చి గడించె మొన్న c బ
ర్లాకిమిడిప్రభుండు నిజరాష్ట్రము; నీవు త్రిలింగ రాజ్య ల
క్ష్మీకమనీయవైభవవిశిష్ట మహోత్సవ కారణంబవై
నీకృతకృత్యతం బ్రజ గణింప రహింపఁగదయ్య ! భూవరా ! 2

శా. కచ్చెల్ పెంచుచు రచ్చ కెక్కుచుఁ బ్రజాకల్యాణమం దెన్నఁడే
నిచ్చం జూపక లచ్చలున్నఘను లిస్సీ ! విత్తమున్ రిత్తగా
వెచ్చంపెట్టెడి వేళ దేశజననీ విక్లేశ విచ్ఛిత్తికై
నిచ్చల్ దస్సెడి నిన్ను మెచ్చవలదా నిస్తంద్రవాగ్ధోరణిన్ 3

శా. నీసౌజన్యము నాంధ్రమండలయశో నిర్మాణకృత్కార్య దీ
క్షా సంపత్తి నెఱింగి పొంగినది నా స్వాంతమ్ము ; వాణీవిపం
చీ సఖ్యమ్మును గన్న యీకవిత నిచ్చెన్ గాన్క cగా నీకు నే
లా సందేహము ? స్వీకరింపగదవయ్యా ! నేతృచూడామణీ ! 4

(కృతిసమర్పణ సభనాఁడు)

ఉ. పెల్లుగ భోగభాగ్యములు పిండెదు దేవరకోటరాజ్యముల్
జల్లగ నేలు రాజకులచంద్రుఁడ వయ్యును బేదవాని కి
ట్లల్లుఁడవైతి వొక్క హృదయంబువినా మఱి ముద్దుముచ్చటల్
చెల్లఁగ నేమికట్నములు సెప్పెద సాలువు లేమి కప్పెదన్ 5

ఆ. తుమ్మ లేర్లగడ్డ లిమ్మెయి వీయమ్ము, నందుకొనుట చోద్యమా నరేంద్ర !
తుమ్మ లేర్ల గడ్డతోఁ గాక జాతితో, జప్పతోడఁ జెలిమి కొప్పునొక్కొ ? 6

ఉ. రోసముచెంది దెందమున రోయకు మీ కవితాలతాంగి నీ
గీసిన గీఁతలో నిలువకే పయనించుచు నెల్లవారి సా
వాసము లాసచేయు బలవంత మొనర్చిన మాన దిట్టి య
భ్యాసము లాఱునూఱయినఁ బాపటవెంద్రుక వెల్ల cబాఱినన్ 7

శా. కోటల్ దాఁటిన దాఁటుఁగాక యిది తెల్గుంగొమ్మ లేఁదోఁటలోఁ
దేటల్ చల్లు నొయారిమల్లెపొదరై దీపించి భూభృత్సభా
వాటీ సత్కవిలోక పండితఘటా వాచా పరిస్తుత్యమై
నీటుం గుల్కెడు కీ ర్తి నీ కొసఁగు నీనెయ్యంబు సామాన్యమే ? 8

# స్వీకృతి

మహాశయులారా !

నా జీవితములో ఇదియొక సుదినము. ఈమాటలు ఏదో సభల ఆచారము ప్రకారము చెప్పుచున్న మాటలుగాక హృదయపూర్వకముగా చెప్పుచున్నవి, యథార్థములు.

కవులు, పండితులు, దేశభక్తిపరాయణులు ఎందఱో యీసభ నలంకరించి యున్నారు. ఇందఱి సమక్షమున ఇట్టి మహాసభాముఖమున, ఒక ఉత్తమ కావ్యమును కృతినందగలిగిన భాగ్యము నాకు నేడు లభించినది. నాకిట్టి మహావకాశము అపూర్వము, కాబట్టి నా కిది ఒక పర్వదినము.

తుమ్మలవారి "రాష్ట్రగానము" ఆంధ్రుల హృదయముల హత్తుకొనిన ఉత్తమకావ్యము. ఆంధ్రుల పెదవులపై లాస్యము చేయుచున్న పద్యావళి. ఏ పద్యముచూచినను, ఏపుటత్రిప్పినను ఆంధ్రాభిమానము, ఆంధ్రరాష్ట్రదీక్ష ప్రత్యక్షముగా కనబడును. కవిహృదయమువలెనే ఈ గ్రంథము ఆంధ్రత్వపూరితము. అనేక ముఖముల వ్యాప్తిగాంచుచున్న ఆ పద్యములే దీనికి సాక్షి. ఇట్టి ఉత్తమ కావ్యముతో నాపేరు కలిసియుండుట మహాసుకృతము.

ఇంతేకాదు. ఇంకొక్కవిశేషము ; అది స్వవిషయము. ఆంధ్రజనాభివృద్ధి కోరుటలో నేనొకరికి తీసిపోవువాడను గాను. ఆంధ్రరాష్ట్ర సిద్ధికొఱకు నేనును పరితపింతును. ఈ విషయములో శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారికిని నాకును ఎంతో భావసాదృశ్యమున్నది. నాకేకాదు, ఆంధ్రులలో అనేకులకు. అయిన నేమి ? వారికున్న యీ ప్రకటనశక్తి అందఱకు లేదు. ఏదో ఆందోళన మన హృదయములలో రగులుచుండునే కాని, మాట బయటికి పెగలదు. పెగిలినను గాసటబీసటగానే ఉండును గాని హృదయముల నాకర్షించదు. కేవలము మనము మూగవారమే, నిజము.

ఏదో చెప్పదలచుకొనిన మూగవాడు చెప్పలేక కొట్టుకొనుచుండును. ఆ యభిప్రాయమును గ్రహించి ప్రకటించగలిగిన వాడు ఒక్కడు దొరికినపుడు ఆ మూగ యెంత పరమానంద భరితుఁడగును ! అతనితో ఐక్యమును ఏర్పరచుకొనును గదా ! అట్లే నేనును నాతో పాటు మీరును ఈ కవివతంసునితో ఏకత్వము నాపాదించుకొనుట.

ప్రజాభావమును ఆకళించి యీకవి తన కావ్యములో ప్రకటించినాడు. ఇట్లు చేయుటయే సత్కవితాలక్షణ మందురు. సత్కావ్యము "సంక్షిప్త ప్రజాభావమై" ఉండవలెనట. ఆ భావమును సంక్షేపించుటతో ఈ కవి సంతోషించి ఊరకుండ లేదు. ఆ భావమునకు చక్కని పదలాలిత్యమును జతపఱచి మనోహరత్వమును కల్పించెను. చెప్పదలచిన మాట గట్టిగా చెప్పెను. కృతార్థత చెందెను.

కవిసత్తమా !

ఈ ఆంధ్రదేశము పుణ్యభూమి. ఎందఱో భాషా కోవిదులు, ఎందఱో దేశభక్తులు, ఎందఱో రాష్ట్రదీక్షాకంకణులు ఈ దేశమున నున్నారు. ఎన్నోవిధముల నాకంటె నెక్కువవారు కలరు. అయినను ఈకృతికి నన్నే మీరు ప్రత్యేకించుట నాఅదృష్టము. మీ అవ్యాజాభిమానము నాయందు కలదని, మీరు చెప్పిన ఆ గుణములు, ఆ అభిమానము సంకల్పించినవే అని నే నెఱుగుదును. రాష్ట్రగానము నందు మీ కెంత ఆదరము కలదో, నాయందు మీ కంత అభిమాన మున్నది. కృతజ్ఞుడను.

ఈ కవిత లత వంటిది. పూర్వ వాసన వల్లనో, ప్రస్తుత కృషివల్లనో లత పొదచూపును. లేదీవలు చాచుకొనుచు వ్యాపించును. అల్లుకొని అంతయు తానే అగును. భూమిని కప్పి పరిమళముతో భూనభోంతరమును ముంచియెత్తి ప్రపంచమును వాసయోగ్యముగ చేయును. అది సత్కవితా లతకు లక్షణము. దానిది స్వేచ్ఛావిహారము. దాని నాపుటకెవ్వరును చాలరు.

ఆ లత ప్రాకికొని పోవుటకు అక్కడక్కడ ఒక ఆలంబనము కావలసియుండును. ఒక కొమ్మయో, ఒక కొయ్యయో అది ప్రకృతికి అవసరము. ఆ కొమ్మకుగాని, కొయ్యకుగాని స్వతస్సిద్ధమగు యోగ్యత అక్కఱలేదు.

అట్టివారలే కృతిభర్తలని నా భావము. కవితాలత వ్యాపించుటకు వీరు కేవలము నిమిత్తమాత్రులు. వీరి వలన కవితాలతకు కొంత - కొంతయే సుమండీ-అనుకూలత యేర్పడవచ్చును. కాని ఆ లతవలన ఈ కొయ్యకు కలిగినమేలు అపారము. అది ఎంత మ్రోడయినను ఈ లతవలన మనోహరమగును. మంచి గౌరవమునకు పాత్ర మగును.

సీతారామమూర్తిగారూ !

మీ హృదయము రాష్ట్రచింతతో పరితప్తమైనది. అక్కడ రేగిన తుపాను మీ కంఠమునుండి "రాష్ట్రగానము"గ వెలువడినది. దీనిలోని భావగౌరవమువలనను, మృదుమధుర శైలి వలనను ఈ గానము ప్రతి ఆంధ్రుని కంఠమునను ప్రతిధ్వనించుచున్నది. ఇట్టి రసవత్కావ్యమును నాకు కృతియిచ్చుట మీ భావౌదార్యమును ప్రకటించుచున్నది. ఆదర పూర్వకముగ మీ రిచ్చిన కృతిని నేను భక్తి పూర్వకముగ స్వీకరించి, ఆంధ్రభాషామతల్లికి వినయపూర్వకముగా సమర్పించుచున్నాను. అయాచితముగ లభ్యమయిన ఈ కావ్యపుష్పముతో ఆంధ్రమాత పాదపద్మముల నలంకరించి అప్రయత్నముగ ఈ మహాభాగ్యము నందుచున్నాను. నా కిట్టి అవకాశమును కలిగించిన మీకు నే నెంతయు కృతజ్ఞుడను.

శివరామ ప్రసాద్

# పీఠిక

కవిత్వమున కానందము పరమప్రయోజనము. ఇది పరజాతులెఱుఁగని దివ్యవిషయము. సర్వకవిత్వమునుండి సర్వపాఠకునకు కలుగు నానందమందు భిన్నత్వము లేదనిలేదు. పాఠకునిశక్తి, ఆ కవనమునందలి శక్తి, ఈ యానందమునందు భిన్నత్వములు సంపాదించును. కవి పండితుఁడు. కవనము విద్వత్కవిత. ఈ యానందము వేఱు. కవి రసజ్ఞుఁడు. పాండిత్య మెఱుఁగడు. కవనము ప్రతిభాద్యోతకము. పాండిత్యము లోఁతులు తెలియనిది. ఈ యానందము ఇంకొక విలక్షణ మైనది. పాఠకుఁడు కొన్ని విషయములయం దభిమానియై యుండెనేని తదభిమాన విషయ ప్రతిబింబము కాని కవనము వానికి గిట్టదు. భిన్నవస్త్వా శ్రయములైన భిన్న రచనలు భిన్నమైనయానందమునే సమకూర్చును. ఇది యానంద జిజ్ఞాస.

ఆంధ్రుఁడు తన మాతృదేశమునందలి యభిమానము కవితాపద్ధతిని కరఁగఁబోసెనేని అది ఆంధ్రునకే యానందదాయి. ఆ కవియొక్క అభిమానము ఒక విలక్షణత్వము కలిగియుండు నేని అది తాదృశులకే యానందము సమకూర్చును. కవి నన్నయభట్టువలె స్వస్థానవేష భాషాభిమతుఁడైనచో తాదృశుఁడు గానివానికి నది యేమియానందము సమకూర్చును?

తెలుఁగుబాస మిక్కిలి తియ్యని దని పరదేశీయుల కందఱకుఁ దెలియును. తెలుఁగు వారికే తెలియదు. అసలు పరభాషానిష్ణాతులకు, నిష్ణాతులు కాకపోయినను తద్భ్రాంతిగల వారికి, తెలుఁగుమెత్తన తెలియదు. తెలుఁగుబాసలోని జివ తెలియదు. భాషాస్వభావమే తెలియని వారికి ఒక బాసకన్న మఱియొకబాస శక్తిమంతమట్లు తోఁచును. అన్యదేశ్యములు లేని భాషయుండదు. పారిభాషికపదములో మఱేవో అన్యభాషా పదములు చేర్చినందువలన ఏ భాషకును లోపములేదు. ఒక భాషయొక్క స్వత్వము అన్యభాషా పదములు చేర్చుకొనుటలో లేదు. దాని నుడికారములో నుండును. ఆ నుడికారము చెడనంతసేపు ఆ భాష కాదనుటకు వీలులేదు. ఒక భాషకు శక్తి తక్కువ యనఁగా ఆభాషను మాటాడువారిలో, అందు గ్రంథములు వ్రాయువారిలో శక్తిలేదని యర్థము. ఒక మహాకవి పుట్టి తన మాతృభాషకొదుఁగని భావము లేకుండ చేయఁగలఁడు. తిక్కన, కేతన్న మొదలైనవారు తెలుఁగుభాషలో 'ఇది చెప్పవచ్చును. ఇది చెప్పరాదు' అనకుండ చేసిరి. బద్దెననీతి, విజ్ఞానేశ్వరీయము మొదలైన గ్రంథములు తెలుఁగుబాస శాస్త్రీయగ్రంథముల కెంత యనువైనదో రుజువు చేయఁగలవు.

ఈకవి స్వస్థాన వేషభాషలయందు పరమాభిమాని. ఈయన కింగ్లీషు గిట్టదు. తెలుఁగు బాసయే కావలయును. పరదేశీయుల వేషము పనికిరాదు. ఆంధ్రుఁ డాంధ్రునివలె కనిపించ వలయును. పూర్వాంధ్రుల వేషము మాఱినచో వాఁ డాంధ్రుఁడుగా కనిపించఁడు. ఆంధ్రుఁడు ఉత్తరముకూడా తెలుఁగులో వ్రాయవలయును. "మఱి యింకొక పెద్ద రోగమే కద్దు వచింతు నాంగ్లము మొగంబు నెఱుంగని శ్రోతముందు దుర్బుద్ధులు వాగుచుంద్రు

పలుపోకలఁ బొంగుచు నింగిలీసులన్" ఈ కవిలో స్వభాషాభిమానము పరాకాష్ఠ పొందినది. ఇట్లే తెలుఁగువాని వేషమును గూర్చి కూడ ఎన్నోచోట్ల సాభిమానముగా వ్రాయఁబడినది. వేషభాషలయం దనాంధ్రమైనది తిరస్కరింపఁబడినది, వెక్కిరించఁబడినది, అసహ్యించుకొనఁ బడినది. ఓహో! ఆంధ్రులు! ఈగ్రంథము చదివి మీరేమనుకొందురయ్యా! కవికి విశాలబుద్ధి లే దనుకొందురు కాఁబోలు. మీలో కొందఱేమనుకొందురో కవికి తెలియును. "వేస మెటున్న నేమి పరవిద్యలకున్" మొదలైన పద్యము చూడుఁడు. తనవలె స్వస్థానవేషభాషాభిమతము కలవాఁడు నేఁటి యాంధ్రదేశములో అల్పసంఖ్యాకుఁ డని కవి యెఱుఁగును. అందుకనియే 'నైజవేషభాషాచరితమ్ములందు, తన జాతిమతమ్ములయందు, పేర్మిగల్గి చరియించు గుణాఢ్యుఁ డొకండుచాలఁడే' అన్నాఁడు. అనాంధ్రునియందు, ఆంధ్రవిరోధియందు ఈకవి ప్రచండకోపి. వారిలో నొకఁడు యంత్రబ్రహ్మ. ఒకడు దేవయ్య. ఒకఁడు భైరవుఁడు. ఒకఁడు కశ్చన. ఆంధ్రులలో కులతత్త్వములే ఆయనకు గిట్టవు. నియోగులు, వైదికులు, కమ్మవారు, కాఁపులు ఇంక లక్షభేదములు. ఈ భేదములు, వానిని పురస్కరించుకొనిన దురభిమానము ఈ కవి యూహలో "వెధవ"గుణము. ఈ మాట సాహసించి వాడిన కవి ఎంత అచ్ఛ శీలుఁడు! ఎంత అమృతహృదయుఁడు! ఎంతటి యాదర్శబుద్ధి! ఈ కవికి కులభేదబుద్ధిలేదు. ఆంధ్రదేశములో నున్న సర్వమేధావులును–అతఁడు బ్రాహ్మణుఁడో, కమ్మయో! కాఁపో, రెడ్డో అందఱును ఆదరణీయులు. తాపీ ధర్మారావుగారును, పట్టాభి సీతారామయ్యగారును రాజకీయ ముగా, సాంఘికముగా, సామ్యము లేనివారయ్యును ఆయన కాదరణీయులు. ఎవరైనను సరే, వాఁడు మేధావి, వాఁడాంధ్రుఁడు. ఆయనకు కావలసినదది.

ఆంధ్రుఁడు ప్రాచీనుఁడు, పశ్చిమాంధ్రుఁడు, ఉత్తరాంధ్రుఁడు – ఈ భేదమాయనకు లేదు. అసలుండరాదు. ఈ భేదములు పెట్టుకొన్నచో ఈ కవి తాను మనస్సులో పొందెడు వ్యథ చెప్పరాకుండనున్నది. "నాదౌచిత్తము నివ్విధింగలఁతురే? న్యాయంబు వర్జింతురే?" ఈ కవి ఆవేశములో ఈ బహ్వాంధ్రులలో తా నొక్కవ్యక్తి యనియే మఱచిపోయెను. తా నాంధ్రమాతృస్థానీయుఁడు. సర్వాంధ్ర హృదయాంతర్వర్తి యైన మూర్తాంధ్రాభిమానము. ఈ కవి స్వరూప మది. ఈయన ప్రాణములో, హృదయములో, మనస్సులో, శరీరములో నాంధ్రుఁడు. ఈ యాంధ్రత్వమును భిన్నవర్ణములు చెఱపలేవు. భిన్నవృత్తులు చెఱపలేవు. భిన్న ప్రకృతులు చెఱపలేవు. అహో! ఓయి ఆంధ్రుఁడా! నీ వీ కవివంటి వాఁడవగుదువేని పతితమైన యాంధ్రజాతి ఒక్కనిమేషములో తొలినాఁటి గొప్పతనమును పొందదా?

ఈ కవి యాంధ్రజాతినిగూర్చి చేసిన పరిశోధన అపారముగా నున్నది. అనేక స్థలము లందు వివరణములు లేకుండ సర్వజనులకు నర్థముకాదు. అఱవలు పెండిలిలో తురగము నెక్కమి, సరిగుంజలతో పందిరి నిలుపమి : ఈ యాచారములు పరిశోధించి చూచినవి. ఒక రీతిగా నేమిటి? ఎన్నో విషయముల త్రవ్వి యెత్తి చూపించఁబడినవి. ఆంధ్ర తేజము నేఁటికిని చావలేదనుటకు నీలు విగ్రహనిర్మూలనమే సాక్షి. కవి దానినికూడ చెప్పినాఁడు.

ఈ గ్రంథమంతయు నొకయెత్తు, పశ్చిమాంధ్రులను గూర్చి వ్రాసినది యొకయెత్తు. ఆదోనిసభ కవి హృదయము నెంత వేధించినదో! "రాయలసీమ" అని ప్రత్యేకింపఁబడుటకు కవి పొందిన దుఃఖము ఒక ప్రత్యేకఘట్టమైనది. రాయలు కర్ణాటకుఁడే యందము. అతని సేనానాయకులు సాయపనేనివారు, పెమ్మసానివారు, రావెళ్ళవారు, మంత్రి తిమ్మరుసు - వీరందఱెవరు? వీరు లేని రాయలెవరు? ఓ రాయలసీమాంధ్రులారా! ఒక్క సత్కవి మనస్సు ఇంత నొప్పించినందులకు మీ వాద మింతటితో వదలుకొనవచ్చును. మన పూర్వులకున్న కవితాభిమానము మీకున్నచో ఇది లెక్కలోనిదికాదు. ఒడ్డెగజపతి పెద్దమ్మ వ్రాసిన పద్యానికి దండు త్రిప్పుకొని పోయినాఁడట. మీకొఱ కీ కవి యొక కావ్యమే వ్రాసెను.

అసలు పుస్తకమునకు పీఠిక వ్రాయుట నా యుద్దేశముకాదు. పాఠకుఁడు వాని సంస్కారము కొలఁది గ్రంథమును చదువుకొనును. అల్పసంస్క్ృయావంతునకు పీఠికవ్రాసి యెక్కువ సంస్కారము కుదుర్చలేము. ఐనను కస్మింశ్చిద్దేశమందు ఫలవంతము కావచ్చును. ఈ కవి యాంధ్రచరిత్రయు, నాంధ్రోద్యమమును చదివి యనుసరించి ఈ గ్రంథమును వ్రాసెను. వానిగుర్తులీ చిన్నికావ్యమున సర్వశః కనిపించును. అది యట్లుంచి ఈయన పాండిత్యమును, కవితాశక్తినిగూర్చి వక్కాణింపఁ బోయినచో నదియు వ్యర్థ ప్రయత్నము. ఏలయనఁగా నట్లు చేయుట సూర్యుని దివ్వెపెట్టి చూపించినట్లు. తెలుఁగుకోస్తాలో ఈయనపేరందఱు నెఱుఁగుదురు. ఈయన రచన లెల్లరుచదివిరి. వీరి 'ఆత్మకథ' మన భాష కలంకారప్రాయముగా నున్నదని రామలింగారెడ్డిగారి యంతవారు చెప్పిరి. నెల్లూరిపండితపరిషత్తులో "తిక్కన్న బహుమానము" ఈయేఁడుపొందినది వీరు. ఈ బహుమానము పొందుట తేలికపని కాదు. కవితాశక్తితోపా టనేకవిషయము లున్నఁ గాని యిది లభించదు. ఆధునిక యుగలక్షణ చిహ్నితమైన కావ్యరచనయే దీనికి పరీక్ష. ఇట్టి కవి కవితాశక్తి తక్కువది కాదు. కాని ఒక్క విషయము చెప్పవలయును. మెఱపు మెఱసి పోవును. కనులు మిఱుమిట్లుగొనవచ్చును. దాని మెఱపు లిప్తమాత్రము. ఒక వెన్నెలతీఁగ మెఱపు సౌదామనివలె లిప్తమా త్రాంధ్యహేతువు కాకపోవచ్చును. కాని చలించనిదై నేత్రాభిరామమై ఆలోచించిన కొలఁది, చూచినకొలఁది హృదయంగమమై యుండును. పండితుఁడు గాని కవికి, పండితుఁడైన కవికి భేద మిది. అసంస్కృతమైన ప్రతిభావిశేషముచేత వాఁడు కనులు మిఱుమిట్లు కొలుపును. ఇతఁడు సంస్కృతమైన ప్రతిభను తీర్చినబోదెల కొదిఁగించి ఆలోచించినకొలది, చూచినకొలఁది రమ్యత్వ మాపాదించును. ఈ కవి యీతరగతి కవి. ఈయనను చదివినకొలఁది, తెలిసి చదివినచో వడిదుడుకులులేని ఆహ్లాదపు నిలుకడ కలిగించును. ఈయన సహజముగా పెద్దన్న కవితారీతి నచ్చినవాఁడు, సరిగానట్లే వ్రాయఁగలవాఁడు. చూడుఁడు. "ఇఁక శాత్రవులాంధ్రులు తీర వాసులా? శ్రమలకు నోర్చి యే గురునిసన్నిధి నేర్చితి రీ వివేకముల్" ఇది ఉక్తిపరిపాకము. "చుక్కలు చుంయిచుంయిమనుచుం బడనేర్చెడి తల్లిఁగంటిరే" "మిన్నులుపడ్డ దేశములు" పెద్దన్నగారి యీ మాటలే కాక కొన్నిచోట్ల సరిగా పెద్దన్నగా రూడిపడినట్లే యుండును. ఇది

గాక శ్రీనాథుఁడు, పోతన్న : వీరి కవికి విద్యాగురువులు. 'కైవల్య కల్యాణ ఘంటాపథము" "మందార మకరంద మాధుర్యము" "అపరాధంబులు లేవు మావలన" - వీనిని యథాస్థితి కముగ ప్రయోగించుకొన్నాఁడు. పూర్వ కావ్యములలోని కొన్ని చక్కని మాటలు ఔచిత్య మెఱిఁగి ప్రయోగించు నేర్పు ఈకవికి చక్కఁగాకలదు. "సూయాణము" వాడిన కవి కావ్యములు చక్కఁగా చదివినవాఁడు కదా! ప్రానుడియందు చక్కని మమకారము, తీపియు కలవాఁడు కదా! ఇట్టివే "ఒజ్జబంతులు" "నలసారములు" "సోదర్యుఁడు" "ప్రథితి" "దేశభక్తి పదవీ నదవీ యసి" ఇట్టిమాట లీ కవియొక్క పాండిత్యద్యోతకములు. 'అనుతాపము' నందలి ప్రథమ పద్యము ఈయనగారి సుఖమైన సమాసపుకూర్పున కుదాహరణము. ఈయన లోకోక్తులు ఎత్తిచూపించుటకు బహుళములు. తెలుఁగు నుడికారమునందు చక్కని పట్టుదల గలకవి. ఔమ్మువిఱిచి నిల్చుట, నామము రూపము లేకుండుట, నెత్తురుపిండుట, తంపి వెట్టుట మొదలైనవి దీని కుదాహరణములు. లోకోక్తులు నుడికారములు పూర్వ కవీశ్వర వాక్ప్రయోగదక్షతయుఁ గాక కవి సహజముగా ఉక్తివైచిత్ర్యము కలవాఁడు. దేశ్యములైన కొన్ని వాడుకమాటలు వాడుటలో కొంత కవితాశక్తి యుండును. "నెత్తురుపిండి కయ్యలకు నీరముచేసి జగమ్ముపెంచు కాఁ పెత్తువడంగఁ జూచి" ఈ కూర్పు, ఇచ్చటికయ్యలన్న శబ్దము తచ్చక్తిపిశునములు. తెలుఁగుపద్యము వ్రాయుట ఒక ప్రత్యేక శిల్పము. ఈ శిల్పములోని మెలఁకువలు ఈ కవిగారి కెన్నో తెలియును. 'ప్రశస్తి'లోని రెండవపద్యము అచ్చముగా శ్రీనాథుని పోఁత. "ఆహ్వానము"లోని మూఁడవది యైన సీసపద్యము యొక్క చక్కని ప్రౌఢి చూడుఁడు. సీసపద్యముచేఁత మరల వేఱు. "ప్రశస్తి"లోని ప్రథమ తృతీయములును, కైవారము లోని మూఁడవపద్యమును చూచినచో దీనియందలి యొకపద్ధతి తెలియును. గీతపద్యము నందు చెప్పఁదలఁచుకొన్నయొక రమ్యవిషయమును పై నాల్గుపాదములతో సమర్థించుట దీని వైలక్షణ్యము. సముద్రమున కేతా మెత్తినట్లు సత్కవిత్వమునకు విమర్శ.

**విశ్వనాథ సత్యనారాయణ**

15-8-39

నాకృతి కొకభాష్యముగా ననర్ఘమైన యీపీఠిక నొసంగిన మహాకవులు శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారికి నా జోహారువులు.

**- రచయిత**

# వివరణము

పొరట

౨ కోహినూరు కొల్లూరికడ (తెనాలి) కృష్ణలో దొరకినదఁట.

౩ గంగగట్టు - ఇది పాటలీపుత్రమును సూచించుటకు.

౫ రావెళ్ళ మల్లన - ఇతఁడు కృష్ణరాయల సర్వసేనాని. కుమారధూర్జటి కృష్ణరాయల సర్వసేనాని. కుమార ధూర్జటి కృష్ణరాయవిజయము చూడు ఁడు.

౬ బ్రహ్మదేశము - బర్మా.

౧౦ మోహనుఁడు - రామమోహనరాయలు.

రాఘవేంద్రుఁడు - ఈదుపుగంటి రాఘవేంద్రరావుగారు, ఈయన లండనులోని ఇండియాకార్యదర్శికి సచివుఁడు.

౧౧ చింతామణి - చిర్రావూరి యజ్ఞదత్త చింతామణిగారు, అలహాబాదు, లీడరు పత్రికాసంపాదకుఁడు.

కోటమరాజుకులుఁడు - కోటమరాజు పున్నయ్యగారు, 'సింధుఅబ్జర్వరు' సంపాదకుఁడు.

మాచిరాణ్ణియోగి - మాచిరాజు భవానిశంకరనియోగి, నాగపూర్ హైకోర్టుజడ్జి.

౧౨ శివాజీ విజయనగరచక్రవర్తుల ననుసరించి పాలించె నని లోకమాన్య తిలక్ చెన్నపురి ప్రసంగములో నుడివెను.

బిల్వమంగళుఁడు కృష్ణాతీరమునందలి శ్రీకాకుళమువాఁడఁట.

౧౪ అన్నమభట్టు తర్కశాస్త్రకర్త.

౧౫ శ్రీ రామానుజాచార్యులవా రాంధ్రులు. వారి యింటిపేరు 'ఆసూరి'. మంగళగిరి నుండి వీరి పూర్వులు కాంచీపురమునకేగిరి.

౧2 గోవిందమాంబ గండికోట ప్రభువు పెమ్మసాని తిమ్మానాయని చెల్లెలు. శత్రుపక్షమునఁ జేరిన భర్తతో రణమొనర్చినది.

చాన- ఖడ్గతిక్కన భార్య చానమ్మ.

౧౮ రీతి - నాగరికత.

౨౨ ఇరువదాఱు శరత్తులు **1938** నాఁటికి.

సైంధవులు - సింధుదేశీయులు.

౨౩ జొన్నవిత్తుల గురునాథముగారు గుంటూరు మిషన్ కాలేజిలో నుపన్యాసకులు. ఆంధ్రరాష్ట్రమును గూర్చి మొదటివ్యాసమును వీరు **1910** లో వ్రాసి హిందూపత్రికలోఁ బ్రచురించిరి.

౨౪ పానుగల్ రాజా, దేదము వేంకటరాయశాస్త్రి, మోచర్ల రామచంద్రరావు, నెమిలి పట్టాభిరామారావు, బయ్యా నరసింహేశ్వరశర్మ – వీరు ఆ యా ఆంధ్రమహాసభల కధ్యక్షులు. నాఁటికి కీర్తిశేషులు.

౨౫ నన్నయదేశభక్తి యేమన ఆగస్త్యుఁడు తన దక్షిణదేశయాత్రలో ఆంధ్రక్షేత్రములు కొన్ని చూచెననుట. ఇది మూలమున లేదు.

"దక్షిణగంగనాఁ దద్దయు నొప్పిన గోదావరియు ......... ఈ సీస మిటఁ జూడఁదగ్గది.

గిడుగు వేంకటరామమూర్తిగారు తన పర్లాకిమిడి ఒరిస్సా రాష్ట్రమునఁ జేరుట కొకనాఁడు ముందుగానే దానిని వదలి రాజమహేంద్రవరముచేరి బనపెట్టిరి.

౨౬ ఈదుపుగంటి – వేంకటరత్నమాంబగారు 1938 నుండి ఆంధ్రోద్యమమున మిగుల శ్రమించిరి.

౨౯ ఆంధ్రరత్నగోపాలకృష్ణయ్యగారి చరమజీవితము ఆర్థికముగా శోచనీయము.

ధర్మరాయనికి – తాపీ ధర్మారావుగారికి.

కాంగ్రెసు – అధ్యక్షు ఁడుగా ఒకప్పుడు పోటీచేసిన పట్టాభిగారి కాంధ్రులే పలువురు ఓటునీయరైరి.

టంగుటూరి ప్రకాశముగారు 1937 లో ప్రధామమంత్రి కామికి కొందఱు తెలుఁగుసోదరులే కారణము.

3౨ సాయపనేనివారు, పెమ్మసానివారు, రావెళ్ళవారు కృష్ణరాయల సేనానాయకులు. వీరందఱు కృష్ణా, గుంటూరు మండలముల నుండి విజయనగరమునకు వెళ్ళినవారే !

3౪ మునిసామి–బొల్లిని మునుసామి నాయుఁడుగారు.

3౫ విజయవాడలోనున్న విశ్వకళాపరిషత్తు విశాఖపట్టణమునకుఁ బోవుటకు అనాఁటి ఆంధ్రేతర ప్రధాన మంత్రి కారణమందురు.

3౬ చేరెఁడు మంచినీళ్ళు లేక 1938 లో బాధపడిన పట్టణములు గుంటూరు, విశాఖపట్టణము.

౪3 'రాజశేఖర చరిత్రము' వీరేశలింగముగారి నవల, 'రంగభూమి' ప్రేమ్‌చంద్ వ్రాసిన హిందీనవల. 'పూదండ' శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి కథల సంపుటము. 'సప్తసరోజ్' ప్రేమ్‌చంద్ రచించిన హిందీ కథల సంపుటము. 'మాధురి' హిందీ మాసపత్రిక.

౪౫ శాహజీ–ఇతఁడు తెల్గుకవుల నాదరించుచు తంజావూరు నేలిన మహారాష్ట్ర ప్రభువు.

౪2 బాలమ్మ–మంగళగిరి బాలాంబ. ఈమె మహామహిమగల భక్తురాలు.

కుసుమాంబ – హరనాథబాబాగారి భార్య కుసుమకుమారీదేవి. అవనీంద్రుఁడు– అవనీంద్రనాథఠాకూరు, వంగచిత్రకారుఁడు.

౪౨ బులుసుసాంబమూర్తిగారు 1937 లో ఆంధ్రరాష్ట్రము పట్ల సుముఖత చూపరైరి. కాని 1939 లో మరల నాంధ్రోద్యమమునకుఁ దోడ్పడిరి. ఈ రెండు విషయములును ఇచట గమనింపఁదగ్గవి.

౪౩ ఆంధ్రరాష్ట్రము నంగీకరింపుఁడని మనవారు కాంగ్రెసు పెద్దల కడకు 1937 లో రాయబారము నడుపఁగా వారు మన కోరికను తృణీకరించిరి. ఈ పద్యము లాసందర్భము నందలివి.

౪౫ సుభాష్ చంద్రబోసు కాంగ్రెసున కధ్యక్షుఁడైనపుడు మనరాష్ట్రవాంఛను త్రోసివైచెను. ఈ పద్యములపుడు వెడలినవి.

౪౭ సింహపురి - నెల్లూరు

రాజనరేంద్రుని కొడుకు కులోత్తుంగచోళుఁడు కంచిలో నుండి తెలుఁగు-తమిళ దేశముల నేలెను. రాజ్యము మాతామహుఁ డిచ్చినది.

౪౯ చాంద్రమానము మనది. సౌరమానము తమిళులది.

౫౦ మదరాసు పురపాలకసంఘ వ్యవహారములు కొన్నాళ్ళు తెలుఁగులోనే వ్రాయఁ బడినవి.

తిమ్మనాయఁడు-బేరీ తిమ్మప్ప. ఇతఁడు మదరాసులో వేయి గృహములను కట్టించి పాత్రలగు వారికి ఒక్క ముహూర్తమున దానము చేసెను.

పోర్చుగీసువారు తెలుఁగువారిని 'జెంటూస్, అనియు, వారి చెన్నపట్టణమును 'జెంటూటౌన్ అనియు పిలిచిరి. ఇపుడు కోటయున్న చోటికి 'చెన్నపట్టణము' అనియు, దానికి నుత్తరముగా నున్న 'ఎస్ప్లనేడ్' అను చోటికి 'మాదరాజు పట్టణము' అనియు పేరు మాదరా జొక తెలుఁగునాయకుఁడు. 'మాదరాజు పట్టణము అను పదమే రానురాను 'మద్రాసు' అయినది.

౫౩ విమలాదిత్యుని భార్య 'కుందవాంబ'యు, ఆమె కొడుకు కులోత్తుంగునిభార్య 'మధురాంతకదేవి' యు, తమిళుల (చోళరాజుల) ఆఁడుపడుచులు.

౫౪ ఒక తమిళనాయకుఁ డాంధ్రులు చేతఁగానివారిని వెక్కిరింపఁగా నపుడు (1939) మన రాష్ట్రకాంగ్రెసు సంఘాధ్యక్షుఁడుగా నున్న పట్టాభిగా రాయనకు సునిశితమైన హెచ్చరిక గావించిరి. ఆ సందర్భమున వ్రాసిన పద్యము లివి.

౫౫ ఈ పద్యములు విజయవాడరేడియో కేంద్రము ప్రారంభమయిననాఁడు (1-12-48) జరిగిన 'కవిసమ్మేళనము'నఁ జదువఁబడినవి అపుడే హైదరాబాద్ రాష్ట్రమునకు రాజకీయ విముక్తి కల్గినది.

# రాష్ట్ర గానము

## జోహారు(గేయము)

తెనుఁగుతల్లీ ! నీకు జోహారు
దేశమాతా ! నీకు జేజేలు
నినుఁజూచి నినుఁబాడి నినుఁ గొల్చువేళ నా
కను లాణిముత్యాల గనులుగా నగు నహో !
తెనుఁగుతల్లీ ! నీకు జోహారు
దేశమాతా ! నీకు జేజేలు 1

నీపాలు జుంటి తేనియ తేటలో గోస్త, నీ పక్వరసమో సుధాపూరమో యాట
నాపల్కు లీ తీయనకు నోఁచి విశ్వ వా, ణీ ప్రపంచ ప్రశంసాపూరితము లాయె ॥తెనుఁగు॥ 2

కుటిలశాత్రవకోటిగుండెలో నిదురించి, యిటుసేతు వటు గంగ యెల్లగా జగ మేలె
నటరాజకంధరా నైల్యమ్ము నడఁగించు, పటుకీర్తి పెంచె నీపట్టి యెంతటివాఁడొ ॥తెనుఁగు॥ 3

ఎల్లోరకొండ నీ యల్లారుగీ మటే, కొల్లూరికోహినూరు కొప్పులోఁ బూ వటే
కొల్లారుగనులు నీకోశం బటే పండ్లు, పుల్లనైపోవు నీ భోగమ్ము కన్నచో ॥తెనుఁగు॥ 4

గౌతమీ కృష్ణానదీ తుంగభద్రాది, పూతస్రవంతికా పుంజమ్ము నీముద్దుఁ
గూఁతులై నీచేను నీతోఁట పండింప, నీ తనూజులు పై ఁడిపాఁతఱల్ కప్పిరే ! ॥తెనుఁగు॥ 5

ఏపుణ్యలేశమ్ము నాపాలి దాయెనో, నాపూజ కేలోకనాథుండు పొంగెనో
నీ పావనోదర శ్రీపరంపరలలో, నీ పదార్చకులలో నేను నొక్కఁడ నైతి

తెనుఁగుతల్లీ ! నీకు జోహారు
దేశమాతా ! నీకు జేజేలు 6

## హెచ్చరిక

సీ. కలదోయి ! తెలుఁగుజోదుల తుటారికటారి, చెలరేఁగి పగఱఁ జీల్చినదినంబు
కలదోయి ! తెలుఁగురాజులు గంగగట్టు పైఁ, దీంద్రించి పడగ లెత్తినదినంబు
కలదోయి ! రేవు రేవులఁ దెలుంగుసరంగు, పెనఁగి లంగర్లు దింపినదినంబు
కలదోయి ! తెలుఁగుపల్కులవెలంది - వెలంది, వెలుఁగు లెల్లెడలఁ బర్వినదినంబు

గీ. కలదు కల దోయి ! తెల్గు ప్రెగ్గడలు మన్ను, మిన్ను తాళంబువైచి పేర్గన్నదినము
నేఁటినీపాటు నెంచి కన్నీటి నిడకు, నిలుచునే కాల మొకలీలఁ దెలుఁగుబిడ్డ ! 1

సీ. తెలుఁగుదాతల దానజలవేణిలో గిరుల్, తెప్పలై పరువులెత్తినదినంబు
తెలుఁగువారలభోగములఁ గాంచి పాకశా, సనుఁడు గ్రుక్కిళ్ళుమ్రింగినదినంబు
తెలుఁగుటొజ్జల పాదములచెంత జగమెల్ల, విజ్ఞానమధువు ద్రావినదినంబు
తెలుఁగుబిడ్డలు కులమ్ములకు మన్నా చెప్పి, యన్నంబు నొకచాఁపఁ దిన్నదినము

గీ. కలదు కల దోయి ! తెల్గుపోకడలు విశ్వ, మునకు మేల్బంతులై వెలింగిన దినంబు
నేఁటినీ పాటు నెంచి కన్నీటి నిడకు, నిలుచునే కాల మొకలీలఁ దెలుఁగుబిడ్డ ! 2

చ. ఉడుగనిపౌరుషమ్ము విజయోత్సవకారణ మన్న సూత్రమున్
విడువక దేశభక్తిపదవీ నదవీయసి యైన బుద్ధిమై
నడువుము తెల్గుజాతికి సనాతన తేజము వచ్చుదాఁక నీ
యడుగుమరల్పఁబోకు మఖిలాభ్యుదయమ్ములు నీవి తమ్ముఁడా ! 3

## కైవారము

సీ. నన్నపాచార్య తిక్కన్నాది కవికోటి, యేతల్లి కుఱువుపై నెక్కి యాడె
కృష్ణరాయాదిక క్షితిపాలు రేతల్లి, జోలపాటలలో సుషుప్తి గనిరి
రావెళ్ళమల్లన ప్రముఖ వీరవరేణ్యు, లొత్తిల్లి రేతల్లి యుదరసీమ
త్యాగరాజాది భక్తసమాజ మేతల్లి, యందిచ్చు వెన్నల నారగించె

గీ. గౌతమాపత్య కృష్ణవేణీ తరంగ, పాళి యేతల్లి తూఁగుటుయ్యాల లయ్యె
దీక్ష మైఁ గొల్తు న య్యాంధ్ర దేశజనని, విమల చరణద్వయంబు హృద్వీధి నిల్పి 1

సీ. గిరిలోక రాజ మంబర చుంబిశిఖరంబు, వింధ్యంబు ఛత్రమై వెలుఁగుచుండ
చల దూర్మికాహస్తముల మోచికొని తెచ్చి, కదలి రత్నచ్ఛటల్ కాన్క వెట్ట
గౌతమీ కృష్ణవేణీ తుంగభద్రలు, ముత్యాలసరములై మురుపుసూప
కవికుమారులు హృద్య గద్యపద్యమ్ముల, నిజవైభవంబు వర్ణింపఁదొడఁగ

గీ. గుణములకొటారు లైన ముక్కోటిబిడ్డ, లడుగుడాఁటక యూడిగ మాచరింప
చెన్నపుర హేమపీఠికాసీన యగుచు, దేశముల నేలుఁగాక మా తెలుఁగుతల్లి 2

సీ. బ్రహ్మదేశంబు నీపంటపండిన చేను, మధ్యరాష్ట్రముల నీమాట చెల్లు
అస్సాములోన నీయందంబు రాణించు, బీహారునందు నీపేర మలరు
వంగభూమికి వన్నె వాసి గూర్తువు నీవు, బొంబాయి నీవిలాసంబునెలవు
మైసూరుసీమ నీమంగళాకృతి వెల్గు, మధురలో నీపల్కు మాఱుమ్రోఁగు

గీ. సింహళద్వీపమందు నీచిన్నె లొప్పు, నాఫ్రికాఖండ మది నీ విహారభూమి
సందియం బేల వైష్ణవశక్తి వీవు, తెలిసికొన్నాఁడ నీ పెంపు తెలుఁగుతల్లి ! 3

సీ. పరవేష భాషాసపర్య తారక మౌట, నాంధ్రత్వమే సగం బడఁగిపోయె
పరఖడ్గమునకు లోబడి జోహారులువెట్ట, స్వాతంత్ర్యసమపేక్ష జాతిపోయె
కులతత్త్వములు చుట్టుకొని యార్వ్యలకు దింప, నైకమత్యము సర్వ మాఱిపోయె
అసమర్థతాపంకమందు బ్రుంగుటఁజేసి, మెట్ట వేదాంతముల్ మీఱిపోయె
గీ. నలఁగిపోయిన యీనాఁటి తెలుఁగుబిడ్డ, కేమిసందేశ మిత్తు తల్లీ ! తమస్సు
విడుచుచున్నది యిప్పు డిప్పుడె రవంత, ఉద్ధరింపుము వీని సద్బుద్ధు లొసంగి 4

సీ. చతురంత ధారణీచక్రంబు శాసించు, వీరప్రతాపు లీవేళ లేరు
పరవీర్యలుంటాక బాహాబలప్రౌఢి, గల బాలచంద్రు లీగడియ లేరు
ఖడ్గంబు నందిచ్చి కదనభూమికి నాథు, నదుపు మాంచాల లీనాఁడు లేరు
కందల స్గదలించుకైత నామెత లిచ్చు, తిక్కనామాత్యు లీదినము లేరు

గీ. లేరు పండితలో కావలేప జలద, మండలీ చండవాయువుల్ మల్లినాథు
లూఁచవోయినసంతాన మేచునట్లు, దీవన ల్గురియింపవే తెలుఁగుతల్లి ! 5

## ప్రశస్తి

సీ. తన క త్తినీడలోఁ బెనిచె ధైర్యము సెప్పి, దక్షిణక్షోణి హైందవమతమ్ము
తన బుద్ధిసాగరత్వము తేట తెల్లగా, వేదభాష్యమ్ములు వెల్లడించె
తన తంత్రశ క్తికిఁ దార్కాణగాఁ బాదు, షాలకే కుచ్చుటోపీలుపెట్టె
తన కళాలిప్స కద్దమువోలె రాణింపఁ, గల్పించె భువనైక శిల్పవీథి

గీ. తన రసజ్ఞత కది నిదర్శనము గాఁగ, మోసెఁ గవిరాజుపల్లకీముందుకొమ్ము
కొమ్ముదిరిగినవారలే కొలువుసేయ, దిక్కు లొత్తిన మొనగాఁడు తెలుఁగువాఁడు 1

ఉ. కాకుళమందు ధాన్యకటకంబున హంపిని దంజవూరిలో
నేకశిలాపురిన్ మెఱయు టేమివిచిత్రము పాటలీపుర
స్త్రీకబరీభరమ్మున విచిత్రసుమస్తబకంబు నిర్ఝరీ
లోకమనోహరంబయి తెలుంగులటెక్కెము నాట్యమాడఁగన్ 2

సీ. ఒకనాఁడు శాక్యమౌనికి జయధ్వజ మిచ్చి, కరుణాసుధావృష్టి కురిసినాఁడు
ఒకనాఁడు శంకరార్యున కండయై నిల్చి, జ్ఞానచంద్రిక వెదచల్లినాఁడు

ఒకనాఁడు రామానుజోపదేశము మెచ్చి, భక్తిప్రపత్తులు పంచినాఁడు
ఒకనాఁడు మోహనోక్తికి నంజలిఘటించి, కులగర్వములు వంగఁగొట్టినాఁడు

గీ. నేఁడు గాంధిమహర్షి వాణికి శిరంబు, వంచి సల్పెడి గాథసేవావ్రతంబు
ఉత్తమోత్తమధర్మ మెందున్న దాని, కొలువు మరగెడివాఁడు మా తెలుఁగువాఁడు 3

సీ. జలధు లేడింటి కవ్వలిమిట్టపై నల్లు, కొనె రాఘవేంద్రుని గుణలతాళి
కర్ణాటనరపతిగ్రామ కర్షకజాతి, కింటివే ల్పయ్యె విశ్వేశ్వరుండు
అతివేల రాజకీయజ్ఞానదాతయై, చింతామణి జగత్ ప్రసిద్ధి వడసె
సింధురాష్ట్ర ప్రజాసేవకోత్తంసమై, రాణించెఁ గోటమరాజుకులుఁడు

గీ. నాగవుర ధర్మపరిషత్తునకు వినూత్న, రామణీయక మిదె మాచిరాజ్ఞియోగి
తారకావర్తి కుముదబాంధవునియట్లు, వెలుఁగు నెచ్చోట నున్న మా తెలుఁగువాఁడు 4

సీ. పాలిచ్చి జోలలఁ బాడుతల్లులు పుణ్య, వేదికల్ గలవు కృష్ణాదినదులు
క్షేత్రముల్ గల విహాముత్రభోగమ్ముల, కాధారములు తిర్మలాదికములు
కలవు బూదికి జీవముల నిచ్చునోషధుల్, కృపసేయుగిరులు తూరుపుకనుమలు
రారాజుల కిరీటరంగమ్ము లెక్కి ని, క్కి న వజ్రములఁ గన్న గనులు గలవు

గీ. కలదు నౌకాప్రయాణసౌకర్యమునకుఁ, జాలినట్టిది గంభీరసాగరంబు
ఎల్లసంపదలకుఁ బుట్టినిల్లనంగఁ, దేజరిల్లిననాడు మా తెలుఁగునాడు 5

సీ. అకలంకశౌర్యమూర్తికి శివాజికి రాజ్య, తంత్రంబు నాంధ్రుఁడే దానమిచ్చె
పీష్వాలయేల్బడి పెంచె మంత్రిత్వంబు, మోసి పింగళివారి మోరొపంతు
చైతన్యునకు భక్తిలోఁతు లన్నియు మప్పి, మహిమగూర్చెను బిల్వమంగళుండు
కర్ణాట కవితావికాసనిర్మాత లై, ప్రథితి కెక్కిరి పూజ్యపాదముఖులు

గీ. కూర్చె హిందీకవిత్వంబు క్రొత్తక్రొత్త, పాకములతోడ భట్టపద్మాకరుండు
పుక్కిటిపురాణములు గావు పూర్వచరిత, తఱచి కన్గొనుఁ డాంధ్రసోదర్యులార ! 6

సీ. అంధ్రరాజ్యస్థాపనాచార్యుఁడై తెల్గు , వేలుపైనాఁ డాంధ్రవిష్ణువిభుఁడు
రణకళానిధి సుశర్మను జంపి మగధోర్వి, శాసించె శ్రీముఖచక్రవర్తి
ఔత్తరాహులనెల్ల నదలించె హాలుండు, శాలివాహనశక స్థాపకుండు
నిజ జయ స్తంభముల్ నిఖిలదిక్కులఁ బాఁతె, గౌతమీపుత్రుండు శాతకర్ణి

గీ. క్షాత్రపుల గెల్చి మాళవధాత్రి కెల్ల, నాథుఁడయ్యెను వాసిష్ఠినందనుండు
ప్రాఁతపడినట్టి యాంధ్రభూపతుల కథలు, చదువుఁ డొకసారి కండలు కదలియాడ 7

సీ. భారతావని కొజ్జబంతులు పల్కు నా, పస్తంబఋషి నీదుపాలు గుడిచె
ఖండఖండాంతరఖ్యాతుఁ డౌ సిద్ధుండు, నాగార్జునుండు నీ నందనుండు
కైవల్యకల్యాణ ఘంటాపథము గన్న, యోగివేమన్న నీయొడిని గులికె
బొందితో నపవర్గ మందిన భక్తుండు, గోపన్న నీ ముద్దుఁగొడుకుఁగుఱ్ఱ

గీ. పారతంత్ర్యపిశాచంబు పైకొనంగ, నయనములు విప్ప లేకయున్నాము గాని
సుతులు నీవార లతిలోకమతులు గారె, అఖిలసద్గుణసముపేత ! ఆంధ్రమాత ! 8

సీ. తనవిద్యచే లోకమున కొజ్జ యైనట్టి, యన్నమభట్టు నాయన్న యనుచు
తన దానధా రచేఁ దెనుఁగుగడ్డను ముంచు, భాస్కరమంత్రి నా బంధు వనుచు
తనప్రజ్ఞ చే మన్ను మిను గుప్పిటం బట్టు, ప్రగడ తిమ్మరుసు నాభ్రాత యనుచు
తనగీతిచే జగమ్మునకు జీవమువోయు, త్యాగయ్య నాదుసోదరుఁ డటంచు

గీ. విశ్వరంగమ్ముపై తొమ్మువిఱిచి నిలిచి, లీలమైఁ బల్కు హక్కు నాకే లభించె
ధన్యతాభాజనంబు గదా మదీయ, జీవితం బని సమ్మదశ్రీ భజింతు 9

సీ. పసిఁడిముద్దలు దోసపండ్లుగా నర్థుల, జడ్డ మాన్పిన వాసిరెడ్డివిభుఁడు
పలుకు పల్కునఁ గావ్యకళలు పింపిసలాడ, సుకృతిఁ గూర్చిన నన్నెచోడనృపుఁడు
నిఖిలప్రజకు నౌపనిషదపీయూషంబు, కురియు వీరబ్రహ్మ గురువరుండు
అభినవభోజరా జాఖ్యాసమంచితుఁ, డానందగజపతి క్ష్మానియంత

గీ. భగవదవతారుఁ 'దాసూరి' పావనాభి, జనుఁడు రామానుజాచార్యుఁ డనఘుఁ డస్మ
దీయుఁ డనఁ గంటి నిట్టిజాతీయగరిమ, నాకుఁ గా కెవ్వనికి దక్కు లోకమందు 10

సీ. లాలిత్యలక్ష్మి విలాసరంగమ్ము ని, ల్పితి వజంతా చిత్రలేఖనమ్ము
సవరించితివి శైవభువనంబు నెల్లొరా, కొండను మైనంపుటుండఁ జేసి
విట్ఠలప్రభుని కోవెలకంబముల చేతఁ, బలికింపఁ గంటి సప్తస్వరాలు
ఒలికించి తౌర ! తిర్మలనాథు నగరులో, వెలలేని సభ్యతా విలసనములు

గీ. భగవదన్వేషణార్థమై పాటుపడిన, యుత్తమతపస్వి వై కళాయోగి వైన
నీకు ఋణపడె రసలుబ్ధలోక మెల్ల, నాంధ్రశిల్పీ ! చిరంజీవి వయ్య ! నీవు 11

సీ. కలము ఖడ్గము పట్టఁగలనేర్పు వడసిన, రెడ్డినాగమ్మ నీబిడ్డ యటవె
జగమగంటిమి నాంధ్రజగతిఁ బాలించిన, గరిత రుద్రమ్మ నీకన్నె యటవె
గండికోటను మల్కదండుపై దూఁకిన, గోవిందమాంబ నీకూఁతు రటవె
మానంబుకై నిజప్రాణంబు బలియిచ్చు, మల్లాంబ నీదుకొమార్తె యటవె

గీ. వీఁగి వచ్చిన హృదయేశు వెక్కిరించి, పోరి కంపిన చాన నీపుత్రి యటవె
ఎంత తేజస్వినివి తల్లి ! యెఱుక లేక, నీమహత్త్వంబు తెలిసికోలేము గాని 12

# అనుతాపము

శా. ఏతాదృ గ్విభవాభిరామ మగు నా యీదేశ మాశాతటీ
మాతంగప్రమదా విశాలకటసీమా నిర్గళద్వేణికా
ప్రీ తేందిందిర గీతకీ ర్తినిధియై పెంపొంది నేఁ దక్కటా !
రీతిన్ బ్రాక్తనవర్ణనీయ సుషమారేఖారమన్ గోల్పడెన్ 1

సీ. పాటలీపుత్రమ్ము కోటకొమ్మలమీఁదఁ, దెలుఁగు జెండాలు నర్తించునాఁడు
ఢిల్లీశు నెదిరి చెండిన తెల్గువిలుకాండ్రు, నవలక్ష లోరుఁగల్ కవియునాఁడు
రాచూరుకదనమం దేచి తళ్ తళ మంచుఁ, తెలుఁగుజోదులక త్తి తిరుగునాఁడు
అలచోళపాండ్యభూములఁ దెల్గుసరకార్ల, పసుపు సూయాణమై ప్రాఁకునాఁడు

గీ. చూచి సంతోషభారంబు మోచి శిరము, నూఁచు భాగ్యంబునకు నింత నోఁచలేక
యేలపుట్టితి నివు డిసీ ! యేటిబ్రతుకు, కటకటా ! దాఁటిపోయె బంగారుయుగము 2

సీ. మంటికుందయు నుల్క మంచం బెఱుంగక, చందవోల్పురము పెంపొందునాఁడు
కొల్ల కొల్లగ మోటుపల్లి రేవునఁ బిసా, ళించు కస్తూరిని దించునాఁడు
రతనాల ముత్యాల రాసులువోసి రా, యల రాచవీటిలో నమ్మునాఁడు
మంచుందెరల నీసడించు సెల్లాలు బం, దరుదుకాణములందు మెఱయునాఁడు

గీ. అందచందమ్ములకు దీవులైన తెలుఁగు, సతులు పన్నీటికలయంపి చల్లునాఁడు
నీవిలాసంబు నీజగారీవి గాంచి, పొంగలేనైతి నక్కటా ! పురుటిగడ్డ ! 3

సీ. చెలువమ్ము నెగఁజిమ్ము జిలుఁగుఁదెల్గులతోడఁ, బెన్న గట్టునఁగృతుల్ పెరుఁగునాఁడు
మందారమకరంద మాధుర్యధుర్యమై, యోరుఁగంటఁ గవిత్వ మూరునాఁడు
ధాటీసమాటీక నాటోపమునఁ గొండ, వీటిలోఁ గావ్యముల్ వెదలునాఁడు
క్రొంగ్రొత్తరుచులపొంగులఁ దుంగభద్రతో, వియ్యమై కబ్బముల్ వెలయునాఁడు

గీ. ప్రతిపదమ్మున రసచమత్కృతులు వెల్లి, వొడువఁ దంజాపురిం గైత నడుచునాఁడు
తల్లి ! నీ భువనైక సౌందర్య రేఖ, కాంచనైతిఁ గదా ! కంటికఱవు దీఱ 4

సీ. ఖండించెనా ఘోరఖడ్గధార నితండు, మగధసేనా వ్యూహమండలంబు
నడిపించెనా తెల్గునాటిశిల్పము మోయు, నౌక లీతఁడు రోమునగరమునకు
శ్రమియించెనా యితం డమరావతీకళా, పరిషత్తులో శాస్త్రపారములకు
అర్పించెనా పద్యహారావళి నితండు, కనకాభిషేకంబు గన్నకవికి

గీ. త్రాగెనా రామభ క్తిమైఁ ద్యాగరాజు, క్రుమ్మరించిన గీతామృతమ్ము నితఁడు
పూర్వసంస్కారదూరుఁడై పుట్టుకతన, వేఁడుచున్నాఁడు వివరింపవే ! సవిత్రి ! 5

# ప్రబోధము

ఉ. దీపితవిక్రమాధ్యము నదీనద శైల సముద్ర కానన
ద్వీపవిశిష్ట విశ్వజగతీవలయ ప్రభుతా సమంచిత
శ్రీపదనిష్ఠమై కడుఁ బ్రసిద్ధివహించిన తెల్గుజాతికిన్
దాపరమైన యీ కసటుదైన్యము వాపఁగలేరె సోదరుల్ 1

ఉ. అచ్చెరువయ్యెఁబో! యిరువదాఱుశరత్తులనాఁడె రాష్ట్రమున్
దెచ్చెద మన్న తెల్గులకుఁ దీరవ కోర్కులు; మొన్న మొన్న కన్
విచ్చిన యోఢ్ర సైంధవుల వేడ్కలు పూచి ఫలించె నెన్నఁడో
వచ్చినవీనులన్ నిరుడువచ్చిన కొమ్ములు వెక్కిరించెడిన్ 2

ఉ. తత్వ మెఱుంగలేక బహుధాశ్రమలన్ గుదువంగనేల యాం
ధ్రత్వము లేనినాఁడు కలదా మన కించుక యేని భారతీ
యత్వము ! తెల్గువీరుఁ డొకఁడైనను గాంగ్రెసుగద్దె నెక్కి నే
తృత్వముసూపుభాగ్యమున కేటికి నోఁచకపోయెఁ జెప్పుఁడీ ! 3

చ. కలధనమెల్ల నొడ్డినను గాంగ్రెసుకై పడరానిబాధలన్
వలచిన బందె కోర్చిన లవంబును జంకక నెత్తు రోడ్చినన్
దెలుఁగుల త్యాగమెల్ల వితథీకృతమైనది యింటిలోపలన్
గెలువనినాఁడు రచ్చలను గెల్చుట యెట్లుపొసంగుఁ దెల్పుఁడీ ! 4

శా. "ఆలస్యాదమృతం విష"మ్మనెడు పల్కాలించి మేలెంచి ని
ర్వేలోత్సాహము పెంచి సంశయతమోవిచ్ఛిత్తి గావించి దీ
క్షాలక్ష్మీవశులై పురాంధ్రజగతీసంపత్తి నార్జించి సు
శ్రీలాలిత్యము నిచ్చి తల్లిఋణమున్ చెల్లింపుఁడీ సోదరుల్ ! 5

ఉ. తల్లి విపత్తుఁ గాంచి పరితాపమునం బడి రాష్ట్రబీజముల్
చల్లిన జొన్నవిత్తులకులప్రభవున్ గురునాథు నెంచుఁడీ
చల్లనివేళ; నాతని కొసంగినపిండముఁ గాకి ముట్టుకో
నొల్లదు పేరు చెందినసహోదరు లిట్టికొఱంత లుంతురే ? 6

సీ. మన్నించెనా యొక్కమాటేని పానుగల్, విభుఁడు రంభయొసంగు వీడియమ్ము
గురుఁ డెంతగా వేఁడుకొన్నను గోష్ఠికై, తలయూఁపె నొక్కొ వేదముబుధుండు
విసముకాదా సుధారసధార మోచర్ల, రామచంద్రున కాంధ్రరాష్ట్రరవికి
కారింపదే నందనారామ సుమబంధు, వనిలంబు నెమిలిపట్టాభిరాము

గీ. గాంగవాఃకణ మంగారకణముగాఁగ, జీకునం బడఁడో నరసింహశర్మ
తల్లి సంకెలలోఁ దల్లడిల్లువేళ, నాక మైనను నరకంబు గాకయున్నె 7

చ. తెలుఁగుల మేలుకొల్పె నుపదేశమొనర్చెను రాష్ట్రమంత్ర మాం
ధ్రులవిభవమ్ము కోరి పలుదుఃఖములన్ వరియించె నెవ్వఁ డ
య్యలఘుచరిత్రు "కొండ" జననాంబుధిచంద్రుని ప్రాణవాయువుల్
వెలలకమున్నె మా తెలుఁగువీరులు తెత్తురుగాక ! రాష్ట్రమున్ 8

ఉ. మూలమునందు లేనివిధమున్ గొనియాడి స్వదేశగౌరవో
న్మీలితచిత్తుఁడై తెలుఁగునేలను గొందల భారతమ్మునన్
జాలఁగ మెచ్చు నాంధ్రకవిసత్తము నన్నయదేశభ క్తి ని
ర్వేల మనారతంబుగ వరించుత ! నేఁటి తెలుంగుబిడ్డలన్ 9

ఉ. ఒక్కనిమేషమున్ నిలువ నొడ్డెల కైవస మైనగడ్డపై
గ్రుక్కెఁడుగంగ ముట్టనొకకొంచెముగాలియుఁ బీల్వనన్న మా
చిక్కని తెల్గుజోదు గుణసింధువు వేంకటరామమూర్తి పెం
పెక్కిన మాతృభక్తి భజియింతురుగాక ! తెలుంగుసోదరుల్ 10

శా. ఎవ్వం డాతఁడు మింటనిల్చి మనపై నీ నందనోద్యానపుం
బువ్వుల్ చల్లెడి ? నాంధ్రరత్నముసుఁడీ ! పుణ్యాత్మ ! నీ వప్పుడే
దవ్వైపోయితివా ! త్రిలింగజననీదాస్యంబు దూలింపఁగా
నువ్విళ్ళూరెడి మా కొసంగవె జయవ్యూహంబు లాశీస్సులన్ 11

శా. దీక్షాకంకణమున్ ధరించి జనయిత్రీదాస్యవిచ్ఛేదనా
పేక్షల్ పొంపిరివోవ ముజ్జగము కంపింపంగ లేలెందు మీ
దక్షత్వంబున కడ్డు లేదు చరితార్థత్వంబు మీ కబ్బు నే
పక్షుల్ గూసిన నేమి లెక్క కడిమిన్ బాలింపుఁడీ సోదరుల్ ! 12

శా. నారాష్ట్రంబు గడించితీరెదను నానావిఘ్నముల్ వచ్చినన్
రారాపిల్లకుఁ దల్లడిల్ల నను తీవ్రజ్వాలతోఁ గార్యమున్
బ్రారంభించిన తెల్గుబిడ్డ నెదిరింపన్ బ్రహ్మరుద్రాదులే
చేరంజాలరు తక్కుముక్కడులకై చింతింపఁగా నేటికిన్ 13

ఉ. ఒడ్డెలఁ గొండవీటికడ నోర్చినలగ్నమునందు రాయచూర్
గడ్డను బాదుసాలను గకావికసేయు ముహూర్తమందు మీ
రొడ్డినశౌర్యమున్ దలఁచి హుమ్మని దూఁకుఁడు రంగమందుమీ
కడ్డమువచ్చి నిల్వఁ దగినట్టిమగన్న జగాన లేఁ డిఁకన్ 14

మ. ఒకనాఁ దంధ్రధరావిరోధినరపాలోదగ్రసేనాశిరః
ప్రకరంబుల్ విదళించి తద్రుధిరధారానిర్ఝ రస్నాతులై
కకుబంతంబుల మీర లెత్తిన పతాకన్ నేఁడు చిత్తంబులో
నొకమారెంచుఁడు ర క్తమగ్నిసఖమై యుప్పొంగి ఘూర్ణిల్లఁగన్ 15

ఉ. నాయకులం దనేకులు వినాయకులైరి సమస్తవిఘ్న సం
ధాయకు లైరి స్వార్థపరతంత్రుల వారలఁ జెప్పనేల తే
జోయుతు లైన మా తెలుఁగుజోదులు దీనికి నోహటిల్ల నే
లా యొకఁడొక్కఁడే జగమునంకెకుఁ దార్చుఁగదాక్షణంబునన్ 16

చ. అతిరథులేకదా ! తెలుఁగు లందఱు నెక్కటివిక్రమమ్ముచే
క్షితితలమెల్ల నోర్వఁగల చేవ తెలుంగులసొమ్ముపో ! జగ
ద్ధితకరణీయముల్ నెఱపి యెల్లరు నెల్లర మించి లోకవి
శ్రుతయశమున్ గడించుటకె చూతురు పాతు రధర్మపద్ధతుల్ 17

ఉ. వాడినతల్లి నెవ్వగలు వాపఁగ నీదుపుగంటియింటికిన్
గోడలు మాలతీకుసుమకోమల వేంకటరత్నమాంబ క్రొ
వ్వేఁడి తెలుంగునెత్తు రతివేలజవం బిడ నెండవానలం
దోడక పెక్కు పాట్లు పడుచున్నది కంటిరె తెల్గుసోదరుల్ ! 18

సీ. పొలివోవలేదు తెల్గుల పరాక్రమ రేఖ, మన 'టంగుటూరి'లో మల్లడించె
సడలలే దాంధ్రవిజ్ఞాన తేజఃపుంజ, మది రామలింగార్యు నాశ్రయించె
చెదరిపోలే దాంధ్రశేముషీసంపత్తి, పట్టాభిసచివుకేల్ పట్టుకొనియె
బీఱువోలే దాంధ్రవీరదాతృత్వంబు, నాగేశ్వరునిలోఁ బెనంగియుండె
గీ. తఱిఁగిపోలేదు తెల్గు కైతలపసందు, కులుకుచున్నది చెళపిళ్ళకలమునందు
నిస్పృహోహేతు వించు కేనియును లేదు, సోదరా ! లెమ్ము నీహక్కు లాదుకొమ్ము 19

సీ. తమిళకర్ణాటబంధము లూడ్చి తెల్గుసీ,మను స్వతంత్రమ్ముఁగా మార్చువఱకు
రాష్ట్రనిర్మాణకార్యము నివార్య మటంచు, మప్పువారికి బుద్ధిసెప్పువఱకు
ఒడ్డెమాగాణమం దొదిఁగి పేర్వాసిన,తెలుఁగుఖండము నెల్లఁ దెచ్చువఱకు
బళ్ళారిలో నాంధ్రభాగమంతయుఁ జీల్చి, తెలుఁగురాజ్యమ్ములోఁ గలుపువఱకు
గీ. నిదియు నది యని లెక్కింప నేల యావ, దాంధ్రవిషయమ్ము నొక్క రాజ్యమ్ముఁ జేసి
పట్టి జయభేరిపై దెబ్బ గొట్టువఱకుఁ, దెలుఁగుఁబసిపాపకైన నిద్రింపఁ దగునె ? 20

## సంస్కరణము

ఉ. లోప మదేమి తెల్గు లతిలోకమనీషు లుదారతాసము
ద్దీపితు లంచితార్థసముదీర్ణు లహో ! భువనత్రయంబు నొ
క్కూఁపున లేపువారు మహిమోజ్జ్వలులే యటులయ్యు నామమున్
రూపములేక యుంటకు నెఱుంగుఁ దసూయలు కారణంబుగన్ 1

ఉ. వైదికులన్నచో మొగమువాద్చునొకందు నియోగిభోగముల్
ఖేదముగూర్చు నొక్కనికి గిట్టదు గిట్టదు కమ్మవారి భా
గ్యోదయ మన్న నొక్కరికి నోర్వఁడు రెడ్లయశం బొకందు స
మ్మోదము నీదు కాఁపులసమున్నతి యొక్కని కేమిపాపమో ! 2

సీ. ఈ సూత్రము పఠించియేకదా ! "ఆంధ్రర, త్నము" నలయించి ప్రాణంబు గొనుట
ఈ మార్గమును ద్రొక్కి యేకదా ! మన "ధర్మ, రాయని" కాదరం బీయకుంట
ఈ ధర్మమును మెచ్చియేకదా ! పట్టాభి, పట్టాభిషేకంబు పాడుసేఁత
ఈ మంత్రము జపించియేకదా ! టంగుటూ, రికి నామమాత్రమంత్రిత్వ మిడుట

గీ. మాయురే ! మాయఁగారాని మచ్చ యగుచు, వెన్ను దన్నుచునుండె ! నీ "వెధవ" గుణము
చుట్టుప్రక్కలదేశాల సోదరులకు, లేఁతయైపోయె మన తెల్గుజాతి బ్రతుకు 3

చ. కులములమాట కేమి యొక గోత్రముననన్ జనియించి యొక్కచో
నిలిచెడివార లొక్క యెడనే మసియయ్యెడివార లీర్ష్యచే
మలమలమాడుచుందు; రతిమాత్రము దుర్భరమిట్టిచంద ; మీ
తెలుఁగులజన్మ మిట్లె కడతేఱునొ తీఱునొ కాఱుఁజీఁకటుల్ 4

ఉ. వచ్చెను బుద్ధివచ్చె నిఁకవ ద్దిఁక వ ద్దిటువంటి జీవితం
బెచ్చటఁ నార్జవంబు కల దెచ్చట శౌర్యము తాండవించు నిం
కెచ్చటఁ బ్రజ్ఞవెల్గు మతియెచ్చట నొప్పు నుదారదర్శనం
బచ్చట నచ్చుగొట్టక జోహారులు వెట్టుఁడు తెల్గుసోదరుల్ ! 5

## పశ్చిమాంధ్రులు

ఉ. రాణదొఱంగెఁబో ! తమిళరాష్ట్రమునం దొకకొంత యొద్దెమా
గాణమునందుఁ గొంత తెలఁగాణమునం దొకకొంత“మధ్యమా
గాణము”లందుఁ గొంత కలగాపులగం బయి తెల్గునేల; యీ
జేనెఁడుముక్కలో సగము చీల్తురఁటే మన పశ్చిమాంధ్రజుల్ 1

శీ. మీ మేనత్తసుతుండె రాయ, లకటా ! మిథ్యావివాదంబు లే
లా మాకాతఁడుకూర్చు బంధువుఁడుగాఁడా మిమ్ములన్ మమ్ములన్
దా మన్నించినమాట నిక్కువము గాదా మీపొలం బొక్కటే
యేమీ రాయలసీమయౌనె కనుఁగొండీ పశ్చిమాంధ్రప్రజల్ ! 2

మ. కటకం బాదిగ సింహళంబువఱ కేకచ్ఛత్రమై సత్కవి
స్ఫుటవాణీ పరిగీతమై పరనృపభ్రూభంగసంపాదియై
పటుకీ ర్తిం గనినట్టిరాజ్యముఁ గదా పాలించె రాయండు, మీ
నటనల్ కన్గాని పల్లటిల్లి యతఁ డన్నా ! సిగ్గునన్ గ్రుగ్గఁడే 3

సీ. నాటలేదా కొండవీటిఖిల్లామీఁద, శత్రుభీకర మైన జయపతాక
ఆంధ్రవిష్ణుపదంబు లర్చించి కాకుళ, క్షేత్రమం దాముక్త చెప్పలేదె
గోదావరీతీర వేదార్థభండార, కోనసీమను బెంచుకొనఁగ లేదె
సింహాద్రినరసింహుచెంత నుత్తాలమౌ, దిగ్జయ స్తంభ మెత్తింపలేదె
గీ. అకట ! పూర్వాంధ్రమున రాయ లాక్రమించి, యాదరింపనిగడ్డ కాసంత కలదె
ఇదియు రాయలసీమ గా కేమియగునొ, వెల్లడింపుఁడు కృతబుద్ధులెల్లఁ గూడి 4

శా. మేమున్ మీవలె నాంధ్రశౌర్యమునకున్ మేలెంచి విద్యాపురీ
సామ్రాజ్యస్ఫురణంబు కోరి పర రాజ్యశ్రీల నార్జింపఁగన్
మామేనం గల రక్తమెల్ల బలిదానం బీయలేదా మనీ
షా మాధుర్యము సూపి మంత్రిపదవుల్ సాగింపమా చెప్పుఁడీ ! 5

ఉ. సాయపనేనివారు పెమసానిమహీశులు రావెళాన్వయుల్
రాయలసేనలన్ గదనరంగములన్ నడిపింపరో జగద్
గేయపరాక్రమంబు నొలికించి జయేందిర కేలు పట్టరో
యేయెడవారొ వారు వచియింపుఁడు పూర్వచరిత్రవేత్తలై 6

శా. మీకున్ మాకును లేవు భేదములు దుర్మేధావు లాంధ్రేతరుల్
మాకున్ మీకును దంపివెట్టిబ్రదుకన్ మల్లాడుచున్నారు మీ
రా కుక్షింభరులన్ త్యజించి యుచితవ్యాపారపారీణులై
లోకుల్ తెల్గుల నుగ్గడించువిధ మాలోచింపుఁడీ ! మ్రొక్కెదన్ 7

శా. మాకున్ మీకును లేవు భేదములు మామాటల్ యథార్థంబులే
కాకున్నన్ దనదారిఁ దాఁ జనక రంగద్భంగహస్తాళితో
మాకృష్ణమ్మను గౌఁగిలించుకొనునే మన్నించునే తుంగభ
ద్రాకూలంకష మీ సరస్వతి నితాంతస్నేహసంపన్నయై 8

సీ. తలఁదాల్పలేదె విద్వత్సార్వభౌముని, గట్టమంచి కులాబ్ధి కైరవాప్తు
మన్నింపలేదె రామారాయణింగారి, సాచివ్యమును సుప్రశంస లిచ్చి
ఆదలేదా కృష్ణమాచార్యకృతములై, నీటుగుల్కెడు పెక్కు నాటకములు
సకలవేదాంతవేత్త కొసంగలేదె రా, ధాకృష్ణునకు జయధ్వానములను
గీ. ప్రతిభ గలవారి మీవారి నతకరించి, త్రోసివైచిరె యెపుడేని తూర్పువారు
సందియములేల రండు బుజాలుగలిపి, చేయవలె నాంధ్రరాజ్యలక్ష్మీ వ్రతంబు 9

ఉ. నెత్తురుపిండి కయ్యలకు నీరముచేసి జగమ్ముఁజెంచు కాఁ
పెత్తువదంగఁ జూచి మది నెంతయుఁగుంది తదీయసేవలో
విత్తముపందు మంత్రిపదవిన్ దృణముంబలె వీడినట్టి లో
కోత్తరశీలు మెచ్చుకొనమో మునిసామిని యుష్మదీయునిన్ 10

చ. మము నిరసింతురా బిరుసుమాటలు పల్కుదురా తెలుంగు లీ
క్రమమున మిశ్రరాష్ట్రమునఁ గందుచు నన్యులసేవఁ జేయు టి
ష్టమ యగునొక్కొ మీకు నకటా యొకనెత్తురు పంచుకొన్నవా
రము మన మన్నమాట వినరా కనరా స్వపురాచరిత్రముల్ 11

శా. మాకష్టంబులలోన సౌఖ్యములలో మాకీడులో మేలులో
మీకర్పింతుము పాలు రి త్తభయముల్ మీ కేల ? మీయాఁకటిన్
బోకార్పం దగుదారి లేని యెడ మాపొట్టల్ విదారింతు మ
ట్లాఁకల్ పెట్టక తల్లి కూడిగము సేయం బూనుఁడీ సోదరుల్ 12

శా. ఏమోచేసిరి తీరవాసు లని మీ రెగ్గాడుచున్నారు మీ
సామర్థ్యంబునకున్ గళంకమిదు వాంఛల్ సూపుచున్నారు మీ
సేమంబుల్ దిగఁద్రొక్కి స్వార్థమున కిస్సీ స్వాగతంబిచ్చు దు
ష్కాముల్ వారలు కారుకా ర్యటకటా ! శాంతించుతన్ బాపముల్ 13

ఉ. ఎల్లరు నాంధ్రదేశమున కియ్యది కేంద్ర మటంచు సర్వసం
పల్లతికాలవాల మన భాసిలు సహ్యసుతాతటంబునన్
జల్లగ నిల్పినట్టి పరిషత్తు విశాఖకు నెట్టి మిమ్ము మ
మ్మల్లరి పాలుచేసిన మహామహు లెవ్వరొ మీరెఱుంగరా ! 14

శా. "ఇంతింతై రిపు లింతయై మఱియుఁ దామింతై నభోవీధిపై
నంతై తోయదమండలాగ్రమున కల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రున కంతయై ధ్రువునిపై నంతై"న కాలాన నీ
యంతర్యుద్ధ మరిష్టదాయకము గాదా జాతికిన్ నీతికిన్ 15

శా. అయ్యంగార్లకుఁ జెట్టియార్లకును నాయర్ కోటికిన్ బిళ్ళ కా
యయ్యార్ గారికి భృత్యుఁడై వినయభారానంచలద్గాత్రుఁడై
దయ్యం గారణమేమి యాంధ్రుఁడు ? బలిష్ఠంబైన వేదండ మ
య్యయ్యో దోమలనాశ్రయించుకొని జోహార్లిచ్చె నీనాఁటికిన్ 16

మ. అకలంకంబగు నాంధ్రసంస్కృతికి నేఁ దాధారమే లేదు వి
శ్వకళాశాలకు వర్ణనీయగరిమల్ సౌందర్యముల్ గానరా
వకటా చేరెఁడుమంచినీళ్ళకు నుపాయం బున్నదా పంచకో
ల కషాయంబున జీవితంబునకు నేలా చిక్కు మాధుర్యముల్ 17

సీ. తిరుచనాపలి తంజవురులందు రేడియో, పెట్టిన మన కేమి యుట్టిపడును
పైకరా మెట్టూరు ప్రాజక్టులను లెస్స, కట్టిన మన కేమి పొట్టనిండు
అయ్యర్లు మొదలియా ర్లధికారములు నిర్వ, హించినంతనె మన కేమి యొఱగు
ద్రవిడ భాషానిఘంటువు సిద్ధమైనచో, బాపురే ! మన కేమి పండు వగును
గీ. అణ్ణమలవిశ్వ విద్యాలయమ్ము మివులఁ, బుష్టినందిన మన కేమి ప్రోగువడును
చెప్పుకొననేల యిస్సిరో ! సిగ్గుచేటు, సైఁపలే మింక నుమ్మడికాఁపురంబు 18

సీ. సచివులై సచివాగ్రసరులై త్రిలింగంబు, పాలించుభాగ్యంబు పడయుకొఱకు
తుంగభద్రకు సేతువుం గట్టి ముక్కారు, పండు కేదారముల్ పడయుకొఱకు
ఊరూర శారదాగారముల్ నెలకొల్పి, పాండితీసంపదల్ పడయుకొఱకు
వన్నె వాసి దొఱంగి చిన్నవోయినయట్టి, ప్రతిభావికాసముల్ పడయుకొఱకు
గీ. ఇదియు నది యని వ్రేలెత్త నేల మీకు, వలయు సౌకర్యముల నెల్లఁ బడయుకొఱకుఁ
దెలుఁగుతల్లికిఁ దేజముల్ తెచ్చుకొఱకు, నడుముగట్టుఁడు రాష్ట్రంబు వడయుకొఱకు 19

మ. అపరాధంబులు లేవు మా వలన; నే యావంత కాన్పించినన్
గృపతోసైఁపుఁ డుదారతానిధులుగారేమీర; లుద్దండ ఖం
డ పరీతంబగు తెల్గునేల నొకజెండాక్రిందికిం దెచ్చి ధీ
నిపుణామ్రేడితకీర్తి కాశ్రయములై నిల్పుండు వీరోత్తముల్ ! 20

శా. అదోనిన్ గుమిగూడి మీరు పదుగుం డ్రౌచిత్యదూరంబులౌ
వాదంబుల్ వచరించి మున్నిడిన మా వాగ్దానముల్ నమ్మఁగా
రా దంచున్ నిరసించి మీకొక పృథగ్రాష్ట్రంబు వాంఛింతురే
నాదౌ చిత్తము నివ్విధిన్ గలఁతురే న్యాయంబు వర్జింతురే ? 21

మ. ప్రళయోత్థానిలచండవేగమునఁ బైపైదూఁకు నాంధ్రోద్యమ
జ్వలనజ్వాలల కోహటిల్లిన రిపుల్ సంధించి రీ వ్యూహమున్ ;
కులమున్ బ్రీల్చెదు మిత్రభేదమును గన్గోలేక తద్దాసులై
తలపంపుల్ ఘటియించుకార్యముల కుత్సాహంబువాటింతురే 22

ఉ. తెల్లనివెల్ల ఁ బా లని మదిం దలపోయుటఁజేసి మీకడన్
జెల్లెను వారి గారడపుఁజేష్ట; లయో ! మన కాఁపురంబులో
నల్లరిసాగె శాత్రవుల హర్షము రేఁగెను గాని లోకమం
దిల్లలుకంగనే ముగియు నెట్టులు ? పందు వ దెట్టివారికిన్ 23

ఉ. ఎంతవిచిత్రవార్త ! మనమెల్లరమున్ విదళింపలేని మీ
చింతలు మీరు మమ్ము విడి చీలిననాఁడు తొలంగ నేర్చునే
చెంతకువచ్చులక్ష్మిఁగని సీ ! యని వాకిలి మూయఁబోకుఁడీ
గంతులు సూచి విజ్ఞులు పకాపక నవ్వఁదొడంగి రక్కటా ! 24

శా. ఆదాయం బొక రెండుకోట్లకును రాదయ్యెంగదా మీకు నా
పై దేశంబునఁ గాటకంబు లెపుడున్ బ్రత్యక్షమౌ, రాష్ట్ర మే
యాధారంబున నిర్వహింపగలరయ్యా ! మానుఁడీదుర్భ్రమల్
తాఁదూటం దగుక్రంతలేనియెడ నేలా దోలు కంఠమ్మునన్ 25

మ. పదికోట్లైన ధనంబు కావలెఁగదా భద్రానదిం గట్ట మీ
కది యెన్నేనిశతాబ్ది లేగిన నలభ్యంబేకదా లేమికిన్
దుదగన్పింపని బక్క కాఁపురమునన్ దోఁగాడు మీ కెవ్వరున్
బదిరూకల్ ఋణమే నొసంగరుకదా పంతంబు లిట్లేటికిన్ 26

శా. జాతీయప్రథకై మహాంధ్రజగతీసమ్మేళనన్ గోరి శం
కాతంకంబులు లేక మీకయి మహాత్యాగంబుగావింప సం
ప్రీతింజూపిన మమ్ము వంచకులఁగాఁ బేర్కొంటి రన్నన్న ! మీ
పాఁతుల్ త్రవ్విన దెన్నఁడో తెలిపి మాపాపంబులన్ జాటుఁడీ 27

చ. తమిళులు మీకు సర్వసుఖదాతలు; కేరళ మండల ప్రజల్
మిముఁదలఁదాల్చికొల్చెదరు; మిత్రుల కైవడిఁ గన్నడుల్ వికా
సము గలిగింత్రుమీకు; నిఁక శాత్రవు లాంధ్రులు తీరవాసులా
శ్రమలకునోర్చి యేగురునిసన్నిధి నేర్చితి రీవివేకముల్ 28

ఉ. అక్కట ! నాతనూజు లిటు లాఱడిపోక నెఱుంగ లేక దు
ర్వాక్కలహంబు పెంచి రనవద్యుల సోదరులన్ ద్యజింపఁగా
మక్కువసూపి రెంత పెదమార్గముపట్టి రటంచు బాష్పపుం
జుక్కలు “చుంయిచుంయి” మనుచుం బడ నేడ్చెడితల్లి ఁ గంటిరే 29

ఉ. నిక్కము లేనివాదము లనేకములన్ బచరించి మమ్ములన్
రక్కసులందు మీర లనరాని దురుక్తుల నెంతతిట్టినన్
వెక్కసపాటుఁజూప మవివేకులకైవడి దుర్యశంబునన్
జిక్కముయుష్మదీయమగు చెల్మినిదక్కము తక్క మెన్నఁడున్ 30

క. అచ్చముగఁ దల్లి కదుపునఁ, జిచ్చున్ దరికొల్పునట్టి చేఁతలు వల, దే
పొచ్చెంబులేదు మాదెస;, నుచ్చాటనసేయుఁడీ దురూహమ్ములకున్ 31

చ. కలదుముహూర్తమొం డచిరకాలమునందె “నిరర్థక క్రియల్
సలిపితి మాగ్రహింపకుఁడు సైరణసూపుఁడు తేనెపూఁతక
త్తుల కలరూపెఱుంగక యధోగతిగంటి” మటంచు గొంకు మైఁ
బలుకుచు మీరు మాచెలిమిఁ బాయక తల్లిసపర్య సేయఁగన్ 32

## మాతృభాష

ఉ. ఊరక రాష్ట్ర మూడిపడునొక్కొ మహేశ్వరిఁబోలె మాతృభా
షారమణిన్ భజించుటకు సంబరమందని చచ్చుజాతికిన్;
సారతరప్రభావులు నజయ్యులునై మన వంగసోదరుల్
తారలకైవడిన్ మెఱయుదానికి నేమికతంబు సెప్పుఁడీ ! 1

ఉ. లేజవరాలిమోవికి జిలేబికి బాలరసాల మార్దవ
శ్రీ జనయిత్రికిన్ రుచులుచిందెదు తేనెకు నాంధ్రవాణి కీ
రోజునఁ దెల్గుబిడ్డలె విరోధులఁటే తెలవానిబాసపై
మోజఁటవారి; కిట్టివిధమున్ గని యెట్లు సహింతు నక్కటా ! 2

ఉ. కమ్మని తెల్గటంచు నుడికారముసొంపుల నీ విశాల వి
శ్వమ్మున దీనిఁ బోలిన వచస్సు నభస్సుమ మంచు వేయి వా
క్యమ్ముల నేను మెచ్చుటయ కాదు రసజ్ఞు లుదారు లెల్ల ఖం
డమ్ముల మెచ్చి రిచ్చిరి వినమ్రతమైఁ గపురంపుటారతుల్ 3

ఉ. ఇద్దఱు తెల్గువాండ్రు తమయింటివి కష్టసుఖాలు చెప్పుకో
నద్దిర మాతృభాష తగదా మఱి యింకొక పెద్దరోగమే
కద్దు వచింతు నాంగ్లము మొగంబు నెఱుంగని శ్రోతముందు దు
ర్బుద్ధులు వాగుచుండ్రు పలుపోకలఁ బొంగుచు నింగిలీసునన్ 4

చ. పసగల జవ్వనంబు పరభాషలకున్ బలియిచ్చి మాంసమున్
వసము నశించి రక్తము లవంబును లేక చరచ్ఛవంబులై
పసిచెడినట్టి తెల్గు లొకచందము నందము లేని పొత్తముల్
పుసపుస గీసి దుర్యశము పూసిరి కమ్మనితల్లి బాసకున్ 5

ఉ. ఎన్నఁడుఁ దల్లిబాస పఠియింపనివారికి నందుఁ గబ్బముల్
పన్నెద మన్నచో ముదుగుపల్కులుగాక మఱొండుతోఁచునా
నన్నయతిక్కనాది కవినాథులపోఁడుము లంతుపట్టునా
చిన్నయసూరిలక్షణ మిసీ యనిపింపక సొంపునింపునా 6

ఉ. ఈ కథ యిట్టులుండఁగనె హిందియు దూఁకెను, గోరుచుట్టుపై
రోఁకటిపోటుదాఁకె; నితరుల్ వెనుకాడిరి గాని తెల్గువాఁ
డాఁకొనియున్న పేద మధురామృతముంబలె నీనుడిన్ నమో
వాకము లిచ్చి మెచ్చె ననవద్యవు హృద్యవు నీవ పా మ్మనెన్ 7

మ. వల దీబాస యటంచు నే నుడివి దుర్వాదంబు గావింప ని
ప్పలుకే భారతజాతి కెల్ల నొకసంబంధంబు సంధింపఁగాఁ
గల; దీచుట్టఱికంబు లేకయ కదా గాసిల్లెడిన్ దాస్యశృం
ఖల కగ్గంపడి భారతావని తిరస్కారాలవాలంబుగన్ 8

సీ. పోతన్న కలముసొంపుల నెఱుంగకమున్నె, తులసిదాసునికైతతోఁ బనేమి
బొబ్బిలికథలోని దెబ్బ చూడకమున్నె, మేవాడపతనంబు మెచ్చనేల
రాజశేఖర చరిత్రము పఠింపకమున్నె, రంగభూమికి జయారావ మేల
పూదండసౌరభంబులను బీల్వకమున్నె, సప్తసరోజకై శ్రమ మదేల

గీ. కోర్కిమై నొక్క 'భారతిం' గొనకమున్నె, కాన్క లేటికి 'మాధురీ' కరుణకొఱకు
పైత్య మెసరేఁగి కంటికి భ్రమలుగ్రమ్మి, దిక్కు తెలియక యున్నాఁడు తెలుఁగువాఁడు 9

మ. పునరావృత్తినివర్తకం బగు పదంబు న్గోరి ఘోరవ్రతుల్
మునిరాజుల్ పరమేశుఁబోలె నిరతమ్మున్ దీని సేవింపఁగాఁ
జనునే; తెల్గుల కింతవెట్టి తగునే సామాన్యసంభాషణల్
హొనరింపం దగునట్టు లే పదిపదంబుల్ నేర్చినన్ జాలదే ! 10

మ. పరరాజ్యంబుల నాక్రమించి కడిమిన్ బాలించి యచ్చోటనే
తిరమైపోయిరి కోటిమంది తెలుఁగుల్ దేశాలు పెక్కింటిలో
మఱవంజొచ్చిరి నేఁడు తల్లినుడు – లీ మార్పాటు లజ్జాకరం
బరరే! పైనముగట్టుఁడందు రమణీయాంధ్రత్వమున్ నాటఁగన్ 11

ఉ. మొన్ననె వింటిఁ బాండ్యమున ముప్పదిలక్షల తెల్గువాంధ్రకున్
గన్నులులేవఁటే తెలుఁగుకబ్బముసూచుట; కింతనీచపుం
బన్నమునోర్తురా తెలుఁగుఁబల్కుఱవంబున వ్రాసికొందురా !
మిన్నులుపడ్డ దేశములు మెట్టిరపో ! పరు లిట్లొనర్తురా 12

శా. ఢిల్లీలోపలనున్న శీతనగపీఠిన్ దోకియోవీథిలో
నిల్లుంగట్టిన రూజువెల్టుమహిలో హిట్లర్కడన్ గాలమున్
వెళ్ళంబుచ్చిన నూర్ధ్వలోకములకే వేంచేసినన్ దెల్గువాఁ
డుల్లంఘింపఁగరాదు తల్లిపలు కెట్లో రక్షసేయందగున్ 13

సీ. నీతీరుతీయముల్ నిగ్గుజగ్గులు సూచి, బ్రౌను బ్రహ్మరథంబు పట్టె నీకు
నీరవి నీహొయల్ నీబెడంగులు మెచ్చి, యిబ్రహీమ్ కానుక లిచ్చె నీకు
నీసొంపు నీపెంపు నీయొయార మెఱింగి, శాహజీ పరిచర్యసలిపె నీకు,
నీతేట నీపాట నీనీటు దిలకించి, యఱవలెల్లరు దాసులైరి నీకు

గీ. ముజ్జగంబుల నినుఁబోలు ముద్దుగుమ్మ, రసికతావే త్తలకుఁ గానరాదు రాదు
ఏ పురాపుణ్యలేశమో యిటకుఁ దెచ్చి, యర్చకునిజేసె నన్ను నీ కాంధ్రవాణి ! 14

## తెనుఁగుఁదనము

ఉ. మానక రాష్ట్రసిద్ధి కతిమాత్రము నాత్రము వెల్లడించు నీ
మానితదేశభక్తి బహుమార్గములన్ నుతిసేయఁదగ్గదే
కాని మఱొక్క మాట; శతకష్టము లోర్చిన నీప్సితంబు గై
కో నగునొక్కొ నీకుఁ దెనుఁగుందనమున్ గడియింపకుండినన్ 1

శా. ఆర్యావ ర్తమునుండి కశ్చన యొకం దాంధ్రావనిం జేరుచోఁ
దూర్యధ్వానముబోరుకొల్పెదవు గంతుల్వైచె దాహ్వానమున్
మర్యాదల్ పచరింతు; వాంధ్రున కసామాన్యప్రథా శేముషీ
ధుర్యగ్రామణి కంటఁగట్టెదవు దుర్ఘోషంబు లీర్ష్యాళువై 2

ఉ. నాఁడు బిహారులోఁ బ్రళయనాట్యము రేఁగి చరాచరంబుల
ల్లాడఁగ వేలువే లొసంగి యార్తశరణ్యుఁడవైతి మంచిదే !
నేఁడు తెలుంగులో సగమునేలకు నాలుకలెండి సోదరుల్
మాఁడుచువేఁడుచుండ నొకమాడయుజార్ప విదేమితమ్ముఁడా! 3

సీ. అస్పృశ్యములు నీకు నాంధ్రపత్రిక లెల్ల, నింటివేల్పులు టైమ్సు, హిందు, మెయిలు
నలసారములుగదా తెలుఁగుమందులు నీకు, జండుఫార్మశి సుధాసాగరంబు
కఱకుబండలు భద్రగిరితిర్మలలు నీకుఁ, బందరిక్షేత్రంబు పరమపదము
పరిహాస్యములు నీకు బాలమ్మచరితముల్, శరణంబు కుసుమాంబచరణపీఠి

గీ. చవుతిచంద్రుఁడు తెలుఁగుపుస్తకము నీకు, విదియాజాబిల్లి హిందీకవిప్రబంధ
మక్కటా ! యేలపుట్టె నీ కుక్కమూతి, పిందియలు నీకు నంచితాస్పందమతికి 4

సీ. దామెర్ల వారి చిత్తరువుసొంపులు చూడ వవనీంద్రుగీఁతల కబ్రపడెదు
కోడిరామునిశక్తి గొనియాడ నొల్లవు, గామాను దలఁదాల్చి గౌరవింతు
కన్నాంబనైపుణుల్ గని సెబా సనలేవు, దేవికారాణికై తీవ్రపడెదు
నాగభూషణు గీతనైపుణ్య మెఱుఁగవు, టైగరాచారిపాటను గణింతు

గీ. వెల్ల కాలము పొరుగింటిపుల్ల గూర, కొఱకు లొట్టలు వేయు దుర్గుణమె నీకు
నిష్టదైవత మయ్యె నీకష్టబుద్ధి, యెట్లు రుచియించె దీని నీ కెవఁడు మప్పె 5

సీ. చాళుక్య రాజ్యప్రశ స్తి నీ వెఱుఁగవు, నార్మన్ ప్రభుత్వవర్ణన మొనర్తు
రుద్రమాదేవి పౌరుషభంగుల నెఱుంగ, వెలిజబెత్తు మహత్త్వ మెన్ను చుందు
సూరన్న కావ్యకళారూఢి నెఱుంగవు, షేక్స్పియర్ కవికి జేజేలనిడుదు
మన తిమ్మరుసుబుద్ధిమత్త నీ వెఱుఁగవు, వాల్ పోలు చరితంబు వల్లెవైతు

ఆ. నిన్ను నీ వెఱుంగ కెన్నివిధానంబు, లాశ్రయించి సర్వదా శ్రమించి
యెట్టిబన్నములకు నియ్యకో ల్పూపిన, లేదు లేదు ముక్తిలేదు నీకు 6

క. నీ పుట్టినగడ్డపయిన్, శ్రీపదములు మాతృరూపచిహ్నితరేఖల్
దీపించెడి ప్రత్యణువున్, నీపాలిటివేల్పుగా గణించుట వలయున్ 7

క. ఆంధ్రుండవై జన్మించితి, వాంధ్రుండవై యనుభవింపు మాయుర్విభవం
బాంధ్రుండవై మరణింపుమి, ఆంధ్రత్వము లేనిబ్రతుకు నాసింపకుమీ 8

ఉ. అయ్యరుగూదకట్టు మన కక్కఱయే, గుజరాతిటోపితో
నెయ్యములేనిచో బ్రదుకనేర, మరబ్బుల లుంగిపొత్తు లే
దయ్యెనయేని చక్కఁదన మన్నది సున్న, తెలుంగువాని కీ
దయ్యపువేస మేల మన తాతలతండ్రులకట్టు గిట్టదే 9

చ. తుకతుక పుట్టెడిన్ గొదమతుమ్మెదతెక్కలఁబోలె నాస్యల
క్ష్మికి నొకవింత కాంతి నిడు మీసములన్ గొఱిగించి ఫ్రెంచిపో
లికయఁట ముక్కు క్రింద నొకలేశము నిల్పెద; రద్ది యెద్దియో
మకిలవలెన్ జుగుప్స నిడి మానసమున్ గలఁగించివైచెడిన్ 10

ఉ. శ్రోత్రియు లెవ్వరో విడువఁజూచినఁ జూతురుగాక నిస్తుల
క్షాత్రశరణ్యులై సమదశత్రుభయంకరులై జగత్త్రయీ
స్తోత్రము లందినట్టి పురుషుల్ కని పెంచిన కోడెగాండ్రు వీ
తత్రపులై మగంటిమికిఁ దావగు మీసముఁ దీయ టొప్పునే? 11

ఉ. మీసము లేనిమూతి కవిమిత్ర మనోహర కావ్యవాఙ్మయా
భ్యాసములేనిపల్కు నవపల్లవకోమల కన్యకా పద
న్యాసములేనిగీము లలనా మధురాధరసంపుటీ సుధా
గ్రాసము లేని మన్గడ జగమ్మున రిత్తకురిత్త సోదరా ! 12

మ. హరిసర్వోత్తమరావు కొల్లిపరసూరాభిఖ్యుఁడున్ దెల్గుశౌ
ర్యరమానాథులు కోటిరెడ్డియును మారంగయ్యనాయండు నె
వ్వరికోపుట్టినబుద్ధి మెచ్చి కళ కావాసంబులౌ మీసముల్
గొఱుగన్ బూనకయుంద్రుగాక యనిమ్రొక్కుల్ వేయిదేవళ్లకున్ 13

ఉ. కొంకిరివేసముల్ వలచి కోఁతులయైరి తెలుంగుబిడ్డ లే
వంకకుఁబోయినన్ దెలుఁగువాఁడితఁడంచుఁ దలంచునట్లుగా
వంకర లేని వేషము నవశ్యము తాల్పకయున్న నెవ్వరీ
సంకరు లంచు లోకు లెకసక్కె మొనర్తురు లేఁతమాటలన్ 14

ఉ. వేస మెటున్న నేమి పరవిద్యలకున్ బరజాతిరీతికిన్
దాసులమైననేమి పరతంత్రతపోకకు దీని కేమిసా
వాస మటంచు అంకెలిడువారికిఁజీరికిరాని పిచ్చి స
న్యాసుల కిమ్ము తల్లి ! కరుణారతి నించుక మానవత్వమున్ 15

ఉ. నోఁచినతల్లి కెందఱుతనూజులు కావలె నైజవేష భా
షా చరితమ్ములందుఁ దన జాతిమతమ్ములయందు దేశ సే
వాచరణమ్మునందు బుధులందు మహాకవులందు వీరులం
దేచినపేర్మిగల్గి చరియించు గుణాఢ్యుఁ డొకండు సాలఁడే? 16

## ప్రమాదము

శా. విచ్చెన్ విచ్చెఁదమస్సు నీసుతులకున్ వేంద్రమ్ము తీంద్రించె ని
న్నుచ్చైస్థానమునందు నిల్పుటకు వా రుంకించుచున్నా రిదే
వచ్చెన్ మంగళవేళ దైన్యభరమున్ వర్జించి సంతోష సం
పచ్చైతన్యమునన్ దలిర్పు మిఁక నంబా! పుత్రులుప్పొంగఁగన్ 1

శా. ఆశాస్యం బగు విక్రమమ్ము వరణీయత్యాగమున్ శేముషీ
కౌశల్యమ్మును సందడింపఁగ భవత్కల్యాణ సంపాదనా
వేశం బూనిన సాంబమూర్తికి జగద్విఖ్యాత కీర్తిప్రదం
బాశీర్వాద మనుగ్రహింపఁగదవమ్మా ! యాంధ్రవీరప్రసూ ! 2

మ. అతఁ డేమో నిను విస్మరించె నని రోషావిష్టులై మొన్న నీ
సుతులెల్లన్ నిరసించి రట్టి సదికిన్ జో టిచ్చునే లోక వి
శ్రుతశీలుండగు బుల్సుపండితుఁడు? వచ్చుంగాక దుర్దాంత దు
ర్గతి పుంజమ్ములు కూలికిం గుడుతురే కాకోలమున్ నీప్రజల్? 3

చ. అటు సుతుఁబూడ్చి పెట్టె నిటు లందుకొనెన్ భరతోర్వి శృంఖలా
పటల విపాటనక్రియలు; బాపురె ! దండహతిక్షతాంగుఁడై
జొటజొట నెత్తురోడినను శూరతఁ బాయఁడు సాంబమూర్తి, నీ
కెటు లతఁ డెగ్గుసేయు జననీ ! వినఁజాలనివాదు లేర్పడెన్ 4

## రాయబారము

గీ. ఏటికో దిక్కు మాలిన యీ జొహార్లు, దేనికో సిగ్గులేని యీ దేవురింపు
లేలొకో రాయబారముల్ జేలమొగము, లెందులకొ రాష్ట్రలక్ష్మికై యింతరగడ 1

గీ. ఎవ్వఁ దాదాత మనరాష్ట్ర మిచ్చి పంప, వరము లిద నెవ్వఁడా లోకవల్లభుండు
యాచనాదైన్య మెఱుంగని యాంధ్రజాతి, యింత దిగజాఱునే యెంతవింత పుట్టె 2

గీ. ఎండమావుల వెంటఁ బర్వెత్త నేల, మేంక మెడచంటి కీపాటిమెప్పు లేల
యరసి యాత్మావలోకన మాచరింపుఁ, దదిగొ ! మనముక్తి మనచేతియందె కలదు 3

గీ. విశ్వరూపమ్ముఁ జూపించు వేళలందు, టిప్పవోవుట లోకమ్ము మెచ్చఁబోదు
వినయ మది యెంతసేవ్యమై వెలయుఁగాక, తలబిరుసువారి మన్నింపఁ దగదు తగదు 4

## ఆంధ్రనాయకుఁడు

చ. ఎవఁడుర వాఁడు * తెల్గులకు నింతయుఁ గట్టడ లే దటంచు, వా
రవగుణు లంచు, నొక్కదొరయాజ్ఞకు లోపడి మేలికార్యముల్
తవిలి యొనర్ప రంచు, నొకతత్త్వవిదుంబలె నంధ్రపూరుష
శ్రవణవిదారకమ్ముల నసత్యములన్ సభలందుఁ గూసెడిన్ 1

ఉ. పందలమాట కేమి? గుణభద్రులు సాహసమూర్తు లాంధ్రుల
స్పందపరాక్రమక్రమవిశారదులై మొనమొన్న దాఁక మ
ధ్యందినభానుమండలవిధమ్మున వెల్గిరి దక్షిణాపథం
బుం దమ బాహువప్రమునఁ బ్రోచిరి మోచిరి కీర్తిభారముల్ 2

ఉ. చావున కెన్నఁడున్ మదిని జంకరు యాచకదైన్య భారమున్
మోవఁగలేరు నీచులకు మ్రొక్కరు చిక్కరు నిత్యకౌతుక
శ్రీవిభవాభిరాములు విశిష్టయశోభిరతుల్ స్వతంత్రతా
సేవకె ధారవోయుదురు జీవధనంబుల నాంధ్రసోదరుల్ 3

ఉ. అఁదుది తెల్గుజాతిది యొయారము లూరెడి జవ్వనంబుతోఁ
గూడి సమస్తభోగములకున్ గుదు రైనది సంగరమ్ములో
నోడిన జీవితేశ్వరునియుల్లము గాయముచేసి వెండియున్
వేఁడిమిదెచ్చి మెచ్చి రణవీధికి నాధుని సాగనంపదే 4

* అనాంధ్రుఁ డొకఁ డీ నింద గావించె.

ఉ. జెబ్బులివంటి మా తెలుఁగుబిడ్డమగంటిమి మొన్నసైతమున్
బొబ్బిలికోటలో నుబికి పొంగి పరాసుల ముంచిముంచి త
బ్బిబ్బొనరించి శాత్రవుల బిట్టుపొగడ్తలఁ గాంచదా జగం
బబ్బురమంద నాఁచికొనదా శరదిందువికాసకీర్తులన్ 5

మ. శ్రుతులన్ గ్రోలిచి ధర్మమర్మములు సంశోధించి బోధించి, గా
ఢ తపశ్చర్యల ముజ్జగమ్ము వడఁకాడం జేసి నానాధ్వర
వ్రతులై పొల్చుటగాక ఘోరసమర వ్యాపారపారీణులై
నుతికిం జాలిన భూసురు ల్గలరె తెన్గుంగడ్డ వర్జించినన్ 6

ఉ. చాలినజాతిరా ! తెలుఁగుజాతి నిరంకుశవీరజాతిగా
నేలినజాతిరా ! విధి సహింపనిదై పెడచూపుచూచుటన్
గూలెఁ దెనుంగుటేఁడు తలికోటరణమ్మున; నాఁటినుండి యీ
నేలకుఁ దగ్గ వాఁడిగల నేత లభింపఁ డిఁ కేమి సెప్పుదున్ 7

ఉ. కమ్మనిమాట లాడి నయగారము సూపినమాత్రం జచ్చు పె
ద్దమ్మలనాయకత్వ మిసుమంతయు నోర్వఁడు తెల్గుబిడ్డ; శౌ
ర్యమ్మున కంచితాశయపరంపరకున్ గుదురైన తేనికై
క్రుమ్మరుచుండె వీఁ, డితనికోరిక లెన్నఁటికిన్ ఫలించునో ! 8

## కృతజ్ఞత

ఉ. నీవు దురంత దాస్యమున నిచ్చలు క్రుంగుట నోర్వలేక నీ
సేవకు నీసుతుల్ గుణవిశిష్టులు నూల్కొని కార్యసిద్ధికై
రేపగలున్ శ్రమంపడుతతిన్ జననీ! తెనుఁగుంబ్రభుత్వ మే
లా వల దంచుఁ గాంగ్రెసుమహారథు లాడిరఁటమ్మ! నిర్దయన్ 1

ఉ. వంగజగత్తుఁ జీల్చిన లవంబును సైఁపను దానిపుష్టికై
యంగదలెల్ల నోర్తునని యక్కపయిం గలపేర్మిఁ గూరుముల్
పొంగులువాఱఁ దోడ్పడిన పుణ్యచరిత్రకు నీ కఁటే యిటుల్
భంగము సేయఁబూనుట సుబాసు; సెబాసు! కృతజ్ఞుఁ డీతఁడే! 2

ఉ. వాసిగలట్టినీకుఁ దలవంపులు గూర్చెదు శాసనమ్ములన్
జేసెదు పెద్దలన్ విడువఁజెల్లదె నీసుతు? లిందు లేశమున్
దోసమురాదు సంశయముతోఁ బనిలేదు నభఃప్రసూనముల్
వాసన పంచునాఁడు మనవైభవ మేర్పడునట్టె! వింటివే? 3

గీ. మంత్రిపదవులకొఱకంటె మనకు రాష్ట్ర, ముత్తయార్భాటమట్టె! యాంధ్రోద్యమంబు
తూర్పుపడమర లెఱుఁగఁగా నేర్పు లేని, తీర్పరుల నాశ్రయింతురే తెలుఁగువారు 4

## సాంత్వనము

మ. ఒక "యంత్రబ్రహ్మ" తెలుంగురాష్ట్రమునకేదో "కుంభకోణంబు"సేఁ
తకునై మొగ్గర మొడ్డినాఁ డని మహోదగ్రక్రుధావిభ్రమద్
భ్రుకుటిం జూపఁగనేల గ్రుద్దులిమి గంతుల్వెట్టఁగానేల శౌ
ర్యకళాభిజ్ఞుల కేల పిచ్చుకపయిన్ బ్రహ్మాస్త్రసంధానముల్ 1

మ. ఎపఁడో మీ సిరి కద్దువచ్చు టది వింతే? యాంధ్రజాతీయతా
సవనం బేలిన ఋత్విజుం డని ప్రశంసం గన్న సోదర్యుఁడే
యవినీతిన్ దలఁ దాల్చి కాసులకు నాహో! దాసుఁడై "తెల్గువా
రవివేకుల్ జగదేకనింద్యు"లని కూయన్ వ్రాయ నుంకింపఁగన్ 2

మ. మన దేవయ్య మఱొక్కరుండు "తెనుఁగేమాటాడరా"దన్న శా
సనము న్మెచ్చె నిఁకొక్క భైరవుఁడు లజ్జాత్యాగ పారీణుఁడై
"తెనుఁగుంజాతికి రాష్ట్రమేటి"కని ధిగ్ ధిగ్రావముల్పల్కెఁ బ
చ్చనికూటంబున; నెచ్చటంగలరు దేశద్రోహు లేతాదృశుల్? 3

మ. శకమున్ నిల్పినజాతి, మాతృజగతీ సమ్మానసంపత్తికై
సకలం బిచ్చినజాతి, కీర్తిలహరీస్నానప్రియుల్ మూఁడుకో
ట్లకుమారు ల్గలజాతి, వీరిఁ గని కంట న్నిప్పులన్ నీరమున్
బ్రకటింపం బనియేమి కేవలతృణప్రాయు ల్గదా తాదృశుల్ 4

## అఱవలు

చ. కలుములతల్లికిన్ దెలుఁగుగడ్డకు రాచతికంబు వచ్చినన్
దెలుఁగులవిత్తముల్ గుడిచి త్రేఁచెడిభాగ్య మదంగునంచు వి
హ్వాలులయి వెఱ్ఱులెత్తి యఱవల్ గఱువల్ నిరసించుధర్మముల్
పలికిరి పాలలోఁబడిన బల్లులకైవడిఁ దల్లడిల్లుచున్ 1

ఉ. చెన్నపురం బహో! తెలుఁగుసీమకు రాదఁట, వేంకటేశ్వరుం
దన్ని విధంబులన్ దమిళుఁడట్టె, యొకప్పుడు చోళరాజు లోఁ
గొన్నకతాన సింహపురికూడను ద్రావిడ మంట, యొట్టిటో
పెన్నకు నీవలన్ విడిచిపెట్టిరి చేరెఁడు తెల్గువారికిన్ 2

ఉ. రాజకులావతంస మపరాజితశౌర్యకళావిభాసి మా
రాజనరేంద్రభూవర పురాకృతపుణ్యఫలంబు కంచిలో
రాజులు మెచ్చఁగాఁ దమిళరాజ్యము నేలఁగలేదె చోళులే
రాజులుగారు పాండ్యులె పరాక్రమశీలురుగారు కా రయా! 3

ఉ. అల్లరిమూఁకలై తిరుగునప్పుడు మిమ్ముల దిద్ది తీర్చి మీ
పల్లెలు పాఁడిపంటలకుఁ బాదులు చేసి కళారహస్యముల్
తెల్ల మొనర్చు హర్మ్యములు దేవళముల్ తమకిచ్చి రెవ్వరా
పల్లవు వాంధ్రజాతినరపాలురయా! కనుఁగొండు ద్రావిడుల్ !

సీ. సడిసన్న బీరంబు చాటి మిమ్మేలిన,విశ్వనాథుఁడు తెల్గువిభుఁడు గాఁడె
కనుసన్న మీయూడిగమ్ము లందిన చెవ్వ, ధరణీశుఁ డాంధ్రసోదరుఁడు గాఁడె
కన్నసంతానంబుగతి మిమ్ము సాఁకిన, యచ్యుతుఁడాంధ్రనాయకుఁడు గాఁడె
పాలించి మీకు సభ్యతరుచుల్ గఱపిన, రఘునాథుఁడు తెలుంగురాజు గాఁడె
గీ. తమిళసోదరులార ! వాదంబు లుడిగి, మధుర, తంజాపురాదులు మాకొసంగి
సింహపురమును మీరలే చేకొనుండు, నిగ్రహింపము మీ ధర్మనిర్ణయంబు 5

శా. ఎంచన్ దిర్పతిలోన నూటికి నొకండే లేఁడు మీవాఁడు, పో
షించెన్ రాయలు భూరిభోగములఁదత్ క్షేత్రంబు, నద్దానిలోఁ
బంచారించెను జాంధ్రమాన; మది మాభాగంబుగా కేమగున్
గొంచంబోవక తెల్పుఁడీ తెలుఁగులన్ గ్రుక్కింతురే పిడ్గులన్ 6

ఉ. అందనిమ్రానిపండ్లకొఱ కఱ్ఱలు చాఁపకుఁ డింద్రజాలముల్
వందలు వేలు సూపి పెదవాదమునల్పినఁ గోవిదుల్ సెబా
సందురటయ్య ! చెన్నపుర మాంధ్రులసొత్తని యుగ్గడింపఁగన్
గ్రందుగఁ జేటలోని వెలఁగల్వలె నున్నవి మేటి సాక్ష్యముల్ 7

సీ. ఏ పురమ్మున కాజ్ఞ యిచ్చి రాంధ్రక్షమా, పాలకుల్ శతశతాబ్దములకొలఁది
ఏ పురమ్మున కాఖ్యయై పొల్చు దామెర్ల, వెలమవీరుని చెన్నవిభుని పేరు
ఏ పురీపాలనవ్యాపారసభ నందె, నగ్రతాంబూలంబు నంధ్రభాష
ఏ పురాభ్యుదయమ్ముకై పంచిపెట్టె మా, తిమ్మనాయండు మందిరసహస్ర
గీ. మే పురమ్మున కలరు జెంటూపురాఖ్య, యే పురం బది మదరాసునై పొనర్చు
నా పురం బాంధ్రలక్ష్మికిం గాఁపురమ్ము, కాదుకా దంట మతిలేని కదుపుమంట 8

క. ఎఱుఁగుదురా? మీ రాంధ్రుల, గరిమమ్మున కానవాలుగా నిటఁ బెండ్లిన్
దురగము నెక్కమి, పందిరి, సరిగుంజల నిల్పు సాహసము నేర్వమియున్ 9

ఉ. బల్లలమీఁద మా తెలుఁగుబాలుర నుంచుచు నేలమీఁద మీ
పిల్లల నిల్పి మున్ను చదివించెడివారఁట యొజ్జ లిప్పురిన్
జెల్లరె ! మేనయత్తకును జిక్కనిమీసము వచ్చి నేఁటికీ
వల్లడిపుట్టె గ్రుడ్డెగిరివచ్చెను బిడ్డను వెక్కిరింపఁగన్ 10

మ. పొరపొచ్చెంబులు లేనివాఁ డగుట మీ పోకిళ్ళు గుర్తింప లే
కఱవం బాడిన తెల్గువాని జనసంఖ్యల్ గూర్చు కాలాన మీ
రఱవన్ జేసినమాట నిక్కువముగాదా చెల్లునే యింత ద
బ్బఱ ? పంచాంగము పోయినంతనె నశింపంబోవు నక్షత్రముల్ 11

సీ. ఆంధ్రకేసరి సైమ నదరిపోవఁ దుపాకి, కెదురుగా నిలిచి రొమ్మిచ్చునాఁడు
నీలువిగ్రహము నిర్మూలించుకొఱకు నాం, ధ్రులు కుఠారంబులు నూఱునాఁడు
రంగయ్యనాయఁ డారంభించి శాసన, ధిక్కారశరము సంధించునాఁడు
దుర్గచందాన మాదుర్గమ్మ చెల రేఁగి, శాంతిసంగ్రామంబు జరుపునాఁడు
చెన్నపురిఁ జిన్నపాపలై యున్నవారె, యొడలెఱుఁగని నిద్రలో నడఁగినారె
దున్నఁబోవ దూడలలోనఁ దూఱువారు, మేయఁబోవంగ నెద్దలో మెలఁగఁదగునె 12

శా. ఎందుం జెల్లని పొల్లువాదములు మీ రెన్నాళ్ళు సాగించినన్
మందప్రజ్ఞులుగారు తెల్గులు భయోన్మాదక్రియామగ్నులై

"తందానా"యని మిమ్ము మెచ్చరుసుండీ! తాటాకు చప్పుళ్ళకున్
గుండేళుల్ వెఱంగందునే పఱచునే కుంచించునే వాలముల్ 13

మ. అనుకూలించె సుపశ్రుతుల్ జయజయవ్యాహారసంపన్నముల్
వినిపించెన్ సుర లిచ్చుదీవనలు మా విక్రాంతి నిర్వక్ర మీ
తెనుఁగుంజోదులు నేఁడు మార్కొన మహాదేవుండె శంకించు మా
మనముల్నొచ్చెదు చేఁత లేల రథమున్ మళ్ళింపుఁడీ ద్రావిడుల్ ! 14

శా. మా శిల్పంబులు శాస్త్రముల్ కవితలున్ మర్యాదలున్ శేముషీ
వైశారద్యము లన్యదుర్లభ యశస్పొంతంబులై యుంటకున్
దేశంబున్ విభజింపఁగా వలసె నంతేకాని మీరందఱున్
మాసొమ్మున్ దినుచుంటఁగా;దదిచిఛీ! మా కేమి లెక్కా?జమా? 15

ఉ. మా విమలార్కుఁ డాతనికుమారుఁడు రాజనరేంద్రుఁ డద్ధరి
త్రీవిభునందనుండు తమతియ్యము వియ్యము నంది; రాంధ్రులున్
ద్రావిడు లాత్మబంధువులుకదా పరికింపుఁడు కాదుకా దనం
బోవదు నేఁటికిన్ వెగటుపుట్టెనె మీకుఁ దెలుంగునా రనన్ 16

ఉ. వేఱిమి లేదు లేదు మము వేఱుగఁ జూడకుఁ డచ్చమైన మీ
కూరిమి పేరిమిం బడయఁగోరిన తమ్ముల మేము; మిమ్ములన్
దూఱిన మాకు నిడ్డెనలు దోసెలు తైర్వడ లుప్పుమావు సాం
బారు నొసంగి యింకెవరు పండువు సేయఁగనేర్తు రక్కటా ! 17

చ. తరుణుల మోవితేనియలు త్రావకపోయిననేమి స్వర్గపుం
బరిచితిగూర్చు సోమరసపానము సేయకయున్న నేమి మా
కరుణగభ స్తిబింబ ముదయాచల మెక్కకమున్నె వెచ్చనై
గరగరమైన కాఫి యొకక ప్పిదిగో యని యయ్య రిచ్చినన్ 18

## పట్టాభికిజే

శా. పట్టన్ బగ్గములేనిచందమున సప్తద్వీప మా భూమికిన్
బట్టాదారుల మే మటంచు నఱవల్ ప్రత్యర్థులై జాతికిన్
రట్టుల్ దెచ్చుతఱిన్ ద్రివిక్రముఁడవై అంపిల్లి మాఱొద్ది తౌ
పట్టాభీ! జయలక్ష్మి తావక భుజాబంధంబు మన్నించుతన్ 1

మ. పరువుంబాసిన జీవితం బింక సహింపంజాల మంతంతకున్
బరువౌచున్నవి తల్లికష్టము లనల్ప స్థైర్య రేఖాసము
ద్ధుర తేజంబున వార్ధులింకిన గిరిస్తోమంబు లుజ్జ్వాగినన్
బరమేశుం దదలించినన్ నిలుప కీ ప్రస్థానసంరంభముల్ 2

ఉ. రక్కసతాల్మి నోర్చితిమి రాష్ట్రములేని పరాభవంబు నల్
దిక్కుల ధిక్కృతిధ్వని ప్రతిధ్వనిసేయఁ దొడంగె ముజ్జగం
బొక్కట వేఁడుకొన్న మొగమోటకు నియ్యది వేళగాదు నీ
యుక్కు వెలార్చి యాంధ్రవిజయోత్సవదాతవుగమ్ము సోదరా ! 3

మ. ఎవఁడేమూలుగుమూల్గినన్ దెలుఁగునాడీనాఁడు సోత్సాహమై
భవదాజ్ఞావశవర్తియై యశము సంపాదింప నుంకించెడిన్ ;
అవిగో పింజలుపింజలై విరిసె నీర్ష్యామేఘపుంజంబు లి
య్యవిగో నీకు ననర్ఘ రత్నకుసుమవ్యాకోశముల్ దోసిళుల్ 4

## తెలుఁగుతల్లి

ఉ. చెక్కలుచెక్కలై చెదరి చేవదొఱంగిన నీదుగడ్డకున్
దిక్కులు చూచిచూచి పరిదీనతఁ గ్రుంగిన నీదుబిడ్డకున్
జక్కనిరాజయోగము వశంపడె నేఁటికి నీ దురాపదల్
ముక్కలుముక్కలై ప్రిదిలిమూల్గుచు నీల్గుచునుండె నంబికా ! 1

సీ. రుద్రమాదేవి పౌరుషపతాకలనీడ, సొంపుపెంపులు గన్న శూరసీమ
పోతనార్యుని క్రొత్తపూఁదేనెకైతతో, సుడివోని కైవల్య మిడిన పొలము
సర్వజ్ఞసింగమ క్ష్మానాథ వైదుషీ, వల్లికల్ కుసుమించి వలచుతోఁట
జగమెఱింగిన బౌద్ధ శైవ శిల్పమహస్సు, పొంగిపొర్లెడు కళాభోగభూమి

గీ. కోటిమందిబిడ్డలు నిండుకొన్న గీము, మన తెలంగాణ మీనాఁడు మల్ల సఱచి
తరతరంబుల దాస్యబంధములు త్రెంచి, కులుకుచున్నది కంటివే తెలుఁగుతల్లి ! 2

ఉ. చాలినజాతి నీ తెలుఁగుజాతి సముజ్జ్వలశూరజాతి, నీ
బాలురు వృద్ధులుం గదనపార్థు లిఁకన్ మన కేంద్రమన్న లో
కాలు వడంకు నెట్టి మొనగాంద్రకునేని పటేలుకంటిపై
వాలినయెట్టిదాలు జమువాకిలిఁజేర్చు సవాలు శంకరీ ! 3

గీ. ఒడ్డెమాగాణమునఁ జిక్కువడ్డకొడుకు, బెంగతో బెంగుళూరఁ గన్పించుపాప
చేరుచున్నారు నీ పొలిమేరలోన, నీకు నిం కేమి కలదు తల్లీ ! కొఱంత ! 4

మ. అనవద్యప్రతిభాసముజ్జ్వలుని దేశారాధక గ్రామణిన్
మనపట్టాభిని విశ్వభారతము సమ్మానించెఁ; బేర్గన్న నీ
తనయుల్ నేఁడు పరస్పరాదర సముద్రస్నాన సంశుద్ధులై
తెనుఁగెల్లం బులకింపఁజేసిరి సవిత్రీ ! క్రొత్తసంక్రాంతితోన్ 5

ఉ. పాపముపండి బాఁపలని బట్లని సెట్లని రెడ్డు కమ్మలుం
గాఁపులు వెల్మలంచు మఱి క్రైస్తవు లన్య్ లటంచు నిద్దపుం
గాఁపురమెల్లఁ జీల్చి పలుకయ్యములంబడి స్రగ్గి మ్రగ్గి సం
తాపములంది నేఁటి కొకదారికి వచ్చిరి బిడ్డలందఱున్ 6

మ. సకలాంధ్రం బొకరాష్ట్రమై చతురతా సంపన్నతా ధన్యమై
సుకవీంద్రస్తుతిపాత్రమై శతకళాశుద్ధాంతమై కాంతమై
కళుబంతంబులనెల్ల నీ జయపతాకల్ నిల్పులగ్నంబు చెం
తకువచ్చెన్ నిటలాక్షుఁ దడ్డపడినన్ సాగింతు మీ పంతమున్ 7

సీ. గౌతమీ కృష్ణవేణీ తుంగభద్రల, కానకట్టల నాలు గైదు తీర్చి
చతురబ్ధివీచికా తతశిరశ్ఛటలపై, వెలలేని తెల్గునావలను నడిపి
రతనాలముత్యాలరాసులు త్రవ్వి నీ, కోటవాకిళ్ల మ్రుగ్గులు రచించి
సడిసన్న తెల్గుబాసకు వాడవాడలఁ, గపురంపుటారతుల్ కాన్కలిచ్చి

గీ. చేవదేలిన నీ రాచఠీవి గాంచి, యక్క సెల్లెంద్ర నోరూరున ట్లొనర్తు
మాంధ్రజననీ ! సువర్ణ సింహాసనంబు, చేరరావమ్మ ! పట్టాభిషేకమునకు ! ! 8

(ఆలిండియా రేడియో - విజయవాడ కేంద్రమువారి సౌజన్యముతో)

## ఆహ్వానము

మ. పగవారై భవదీయ మభ్యుదయమున్ భంగించు నీర్ష్యాళువుల్
జగమందుం గల రంచు నోడకుము నీ సంతానధీసత్యముల్
తెగువల్ గణ్యములౌ టెఱుంగవె నినున్ దేజోనిధింజేసి నీ
సిగపూ వాడఁగనీ రిఁకన్ సుతులు సంసేవింతు రాంధ్రప్రసూ ! 1

చ. పొరపడి కొన్నినాళ్ళు పెదబుద్ధులు మెచ్చిరి, నీ మహత్త్వమున్
మఱచిరి, భక్తిమై సవతిమాతను గొల్చిరి, వచ్చె నిచ్చె మా
వరము లటంచు మూఁపు లెగవైచిరి, నేఁటికి మొట్టికాయలే
దొరకుటఁజేసి నీకడ సుతుల్ తలవంచిరి తప్పుసై ఁపవే ! 2

సీ. చేసేత నంది తెచ్చిరి నైష్ఠికులు పావ, నాంధ్రవేణీతీర్థ మలసి సొలసి
నెఱవేడ్క మున్గి కట్టిరి చిన్ని బాలకుల్, తూర్యధ్వనులలోనఁ దోరణములు
అర్ఘ్యంబు పాద్యంబు నర్పింపభక్తిమై, సిద్ధమైయున్నారు వృద్ధజనులు
కాకలీధ్వనుల మంగళగీతికలు పాడ, నాయత్తమయ్యెఁ గన్యాజనంబు
గీ. వేదబుక్కుల నిన్ను సేవించుకొఱకు, శ్రోత్రియులు నిల్చినారు పవిత్రమతులు
ఆంధ్రజనయిత్రి ! మా పూజలందు కొఱకుఁ గదలిరావమ్మ ! సుముహూర్తకాల మయ్యె 3

సీ. చల్లపల్లి విభుండు, కల్లూరి సుబ్రావు, నీ పల్లకి బుజాన మోపి నడువ
న్యాపతి సుబ్బరాయఁడు వేంకటప్పయ్య, వింజామరంబులు విసరుచుండ
కోట్రెడ్డి రంగయాఖ్యులు తెల్గుశౌర్యంబు, దలఁపించు వీరగీతములు పాడ
రామలింగారెడ్డి రమణీయమౌక్తిక, చ్ఛత్రంబు పట్టి నీ సరస నిలువ
గీ. సాంబమూ ర్తి గళం బెత్తి స్వస్తి పలుక, భోగరాణ్మంత్రి పెత్తనంబును వహింప
నెల్లమాగానులందు నూరేగవమ్మ !, అఖిలవైభవసముపేత ! ఆంధ్రమాత ! 4

## రథోత్సవము

మ. అదిగో ! తెల్గులతల్లి దివ్యరథ ముద్యత్కాంతిపుంజంబులన్
బదిదిక్కుల్ వెలిఁగించుచున్ గదలెడిన్ బ్రస్థానభేరీధ్వనిన్
బధిరంబయ్యె జగంబు మీకుఁ గలకాన్కల్ తల్లి కర్పించి తద్
రథమున్ లాగుఁడుమాతృభ క్తిదయివాఱన్ దెల్గువీరాగ్రణుల్ ! 1

ఉ. ఆ రథనేమిఘట్టనల కగ్గములై మనహేయకాయముల్
తీఱినఁదీఱుఁగాక ! చనుదెందు విచారములేల మాతృసే
వా రమణీయవృత్తమున వందురి సచ్చినవారి జాహ్నవీ
తీరమునందు భోగములఁదేల్తురు వెన్నెల రేల నచ్చరల్

ఉ. చింతలప్రేఁగునం బడి కృశించిన దేశము నుద్ధరింపఁగాఁ
బంతములాడువారికథ బంగరుబంతులతోఁ జరిత్రలో
వింతహొరంగుఁ దాల్చు-సుకవిప్రభువుల్ కమనీయశిల్ప భా
స్వంతములైన కావ్యములఁ బాడుదు రా మధురాశయమ్ములన్

ఆ. అక్కలార ! చక్క చక్కనిపాటతో, బత్తితో నివాళి నెత్తరమ్మ !
కన్నెలార ! పసిఁడిగజ్జెల కులుకుతోఁ, దాండవింపరమ్మ ! తల్లి యెదుట 4

## ఆశీస్సు

సీ. ఆచక్రవాళంబు నాంధ్రజాతీయతా, మధురసౌరభ్యముల్ మలయుఁ గాత
బిగువెక్కి నేలనాలుగుచెఱంగులయందుఁ, దెలుఁగు రాచఱికంబు వెలయుఁ గాత
లక్ష్మీసరస్వతీలలనా నివాసమై, యాంధ్రదేశమ్ము పే రందుఁ గాత
విశ్వమోహనకళావీథియై రుచిరాంధ్ర, శిల్పవిన్యాసంబు చెలఁగుఁ గాత
గీ. రసికలోకమ్మునకు విందు లొసఁగి పొసఁగి, దేశికవితాలతాంగి వర్థిల్లుఁ గాత
తెలుఁగుజనయిత్రి పచ్చతోరణముతోడ, నిత్యకల్యాణరాశియై నెగడుఁ గాత ! 1

ఉ. వచ్చిన రాష్ట్రమున్ దెలుఁగువారు పరస్పర సౌహృదమ్ములన్
మచ్చ యొకింత లేని ఋజుమార్గములన్ నడిపింత్రుగాక ! వా
రచ్చ తెలుంగులై కెలఁకులందలి సీమలపాలి విందులై
హెచ్చినకల్మితోడ సుఖయింతురుగాక ! యశః ప్రశస్తులై 2

## ఆకాంక్ష

ఉ. ఎట్టికఠోరదీక్షలు సహించితినో తొలుబామునందు నీ
కెట్టిదళంబు లెట్టివిరు లిచ్చి నమస్య లొనర్చినాఁడనో
పుట్టితి నీ సుతుండనయి పోఁడిమిగంటిని తల్లి ! వీనికిన్
బెట్టుముభిక్ష నీ యనుఁగుబిడ్డఁడుగా నెపుడున్ జనింపఁగన్ 1

ఉ. నీ రమణీయమూర్తి కమనీయవచస్స్ఫురణంబు దాతృతా
గౌరవ మద్వితీయరసికత్వవిభూతి విశిష్టశౌర్య వి
ద్యారుచిరత్వ మెంతకొనియాడిన మత్కవితాపిపాస చ
ల్లాఱ దదేమి తల్లి ! యిది యాఱక మాఱక యిట్లె నిల్చుతన్ 2

శా. నాకేకాదు భవచ్చరిత్రము లనన్యప్రాప్యధారా రస
శ్రీకంద మ్మన నందగించుకవితన్ జిత్రించుభాగ్యంబు ను
ద్రేకస్ఫూర్తియు నస్మదీయమగు పుత్రీపుత్రకశ్రేణి కీ
వాకల్పాంత మనుగ్రహింపఁగదవమ్మా ! ఆంధ్రవీరప్రసూ ! 3

# తొ లి ప లు కు

## రచన

శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు నాకుఁ గవితా బంధువు. బహుమార్గముల రచనా సంస్కరణాభినివేశములతోఁ బరుగులువాఱుచున్న వర్తమానాంధ్ర కవివర్యుల కులములలో శ్రీ సీతారామమూర్తిచౌదరిగారు సంప్రదాయ సంరక్షణాభినివిష్టులై మడిగట్టుకొని కూర్చున్న శుద్ధశ్రోత్రియ బ్రాహ్మణులు. భాషాసంప్రదాయ సంరక్షణమునం దిట్లుందురు గాని భావావేశమున వారు కడు వడిగా వాడిగా వర్తింతురు. రాష్ట్రగానములో, పఱిగపంటలో నీ తీరు తిలకింపదగ్గది. కావ్యక్రమము ననుసరించి వారి రచనాక్రమము నెఱినీటులు నెఱసి మెఱుఁగులు దేఱఁజొచ్చినది. ప్రకృతగ్రంథమగు 'ధర్మజ్యోతి'లో', వారి కవితాధార దరులొరసికొని నిండారి పార్వాఱినది.

> **"బొజ్జబలిసి నేఁడు విఱ్ఱవీఁగుచునున్న, సాహుకార్లయాట సాగ దిట్లె**
> **రుద్రమూర్తియై దరిద్రుండు చిచ్చఱ, కన్నువిప్పి గజ్జెగట్టు నెపుడొ"**

పద్యరచన మింతకంటె బాగుగా నుండుటకుఁ దెఱఁగు నే నెఱుఁగను. నన్నయ పద్య మీ క్రిందిది.

> **"ఎల్లవారు నెఱుఁగనొల్లని ధర్మువు, బేల నీకుఁ దెలుప నేల వలసెఁ**
> **జిఱుతవాని కింత దఱుసంటి పలుకులు, నన్నె? వృద్ధజనము లున్నచోట"**

ఈ పద్యముఁ జదివి నే నెంత మురిసితినో పై చౌదరి గారి పద్యముఁ జదివి యంత కెక్కువ మురిసితిని.

## కథావస్తువు - కవి

కథావస్తువు కవికిఁదననాటిది, తననాఁటిదియగుట కే నెంతయు సంతసంపడుదును. ఇందుఁ గవికిఁ గథావస్తువు తన నాటిది, తననాఁటిదిమాత్రమేకాక తన వీటిదికూడ నగుట మఱియు విశేషము! ఇందు స్వదేశ, స్వకుల, స్వగురుప్రశంసలు కథాంగములుగాఁ గవికిఁ గుదురుట యానుకూల్య విశేషమేకాక, యాహ్లాదకరమగు నదృష్ట విశేషముకూడనయ్యెను. ఏతత్ ప్రశంసలు, కథా మధురభక్ష్యమునకుఁ గమ్మ నంజుళ్లు! ఇందు వెలనాటి, ధనదవోలి వర్ణనలు రుచిరములు. స్వవంశప్రశంస సంగతము, శ్లాఘ్యము; స్వగురుస్తుతి సంస్తవనీయము.

ఈ కబ్బమున నుప్పరివాండ్రు తమకు దొరకిన బంగరును జాటుసేయక వెల్లడించియే యుండిరేని యం దెంతో కొంతవంతు దొరతనమువారు కైకొని, కడమ వారికిచ్చి యుందురు. వారు సంపన్నులు నయి యుందురు. అది క్రమ మార్గము. చదువురానివారు గాన వారు దానిని గోమట్లపాలు చేసి చెడిరి! దాని నపహరించిన బేరులు పదపడి దానినెట్లు జీర్ణించుకొనిరో, వారు కుబేరులే యైరో, బికారులేయయిరో యెఱుఁగముకాని కథలోని కోమటిమాత్రము పెక్కేండ్లు దాని మూలమునఁ జాలఁ గడగండ్లు కుడిచినాఁడు! ఆ కడగండ్లతో నాతని దోసము తొలఁగెఁగావలయు! నారయ్య దాఁపఱికమున కొప్పుకొనుటలోఁగూడఁ గొంత కొఱఁత లేకపోలేదు గాని యది యా ధనమును దా నర్థింపకుండుటతోఁ దొలఁగెఁ గావలయు! ఈ కొఱంతచేతనే యేమో తన ధర్మఫలమును దా నాస్వాదించి చూచుటకు నారయ్య కెంతో కాలవిలంబము కలుగవలసెను.

ఇందుఁ గధా ప్రధానపాత్రమగు నారయ్య స్వార్ధరాహిత్యము మూలమున 'ధర్మజ్యోతి' వెలిఁగినాఁడు! ఆతఁ డా నాఁట సంపత్సమృద్ధుఁడు కాఁడు! సంపన్నుఁడే యగుఁగాక! ధనాశకు సంపన్నత బాధకముగాదు సరిగదా, మఱింత సాధకముగూడ నగుట కలదుగదా! అయినను బంగారులప్పులు సులువుగాఁ జొప్పడ నున్నప్పుడు - వణిజుఁడిచ్చెదననికూడ నన్నప్పుడును దా నందుల కొప్పుకొనక తృణీకరించినాఁడు నారయ్య. ఈ నాఁ డాతఁడు కొంత బంగరును వణిజునొద్ద గోఁజాడి యార్జించియుండినచోఁ దానును ధనిక విడంబనములకుఁ బాల్పడి యే మేమో యయియుండువాఁడేమో! కాన దాని నతఁడర్థింపలేదు ఇక్కడ నారయ్య శీలసంపద మిక్కిలి మెచ్చఁదగినది

ఏకాంతమున నెవ్వరికి నెఱుకపడ వీలులేని తెఱఁగునఁ గాంతాకనకములు సమకూడఁ దగిన సంఘటన లేర్పడఁగా నిబ్బరముగా నిట్లు "నేను నిగ్రహము నెఱపుదునుగాక" యను దృఢవ్యవసాయముతో జాగ్రత్త వహించి నిలిచి శీలమును శిక్షించుకొని రక్షించుకొనఁగల్గువారు లోకమున నెన్నఁడేని నరిదిగాఁ గొందఱేయుందురు ఇట్టిమహత్త్వము నారయ్యలో సునాయాసముగాఁ గుదుర్కొన్నది. దీనికి సంపన్నత, చదువు సందెలు నావశ్యకములుకావు గాఁ బోలును! సుకృతవిశేషమే!

నారయ్య సెట్టిమిత్రునకు మట్టిలోదాఁచిన బంగారు ముద్దలిచ్చివేయుటమాత్రమే కాక తన పొట్టలో నేచిన నిండారు సుద్దులను, బంగారుకంటె విలువ గలిగినవానిని గూడ నొసఁగినాఁడు నిజముగా నారయ్య యా నాఁ డట్టి సూక్తులను సెట్టికి వినిచినాఁడోలేదో కాని పుత్త్రరూపమగు నారయ్యయాత్మ (ఆత్మావై పుత్త్ర నామాసి) నేఁడు నా డెల్లరకుఁ గూడ వినిచినది నారయ్య నాఁ డట్లు శీలమును శిక్షించుకొని వర్తించినందులకుఁగా నెట్టి ఫలమును బడసిఁనాడో యది 'ధర్మజ్యోతి' జూచువా రెల్లరు నేఁడు కనుఁగొనఁగలరు తధావిధమైన సుకృతపరిపాకమే యా పుణ్యాత్ముని కడుపుపంట శ్రీ సీతారామమూర్తి చౌదరి! నాఁటి నారయ్య సుకృత బీజమే యిప్పు డిట్లు సత్కావ్య కల్పకశాఖిగాఁ జెట్లుగట్టి చెలఁగుచున్నది

కృష్ణాతీరమునఁ బేర్వెలయు కమ్మకొలమువారు ప్రాయికముగా రెండువేలేండ్లనాఁడు బౌద్ధధర్మ పరిపాలకులయి విఖ్యాతిఁగన్న 'కర్మరాష్ట్రీయు'లే యగుదురని నా నమ్మకము! అట్లే యేని యట్టి సంస్కారవాసనగల కొలమున నిట్టివారు వెలయుట సంగతమే కదా!

శ్రీ సీతారామమూర్తి చౌదరి గారి కోరికి గూడ, "మాకుఁ, మా సంతతికిని ధర్మ వ్యాసక్తియె సిరులకంటె నగ్రియమగుతన్" - అన్న పద్యార్థమున వెల్లడి యైనది వీరి వంశ మిట్లే సుగుణవైభవముతో వెలయుచుండున ట్లీశ్వరుఁడనుగ్రహించుఁ గాక !

**వేటూరి ప్రభాకరశాస్త్రి**

పార్థివ - దీపావళి

# అంకితము

చ. సదలని కీర్తిపైఁ బ్రభుత సల్పుతలంపున మామకీన నె
వ్వఁడువలచెన్గృతిన్మధురవర్తనుఁ దాతఁడు వెల్లపూఁడి వం
గడమున మేలుబంతి చిరకాలపు నెచ్చెలికాఁడు దానయా
ఖ్యుఁడు పొలివోనిసంపదలకున్ గుదురయ్యెడుమిందునందునున్ 1

క. కమ్మకుల పయోనిధి, రాకాచంద్రముఁడు కావ్య రమణీయత్వ
శ్రీకిన్ లోపడి నాకడ, కీకమ్మను బంపెఁ బద్యహృద్యత వెలయన్

క. "శ్రీమత్తుమ్మల సీతా,రామకవీ ! సుకవి లోకరంజన ! సుగుణ
స్తోమాభిరామ ! నీ కవి, తా మహిమము నుగ్గడింపఁ దరమే నాకున్ 2

ఆ కట్టమంచి రెడ్డి కనుసన్నఁ గూడిన, సింహపుర సుధీప్రసిద్ధ సభను
దిక్కనార్య సత్కృతిం గంటి "వభినవ, తిక్క"నాఖ్య వన్నెకెక్కఁజేసి 3

క. నీతికి నెలవులు కవితా, రీతులకున్ గనులు నీదు కృత్యు లందుఁ గదున్
నూతనమై తగు "ధర్మ, జ్యోతి" మదంకితము గాఁగ నొనరింపఁగదే 4

క. హితుముచ్చట మన్నించుట, మతిమన్నత మొాటఁజేసి మత్ప్రార్థన మం
చితముగఁ దీర్పుము పేదలు, కృతజ్ఞతయకాక యేమియిత్తురు కాన్కల్?" 5

శా. నామేల్గీదులఁ బాలు పంచుకొని నానారీతులన్ మామక
శ్రీమత్తన్దలపోయు మిత్రమిటు లుంచెన్ దౌల మస్మత్కృతిన్
లేమిన్ బ్రుంగుటఁజేసి కానుకల నీలే నంచు వెన్నాడు నీ
ధీమద్గ్రామణి దాతృతానిరతి కర్థిన్ మ్రొక్కు లందించెదన్ 6

ఉ. కోరకమున్న యీ హితునకున్ గృతినిచ్చు నదృష్టరేఖ చే
కూరమిఁజేసి లజ్జయును గొందలము న్దలచూపి దెందమున్
గాఱియపెట్టెడిన్ సుజనగణ్యుఁడు దానయకున్ క్షమాంజలిన్
జేరిచియిత్తు మైత్రి కొక చిహ్నముగా నిపుడేని మత్కృతిన్ ॰ 7

కం. కృతమెఱుక చాలు నస్మ, న్మతి కింపద కబ్బమిచ్చి మణి గొంట్మ జగ
ద్ధితశీలుండొదవ నయా, చితమ్ముగా నిడుదు నా సృజించినకవితన్ 8

చ. అగుటన యిచ్చినాఁడ నఖిలాంధ్రసదస్సుల నిస్సమాన కీ
ర్తిగొనిన 'రాష్ట్రగాన' సుకృతిన్ జలపల్లి నరేంద్రమౌళి; కా
పగిదిఁ దలంచి జంకు నెడబాఁసి మదీయము కావ్య మంది వీ
న్మిగులుత దానయాఖ్యుఁడు సమిద్ధయశోవిభవాభిరాముఁడై 9

చ. నరునకుఁ గబ్బమిచ్చుట యనాదృతకృత్య మటంచు సత్కవీ
శ్వరులు పురాతనుల్ నొడువుచందమదేమొ రుచింపదింతయున్
సిరులకు నాసచెంది యొకచెన్నఁటి కిచ్చుట మచ్చ గాని స్వా
ర్థరహితబుద్ధి నిద్ధగుణరాశి కొసంగిన దోస మబ్బునా? 10

క. కావున నే తత్కావ్యము, పావనచరితునకు మృదులభాషాకవితా
శేవధికి మధుమథనపద, సేవానిరతునికి బంధుచింతామణికిన్ 11

క. రంగమహృదంబుజగ్రహ, పుంగవ రామాభిధానపున్నిరయార్ఛ్రీ
రంగప్రావృడ్జలదున, కంగీకృతనైకసుకవిహారిహార్దునకున్ 12

క. శ్రీ విజయవాటికా మహి, ళా వాత్సల్యాంచ " దెనమలకుదురు" సద్గ్రా
మావాస విభాసికి గురు, తా వాసజ్జీవితునకు దానార్యునకున్ 13

# స్వీ కృ తి

క. అభియాతి విదళనస్థిర, విభవ మహత్త్వమున వెలయు విక్రమపురియం
దభినవతిక్కన బిరుద, ప్రభూతకీర్తియ ఁసితండు పరమహితుండున్ 1

క. కృతికన్యా స్వీకారం, బతితరమగు గౌరవమున కాస్పదమగుటన్
హితు నీతని మున్గోరితిఁ, గృతికిం బతిఁజేయ,నిపుడు నది తీర్చెన్ 2

సీ. దాతయా! నిజకవితా సుధామయ వృష్టి
గురిసి తెల్గుల మెప్పుగొన్న ఘనుఁడు
కన్యయా! పరవిత్తకాంక్షాంధతమసంబు
నడఁప ధర్మజ్యోతియైన మాన్య
పెద్దలా ! నవరస ప్రియులైన కవి పండి
తోత్తము లంచితోద్యోగధనులు
స్థలమా ! మహానంద మెలయించు ఫలవృక్ష
రాజిసంశోభితారామసీమ

గీ. సమయమా శాంత హేమంత రమణి సస్య, సంతతికిఁ బెంపు సొంపు లొసంగువేళ
అహహ! ధన్యుఁడఁ గృతిభర్తనైన నాకు, నింతకంటెను వలసిన దెద్ది కలదు? 3

క. పదునెనిమిదేండ్లనుండియుఁ, బొదలెడు మా చెల్మితీవపూవులు జనతా
హృదయముద మొసఁగి దెసలం, బదింబదిం బరిమళము గుబాళించుఁగదా ! 4

గీ. చెలిమి పాటించి కోరికి చిత్తగించి, యంచితప్రేమఁ గావ్యకన్యక నొసంగి
మామగారైన మా సీతరామమూర్తి, కవికి నొనరింతు నిదె నమస్కార శతము 5

వెలగపూఁడి దానయ్య చౌదరి

# ధ ర్మ జ్యో తి

## 1

క. అలనాడు వాసికెక్కిన, పలనా దది తనకుఁ గూర్పుబంధువు గాఁగన్
గలనాఁడులలో మిక్కిలి, వెలనాడై తెలుఁగువారి వెలనాఁ డలరున్ 1

ఉ. శాలిశతాబ్ది భూమిశశిసంఖ్యల నందినవేళఁ జోళభూ
పాలు రుదారులై కదనపండితు లూర్జితభోగభాగులై
యేలిరిదాని "గొంక" ధరణీశ్వరముఖ్యులు మేలుమే లనం
జాలిరి పాలితాళి నిజశాసనముల్ శిరసావహింపఁగన్ 2

ఉ. అంచితు లంధ్రచోళ విభులర్థి నొసంగిన యగ్రహారముల్
పెంచిన కంచితోఁపులును బేర్చినభక్తిఁ గళానురక్తిఁ గ
ట్టించిన దేవళంబులు ఘటించిన కూపములున్ దటాకముల్
మంచిన సత్రముల్ నిరుపమానములై విలసిల్లె నెల్లడన్ 3

గీ. తన్నరేంద్రాలి సర్వజ్ఞతయును శంక, రత్వ మీశత్వ మార్యానురక్తతయును
గామజిత్త్వంబు రాజశేఖరత నేర్చి, తనరె నిజశైవధర్మసార్థకతఁ గూర్చి 4

క. సడిసన్న వారికత్తికి, గడిదొరలు వడంకి మత్తగజమండలిపై
నిడిపంపెడు కప్పము ల, ప్పుడమికి బ్రేఁగయ్యె రత్నభూరిమయంబుల్ 5

ఉ. ఎత్తిరి కోట్లకుం బడగ లెల్లవణిక్కులు రాజదత్తముల్ 6
విత్తము లంది పేర్వడిరి విప్రులు వైదికధర్మకర్మఠుల్
విత్తినవిత్తనంబు పదివేలమడుంగులు పండఁ గాఁపువా
రొత్తిరి శంఖముల్ సిరుల నుబ్బిరి కార్మికు లప్పు దమ్మహిన్ 7

ఆ. "మంటికడవ నులకమంచంబు పూరిల్లు, నూలిచీర రత్నకీలితంబు
గాని పైఁడితొడవు" కానమపో! వెల, నాటిదొరల రాచవీటిలోన

క. అగ్గింపనేర్తు రెవ్వరు?, కగ్గనికస్తూరితోడి కలయంపులపై
బ్రుగ్గులు ముక్తామయములు, నిగ్గుంజగ్గుల వెలార్ప నెగడినదానిన్ 8

*శాసనములంబట్టి దేశవాచి "నాడు" నం దరసున్న వలసె

సీ. చీనా దుకూలసంతానమ్మునకు బ్రహ్మ
భూమీభవ హిమాంబుపూరమునకుఁ
గాశ్మీర హిమవాలుకా కుంకుమములకుఁ
బాంచాల మృగమదభాండములకు
గోవా ప్రశస్తసంకుమదమ్మునకుఁ గొచ్చి
జాజికాయకు గంధసారమునకు
సింహళద్వీప హస్తిఘటా సమృద్ధికి
హురుమంజి ఘోటకోత్కరమునకును

గీ. మేటి జలనోగి బంగారుపేటికలకుఁ
బందువా నవరత్నసంభారమునకు
శరణమై నాఁటి సాటిదేశాలపండ్లు
పులియఁబాఱంగఁజేసె నప్పురవరంబు 9

క. ఆ వీడే ధనదపురం, బా వీడే ధనదవోలు నదియ సనదవో
లీ వేళఁ జందవోలదె, పోవంబోవంగ నయ్యేఁబో! చందోలున్ 10

సీ. మంచన్నకవిశిరోమణి కావ్యకన్యకుఁ, బారాణి పూసె నే భాగ్యరాశి
గడుసుజోదుల విచ్చుఁగత్తి తళ్తళలలోఁ, దిలకంబు దిద్దె నే కలికిమిన్న
నరపాలకన్యకా సరసవీణాగాన, సుఖములో నే కాంత సుప్తివడసె
వందిమాగధుల కైవారంపు రవళిలో, వదలె నేయిల్లాలు నిదురసొక్కు

గీ. చోడరాణ్మండలీ యశస్సుమము విసరు, కసరుఁదావికి నే·కొమ్మ కొసరి పొంగె
నా పురీలక్ష్మి ధనదవో లక్కటా! ని, రస్తవైభవయై నేఁడు కస్తిగూర్చు 11

చ. చెదరిన శాసనంబులును జెల్వమువాసిన దేవళంబులున్
జదునయినట్టికోటలును జాడలుదప్పినపేఁటలున్ భయా
స్పదములు దిబ్బలై మిగులఁ బాడఁటిపోయిన మేడమిద్దెలై
యెద నలయించుఁ దెల్గులకు నిప్పుడు తత్పుర మొక్కపల్లెయై 12

ఆ. బ్రదికి చెడ్డ తెల్గుపదుచులు నేఁడు త, జ్జనపదంబు నీగి చనెడువేళ
నొక మహోజ్జ్వలాశయోర్మి విజృంభించి, కంటికొసలఁ జూపుఁ గనక యుగము 13

## 2

సీ. అంగిలేయు లశీతిహాయనమ్ములనాఁడు, విజయవాటిక చెంత విమలవారి
సంపన్నయై జగజ్జనకల్మషాపహ, యై గభీరప్రవాహాభిరామ
యై సహ్యజాతయై భాసిల్లు కృష్ణకు, నానకట్టను గట్టి వేనవేల
కుల్యల నిరుగెలంకుల నమర్చెడివేళ, నొదవె నిప్పురిపశ్చిమోర్వి నొక్క 1

గీ. కాల్వ; దానిఁ ద్రవ్వ కార్మకులం దొక,మేటియొడ్డెవాఁడు నాటినట్టి
గడ్డపలుగు ఖంగు ఖంగున మ్రోసి కే, లెడసి నేలమీఁద మిడిసిపడియె

క. అబ్బో! యిది యేమిర! చిన, సుబ్బా! యనునంతలోనె చుట్టుకొనిరి యా
గుబ్బగఁ బనివాం డ్రతనిని, దబ్బిబ్బై మానసములుదందడివెట్టన్ 2

క. అటు నిటుఁ జూచిరి గుండెలు, తటతట మనుచుండ నేలఁ ద్రవ్విరి మేలౌ
నిటికలతో సున్నములో, ఘటియించిన లిబ్బి నచటఁ గాంచిరి పేదల్ 3

క. అల్లన కదల్చి పైమఱు, వెల్ల నపసరిల్లఁజేసి హృదయంబులు జల్
జల్లనఁ బసుపుందళుకులు, చల్లెడితల్లులను గనిరి స్వర్ణేష్టకలన్ 4

గీ. సప్తసంతానరతుఁడై ప్రశస్తి గన్న, పురుషుఁ డెవ్వాఁడు వసుధలోఁ బూడ్చె నిట్టి
పసిఁడి యచ్చులు; వాని కా బ్రహ్మకల్ప, మగ్గపడుఁగాక నాకసౌఖ్యానుభూతి 5

క. రెండా? మూడా? కాంచన, ఖండము లొడ్డెలకు నూఱు కన్పట్టెను; దే
తెండని బలియిచ్చిరి నడ, గొండల నవ్వారు పందిగున్నల నిధికిన్ 6

క. భాగించుకొనిరి తమ తమ, భాగమ్ములకొలఁదివెలఁదిబంగరుటచ్చుల్
భోగమ్ముల వెల్లువలో, నీఁగితి మని విరిసి మురిసి రింటికిఁ జనుచున్ 7

క. రొక్కమ్మున కాబంగరు, ముక్కల నమ్మంగఁ దలచి ముదుసలియొడ్డెల్
చిక్కని చీఁకటిముసుఁగునఁ, గిక్కురుమన కూరిలోనికిం జనిరంతన్ 8

క. పరిచితులగు బేరుల ని, ద్దరకున్ దొలఁగించి పైఁడితున్కలఁ జూపిం
చిరి వానికల్మి నెఱిఁగిం, చిరి సరివిత్తమ్ము నభిలషించిరి పేదల్ 9

క. అచ్చులు పొడగన్నంతనె, బచ్చులు పేరాస కగ్గపడి కల్లలకున్
జొచ్చి రిసీ! యివి యిత్తడి, యచ్చులుపొం దనిరి విఱిచి రార్చిరి పెదవుల్ 10

ఆ. కాసుదూద కైదుకాసులబండె యై, కొంపమునుఁగు వీనిగుట్టు పొక్క
నెఱిఁగి యెఱిఁగి మెడకు నురిఁ దెచ్చుకొందుమా, పోదఁ! దదేల లేనిపోని బెడఁద 11

క. తొనఁకనిగంభీరతమై, వణిక్కు లిట్లాడ నొద్దెవాంఁద్ర మొగమ్ముల్
జుణిఁగె నొదళ్లు సెమర్చెను, మనోరథములెల్ల నొక్కమాతే ప్రిదిలెన్ 12

మంజరి

బంగార మని మిట్టిపడితి మిందనుక, నిత్తడి యంద్రు వీ రిది యెంతనిజమొ
కాదంచు దేశానఁ గల వారికెల్లఁ, జూపుట మే లౌనె సొత్తు నిద్దానిఁ;
గష్టించి కూర్చిన కనకమా యిదియు, నెంత లాభించిన నేమి నష్టంబు;
ఆలితో బిడ్డతో నాఱుగాలంబు, మట్టితట్టలు మోసి మనుఁ దంచు బ్రహ్మ
మనమొగమ్మున మూదుమార్లు లిఖించెఁ; బొరపాటుచే నొకప్పుడు వచ్చుఁగాక
నిఱుపేద కొంపలో నిలుచునా లక్ష్మి, వెఱ్ఱులచందాన వెనుకాడనేల
వచ్చినదే వేయివరహా లటంచుఁ, దెగనమ్ముదము వీని దిగు లేల మనకు
నని యెంచి వారు బేహారులం జూచి, యయ్యలారా! వస్తు వరసి మీ యిచ్చ
వచ్చిన వెల యిందు వాదంబు లేల, ధర్మమే జయముగదా మీకు మాకు
ననవుడు వర్తకు లల్లన నవ్వి, యేగానివారలమే కదా మేము
కష్టజీవులు మీరుకదుపేదవారు, పాడిదొఱంగి పాపపుబండి నెక్కి
మీ సొమ్ము తిందుమా మీకేల శంక, యిత్తడిసుద్దలే యియ్యవి నమ్ముఁ
దని మూఁదువీసెలయైదుపలాల, తూఁకమ్ముగల పైఁడితునుకకు రెండు,
రూప్యముల్ చొప్పున రొక్కమ్ముగట్టి, వెడలించి రొడ్డెల వేగకమున్న, 13

ఆ. కలదె యిట్టి ఘోరకలి పేదవాఁ డెంత
యనదయైన వెంగళప్పయైనఁ
దగునె సాహు లిట్లు తడిగుడ్డతో వాని
గొంతుఁ గోఁత పేరుకొన్న రోఁత 14

క. అబ్బినసిరిఁ గని కోమటు, లుబ్బక నిబ్బరము నూఁదియున్నను దుద కా
లిబ్బికథ వాడవాడలన్ బ్రబ్బె గోడలకుఁ జెవులు పైకొని వచ్చెన్ 15

క. పొరుగింటి ప్రొయ్యి రాఁజిన, సరగన్ దమనిప్పు లార్పు సాధువు లెవరో
దొరతనమువారిచెవి నూఁ, దిరి బంగరువార్త కడుపుఁదీంఁడ్రలు వాయన్ 16

ఉ. టెక్కలు కట్టుకొన్నటులు తివ్వన దూఁకిరి చందవోలి నల్
దిక్కులు ముట్టడించి రదలించిరి బేరుల; వారి భాషలో
నిక్కము లేదు లే దని వణిక్కుల పెట్టెలుఁద్రచ్చి లోఁగిళుల్
క్రక్కదలింపఁజాగి రధికారులు పౌరులు సంభ్రమింపఁగన్ 17

క. మూఁడచ్చులకున్ నోఁచిన, వాఁ డొక బేహారి పేదవాఁ డిది గని కా
లాడక చేయాడక వడఁ, కాదుతతిన్ మిత్రుఁ డొక్కఁ డతనిం గదిసెన్ 18

క. వచ్చిన చెలికానిం గని, చచ్చినధైర్యమ్ము కొంత సమకుఱ నతనిన్
బచ్చు కవుఁగింట నిడి వా, క్రుచ్చెన్ మెలమెల్లఁ దనకుఁ గూరినచెట్టన్ 19

క. ఈ బెడఁద దలఁగింపుము, నా బిడ్డల కింత జీవనము సూపుము నా
లేబరపుంబ్రదు కెఱుఁగవె, బాబూ! నీకాళ్ళుపట్టి ప్రార్థింతు ననెన్ 20

గీ. ఏమి సెప్పుదు నక్కటా! యీనఁగాచి, నక్కలకుఁ బెట్టిన ట్లయ్యె నా ప్రయత్న
మన్న! దేవునివలె వచ్చి తభయమిచ్చి, చెలిమి వాటించి నన్ను రక్షింపు మనియె 21

క. ఆతనిదైన్యము గని తన, చేత నయినమేలు సల్పి సెట్టిని దురవ
స్థాతీర్ణుఁ జేయ నేయది, యో తెరు వని మిత్రుఁ దరయుచుండెడివేళన్ 22

సీ. సెట్టి నెచ్చెలికాని చెవిలోన నెద్దియో
గొణఁగ మేల్ మే లనుకొని వయస్యుఁ
దద్దిరా! సరి సరే! ప ద్దన్న నీకేమి
బుద్ధి లేదా కడుపునకుఁ దిన్న
నాఁడే మఱచిపోయినాఁడవా మా సొమ్ము
నెంతకాలంబాయె నిచ్చి; యెన్ని
మార్లడిగిన రిత్తమాటలే చెప్పెద
వౌరా! మొదలుచెడ్డబేర మెట్లు

గీ. సేయమందువు; మాఋణంబీయకున్న, నేఁడు నీపరువది దక్కనేర; దీతఁ
డిట్టులే ప్రేలి తనదారిఁబట్టు నని త, లంపకుము; రట్టుపఱుతు సైరింప నిన్ను 23

చ. అనవుడు సెట్టి యింతటి దురాగ్రహ మేటికి సామి! లచ్చలి
చ్చినటులు మాటలాడెద విసీ !యిపుడింటను జిల్లిగవ్వయున్
గనఁబడదయ్యె నీఋణ మిఁకన్ నిలుపన్ మనసొగ్గదయ్యె నీ
ధనమున కిచ్చువాఁడ సరిధాన్య; మిదే కొనుమంచుఁబల్కినన్ 24

క. ఆయుత్తమర్ణుఁ డందుల, కీయకొనన్గొలుచునెడ గోతములో
మాయముగఁ జొనిపె వర్తకుఁ, డాయచ్చులనెల్ల నుల్ల మల్లలనాడన్ 25

క. వాకిటఁగల రక్షకభటు, లీ కీలక మెఱుఁగలేక యిది యేదో బా
కీ కీచులాట యనుకొని, రా కోమటినంటు వారి నంటుచుఁబోయెన్ 26

క. ధనదునివీటికి గవ్వ్యా, తిని వేలుపుమన్నె కానిదెసఁగల "కావూ"
రను తనపల్లెకు బిరబిరఁ, జను నాతనిమదికిఁ బెక్కు శంకలు తోఁచెన్ 27

ఆ. నాగుఁబామువోలె నాయింటిలో నిలు, వంగఁజనునె యిట్టి దొంగసొత్తు
తా నొకండు తలఁప దైవమ్ము వేఱొండు, తలఁచునంద్రు ధర్మతత్త్వవిదులు 28

సీ. సొమ్ముపోయియు శని చుట్టుకొన్న విధాన
నెదుఱొమ్ముకుంపటై యిది యలంచు
నేమొ, కీడెంచి మేలెంచుమన్నా ; రని
దారిలోఁజీమలు దూఱరాని
ప్రేఁపపొదల్ దాసి పెద్దచీఁకటి చూచి
నమ్మకం బూఁచి దైవమ్ముమీఁద
భారమ్మువైచి జొంపములోన మడిసంది
లోతుగుంటను ద్రవ్వి గోతమూఢ్చి

గీ. పసిఁడియచ్చుల నద్దానఁ బూఁతిపెట్టి, యంగమచ్చమ్ము లుంచి గేహమ్ముసేరి
గుట్టు చప్పుడుగాకుండునట్టు లప్పు, డ ప్పతఁడు వచ్చి కనుచుండె నా ధనంబు 29

## 3

ఆ. సద్దు మణఁగిపోయె సంవత్సరము లొండు, రెండు గడవఁ గనకఖండవార్త ;
గుండె కుదుటఁబడియెఁ గోమటి; కింతలో, మెండుకొనియె మేలిమేలికలలు 1

ఆ. జదలదయ్య మనఁగ జగమెల్లఁ గాఱుఁజీఁ, కటి వయాళిసేయు కాలమందుఁ
గదలె ముదుకబేరి కాఁదారిమాఁదారి, ప్రొద్దుసూచి నిద్రపొత్తుఁ బాసి 2

క. పదుపదుక కేనిఁజెప్పక, యడుగులు మెలమెల్లనిడుచు నాకసియాడన్
వడఁకుచు నాసయె తోడై, నడువ నతం డితపుగీమునకుఁ బయనించెన్ 3

గీ. ఇనుపగజ్జెల దొరసాని కింపు నినుచు, కొంపలోఁదూఁగునం దోఁగి గుబ్బువెట్టు
కూర్మిచెలికాని మెల్ల మేల్కొలిపి కుశల, మడిగి నయగారములతోడ నొడలు నిమిరి 4

క. ఈయెడ నరుదెంచితి వే, లా యని మిత్రమ్ముచేత ననుయుక్తుండై
నీ యెఱుఁగని దేమున్నది, నాయన్నా! యనుచు నాలినాలిగ నవ్వెన్ 5

క. చెలికాఁడంతట నెఱుకువ, తలకొన బేహారియివంగితం బారసి క
న్నుల నిండుకొన్న ప్రన్నని, తెలివిన్ ముదిబచ్చునెడఁద తేఱుకొనంగన్ 6

క. నీ బంగరు నర్థింతునె, యే బెడఁదయు రాని తరుణ మే తెంచినదే
నా బరువున్ దొలంగించెద, వే ! బళిబళి రమ్ము రమ్మికేలా తడయన్ 7

క. అని తేనె లురలఁ బల్కుచుఁ, గనకమ్మున కునికియైనగద్దకు నూర
వ్వనితోడ ధర్మదేవత, పసుపరియై తత్‌క్షణంబ పయనంబయ్యెన్ 8

గీ. బరువుతీఱు నటన్న సంబరము హెచ్చి, కఱువుతీఱు నటన్న ముద్దరిమ మొదవి
యిరవుకొనియున్న గాటంపుటిరులు వారి, కిరువురకుఁ బండువెన్నెలై తెరువుసూపె 9

ఆ. ఎదురుదెబ్బ లెన్నిపడు లంటఁదగిలెనో, దొడ్డపాము లెన్ని యడ్డుపడెనొ
తప్పుదారు లెన్ని తంటాలు పెట్టెనో, నిక్క మరసి యెవఁడు లెక్కచేసె 10

క. ఈకరణి వారలిద్దఱు, నాకాంచనభూమి దఱిసినంతట భక్తి
శ్రీకందమైన మిత్రుఁడు, లోకేశ్వరు దహరవీథిలోనం గనుచున్ 11

క. రామప్రభూ ! కిరాటుఁడు, నామీఁదంబోలె నిల్పినాఁడఁగదయ్యా !
నీమీఁద భారమంతయు; సేమంబా పసిఁడి; కేమి సేయుదు నన్నున్ 12

క. అని సుడివడుచుం బొదకుం, జని పాఁతును గ్రొచ్చి మేలిజగ్గుల కిరవౌ
కనకపుటచ్చుల నారం, గని మత్సుకృతంబు పండెగద యని పొంగెన్ 13

ఆ. అంతఁ బసిడి యెత్తి యంతరంగముతోన, విరియఁబాఱినట్టి వృద్ధవణిజు
కరపుటమ్మునందుఁ గమనీయచంపక, గుచ్ఛ మనఁగ నునిచి కూర్మినినిచి 14

ఆ. నింద లేవి లేక నీ సొమ్ము నీ చేత, నిడు ముహూర్త మెప్పు డెప్పు డంచుఁ
గలవరించు నన్నుఁ గరుణించె నేఁటి కా, రంగశాయి మదికొసంగె హాయి 15

గీ. జాగరూకతఁ గల్గు మిజ్ఞాతరూప, మొదవఁ జూడుము లోకాన మొదవుమోర
పులులు చెరలాడుఁ దేనియ పూసినట్టి, కత్తు లుండును గిల్బిష గ్రామఖనులు 16

ఆ. అనుడు వైశ్యుఁడతని యాత్మపావిత్ర్యంబు, నరసి యరసి విస్మయాక్తుఁడగుచు
బిగ్గఁగౌఁగిలించి పిదపిదనల్‌పల్కు, లదర నొడలఁ బుల్క లంకురింప 17

ఆ. ఎంతవాఁడ వన్న ! యే యోగమో నీదు, చెలిమికలిమి కర్హుఁ జేసె నన్ను
నింతవాఁడనైతి నేఁబుట్టి నీయట్టి, నీతినిధిని జూడ నేరనగుదు 18

ఆ. ధర్మవులు పరశ్శతంబుగ బోధింప, జగతి నెల్లవాఁడు చదురుగలఁడు
సీమ కొక్కదేని జెప్పినటుల్ సేయు, నరుఁడు లేఁడు నిన్ను దొరయువాఁడు **19**

సీ. కన్నెత్తి పరసతిన్గనుటొప్పదని యొకం, డారటంపడును బజాఱమునకు
సత్యం బఖిలధర్మజనకంబ యని యొక్కరుఁడుగడ్డిగఱచు దమ్మిడికి లోఁగి
యతిథిసేవయె రమాపతికొ ల్వకాఁ బల్కి, యొక్కండు తల్లికి దొక్కమాడ్చు
వర్ణభేదములు చావలయునం చని యొద్దు, శాఖాభిమానదాస్యంబు నెఱపుఁ

గీ. గుస్మృతిమూర్తులు ధూర్తు లుత్కోచరతులు, ధర్మవిధ్వంసకారు లేతాదృశులకుఁ
దావలంబైన కలి కెట్లు దక్కితయ్య! నెయ్యరీ ! నీవు వేయేండ్లు నెగడవయ్య! **20**

క. పరధన వైముఖ్యము ని, క్కరణిం బ్రకటింతువే ! జగమ్మున నిన్నున్
దొరసెడి పుణ్యులు గలరే, నరుండవే నీవు వేల్పునాఁజాలవొకో ? **21**

చ. శ్రుతులును బ్రహ్మవేత్తలును సూనృతవాదులు గోవులున్బతి
వ్రతలు నలుబ్ధులై నెగడువార లుదారవదాన్యతాకళా
రతులున కాక యిమ్మహిభరమ్మున కెవ్వరు చాలువారు ప
ర్వతములు నేన్గులున్ ఫణియుఁబందియుమోయుట నమ్మనయ్యెదన్ **22**

క. ఈపసిడినెల్లఁ గొనఁగా, నో పుణ్యనిధీ ! మదీయ ముల్లము వెఱచున్
నాపల్కుఁ గుఱుచసేయక, యేపారినపేర్మి నందు మిందొకముక్కన్ **23**

క. నా నెయ్యుఁడు కటకటఁబడి, యేనా యీహాటకమ్ము నింపుట యిసిరో
మానవున కీదృశస్థితి, రానగునా బుధుఁడు వింట రా నగు నంచున్ **24**

క. తగునే యివ్విధి నన్నుం, బొగడ్తసేయంగ వైశ్యపుంగవ ! మిత్రుం
దగువాని ధర్మువునకున్, మిగిలిన ఘనకార్య మేమి నెఱపితిఁ జెపుమా ! **25**

చ. శిబివలె మేనికండలను జీల్చితి నెట్లు మరున్నదీసుతుం
డుబలె నఖండరాజ్యరమ దుల్చితినొక్కొ దధీచిమౌని య
ట్ల బెదరులేక వెన్నెముక లాగితి నోటు త్రిశంకుసూతిభం
గిఁ బలుకరాని కష్టములఁ గీడ్పడి స్రుక్కితినేమి సెప్పుమా **26**

క. నీ సొమ్ము నీ కొసంగితి, వీస మ్మిడలేద నాదు విత్తము ; దీనన్
నా సౌజన్యము కలదా ? యీసరణికి నుబ్బి యులుప లీయవలయునా ? **27**

క. మిత్రుం డిహపరమంగళ, దాత్రగ్రణి యనుచు నధిగతశ్రుతమర్మల్
సూత్రించి రద్భుతజనుః, పాత్రం బిఁక నేమి కానఁబడు మచ్చరితన్ ? 28

క. వలదు బహూకృతి లేశము, వలాదు నన్మెచ్చుకోలు వలవనిచేంతల్
వలవదు సువర్ణమిది నీ, యిలు సేరిచికొమ్ము నాకిదే పదిలక్షల్ 29

గీ. ఇక్కరణిఁ బల్కి వేగురుఁజుక్క పొడుపు, మున్న సహిరణ్యుఁ గోమటిముదుక నొయ్య
నర్థపతివీటికిం జేర్చి యతని కింత, హితము నెఱిఁగించు టుర వని యిట్లు నొడివె 30

క. ఇది పేదలసొమ్ము సుమా, యెద నుబ్బకు మస్మదీయమే యని, దీనిన్
బదిలించి వెచ్చ పెట్టం, గదవే విదిలించి లోకకల్యాణమునన్ 31

గీ. అనుభవించుట యన నీగి యనఁగ జెదుట, నా నవస్థలు మూఁడు స్వర్ణమున కమరుఁ
గుడుపు నొల్లని దానరక్తుండు గాని, యధముసంపద కబ్బు మూఁడగునవస్థ 32

గీ. త్రావనొల్లవు వాహినుల్ తమజలంబు, కొఱుకుటకు నిచ్చపడవు మ్రాఁకులు ఫలంబు
మేఁత కొప్పదు సస్యమున్ మేఘపటలి, పరులకే దక్కు సుజనుసంపదలు సెట్టి ! 33

క. ఇచ్చునెడ మెచ్చు వేళల, నచ్చముగా గుణము చూతు రంచితచరితుల్,
త్రచ్చెదరు కులమతంబులు, తెచ్చెదరున్ ఖలులు గ్రామ దే శాంతరముల్ 34

క. అర్థులకు నీమి లోకవి, గర్హణపాత్రులకు నీవి కతమున ధర్మా
భ్యర్థితుని విత్త మే నం, తర్హిత మగు నందు రర్థతత్త్వాభిజ్ఞుల్ 35

క. వనధిజలదములయట్ల, య్యేను ధర్మార్థములు రెండు నితరేతర సం
జననమ్ము లీ రహస్యము, గని వానికి బుధుఁడు తుల్యగౌరవ మిచ్చున్ 36

## మహాక్కర

నెఱయఁబాడికినెడయైతనర్చువానికినబ్బు నభ్యుదయముసొరిదిఁ
దఱుగునట్టిద కాని పెంపొందునె తగవరిసంపత్తి చందమ్మునన్
బెరిఁగెనె పులిచూల్బాలున కెన్నేనిబిడ్డలంగన్న ఁదదన్వయంబు
సురభితానొక్క పాపనపడసిన సుబ్బదె తజ్జాతి పూజ్యమౌచున్ 37

గీ. ఉత్తమజ్ఞానవృద్ధుల వృత్త మరసి, సుజనసంసర్గమునకు నౌత్సుక్య మూఁది
తగవెఱింగి యెఱింగినదాని విడక, నడుప నేర్చినతండ యున్నతి గడించు 38

గీ. కాయ మంభ స్తరంగసంకాశ మగుట, ధనము శంపాలతాసగోత్రంబ యగుట
మతి మతంగజకర్ణ సమ్మితమ యగుటఁ, గాదు జాడ్యంబు ధర్మసంగ్రహమునెడల 39

గీ. అడుగుపెట్టదు కల్మి గేహమ్ము నెడసి, మసనమునయందె చుట్టాలు మరలిపోదు
రాత్మకృతపుణ్యపాపంబు లవియ పురుషు, వెంబడించు నొడల్వాసి వెడలువేళ 40

క. గఱువలచే మేల్గీడులు, పరస్పహస్రముగ నుడువఁబడెఁ గాని మహిన్
బరహితమునట్టి సుకృతము, పరాపకృతి కీడువచ్చు పాపము గలదే 41

గీ. ధర్మువును శమనుండు భూతమ్ము లైదు, నంతరాత్మయు నమృతాంశుఁడర్యముండు
శ్రుతులు సంధ్యలు రేపవల్ సూచు నరుని, పోకడల నన్నపల్కు మఱాకు మన్న ! 42

క. గోర్చుట్టుమీఁద రోఁకటి, నార్చినగతిఁబేదనెత్తి నదనపువడ్డిన్
బేర్చెదు వార్ధుషికత మొద, లార్చున్ సకలార్థరాశి నగ్నియపోలెన్ 43

క. ఒక పుట్టిఁగుంక తన పా, లికి వచ్చిన రెండురూకలే దెబ్బదివే
లకుఁ బెంచెఁ; బెంచినది హా, టకమా వివరింపు ముత్కటం బగు నఘమా? 44

ఆ. యుగయుగాలనుండియును ధనవంతు లీ, రీతి నీతి పాపభీతి లేక
పీల్చుచున్నవారు పేదలరక్తంబు, తీయతీయకొండతేనెవోలె 45

గీ. చెమటలోఁ జీకి చీకి కష్టించు బడుగు, కమికెఁడన్నంబు లేక యేఁకారు టేమి
యెండక న్నెఱుఁగనిశుంర లింద్రభోగ, మగ్నులై కోరమీసాలు మలఁపు టేమి 46

గీ. ఆఁకటికి క్రుగ్గి చలిదెబ్బ కలమటించి, మొండిరోగాల కవమానములకు లోఁగి
నాగరకలోకమున కొక్కనవ్వు విసరి, పిలుచుచున్నాఁడు యము నహో! పేదవాఁడు 47

గీ. ఎవనియెముక లీమేడల కిటుకలయ్యె, నెవనిరక్తంబుచే గోడ లిట్లు బిగిసె
నతనికా యిట్టి పరమహేయంపుబ్రదుకు, వానికా యిట్టి దుర్మరణానుభూతి 48

గీ. కాలదంష్ట్రిక బోనిఖడ్గమ్ము జూపి, చెఱకడమ్ముసుబోనిదబ్బఱను మప్పి
చేఁదుతలపోఁత లెఱుఁగని పేదవారి, పొట్టలం గొట్టి రాత్మైక భోగరతులు 49

ఆ. పడగవిప్పి తోఁకపై నిల్చి పూత్కృతి, ధ్వనులుగ్రక్కు కోడెత్రాఁచు కాదు
కూడులేనివాని కుక్షిలో నెగసిన, చిచ్చు కడిఁదిముప్పు దెచ్చు మహికి 50

ఆ. బొజ్జబలిసి నేఁడు విఱ్ఱవీఁగుచున్న, సాహుకార్లయాట సాగ దిట్లె
రుద్రమూర్తియై దరిద్రుండు చిచ్చఱ, కన్ను విప్పి గజ్జెగట్టు నెపుడొ 51

క. ఈచెఱువు లీ నదీచయ, మీ చతురబ్ధులు తదగ్ని హేరాళ జ్వా
లాచక్ర విక్రమ క్రీ, డా చాతురి మాన్పఁజాలుట యసాధ్య మయా ! 52

శా. ఈసంవర్త శిఖిచ్ఛటల్ తమకుఁదామే శాంతికిం జొచ్చి జ్యో
త్స్నాసోదర్యతఁ గైకొనున్ గువలయాప్తఖ్యాతికిం దావులై
యీసర్వంసహ తద్రసార్ద్రమగునాఁడేమూల నీక్షించినన్
రాసుల్ రాసులు పండి బండిబరువై అంపిల్లునుల్లాసముల్ 53

ఉ. ఈకపటోక్తు లిచ్ఛకములీ నటనల్ మొగమోట లీ యసూ
యా కలుషీతకృతాశయము లందనికోరుకు లీర్ష్య లీ భయో
ద్రేకము లీ పగల్ వగ లదృశ్యములై యపు దచ్ఛబాంధవ
శ్లోకము లూరు సత్యశివసుందర జీవితముల్ మొదల్కొనున్ 54

క. ఇతరులకీర్తికి ధిషణా, చతురతకున్ రూపవిత్తసంపన్నతకున్
వెతపడు నీర్ష్యారోగిన్, బ్రతికించెడివెజ్జు త్రిభువనమ్ములఁగలదే ? 55

క. తనకంటె లెస్సవా రుం, ట నెఱింగి యహంత మానుట కడున్ వలయున్
దనకంటె నధము లున్కిం, గని యున్నది నరుఁడు కుందక వణక్రవరా 56

ఆ. చెమటనోడ్చి నరుఁడు జీవింపఁదగుఁ గాని, తేరసొమ్ము త్రేఁపరాదు
బానిసీఁడు కుడుచు పరమాన్నముకంటె, నుచిత మిచ్చకొలఁది నొదవు గంజి 57

క. మన యౌన్నత్యముఁ జూటఁగ, మన యౌన్నత్యంబ కడుసమర్థంబు సుమీ
ధన ధాన్య కరి పురోగమ, ఘనసంపజ్జాత మూఁతగా దిప్పట్లన్ 58

గీ. వాఙ్మనఃకాయముల నెట్టివారికేని, హింసనేయమి పరమార్థహేతు - వన్య
కాంతజవ్వన మాసింపఁగాదు - పురుష, కార మెడయైన దైవ మక్కఱకురాదు 59

క. వెలిమార్తుర నోర్చెడి వా, రలకే మంతర్విరోధిరాజి నడంపన్
గలవార జగామగ ల, గ్గెలుపే యపవర్గసిద్ధికిన్ మూల మగున్ 60

సీ. ఉభయతోముఖ గవాయుత దానఫలదాత్రి, సత్యోక్తి యను నీతిసరణి విడకు
రాగవైరముల ధర్మము నుజ్జగింపకు, మపకారికైన లగ్గాచరింపు
శుభపరంపరలను జూచి అంపిల్లకు, బెడఁద లంటినవేళ బెండువడకు
పరనిందసేయఁ బాల్పడకు మాత్మగుణాను, కీర్తన మ్మదిలఘుక్రియగ నెంచు
మబ్బరుల కింపు సంధిల్లునట్లు పలుకు, మడుగకయమున్న యిచ్చుభాగ్యంబు గనుము
కృత మెఱుంగుము ధర్మమున్ గుతిలపెట్టు, ధర్మువును మెచ్చఁబోకు వర్తకవతంస! 61

క. మది నిల్పుము నారాయణ, పదవాచ్యుండై వెలుంగు పరమేశ్వరుపై
సదమలభక్తియ భగవ, త్పదమ్ము నందించు మేలిబాట కిరాటా 62

క. ఆపద లవి ముజ్జిద్దుగఁ, బ్రాపించినవేళ విశ్వపతిఁబిల్చి సుఖం
బాపాదిల్లిన మఱచుట, కాపురుషునిలక్షణంబుగాఁజెప్పఁదగున్ 63

క. భగవత్కృపావిదూరులు, జగమ్మునం దేమిసేయఁ జాలుదురయ్యా !
జగదీశుదయకు నోఁచిన, నగమ్ము నుఱ్ఱూఁతలూఁపదా యణువేనిన్ 64

క. ఆస్తికత వలయు నిహపర, శస్త్రావిర్భూతి వలచు జనునకు గర్వ
గ్రస్తుం డస్తవివేకుఁడు, నాస్తిక్యము నిచ్చమెచ్చు నరకము సొచ్చున్ 65

క. కోవెలలో గంగానది, రేవులలో రామకోటిరేఖలలో లేఁ
దేవానియెడఁద కరుణకు, నావాలం బతనియంద హరి వసియించున్ 66

సీ. అని పెక్కుచక్కట్ల నక్కిరాటున కుప, దేశించి సుకృతనివేశ మతఁడు
తనపల్లియకుఁజేరెఁ-దదుపరి వాని లో, కోత్తర ధర్మాభియుక్త శీల
మతనిపాలిటి వేల్పుటా వయి పౌరుష, మెల్లఁబండింప నల్లల్ల నేచి
గ్రాసవాసోద్దైన్యగతి నాతం డెడసి చెం, చమఁ బెండ్లియై సదాచారధన్య

గీ. నలరి వలయు భోగ త్యాగములకు నోర్చు, కలిమిఁ బాలించె; నాతనికధకు నఘుని
బర్హణంబున కుల్లాసపడెదరేని, నదరి దత్తావధానులరై వినుండు 67

## 4

గీ. కత్తిచేఁ దెల్గుపొలిమేర లొత్తి యొత్తి, కఱుచే మన్ను బంగారువఱ్ఱఁచేసి
మేలినదవళ్ళచే వీనుమిగిలినట్టి, కమ్మవంశంబు మీ రెఱుంగనిదిగాదు. 1

సీ. ఏ వంశమునఁబుట్టె నిద్ధాంధ్రసామ్రాజ్య
ధౌరేయభుజుఁడు ప్రతాపరుద్రుఁ
దే వంశమునఁ బుట్టెఁ గృష్ణరాయక్షమా
భృచ్ఛమూనేత రావెళ్ళమల్లఁ
దే వంశమునఁబుట్టె హేరాళదాతృతా
వీరతావిభ్రాట్టు వేంకటాద్రి
యేవంశమునఁ బుట్టె గృతసంఘహితజనా

గ్రణి సూర్యదేవర రాఘవుండు

గీ. సారథీరాశి శతశిల్పి నారసింహ, నాయఁ దేవంశమునఁ బుట్టె నాయుదాత్త
వంశమున్ గని తనియనివారు లేరు, సేతుశీతాచలాంతర క్ష్మాతలమున 2

క. ఆ కమ్మవంశమునయం, దాకాశధునీ సుధాక రానంత నిభ
శ్లోకుఁడు రిపుభీకరధా, టీకుఁడు మును పుట్టెఁబేరు టీకన్నయనన్ 3

ఆ. పెమ్మసానికులుఁడు తిమ్మభూజానికి, గండికోట నేలు దండిమగని
కాప్తుఁడై యమాత్యుఁడై దళవాయియై, వన్నె కెక్కె ద్విషదవార్యుఁడతఁడు 4

క. తజ్జన్మఫలం బనఁగా, సజ్జనసంభావ్య శీలసంపన్నిధియౌ
నొజ్జయ్యవాడమె నతనికి, విజ్జెను దత్కీర్తి సురగవీనమ్మితమై 5

గీ. అతనికిం గల్గె నయ్యవారప్ప యనెడి, నందనుండు; దయాధర్మకంద మగుట
నయ్యవా రయ్యె నెల్లర కమ్మహాత్ముఁ, డొజ్జకొడు కయ్యవారౌట యుచితమకద 6

క. జనియించె నతని కన్నయ, కనదాచారుం డతండు గనె ముత్తయ్యన్
వినయాశ్రయుఁ డతనికి నా, త్తనయుఁడు రమణాభిధుండు తనయుం డయ్యెన్ 7

క. ఆ రమణయచౌదరి సా, ధ్వీరత్నము కిచ్చమాంబఁబెండ్లాడి గుణా
ధారుని శూరుని బుధమం, దారుని శేషయ్యఁ గనె ముదం బెసలారన్ 8

క. అతిమాత్ర పూతచరితాం, చిత యగు సుబ్బమ్మవలన శేషార్యునకున్
సుతు లుదయించిరి వేంకట, పతి సీతారామ నామ భాస్వరు లగుచున్ 9

క. అందగ్రజుండు శారద, కంద పురందర కరీందు కర సురతటినీ
మందార హీర లవలీ, కుందసమాస్పందకీర్తిఁగొని రాణించెన్ 10

క. భాసుర గుణసంపద ల, క్ష్మీపతికిన్ మిన్న యగుచు మించు మహాల
క్ష్మీసాధ్వికి నాతఁడు పతి, యైసల్పె గృహస్థధర్మ మార్యులు మెచ్చన్ 11

గీ. ధన్యజీవను లైన తద్దంపతులకుఁ, బ్రాగ్భవార్జితసుకృతమ్ముపంట యనఁగఁ
బుట్టి రిద్దఱు కొమరు లప్పుత్రులందుఁ, బెద్దయై బాపయాఖ్యుండు తద్ద వెలసె 12

సీ. నిత్యసత్యాలాపనియతిపై ననురక్తిఁ, చెందినాఁడు జయంబు నందినాడు
పరవిత్త మది విషప్రాయంబ యని విశ్వ, సించినాఁడు తిరస్కరించినాఁడు
దీనార్థిలోకంబుఁదిలకించి కన్నీరు, జార్చినాఁ దండకుఁ జేర్చినాడు
మొగమోట దిగఁద్రావి తగవు చెప్పెడినేర్పు, నేర్చినాఁడు యశానఁ బేర్చినాఁడు

గీ. కష్టమున్సుఖమున్దుల్యదృష్టితోడఁ, జూచినాఁడొకత్రాసులోఁ దూఁచినాఁడు
నాఁడు నేఁడును బుధులు కొండాడునడత, నివ్వటిల్లిన నారయ్య కెవ్వ రీడు 13

క. గోవిందచరణసేవా, హేవాకనిరస్త దానవేశ్వరసుతుఁడై
జీవన్ముక్తుండై సుజ, నావళి కతఁడొజ్జబంతియై హవణిల్లెన్ 14

క. అతిలోకత్యాగసమం, చిత మేతత్కార్య మతఁడచేసె; నహో ? మత్
కృతపుణ్యాపాటవమ్మున, నతఁడే ననుఁగన్న తండ్రి యయ్యె వినుండా ! 15

చ. చదువక యున్న నేమి బుధసత్తము లబ్బఁగ నర్థభావసం
పద వికసింప భాగవత భారతముల్ వివరించు; హృద్యముల్
తదమలకావ్యపద్యములు ధారణ కగ్గముచేసి వేనవేల్
చదువు నతఁడు; తచ్ఛ్రవణసాహితి దుశ్శక మెట్టివారికిన్ 16

క. మక్కువమైఁ గొండికనాఁ, డక్కఱ గలయప్డు లేనియప్పుడు నొఱపౌ
చక్కట్లదండ లాతఁడు, పెక్కులు మన్మృదులహృదయపీఠికిఁ జుట్టెన్ 17

క. నమ్మినవారిం జెఱుపమి, దమ్మిడియే నొరులసొత్తు దాఁకమి జగదీ
ద్యమ్ముసుమా యని యా కన, కమ్ముకథన్ నాకుఁ దారకాణగఁ జెప్పెన్ 18

## 5

ఆ. మచ్చలేని యిట్టిమనుగడతోఁ జతు, ష్షష్టివత్సరములు జగతి నిల్చి
యరిగెఁ బింగళాబ్దమం దితఁ డానంద, భవనమునకు విష్ణుభువనమునకు 1

చ. పదపడి తాడెపల్లి కులపావనుఁ బుంవపురీద్యమాన శా
రద నల వేంకటప్పగురు "రామకథామృత" కావ్యకర్త న
స్మదనుపమానపుణ్యమహిమమ్మునఁగొల్చి రసాలవాలముల్
చదివితిఁ గాళిదాసకవిసత్తము కబ్బము లమ్మనీషితోన్ 2

క. గురుకాణయాచి ధనదుని, పురమునకున్ దినదినమ్ము పోయెడి నాకున్
మఱపునకు రానికథయై, తిరపడె నిప్పుసిఁడిగాథ దెందమునందున్ 3

క. ఆ కోమటియింటికిఁ జని, యీ కనకోదంత మడుగ నిచ్చవడియు నే
మో కస్సు బుస్సు మం చను, నో కథ యడ్డంబు తిరుగునో యనుభీతిన్ 4

సీ. కాల మెంతేని గడపితిఁ గాని మదికి, దూరమైపోవదయ్యో నయ్యారటంబు
ఎట్టకేలకు సాహస మింత సూపి, యడుగువెట్టితి సెట్టిగేహమ్మునందు 5

ఉ. తొంబదియేండ్లు దాఁటి జరతో రుజతోఁ జెరలాటమాడు వ
గ్గుం బొదగంటినొక్కరుని గొంకుమెయిన్ గిడిగిళ్ళు వెట్టి సౌ
ఖ్యంబెయటంటిఁ“ జిత్తమెవరయ్యలుమీ” రనుచుం బ్రసన్న భా
వంబున లేచె వృద్ధతని వాడినకన్నుల తెల్వి కుబ్బుచున్ 6

గీ. మాది కావూరు; కొండొక మాటలాడ, వలచి మీసన్నిధింగూర్చి వచ్చినాఁడ
మీరు తుమ్మల నారయ్యగారి నెఱిగి యుందురా వారి కేఁ దనయుండ నగుదు 7

క. ఇటు లే నపు దనుటయుఁ గో, మటి సంభ్రమ విస్మయ ప్రమద వార్ధి హుటా
హుటి నీఁదులాడువాఁడా, దట నెగదిగఁ జూచి నన్ను ఁదఱియంబడుచున్ 8

క. నారయ్య బిడ్డవా ! బా, బూ ! ర మ్మిటురమ్ము దైవయోగముకతనన్
నీరాక దొరలె; నురలెన్; గారాకులువోలె నాదుకలుషము లెల్లన్ 9

క. ఊరున్నాఁడును మెచ్చెడి, నారయ్యన్దెలియకుందునా వినవో నా
కోరంతప్రొద్దు నాతని, పేరే తారకము వేలుపే యతఁడు సుమా 10

క. ఆదరువై మ మ్మారసి, మాదీపము నిల్పినట్టి మాన్యుం డతఁడే
కాదంటిమేని ధర్మము, లేదిహమున్లేదు పరము లేదును మాకున్ 11

ఉ. కారణజన్ముఁడాతఁడు జగమ్మునవా రొక పుచ్చువక్క కై
పారములేని పాపములపా లగుచుండఁగ నైదుకట్ల బం
గారము నస్మదీయమును గాచి శరత్తులు దాఁచి రూకయుం
గోరక యిచ్చె లేమి కనుఁగుంగొదుకై వసివాడుచుండియున్ 12

క. ఏలా వ్రతములు తీర్థము, లేలా జన్నములు చదువు లేలా యోగం
బేలా తపస్సు నరునికి, శీలం బది యింత చెక్కు చెదరక యున్నన్ 13

గీ. అంత కొకయింటివాఁడు కాఁడయ్యె నీడు, ముదిరి యున్నను లేని కాఁపురము గాన;
నెట్టి యొఱగడ్డముల నున్ననే మతండు, తొనఁకనొల్లఁడు ధర్మచ్యుతుండు గాఁడు 14

ఆ. ఇట్టి పుణ్యమూర్తు లిట్టి మహామహు, లే కదా జగమ్ముప్రేఁక నోర్తు;
రేల మాతృయౌవనైలాలతాలవి,త్రములమాట యనుడుఁ దా నెలర్చి 15

గీ. ఆడఁబోఁ దీర్థమే యెదురైన యట్టు, లడుగ వచ్చినకథ సెప్పితయ్య నీవ
మేలు మేల్ మెచ్చినాఁడ నీ శీలమునకు, మేలు మఱవని నీకు జేజే లనంగ 16

క. ఇదియు నొక గొప్పచేఁతయె, సదమలగుణరాశి నీదుజనకుని శీలం
బదియెక్కడ నిదియెక్కడఁ, జదురున్నన్ దాని నెల్లసభలను జెపుమా 17

క. ఈపూఁటకు మాయింటను, సాపాటొనరింపు మిది ప్రసాదము మాకున్
నీపొట్ట నింపి తనిపిన, మా పుట్టువు ధన్యతాసమగ్రము గాదే 18

క. మీతండ్రిఋణము దీర్పని, పాతకులన్ మమ్ము సత్కృపామతిమై న
పూ్పాతాత్మునిసుతుఁ డగు నీ, వోతండ్రీ! యుద్ధరించు టుచితమ్ముకదా 10

క. అని వినయోక్తిపరంపర, దనరన్ వణిగ్గ్రముఁడు కృతజ్ఞతఁ జూపెన్
దన యాలికిఁ దనయాలికి, ననుఁ బరిచితుఁజేసె మన్ననల్ దయివాఱన్ 20

మంజరి

చిఱుబంతి పసపాడి సీమంతవీథి, గుఱిచేసి పెద్దకుంకుమబొట్టు నలఁది
ముత్యాలతాటంకముల నొప్పఁ దాల్చి, ప్రభలు చిమ్మెడు నద్దబాస ధరించి
పాటపాటగ వెల్లఁబాఱిన కురుల, విరులతో జతగూర్చి వేనలిఁ దీర్చి
మురువూరు సరిగకమ్ములఁ బిసాళించు, చెంద్రికపూవన్నెచీరను గట్టి
కరువునం బోసిన గఱువతనంబొ, కరుడుగట్టినయట్టి కారుణ్యరసమొ
మేనుదాల్చిన జగామేలిశీలంబొ, తొలుమిన్కునాఁటి ముైదువయో యనంగ
నెదుట నిల్చినసెట్టి యిల్లాలు నన్నుఁ, దెలిగన్నుఁగవతోడఁ దిలకించి యపుడు
జిలుగువెన్నెల వంటి చిఱునవ్వు సూపి, యమృతధారాస్యంది యగుపల్కుతోడ
నారయ్య కడుపు పంటవె నీవు తండ్రి!, లేరయ్య ! మిమ్ముఁబోలిన పుణ్యధనులు
లోకాన మీకథల్ నుడివినచోట, దొరకునే తావెట్టిదురితాన కేని
నెల్లకాలంబు మీయిల్లు ధర్మమున, కాశ్రయంబై కీర్తి నార్జించుఁగాక !
యష్టభోగంబు లిష్టైశ్వర్యములును, దిరములై మీకు సిద్ధించునుగాక !
బ్రహ్మోయురున్నతిఁబడసి మీవంశ, మాచంద్రభాస్కరం బలరొందుఁగాక !
యని మెచ్చి వెలలేనియాశీస్సు లిచ్చి, యరగంటలో వంట యగును మజ్జనము
సలుపలె మ్మని బానసముఁ జేరినంత 21

సీ. హైయంగవీనదివ్యామోదబంధువై, జీరకవాసనాశ్రీఁ బెనంగి
మెంతికమ్మదనంబునెంతేనిఁ జేపట్టి, యింగువనెత్తావిపొంగు లొలసి

కటివేఁపవలపుతోఁ గలసి కుస్తుంబరీ, లలితపల్లవ పరిమళము నెనసి
మాషఖండ ఘుమంఘుమను గూడి సర్షప, గంధమ్ముతోడిసాంగత్య మంది

గీ. వంటయిలు వీడి వాడలవెంటఁ జాగి, పౌరనాభితర్పణకారి యగుచుఁ
జవులు పుట్టించు తాలింపుసౌరభమ్ము, హెచ్చి మజ్జారరజ్వాల రెచ్చఁగొట్టె 22

సీ. వలచు కప్పురభోగివరివంటకమ్ముతోఁ, గారవేల్లాది శాకములతోడఁ
బసుపునిగ్గుల కందిపప్పుతోఁ బులుసుతోఁ, బచ్చళ్ళతో షాడబంబుతోడ
వడియాలతోడ నప్పడముతో వరుగుతో, లడ్డువమ్ములచక్కిలములతోడఁ
బోళీలతో గారెబూరెలతో నంటి, ఫలములతోఁ దేనెతొాలలతోడ

గీ. మీఁగడలతోడఁ బెరుఁగుతో మేలితరపు, టావకాయతో గంధతోయమ్ముతోడ
విం దొసఁగె నమ్మహాసాధ్వి వేడ్కఁదనకుఁ, బసిఁడిగాజులు పోఁచీలఁగొసరితాఁక 23

## 6

గీ. భోజనోత్తరమందుఁ గప్పురపువిడెము, నమలి భుక్తిశ్రమం బింత సమసినంత
జరరవైశ్యుని జూచి తజ్జాతరూప, మవల నేమయ్యె నెఱిఁగింపు మనుడు నతఁడు 1

క. సజ్జనమూర్ధన్యుఁడు యు, ష్మజ్జనయిత కూర్మినిచ్చు జాంబూనదమున్
మజ్జనకుఁ డింట నిల్పక, విజ్జిన సాధ్వసముతోడ విహ్వలుఁ డగుచున్ 2

క. కోడూరం గల తన చెలి, కాఁడగు సంసారి కిచ్చెఁ గావు మటంచున్
వాఁడా కడానిఁ జూచిన, తోడన కనుగుట్టి పెంచె దుర్ద్రోహదముల్ 3

క. మాతండ్రి కొన్నినాళ్ళకు, నాతని గేహమ్ము గదిసి యారోగ్యాది
శ్రీ తడవి తడవి వినయా, న్వితుండై పైఁడి నొసఁగవే యని వేఁడన్ 4

ఆ. ఎంతనింద వచ్చె నేనాఁటిపాపమో, పాటిదిబ్బలోన మాటినట్టి
పసిఁడి నేఖలుండొ పసివట్టి మ్రింగె న, య్యో! యటంచు నాతఁడుమ్మలించె 5

గీ. నిలువునంగూలి నా తండ్రి తెలివి దప్పి, తేఱుకొని మిత్రుఁజూచి కన్నీరు జార్చి
యెంతపనిఁ జేసితయ్య ! నీ వింతవాఁడ, వని యెఱుంగక వెంగలి నైతి నేను 6

క. పోయినదా నా బంగరు, పోయినదా నన్ను మఱచి పోయినదా నా
కీ యెడ లింకేటి కిసీ !, నీ యెదుటన చత్తు నొక్క నిమిషములోనన్ 7

క. అని వాని యింటిదూలం, బున కురి సంధించి వ్రేలఁబోవఁగ మిత్రుం
దనుమానంపడి కొంపలు, మునుఁగు నటం చదరి బెదరి మూరినభీతిన్ 8

ఆ. జనకు నిల్వరించి సైఁపుము నా దోష, మెఱుకలేమి గడ్డిఁగఱచి నాఁడ
మఱచినాఁడ నీతిమార్గంబు నీ మదిన్, విఱిచినాఁడ మైత్రి చెఱిచినాఁడ 9

ఆ. కన్నుమూఁత లేక యిన్నాళ్లు నీసొమ్ము, గాచినాఁడ నింట దాఁచినాఁడఁ
గాపుఁగూలి తృణమొ కణమో యొసంగి నీ, యచ్చులందు మింద మని వచింప 10

క. మొదటికి మోసములే దిఁక, బ్రదికితిరా దేవుఁడా ! కృపానిధి ! యంచున్
మది నుబ్బి తండ్రి రూకలు, పదియేఁబదు లతని కిచ్చి పసిఁడిన్ దెచ్చెన్ 11

చ. పదపడి ధూళిపూఁడి యను పల్లియ నల్లునియింట దాఁచి తా
నెదపయిఁ జేయిసేర్చి యొకయేఁడు సుఖమ్ముగ నిద్రవోయె న
ప్పిదప సువర్ణమి మ్మనుచు వేఁడఁగ నల్లుఁడు నీతిబాహ్యుఁడై
యది యిది సెప్పుచున్ నెలలు నబ్దము లీడ్చె నుపాయమేర్పడన్ 12

క. నారయవోనిపవిత్రు లు, దారులు పెక్కండ్రు జగతి నబ్బంగలరా
దూరీకృతసత్యులు దురి, తారంభులు దుగ్ధముఖవిషాబ్ధులు దక్కన్ 13

ఉ. ఆ దశమగ్రహంబు మనుజాపశదుండు సమస్త బంధులున్
నీదుచరిత్ర మెంతయును నింద్య మిసీ ! యని ప్రువ్వఁదిట్ట మా
సోదరి తన్ను వేఁడుకొనుచున్ బెదిరించుచు నుగ్రకిల్బిషా
పాదక మిట్టిచేఁత సలుపందగునా యని బుద్ధిసెప్పఁగన్ 14

ఆ. తనదురాశ కొక్క దానిని బలిచేసి, కడమరెండుముక్క లిడియె మాకు;
మార్చుకొంటి మంత మద్రపురంబులో, రొక్కమునకు జాతరూపమెల్ల 15

గీ. పసిఁడి పండ్రెండు వేలరూప్యముల కమ్మి, ముసురుకొని యున్న పెద్దమ్మపస నడంచి,
పాఁడిపంటలు వాణిజ్యపాటవమ్ము, దనర నున్నార మిట్లు నీతండ్రిచలువ 16

వ. అనిపల్క వెండియు నేనతనిం గాంచి తాతా ! పసిఁడియచ్చది యెట్లుండు దానియాకృతిమున్నగు చిహ్నంబుల న్దెలుపుమా యని వేఁడఁ దామేటివీఁపువోలె దాటిబెల్లపు టచ్చుంబలె నక్కనకఖండంబు వెలయు దానిపై ఖవర్ణ పూర్వకముగాఁ బదివేలయొకటికిం జెందిన తెలుఁగంకె (౧౦౦౦౧) లుండు నీ యంకమ్ములకు

నాయపరంజిబ్రేఁగునకుం గల పొత్తెయ్యదియో బుద్ధి కందదాయె నిట్టి యచ్చులు నితర ధనంబులు మెట్టిపుట్టినవారి కివ్వీట నేఁటికిం జేపడు చున్న విది రత్నగర్భగదా యని యమ్ముదుకండు నివేదించుటయు నేనిష్టకథా వినోదంబుల మఱికొంతసేపు గడిపి యయ్యా ! యే నెట్టులం దోలుచున్నయది యేను బయనంబు సాగింపవలయుఁ గృతజ్ఞతారాశివైన నన్నింతగా నాదరించిన యపూర్వగాథ లనేకంబు లెఱుకువచేసిన నీకు సాధుసత్తమునకు నా నమోవాకము లీనెయ్యంబు మన తరతరమ్ముల నవిచ్ఛిన్నమై కొనసాగుంగావుత వెడలివచ్చెద నిలువుండని ప్రసన్నతామృదూకృతదర్శనుం డగు నతనివలనం జాసి యింటికిం జనువాఁడనై మఱపునకురాని యా యిల్లడవృత్తాంతము న్గుఱిచి 17

క. వృత్తం బుదారధర్మా, యత్తము నాయంకుఁదన్న నస్మజ్జనకుం
దత్తిన కవితాకళ నీ, చిత్తరువువ దిద్ది బయలుసేయవ దగదే 18

క. నీఁగెదఁ బిత్రూణభారం, బీఁగెదఁ జరితార్థకోటి నిహపరసౌఖ్య
శ్రీగరిమం బిడు కృతికిం, జాగెద నాంధ్రీసపర్య సలిపెద నింకన్ 19

గీ. అని తలఁచి శ్రద్ధధానుండనై ప్రమాధి, శరద శిశిరర్తువునఁ గలాశరధి యగుచు
భావపురి నా నెసంగెడి పట్టణమున,(బాపట్ల) నస్మదాచార్యక స్థానమైనచోట 20

క. వ్రాసిన యాచిఱుకబ్బము, వాసిన్ గడియించుఁగాత వసుమతి ; మాకున్
మా సంతతికిని ధర్మ, వ్యాసక్తియ సిరులకంటె నగ్రియ మగుతన్!! 21



# మున్నుడువు

ఆంధ్రీ మహతీ భారతీ ప్రజామిత్రాదిపత్రికలలో, రైతుబిడ్డ మున్నగు చలనచిత్రములలో, హచ్చిన్సు లోనగు, వణిజ్మండలుల శబ్దగ్రాహులలో, రైతుభజనావళి మొదలగు నితర సంపుటములలోఁ జెదరి చెదరి పఱిగకంకులంబలెఁ బడియున్న నా చిఱుకబ్బముల నొక్కచోఁ గూర్చుట యుఱ వని తలంచి "పఱిగపంట" అను పేర 1943లో వాని నాంధ్రావలికి సమర్పించితిని.

తరువాత 1948 నాఁటి కిట్టిరచనలు మఱికొన్ని వెడలెను. అందు వలఁతి వలఁతి కైతలు పెక్కు లుండుటంజేసి "పెద్దకాపు"(పెద్దపంట-ఒండె- (భాషకు) పెద్దరక్షణ) అను పేరిడి వాని నపుడు వెలారించితిని.

ఇపు డీరెండుసంపుటములును బునర్ముద్రణమున కెదురు చూచుచుండుటచే నే నీపనికి సమకట్టితిని. విలువంగోరువారి సౌకర్యము వలచి నేఁ డీరెంటి నేకముచేసి మొదటిదానిపేరే యుంచితిని. వస్తుసంబంధమును బట్టి యిందలి ముక్కలు కొన్నింటిని 'రాష్ట్రగానము'నకై వేఱుచేసితిని, అనావశ్యకములని తోఁచినభాగము లుజ్జనచేసితిని. తక్కినవాన నించించుక మార్పులు, చేర్పులు కావించితిని. క్రొత్తలు కొన్ని దీనికి హత్తించితిని.

ఇంతకుము న్నెక్కటి యెక్కటిగా వెలువరించిన - భజగోవిందమ్, అమరజ్యోతి, తపస్సిద్ధి - అను చిన్నచిన్న కృతులను సైతము దీనిలోఁ గలిపితిని. కావున నిప్పటి కిది నాఖండకావ్యముల సమగ్రసంపుట మని చెప్పవచ్చును.

నిడుఁద్రోలియున్నతపాఠశాలకుఁ దన యెల్లకల్మియు నప్పనచేసి నిఱుపేదయైన నెఱదాత కొసరాజు లక్ష్మయ్యకు నుడుగర గావించిన పఱిగపంట నేఁ డిట్లు పెరుఁగుట కా నెఱదాత నిఱుపేద యగుటదాఁక డిగుటయే కారణము.

ఒకానొక తెలుఁగుపత్రికవారు 'పెద్దకాపు'ను సమీక్షించిననాఁడు నేఁ డిందుఁజేరిన 'ఆవేదన' అను కావ్య మాత్మస్తుతి యని యెల్లిదము లాడిరి. లోఁతులు పరికించినచో వారి కందలి కలరూపు తెల్లమి యయ్యెడిది, కాని యోపిక యేది? సత్యనిరతి మాత్రము కలదా? ఉన్నచో 'మల్లెపూలదోసిళ్లు' అనుకరణం బని పదరుదురా? అట్లనుట క్రించుఁదన మని వీరికిఁ దోఁపవలదా? వీ రింతటితో నాఁగక "ఈగ్రంథము పెద్దదగాగా యున్నది..... 'కాపు'కథన మిం దెచ్చటనూ కానవచ్చుటయే లేదు. కేవలము మసిపూతకు 'శివుని మాపెద్దకాపు నర్చింప రండు' అని దైవస్తోత్ర మొకటి ఇరికింపఁబడి యున్నది'' అనికూడఁ దూలనాడుటకుఁ

దెగువచేసిరి. 'కాపు' - అనఁగా సేద్యగాఁడని వీరితలంపు. కావుననే నాగ్రంథమున 'శివుని మా పెద్దకాఁపును'అని తేటతెల్లగా నున్నను దాని నుదాహరించుపట్ల 'శివుని మాపెద్దకాపును' అనియ వీరు వ్రాయసము పొసఁగినది. కాపు-కాఁపుల కర్థభేదము కలదని వీ రెఱుఁగరు. ఈ యెఱుఁగమికి నేఁటివిద్యావిధానమే కారణము. ఇందు లాఁతి బాసకున్న పెద్దఱికములోఁ గీసపాలైనను దేశభాషకు లేదు గదా! ఆంగ్లశబ్ద వర్ణక్రమముదెసఁ జూపు శ్రద్ధాసక్తులు తెలుఁగుం బల్కు రూపునెడసైతము పాటింపఁగల్గిననాఁడు కాపు-కాఁపు, పాడి-పాఁడి, తీరు - తీఱు, నీరు - నీఱు మున్నగుతావులం గల వేర్మి చులుకం దెలియును? ఈ తెలివిలేనివారే నేఁటి విమర్శకులలోఁ బెక్కు రున్నారు. అందొకానొకఁడు నాపాలఁబడియె. అతని చలువచే మన భాషాజిజ్ఞాసువుల కీపాటి పాఠము గఱపుభాగ్యము నాకు దక్కినది. కాని పేరుపడ్డపత్రిక లిట్టి పెడవ్రాఁతలు-వెడ పల్కులు బయల్పఱిచి పేరుపడ్డపత్రికలు కారా దని నాకోర్కి. అవి వర్తమానములౌటయ కాదు, వర్ధమానములు గావలయు.

'ఆవేదన' అన్నకావ్య మొక మహాకవి పేదఱిమిని గన్నారఁజూచి కలఁగి వ్రాసితి ననియు, నందలి 'పాశ్చాత్య విజ్ఞానపండితుండు' మున్నగు ప్రయోగములు తనకుం బోల వనియు, నాత్మస్తుతి కీకొన్నను సీతారామమూర్తి "ఇంతటి కవీంద్రు లేమిడి యిట్టి దనుచుఁ! జెప్పుటకు నాదులేఖిని సిగ్గు వడియె'' నని పొవులం దగిన యక్కఱపాటు గలవాఁడు కాఁడనియు, నితనిని, వీనిపల్కును వెక్కిరించుట యన నలంతిచేఁత గా దనియు హెచ్చరించుట నా కనిష్టమైనను నేఁడు కనిష్ఠ కర్తవ్యము. దుర్బలులగు విమర్శకులపెనువుం గోరి యే నిట్లు చెప్పుకొనుట తప్పనిసరి యయ్యె.

అయ్యది యట్లుండె.

దేశవాచి యగు 'నాడు' నారచనలో 'నాఁడు' గా నుండును. ఈమార్పునకు శాసనముల లోని 'కమ్మనాండు, వెలనాండు' మొదలగు రూపము లాధారములు.

ఇఁక - బహుకార్యవ్యగ్రులయ్యు నాయందలి యనురాగముకతన నీ కావ్యావలిని సమీక్షించిన మహాకవులు, సౌజన్యమూర్తులు శ్రీ కాటూరి వేంకటేశ్వరరావుగారికి నా కృతజ్ఞతా పూర్వకసమస్కృతులర్పించుచు, నస్మదీయంబగు నేక పంచాశత్తమ (51) జనుర్వాసరమునాఁ డంద్రశారద కీ పరిష్కారము నర్పింపఁగల్గితి నని సాహిత్యసౌహిత్యముం బడచుచుఁ దెలుఁగు సోదరులు యథాపూర్వము నన్నాదరింతు రని విశ్వసించుచున్నాఁడ.

**తెలుఁగులెంక**

25-12-51

# పురస్కృతి

నూటయేబది యేండ్లుగా మనదేశములో నిరాఘాటంగా చెల్లివస్తున్న తెల్లదొరతనంవల్ల మన వేషభాషలు, ఆచార వ్యవహారాలూ, సభ్యతా సంస్కృతులూ తారుమారై పోయినవి. "తల్లికౌగిలి"వంటి పల్లెటూళ్లనివాసం పంచాగ్నిమధ్యమైనది. "పంటదొరలు" పొడైపోయి "పేదకూడు కుడుస్తున్నారు." "సాదుపలువలైన వకీళ్ళకు, వలకారిజిత్తులాంధ్రగు బేరులకు" నిలయములైన పట్నవాసాలు పల్లెను పీల్చి పిప్పిచేస్తున్నవి. "దక్షిణాపథమును బాహువప్రమున బ్రోచిన"యాంధ్రజాతి నిస్తేజమై నిర్వీర్యమై "వివేకం తఱిగి" తన యౌదార్యమును "సిగరెట్టు ముక్కకు చెక్కులు మార్చడంలో, ఎలెక్షను కాండలో సివంబెక్కి వేలకువేలు సొమ్మును పుచ్చిన వక్కలవలె బలియివ్వడంలో" మాత్రం మిగుల్చుకొన్నది. సంఘానికి శక్తి చచ్చిపోయింది. అసూయాద్వేషములు మెండుకున్నవి. "జాలువిత్తినచో వరాల గుత్తులు పండే" భారత సవిత్రి నిప్పచ్చరంతో ముచ్చముడిగిపోయింది. పారతంత్ర్య లక్షణాలన్నీ సుసంపన్నములై జాతిని జీవచ్ఛవాన్ని చేసివైచినవి.

ఈ యధోగతినుండి దేశము నుద్ధరించుటకు, మళ్ళా స్వస్వరూప సాక్షాత్కారం కలిగించుటకు దేశంలో బహుముఖమైన యుద్యమం తలయెత్తింది. సంస్కర్తలూ, రాజనీతి కోవిదులూ, పండితులూ భక్తులూ, కవులూ ఈ పతిత భారతమును మళ్ళా అనేకవిధాల మేల్కొల్పడానికి యత్నిస్తున్నారు. సీతారామమూర్తిచౌదరిగారు ఈ మహోద్యమమునకు నడుముగట్టిన కవులలో ప్రథమగణ్యులు.

ముప్పదియేండ్ల క్రితం ఆంధ్రోద్యమం తప్పటడుగులు వేసే తొలినాళ్ళలో రాయప్రోలు సుబ్బరాయకవి "ఆంధ్రుల మహోజ్జ్వలచరిత్ర చావలేదు చావలేదు" అంటూ ఎలుగెత్తి చాటెను. క్రమంగా ఆరంభశూరత్వం చచ్చి, మళ్ళా ఆంధ్రోద్యమం గుంటపూలుపూస్తూ, తిరిగి ఓఢ్రదేశ విభజనతో తల యెత్తింది. ఆ శుభావసరాన చౌదరిగారు వేయికంఠాలతో చేసిన రాష్ట్రగానం ఆంధ్రుల హృదయాలకు చబుకు దెబ్బయై వీరరసావతారులను చేసినవైచినది. పారతంత్ర్యాన్ని బలియిచ్చే తెలుగుదేవరకొలువులో చౌదరిగారి రాష్ట్రగానం పంబజోడై మ్రోగింది.

1924 నుండి నేటివఱకు గడచన్నకాలములో చౌదరిగా రెడపదడప రచియించిన కృతులన్నీ పఱిగయేరి యీ గ్రంథరూపాన నిపుడు పంటపండించారు. రచనాకాలమును బట్టి మొదటిదైన "అనుతాప" మనే కృతిలోనే ఆంధ్రుల పౌరుషప్రతాపాలు పొంగి పొరలిన తొలినాళ్ళలో నేను పుట్టకపోతినిగదా అని చౌదరిగారు అనుతాపాన్ని వెల్లడించారు. ఆ పుణ్యదినాల్లో చౌదరిగారు పుట్టియే యుందురని నే ననుకొంటాను. లేనిచో ఆ వీరరస భావ స్మృతులు వారియం దింత గాటముగా మొలకెత్తేవికావు. తలపులో పలుకులో చేతలలో వారికింత శ్రోత్రియత్వం అలవడేది కాదు. నిక్షేపమువలె చేజిక్కిన పైడియిటుకలను దక్కించుకోలేక తిరిగి కోమటయ్య కర్పించి నీతులు కొట్టిపోసిన వెట్టినారయ్య కడుపున బుట్టినారు

చౌదరిగారు. ఆ నారయ్య నిండుమనస్సులో వెలిగిన జ్యోతియే చౌదరిగారియందు వెలిగి వారి కింతటి అభిజనాభిమానం సమకూర్చి పెట్టింది.

తెలుగుజాతినీ దేశమునూ తలచుకొంటే చౌదరిగారి "కన్ను లాణిముత్యాలగనులై" పోతవి. "కృష్ణాగౌతములు తెలుగుతల్లికి ముద్దుకూతులై తెలుగుచేలూ తెలుగుతోటలూ పండించి పైడిపాతళ్ళు కప్పుతున్నవి." "గమగమలాడు పైర వంకాయకూరా, నాల్కతుప్పుడుల్చెడి నక్కదోసబజ్జీ, మదురు గుమ్మడిపండు ముదురుపులుసూ, జిడ్డుదేరిన వెన్నెలగడ్డపెరుగూ" అనుభవించే తెలుగుభోగం తలచుకుంటే "పళ్ళుపుల్లనై పోతవి." "హేమంత వీథులయందు భాగ్యాల కడలియై కదలివచ్చే మకరసంక్రాంతి" యందు తెలుగుతల్లి అద్భుతదర్శనం లభిస్తున్నది. "సంక్రాంతి" అనే కృతి భావనలో, భాషలో సర్వోత్తమమై తెలుగునాటి భోగభాగ్యాలను, సరససల్లాపాలను, నడతనాగరీకతలను కన్నులకుగట్టునట్లు, నోరూరునట్లు చిత్రిస్తున్నది. చౌదరిగారు అచ్చమైన రైతుబిడ్డ. నిజమైన తెలుగు కవి. పల్లెల సౌభాగ్యాన్ని చిత్రించే సిద్ధ హస్తుడు.

ఓరుగల్లులో, పల్నాడులో, విద్యానగరంలో ధ్వజినీనాథులై తెలుగుమాగాణమును తమ రక్తధారలతో తడిపిన, రావుతులవంశంలో బుట్టినచౌదరిగారి కలము ఎంతసేపూ వీర రసము నాశ్రయిస్తుంది. "తెలుగుబిడ్డల చిఱువేడి పలుకు నెత్రుటేర్లు తుకతుక నుడికి పొంగెత్తి పారలునట్లు వీరగీతాలు వీను మిగిలిన" పల్నాటి పౌరుషమును దలపోసి "పోటు మానుసులం గన్న ఆపోతుగడ్డ"ను గూర్చి వారు పలువిధాల వలపోస్తారు. ఒక్క పల్నాటిలోనే కాదు. బొబ్బిలిలోనేకాదు. పాంచాలమున సిక్కుయోధులలోనే కాదు. వీరధర్మాభిరతియే చౌదరిగారి చేత గ్రంథమును కొసరాజు లక్ష్మయ్యగారికి కానుక పెట్టించినది.

ఆంధ్రులు నేడు ప్రాభవదూరులై అనుభవిస్తున్న దైన్యమును 63 వ పుటలో నొక సీస పద్యమున వర్ణించి ఈ యవస్థలో తల్లి నాదుకోలేని "తెలుగుబిడ్డ బ్రదుకు బరువు చేటు" అని ఖండితంగా చెప్పి విడిచిరి. ఈ యలసత్వమునుండి, వైక్లబ్యము నుండి భారతజాతి మేలుకొనే శుభదినాలు వచ్చినవి. "నవయుగ మేగు దెంచి పరిణామముచెందె జగంబు" "దిశాంగణ మందు నటించే ఆ నూతనచ్ఛవులు" చౌదరిగారికి పొడకట్టుటచే విద్యార్థులను "లెమ్మింక లె"మ్మని తట్టిలేపి ఆ శుభలగ్నమున కాయత్తు లననర్చుచున్నారు.

యుద్ధవీరముకంటె దానవీరమూ, ధర్మవీరమూ అంటే చౌదరిగారికి మఱీయిష్టము. ఆత్మార్పణము నేమి ధర్మజ్యోతి నేమి ఆత్మకథనేమి రచియించుటకు చౌదరిగారి ఈ వీరరస పరతంత్రతయే కారణం. కావ్యానికి నాడూ నేడూ శృంగారరసమే ప్రధానాశ్రయం. కవులలో శృంగారమును విడిచినవారూ, విడువక మాటదక్కించుకున్నవారూ అరుదు. చౌదరిగా రొక్కరే దానిజోలికి వెళ్ళకుండా ఉత్తమకావ్యములను రచింపగల్గిరి. స్వభావముచేతనే వారు వీరకరుణ రసలుబ్ధులు.

ఆంగ్లసాహిత్య సంపర్కంవల్ల మన కావ్యప్రక్రియలలో నెన్నో మార్పులు వచ్చినవి. రవీంద్ర మహాకవి కావ్యమర్యాదలు కూడా మనం అలవరుచుకున్నాము. వీనితోపాటు హిందూస్థానీ

నడకలుగూడా నేర్చుకొంటున్నది మన సాహిత్యం. నేటి కవులలో ఈ మూడు ప్రవాహాలను తప్పించుకున్నవారు నూటికి నలుగురుకూడా తేలరు. చౌదరిగారికవితయందు దట్టి సాంకర్యము మందున్నకైనా దొరకదు. భావనలో, భావావిష్కరణంలో, వాక్యవిన్యాసంలో ఆంధ్రసంప్రదాయం మూర్తీభవించి ఉంటుంది. పదబంధమేమి, సాపుసంతనలేమి పూర్వమహాకవులను తలపిస్తూ పులుముడూ అన్వయక్లిష్టతా వెలితీలేక, సర్వాంగసుందరమైన చౌదరిగారికవిత్వం చదువుతూ వుంటే ప్రాణాలు లేచివస్తవి. పద్యకావ్యములలో ఎడనెడ వారు రచియించే వచనములు సాక్షాత్తూ తిక్కన నోట్లోనుంచి ఊడిపడినట్లుండును. ధర్మజ్యోతియందు చౌదరిగారొక మహాక్కర రచియించారు. నన్నపార్యునికి బిమ్మట మళ్లా అంతచక్కగా అక్కరను రచియించినవారు లేరు. సంప్రదాయసిద్ధమైన భాషామర్యాదలందు చౌదరిగారికుండే ప్రీతియే, నవీనులచే నిరసింపబడే చిన్నయసూరిని ప్రశంసింపజేసినది. తెలుగుకారకము చెడకుండా వాక్యరచన చేయడం వీరేశలింగంపంతులు మొదలుకొని నేటివఱకు గద్యరచన చేస్తున్నవారిలో ఒక్క చౌదరిగారికే తెలుసును. "ఎలనాగమోవితోఁ దులవచ్చు" తెలుగుకావ్యమునందు చౌదరిగారికి గల యీ అభిమానమే "గీర్వాణమెంత నీల్గిన జల్బిలి తెలుంగు నుడిసొంపునకు దిగదుడుపుగాదొ" అని పలికించినది. స్వస్థాన వేషభాషాదులపట్ల వారికి గల యీ అభిమానమే "వంగభస్మ" మనేకృతి రచియింపజేసినది.

తెలుగునుడికారముసొంపు చౌదరిగా రెఱిగినంతగా, ఇతరు లెరుగరేమో. వేమన్నను తిక్కన్నను గూడ మఱపిస్తూ ఉంటవి వారి తెలుగుపోకడలు. "క్షేత్రజీవి" అనే కృతిలో రెండవసీసమునందలి ఉత్తరార్ధములను బరికింపుడు. తెలుగు నుడికార మన్నప్పుడు నిజానికి తాళ్ళపాకవారిదీ, పదకవులదీ ఆ సొమ్ము. అట్టి సొంపు లుట్టిపడే రచన లీ గ్రంథమందు గోకొల్లలు. చౌదరిగారి యీ ఆంధ్రాభిమానము వేఱు. సనాతనధర్మాభిరతిని, ఆస్తిక్యమును కుద్దలించే ఇతరుల ఆవేశము వేఱు. చౌదరిగారి సంఘరక్తి, ఆంధ్రాభిమానము దేశభక్తి కద్దురావు.

సాహితీరంగంలో తొలుత గజ్జెకట్టే వారికిగాని యిట్టి పురస్కారవచనములు కృతప్రతిష్ఠు లగు చౌదరిగారివంటి కవీశ్వరుల కక్కఱగావు. అయినా నాకు ధన్యతకల్పించుటకే, వారీకార్యము నాపై బూన్చిరి. చౌదరిగారి కవితాశక్తిని, సౌజన్యమును, ఆభిజాత్యమును గూర్చి యింక విస్తరింపక

> **"కత్తిపోటును మించిన కలముపోటు**
> **మాట తీపిని గెలిచిన మనసు తీపి**
> **సంఘరక్తిని మీఱిన జాతిరక్తి**
> **నీక చెల్లుఁగదోయి"**

అని వారిమాటలే వారి కప్పగించి యింతట ముగిస్తాను.

**కాటూరి వేంకటేశ్వరరావు**

27-10-43

'పఱిగపంట,కీ పురస్కృతి చెప్పి ఎనిమిదేండ్లు గడచినవి. ఈ గ్రంథానికి ద్వితీయవార ముద్రణభాగ్యం లభించింది. ఈలోపల దేశమున స్వరాజ్యలాభము మున్నగు అద్భుత ఘటన లెన్నో నడచినవి. స్వతంత్రభారతావతరణమున చౌదరిగారు హర్షపులకితగాత్రులై

**"కులవర్గములు పెంచుక్రుళ్ళింత లేని.....**
**ధనవద్దరిద్ర భేదచ్ఛాయలేని**
**పరులకూటికిమూఁగు బదనికల్లేని**
**విద్యావిహీను లే వీధిలోలేని...**
**జీవత్సమాజంబు సృష్టిగావించి**
**తమ్ముఁడా! నీతేరు తరలింపవోయి!"**

అంటూ సహజోత్సాహంతో ముందుత్రోవ వేలెత్తి చూపుతున్నారు. వారి వాక్కు అన్వర్థము గాకపోదు.

తెలుగువారి అధోగతికి మొదటినుంచి దురపిల్లుతూ వచ్చిన చౌదరిగారి కీ లోపల మరొక సంతోష మహావకాశం లభించింది. అది డాక్టరు పట్టాభిగారికి కాంగ్రెసు గద్దెపై పట్టాభిషేకం. ఆ యుత్సవమును పురస్కరించుకొని చౌదరిగారు "అతిదీనత సైఁచిన తెల్గుజాతి కిన్ మల్లెలుపూచెరా!, మలయ మందల మంజుల వాతపోతముల్ మెల్లన వీచెరా!" యని సంతోషపరవశులై పాడుకొనిరి. పాపం! చౌదరిగా రెంత అల్పసంతుష్టులోకదా! ఇంతటిలోనే తెలుగులకు పండువయ్యె ననుకొనిరి. మరి, వారు పరితపించి పాడిన రాష్ట్రగానం ఇంకా చెవులలో మ్రోగుతూనే ఉంది. దానికి ఫలసిద్ధి యెన్నటికో అయితే గ్రుడ్డిలో మెల్ల యన్నట్లు తెలంగాణాకు మాత్రం విముక్తి కలిగింది. దానితో "మూఁడుకోట్ల తెలుంగు లిప్పుడు ముక్తినందిరిరా" యని చౌదరిగారి 'విజయవాణి' పలికింది.

ఇలా చౌదరిగారి వాణి యెప్పటికప్పుడు కాలంతోపాటు, కాలంకంటే ముందు నడుస్తూ ఆశాకిరణాలు ప్రసరింపజేస్తూనే ఉంటుంది. మా తరం కవులందరూ అంతో యింతో విరహవిషాదము ననుభవించి వైక్లబ్యం పొందినవారే. చౌదరిగారు మాత్రం విషాదగీతిక లెన్నడు పాడక, ఆశాజ్యోతి చేబూని ఉత్సాహగీతములే పాడుచు వచ్చిరి.

చౌదరిగా రల్పసంతుష్టు లంటిని. ఈ కూర్పులో చేరి 'కృతమెఱుక' యను కావ్యమే అందుకు సాక్షి. తమకు పథ్యానికి గావలసి వచ్చిన గోదుమల నయాచితముగా నొసగిన యొకానొక గేస్తు వితరణను గూర్చి ప్రవర్తించిన దది. చూచితిరా! వందలుగావు, వేలుగావు, గండపెండెరంగాదు, కనకాభిషేకం గాదు. మూటెడు గోధుమలు! ఈ భాగ్యాని కింతటి కావ్యం వ్రాసిరి చౌదరిగారు. అవును, చల్లపల్లి ఱేనికి రాష్ట్రగానం కృతియిచ్చి, రాజాగారు ప్రార్థించినా వారిగడప త్రొక్కబోవని చౌదరిగారు ప్రతిఫల మొల్లనిదాతలు, తనపై ఋణ ముంచుకొనని ప్రతిగ్రహీతలుగదా! గుణమున్నచో కృతులు కాన్కపెట్టుటేగాని కన్యాశుల్కముల నంగీకరింపరు వారు.

ఇంతటి సాధుచరిత మూరకపోవునా? మా తరం కవులలో నెవరికిని జరగని మహోత్స వము నిడుబ్రోలులో ఈ "అభినవ తిక్కన"కు జరిగిందంటే అబ్బుర మేమున్నది? గజా రోహణంతోపాటు, కనకాభిషేకంతోపాటు, కృతిస్వీకారములతోపాటు కవికి జరగదగిన

ఉత్సవములన్నీ చౌదరిగారి కానాడు జరిగినవి. పూర్వకృతమగు వారి తప స్సా నాడు పండి నది. కావుననే దానిని గూర్చి రచియించిన పద్యములకు 'తపస్సిద్ధి' యని పేరిడుటలో నెంత వినయము! ఎంతటి యౌచితి!

ఈ కూర్పులో 'చుక్కలు' అనే పద్యాలను గూడా క్రొత్తగా చేర్చారు. దీనిలో చౌదరిగారి ఉత్ప్రేక్షాకల్పన లతి రమ్యము లగుటయేగాక ఆ కందముల పరుగు అందుకోరానిదిగా ఉంది. మింటవెలుగు చుక్కల ననేకవిధాల ఉత్ప్రేక్షించి, తుదకు

**కాలెడి పొట్టతో విరతిగానని చింతలతో విశీర్ణమై**
**సోలెడిమేనితో బడుగుఁజూపులతో నిజరక్తమాంసకం**
**కాళము లర్థమత్తులకుఁగా నిచటన్ బలివెట్టి రెవ్వ రా**
**మాలలు మాదిగల్ గగన మంటపమెక్కిరె యిట్లుచుక్కలై.**

అని ముగించటంలో ఉన్నసొంపు ఎంతని చెప్పను!

చిన్ననాటనే తెనిగించిన భజగోవిందమును, ఆవల కొంతకాలాన కాళిదాసకృతి ననుస రించి చేసిన సేవాధర్మమను రచనను ఈ కూర్పులో చేర్చుట మరొకవిశేషము. ఈ తెలుఁగు సేతలు ఎంతో సరసంగా కొనసాగినవి. ఇంచుమించు ఆ కాలంలోనే తిక్కన భారతము ననుసరించిన 'ఆత్మార్పణము, వలెనే యివియు ప్రౌఢములై, 'పూవు పుట్టగానే' అన్న సామెతకు సాక్ష్యమిస్తున్నవి. ఈ కృతులన్నీ పతిగయేర్పులే అయినా ఎక్కడా తాలూ, తప్పా కనిపించదు సరిగదా, చౌదరిగారు కలంపట్టినది మొదలుకొని నేటివరకు వారు చేస్తున్న రచనలు ఎక్కడా జల్లుపొల్లులు లేక కండగలిగి, రసనిర్భరములగుట నాన్యతోదృష్టమని చెప్పాలి.

చౌదరిగారి రచనలన్నీ ఒకయెత్తు, 'ఆత్మకథ, ఒకయెత్తు. గాంధిపట్ల చౌదరిగారిభక్తి అతివేలము. కావుననే వారిరచన లన్నిట నంతో యింతో గాంధిధర్మగంధం ఉంటూనేఉంది. "కన్నువిచ్చినపిదపన్ వ్రాసినదంతయు నీకథ, నీ సందేశంబ" యని వారన్నది నిజం. అట్టి భక్తిప్రపత్తులతో గాంధిచరితమును పద్యకావ్యంగా రచియింప సంకల్పించారు చౌదరిగారు. ఆ గ్రంథం తుదముట్టక ముందే 'అమరజ్యోతి' రచియింపవలసి వచ్చింది. పాపం!

**"శతజన్మార్జిత మామకీనసుకృత స్థానమ్ముగా నీ జేగా**
**బ్రతుకున్ జోటెడికావ్యమున్ సుకవితాప్రౌఢమ్ము నిర్మించి నా**
**బ్రతుకున్ ద్రోయఁదలంచుకొంటిమును; పాపంబెద్దియో పండి నీ**
**మృతిపై నేఁడు కృతిన్ రచించితి మహోర్మింబోని కన్నీటితోన్"**

అని విలపించినా, వారిపూనిక తుదనెగ్గి 'ఆత్మకథ' పూర్తియై, ముద్రితమయింది. గాంధి చరితము రచియించుటకు "మహాత్ముని ఆస్థానకవి" యగు చౌదరిగారే సర్వవిధాల అర్హులు. కనుక 'ఆత్మకథ' పిమ్మట నడచిన గాంధిచరితమును గూడ చౌదరిగారు స్వతంత్రకావ్యముగా నిబంధించి చరితార్థులు కాగలరనే ఆశంసతో ఈపునః ఆశంసతో ఈపునఃపురస్కృతి ముగిం తును.

ఆంధ్రరాష్ట్ర హిందీప్రచార సంఘము }
విజయవాడ

**కాటూరి వేంకటేశ్వరరావు**
25-2-52

# మిత్రోక్తి

చ. ఒక నిఱుపేదజీవి తన కున్నసమస్తము నొడ్డి బాల బా
లికల కళాభివృద్ధి కని లేమిని దా వరియించుగాథ నీ
వొక రసయుక్త ఘట్టమున నూఁది జగమ్ముల మేలుకొల్పితో
సుకవివరేణ్య! నీ కవిత సూనృతవృత్తిని రాణకెక్కెరా! 1

ఆ. అచ్చు ఖర్చు లిచ్చి యందలా లెక్కించి
కార్ల మీఁదఁ ద్రిప్పుఘనులు గల్గ
లావు ధనము లేనిలక్ష్మయ్య కీ కృతి
నిచ్చినాఁడ వేల పిచ్చివాఁడ! 2

గీ. పలుచపలుచగ రాలు కంకులనె మట్టఁ
బతిగపంటయె యింతగొప్పగ ఫలించెఁ
దీర్చివేసిన కుప్పలు నూర్చునప్పు
డెన్ని ధాన్యరాసులు మిన్నుదన్నఁగలవొ! 3

కృతిసమర్పణసభ
నిడుబ్రోలు
12-3-44

కవిరత్న
కొసరాజు రాఘవయ్య చౌదరి



'పఱిగపంట' కృతిస్వీకర్త

శ్రీ కొసరాజు లక్ష్మయ్యా చౌదరి

# విషయసూచిక

# పతిగపంట

## కానుక

గీతిమాలిక

చేత నొక కుంభకోణంపుఁజెంబుతోడఁ, గక్షనొక వగ్గు వంకర కఱ్ఱతోడ
నొసటిపైఁ దిరునామంపుముసుఁగుతోడ, గునియు సనసన్నపసిఁడిపోఁగుల్లతోడ
మలఁచి కట్టిన నీర్కావివలువతోడ, డాపలించిన మీఁదిపుట్టమ్ముతోడ
బడలి పల్లకిబొంగైన యొడలితోడఁ, దఱపివెన్నెల విరియించు శిరముతోడఁ
దూలి గుంటలువడిన కన్దోయితోడఁ, దేపతేపకు బెదరెడి చూపుతోడ
నల్లనల్లన మనబడి కెల్లనాఁడు, వచ్చి గడిగడి చూచు దేవళముఁ జేరి
వలగొనిన యట్ల బడిఁ జుట్టివచ్చుచుందు, నితనిఁ గన్నంతనే కుఱ్ఱ లిహిహి యంచు
వినుకలిం బాసి గోల గావించుచుందు, రితని రాయిడి నానాఁటి కెచ్చుఁదొడఁగె
నెవ్వఁ డీ వెఱ్ఱివాఁ డితం డెచటివాఁడు, గట్టిగా మందలింపక యిట్టివాని
నేల మన్నింతు రొజ్జలిదేమి తాల్మి. 1

*   *   *   *   *

క. రెండేఁడులనాఁ డజ్ఞత, నిండిన యిప్పలకు లంటి నిడుఁద్రోల్ బడిలోఁ
బండిన పాపం బపుడే, పండితుఁగా నిటకుఁ దెచ్చి పడవైచె ననున్. 2

క. ఆమాటలువిని సుగుణ, శ్రీమన్మణి సాటియొజ్జ చినరోశయగా
రేమేమీ! నీ వెఱుఁగవె, యీ మానిసికథలు వింత లీ నీ మాటల్. 3

గీ. అచ్ఛశీలురు లోకసేవానురక్తు, లనఘు లిట్ల యుందురు వెంగళప్ప లట్లు
పనికిమాలిన చవటలు పట్టరాని, గడుసుడాబులతో మిట్టిపడుచునుంద్రు. 4

నిడుఁద్రోల్ కని పెంచిన దీ, బుదుతన్ గొనరాజువారి పుణ్యగృహమునన్
నడిసన్న బాపయాఖ్యుని, కొడుకై లక్ష్మయ్య యితఁడు కొమ రొందుఁ జుమా. 5

*   *   *   *   *

క. పదియేండ్లకు ము న్నీ బడిఁ బదిమందియు నాదరింపఁ బ్రజ పాలించెన్
మొదలిటినాళ్లన్ దీనికిఁ, గొదవలు పె క్కొదవెఁ దగినకోశము లేమిన్ 6

సీ. ఇరువదాతేండ్ల నాఁ డియ్యది పొన్నూరఁ, బూరిపాకలలోనఁ బ్రొద్దువుచ్చు
తరుణమ్మునందుఁ దొల్కరివాన కడవలఁ, గుమ్మరించినయట్లు కురియఁజాగ
నపుడె సముద్ధాంతమై మహాసంవర్త, తీవ్రవాతంబునా దిక్కదంబ
మల్లాడ గిరులు కంపిల్లఁ బెల్లుగ రేఁగి, పెనుగాలి విసరెఁ దద్భీకరార్భ

ఆ. టికి జగమ్ముగుండె వికవిక లయ్యె ను, దు్ధత మాయె సకలభూతరాశి
మోకు తిరుగలేని మ్రాఁకులు పెళపెళ, ధ్వనులతోడ వ్రస్సి ధరణిఁ గూలె. 7

క. బడిపాకలు తొలిదెబ్బకె, యడఁగెన్ రాడులును గొమరు లాకులు పెండెల్
గడలున్ దడులున్ దొమ్మిది, కడలందున్ జెల్ల చెదరుగాఁ బోయిపడెన్. 8

క. బొమ్మలు తడిసెను దేశప, టమ్ములు చెడెఁ బుస్తకము లడంగె నెఱాప
త్రమ్ములు నశించె బల్లలు, వమ్మయ్యెన్ దులువగాలివానకతానన్. 9

క. పొలకల నైన బడిం గని, పొలిమేరల నుత్తరించి పొంగెడివంతన్
నిలుపంజాలక విద్యా, నిలయసభాసభ్యకోటి నిలువునఁ గూలెన్. 10

క. సంతానం బెవనికి బడి, సంతానం బెవఁడు పాఠశాలకు నా; ద
ప్పంతయపంతులు లేమికిఁ, జింతాశరధేనువిద్ధచిత్తం బయ్యెన్. 11

క. భావనాచార్యు లల్ల న్యాపతి హనూమ, దాఖ్యుఁడును మాడభూషి రామానుజార్యుఁ
డాదిగాఁ గల సభ్యు లయ్యవసరమున, నలమటం దిగఁద్రావి ధైర్యమ్ము నూఁది. 12

క. వేలు గలవారి, లక్షలు, మూలుగులోఁగిళ్ళవారిముంగల బడిబ
న్నాలు వివరించి మీకృప, కాలంబముగాఁగ దీని నరయుఁడు విజ్ఞుల్. 13

క. అని విన్నవింప నొకఁడున్, గనికరమును జూపఁ డయ్యెఁ గర్తవ్య మిఁకన్
మన కెద్ది యనుచుఁ గలఁగిన, మనములతో నింటిదెసకు మలఁగిరి సభ్యుల్. 14

క. అనువత్సరకార్తికవన, ఘనోత్సవావసరమధురఖాదనభక్ష్య
ప్రణిపాతసమభితర్పిత, జనుఁ డెదురై వచ్చె నితఁడు సభ్యుల కంతన్. 15

క. ఇద్దఱు కూఁతులతో ముస, లెద్దులతో రెండుగొర్ల కెచ్చనిమడితో
నిద్దాతనమ్ముతో నిలు, దిద్దుకొనున్ నాఁ డితండు తియ్యనిచెలితోన్. 16

ఆ. ఎన్నఁదగినకల్మియున్నది లేకున్న, మున్నితండు సల్పునన్న దాన
మన్నియూళ్ల ప్రజలు విన్నది యొట ల, క్ష్మన్నమీఁద వారికన్ను ప్రాలి. 17

క. రాజులలో నధునాతన, రాజులు కొసరాజు లట్టి రమణీయగుణో
త్తేజితులు గాక మేమును, రాజుల మనువారు బొమ్మ రాజులు గారే. 18

క. ఇన్నెతి నీతని మెచ్చుచు, నన్నా! లక్ష్మయ్య! కుశలమా నీకథలన్
విన్నారము కన్నారము, కన్నాకవు నీవ యూవిగలవారలలోన్. 19

గీ. అర్థిసాత్కృత మెవనిద్రవ్యమ్ము కాదొ, జగతి కాతండ వ్రేఁగు నాఁడగును గాని
యంబుధులుగావు, కా వరణ్యములు, తుహిన, కనకశైలాదికంబులు గావు బరువు. 20

క. నిన్నటి ఝంఝూ ఝంపలు, మన్నిగొనియె నొక్కతుటిని మనబడి నకటా
కన్నాఁదవె రా రమ్మని, క్రన్నన విద్యాలయంబుకడ కీ సుకృతిన్. 21

క. తోడుకొనిపోయి బగ్గము, పాడై దయనీయమైన బడిఁ జూపి కదున్
వాడిన మొగములతో ని, ట్లాడిరి ధీనిధులు భావనాచార్యాదుల్. 22

ఉ. భావిపురాతనాద్యతనభారతగౌరవలబ్ధి కెల్ల వి
ద్యావిభవంబె మూలము గదా ధనధాన్యతురంగదంతిరా
జీ వరణీయసౌధమణిశింజితు లయ్యును విద్యలేనివా
రేవిధి రాణకెక్కి చరియింతురు పెంతురు మానవత్వమున్. 23

ఆ. విద్యలేమిఁగాదె వేయేండ్లనుండియు, మోవరానిదాస్యమునకుఁ జిక్కి
పరితపించుచుండె భారతదేశమ్ము, తల్లిగోడు మాన్పఁదగదె సుతులు. 24

క. దానమ్ములందు విద్యా, దానం బది ప్రథమగణ్యతం గను లక్ష్మ
య్యా! నీ వెఱుఁగని ధర్మువుఁ, గానము, మేల్బంతి వీవు గఱువల కెల్లన్. 25

క. ఈ పాఠశాలయే మగ, పాప సుమీ నీకు; దీనిఁ బరిపోషింపన్
వే పూను; మిహపరశ్రీ, నీ పాలం బదును త్రిభువనీపూజ్యముగన్. 26

మంజరి :

అనవుడు ని వ్వీరుఁ దల్లన నవ్వి, యోపెద్దలార! విద్యోన్నతులార!
యేనేద నీచేఁత యేద నావంటి, బదుగుమానిసి యింతబరు వూనుటేద?
నన్ను మన్నింపుఁ దన్నలు! సంతతార్థ, సంపన్ను లగువారి సాయమ్ము గొనుఁడు
నాకుం దగిన కాన్క న న్నేలు ప్రభువు, లనుమతించినకాన్క నందింతు నెల్లి
నామీఁద సన్నసన్నని వాని మీఁదఁ, బెదపెద్ద యాసలు పెట్టుకో వలదు
గడువు పెట్టితి నంచుఁ గలఁతపాల్గాక, సెల వొసంగుఁ డటంచుఁ జేరె గేహమ్ము. 27

అనాఁటి రేయి నిద్రా, ధీనున కాస్తిక్యసేవధికి నిజపాద
ధ్యాన సుధాపాన మహో, లీన స్వాంతునకు మధురలిప్సానిధికిన్. 28

క. ఈ లక్ష్మయకు యశోదా, బాలుఁడు సాక్షాత్కరించి భక్తశ్రేయో
లోలుఁడు దరహాసరమా, లాలితవదనంబుమైఁ గలం బల్కె నిటుల్. 29

శా. ఆపన్నంబగు పారశాలకయి సాయం బర్థిమై వేఁడఁగా
నాపై భారము పెట్టి వచ్చితివె యన్నా! నిన్నుఁ బొన్నూరిలో
నీపావిత్ర్య మనన్యసాధిత మహో! నీ వొజ్జవై లోకపుం
బాపంబుల్ తెగఁజూడనేర్తువని సంభావింతు నిన్ లక్ష్మణా! 30

గీ. వనసమారాధనంబు లవ్వారిగా నొ, నర్చి ననుఁ దన్పుచుంటి వీనాఁటిదనుకఁ
జాలు నిఁక నన్నదానముల్ చాలు నీదు, మదిని మరలింపు మొండొక మార్గమునకు.

క. ఆధ్యాత్మికసంపత్తికి, విద్యయె మూలం, బెవండు విద్వాంసుఁ డతం
డాద్యపురుషు న్ననుం గని, యధ్యక్షించును వినశ్వరానందంబున్. 32

క. న న్నెఱుఁగలేని మానవు, లన్నా! పశుతుల్యు లట్టి యజ్ఞులఁ దెలుపన్
బన్నిన సంస్థకు నీకడ, నున్నధనం బెల్ల నొసఁగు టుచితంబు సుమా! 33

గీ. తన్నుమాలినధర్మంబు తగునె యంచు, నోహటిల్లకు నీ కింత యోగిరంబు
చిక్కదా లోకమునఁ జేను చెట్టు లేని, మనుజు లెందఱు లేరు ముమ్మాఱు తినుచు. 34

క. ఆవంత సంశయింపకు, నీవం తీకర్జమంచు నియమింతు హిమ
గ్రావ దశకంఠపుర మ, ధ్యావని నీ కొండ్ర యుంట కనుమతిసేయున్. 35

క. యాగాదులుం దనూజులు, సాగరముం బోని మేటిసంపద లమృతం
బీఁగలవా నిరవధిక, త్యాగం బది యొండె లెస్స తగు నప్పనికిన్. 36

క. లే లె మ్మెవ రే పగిదిన్, గేలి యొనర్చినను నీవ గెల్తువు నా ప
ల్కాలము సేయకు, విద్యా, శాలోద్ధరణప్రయత్నశాలివి కమ్మా! 37

క. అని పల్కి తిరోహితుఁడై, చనె నఁట; యీసాధులోకసత్తముఁ డంతన్
దన వేల్పుం గొనియాడుచుఁ, గనుదెఱచెన్ సతికి స్వప్నగాథలు వినిచెన్. 38

క. ఆ పడఁతుక యీ పురుషున, కేపుణ్యఫలంబొ "శంక లేటికి బృందా
గోపాలుపన్పు శిరమున, వే పూనఁగదయ్య! మల్లెవిరిదండవలెన్". 39

ఆ. అనుచు నాథుఁ దెల్పెనఁట! యెంతదొడ్డయి, ల్లాలొ లక్ష్మణార్యుఁ డేలువెలఁది
పొదమఁజాలునెట్లు పూర్వసంస్కారమ్ము, లేనిచాన కిట్టిలెస్సతలఁపు. 40

క. ఏటి కని మగఁడు లాగినఁ, గోటికిఁ దా లాగి వానికుత్తుక కురియా
బోటికి నీమె సతీత్వము, మాటికి మాటికిని బుద్ధి మప్పఁగఁజాలున్. 41

క. సహధర్మచరీపద భర, వహనక్షమ రామమాంబ వాసచ్చరితం
బహరాద్యనిమేష ముహూ, ర్మహురుద్దేయమ్ము విశ్వమునకాంతలకున్. 42

క. పదపడి మనలక్ష్మయ దె, బ్బది యేన్గుల బలముతోడ బడిపనిఁ బూనెన్
బదియూళ్ళకుఁ గూడలియై, పొదలెడి యిచ్చోటు వలిచి పుణ్యాహమునన్. 43

క. త్రవ్వెఁబునాదులు కార్మిల, తీవ్వాన రావించె నెల్ల తేపులు మాపుల్
నొవ్వెఁబుఁగ కన్నిపనులం, దివ్వీరుఁడు పాలుగొనియె నించిన వేడ్కన్. 44

క. పొల మమ్మెన్నగ లమ్మెను, గలవస్తువులెల్ల నమ్మెఁ గడ కిల్లమ్మెన్
మలమల నెండకు మాడుచు, లలిఁ జెట్టిన కుట్టిగట్టి లక్ష్యము గొట్టెన్. 45

క. పదునాల్గువేల విత్తము, వెదపెట్టెఁ గదన్న దానవీరుం డితఁ డీ
సదనమున, కెన్ని విఘ్నము,లొదవిన నావంత సెదని యుత్సాహమునన్. 46

క. కూలికి బండిం దోలుచుఁ, బాలికి మడిదున్నుకొంచు బ్రదుకుచు నున్నాఁ
డీ లక్ష్మయ నేఁ డోహో, హో లే రీదృశులు కర్మయోగులు జగతిన్. 47

క. తన ర క్తమాంసములతోఁ, దనసర్వస్వమ్ముతోడఁ దినిసిన బిడ్డన్
దినదినము న్జూడక యీ, జనకుఁడు నిలఁజాలఁ డీ విశాలగృహమ్మున్. 48

క. ఇతఁ డిచ్చు నింటితో ను, న్నతవిద్యాశాలయై తనర్చి మనీషా
చతురుల వెలయించుచు సం, స్తుతి గను నీబడి నితాంతసుందర మగుచున్. 49

క. దేవుఁడుగా కీతఁడు నరుఁ, డా విశ్వజనీనవృత్తు లగు వా రెల్లన్
దేవపదవాచ్యు; లేవపుఁ, ద్రోవలఁ జనుమనుజు లెల్ల దూరక్షస్సుల్. 50

* * * * *

క. ఏ మనుకొంటివొ నిదుఁద్రో, లీమాన్యచరిత్రు నొకనినే కాదు గుణో
ద్దాములఁ బెక్కురఁ గని తన, నామము నన్వర్థముగ నొనర్చె వయస్యా! 51

గీతమాలిక :

రసికతకు నాశ్రయంబు నా రాణకెక్కి, కవుల దనియించి గాయకాగ్రణులఁ బెంచి
దానకందూతి కగ్గమై దీనలోక, సురభియైనట్టి వేంకటసుబ్బరాయఁ,
డిచటనే పుట్టె - నచ్చుతాప్రచురభావ, భరితుఁడై పాండితీబలప్రథితుఁడై వి
గర్వియై నిజదేశవికాసకృత్ క్రి, యా రిరక్షులుగాఁ దన యూరియువల
సంస్కరించిన జంపని సత్కులుండు, పొదమె నిచటనె యాంజనేయుఁడు - తెలుంగు

నేతలం దొకఁడై - రాజనీతిలోఁతు, లెఱిఁగి యుత్తమపీఠంబు లెక్కి పెక్కు
వత్సరంబులు బ్రాహ్మీనివాసమునకు, దీని కేలికయై యేతదీయపుష్టి
కారణంబై తనర్చినవీరుఁ దసమ, జిష్ణుతాభాసి వేంకటకృష్ణుఁ డింద
కలిగెఁ-బ్రాచీ ప్రతీచీ జగత్కళా స, మగ్రుఁడై త్యాగజీవియై మాతృదాస్య
దళనకేళీనిమగ్నుఁడై దైన్యగాధ తిమిర సంఛన్న సైరిక సముదయమ్ము
పాలి జీవనజ్యోతియై పతితసంఘు, ముక్తికై ప్రాణమానము ల్మొడుపుగట్టి
నవ్యకర్షక శకకర్తనాఁ జెలంగు, భారత శ్రీవిధాత నాఁ బరఁగు వీరుఁ
దవతరించెను రంగనాయకుఁడు నిందె, నీ వెఱుంగవొ నిడుఁబ్రోలిచేవ దీని
బిడ్డలం దెంద ఱెందఱో దొడ్డవారు, కలరుకాని వా రొకయెత్తు కలిమిలేక
చదువులే కిట్టి నెఱచేఁత సలిపినట్టి, లక్ష్మయాభిధుఁ డొకయెత్తు లక్ష లున్న
వాఁడు వే లిచ్చు టబ్రమావంద లున్న, పేద సకలమ్ము నిట్టు లర్పించుటన్న
నెంతయౌదార్య మజ్జారె! యెంత తెగువ!, యెంత ధర్మాభిరతి! సత్కవీట్ ప్రబంధ
వస్తువై తెల్గునాఁటిలో వాడవాడ, లందు వీనిచరిత్ర పేరందవలయు. 52

చ. "శ్రుతులును బ్రహ్మవేత్తలును సూనృతవాదులు గోవులుం బతి
వ్రతలు నలుబ్ధులై నెగడువార లుదారవదాన్యతా కళా
రతులున కాక యిమ్మహిభరమ్మున కెవ్వరు చాలువారు ప
ర్వతములునేన్గులున్ఫణియుఁబందియు మోయుట నమ్మనయ్యెదన్" (ధర్మజ్యోతి) 53

క. అని మున్ను నీవు మెచ్చిన, యనఘులయం దెన్నఁదగిన యతఁ డీతఁ డనన్
విని బ్రీడకు విస్మయమున, కనుతాపంబునకు లోఁగి యార్తింబడుచున్. 54

క. ఇతఁ డింత యొప్పునే ఋషి, నతిమాత్ర పవిత్రతాసమంచితు వీనిన్
మతిలేక దూఱు నా కే, గతి కలదో మోవరానికలుషము వచ్చెన్. 55

క. ఈతఁడు సక్తుప్రస్థుం, డీతండు మరుత్తుఁ డీతఁ డినసూను వహో!
యీతఁడు బలి యీతఁడు శిబి, యీతండు దధీచి పూజ్యుఁ డితఁ డెల్లరకున్. 56

ఆ. ప్రజలకొఱకు నిట్లు బలివోవు లక్ష్మణు, నూరుపేరు తడవఁ డొక్కఁడేని
లోక మెంత గ్రుడ్డిదోకదా చెన్నఁటి, వానిఁ బిలిచి పీటవైచి కొలుచు. 57

క. సడిసన్న యేద్దెఱన్ దన, యొడలిన్ రణభూమి కిచ్చు నొసపరిబంటున్
నొడువ; దని కోహటించిన, పడవాల్ తలమీఁదఁ జల్లు బంగరుపువ్వుల్. 58

మం. ఇట్టివీరుల జగద్ధితకార్య మరసి, యంతుపట్టని జీవితావధుల్ దలఁచి
యాడంబరమ్ముల కలవాటువడని, మనుగడఁ గాంచి వేమఱు వాడవాడ
వెక్కిరింపకుఁడు గర్వితచిత్తులార!, సంపదల్ భోగముల్ చక్కఁ దనమ్ము

లధికారమత్తత లఖిలదంభములు, ననివార్యమై పోల్చు నవసానవేళ
కొకనాఁడు తప్పు కాహుతియౌట నిజమ, ఓదురహంకారు లో జనుషాంధు
లిట్టి జానపదాలి కెవ్వరు స్గుసుమ, హారముల్ నింపలేదని, కవుల్ వీరిఁ
గీర్తింపలేదని గేలిసేయకుఁడు, మీ రుపేక్షించు గ్రామీణులలోన
విశ్వైకతేజోగ్ని విస్ఫులింగములు, గమికొన్న హృదయముల్ కల వనేకములు
రాజదండము దాల్చి రాజ్యమ్ములేలు, జీవసారస్వత శ్రీవీణమీటు
మధురహస్తాలకు మాత్రము కఱవె, బ్రాహ్మీకటాక్షసంపత్తి కీ ప్రజలు
దవ్వైరిగాని దుర్దాంతదారిద్ర్య, మేఁచి వీరలశౌర్య మిఱ్ఱింకెఁగాని
కల్పనాఝరి గడ్డకట్టెను గాని, యలఁతివారా వీర లంతంత వారె?
మున్నీటిలో విశ్వమోహనచ్ఛవులు, పండురత్నము లెన్ని పడియుండలేదు
పరువమ్ము కమ్మనల్ పాడఱిపోవఁ, గటకటా! నిర్జనకాంతారవీథిఁ
బుష్పరాజము లెన్ని పొలియుట లేదు, మానవేంద్రుల రత్నమకుటముల్ దించు
నెందఱుతిమ్మర్సు లిందు లే రడఁగి, యించుకంతయుఁ గీర్తి నెఱుఁగని మూఁగ
మానుసులగు చిల్కమర్తి కవీంద్రు, లీ ప్రజారాశిలో నెందఱు లేరు
ఉన్నారు వేలు వే లున్నారు గాని, యెక్కలేరు చరిత్ర కీ మహామహులు
లేమి కొందఱపేరు లేకుండఁ జేసెఁ, గులము కొందఱపెంపు గోతిలోఁ ద్రొక్కె
మతము కొందఱరూపు మాపి యుప్పొంగె, నకటా! గరీయాంసులగు వీరికొఱకు
నొక్క నిట్టూర్పు - నిట్టూర్పు - రానిందు -, రానిందు మీ పాపరాశి పెంపఱఁగ 59

క. అని శాఖాచంక్రమణం, బొనరిచి యే నింతతేఁటి యుడుగని తివుటన్
జన సేవా పరతంత్రుని, మునివర్యుని లక్ష్మయార్యు మొగమున్ గనుచున్. 60

క. నీచుల మెచ్చుట కెన్నఁడు, వాచవి లేనట్టి మతము వాఁ డని వాణీ
వైచిత్రి వెలయఁ బరిపూ, తాచారుల నుగ్గడించునతఁ డని జగతిన్. 61

క. నానుడి గల యే నెచ్చుట, నీ నిందాలాప మెచట నియ్యది గాలం
బై నాగుండెను దేవుచు, నానా వేదనలపా లొనర్పక యున్నే. 62

క. వాచాదోషం బిది సెడ, మోచాఫలమధుర విశ్వమోహన చాటు
శ్రీ చిక్కణ మస్మత్కృతి, కీ చారుకథానిధాను నీశు నొనర్తున్. 63

ఆ. ఇట్లు నిశ్చయించి యాఁనాటి కానాఁటి, మాట మందమతిని మఱచినాఁడ
లోకమాన్యు నెవని నీ కావ్యభర్తఁగా, నాచరింతునంచుఁ జూచినాఁడ. 64

గీ. వారినని వీరినని పెక్కువగలఁ దలఁచు, వేళ నొక నిద్రలో ధర్మవీరుఁడితఁడు
దర్శనంబిచ్చి మత్ ప్రమాదంబు తొలఁచె, నమ్ముఁ డిది సర్వథా సూనృతమ్ము బుధులు!

క. వినరయ్య! నాఁటికర్జం, బొనరింపంగంటి నేఁటి కోహో! తెలుఁగుం
జనులారా! యే మందురు, ననుఁ దద్దురితంబు వాయునా వాసినదా 66

శా. రావయ్యా! కొసరాజు లక్ష్మణకృతీ! రావయ్య కబ్బంబు గై
కోవయ్యా! భవదీయపావనకథాకూలంకషాస్నాతులై
శ్రీవాణీపదభక్తులీ కవిత సంసేవింతు రాంధ్రక్షమా
దేవీవత్సలతాపహారచణ పుత్త్రీపుత్త్రు లాకల్పమున్. 67

ఉ. కాసుల కాసచెంది కృతికన్యల నమ్మక ప్రాజ్ఞకోటిలో
వాసిగడించినట్టి కవివర్యులు కానుకబెట్టు కబ్బముల్
మోసెడిభాగ్య మెల్లరకు ముట్టదు విశ్వజనీనశీలురై
భాసిలు నిన్నుఁబోని గుణభద్రులకే సమకూడు లక్ష్మయా! 68

క. ఇఁక నీకీర్తిజ్యోత్స్నలు, సకలాశలఁ బ్రాఁకి దిగ్గజము లవి యెల్లన్
బ్రకటైరావణభావ, ప్రకాశములుగా నమర్త్యపతి నాడించున్ 69

ఆ. నిన్నువంటివారె ప్రన్నని నాకైత, నేలుచంద్రుగాత! మిద్ధగుణులు
పసిఁడికొండ లంచుఁ బశువులఁ గొండాట, వలవకుంద్రుగాక! తెలుఁగుకవులు. 70

15-9-43



# భారత సవిత్రి

సీ. వెన్నతోడనె చతుర్వేదబుక్కులు పంచి, సుతుల కేజనయిత్రి చుంచు దువ్వె
త్రిజగంబు లన్యథా సృజియించు గడుసరి, కొసరి యే తల్లిచన్ గుడిచి తనిసె
ఱాలు విత్తినచో వరాలగుత్తులు పండు, నవనిపై నేరాణి హక్కు వడసె
పాత్రంబులగు నిహాముత్రసంపద లిచ్చు, తటిను లేదేవిపూదండ లయ్యె

గీ. మూఁడుసంద్రాలు నగరాజు మోఁకతించి, యేమహాశక్తినర్చింతు రెల్ల దెసల
నమ్మహేశ్వరి కఖిలకల్యాణఖనికి, భారతసవిత్రి కర్థినై ప్రాంజలింతు.

10-7-40



# సంక్రాంతి

సీ. కొసరి నూతిన పచ్చిపసపుఁబూఁతమొగాన, గుమ్మడిపూదుమారమ్ము నద్ది
కందరేగద నారఁబండి కన్పందు వై, పొలుచు మిర్యపుఁబందు బొట్టు వెట్టి
వలిపమ్మునకు నొక్కవాసి హెచ్చైనట్టి, నునుమంచుఁదెలిచీర నూలుకొల్పి
బంతిపూవులకుఁ జేమంతినెయ్యము గూర్చి, కబరీభరమ్ముచక్కన కుదిర్చి
గీ. పంటకళ్లాలు మును బరాబరులు సేయ, గూఁడుగట్టిన తెలిమబ్బుగొడుగునీడఁ
గదలివచ్చెను భాగ్యాలకదలి వోలె, మకరసంక్రాంతిలక్ష్మి హేమంతవీధి. 1

సీ. లేఁగటిపాలలోఁ గ్రాఁగి మాఁగిన తీయ, తీయకప్పురభోగిపాయసంబు
చవులూరు కతివేఁపచివురాకుతో గమ, గమలాడు పైరవంకాయకూర
తరుణకుస్తుంబరీదళమైత్రిమై నాల్క, త్రుప్పు దుల్చెడి నక్కదోసబజ్జి
క్రొత్త బెల్లపుఁదోడికోడలై మఱిఁగిన, మదురుగుమ్మడిపండు ముదురుపులుసు
గీ. జిడ్డుదేఱిన వెన్నలగడ్డ పెరుఁగు, గరగరికఁ జాటు ముంగారు చెఱకురసము
సంతరించితి విందుభోజనము సేయ, రండురం దని పిలిచె సంక్రమణలక్ష్మి. 2

సీ. నెలదప్పినట్టి కోడలిచేత నొక య త్త, బోగిపొంగలిపూజ పూర్తిచేసె
పుట్టినింటికి వచ్చినట్టి కూఁతు గులాబి, చెక్కిళ్ళ నొకతల్లి చెనకి పుణికె
మాఱువడ్డించెడి మఱఁదలి కెంగేలు, పిసికి వల్దనె నొక్క పెంకెబావ
వంగి ముగ్గులు దిద్దు వధువుపై నీర్చల్లె, గది వీడిచను నొక్క గడుసుమగఁడు
గీ. అపుడె వచ్చిన ప్రియునిసోయగముఁ గనుచుఁ, దలుపుచాటున నొక్క పైదలి చెమర్చె
మధురమధురానురాగసామ్రాజ్యపీఠి, జగము కొలువుండె మకరధ్వజంబు నెత్తి. 3

సీ. తొలిమేని దుష్పాపఫలము పండిన రోగి, మొఱ్ఱోయనుకొలంది బిఱ్ఱబిగిసి
వసవల్చు పసిపాపదెస కేగి నీతికి, బాహిరంబైన దర్పంబు నెఱపి
దగ్గు మున్కలతాత వగ్గుందనము సూచి, గొనయమ్ము గనయమ్ము కొసకు లాగి
పంచాస్త్రు దయరాని బ్రహ్మచారులఁ దాఁకి, తోరహత్తములోని జోరు సూపి
గీ. పొగరుపొంగున రవ్వంతబుద్ధి లేక, పొలయలుక చన్న తఱపిజంటల నెదిర్చి
కొంటెచలిగాఁడు కొదమ కౌఁగింటిసెగలఁ, గటకటా! మ్రగ్గిపోయె సంక్రమణ వేళ. 4

సీ. ఈ కోడిపందెంబు లేమి చెప్పెడినయా, ఆంధ్రజాతీయశౌర్యాభిలిప్స
ఈ రంగవల్లిక లేమి తెల్పెడినయా, తెలుఁగునారీకళాధీనబుద్ధి
ఈ గంగిరెద్దువాఁ డేమి పల్కెడినయా, మఱుఁగువడ్డ తెనుంగుమాట తేట
ఈ గొబ్బిసంబరం బేమి చాటెడి నయా, తనివిగొల్పెడు నాంధ్రిధర్మభిక్ష
గీ. ఈ రుచిరపాయసాన్నంబు లేమి చూపు, తెలుఁగు లేజంట తొలుకారు వలపుఁ జవులు
వింత లొలికించు కలికిసంక్రాంతి నిట్లు, తెలుఁగుఁదన మింట నింట మూర్తీభవించె.

సీ. ఉదయాస్తనగహిమవ్యూహసేతువు లెల్ల, లగు మహీరాజ్యంబు నతకరించి
అఖిలప్రజావిస్మయాపాదకంబైన, బ్రహ్మచర్యవిధానభార మూని
ధర్మేతరక్రియాతత్త్వబోధనసేయు, గురునైన హరునైన గ్రుద్ది గ్రుద్ది
అపరాజితోరుశస్త్రాస్త్రరోచిష్ణువై, రణకళానీతిగౌరవము పెంచి
గీ. పున్నెములముద్ద నాఁ గీర్తి గన్న భీష్ముఁ, డంపసెజ్జకు గాయంబు లప్పగించి
నీ యొడిం గన్నుమూఁతకై నెలలు సైఁచె, మకరసంక్రాంతి! నీ వెంత మాన్యవమ్మ! 6

సీ. తట్టలుతట్టలే త్రవ్వి *సుంకులు వోసెఁ, బొలికేకలో నొదల్ పులకరింప
పొలికట్టె నందియు మొలకనవ్వుల నిండు, కళ్లమిచ్చెను జీతగానికొఱకు
వెలసూచి చిఱుఁదిండి విలిచెనా కొబ్బెర, చిప్పకే చేటలుచేట లొసఁగె
గాజుల కని కోరఁగా గంప కెత్తించి, పాలేరుసతికి సంబరము గూర్చె
గీ. కుంటికిన్ గ్రుడ్డికిని వేఁడుకొన్నవాని, కెల్లవానికి భాగంబు లేర్పరించి
లేము లెఱుఁగని సంక్రాంతిలేమ కపుడ, నుంగుఁదోడయ్యెఁ గుప్పలు నూర్చురైతు. 7

సీ. లేఁబొట్టతోఁ బిసాళించు నాముసకు న, క్కోరుదూడలు వెండికొండ లయ్యె
నిముసాన కొకసారి నిండునక్షయపాత్ర, గాసిచే సొతాని గజ్జెవిప్పె
కల్లుపెల్లాని రంగము పెట్టెఁ గాకలీ, నాదమ్ముపంట యేనాదిజంట
ప్రాఁజీర విడి మాలపడఁతి క్రొత్తలు దాల్చి, సూచించె శిశిరర్తుసుదతిరాక
ఆ. క్రొత్తకుసుమకూడు కుత్తుకబంటి గా, బిచ్చగానికుక్క పెచ్చురిల్లె
చేవ తనివి వేడ్క చెలువంబు కావరం, బగ్గలించె నుత్తరాయనమున 8

14-12-41



# ఆదర్శవీరుఁడు

సీ. అది మొగల్పాదుసా యౌరంగజేబు రా, జ్యమొనర్చు పదియునేడవశతాబ్ది
అది భారతీయదాస్యాంధకారప్రభల్, దోబూచు లాడెడి దుర్దినంబు
అది పరస్పరమైత్రి యడుగంటి హైందవుల్, లోలో నెదుర్చు దుష్కాలఘటిక
అది స్వాభిమానరక్షార్థియై బెదరి హిం, దూ మతం బల్లాడు దుర్ముహూర్త
గీ. మది నిజకుమారదైన్యదశావలోక, జనిత సంతాపపావకజ్వాలికా వి
తప్తమానసయైభారతంపుజనని, వేఁడికన్నీరు గార్చెడు విసపుఁబ్రొద్దు. 1

* గ్రామదేవతకు నర్పించు ధాన్యము

మ. మతవిద్వేషము హెచ్చి సిక్కులు ముసల్మానుల్ విజృంభించి వి
ౖశుతశౌర్యం బనివార్యవీర్యము రణక్షోణిం బ్రదర్శించి క
ల్పతరుప్రాంతలతాకుటీరగత రంభామేనకాద్యప్సర
స్సతతాలింగనభోగభాగ్యకలనాసంతుష్టులై రత్తఱిన్. 2

క. ఈడంబోవని మగఁటిమి, తోడన్ బెక్కేఁడు లెదిరి తుద కొక రణమం
దోడిరి సిక్కులు; తురకలు, పాడిరి జయగీతములు నభం బద్రువంగన్ 3

క. చిక్కెం గాలవశంబున, సిక్కుగురూత్తముఁడు సర్వసేనాపతి పే
రెక్కిన తేజబహద్దరు, దిక్కెల్లఁ జెడన్ మహమ్మదీయులచేతన్ 4

క. మలక లతనిం గదుంగడుఁ, గులుకుచు బంధించి విజయకోలాహలముల్
బలియ న్గొనిచని నిల్పిరి, సలాము లొనరించి పాదుసాకట్టెదుటన్ 5

శా. సంతోషాంబుధి నోలలాడుచుఁ బ్రశంసంజేసె నౌరంగజే
బెంతేని న్దనవారి, నంతట నహో! యివ్వీరు లెవ్వారు దు
ర్దాంతాహంకృతులైన సిక్కుదొరలా తథ్యంబు! వీరేల మా
చెంతం జేరి రటంచు నమ్మగని నాక్షేపించి యిట్లాడెడిన్. 6

క. పొగరెగసి మొగలు వీరుల, మగఁటిమి గనవైతి వింతమాత్రము నౌరా!
తగరు నగరాజు నెద్రిచిన, పగిదిం జరియించి తింతవట్టు వెడంగా! 7

గీ. చిక్కితివి దక్కితివి మొగల్‌సింగమునకు, నేఁటి కిటు వంటయింటికుందేల వైతి
బహదరూ! దిక్కుమాలినపక్షి విపుడు, బ్రదుకుపై నాసయున్న నాముదల వినుమ. 8

క. నా కనుసన్నల మెలఁగుము, నా కొలువు న్గొలిచి మన్నన ల్గాంచుము నా
మూఁకకు నొక్కటి కేలిక, వై కనుమా నిస్సమాన మైన యశంబున్. 9

క. కాదనక సిక్కుమతమున్, బోఁదోలుము మన్మతంబు భూషింపుము నా
యాదరమున వర్ధిల్లుము, లేదా చచ్చెదవు జాలిలే దీతనికిన్. 10

ఉ. నావుడు సిక్కుదంట చిఱునవ్వు మొగంబునఁ దాండవింప ధి
ల్లీ విభుతోడ నిట్లను బలే! యవనాధిప! నీ వివేక మీ
త్రోవలఁ బట్టుటొప్పునె! విరోధి వశంగతుఁడైన వేళ నే
యే విధి నాడఁజెల్లు నొకయింత యెఱుంగ విఁ కేమి సెప్పుదున్. 11

ఉ. మీసము దువ్వి శాత్రవులమీఁదికి దూఁకుమగండు విక్రమో
ల్లాసవిభాసియై రిపుబలంబుల నొక్కపు దోర్చు, నొక్కచో
గాసికిఁ జిక్కఁగాని నిజగౌరవనాశకవృత్తి కాతఁ డె
ట్లాసపడంగ నేర్చు వినవా కనవా మొనగాంద్ర చెయ్దముల్. 12

క. మతమునెడ విజ్ఞుఁడు బలా, త్కృతి సల్పునె యది మనుష్య నిచ్ఛావశమౌ
ట తగదె యాస్తిక్యముగల, మత మెయ్యది యైన సుజనమాన్యముగాదే. 13

గీ. విశ్వవిఖ్యాతసభ్యతావిలసితంబు, భారతావని ధర్మంబుపట్టుఁగొమ్మ
నీకు నెలవు గదా! యేమి నేర్చి తిందుఁ, గమలసౌరభ మది యెంత కప్ప తెలిసె. 14

శా. దుర్వారప్రథనక్రియాచతురతాదుర్ధర్షులై మించు మా
పూర్వుల్ పెక్కురు దేశమాతృచరణంబుల్ చిత్తమందూనియీ
యుర్వి న్గార్చినరక్త మిప్పటికి నోహో! యింకి పోలేదు నీ
గర్వోక్తుల్ ఫలియింపఁజాలునె వివేకం బున్న నూహింపుమా. 15

ఉ. చచ్చెదు సచ్చె దంచుఁ బలుసారులు హెచ్చరికించె దేల యీ
చచ్చుటకై భయంపడి విశాంపతు లెల్లరు నవ్వ నేఁడు నీ
బిచ్చము నిచ్చగించి రిపుభీకరభారతజాతి కీతఁ డే
మచ్చయుఁ దెచ్చిపెట్టఁడుసుమా! విడువందగు నీప్రలాపముల్. 16

ఉ. చావనివాఁ డెవండు జితశత్రులు సప్తసముద్ర ముద్రిత
క్ష్మావలయాధిపత్యపరిసర్పితకీర్తులు చక్రవర్తు లే
రీ వచియింపు; కీర్తి యొకఁడే యమరత్వము గన్నదోయి త
త్సేవకె ధారవోయుదురు జీవము భారతవీరశేఖరుల్. 17

ఉ. చిక్కినవానిఁ బట్టి వధసేయుదు నందువు దానిఁ దీర్ప నే
మ్రుక్కడిసాలఁ దోయి బలమున్ మగపాడియు నున్న దేని పే
రెక్కినకత్తినిచ్చి యిపుడే యెదిరింపుము నన్ను నీకు నా
సిక్కఁదనంబునంగల విశేషము సూపెద నొక్క వ్రేల్మిడిన్. 18

క. తెలియవొకో సిక్కుల ని, స్తులధైర్యస్థైర్యశౌర్యధూర్వహనకలా
బలలబ్ధయశఃపిహితా, ఖిలదిక్కుల భారతోర్వికి నలంకృతులన్. 19

ఉ. ముప్పదికోట్ల మానవుల మూర్ధములన్ దనసేయుశాసనం
బెప్పుడు నిల్పఁగోరు ధరణీశుఁ డిటుల్ నయబద్ధపద్ధతిన్
దప్పిన, వానిరాజ్య మయథాతథమై సెడకున్నె వానికిన్
ముప్పులు పెల్లురేఁగి తలమున్కలుగావె మదిన్ దలంపుమా. 20

ఉ. క్రూరతనూఁది నీ విపుడు కోసెదు నాశిర; మంతమాత్రఁ జే
కూరదు నీకు సంతస మకుంఠితశౌర్యులు సిక్కుజోదు లీ
వీరునినేత్రుచుక్క కొక వేవురుపుట్టి మొగల్ప్రభుత్వధా
త్రీరుహమున్ బెకల్తురు గరిష్ఠులు కుంకటివేరు లూడఁగన్. 21

ఉ. నిచ్చలు గుండెగాల మయి నిన్నుఁ గలంచు మగండు నేఁటితోఁ
జచ్చెను జచ్చెనంచు నిఁక సంబరమంద కతండు రేప తా
వచ్చు రణోర్వి కొక్కవరవర్ధినిగర్భమునుండి మార్తురన్
గ్రుచ్చు నిశాతభల్లమునకున్ జయలక్ష్మిఁకవుంగిలింపఁగన్. 22

శా. వీరాగ్రేసరు లిద్ధతేజులు జగద్విఖ్యాతకీర్తుల్ మహో
దారుల్ భారతపుత్రు లాత్మజననీదాస్యంబు మాయింప దు
ర్వారోత్సాహమునన్నిజాంగము తృణప్రాయంబుగా నిత్తు రీ
ధీరోదాత్త చరిత్ర నీకు నిపు డేఁ దెల్లంబు గావించెదన్ 23

క. ఉక్కున్ జక్కటి వీడక, యెక్కటియై సిక్కువీరుఁ డివ్విధిఁ బల్కన్
మొక్కలమున కెంతయుఁ బే, రెక్కిన యమ్మానవేంద్రుఁ డెంతయు నల్కన్. 24

శా. తోఁకంద్రొక్కిన నాగుఁబా మగుచు హద్దుల్మీఱి, కన్నుంగవన్
మూఁకల్ మూఁకలు విస్ఫులింగములు నిర్ముక్తంబులై క్రాల న
స్తోకస్థైర్యుని భారతీప్రియసుతస్తోమాగ్రణిన్ బౌరుష
శ్రీకందమ్మును సిక్కువీరుఁ గబళించెన్ బెంచె దుష్కీర్తులన్. 25

10-8-34

(భగత్‌సింగు నురితీసిన సమయము)



# గురుదక్షిణ

ఉ. చిక్కిన సిక్కువీరు మగచేవమెయిన్ రణ మిమ్మటంచుఁ దాఁ
జక్కటి సూప క మ్మొగలుషా పరుషక్రమమూఁది వాదరన్
ముక్కలుచేసియున్ బ్రమదముం గనఁజాలకపూతిగంధముల్
గ్రక్కుచుఁ గుళ్లి కుళ్లి చెడఁగావలె వీఁడని యెంచె నీసునన్. 1

క. ఆతనిపన్నున భటులు ప, రేతక్షితి శవము నిల్పి రేయుంబవలున్
జైతన్యముగల పీనుఁగు, లై తమధర్మంబు నడుపు నాసల నుండన్. 2

క. ఒక్క ముహూర్తములో నిది, పొక్కె నమృతసరములోన; బోరన సిక్కుల్
వెక్కిరి లేటమొగమ్ములఁ, జిక్కిరి పరిభవదవాగ్ని సిగల సెగలకున్. 3

క. ఒక మునలిసిక్కు గురుభ, క్తికి లోఁగినసాదు వగలఁ దెరలెడి తన వా
రికి నిట్లు పల్కె నెత్తురు, తుకతుక నుడుకెత్తి పొంగి తొందరపెట్టన్. 4

చ. పగఱకు నోహటించి నగుఁబాటున బ్రుంగుటగాక లోకముల్
పొగడిన మేటిజోదు గురుపుంగవు బ్రింగుటగాక గెల్పులో
సొగసినశత్రు లట్లు తెగఁజూచియుఁ దత్కుణపంబునిమ్మెయిన్
దెగడుట సమ్మతింతురె నుతింతురె శూరులు మీచరిత్రముల్. 5

క. పోవలయును గురుశవమున్, దేవలయును సిక్కు మతవిధిన్ మఱుపఱుపం
గావలయును సత్కీర్తులు, రావలయును మనకు నిహపరంబుల రెంటన్. 6

గీ. రాచపుట్టువు గన్నవారలకు నిట్టి, తరుణము లఖండపుణ్యలబ్ధములు గావె
నీచముగ నింటఁ దెవులుచే నీల్గనేల, నడుముగట్టుఁడు గురునిఋణమ్ము నీఁగ. 7

* * * * *

క. నే వెడలెద నే వెడలెద, నే వెడలెద నన్నరవళి నిండెను సభలో
నే వానిభాగ్య ముఱవో, దైవ మెఱుఁగు నంచు వృద్ధు తనివోయె నెదన్. 8

ఉ. పుత్రుని గూడి కోడియలఁ బూన్చిన కంచర మెక్కి నిర్భర
క్షాత్రము సందడింప నొకసైరికుఁ దెల్లర కంటె ముందె మ
ద్గాత్రము నేఁడు ధన్యమవుఁగా యని పొంగుచు హస్తినాపుర
క్షేత్రము సేరె సన్నసన చీకటి దాఁగురుమూఁత లాడఁగన్. 9

ఉ. హైందవుఁ డెవ్వడో తెలియ నాడినజాడలు పట్టి సంశయ
స్పందితచిత్తుఁడై యొలికిపట్టున కల్లన సేరి కాపరుల్
సందడి మాని నిద్రకు వశంపడినంత ముసుంగుచాటునన్
గందిన గాజువాతిన జగామగనిన్ గుఱుతించె సద్గురున్. 10

ఉ. వీరలఁ గన్మొఱంగి పదవిం బడినంతన కార్యఖడ్గముల్
తీరవు కాపువాండ్రు తెలతెల్లగవేగిన వెన్క నాగ్రహో
దారత వెంబడింతురు గదా మదవజ్జవనాశ్వకోటిపై
బారులుదీరి; నట్టిలివి పాపము ఱెక్కలు లేని సాధువుల్. 11

క. ఈ దుష్పటి మఱువున గురు, పాదులమా ఱొందుపిన్గు పడియుండినచో
మీఁ దెల్ల రుద్ధవిఘ్నో, త్పాదనమై వెలయుఁ గి ర్తిఫలసాధనమై. 12

మ. కొదుకా! ధైర్యమ జీవగఱ్ఱ యనుపల్కుల్ పల్కి వెన్వెంటనే
బెడిదంబౌ నడిదంబుదూసి తనుఁ దా ఛేదించె, రోమాంచముల్
వెడలెన్ దివ్యులమేన, నందనవనావిర్భూతముల్ క్రొవ్విరుల్
జడియైముంచెను సిక్కురైతు నఖిలాశల్ తెల్విఁజెల్వొందఁగన్. 13

21-1-40



## ఉద్రేకము

ఉ. సేనలతోడ నవ్వెలమసింగ మభంగురసంగరోత్సవ
శ్రీనిధి బ్రహ్మనాయఁడు విశిష్టచరిత్రుఁ దవార్యవీర్యస
మ్మానితమైన తేజము నమానుషపౌరుషమున్ వెలుంగఁదా
నా నలగామతోఁ దొదరి యాజి నొనర్పఁ దలంచి పోవుచున్. 1

ఉ. అంతిపురంబునంగల కులాంగనలం బరిరక్షసేయ దు
ర్ధాంతబలప్రతాపసముదగ్రుఁ గుమారుని బాలచంద్రు ధీ
మంతులు ధైర్యవంతులన మంతున కెక్కిన వానినెయ్యురన్
దంతివిరోధివిక్రములఁ దా నియమించి రణోర్వికిం జనెన్. 2

చ. నిజభుజశక్తి చూపుటకు నేఁడుగదా! తఱి యయ్యెనంచు న
క్కజమగు సంతసంబు నెదఁ గాంచెదు బాలున కీయనుజ్ఞ దుః
ఖజనకమయ్యె, నైన జనకప్రతివాక్యము గూదదంచుఁ దా
గజిబిజి మానియుండెఁ జెలికాంద్రురతో నల వీరమేదపిన్. 3

ఉ. మేదపిలో నతండు తన మిత్రులతో నొకనాఁడు బొంగరా
లాడఁదొడంగ వీటఁగల యంగన లెల్లరు నేగుదెంచి యా
వేడుక సూచుచుండి రల వీరులయాటలలోనినేర్పు గొం
దాదుచుబొంగరాలఁ గొనియాడుచుఁబాడుచు గుంపుగూడుచున్. 4

ఉ. పంబినవేడ్క నత్తఱిని బాలుఁడు ద్రిప్పెదు పైఁడిబొంగరం
బంబరమున్దిగంతములునార్వఁగ "రంయి"మటంచువచ్చి విం
తం బొదగాంచుచున్న యొక తన్వికి నన్నమ కజ్జమీఁద నా
టెం బొలివోని వేగమున దెప్పరమంచు జనంబు లాడఁగన్. 5

క. అయ్యతిదిగ్భ్రేటు గొని "య, య్యయ్యో చచ్చితి"నటంచు నన్నమ్మ వడన్
నెయ్యంపుఁజెలులు జెవులన్, జయ్యన మూసిరి విచారసంతాపములన్. 6

ఆ. అంతఁ గొంతవడికి నయ్యింతి లేచి దు, రంతరోషకలుషితాత్మ యగుచు
మొనసి మొప్పె నంచు ముకుళితహస్తుఁడై, మ్రోల నిలిచియున్న బాలుఁ జూచి. 7

శా. "రేచెర్లాన్వయులైన వెల్మదొర లుర్విన్ జండకోదండ వి
ద్యాచాతుర్యము మీఱ శాత్రవకులధ్వంసంబు గావించి ధ
ర్మాచార్యత్వము నంది పేర్వడసి రిట్లన్యాయ్యమార్గంబులన్
నీచారంభములం బొనర్పరుగదా నిర్భీకులై యెన్నఁడున్. 8

చ. కలన నిశాతహేతుల నఖండవిరోధివరూథినీ శిరో
ధులఁ దెగవ్రేయఁబోవ రణదుర్జయులౌ దొర లెల్ల, నీ విటన్
గులుకుచు సిగ్గుమాలి మదిఁ గొంకక జంకక బొంగరాలతోఁ
జెలువలపాదపద్మములఁ జెందెద విస్సిరొ! రాచబిడ్డవై. 9

చ. కలదొకొ నీకుఁ బౌరుషము కల్గినఁ గారెమపూఁడి సేరి నీ
దళములఁ గూడి శత్రువసుధాపతిసేనల నుగ్గుసేసి దో
ర్బలమును జూపి తేని మగపాడికి మెత్తురు లోకు; లిట్లు దు
ర్బలలగు నింతులన్ జదుమఁబాల్పడినన్ నినుఁ బ్రువ్వఁదిట్టరే. 10

ఉ. మీసము దీటి శాత్రవులమీఁదికి దూఁకఁగ శక్తిలేక సం
త్రాసముచెంది పందవయి తండ్రులకీర్తికి మచ్చఁ దెచ్చి యే
దోసములేని చానలకు దోర్బలముం బ్రకటించుచుంటి వి
స్సీ! సరివారిలోనఁ దలయెత్తఁగ నీమన సెట్టు లొప్పెడిన్. 11

క. అని తెగడుచున్న వైశ్యాం, గనపలుకులు ములుకులట్ల కాఁడిన, మది న
గ్గుణనిధి కినుకం జెందక, వినయంబు నయంబు వెలయ వెలఁదికి ననియెన్. 12

ఉ. "తల్లిరో! బొంగరంబు నిను దైవవశంబునఁ దాఁకెఁగాని నా
ప్రల్లదమోటు? గాటమగు బాధకు నోరువలేక శోకమన్
వెల్లువలోపలం బడి వివేకముఁ గోల్పడి నన్నుఁ దిట్టుదే!
కల్లనిజంబులం గనమి కర్జమె? నీమదిలోఁ దలంపుమా. 13

క. దోషంబో! పొరపాటొ! య, దోషమొ! నేదోషి ననుచుఁ దోఁచినఁ గడుసం
తోషంబున మన్నింపుము, రోషంబును బూని చానరో! తిట్టకుమా! 14

క. అని యవ్వెలంది గాయం, బునకుం దన మేలిపట్టుఁబుట్టంబును గ్ర
క్కునఁ జించి కట్టు గట్టెను, వనితకు మందులకు నూఱువరహా లొసఁగెన్. 15

గీ. ఇచ్చి యచ్చెల్వ నింటికిఁ బుచ్చివైచి, యాటపాటలఁ జాలించి యనుఁగుఁ జెలుల
నన్నపోతాదులం గాంచి యాగ్రహంబు, దుఃఖమును సంభ్రమంబుఁ దోడ్తో జనింప. 16

ఉ. "గండరగండవై యలవు గందును మెండుగఁ దాండవింప ను
ద్దండవిరోధికాండముల దర్పమునన్ విదళించి మించుచున్
గొండలఁ బిండిసేయఁగల క్రోల్పులి కెట్టి యవస్థ వచ్చె నీ
ముందకుఁ జుల్కనైతిఁ గద మూరినదుర్విధి నేమి సెప్పుదున్. 17

ఉ. రోసములేని పందనని రోయుచుఁ గోమటివీరకాంత నన్
గూసినకూఁత లెల్ల ననుఁగుంజెలు లందఱు వింటిరే? యిఁకన్
మీసము దువ్వి శాత్రవుల మింటికి గెంటక యింటనున్నచో
వీసరవోవకున్నె మన విశ్రుతపౌరుషవీరసంపదల్? 18

చ. నిరుపమ విక్రమక్రము లనింద్యులు నాఁ బలనాఁటి వీరశే
ఖరులు ప్రసిద్ధిఁ గాంచిరి యఖండయశోనిధులై వెలుంగు న
ప్పురుషులలో నొకందనయి పుట్టి కృపాణముఁ జేతఁ బట్టి సం
గర మగుచో నిట న్నిలువఁ గాంతలు నవ్వుట వింతయెట్లగున్. 19

ఉ. ఈ పలునాఁటిసీమ జనియించిన వీరవరేణ్యుఁ డీలస
ద్రూపవిలాసవిక్రమనిరూఢచరిత్రుఁడు నేఁడ కామధా
త్రీపతి గుండె జల్లుమనఁ దెంపరియై రణసీమఁ జేరు మీ
రోపిన రందు చందరిపుయోధశిరంబులబంతులాడఁగన్". 20

క. వీరరసోద్రేకంబున, నీరీతి నతండు వల్క, హెచ్చినవేడ్కన్
ఘోరాహవప్రయాణ, ప్రారంభము చెంగలించి బాలునిమిత్రుల్ 21

ఉ. "ఓపిన రందటంచు మము నుల్లసమాడఁగ నేల బాల! మా
యోపిక లెట్టివో! తెలియవో! వినవో! పెఱవారమో! యశః
ప్రాపణమైనఁ జావయినఁ బాయక నీ వెనువెంట నుంటయే
మాపని గాదె భీరువులమాడ్కి మముం దలపోయు టొప్పునే. 22

క. అని బాలచంద్రుతో నా, డిన విని యవ్వీరుఁ డినుమడించిన శౌర్యం
బున వారిఁగూడి తగు దీ, వనలం గొనఁ దల్లికడకు వడివడి నడిచెన్ 23

# వీరధర్మము

(బాలచంద్రుండు రణ మొనర్పఁబోవుతలంపు వెలువరించినతఱిఁ దల్లియగు నైతాంబ)

క. అక్కట కుమార! నీ కెవ, రిక్కరణిన్ బోధచేసి రీ వెక్కడఁ బో
రెక్కడఁ బౌరుష మెక్కడఁ, జెక్కిలి నిటు మీటఁ బాలు చిందెడి నీకున్. 1

ఆ. బంతులాటగాదు బిలిచెడుగుడుగాదు, బొంగరాల విసరుభంగి గాదు
గోలిగుండ్ల నాడికొనుఫక్కిగాదు సం, గరము తగరుపోరు కాదు తనయ! 2

క. హుంకారము లతులధను, ష్టంకారము లార్భటులును జంకెనలును బల్
అంకెలుఁ బొంపిరివోయెడు, సంకులసమరోర్వి నిల్వఁజాలుదె తండ్రీ! 3

చ. మదగజఘీంకృతుల్ తురగమండలిహేషలు భేరిభాంకృతుల్
రథగణనేమిధంధణ లరాళకరాళకృపాణజంఝుళల్
గుదిగొను సింహనాదము లకుంఠితభంగిఁ జెలంగ సాధ్వసా
స్పదమగు యుద్ధరంగమున బాలుఁడ వీ వెటు నిల్తు సెప్పుమా - 4

క. కత్తుల తళతళలకు నీ, చిత్తము కంపిపఁ గనుల జీకటి క్రమ్మన్
దత్తఱపడువడిఁ బగ తొక, మొత్తమ్మె ముట్ట నెట్లు మొత్తెదు వారిన్. 5

గీ. యుద్ధము లొనర్చి దేశంబు నుద్ధరించి, జాతికిం గులమునకు విఖ్యాతి దెచ్చి
మమ్ము నలరింప భావికాలమ్ము లేదె, తరుణ మిదిగాదు మాను మీతలఁపు గుఱ్ఱ! 6

క. సంతతి లేక కదుంగదుఁ, జింతిలిచింతిల్లి చిట్టచివరకుఁ జెన్నుం
డింత దయ సూప ని న్గని, సంతసపడితిన్ ఫలించె జన్మం బనుచున్. 7

గీ. నానిధానంబ వీవు నాప్రాణ మీవు, నన్ను నెడఁబాసి పోయెద నాయ మెడసి
తగవుగా దీప్రయాణంబు తగదు తగదు, విడువు సంగ్రామవాంఛ నో వెడఁగుఁగుఱ్ఱ!

క. నీ తండ్రి రణోర్వికిఁ జన, నాతో డీ వుందు వనుచు నమ్మితి నెదలో
నోతండ్రి! నాకదుపునం, దీతఱిఁ జిచ్చిడకు మేటి కీ సాహసముల్. 9

క. ఆలింపుము నాపల్కులఁ, జాలింపు మపాయజనక సంగరయాత్రన్
దూలింపుము రోషం బన, బాలుండిటు లనియె ధర్మపరవశుఁ డగుచున్ 10

క వెఱఁగయ్యె నీదుపల్కుల, తెఱఁగుం బరికింపఁ దెల్గుఁదెఱవకు నెఱపో
టరియగు బ్రహ్మనపత్నికిఁ, బితికితనం బిట్లు వెల్లివిరియందగునే. 11

ఉ. బాలుఁడవంచు సంగరముభంగు లెఱుంగనివాఁడ వంచు గు
ఱ్ఱా లిగిలించినంతనె కరంబు భయంపడె దంచు నా కహో!

పోలనినీతులం గఱపఁబోకుము వైరివిదారణక్రియో
ద్వేలయశస్కుఁడౌ వెలమవీరశిఖామణి వీఁ దెఱుంగుమా! 12

ఉ. బాలుఁడు గాఁ డితండు యువపట్టము నేలెడు దిట్ట యౌవన
శ్రీలలితుండె సత్క్రియలఁ జేయ వలంతి యతండె దుస్థితిన్
దీలుపడంగఁ దోలి నిజదేశసముద్ధరణం బొనర్పఁగాఁ
జాలినమేటి వాఁడె పటుసాహసదోహలుఁ డూహసేయఁగన్. 13

ఉ. కొండలఁ బిండియొనర్చెద, దండధరుండన విరోధిదళముల నెల్లన్
జెండాడెద వ్రేల్మిడి బ్ర, హ్మాండంబులఁ బట్టి బంతు లాడెద జననీ! 14

ఉ. కారెమపూఁడి రంగమునఁ గయ్యమునల్పఁగఁ గాలుదువ్వుచు
న్నారు తెలుంగుజోదు లదనన్ గదనంబున దూఁకి మూఁకలో
వీరవిహారము ల్సలిపి విశ్రుతకీర్తి గడింపకున్న నా
పేరును బెంపు సొంపు చెడఁ బెద్దలుఁబిన్నలుఁబ్రువ్వఁదిట్టరే. 15

మ. జనకుం డాహవభారము న్నిజభుజస్కంధంబునం దాల్చి తీ
అనికష్టంబులఁ జిక్కి స్రుక్కుతతి ధైర్యస్థైర్యవిభ్రాజియౌ.
తనయుం దెవ్వఁడు రాణివాసములఁ జెంతంబాసి వర్తించు నో
జననీ! వేగ ననుజ్ఞయిమ్ము సమరోత్సాహంబు తీంద్రించెదిన్. 16

క. ఆహవమున కిప్పుడ చని, దోహలమునఁ గసిమసంగి దుష్టవిరోధి
వ్యూహంబులఁ ద్రుంచెద నా, బాహాబలమెల్లఁ దేటపడుచందమునన్. 17

క. తెలుఁగుం దేశ చరిత్రకుఁ జెలువిచ్చి సువర్ణవర్ణచిత్రితములు నై
పలునాఁటివీరగాథలు, విలసిల్ల నొనర్తు నారవిసుధాకరమున్. 18

క. గత్యంతరంబు సెప్పకు, మత్యంతోత్సాహమలర నాజి "యశోవా
మృత్యుర్వా" యని దూఁకెద, నిత్యంబగు నసము దెసల నింపెదఁ దల్లీ! 19

చ. వెలమలు కమ్మవీరు లలవిప్రకుమారులు రెడ్డిజోదులుం
దెలఁగలు దేశదాస్యమును ద్రెంప విరోధిశిరోధిఖండనో
జ్జ్వలకరవాలహస్తులయి సంగరలక్ష్మి నలంకరింప నన్
నిలుపఁదలంచె దిందు జననీ! నిను నే మనువాఁడఁ జెప్పుమా. 20

గీ. స్వార్థనిరతుండు తుచ్ఛభోగాభిరతుఁడు, పాఱుఁబోతు దేశద్రోహి బైసిమాలి
మూలడాఁగిన డాఁగుఁగా కాలమునకు, దూఁక కెవఁ డుండు నిత్తతి వీఁకతోడ. 21

క. నీ వెఱుఁగని ధర్మంబులు, లేవైనను బుత్రమోహలీనాత్మకవై
యీవిధిఁ బల్కెదు, తమముం, బోవిడువం దగిన యదను పా మ్మిది తల్లీ! 22

గీ. పుత్రుఁడని మిత్రుఁడనియుఁ గళత్రమనియు, భర్తయని సోదరుండని బాంధవుఁడని
బాలుఁడని వృద్ధని తలంచువేళ గాదు, తల్లిరో! సాగుచుండె స్వాతంత్ర్యరణము. 23

క. కరికర్ణాంతవిలోలము, శరీరము తడిత్సమంబు సకలార్థంబున్
సరసీరుహదళగత శీ, కరములు భోగములు వీనఁ గాంక్షలు దగునే 24

క. కాయం బనపాయము గా, దోయమ్మరో! కీ ర్తిమాత్ర ముందును గవిరాడ్
గేయంబై యాచంద్ర, చ్ఛాయానాయకము దశదిశావ్యాప్తంబై. 25

గీ. వీట నున్నను గాటంపుఁగాట నున్న, మిత్తి నెదిరంప నెవనికి సత్తి గలదు
ఉప్పతిల్లుచుఁ జెల్లుచు నుండుఁగాని, యెల్లప్రొద్దులు నొక్కమే నెట్లు నిలుచు. 26

క. బ్రదికిన నాల్గుదినంబులు, నదిరా యని జగముమెచ్చునటు పౌరుషసం
పద పొంపిరివోవఁగ నుం, డఁదగు న్నరుఁ డంచు బుధు లన న్వినవొక్కో. 27

క. "ఆరయ వివృతస్వర్గ, ద్వారము రాజులకు నాహవం" బంచు మహో
దారుఁడు శాంతనవుఁడు తా, భారతసంగ్రామవేళ భాషింపఁడొకో. 28

ఉ. అమ్మరో! వీరసింహముల కాహవరంగ మొకండె వాసయో
గ్యమ్మగు కాననం బచటఁ గాయముఁ బాసినఁ బాయకున్న సౌ
ఖ్యమ్మున కించుకంతయును గల్గదు లో టటకేగలేనిద
ద్ధమ్మలు భుక్తిముక్తులకుఁ దప్పుదురం చనరొక్కొ పండితుల్! 29

క. తను వస్థిరంబు గావున, మనుజుం దనయంబు నప్రమత్తతతోడం
బొనరింపం దగు మృత్యువ, దనసదనావాసి వోలెఁ దనధర్మంబున్. 30

క. ఉత్తమమగునరజన్మం, బెత్తిన ఫల మేమి సుగతి కేగెదుమార్గం
బెత్తోయంబునఁ గానక, మత్తిల్లి చరించునతఁడు మాతరొ చెపుమా! 31

సీ. మాతృదేశం బన్యమనుజేశ్వరునిచేతఁ, జిక్కి స్వాతంత్ర్యంబు దక్కి తనదు
జాతీయతను బాసి చేతోగతంబైన, తలఁపు వెలువరింపఁ దగినహక్కు
నెడసి లోలోపలనే క్రుళ్లి కుములుచు, నీచదాస్యమున మునింగి పిఱికి
తనము వరించి నితాంతకష్టపరంప, రల నీఁగి దారిద్ర్య మలమ దిక్కు
గీ. లేక శోకించువేళఁ దల్లిమొఱ నాల, కించి మై పులకింపఁ జలించి కొంచె
మేని నామెకుఁ దోడ్పడలేనిబిడ్డ, బ్రతు కదేటికి ధాత్రికి బరువుచేటు. 32

1-10-30

(ఉప్పుసత్యాగ్రహ సమయము)



# తెల్గుకాంత

సీ. నేలనాల్గుచెఱంగు లేలె మార్తురగుండె, గాలమై యొక తెల్గుకలువకంటి
సకలతంత్రావాపచాతుర్యరాశియై, రాణించె నొక తెల్గురాచవెలఁది
శీలసంపదచెక్కు చెదరకుండుటకునై, బలిపోయె నొక తెల్గుపద్మవదన
కవ్వించురిపులధాకకు జంకుమగనికై, పసపిచ్చె నొక తెల్గుపసిఁడిగుమ్మ
గీ. కాసె బిగియించి రెండవకాళివోలె, సంగరము సల్పె నొక్క తెలుంగు లేమ
తెలియవలెఁగాని తెల్గుకాంతల చరిత్ర, కోహినూర్లకు నూర్ల కేకొదువలేదు. 1

సీ. ఒకచాన వాసంతమకరందవాహినుల్, పరువు లెత్తించెఁ గబ్బంబునందు
ఒకచాన సర్వశాస్త్రకళాపయోనిధుల్, కదచె నానాతర్క గతులతోడ
ఒకచాన నందగోపకతపమ్ములపంట, నింటిబంటువిధాన నేలుకొనియె
ఒకచాన రాజశ క్తికిఁ దారకాణమై, నిజభూపవంశంబు నిలువఁబెట్టె
గీ. చాన యొక్కర్తు విసరిన శాపవాక్కు, బీరముంజూపెఁ జిచ్చుఱపిడుగువోలె
తెలియవలెఁగాని తెల్గుకాంతలచరిత్ర, కోహినూర్లకు నూర్ల కే కొదువలేదు. 2

15-12-38

1) రుద్రమదేవి, 2) నాగమ్మ, 3) మల్లమ్మ, 4) రణతిక్కన భార్య చానమ్మ, 5) పెమ్మసాని తిమ్మానాయని చెల్లెలు గోవిందమ్మ, 6) మొల్ల, 7) నాచి, 8) వెంకమాంబ 9) కొంపెల్లమహాలక్ష్మమ్మ, 10) రాయజగపతి భార్య సీతమ్మ.

# హంపీక్షేత్రము

సీ. ఇచ్చోటనే పూసి రెలజవ్వనులు తెల్గు, వెలఁదుకల్ మగలకు వీరగంధ
మిచ్చోటనే త్రోసి రిద్ధశౌర్యులు తెల్గు, లరిసేనఁ గన్నెకయ్యంబునందె
ఇచ్చోటనే మోసి రెల్లదిక్కులరాజు, లంధ్రసమ్రాట్టు ముత్యాలగొడుగు
ఇచ్చోటనే వ్రాసి రెలనాఁగమోవితోఁ, దులవచ్చుకబ్బముల్ తెలుఁగుకవులు
గీ. ఇచటనే కోసి రమరతాప్రచురశిల్ప, చతురు లాంధ్రులు కీర్తిసస్యములపంట
నేఁటి కిటు దుర్గమారణ్యవాటి యగుచు, రూపుసెడిపోయెఁ గాని హంపీపురంబు. 1

శా. కర్ణాటక్షితిపాలవందిత జయాఖండప్రథాకల్పిత
స్వర్ణస్నానము నంది తద్రసికరాజశ్రేష్ఠు నిచ్చోటనే
వర్ణించెన్ గవిరాజు ధూర్జటిశిరోవాటీనటత్ స్వర్ణదీ
తూర్ణాంభః పరిభావి భవ్యకవితా దుర్వారధారోద్ధతిన్. 2

5-7-40

# పలునాఁడు

సీ. నాగార్జునాచార్యనవ్యతేజశ్ఛటల్, చిందు ద్రొక్కిన దివ్యచిత్రశాల
వీరవైష్ణవమతావిష్టులై తెన్గులు, తిరుమణి తీర్చిదిద్దిన పొలంబు
వెలనాఁటిబోటితో వియ్యంబులు బిగించి, కేరింతలాడిన వీరభూమి
చంద్రభాగాసరిజ్జలశీకరంబులఁ, జెమ్మగిల్లిన జగాచేవనేల
గీ. ప్రకృతిసౌందర్యలక్ష్మికిఁ బట్టుఁగొమ్మ, చిన్ని నా తెల్గుతల్లికి జీవగఱ్ఱ
పోటుమానుసులం గన్న పోతుగడ్డ, నాదు పలునాఁడు మేలిగొనాల గూఁడు. 1

సీ. శ్రీనాథ కవిరాజ వాణీ విపంచికా, స్రుత సుధాధార లెచ్చోట నొలికె
మధురాపురీబుధప్రథఁ దూల్చు సోమన్న*, సాహితీసుమము లెచ్చటను వలచె
సోమరసంబులోఁ జొనిపి పింగళి మంత్రి, సుకవితారసము నెచ్చోటఁబంచె
కాకుసూర్యప్పన్న గంటంపు గజ్జియల్ గదుసుపోకదల నెక్కడను మొరసె
గీ. తెలుఁగుబిడ్డల చిఱువేఁడి •పలుకు నెత్రు, టేర్లు తుకతుక నుడికి పొంగెత్తి పొరల
వీరగీతంబు లెచ్చోట వీనుమిగిలె, నదియె పలునాఁడు దీనికున్నదియె జోడు. 2

సీ. చండశాత్రవశిరఃఖండకాండమ్ముల, బాలచంద్రుం డెందు బంతులాడె
గంటంబు నెఱవాలుఁగరవాలు చేఁ బూని, రెడ్డినాగమ్మ యేగడ్డ మెఱసె
హంవీరసింహంబు లయ్యారె! యని మెచ్చ, ననపోతు రుధిర మే యవనిఁ గార్చె
శూరనారీపరిస్తూయమానచరిత్ర, మాంచాలయెచ్చోట మగనిఁ దెలిపె
గీ. నటదుమానాథ మస్తకతట విరాజ, దభ్రగంగా ప్రవాహంబునట్లు తెలుఁగు
దొరల కీరుతు లేనేలఁ ద్రుళ్ళిపడియె, నదియె పలునాఁడు చూడరావయ్య! తోడు. 3

10-3-34



# మాయూరు

సీ. ప్రచలితస్వాతంత్ర్యరణవీర కాహళీ, రుతిరా ణ్ముహుర్ముహు ర్ముఖరితంబు
జాతీయవిద్యాప్రచారసంతర్పిత, బ్రాహ్మీచిరంతన భర్మపీఠి
సాబర్మతీయోగిసమ్రాణ్మహాశీః ప, రంపరాదానపాత్రప్రవృత్తి
సేవాతపఃక్రియాజీవాతుమండలీ, విశ్రుత వినయాశ్రమాశ్రయంబు
గీ. మధురతరశీల సంవర్ధమాన తరుణ, వృద్ధనారీనరచ్ఛటావేష్టితంబు
మఱపునకురాదు "కావూరు" మామకీన, గాఢతరపుణ్యారుక్సూచి కాణయాచి

20-5-47

* ఇతఁ డప్పకవి తాతకుఁ దాత • పలుకు - చిక్కన

# విద్యార్థి

శా. ఆద్యాఖండయశోధనం బెడసి దాస్యస్ఫూర్తిఁ జింతాభరా
పాద్యంబై భరతోర్వి నేఁడు విలపింపన్‌సాగెఁ దద్రోదన
ప్రోద్యద్ధ్వానము వీనులం జొరదొ? యేబుద్ధుల్ నినుంజుట్టెనో
విద్యార్థీ! నినుఁ గన్నతల్లి మొఱ నీవే యిట్లుపేక్షింతువా 1

సీ. చెలఁగిమార్తురఁ జించి చెండాడివైచిన, యభిమన్యుఁ దేతల్లియంక మెక్కె
చిచ్చఱపిడుగు పుంజీభూతశౌర్యంబు, బాలుఁ దేయమజోలపాట మెచ్చె
నెఱజోదు పగఱగుండెలలోని గాలమై, మనినశివాజి యేజననిఁ గొల్చె
జగదేకవీరప్రశస్తతేజోరాశి, జవహరుఁ దేమాతచన్ను గుడిచె
గీ. నమ్మహాసాధ్వి సకలలోకైకజనని, భారతాంబకుఁ బండినపంట వీవు
అన్నలకు మచ్చుఁ దేఁబోకు మెన్నఁడేని, నుతగుణాధార! వీరభారతకుమార!! 2

చ. నవయుగమేగుదెంచెఁ బరిణామము సెందె జగంబు నూతన
చ్ఛవులు నటించుచున్నవి దిశాగణమందు స్వతంత్రతావధూ
నవనవదివ్యయౌవన మనంతముఖంబుల నిండి భారతీ
యువజనచిత్తవిత్తముల నూఁపుచుఁజూపుచునుండెఁ దళ్కులన్. 3

ఉ. లెమ్మిఁక మీనమేషముల లెక్కలు మానుము భావదాస్యబం
ధమ్మును ద్రెంపివేయుము వితండవివాదము లుజ్జగింపు ద
ద్ధమ్మల భేదవాదసముదాయముతోడఁ బనేమి నీకు నీ
యమ్మఋణమ్ముఁ దీర్చి చరితార్థత నందుము మిత్రసత్తమా! 4

చ. అమరులు గుంపుగూడి విజయోస్తని నందనచందనస్ఫుర
త్సుమసముదాయముం గురియఁజొచ్చిరి నీపయి; దిక్తటంబులం
దుములములై ధ్వనించె జయదుందుభిఘోషలు; మంచిలగ్నమీ
సమయము; లెమ్ములెమ్ము పటుసాహసదోహల దుర్భరార్భటిన్. 5

ఉ. లోకు లిసీ యనన్ జగతిలోఁ గలకాలమునూఁగులాడుచున్
గాకముకైవడిం బ్రతుకుకంటె బుధుల్‌తలలూఁప గంటయేఁ
గోకిలమై వెలుంగు టది కూడదొ విజ్ఞుఁడు కీర్తి కాయముం
గైకొన రక్తమాంసమయకాయము హేయము నీసడింపఁడో. 6

11-2-31



# పాద ధూళి

గీతమాలిక :

అది దురాశాపిశాచీ సమర్చన ప్ర, భూత సవన బృహద్భాను హేతి వదన
హుతదయాధర్ములకు, నరాకృతి నివిష్ట, దుష్ట రక్షస్సులకు, జగద్ధూమకేతు
వులకుఁ గేతువులకు వణిక్కులకు నిలయ, మది నిరంకుశక్షామ దురంత దుర్భ
రాగ్రహావేశ వికటాట్టహాస జవన, గమనవిన్యాసముల కసంఖ్యాత సాధు
మానవీ మానవచ్ఛటా ప్రాణమాన, రాశి బలివోయినట్టి నిర్భాగ్యదేశ -
మది మహాభూతవేతాళమదవతీ ప, రంపరా రూక్షఖడ్గనిర్యత్ ప్రభా స
ముజ్జ్వలద్దంష్ట్రయై మృత్యు వుగ్రదీర్ఘ, జిహ్వాలార్చుచు వాహ్యాళి చేసినట్టి
రంగ - మది మదిఁ గరఁగించు వంగభూమి 1

* * * * *

సత్యకంకటధరుఁ డహింసాకృపాణి, శాంతిరణవీరమండలీ చక్రవర్తి
మోహనుఁడు విశ్వకల్యాణమూలమూర్తి, జాలికి న్నెలవైన యీ నేలఁ జూడఁ
గదలె భగవానుఁ డార్త రక్షాతపస్వి 2

* * * * *

గుండెలో నగ్నిగోళముల్ మండి ప్రేల, నూర్పులో మూఁడులోకమ్ము లూఁగియాఁడ
జూపులో నెయ్యతియ్యాల సోన లురలఁ, బలుకులో నవజీవసంపదలు పండఁ
బల్లియలు పట్టణంబు లా ప్రభువుచూచె 3

* * * * *

పౌరు లేతన్మహోజాత పారవశ్య, మగ్నులైయున్నవేళ డింభకుఁ డొకండు
పరుగుమైవచ్చి తత్సభా ప్రాంగణమ్ము, దాసి జర్జరితమ్ము కూర్పాసమూడ్చి
మూటకట్టఁదొడంగె నచ్చోటి దుమ్ము 4

* * * * *

ఏమిరా వెఱ్ఱి పాపఁడా యీ ప్రజా స, ముద్ర మిటు పొంగి మిన్నులు ముట్టుచుండ
దృష్టి సారింపవైతి వాదిశకు నీవు, సాగి దర్శింప వాకర్మయోగిచంద్రు
నేల మడిచెద వీపాంసుజాల మిచట 5

* * * * *

అయ్యగారూ నమోవాక మమ్మహాత్ముఁ, గంటి నేనఃపిశాచికం గదలుమంటి
హరిజనత్రాత నా స్వామి యడుగుసోఁకి, పరమ పావిత్ర్య లక్ష్మీవిభాసియైన
యీ రజోరాశి జననికై యెత్తుచుంటి 6

* * * * *

అమ్మ! నన్నీ సదస్సున కనుచవేళ, దివ్యపూరుష చరణ బాంధవ్యమంది
పతితపావనపాద సంపర్కమంది, సుకృత సురభిళమైన పాంసువునుదెచ్చి
దుఃఖనిస్తారకంబైన ధూళి దెచ్చి, యస్మదీయము పరితాప మార్పుమనియె 7

* * * * *

ము న్నొకమహాత్ము నదుగుదుమ్మునకు నోఁచి, కఠినశిల పూవుఁబోఁడియై కదలెనంట
ఘోర జానుషబంధముల్ కోసెనంట, బాబయా! యిమ్మహాత్ముని పదమునంటు,
దుమ్ముచే గెంటలేమె మాదుర్విపత్తి 8

* * * * *

దీనబాంధవురూపమ్ము దెల్పుమంచు, వేషభాషావిశిష్టతల్ వినుపుమంచుఁ
జేష్టితమ్ములు వర్ణించి చెప్పుమంచుఁ, దల్లి ననుఁ బంప జన్మసార్థక్యమొదవె
సాక్షిగావచ్చెఁ గనుము బాష్పస్రవంతి 9

* * * * *

నా సవిత్రి నా సోదరి నగ్నలగుచు, గుడిసెనున్నారు జేనెఁడు గుడ్డలేక
కుములుచున్నారు బ్రతుకు బ్రేఁగునకునోడి, యదలుచున్నారు ప్రత్యక్షమైన వేల్పు
దెసకుఁ గనువిప్పలేని దుస్థితికి లోఁగి 10

* * * * *

జనకుఁడెందుండెనందువా జఠరకోశ, మెరియుచున్నది నీకు నుత్తరమొసంగ
నంబలియులేక రోగాల నద్దలేక, యాలుబిడ్డల కన్నీటి నార్పలేక
స్రుక్కి మము దిక్కులేని పక్షులను జేసి, యతఁడు దుర్భిక్షవహ్ని కాహుతిగమాతి
పోయె నసిపత్రశిక్షావిధేయ హేయ, విత్తదాసులకొక నవ్వు విసరి, కొసరి
పిలుచు నమరేంద్రు గద్దెపైఁ గొలువుదీర 11

* * * * *

పతియలై వ్రీలె నాగుండె బాలకా! త్వ, దీయ కథ లీదృశంబులా! దీనతా ని
మగ్నులకు మీకు, మిమువంటి మానవాళి, కిట్టి దుర్యోగ మిఁక లిప్తయేని నిల్వ
దిట్టి దుష్కాలమిఁక నెన్నఁడేని దాయ, దిది పరాధీనతాఫలం బిది నికృష్ట
దాస్యఫల మస్వతంత్రతా దారుణాంధ, తమసమును జీల్ప మాతృాణదమనజన్య
ధన్యతగడింప నేఁడు సోదర్యులెల్ల, నడుముగట్టిరి ప్రాణము ల్మడుపుగట్టి
రడఁచి రాత్మీయ కులమతాహంకరణము, విడిచి రీర్ష్యామషీజుష్ట వీక్షణమ్ము
నలఁది రుప్పొంగి వీరగంధావలేప, మగ్గలించి రహింసారణాంగణమున

నెత్తిరి త్రివర్ణశోభితామృతపతాక, నొత్తి రొక్కుమ్మడిగ దేవదత్త కుహర
మంతిపుర ముజ్జగించి శౌర్యాచ్ఛరేఖ, లింతు లెసరేఁగి వీరతాయెతులుగట్టి
కుసుమపూవన్నె వల్వము లుప్పరించి, మాతృసేవాపరాయణామ్లానదీక్ష
శిక్షితాత్మలు ధీరలక్ష్మీ సనాథ, లపరదుర్గలు రుద్రాంబలగుచు నగుచుఁ
గలని కహమహమికతోడఁ గదలివచ్చి, రెవ్వరీ యోద్ధృమండలి నెదిరినిల్చు
ప్రధిమ గల మగ, లెవ్వరీ తరుణభార, త స్రవంతి నిరాఘాట ధాటికోర్చు
దమ్ముగలబంటు లదిగో స్వతంత్రతార్క, మండలారుణరోచిస్సమాజ ముదయ
పర్వతప్రస్థభూమిఁ గ్రొం బసిడిజల్లు, చల్లుచున్ విజయోత్సవ సమయసిద్ధి
సూచియయ్యెఁ బ్రసన్నతల్ పూచి దెసల, వెల్లి వొడిచె హుటాహుటి నిల్లుసేరి
తల్లి కీమేలుపల్కి చూతప్రవాళ, తోరణము కట్టవోయి! మందారకుసుమ
హారమిది తాల్పవోయి! దీర్ఘాయురర్ఘ, భారములు మోయవోయి! నవ్య స్వతంత్ర
భారతము నేలవోయి బంగారుతండ్రి! 12

14-12-45



# స్వతంత్ర భారతము

మంజరీద్విపద ·

జయచంద్రుఁ డపగతక్షాత్రుఁ డానాఁడు, రగులుకొల్పిన చిచ్చురవ లేచి యేచి
యఖిలభారతభూమి నల్లార్చియార్చి, యిన్నాళ్ళకిన్నాళ్ళ కిట్టింకులింకె-
ఈ దవానలమార్ప నీదాస్యమడఁప, నెత్తురోడ్చిన శూరనివహమ్ముపేర
నురికంబమెక్కిన యోధులపేరఁ, బూనవోయీ! మల్లెపూలదోసిళ్లు
పాడవోయీ! వీరభక్తిగీతములు, - కులవర్గములు పెంచు క్రుళ్ళింతలేని
మతపిశాచంబుల మనుగడలేని, ధనవద్దరిద్రభేదచ్ఛాయలేని
పరులకూటికి మూఁగు బదనికల్ లేని, విద్యావిహీను లేవీధిలో లేని
జీవత్సమాజంబు సృష్టిగావించి, తమ్ముఁడా! నీ తేరు తరలింపవోయి!
మనప్రాక్తన మహస్సు మరలింపవోయి!

14-12-45



## దొరతనము

సీ. తొలుసంజఁ బుట్టినాజ్ఞలకు బైసి దొఱంగి, మలుసంజ నపరకర్మంబు సలిపి
కులపాశములఁ దగుల్కొని శుంఠలను బిల్చి, యుత్తాలపదవిఁ గూర్చుండఁ బనిచి
లంచాలగడ్డి కాసించి లోకులఁ గ్రుమ్ము, నధికారిపశువుల కచ్చుపోసి
చీకటిబేరముల్ సృష్టించి పేద నె, త్తురు పీల్చురక్కసి నురక విడిచి
గీ. పరువు దక్కించుకొన్నట్టి దొరతనంబు, లేదు భువనత్రయమ్ములో లేదు లేదు
చెప్పనేటికి విద్యావిశిష్టుఁ డైన, మంత్రిముంగడ ధర్మమర్మంబు లెత్తి.

20-5-47



## నేతాజీ

ముత్యాలసరాలు :

ఇదె మహోదయవేళ యయ్యెను, వదలుమీ యజ్ఞాతవాసము
కదనకేళీ రుద్రమూర్తీ!, కదలిరావోయీ! 1

బ్రతుకు బరువై క్రుంగిపోయిన, గతులు కఱవై దెసలుసూచిన
వెతలమున్గిన తల్లి కొఱకై, విక్రమించితివా! 2

మహిషరక్షో రుధిరమేదో మగ్నకాళీ మాతృరూపము
దహరసీమ ఘటించి ఖడ్గము, దాల్చి నడిచితివా. 3

జిత్తులన్నిట నందెవైచిన, చేతులే నీయెత్తులోఁ బడి
చిత్తుచిత్తై తెల్లవోయిరి, చిన్నవోయిరిగా. 4

బానిసమ్మునఁ గ్రుళ్లి కుమిలిన, బ్రదుకుకంటెను జావు మేలని
షానవాజ్ ఢిల్లాను సేగాల్, సేన గూర్చితివా. 5

పొగల పెల్లున సెగల పెంపున, యుగ యుగమ్ములు పెరిఁగి పేరిన
పగలు మానిపి హిందు ముస్లిం, బాట దిద్దితివా. 6

విశ్వభారత వీరకోటికి, శాశ్వతప్రేమమ్ము గూరిచి
యాశ్వికధ్వజినీ పరంపర, కాజ్ఞ లిచ్చితివా. 7

రక్తతిలకము దిద్ది భారత, రమణి పౌరుషలక్ష్మియై మన
ముక్తికై నీ కన్నుసన్నల, మోహరించెనఁటే. 8

కంటగించిన పోటరులు నీ, కంటి యెఱ్ఱన కాంగఁజాలక
మంటిబొఱ్ఱెలలోన నక్కల, మాడ్కిఁ దూఱిరఁటే. 9

ప్రాంతగాథల నిద్రవోయిన, భారతీయుల సమరచండిమ
లోఁతు లోఁతులు చూపి జగముల, లోభపెట్టితివా. 10

ఎదురుదొరతన మేర్పరించితి, వెదిరిగుండియ గాలమైతివి
కదరుజెండా యెత్తి యిన్ఖాల్, కదన మూఁపితివా! 11

చాలుఁ జాలు మహాప్రభూ! మన, సాహసం బొకసారి చాటితి
హేలగా నిఁక సైతు బన్నము, లెన్ని పైకొనినన్. 12

కట్టుబట్టల నిల్లు వెడలిన, వట్టిమానిసి వీవు రాజ్యము
లెట్లు గెల్చితి, విన్ని మాయల, నెపుడు నేర్చితివో. 13

వెక్కిరించిన రథికమండలి, బిక్కమొగమై డిల్లపోవఁగ
నెక్కితివిరా సర్వమానవ, హృదయ పీఠములన్. 14

జాతి యొకటే లక్ష్యమొకటే, నేతఁ యొకఁడే దేశమున కని
నీతి నేరిపి మాకు నాశా, జ్యోతి వైతివిరా. 15

తారకంబై మమ్ము లేపెను, తావకము జైహింద నాదము
ఘోరవిక్రమ మూని ఢిల్లీ, కోటగెల్తు మిఁకన్. 16

వీరతాయెతు గట్టినారము, వీరపాణము చేసినారము
లేరు లేరిఁక నడ్డుకోఁగల, వారు మాకెచటన్. 17

భవ్యభారత మధురమూర్తీ, దివ్యభారత సవ్యసాచీ
నవ్యభారత చక్రవర్తీ, నతులు నీ కివిగో. 18

ఆసమై గంగా జలమ్ములు, మోసి తెచ్చిరి, దేశభక్తులు
దాసెరా, యభిషేక లగ్నము, దాఁగవల దింకన్. 19

సాగిరమ్ముస్వతంత్ర హిందూ, సైన్య చక్రక్రమణ నేతా
ఏగుదెంచిరి కమ్మహారతు, లెత్తఁగా మహిళల్. 20

కోసి తెచ్చిన పూలగుత్తులు, గ్రుచ్చి దండలు కట్టినారము
బోసు వీరా! పూజలందుము పురుష సూక్తమునన్. 21

పంటమొగ మైనట్టిపొలములు, కొంటె గాలికి దెబ్బ తినెనని
యొంటిపాటున వెచ్చనూర్చుచు, నుంటివా తండ్రీ! 22

మేటి మగఁటిమి చూపుటొకటే, మెచ్చుకోఁ దగినట్టి పనిరా
ఓటు గెల్పులు సాజముల్గద, పోటు మానిసికిన్. 23

పండినది నీకీర్తి మురువై, పాలసంద్రము మీఁది నురువై
నిండినదిరా విశ్వజగతీ, ఖండ ఖండములన్. 24

16-10-46



## నవభారతి

గీ. కదచిపోయిన వెన్నోయుగాదు లొక్క, రీతిగా - వానికేమిలే - జాతికెల్ల
నభినవానంద పారవశ్యమ్ము నిడుచుఁ, బండినయుగాది యిది తపఃఫలము మీది. 1

మ. ఒకయేఁడో పదియేఁడులో యిరువదేండ్లో నీచదాస్యంబు త
ల్లికి వేయేండ్లుగ వచ్చి యిప్పటికి వ్రీలెన్ దూలె సర్వంబు జో
హుకుముల్ సెప్పుచు స్రగ్గిమ్రగ్గిచెడు దుర్యోగంబులెల్లన్ వికా
వికలై చన్నవి నవ్యభారతశకావిర్భూతియై నేఁటికిన్. 2

సీ. తన బోసినవ్వుముత్యాలపంటలు ప్రజా, హృదయదారిద్ర్యంబు కదలఁద్రోయ
తనచూపుజిగి రసాతలతమఃకూపస్థ, జంతుకోటికిఁ దెల్వి సంతరింప.
తనపల్కు లుపనిష త్సారనిష్యందులై, సమతామనోజ్ఞసస్యములు పెంప
తనబాటఁక్రేవ సత్యము నహింసయుఁ దరు, చ్ఛాయలై పాంథులశ్రమ మడంప
ఆ. తనపతాక పరమధర్మచక్రాంకిత, మై సమస్తజగతి కభయ మొసఁగ
తనదు బ్రదుకుబ్రదుకు జననిదాస్యవిముక్తి, కప్పగించుగాంధి కంజలింతు. 3

శా. తానై శాంతిరణంబునం గనిన స్వాతంత్ర్యంబు పూతంబు లో
కానీకమ్ముచరిత్రకే యొకవినూత్నాధ్యాయమున్ బెంచె స్వా
ర్థానన్ గ్రుళ్ళినమానవాళికి మిథోంతస్స్నేహదీక్షా రిర
క్షా నైర్మల్య మొసంగుచున్ వెలిఁగెఁ నాశాజ్యోతియై దిక్కులన్ 4

క. ఎక్కడికక్కద ముక్కలు, ముక్కలుగాఁ దెగినదేశములు జాతులు నై
స్రుక్కినజగంబు నీఋషి, ఋక్కులుగా కేవి యుద్ధరింపఁగ నేర్చున్. 5

సీ. చెదరిపోలేదు దేశికపాదముద్రలు, నౌకలీ శాంతియాత్రాకృతములు
ఇంకిపోలేదు నల్వంకసాగినస్వామి, రామనామ సుధాధునీమతల్లి
చెఱగిపోలేదు హస్తినరాజవీథిలోఁ, దండ్రి చిందిన బలిదానరుధిర
మాఱిపోలేదు యమీ రాజఘట్టాన, రేఁగిన ప్రభుచితార్చిశ్చయంబు
గీ. నిత్యనూతనచైతన్య సత్య మసృణ, మూర్తియై జగదంతరవర్తియైన
మనమహాత్మున కీ చైత్రమధురవేళఁ, జిత్తమిగురొత్త నివ్వాళి నెత్తవోయి! 6

సీ. మతమౌఢ్యజనిత రామ రహీమ భేదవా, దావేశనష్ట కష్టాత్ములార!
స్పృశ్య తాస్పృశ్యతా హేయచింతా కర్త, రీ ఛిన్నవిచ్ఛిన్నహృదయులార!
దారుణ దారిద్ర్యదహనత ప్త ప్రజా రక్త పానక్రియా ప్రవణులార!
చార్వాక పాషండ దుర్విమర్శనవిధా, లబ్ధావినీతి విషాబ్ధులార!
గీ. రండు రండోయి త్రిభువనారాధనీయ, బాపుజీ ప్రేమధర్మతత్త్వోపదేశ
జాహ్నవీస్నాతులై సాధుచరితులై త, రింపుఁ డీనూత్నవత్సరశ్రీముఖమున 7

ఉ. కత్తికిఁ గత్తి cజూపి రిపుకంఠవిలుంఠన మాచరించు దు
ర్వృత్తి నశించి శాత్రవుని యెత్తినకత్తికిఁ గంఠమిచ్చుచున్
దత్తరపాటులేక రిపుతన్ దెగటార్చుట వీరజాతి క
ర్తృత్తమధర్మమై నవయుగోదయమై జగముల్ సుఖించుతన్ 8

గీ. మ్రోదు మ్రోడును జివురించి మొగ్గతొడుగఁ, గవిపికమ్ములరవళి నల్గడఁ జెలంగ
నవ్యభారత సింహాసనస్థుఁడైన, వాని కగు స్వస్తి నవశరద్వల్లభునకు 9

16-3-50

(ఆలిండియా రేడియో - విజయవాడవారి సౌజన్యముతో)



## కాంగ్రెసు

సీ. తరతరాలతమస్సు తరలించి మరలించి, యేశ క్తి మనయింటి కిచ్చె వెలుఁగు
కులమతాది కఠోరకుడ్యముల్ పడఁగొట్టి, యేతల్లి సౌహృద్యమిడియె మనకు
జగదజేయము నహింసామహాస్త్రముఁ జూపి, యేదేవి మనచేవ నిగురుకొల్పె
విశ్వప్రజారాజ్యవీథిలో మనజాతి, కేరాణి వేయించె హేమపీఠి
గీ. కర్మచంద్రతనూభవాఖండసత్య, శౌచ రోచిస్సు లేసద స్సాఁచికొనియె
దాని కంజలిపట్టి సార్థకత నందు, మిండియన్ నేషనల్ కాంగ్రెసిది కుమార! 1

క. పదవులకేమి తెగంబడి, వదలకుమా తల్లికొల్పు వక్రమనీషన్
పదిమంది నీదుసేవకు, ముదమందిననాఁడు పట్టములె నిన్ వలచున్. 2

క. కదనం బొనర్చురాహుతు, పదపద మని యాజ్ఞలిచ్చు పదవాల్ కంటెన్
గొదవవదునొక్కొ మఱి నా, మది యెపుడున్ బంటు దెసకె మన్నన చూపున్. 3

31-5-51



## కర్షకుఁడు

సీ. మండునెండలలోన మలమల మాడి దు, ర్భరశీతబాధఁ గొంకరలు వోయి
వానలో వఱదలో నాని జీవము లాఁపి, కఱకుముండులలోనఁ గాళ్ళుమోపి
తేళ్లపాములలోన దెసమాలి తిరుగాడి, మోవఁజాలని వ్రేగు మోసి దస్సి
ఒడలెఱుంగని నిద్ర యొకనాఁ డెఱుంగక, కుక్షినిండని పేదకూడు కుడిచి
గీ. ఆఱుఁగాలంబు గండంబు లన్నిగడచి, సేద్య మొనరించి తుదకుఁ దా సేకరించు
పంట సకలంబు నరికి నప్పన మొనర్చి, కంటనీర్వెట్టె నక్కటా! కాఁపుబిడ్డ 1

సీ. కూలిపోయిన కొంపకుదుటఁ బెట్టఁగ లేక, యుస్సురు మనుచుండె నొక్క కాఁపు
ఎలనాఁగ కూఁతు పెండిలి సేయలేక శీ, ర్షము వంచుకొనియెఁ గర్షకుఁ డొకండు
పసిబిడ్డకై బుడ్డిపాలు తే లేక చీ, కాకులోఁబడె నొక్క కమ్మతీఁడు
కొడుకుఁగుఱ్ఱను మంచిబడికిఁ బంపఁగ లేక, గోళ్లు గిల్లెడి నొక్క గొప్పరైతు
గీ. హెచ్చు కట్నాలు వైద్యుల కీయ లేక, చిక్కి సగమయ్యె నొండొక్క సేద్యఁగాడు
పరువుబరువున బ్రదికిన పంటదొరకుఁ, గటకటా! నేఁటి కెట్టి యిక్కట్లు వచ్చె. 2

సీ. మీసరంబునఁ గోరమీసాలు వడివేసి, భూపతుల్ నెఱజంకెచూపుఁ జూడ
కలికి బంగారు మేడల రాణివాసంబు, లెండకన్నెఱుఁగకయే సుఖింప,
దొరలేని గరువంబు తొలఁకాడ నుద్యోగు, లుఱ్ఱూత లూఁగుచు విఱ్ఱవీఁగ
కోట్లుకోట్లుగడించి కోశంబులకు నించి బేహారి తనబొజ్జపెంచి కులుక
గీ. అన్నమో రామచంద్రా! యటంచు నేడ్చు, కటికిబీదలు దోసెఁడు గంజి ద్రావ
నీవకద కారణం బహో! నీకు నెట్టి, కట్టుకడగండ్లు వచ్చెరా! కాఁపుబిడ్డ! 3

సీ. బిందెలతోడఁ బాల్పిండెదు గాని నీ, కంచంబులోనికి గంజినీళ్ళె
కొండంత నునుప్రత్తి పండింతుగాని నీ, కాయంబు మూయంగఁ గప్పదంబె
పలుపుట్లవడ్ల గాదెల నింతుగాని నీ, క్షుద్బాధ నడఁగింపఁ జొన్నజావె
కమ్మనిశాకముల్ కాయింతుగాని నీ, కూరకై కటికిసంబారుపొడుమె

గీ. ఏమని వచింతు నీ బాము లెల్లఁ దడవి, కడుపుచుమ్మలువాఱు నీకథలు విన్న
నిన్ను మఱచిరె దొరలయో! నేఁటి కెట్టి, చెట్ట నిను ముట్టడించెరా! సేద్యగాఁడ! 4

సీ. పెద్దవడ్డీలొడ్డి పీల్చె నీ రక్తంబు, చట్టుఱాగుండియ సాహుకారు
బన్నం బెతింగి నీపంట నల్పక్రయం, బిచ్చి బండ్లకు నెత్తె బచ్చు కటిక
లంచంబు నాసించి కించిత్తు నీతిలే, కధికారి నీ కూటి కడ్డు దగిలె
దారుణం బగుపన్ను దయమాలి విధియించి, కటకటా! నృపతి నీకడుపు మాడ్చె
గీ. ఇన్నిరీతుల నీసొమ్ము తిన్న వారె, చూచుచున్నారు నిను గడ్డిపోఁచవోలె
లేదొకో ధర్మ మూర్విపై లేశమేని, సారగుణరత్నహార! కర్షకకుమార! 5

సీ. సుక్షేత్రములు దయాశూన్యులై పీడించు, ఋణదాతలకు సమర్పింప వలసె
ఇల్లాలిమెడలోని నల్లపూసయు వెచ్చ, పెట్టి పన్నులపొట్టఁ బెట్టవలసె
దినవెచ్చమునకునై తెచ్చు బాకీలకై, కొంప తాకట్టులో దింపవలసె
కడుపుకక్కుఱితికై గతిలేక పశుకోటి, నెల్ల మెల్లన విక్రయింపవలసె
గీ. ధరలు పడిపోయె సేద్యంబు తక్కువాయె, శిస్తు మెండాయె నింకేమి సేయుదోయి!
నిర్జనారణ్య మే నీకు నెలవఁటోయి!, కర్షకా! యిది యేనాఁటి కర్మమోయి! 6

సీ. సంఘశక్తి నెఱింగి జనపదంబుల నెల్ల, రైతుకూటంబు లేర్పఱుపవయ్య
నీ గౌరవము నెంచి నీ చేవఁ బాటించి, తలయెత్తి దీనతన్ దలఁగవయ్య
వెఱపు దవ్వుగ జోపి దొరలపజ్జకుఁ జేరి, నీగోడు నెల్ల విన్పింప వయ్య
నీ మేలు గోరి నీ నేత లిచ్చు దురాయి(ఆజ్ఞ), పూదండవలెఁ దలం బూనవయ్య
గీ. సాటిదేశాల కాఁపులజాడ లరసి, నేఁడు నీకర్జ మేదియో చూడవయ్య
ఉమ్మలిక లెల్లకాలంబు నుండఁ బోవు, చింతపడకయ్య "భారతక్షేత్రజీవి" 7

26-3-34



## క్షేత్రజీవి

సీ. అమ్మతల్లులవంటియావు లింటింటిలోఁ, గదుపులై యమృతంబు పిదుకఁ జేసి
కందబింకము సూపి కొండ లైనను మోసి, కలుము లందిచ్చు గిత్తలను బెంచి
పనిముద్దు గాని సంపద ముద్దుగా దన్న, జీవసూత్రము శిరసావహించి
గొడగరి వడ్రంగి గోసంగి కనుదోయి, దైన్యరేఖలకు దౌదవ్వానర్చి
గీ. కదురు గలచోటు కవ్వంబు కదలుచోటు, కఱవులకు ధూమకేతువుగా నెఱింగి
త్యాగమున కాశ్రయము కర్మయోగి వగుచుఁ, గీర్తి గనవయ్య భారతక్షేత్రజీవి! 1

సీ. పరధర్మముల మెచ్చి పరువులెత్తెద వేల, కోటివిద్యలు కొండ్రసాటి యగునె
పట్టణంబులఁ జూచి లొట్టవైచెద వేల, తల్లికౌఁగిలి గదా పల్లెయూరు
కొంప నిల్వునఁగూల్చు కోర్టులంపట యేల, విద్యతీర్పరి లేఁదె పెద్దకాఁపు
బక్కరైతును ద్రొక్కిపట్టఁజూచెద వేల, మేలోర్వ కెవ్వాఁడు కోలుకొనియె
గీ. కలవరించెద వేల శుల్కంబుకొఱకు, విషకణం బది నీదు జీవితపుసుధకు
సదలిపోయిన శీలంబు సంతరించి, కీర్తి గనవయ్య భారతక్షేత్రజీవి! 2

13-3-40



# శివ కర్షకుఁడు

సీ. చదలేటి నీటిసంపద రిత్తవోనీక, సిగముడి నానకట్టగ నమర్చి
యల జాహ్నవీముఖ్యములు చిన్నపెదకాల్వ, లఖిలభారతభూమి నల్లుకొల్పి
ముక్కారుపంటల ముద్దుటెక్కెంబనఁ, గేల ముమ్మొనల ములోల్కల నూఁది
మెదముమ్వపాటలో నొడలఁ బుల్కలు రేఁగి, బసవన్న నసివాఱుపనికిఁ బనిచి
గీ. యిల్లు వెండియు బంగారు విల్లుగాఁగఁ, బండి కైవ్రాలినజగమ్ము పంటపొలము
కావలికి ఘోరసర్పకంకణము గట్టి, శివుని మాపెద్దకాఁపు నర్చింప రండు.

13-3-40



# పాలేరు

సీ. అధికారి యెవఁడు నీ యస్థిదండములోని, పచ్చిమూలగ జుఱ్ఱు పాలసుండు
ధనవంతుఁ డెవఁడు నీదైన్యముద్రాజను, ర్మూలకారణమైన కాళరాత్రి
మత మన్న నేమి సోమరిమూఁకలకు నిన్ను, బలి యిచ్చునట్టి పాపగ్రహంబు
రాజన్న నెవఁడు నీరక్తమాంసములతోఁ దనువు పెంచెదు మహాదానవుండు
గీ. వేరి యెవ్వఁడు తడిగుడ్డ నూతి నీదు, కుత్తుకను గోయు వలకారి జిత్తులాఁడు
చూడు మొకసారి కర్షకా! చుట్ట మనఁగ, నెవ్వఁడున్నాఁడు నీకుఁ బాలేరు దక్క

13-3-40



# గోసేవ

ఆ. ఔపనిషదసూక్త లవి గవాకృతు, లావు, లమృతరాసు, లుత్తమాధ్వరంబు
ధేనుపూజనమ్ము., గాన వినీతిమై, మోఁకతింతు సురభిమూర్తియెదుట. 1

క. స్వస్తికి మున్ముందు గవీ, శస్త్రావిర్భూతి వలచుజాతిని సురభి
ప్రస్తుతి సకలాఘంబుల, కస్తంగతి యన్నజాతి నభినందింతున్. 2

క. ఏతపము లేవ్రతమ్ముల, హో! తీర్థము లెవ్వియెవ్వియును గోహత్యా
పాతకము నార్ప వని నా, జాతి గదా నిల్చి ధర్మసందేశమిడెన్. 3

ఉ. గోవులు లేనియిండ్లు పసికోడెల ముద్దుల చెంగనాలకున్
దావులు గానిబీళ్ళు మఱి తంద్రులవోలె సమస్తసంపదల్
ప్రోవులుసేయు నెడ్లసిరి పొంగని చావడు లెన్నియున్నఁ ద
జ్జీవనమీజగంబున రుచింపదు నింపదు తృప్తి నెన్నఁడున్. 4

ఆ. నిదురలేచి తేఱి యెదుటికొట్టమ్ములో, గంతువైచు పెయ్యఁ గౌఁగిలించి
ముద్దులాడి వదయుముదము నాసంతాప, రాశి నడఁచు కప్పురంపుహ్రదము 5

క. దధిమథనవేగ విచల, న్మధుకరవేణీ సువర్ణమణివలయోద్య
న్మృదునాదమ్ములు కమలా, పథమ్ము లెవ్వాఁడు మఱచుఁ బ్రాభాతికముల్. 6

ఆ. "పాఁడి గలదె" యన్నప్రశ్న మున్ముందుగాఁ, బుట్టుఁ జుట్ట మిల్లు మెట్టెనేని
పంట చదువు సంధ్య పాపలకల్మి యే, పాటిదేని పాఁడిసాటి గాదు. 7

క. సంపదలఁ బెంచుపశువుల, కింపవు నేగడ్డియైన; నిది యేమి సిరిన్
దంపెడినరులకు నింతయు, నింపవు పాకమ్ము లెన్ని యేర్చి యొసఁగినన్. 8

క. భోగము మరగిన మానవు, రోగమ్ము నడంప నెందఱోకల రెందున్
త్యాగము వలచినధేనువు, యోగమ్ముఁ దలంప నెంద ఱున్నారు మహిన్? 9

23-5-49



# చిన్నయసూరి

ఉ. అంకిలిలేని పాండితియు నన్యదురాసద శాబ్దికత్వపుం
బొంకము నీక దక్కినదిపొమ్ము! తెలుంగుల నెల్లకాలమున్
లెంకలఁ జేసికొంటివి బలే! కనుసన్నలఁ గోవిదాళిచే
సుంకము లందికొంటివి యశోనిధి వైతిగదయ్యచిన్నయా! 1

ఉ. గాసట బీసటల్ సదివి కర్జ మెఱుంగఁగలేక సంతతా
యాసమునందు సోదరుల నారసి వాఙ్మయవార్ధి శేముషీ
భాసురమంథదండమునఁ బట్టిమథించి సుధీజగత్తు సే
బాసన లక్షణామృతము పంచితి వంచితవైభవంబునన్. 2

సీ. పురుషార్థము తురీయము నెఱుంగఁ గోరుచో, నుపనిషద్రాజమై యొప్పుదాని
భాషాస్వరూపంబు పరికింపనెంచుచో, శబ్దలక్షణమై యెసంగుదాని
లోకజ్ఞతా విశేషాకృతుల్ సూచుచో, నీతి శాస్త్రంబయి నెగడుదాని
చేతోహర రసానుభూతి నర్థించుచో, నుత్తమకావ్యమై యుందుదాని
ఆ. సకలధర్మతత్త్వసారమై విశ్వజ, నీనమై వెలుంగు నీతిచంద్రి
కను రచించి తెల్గుజనయిత్రి కిచ్చు నీ, పుట్టు ధన్యమయ్యెఁబో! కవీంద్ర! 3

ఉ. వ్రాయఁగవచ్చుఁగబ్బములు వందలు వే లెటులో శ్రమించి దే
శీయులు వానిఁ గైకొని భజింపరయే నవియేల? భాస్కర
చ్ఛాయలు నీదుసత్కృతులు సంచరణం బొనరింపకున్న చో
టీ యఖిలాంధ్ర భూమిఁ గలదే! వలదే! యిటువంటి భాగ్యముల్. 4

శా. జాతిద్వేషపిశాచదాస్యమున కిచ్చ న్మెచ్చు దుశ్చిత్తులన్
నీతిత్యాగుల నిన్ సమస్తవిబుధానీకస్తుతున్ జేరు వి
ఖ్యాతిన్ దూల్పఁగడంగి దొంగ కృతులన్ గల్పించుదోషజ్ఞులన్
జేతోవీధిఁ దలంచువారలకు నిస్సీ! రోఁత వాటిల్లదే? 5

శా. ఏతద్దుర్మతు లెంతచేసినను నీ కేలోటు వాటిల్ల దీ
ర్ఘ్యాతీతుల్ సమబుద్ధు లుత్తములు సంఖ్యావన్మణుల్ సూనృత
ప్రీతుల్ పూతచరిత్రు లీజగతి లేరే? పల్వు రుత్సాహులై
చేతఃపూర్వకగౌరవం బొసఁగి నిన్ సేవించు తెల్గుంబ్రజల్ 6

క. *వేంకటరమణుఁడు సూనృత, కింకరుఁడై ధూర్త విబుధకృత్రిమసృష్టిన్
జంకక చాటఁడె విద్వద, లంకృతి కాతనికి మ్రొక్కులం బచరింతున్. 7

* దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారు.

సీ. ఎందాఁక గౌతమీ కృష్ణవేణీ తుంగ, భద్రా స్రవంతులు పరువులెత్తు
ఎందాఁక దెల్గుల కిలువేలుపై వేంక, టేశుండు లోకంబు నేలుచుండు
ఎందాఁక నమృతనిష్యంది కవిత్రయ, రచితకావ్యంబు భారతము వెలయు
ఎందాఁక నాంధ్రుఁడ నే నంచు భావించు, మానిసి జగతిపై మలయుచుండు
గీ. ప్రాక్పయోనిధివీచికాపాణిదత్త, మర్ఘ్యపాద్యాదిపూజనం బందికొనుచు
నీ తెలుఁగుతల్లి యెందాఁక నెసఁగుచుండు, నీకు దక్కినకీర్తి యందాఁక నిలుచు. 8

క. ఉన్నయ్యలలో దివికిం, జన్నయ్యలలో నెవండు సరి? తెల్గుపసల్
కన్నయ్యకుఁ బరవస్తువు, చిన్నయ్యకు నీకు నాంధ్రచింతామణికిన్. 9

16-2-35



## మొల్ల

ఉ. మల్లెలు పూచెఁబో! మలయమండల మారుతశాబకంబు ల
ల్లల్లన వీచెఁబో! చవుల కాశ్రయముల్ మకరందవాహినుల్
వెల్లువ లయ్యెఁబో! తెలుఁగులేమ కపూర్వయశం బొసంగుచున్
నెల్లురిమొల్ల రామధరణీపతిపుణ్యచరిత్ర పల్కినన్ 1

ఉ. కుమ్మరిపిల్లవంట పలుకుంజవరాలికి నీకు బాంధవం
బెమ్మెయి నబ్బె నీకుఁ జదు వెవ్వఁడు సెప్పె నుదారతానిధా
నమ్మగు నమ్మహాపురుషనామము సెప్పెదవేని హృద్యప
ద్యమ్ము లొసంగి వాని శతధా నుతిసల్పుదునమ్మ! సోదరీ! 2

చ. తెలుఁగుల నోముపంటయగు తిక్కనకావ్యము తాటియాకుపైఁ
దొలుత లిఖించుభాగ్యమును దోఁచిన వ్రాయసగానికోవలో
మొలచినమొక్కవా చరితమున్ వినిపింపుమ యట్లుగానిచోఁ
గలుగునె నీకు నింతనవకమ్మునఁ గబ్బముగూర్చు నేరుపుల్ 3

ఉ. చూచినయంతనే చదువఁజొచ్చినయంతనె యర్థభావముల్
పూచి ఫలించునేని యదెపో! సుకవిత్వపదంబు నందఁగా
నోఁచిన కైతయం చతిమనోహరఫక్కి వచించి నీప్రతి
జ్ఞాచరణంబు సార్థకమ యౌనటు సల్పితి వింతయొప్పునే! 4

6-4-38

# ఆస్థానకవి

ఉ. కింకవిరాజ మత్తగజ కేసరియై తెలుఁగుం గవిత్వపుం
బొంకములెల్లఁ జూపిరుచిపోయిన శారద సోయగంబులో
వంకలు దిద్ది సత్కవుల వందల వేల సృజించె నెవ్వఁ డా
వేంకటశాస్త్రి కంచిత కవిత్వ విధాతకుఁ గేలుమోడ్చెదన్. 1

ఉ. అంకిలి లేనిధాటిని సహస్రవధానము లాచరించి స
ర్వంకష నైపుణుల్ మెఱసి వారికి వీరికి నంధ్రసాహితీ
కింకరతానురక్తి నొలికించి రహించినవీరుఁ డెవ్వఁ డా
వేంకటశాస్త్రి కంచిత కవిత్వ విధాతకుఁ గేలుమోడ్చెదన్ 2

ఉ. జంకని శేముషీపటిమ సాయముగా ననిరుద్ధవృద్ధతా
పంకమునందుఁ జిక్కియు నభంగురశిల్పసమగ్ర నూతనా
లంకరణమ్ములన్ నుడివెలందికిఁ బందువుసేయు నెవ్వఁ డా
వేంకటశాస్త్రి కంచిత కవిత్వ విధాతకుఁ గేలుమోడ్చెదన్. 3

ఉ. లెంకలవోలె నెవ్వనిఁ జలింపనిభక్తి భజింతు రాంధ్రు ల
భ్రంకషకీర్తి పెంపున సుపర్వధునీవిహరన్మరాళికా
హంకృతిఁ దూల్చు నెవ్వఁడజరామరవాఙ్మయమూర్తియెవ్వఁ డా
వేంకటశాస్త్రి కంచిత కవిత్వ విధాతకుఁ గేలుమోడ్చెదన్. 4

ఉ. ఓకవిసార్వభౌమ! భవదుజ్జ్వలయోగ మపూర్వ మెన్నఁడున్
నీకడ రామశబ్దమును నేర్చు టెఱుంగనివార లెందఱో
మాకును జెళ్ళపిళ్ళకవి మందనుఁడే గురుఁడం చహో నమో
వాకము లిచ్చి నిన్నుఁ గొలువన్ బులియున్ గనువారి దంతముల్. 5

క. మాటలు పె క్కేలా తొలి, నాఁటికవిబ్రహ్మ తిక్కనప్రభుఁ డీవో
నేఁటికవిబ్రహ్మవు నీ, నాటినమల్లియలు తెల్గునాఁటికవీంద్రుల్. 6

క. తోఁటఱవజాతి నీయది, యాటన్ దోహదము కరతలామలకంబై
వాటిల్లె నందనవనీ, వాటీసౌరభము నీదువనవీథికలన్. 7

శా. చెన్నక్ష్మాపరిపాలకుల్ శతముఖశ్రీమత్కళాసాగరున్
నిన్నాస్థానకవీంద్రుఁ జేసిరటె యాంధ్రీకీర్తి చిహ్నంబుగన్
నన్నూతేఁడులనాఁటివైభవము కన్నా రిచ్చుటన్ దెల్గువా
రన్నా! పున్నెములెల్లఁ జేరినవి సహ్యాగ్రావజాతీరమున్. 8

ఉ. కంటిమె యిట్టివింత సరకారు కదుంగడు గాసి కోర్చి నీ
యింటికె వచ్చి నీకు బిరుదిచ్చిరి మెచ్చిరి కాన్కపెట్టి; నీ
వంటికవీంద్రుఁ డిట్టివిభవమ్మున కర్హుఁడ కాని దీనిఁ గ
న్గొంట ప్రజాప్రభుత్వమునకున్ సరిక్రొత్త వెలుంగుఁదెచ్చెడిన్. 9

ఉ. రాచతికమ్మువారు కవిరాయని కిచ్చుటఁ బుష్పమాలికల్
వైచుటఁజేసి యీవిజయవాద తెలుంగులరాచవీడు గా
నోఁచినమాట నూటికిని నూఱువిధాలయథార్థ మమ్మహో
రోచికి నేఁటిపర్వ మవిరుద్ధ ముపశ్రుతిగాఁ దలంచెదన్ 10

7-9-49



## కవిరాజు

సీ. యుగయుగమ్ములు బొజ్జ నునిచి కృష్ణమతల్లి, యాంధ్రలక్ష్మి కొసంగు నమృతకలశి
అందందుఁజెదరి సొంపతి నేఁటి కొక్కచో, ముద్దగట్టిన ముద్దుముద్దు తెలుఁగు
దివి నున్న సకలాంధ్రకవిరాజరాణ్మహః, ప్రాతినిధ్యము బయల్పఱచు వెలుఁగు
శ్లాఘావిలంఘన జాంఘికప్రతిభచేఁ, గమనీయకావ్యముల్ గన్న గేస్తు
గీ. ఏడుదీవుల కవ్వల నేపుసూపు, కొండనెత్తమ్ముపై నైజగుణలతాళి
కల్లువెట్టిన గడుసరిహాలికుండు, త్రిభువనీపూజ్యతముఁడు మాత్రిపురసుకవి. 1

సీ. కృత్స్ను వేధస్సృష్టికిని మాఱు కల్పించి, సడిసన్న గాధిపుత్త్రుఁడవు నీవు
విశ్వకల్యాణంబు వెలయింప జీవముల్, ముడుపుగట్టిన శాక్యమునివి నీవు
దుర్వాద దుర్మత ద్రుచ్ఛిదావిధిలోన, రాటుదేలిన కుఠారంబ వీవు
నిఖిల ధర్మాధర్మనిర్ణేతయై జగ, ద్గురుపదం బేలు సూతఋషి వీవు
గీ. తెలుఁగుకావ్యమ్ముపైఁ గోర్కి తీవరింప, సురల వీడిన కాళిదాసుఁడవు నీవు
పరిణతాంధ్రప్రసూ తపఃఫలమ వీవు, త్రిపురనేనికవీ! నీ కిదే జొహారు. 2

ఉ. సన్నని సంస్కృతాంధ్రముల సొరులుగుప్పెదు నీ కలమ్ములో
నన్నయతిక్కనల్ కదలి నాట్యముసేయుదు; రాంధ్రవాణి బల్
ప్రన్నని హైమనూపుర ఝుళంఝుళలన్ లయ చక్కదిద్దు నీ
కెన్ని భవంబులం దొదవె నింతటి పుణ్య మగణ్య మగ్రజా! 3

ఉ. వెన్నెలజల్లు సౌరవనవీథులు పంపెడి కమ్మగాలి క్రొం
గ్రొన్ననపచ్చితేనె జిలుఁగుంగపురంపుబిదారు తెల్గులేఁ
గన్నె పసిండిమట్టెబయకారిఘలంఘల నీదు కైతకుం
జిన్నరితోడఁబుట్టువులు సెప్పఁగనేటికి నీ యదృష్టముల్. 4

ఉ. క్షత్రకులంబునందుఁ గవిసత్తము లెందఱొ లేరుగాని లో
కత్రయమేని కిమ్మనదుగా ననెచోదనితో నృసింహరాట్
పుత్రుఁడు కృష్ణరాయకవిపుంగవుతోఁదమతో సదృక్షులై
ధాత్రిఁ బ్రసిద్ధిగన్న కవితల్లజు లెవ్వరు లేరు లేరనన్. 5

సీ. చాళుక్యనరపాల సంపత్పయోధిలో, మునిఁగి తేలినవాఁడు మొదటి సుకవి
మనుమసిద్ధిని వెఱ్ఱిమామయ్య నొనరించి, దిక్కులేలినవాఁడు తిక్కయజ్వ
రడ్డివేమన రాజ్యరమ లేఁతనవ్వులోఁ, జివురించినాఁడు కాశీప్రబంధ
సార్వభౌముని భుజాస్కంధమ్ముపై నెక్కి, తద్ద వెల్గినవాఁడు తాతగారు
గీ. గ్రుడ్లు తిక్కించి పెదవులు కొఱుకుకొంచు, నబ్రపడఁబోము వీరి కావ్యమ్ము లరసి
ముసురుకొన్న దిగుళ్ళలో మున్కలిడుచు, నెట్లు సూతపురాణ మూహించితయ్య. 6

శా. తెన్నాలిన్ నివసించి ప్రౌఢకవితా దీవ్యన్మతిన్ రామకృ
ష్ణన్నన్ మ్రింగితి వంతఁ బోక గురజాలామాత్యు రేచర్ల బ్ర
హ్మన్నన్ జీర్ణము చేసికొంటి విఁక మా హక్కైతి వీ మాట కా
దన్నన్ గెల్తుము కోర్టులోన భయమేలా మాకు బారిష్టరూ! 7

చ. గురువులు నేర్చునాఁడె గురుకుంజరుఁడౌ చెళపిళ్ళశాస్త్రి కా
దరువయి కొప్రపుంగవులధాటి కెదుర్కొని పౌరుషప్రభల్
కురియుట కేమి యీ గడియకున్ సడలింపని కాసెకోకతో
దురము దురం బటంచు రణదోహలముం బ్రకటింతు వీవనన్. 8

శా. ఎన్నో బాధలు ప్రాణగొడ్డములు ని న్నేడాటలాడింపఁగా
విన్నంబోవక జాతిగౌరవసమావిర్భూతికై నీతికై
యన్నా! సర్వము ధారవోసితివి నీ యౌదార్యమున్ శేముషీ
స్కన్నుల్ దున్నలు మన్ను జెఱ్ఱు లెఱఁగంగా లేరు వీరాగ్రణీ! 9

ఉ. నేఁటికి వక్కలాకు లిడనేర్చిరె నీకుఁ దెలుంగువార లీ
నాఁటికి మెచ్చుకొంటయు మనస్సున కించుక శాంతిఁగూర్చులే

మాటల కేమిపో తెలుఁగుమానిసివై మతి కమ్మబిడ్డవై
పాటిలకున్న ని న్నెపుడొ బంగరువువ్వుల ముంచియెత్తరే 10

గీ. కత్తిపోటును మించిన కలముపోటు, మాటతీపిని గెల్చిన మనసుతీపి
*సంఘరక్తిని మీతిన జాతిరక్తి, నీక చెల్లుఁగదోయి! శంబూకసుకవి! 11

16-2-42



## ద్వారమువారు

సీ. చిన్నారి తెలుఁగింటి కన్నె బంగరుటందె, వలకారి జిలుఁగుసవ్వడులు దిద్ది
గౌతమీ కృష్ణవేణీ తరంగచ్ఛటా, పటుతరార్భటి హరి త్తటుల నింపి
తెలుఁగుభక్తులగుండియల నూరి జాల్వాఱు, తేటపాటల తీరుతీయ మరసి
ఆంధ్రగీతిప్రపం చాశేషమృదురవ, స్ఫురణ కాచార్యకంబును వహించి
గీ. లలిత కర్ణాటగానకలా సరస్వ, తీ సవిత్రీ సమర్చనాధీనవృ త్తి
నలసిపోయిన గీతరత్నాకరునకు, నేఁటి సన్మాన మొక్క పన్నీటిజల్లు. 1

ఉ. పోయినచూపు లోపలికిఁ బోయి హృదంతర దివ్యలోక బృం
దా యమునాతటీ విహరణప్రవణ ప్రభు వేణునిస్వన
చ్ఛాయలఁ దెచ్చుకొన్న యొక చక్కనినాదము సొమ్ము నీ దహో
నాయఁడ! ముగ్ధులై మురిసినారు తెలుంగులు నీ కమానులోన్. 2

ఉ. జాతిని దిద్ది తీర్పఁగల జాణలు గాయకులుం గవీంద్రులీ
నీతి నెఱింగి ప్రాక్తనులు నేర్చిరి వీరి సమాదరించు; టా
తాతలనాఁటి ధర్మము, నుదారతయున్ దలయెత్తె నేఁటి కీ
రీతులు సాగిసాగి చివురించుతఁ జిత్కళ లైన సత్కళల్ 3

19-3-49



* కులాభిమానము

# షష్టిపూర్తి

గీతమాలిక :

కందుకూరి సమాజసంస్కరణదీక్ష, చెళ్ళపిళ్ళ దివాకర శ్రీకవీంద్ర
శతవధాన పరంపరా సరిదఖండ, మధురకవితా ప్రవాహముల్ మలసిమలసి
తెలుఁగుబిడ్డలకన్నులు తెఱచువేళఁ, దెలుఁగులోఁగిళ్ళఁ బొలికోడి పలుకువేళ
నుదితమయ్యె సహస్రభానూజ్జ్వలార్చి, రూర్మిచలితంబు గ్రంథాలయోద్యమంబు 1

* * * * *

శారదామూర్తి యిది సుప్రసన్న ఫణితి, నంబయై బుజ్జగించె నాంధ్రాళినెల్ల
నొజ్జయైతెల్గులకు వెల్గు లొసఁగనేర్చె, రాణిగా నేలెఁ దెనుఁగుమాగాణమెల్ల 2

* * * * *

వలదు పరతంత్రతాపీడ వలదటంచుఁ, దగదు బెంబేలుపడి స్రుక్కఁదగదటంచు
లెందు సమరావనికి సాగిరం దటంచుఁ, దెరలె రణభేరి సాబర్మతీతటాన 3

* * * * *

ఎవరుదూఁకిరి మంటలో నెవరుమాతృ, దాస్యభంజకసవనతంత్ర స్వతంత్ర
హోతలైపొల్చి రపరాజితోగ్రశౌర్య, నిధులుగానిల్చి, రీతెల్గునేలఁ జెప్పుఁడి! 4

* * * * *

భారతీపాద కనకమంజీరజనిత, ఘల్ఘలారావ మెచ్చోటఁ గదలుకొనియె
సార సారస్వతాంశు లేచాయఁ బ్రాఁకె, నచటనేలేచి రాంధ్రయోధాగ్రగణ్యు
లచటనేపూచె జాతీయతాగమంబు, లచటనే పుట్టినారు మహాకవీంద్రు
లచటనే కానఁబడిరి మహస్సమగ్రు, లచటనే సాధుసౌందర్య మవతరించె 5

* * * * *

ఎవ్వఁడీ యభ్యుదయలక్ష్మి కిచట విత్తు, నాటె, నీరెత్తె నేతెల్గుతోఁటమాలి
యెవ్వఁడీ చైత్రరథవాటి యువతళించి, సురభిసుమనః కదంబమై సొంపుగుల్కఁ
బాటువడె నన్నపానముల్ మాటమఱచి, యెవ్వఁ డీజాతి రతనాల దివ్వెయయ్యె
నెవఁ డుపఘ్నమై నిల్చె సాహిత్యలతకు, నెవఁడు సర్వస్వమయ్యె సాహిత్యపరుల
కతని కాంధ్రసవిత్రీ ప్రియాత్మజునకు, నిస్తు లాయ్యంకి వంశాబ్ధికౌస్తుభమున
కమరకీర్తికి వేంకటరమణమంత్రి, కంధ్రసేవానిమగ్నున కంజలించి
షష్టిసంపూర్తి సమ్మాన సంపదిష్టి, కన్నలుం దమ్ము లీనాఁడు పన్నిరనినఁ
బెద్దలుం బిన్న లీనాఁడు పేర్చిరనిన, నక్కసెల్లెంద్రు హారతు లద్దిరనిన

నద్దిరా! వెలువద్ద సత్యంబదేమి, నల్లవో! తేటపద్ద విన్నాణ మేమి
తెలుఁగు బిడ్డలు సత్కలాధీనమతులు, తెలుఁగునాఁ దుత్తమాచారధీసమగ్ర
మాంధ్ర మాచార్య మన్యదేశౌఘమునకు, నాంధ్రసంస్కృతి మోహనం బనుట గాక 6

* * * * *

జాతి నిటు దిద్ది తీర్చెడి జాణపట్ల, జాతికై కొల్వునెఱపు సచ్చరితుపట్ల
జాతికై బలివోవు సజ్జనునిపట్ల, జాతికిం బ్రాణమిడు కళాసమితిపట్ల
జాతికిం గీర్తి సంధించు సరణిపట్ల, మూరిఁబోయిన యీభక్తి గౌరవములు
చివురుదొడిగిన యీప్రేమచిహ్నశతము, నిచ్చలుం దెల్గుబిడ్డలో నిలుచుఁగాక
నిత్యమై తెల్గుగడ్డలో నెగడుఁగాక! 7

12-10-50



# మాధవపెద్ది

ఉ. ఎందఱులేరు నేఁడు సుకవీంద్రు లఖండకవిత్వరాజ్య సం
క్రందను లంధ్రవిశ్వజనగౌరవభాజను లట్టివారిలో
నెందఱకబ్బె నీకు లభియించిన యించిన కూర్పునేర్పులో
సుందరరామశాస్త్రి! నినుఁ జూచుటె పండువు తెల్గువానికిన్

11-10-42



# పట్టాభిషేకము

ఉత్పలమాలిక :

తెల్లమొగాలతోఁ గడు విధేయతతోఁ బసిలేటి చూపుతోఁ
దెల్లమొగాల కారతులు దీవన లిచ్చెడి దుర్దినమ్ములోఁ
బల్లెలు పట్టణంబులును బ్రబ్బిన నిద్దుర నున్న జాములో
వల్లభుఁ డయ్యెలే తెలుఁగువాఁ డొకరోజున దానికేమి "మా
తల్లి విపత్తు మాన్పి పరితాపము లార్పి దురంత దాస్యపున్
వ్రేళ్ళు కదల్చి లోకమున వీరులమై తలయెత్తి నిల్వ మా
యెల్లసుఖమ్ములున్ సిరులు నీ తనువుల్ తృణముల్గదా! యిసీ!
క్రుళ్ళిన కంపుగొన్న బ్రదుకున్ ద్రుటియేని భరింపఁజాల" మన్

వెల్లువ పొంగి పొర్లి వినువీథికిఁ దన్నిననాఁడు ధాత్రి కం
పిల్లిననాఁడు భారతము పేర్చి పెనంగిననాఁడు శంఖముల్
చిల్లులు పడ్డనాఁడు తన చేవలు సేవలు త్యాగసంపదల్
పెల్లు వెలార్చి యార్చి రిపు భీకరుఁడై యెదుఱొమ్ముచూపిఱం
పిల్లి యశమ్ముగన్న పులి పిల్లకు భారతమాతృ పూజకై
తల్లడపాటు లేని బలిదాన మొసంగిన తెల్గుబిడ్డ కే
నల్లన లేని జోదునకు నాల్గుదెసల్ జయపెట్ట ముత్తెపుం
జల్లులు చిందఁ దూర్యముల సందడి రేఁగఁ దురంగ కింకిణుల్
ఘల్లున మ్రోఁగ సత్కవులు కబ్బములం గొనియాడ గాయకుల్
పల్లవి పాడఁ గ్రొంబసిఁడిపళ్లెము లెత్తి నివాళి పట్టి సం
ఫుల్ల సరోజనేత్ర లతిపూత చరిత్రలు బొట్టు దిద్ద రా
ట్తల్లజునట్లు పుణ్యములు దాల్చిన రూపమునట్లు వచ్చి య
ల్లల్లన హైమరుక్మబలితాభ్రము కాంగ్రెసు పీఠమెక్కు భా
గ్యోల్లసనం బికం గలుగదో! తగదో! యిది యేమివింత యీ
వల్లడి కేమిహేతు వనవద్యగుణమ్ముల నాంధ్రపుత్రుఁ డే
బల్లిదుఁ గ్రిందుసేయఁ దలబాబులు బోసులు దాసులుం బటే
ళ్ళుల్లమువిచ్చి చూడ మనయోధుల మించెదరా యటంచుఁ జిం
తిల్లిన తెల్గుతల్లి కతిదీనత సైఁచిన తెల్గుజాతికిన్
మల్లెలు పూచెరా! మలయమండల మంజుల వాతపోతముల్
మెల్లన వీచెరా! నిరుపమేయమనీషకు నాలవాలమై
పొల్లొకయింతలేని నుడి పొందికకుం గుదురై జగత్తునన్
జెల్లెడు లెక్క లెల్లఁ దనచేతి కనిష్ఠనుజూపు యంత్రమై
నల్లవో! మోహనుండు ఋషినాథుఁడుపల్కిన ఋక్కురూపముల్
తెల్లము సేయఁజాలిన సుధీమణియై ప్రతివాది ప్రక్కలో
బల్లెమునై విపన్నులకు బంధువుఁడై పగవాని మృత్యువున్
నల్లను వాంఛసేయని రణమ్మున నోటయొకింత లేని, యే
యల్లరి పాలుగాని మగఁడై ఫలమొల్లని కర్మయోగియై
పల్లము మెట్టయున్ వఱద పాలయి వెట్టకు నుగ్గునూచగా
గొల్లునఁ గాఁపులుం బెఱలు కూడును గుడ్డయు లేక యేడ్చినన్
గొల్లలు మానఁబోఁక ప్రజకున్ దగుపెత్తన మీక గర్వముల్
త్రుళ్ళఁగ నింద్రభోగములతో సకల వ్యసనాలతోఁ బగల్
త్రెళ్ళుట చీఁకటుల్ కవియుదెంచు టెఱుంగక మత్తులై ప్రవ

ర్తిల్లు నరేంద్రులన్ బొగరుదింపి విధేయులఁ జేసి యేద్దైఱన్
జల్లిన వీరుఁడై ప్రజల సత్కృతు లందిన యోధుఁడై విరా
జిల్లిన భోగరాజకుల సింహము కాంగ్రెసునేత యయ్యెరా!
ప్రల్లదుఁ డొందు ప్రేల్చిన తుపాకి మహాత్మునిగూల్చెఁ గాని యా
చల్లని తండ్రి ధర్మమును జంపఁగ లేదను వార్త నేఁ డిటుల్
వెల్లడి యయ్యెరా! భువన వీధులు నాంధ్రజయస్వనంబు పిం
పిళ్ళు వెలార్చెరా! జననిపీడలు వోయిననాఁడు దైన్యముల్
బల్లున వ్రీలునాఁడు నవభారతలక్ష్మి యనుగ్రహమ్ము సం
ధిల్లుట కెల్ల ఖండములు దేశములున్ వెలలేని కానుకల్
ముల్లెలు పంపునాఁడు నలుమూలల స్వేచ్ఛ నటించునాఁ డహో!
ఫెళ్ళున సాగి రాష్ట్రపతి పీఠము నెక్కుట లెస్సయం చిదే
మొల్ల నదల్చు కీర్తికినిమూల మటంచు మదిందలంచి యి
న్నాళ్ళు సహించెనో తెలుఁగు నాయకుఁ డీపద మాక్రమింపఁగన్
ఛల్లరె! భోగరాజకుల పావన! నీ తలఁ పెంత యౌచితీ
వేల్లితమోయి! యెంతటి వివేకము నేర్చితివోయి! యింతకుం
దొల్లి యెఱుంగనట్టి యకుతోభయతన్ జయపూర్ణహాసభన్
బిల్లలు పెద్దలుం జెలఁగి పింపిసలాడ సువర్ణరత్నరుగ్
వల్లరియౌ కిరీటమును వర్ణితమున్ ధరియించి కుట్రకుం
గల్లకుఁ బేరువడ్డ రిపుకాండము బమ్మెరవోవఁగా రథం
బుల్లలితం బొనర్చి భరతోర్వి యశంబును బెంపవోయి! నీ
యిల్లు తెలుంగుసీమ జగదీడితమై కెడనాఁడు లర్థిమై
నుల్లెడపట్ట రాష్ట్ర విజయోత్సవడోలల నూఁగు లగ్నమున్
ఢిల్లిని దెల్గు మంత్రులు పటిష్ఠతమై హవణిల్లు భాగ్యమున్
బల్లవ పుష్పగుచ్ఛ ఫలబంధురయై మన గాంధి భావనా
వల్లిక సాగు యోగమును వచ్చునటుల్ కృషి సల్పవోయి! నీ
కొల్లమి రానియట్లు సిరియున్ జవమున్ బల మాయువబ్బివ
ర్ధిల్లెడునట్లు నీ ప్రభుత దీర్ఘతరంబగునట్లు నీవు హొం
బల్లకి నెక్కునట్లు జయభారతి హారతి నిచ్చి మెచ్చుతన్!

8-10-48



## అనుతాపము

సీ. శ్రీమన్మగధరాజ్య సింహపీఠికమీఁద, నాంధ్ర రాజన్యు లున్నట్టివేళ
పలునాఁటి నెఱజోదు బ్రహ్మనాయని కీర్తి, వల్లికల్ సకలోర్వినల్లు వేళ
వీరప్రతాప భూవిభుఁడు ఢిల్లీనాథు, సేనాళి నవలీలఁ జెండు వేళ
కర్ణాట భూభ ర్త కవిచక్రవర్తికి, స్వర్ణాభిషేకంబు సలుపు వేళ
గీ. విశ్వవిఖ్యాత బొబ్బిలి వెలమ వీర, చండశౌర్యార్చి దిక్కుల నిండువేళ
నాంధ్ర జనని! న న్నీవు కన్నట్టులైనఁ, గటకటా! యింతదుఃఖంబు కలుగ దిపుడు

18-9-24



## విశ్వదాత

సీ. తరలినాఁడా మాతృదాస్యపాశచ్ఛేద, కౌశల్యమును గన్న కర్మయోగి
కానరాఁడా బలికర్ణమాంధాతల, విస్మృతికిం దెచ్చు విశ్వదాత
ఏగినాఁడా జగజ్జేగీయమాన సా, హిత్య సామ్రాజ్యంబు నేలు బుధుఁడు
పోయినాఁడా దివ్యభూషణమ్ము లొసంగి, చదువులమ్మకు సేవ సలుపుబంటు
గీ. తెలుఁగువెల్గులకొఱకు రాత్రిందివమ్ము, రక్తమును ధారవోసిన రాచబిడ్డ
యస్తమించెను నాగేశ్వరాభిధుండు, దేశమున కెవ్వఁ డీలోటు తీర్చు నకట!

13-4-38



## ఓదార్పు

సీ. కనుసైగచేసినకలికి మేనక కెంత, సవురున్న నది సంతసాని కాదొ
తోడుగోరిన జయంతుఁడు సాధువైనను, మిండగానికిఁ దనూజుండు గాఁదొ
గీర్వాణ మెంతనీల్గిన జిబ్బిలితెలుంగు, నుడిసొంపునకు దిగదుడుపు గాదొ
అమరలోకము నాక మందువా యగుఁగాక, విడుపులేనిసుఖంబు వెగటు గాదొ
మందార మెంతకమ్మన పంచిపెట్టిన, జవ్వాది దాని కాశ్రయము గాదొ
పీయూష మెంతయింపిత మైన నది యావ, కాయయూటకుఁ గ్రిందిచేయి గాదొ 1

ఆ. ఏమి బావుకొంట కేగితి వౌగాము, లింత కనక వైజయంతమునకు
వేయి చెప్పవయ్య *వేంకటరామయ్య!, శాస్త్రి వయ్యు నీవు ఛాందసుఁడవు. 2

* జమిందారు శ్రీ జవ్వాజి లక్ష్మయ్యనాయుఁడుగారి కుమారుఁడు వేంకట రామశాస్త్రి

క. బహిరంతర సుందరతా, మహోనిధి భవత్కుమారమణి ఫణిదంష్ట్రా
విహర జ్వాలనార్చి స్తతి, నిహతించెనె లక్ష్మణావనీపాలమణీ! 3

మ. ఎటు లీశోకము నుక్కఁబట్టెదవు ని న్నేరీతి నోదార్తుము
త్కటసౌజన్యవిభాసివై మనెదు నీకా యిట్టి దుర్యోగ మీ
కటుకృత్యంబున కెట్టులోర్చె విధి; లోకంబెల్ల నీ బంధు వౌ
నటు భావించుచు బుద్ధిచెప్పఁగదవయ్యా! కూళ కవ్వానికిన్ 4

3-1-43



# ఆవేదన

గీ. అతఁడు తెల్గులతల్లి పుణ్యమ్ముపంట, యతఁడు తెల్గులబాస భాగ్యంపురాశి
యతఁడు కవిరాజు సంఖ్యావదగ్రగణ్యుఁ, డేల పుంభావభారతియే యతండు. 1

గీ. అతని గంభీర కవితా రహస్య మెఱిఁగి, మేలు మేలనువారు వేల్వేలె కాని
బెగ్గడిలి యీరసంబెత్తి బ్రుగ్గుచున్న, వారు లక్షలు లక్ష లున్నారు జగతి. 2

గీ. కల్పమునుఁబోని యుత్తమ కావ్యసృష్టి, వాని కలవోక వాణి యవ్వానిరాణి
యతనికి వచోవిధేయమై యఖిలశాస్త్ర, పటలమది భీతిమై బరాబరులొనర్చు. 3

గీ. అతఁడు పల్కిన పల్కు పాటై ధ్వనించె, నతఁడు వ్రాయుచ్చు వాక్యంబు హోరి కావ్య
రాజమై దేశదేశాల రాణకెక్కె, నతని హృది రసవాహినియై తొణంకె. 4

గీ. ఆతఁడు మహాకవిత్వ దీక్షావలంబి, యగుచు నంతర్విలోకనం బట్టె విప్ప
యుగయుగమ్ములు దాఁటిన జగములెల్ల, రివ్వు రివ్వున సాక్షాత్కరించితీరు. 5

గీ. కుకవులకు నాతని విమర్శ గుండె గాల, మల్పబుద్ధుల కేనాఁటి కందఁ దతఁడు
ప్రాచ్య పాశ్చాత్య విజ్ఞాన పండితుండు, పండితుఁడె కాదు పండితాఖండలుండు. 6

గీ. తెలుఁగు హృదయమ్మునందున్న తీపి నెఱిఁగి
తెలుఁగు నుడికార మందున్న మెలపు నెఱిఁగి
తెలుఁగు సంస్కృతియందున్నచెలువ మెఱిఁగి
తెలుఁగున కతండు సరిక్రొత్త వెలుఁగులిచ్చె 7

గీ. ఇంతటి కవీంద్రు లేమిడి యుట్టిదనుచుఁ, జెప్పుటకు నాదు లేఖిని సిగ్గుపడియె
నిస్సిరో! యెంత దుష్కాల మీ తెలుంగు, జాతిలోఁ జీమునెత్తురుల్ సచ్చెనొక్కొ. 8

సీ. కవితా రసాస్వాద కౌతుకవ్యగ్రులై, దండయాత్రలు నిల్పు దండిదొరలు
రమణీయకావ్య సారస్ఫూర్తావేశులై, కవుల పల్లకిమోయు నవనివిభులు
తెల్లవారకముందె దినవెచ్చముల నంపి, కృతికర్తలను గొల్చు పృథివిపతులు
కనకాభిషేక సత్కారమ్ములర్పించి, కవికృపావిభవంబు గాంచు ప్రభులు
గీ. నృపుల యౌదార్యమునకు వన్నియలొసంగి, శారదాపూజలొనరించు సచివమణులు
నేఁటి కవిశేఖరుని దైన్యపాటు సూచి, కుములుచున్నారు చచ్చి స్వర్గముననుండి. 9

గీ. బ్రతికినన్నాళ్ళు దుర్భరాపదలఁ గుడిపి, చచ్చినంతనె యాత్మకు శాంతిపల్కి
వీరపూజలు గావించు వెఱ్ఱితనము, తెలుఁగు దద్దమ్మకే సమృద్ధిగ లభించె. 10

క. ఇది వెఱ్ఱితనంబని ప, ల్కుదునా? మఱి తోడివాని గుణగౌరవ సం
పద కోర్వలేని నైచ్యా, స్పద మీర్ష్యాదాస్యమనుచుఁ బ్రకటించెదనా? 11

గీ. లోక మితనికి నేవమ్ము గాకమున్నె, యీఁకటికి దస్సి జీవముల్ పోకమున్నె
పట్టుఁడీ బ్రహ్మరథము నీ భావుకునకు, నవల నేద్చిన లాభ మావంత లేదు. 12

గీ. చవియు సారంబు నెఱుఁగని చచ్చుకవులు, పుట్టకొక్కులవలె సదా పుట్టుచుంద్రు
సర్వతంత్ర స్వతంత్రుఁడౌ సత్కవీంద్రు!, డెన్నఁడో కల్పమున కొక్కఁడే లభించు. 13

8-2-38



## వంగభస్మము

ఆ. సిగ్గు సిగ్గు తెల్గుసీమల దత్తు, రా, కూర్, బెనర్జి, సేను, ఘోషు, బోసు
రే, యటన్న పేర్లు రేఁగెను; హెగ్గడ, భట్టు, సెట్టి, నేఁడు వట్టిపోయె 1

సీ. మాదరన్‌రివ్యుపై మమతఁ బెంచుటెకాని, కోలవెన్ను త్రివేణి కొనఁగఁబోము
రేల బోసులఁ బగల్ రేలఁ గొల్చుటెకాని, భగవత్సుధీశాస్త్రపటిమ గనము
ఏ ముఖర్జీగీతమో మెచ్చుటే కాని, చదువ నొల్లము కృష్ణశాస్త్రి కృతులు
సెహబాసని సుభాసుసేవ సల్పుటె గాని, భోగరాజ్మంత్రివైపునకుఁ జనము
గీ. ఎవ్వఁ డీవంగభస్మంబు నేముహూర్త, మందు మన కిచ్చెనో తక్కుమందులన్ని
దోఁకు పుట్టించె; మంచిఘాటుగలదాని, వెదకుఁడు కషాయమును దీని వెదలఁగ్రక్క. 2

ఉ. అప్పుడు రామమోహనమహర్షి ముఖుల్ మన కేవిశేషముల్
సెప్పినఁ జెల్లెఁగాని బుధశేఖరులై ప్రతిభావిభాసులై
యిప్పుడు తెల్గువారె గడియించిరి విశ్వజగజ్జనాళికిన్
మప్పెడి హక్కు సర్వెపలిమంత్రిపురోగము లెక్కివచ్చుటన్ 3

30-1-40



# చుక్కలు

క. సాచలసముద్రవిపిన, క్ష్మాచక్రము నెల్ల నైజమంజులరోచి
ర్వీచీమందలిఁ దన్పెడి, యీ చుక్కల పుట్టుచంద మేమందురయా? 1

*  *  *  *  *

క. నిర్గతమోహాద్యసుహృ, ద్వర్గులు పరతత్త్వవిదులు "తమసో మా జ్యో
తిర్గమ" యేతి వదన్ముని, భర్గులు దీపింతురా నభస్థలి నిట్టుల్ 2

*  *  *  *  *

క. ఋగ్యజుషసూక్తములు ఛాం, దోగ్యాదులు వినిచి మనిచి తొలఁగిన బ్రహ్మా
గ్రగ్యంత్రితమతు లారవ, ముగ్యవనిక నిట్టిరూపముల వెల్గెదరా? 3

*  *  *  *  *

క. అమృతప్రసువులు యజన, క్రమకర్షణమూలములు సురధ్యేయము ల
గ్నిమయమ్ములు ధేనువు లీ, రమణీయాకృతులు రా విరాజిల్లు నొకో? 4

*  *  *  *  *

క. పరిణతపాతివ్రత్య, స్ఫురణత్వరమాణలై ప్రభూతత్యాగ
స్థిరలై పతిచితి నెక్కిన, తరుణీరత్నమ్ము లిట్లు తలచూపి రొకో? 5

*  *  *  *  *

శా. గంగాంభఃపరిభావిశీలసుషమాగారంబు లై చిత్తభూ
శృంగచ్ఛేదమొనర్చిదుష్కరతపోర్చి రాసులై ప్రాయమున్
సింగారంబును జాతిధర్మపదవీ సేవార్థ మర్పించి మే
నిం గోల్పోయిన భారతీయవిధవానీకమ్ము లీ చుక్కలా? 6

*  *  *  *  *

క. వసుధారాజ్యమ్ములు గా, కసిపుత్రికc గోసి తనువు నర్థుల కిడి ధ
ర్మసపర్య మునింగి తేలిన, యొసపరి తెగుదారు లిట్టు లుండిరె చదలన్? 7

* * * * *

క. ఎత్తిన కటారిదింపక, నెత్తుటc దోcగాడి శత్రునిర్మథనకలా
విత్తములై ప్రజనేలిన, యుత్తమసమ్రాట్టు లిట్టు లుందురె మింటన్? 8

* * * * *

క. పరిభావజనక దుర్భర, పరతంత్రత నెదిరి దేశభక్త్యుల్బణులై
యురికంబము లెక్కిన పో, టరు లంబరవేది నిట్లు రవణిల్లెదరా? 9

* * * * *

క. పతితప్రజాసమాజో, న్నతికృత్సంస్కృతికి జీవనస్వార్థము లం
కితముల్ పచరించు తథా, గతాదులా నింగి నిట్లు క్రాలెడి రిక్కల్? 10

* * * * *

క. మసృణ మకరంద ధారా, విసృమర పుణ్య ప్రబంధ విరచన పరితః
ప్రసృత ప్రథా మహిష్ఠులు, రసజీవులు సుకవు లుందురా యీ సరణిన్? 11

* * * * *

ఉ. కాలెడి పొట్టతో విరతి గానని చింతలతో విశీర్ణమై
సోలెడి మేనితో బడుగుc జూపులతో నిజ రక్తమాంస కం
కాళము లర్థమత్తులకుcగా నిచటన్ బలివెట్టి రెవ్వ రా
మాలలు మాదిగల్ గగన మంటప మెక్కిరె యిట్లు చుక్కలై? 12

30-12-47



# ముక్త్యాల మాలిక

(రాజసమ్మాన సందర్భమున)

ఉత్పలమాలిక :

గండరగండలై శ్రుతిసుఖప్రద సాధుకథామచర్చికా
మండనులై మహిష్ఠగరిమన్ జతురబ్ధిపరీతమేదినీ
మండలభర్తలై భువనమాన్యతనోcచిన తెల్గువారిలో
దండియశమ్మునేలిన సదస్సుల కెక్కిన వాసిరెడ్డి రా

ణ్మండలిపుణ్యవృత్తసుషమాపరిపూతము తెల్గునేల-త
ద్ఖండనపాటవమ్ము ప్రతిపక్షభయంకరమౌట నన్యదో
శ్చండిమలేక శాంతిసుఖసంపద కిమ్మయి దక్షిణాపథం
బుండెనటన్న పల్కు నెదురొడ్డఁగ నాఁడునునేఁడు నేరికిన్
గుండెలులేవు-వారల యకుంఠిత విక్రమకంకటమ్ముతో
నెందని కేవిగాంచి జగదీడిత వైదికధర్మమిచ్చటన్
బందువులాచరించుకొను భాగ్యమునందెఁ-దదీయదాతృతా
ఖండితదైన్యులై తనివిగాంచిన యాచకు లగ్రహార వే
దండతురంగహేమమణిదానములన్ బరితుష్టిసంపదల్
మెండుకొనందలిర్చిన యమేయమనీషులు సత్కవిప్రభుల్
పండితు లార్షధర్మపరిపాలితబుద్ధులు సోమపీథులున్
నిండనిపల్లె లాంధ్రధరణింగన - మాస్తికతా రిరక్షమైఁ
బిండులుగట్టి శిల్పములు పింపిసలాడఁగ వీరి మాతృభూ
ఖండమునందునిల్చు శివకైటభజిద్గృహరాజినెన్న శే
షుండునుజాలఁ - డిద్ధగుణశోభితమైతగు నిట్టికోవలోఁ
బండిన రామకృష్ణనరపాలక! నీ సుతుజన్మపర్వము
ద్దండవిభూతిమైవెలయు దానిఁ గనుంగొను భాగ్యమబ్బి నా
కండలుపొంగె మేనఁబులకల్ మొలకెత్తె నఖండహర్షమై
తాండవకేళిసల్పెడిగదా హృదయమ్ము - త్రిలింగరాజమా
ర్తండుల వాసిరెడ్డివసుధాపురహూతుల వైభవంబులన్
వెండియు వెండియుంగనెదు వేడ్కలుపుట్టు టదేమివింత - యీ
పండుగు వర్షవర్షపరిపాటి సహస్రముగా నెసంగ నీ
కందగనిల్చు వేదకుధరాగ్రవిహర్త జగద్ధితక్రియా
శౌండుఁడు నారసింహుఁడు - ప్రసాదమృదూకృతలోచనద్వయీ
*చండి యజాండభృజ్జఠరి శాంకరి కింకరమందిరాంగణా
ఖండలశాఖి నిర్భరసుఖమ్ముల నిన్నలరించు - మీఁగడల్
నిండిన రత్నరాజి రవణించిన యింటినిసుంగుచల్వ నీ
బందరు వెల్లవేళల నపారధనాశ్రయమౌచు జాళువా
కొండనదల్చు - మాన్యకవికుంజరపుంజము లంధ్రభారతీ
కుండలముల్ కిరీటములు క్రొవ్విరిదండ లనల్పకల్పనా

* చల్లనిదని యిచటి అర్థము

భాండములైన కావ్యములఁ బాడి నినుందనుపారఁజేయు - నీ
తండిరి చంద్రమౌళివసుధాపతి కచ్ఛయశోవిభాసికిన్
బెండెరమున్నసత్కృవులఁ బెంచినకావ్యకళావినోదికిన్
రెండవ రాజరాజునకు నీ కవితారతి సమ్ముదశ్రువాః
కాండములూర్చు - నీసుతుల కమ్మనిమన్గడ గన్నవారికిం
బందులు బోరనం బులియఁబాఱు-భవద్భవనావళుల్ సుహృత్
*తండముతోడ బంధుసముదాయముతోడఁ బెనంగి భేరికా
డిండిమ కాహళీధ్వనులు డీకొని సందడిసేయ లేఁత యి
ల్లాండ్రు పికీనినాదముల నారతి పాటలుపాడ నిండుగా
వండిన భక్ష్యభోజ్యముల వాసన లాసలు పెంప సర్వదా
పెండిలి వేడ్కలన్మనిఁగి పెంపగుఁ - జింతలపాటి రాజ్య మెుం
డొండ తనర్చి నిత్యవిజయోత్సవ కందమగున్-హిరణ్యముల్
మండెలువైచి నీప్రజలు మాన్యచరిత్రల కాశ్రయంబులై
వేంద్రములేని దెందముల వేమఱు నిన్వినుతింతు - రద్రికో
దండ పటీర హీర హిమధామ శరజ్జలముగ్వియద్ధునీ
కాండ మరుద్గవీకనకగర్భవధూ ఫణిరాజ మల్లికా
పాండురకీర్తి నిన్వలచి పార్థివకోటికి నీర్ష్యపెంచు - రా
రండని పిల్చి గౌరవధురానతదృక్కులు పంచి సాహితీ
మండితులైన సత్కవుల మాదృశులన్ దనియించు నీకథా
మండల మొజ్జయై ధనికమార్గములన్ సవరించు భూపతీ!

* * * * *

కొండొక విన్నవింతు వినఁగూడని కబ్బము లల్లి గ్రామ్యముల్
బందులు బండ్లు నింపి కవిపాంసను లాద్యకవీంద్రమార్గముల్
దుందతికమ్మునన్ దెగడుదుర్గద - బందరువాల్ ఫిరంగిలో
మందలు ముందు లెల్ల కసుమాలపుఁజెత్తయుఁ గ్రుక్కునట్టు లీ
బందలు భారతిం బఱిచి పల్మఱునుబ్బుదు - “రేంది కాంది కూ
కోంది తెలీదు రాం డిహ లెగుం” దని వ్రాసెద - రెల్లకట్టులన్
దుండెలు సేయకున్న నుడితొయ్యలి రెక్కొనదందు-రెట్లు వా
కొందు రటుల్ రచించుటయ కూడునటందు - రి దేమి యేటికిన్
గందులుపెట్టి స్వేచ్ఛనిడఁగాఁ దగునన్నఁ బొలంబులుం గొటా

* ఈ ప్రయోగము శ్రీనాథుని 'కంకాళతండము' వంటిది

ర్లిండులు పల్లెలుం బురము లెల్లయు వెల్లువబారి కగ్గమై
వండలి దిబ్బలై సమయవా–కరకట్ట ప్రవాహజీవికన్
జెందునె–సూర్యసోములను జేద్పడఁజేసెనె కాలబంధముల్ –
గండరు వందచందములఁ గాఱియపెట్టి నగన్ నలంచెనా –
పెండిలి సౌఖ్యముల్తుడిచిపెట్టి నెలంతుక నంగలారుపుం
బిండలిఁ జేసెనా – పసులబీటికిఁ గంచెలు గోష్ఠశాలకుం
బెండెము లేనిచో మొదవుపిండు సుఖించునె – దుర్విదగ్ధతా
పిండితబుద్ధు లాంధ్యపరిపీడితు లిత్తఱి నన్యసాహితీ
షండ సపర్యలోఁ బెరిఁగి సత్యమెఱుంగక వెంగళప్పలై
బెండులుపల్కి రిత్తవెడబీరముచూపెద – రీ ప్రసక్తిలో
మండఁ దొడంగు నాహృదయమండల – మక్కట! తెల్గుతల్లికీ
పుండులు మానునట్లు పనిఁబూను– ముసుళ్ళనఁ గ్రేళ్ళువాఱు నీ
దండు నధఃకరించి కవితావనితాశుచితామనోజ్ఞతల్
గొండిలిసల్పునట్టి తెఱఁగుల్ పచరింపఁగదయ్య – సాధుశీ
లుండు రసజ్ఞుఁడుం దెలుఁగులోఁతు లెఱింగినప్రోఢ రాజమా
న్యుం *దెలమావివంగడమునోఁచిన నోముల మేలిపంట నీ
దండ నమాత్యుఁ డయ్యెను గదా శివరామమనీషి – సాహితీ
కండువు నీకునుంగలదు – గాన మదీయ మనోరథాప్తికే
వండయు రాదటంచు వగవా సెదఁ – జేఁదు లడంగి తీయ మేల్
పండులు తెల్గుఁదోఁట దెగఁ బండునటుల్ ప్రయతింపవయ్య – కై
దండలొసంగుచున్ నిను బుధప్రకరమ్ము భజించి హర్షముల్
పిండును – భట్టతిక్కనలు ప్రెగ్గడ పెద్దనసూరనాదికుల్
దండితచిత్తు లాంధ్రకవితాపరమేష్ఠులు పారిజాతపుం
జెండులుపంపి నీకుఁ గయిసేఁతలుగూర్తురు – రాణ్ణరేంద్రుఁడుం
గుండలినేలినట్టి ప్రభుకుంజరుఁ డన్యదురాసదప్రథన్
డిండిమభట్టుబింకమును డించు మహాకవిపై వరాలమేల్
గిందులు క్రుమ్మరించునృపకేసరి వేమనరేంద్రుఁ దంధ్రభో
జుండు సిరంగరాయలు యశోనిలయుల్ రఘునాథరా ణ్ముఖుల్
తీంద్రలుతక్కి శాంతిజలధి న్మనుకల్ పచరింత్రు – నానుడుల్
కొండికపల్కులంచనకకోల్తలసేయఁగదయ్య – కీరుతుల్
పండుననీకు – ‘మీకవనపాండితిఁజూపి నితాంతసమ్మదం
బిం’ దని కూర్మిపేర్మి వెలయించి మహీపతు లెందఱెందఱో

* చిరుమామిళ్ళ

గండెలవంటికాఁపు లధికారులు కోరుచునున్న నేడియో
మొండితనమ్ముఁదెల్పి పదమున్గదలింపనియట్టినేను నీ
రెండవపిల్పుతో ననువరించినకోరిక లంధ్రశారదా
గండసరద్దురశ్రుజలఖండవిరోధులు నీకతమ్మునం
బందునటంచునెంచి పొగబందులరాయిడిసైఁచి రోగముల్
పొందని ధిక్కృతుల్పలికి పూనినకర్జములాఁపి యెట్టిటో
యెండకువానకోర్చి ధరణీశ్వర! వచ్చితి – మాతృసేవ నీ
గండువెలార్చి నాదుకుతుకంబునుదీర్పవె – తెల్గువాణికీ
పాండువదంగునట్లు నడుపంగదె యార్ష రసాయనంబు – పె
క్కంద్రు మహామహుల్పడిన కష్టముపంటగ నేఁడొ రేపొ రా
నుండిన తెల్గురాష్ట్రము శుభోత్తరమై విలసిల్లుపొంటెఁ ద
చ్ఛందతరప్రతాపము దిశావలయమ్మును దాఁటుపొంటె వే
ధోండము దాని సభ్యతకు నారతు లిచ్చి భజించుపొంటెఁ బా
షండమతప్రచారములుస్రగ్గి జగద్ధిత మబ్బుపొంటె నాం
ధ్రుండు విశిష్ట ధర్మ బల ధూర్వహుఁ డన్నుడి నిల్చుపొంటె నె
న్నండొ తొలంగిచన్విలసనంబులు శారదకబ్బుపొంటె నే
తందును వ్రేలుసూపని విధంబున దిద్దవె రాష్ట్రవాణి – నీ
గండముఁ దూల్చి బాసకు వికాస మొసంగు వలంతి వీవ – యె
వ్వండిది కాదటంచు నిలువంగలఁ – డట్లగుటన్ సుధీకవుల్
దండకపద్యగద్యసముదాయములం బొగడం గదాని పూ
దండలు నింపి వాణి నిcకc దన్పవె ముక్తిపురీమహీశ్వరా!

13-12-44



# కూటవేదాంతులు

సీ. పరసతీలావణ్యపరిపాకమును మెచ్చి, గ్రుక్కిళ్ళుమ్రింగెదు కొంటెగుంట
ధనదాసుఁడై నిరర్థకధర్మసూత్రముల్, పడcగూయుచుందు ముక్కడిగులాము
తత్త్వంబు లౌకికవిత్త్వంబు నెఱుcగక, విఱ్ఱవీcగెడి వెఱ్ఱివిధవకొడుకు
జాత్యహంకారంబు సడలింపలేక మి, ట్టెక్కి రజ్జులువల్కు నేబెరాశి

గీ. ఇచ్చవచ్చినచందాన వెచ్చపెట్టి, రొంపిలోఁ జిక్కి లోకులకొంప ముంచి
సడికి నోర్చినయట్టి లుచ్ఛాలుకూడ, గురువులైనారు నేఁడు మేల్కొనుఁడు జనులు. 1

సీ. తిరుమంత్రములు సెప్పు దొరతన మొక్క జం, దెంపువానిదెయంచు నిక్కు నొకఁడు
కామిగాకయె మోక్షకామిగాఁ దంచు దు, ర్భోధనల్ పచరింపఁబూను నొకఁడు
ఇది దేహధర్మంబ యిందుఁ దప్పే మంచు, నీచవృత్తులకుఁ బ్రేరేచు నొకఁడు
హృత్తాపహరణ మింతేని సల్పఁగ లేక, విత్తాపహరణంబ వెదకు నొకఁడు
గీ. ఇట్టి నీచులపాదాలు పట్టువార, లెట్లు కామాదిశత్రుల నెద్రిచి తమము
నెట్టి నిక్కంపుటెఱుకఁ జేపట్టి చావు, పుట్టుకలులేని లోకంబు మెట్టఁగలరు. 2

సీ. గ్రాసవాసోదైన్యగతి కాఱుఁగాలంబు, దాసులైనట్టి పెద్దమ్మ లొకట
విద్యావివేకసంపద్యోగదూరులై, బాహువుల్ సఱచెడి పశువు లొకట
మందు మ్రాఁకులు లేక మరణశయ్యలఁ జిక్కి, పరితపించుచు నున్న పక్షులొకట
"నా" యన్న దిక్కుగానక నిస్సహాయులై, చింతలన్ జివికెడి జీబు లొకట
గీ. కలరు మన మెందుఁ జూచిన న్గలరు వీరి, సేవఁ జేయక మోక్షంబు సెందె నెవ్వఁ
డాఱుమూఁడంచు మూఁడు నాల్గనుచు వెఱ్ఱి, తత్త్వములు పాడినంత సార్థకత లేదు. 3

1-11-35



# భజగోవిందమ్

క. గోవింద ప్రభు సంతత, సేవావ్రత మూను మితరచింతన మేలా
వైవస్వతుఁ డెత్తినతఱిఁ, గావదురా శబ్దశాస్త్రకౌశల మజ్ఞా! 1

ఉ. విత్తము సేకరింపవలె వేలకువే లనుకోర్కి మాని నీ
చిత్తమునన్ దురాశలను జేర్పక సారవివేక మూని నీ
వృత్తముచే వశంపడినవిత్తము కాసయినన్ సహస్రమం
చత్తినవేడ్క నెంచుకొనుమా వినుమా యనుమానమేటికిన్. 2

చ. పొలఁతుకగబ్బిగుబ్బలను బొక్కిలిఁ గన్గొని మోహవార్ధిలో
పలఁ బడఁబోకు దుర్గతికి. బాల్పడఁబో కవి చీమునెత్తురుల్
కలిగినకందలంచుఁ బొడఁగాంచినవేళల మాటిమాటికిన్
దలఁపుము పై మెఱుంగులకు దాసుఁడవై చెడిపోకు మజ్ఞుఁడా! 3

మ. నలినీపత్రముమీది వాఃకణము ప్రాణం బౌట కన్గొక మ
ర్త్యులు తృష్ణామయపీడితాత్ము లగుచున్ దుఃఖాబ్ధినిర్మగ్నులై
తెలివిం గోల్పడి దారిగానక కదున్ దేహాభిమానమ్ముతో
నిల వర్తింతురు గాని సౌఖ్యపదువా రెవ్వార లీజొంపిలోన్. 4

ఉ. వేలకువేలు మానవుఁడు విత్తము నార్జనచేయువేళలం
దాలును బిడ్డలున్ హితులు నందఱు నాతని గారవింతు రా
యాలును బిడ్డలున్ హితులె యర్థము గూర్పఁగలేక వృద్ధుఁడై
కాలముపుచ్చువానిఁ బొడఁగాంచరు పిల్చినఁబల్క రొక్కరున్. 5

ఉ. బొందిని ప్రాణవాయువులు పోవక నిల్చెదునంతదాఁక ని
న్నందఱుఁ గూర్మిమైఁ గుశలమా తమ కంచును బల్కరింతు రో
మందుఁడ నీవు చావఁగనె మక్కువనించిన పెండ్లమైన నీ
కందినమేను చూచుటకుఁ గాతరతన్ గుదుచున్ విరక్తయై. 6

ఉ. కా సొకవేయిగాఁ దలఁచి కల్లలు పొల్లులు కూసి సొమ్ము పే
రాస గడింపనేల విను మర్థ మనర్థమపో సుఖం బటన్
వీసము కానరాదుసుమి విత్తము కల్గినయట్టివారి కొ
రా! సుతుఁడైన సంతతభయప్రదుఁడై కనిపించెడిన్ గదా. 7

చ. చెడుగుడులాడఁ బాడఁగను జిన్నతనంబున నాసచేయు లేఁ
బడతులతోడఁ గూడ నెలప్రాయమునం దభిలాషపెంచు వృ
ద్ధుఁ డయినపిమ్మటన్ విషయదుఃఖములన్ గృశియించు నింక నె
న్నఁడు మనుజుండు తత్త్వగమనం బొనరించి తరించు నక్కటా! 8

ఉ. ఎక్కడి దీలతాంగి సుతుఁ డెవ్వఁడు వీరికి నీకు నెవ్విధిన్
జిక్కెను బాంధవం బతివిచిత్రమ యీతగులాట మిందు నీ
వెక్కడినుండి యూడిపడి తెవ్వనివాఁడవు దీనితత్త్వమున్
జక్క నెఱుంగవయ్య సదసత్పరిశోధకబుద్ధియేర్పడన్ 9

శా. సంగత్యాగము కల్గు సజ్జనులతో సాంగత్యమున్ జేయ, ని
స్సంగత్వంబునఁ జేసి మోహము వినాశంబందు, నిర్మోహతన్
భంగంబున్ గనఁబోనితత్త్వ మది సంప్రాప్తించు, నద్దానిచే
వంగైకోలొనరింతు రుత్తములు జీవన్ముక్తి సాహిత్యమున్. 10

ఉ. కాయపటుత్వమెల్లఁ జెడఁ గామవికార మదెట్టులుండుఁ? బా
నీయము వట్టిపోవుతటినిన్ జెరువన్న దిఁకేదనుందు? నా
దాయమడంగ భృత్యసముదాయము నిల్చునె? తత్త్వ మబ్బుచోఁ
బాయక యున్నె సంసరణబంధము లాపదనీకబీజముల్. 11

ఉ. భోగము భాగ్యమున్ సతులు పుత్త్రులు ప్రాయము నిత్యమంచునీ
వీగతి మోసపోకు, మివియెల్ల హుళక్కి యటంచు వీనిపై
రాగము మాని, విశ్వపరిరక్షకు నక్షయసౌఖ్యదాయకున్
బాగుగ నమ్మి, తత్పథము పట్టు, మసారవిచార మేటికిన్? 12

చ. శిశిరవసంతముల్ మొద లశేషఋతుల్ మఱి సందెవేకువల్
నిశలు పవళ్ళు పర్వులిడ నీబ్రదుకంతయుఁ జెల్లెఁ గాని యో
కృశమతి! నిన్నుఁ గ్రమ్ముకొని క్రిందికి మీఁదికి లాగునేమి నీ
వశమున కింత లోపడక వాంఛలు దుస్పృహధాటి నేఁటికిన్. 13

మ. వనితాకాంచనచింత నిచ్చలు నిషేవ్యంబాయె నౌరౌర! దీ
నిని మానందగు నంచు నింతదనుకన్ నీ కెవ్వరుం జెప్పరో
ఘనసంసారసముద్రవీచిఁ గడవంగన్ లోకముల్ మూఁట స
జ్జనసాంగత్య మొకండె నావ యగుచున్ సాయంబు సేయుంజుమీ! 14

ఉ. కావిమెఱుంగువేసములు కట్టి జటాలురు బోడు లెందఱో
క్ష్మావలయంబునం గలరు కాని గిరుల్ పరమాణుమూర్తులున్
దావులుగా వెలుంగుపరతత్త్వము గాంచిరె పొట్టకూటికై
యీవిధి దంభవేషముల నెత్తెడిశుంఠలు దాని కర్హులా. 15

చ. ముడుతలువాఱె మేను, శిరమున్ నెరసెన్, బదునాఱుదంతముల్
విడివడిపోవఁగా, మొగము వెల్తిపడెన్, శతవృద్ధుఁడౌటచే
నడుగిడలేక దండ మొకఁ దానెఁ గరమ్మున నూఁతకోలగా
విడువఁడు తృష్ణ నిప్పటికి వెంగలిమానిసి నేమి సెప్పెదన్. 16

చ. అనయము వ్రేల్చు నాతఁడు హుతాశనుఁ జండమయూఖతాపరా
శిని బవలెల్లఁ గ్రాఁగును నిశీథమునం జుబుకంబు జానులం
దునిచియ నిద్రపోవుఁ గరయుగ్మమునం దినుభిక్ష, చెట్టునీ
డను వసియించు నిట్లయి విడం దొకతృష్ణనుమాత్ర మేలొకో. 17

శా. గంగాసాగరయాత్రలన్ సలిపినన్, గాంగేయదానంబు లు
ప్పొంగన్ సజ్జనకోటి కిచ్చిన, వ్రతంబుల్ పెక్కు సాగించినన్,
సాంగోపాంగముగా శ్రుతిస్మృతులయభ్యాసంబు నార్జించినన్,
సంగుండేగతి నందుకోఁగలఁడు మోక్షశ్రీకటాక్షంబులన్. 18

చ. గుదులను జెట్లనీడలను గూడుచు, నేలను బవ్వళించుచున్,
దడసరితోలు గట్టి, వనితా ధన దాస తురంగ లబ్ధికై
బడలుటలేక భోగములపై మదినిల్ప కెవండు తత్త్వమే
ర్పడఁ బరికించు, వానికి విరాగ మొసంగుసుఖం బలంతియే. 19

ఉ. యోగసమాశ్రితుం డయిన, నుత్తమభోగనిధానుఁ డైనఁ, దా
రాగవిహీనుఁ డైన, ఘనరాగపరీవృతుఁ డైన, నిత్య మ
య్యాగమవేద్యు సర్వజగదాద్యు ననంతు నకల్మషున్ బరున్
బాగుగఁ జిత్తమం దిడిన బ్రహ్మపదంబును జేరకుండునే. 20

ఉ. గీతలలోపలన్ వెలయుకీలు నెఱింగినవాఁడు స్వర్ధునీ
పూతజలంబు త్రావినసుపుణ్యుఁడు కేశవనామకీర్తన
ప్రీతుఁడు ప్రేతనాయకుని భీషణముద్గరముం దలంచి లో
భీతిలనేల దండధరుబింకము సాగునె వానిముంగడన్. 21

చ. పలుమఱు జన్మమెత్తుటయుఁ, బల్మఱుచచ్చుట, మాతృకుక్షిలో
పలఁ బలమాఱుసొచ్చుటయుఁ, బాపవుసంసృతిచే నగుం గదా
తెలియుము, కర్మబంధములఁ ద్రెంచి, సుఖించుపథంబు; దీనికై
వలసినమేలివెల్గు సిరివల్లభుసేవయపో త్రిశుద్ధిగన్. 22

ఉ. యోగనిబద్ధచిత్తుఁడగు యోగివరేణ్యుఁడు సందుగొందులన్
మూఁగినరిత్తపేలికల బొంతలుగుట్టుచుఁ బుణ్యదుష్కృత
త్యాగమొనర్చి బాలునివిధంబునఁ జిత్తవికారికైవడిన్
వీఁగనివేడ్కలో మునుకవేయుచు నిర్మముఁడై రమించెడిన్. 23

ఉ. ఎవ్వఁడవీవు? నేనెవఁడ? నిచ్చటి కెచ్చటినుండిరాక? యీ
యవ్వయు నయ్య యెవ్వ? రనినప్పుడు సంసృతి స్వప్నతుల్యమై
నివ్వెఱఁగున్ ఘటించుటది నిక్కమ కానఁ దదీయబంధముల్
త్రెవ్వఁగనేసి యున్మిషితధీనిలయుండవు గమ్ము తమ్ముఁడా! 24

ఉ. అందఱలోపలన్ వెలయునట్టిమహాత్ముఁడు విష్ణువొండ యీ
చందమెఱింగి భేదములఁజంపుము భూతదయామయుండవై
పొందుము మోక్షసౌఖ్యములఁ బుట్టుట గిట్టుట కట్టిపెట్టు మో
మందుఁడ నీవు నే ననెడుమచ్చర మేటికి మాటిమాటికిన్. 25

ఉ. లోపలిశత్రుషట్కమును లోఁచినవాఁ డపరోక్షబుద్ధికిన్
బ్రాపయి తన్నుఁ దానెఱుఁగు బ్రహ్మముఁగా నవికారమూర్తిఁగా,
నేపళు వాత్మతత్త్వ మది యించుకయే నెఱుగం దతం డిసీ
పాపగృహంబు సంసృతికిఁ బాల్పడి నారకవహ్ని బ్రమగ్గెడిన్. 26

శా. గీతానామసహస్రమున్ నిరతమున్ గీర్తింపుమా, శ్రీపతిన్
జేతోవీధి నఖండభ క్తివెలయన్ సేవింపుమా సజ్జన
వ్రాతస్నేహ మొనర్చి, పూతమతివై వర్ధిల్లుమా విత్తపుం
జాఁతుల్ త్రవ్వి దయానికేతనుఁడవై పాలింపుమా పేదలన్. 27

30-5-23



# సేవాధర్మము

(కాళిదాసు ననుసరించి)

దిలీపుఁడు వసిష్ఠుంజేరి తన యనపత్యతకు వగవ, నా ఋషీంద్రుఁ డతని నోదార్చి "నా హోమధేనువును నందినిని బూజింపు - మదియ నీ యీప్సితంబు నొసంగు" - ననవుడు మహీపాలుఁ డా మొదవును భక్తిమై సేవింపఁజొగె - నొక్కనాఁ డా గిడ్డి నడవికిఁ దోలుకొని పోయిన -

చ. మనుజవిభుండు దుష్టమృగమండలి కాఁబసినీడ నేనియుం
జెనకుట దుశ్శకంబనుచుఁ జిత్తమునం దలపోసి చెంగటం
దనరు మహీధ్రమౌళి సముదంచితశోభలు కాంచువేళ నే
పునఁ జనుదెంచి పై దుమికి బోరననీడ్చె మృగేంద్ర మగ్గవిన్. 1

ఆ. గుహలు మాఱుసెలఁగ గోవప్పుడఱచిన, యార్పు దీనబంధువగు నృపాలు
శైలసక్తదృష్టి సరగమరల్చెఁ బ, గ్గాలఁబట్టి యీడ్చుకరణి తోఁప. 2

గీ. ధాతుమయమైన కొండనెత్తమ్మునందుఁ, బూచియేచిన లొద్దుగుపోల్కి నెట్టిఁ
దనము నెగఁజిమ్ము కుత్తిపై దాండవించు, తెల్లమెకమునుగాంచె నవ్విల్లుదాల్పు. 3

ఉ. అంత మృగేంద్రగామియు జితారియు నార్తశరణ్యుఁడైన భూ
కాంతుఁడు స్వప్రమాదమునఁ గల్గినచెట్టకు సిగ్గుచెంది దు
స్స్వాంతము వధ్యమైన మృగవల్లభముం దెగటార్పఁగా నిషం
గాంతర శస్త్రమున్ దివియ నాసపడె న్గదు నల్కతొల్కఁగన్. 4

గీ. చిత్తరువునందు దిద్దితీర్చిన విధానఁ, గదలదయ్యె నవ్వీరునికరము నఖర
కాంతినికరఫరిచ్ఛన్న కంకపత్ర, శరశిరోబాంధవత్యాగసహము గాక. 5

గీ. తన కరంబట్టు మ్రోదువాతిన వివృద్ధ, రోషఁ దారాజు మాంత్రికరుద్ధవీర్య
భోగియై చెంతఁగల మార్తుఁ బొదువలేని, తన ప్రతాపమ్ముచే లోనఁ దగులఁబడియె. 6

క. తనయున్కికి వెఱఁగందెడు, మనుకులమణి సింహసత్త్వ మాన్యుని గని యి
ట్లనెఁ గేసరి నరభాషల, జనపాలుఁ దవేలచిత్రచకితుఁడు గాఁగన్. 7

ఉ. ఏల వృథాశ్రమించెదు సరేశ్వర! నీ విశిఖంబు వచ్చియున్
జాలదు నన్నుఁగూల్ప నిది సత్యమ యంబరచుంబిపాదపో
న్మూలన కౌశలమ్మునకు నోఁచిన మారుతుఁ డెంత నిక్కినన్
శైలమునూఁపునా విమతసార మెఱుంగక విక్రమింతువా. 8

గీ. శివుఁడు రజతాచలంబు నాఁ జెలఁగు నాము, టెద్దు నెక్కుచుఁ బాదంబు నింతమోపి
దయఁ బవిత్రమొనర్చు నీ దాసునదుము, నధిప! నన్నుఁ గుంభోదరుఁ దంద్రు జనులు. 9

ఆ. శివుఁడు ముద్దుసేయు చిన్నారిపాప యీ, దేవదారు; వభవుదేవి దీనిఁ
బెనిచె మేల్మి పసిఁడి బిందెలతోడఁ దె, చ్చినపయస్సువోసి చిన్ననాఁడు. 10

క. చెక్కిటి తీఁట నడంపఁగ, నొక్క వనేభంబు రుద్దె నొకపరి దీనిన్
రక్కసిములు్మలఁ జిక్కిన, యక్కొమరుంగూర్చివోలె నపు డుమ వగచెన్. 11

చ. అదిమొదలోన్నృపాల! వనహస్తి భయంపడ నన్ను సింగపుం
గొదమనుచేసి యీతుహిన గోత్ర గుహాగృహవాస మిచ్చి నన్
గదిసెడి సత్త్వకోటి నెరగా నియమించెఁ బినాకపాణి య
మ్మొదలఁ దలన్ ధరించి సతమున్నెఱవేర్తు మదీయధర్మమున్. 12

గీ శంభు నిర్దిష్ట భోజనసమయమగుచు, నాకుఁ జిక్కిన యీ కుత్తినెల్లఁ జేసి
క్షుధితుఁదగు రాహు వైందవసుధనుబోలెఁ, దనివిసెందెద నేఁడు గోత్రాకళత్ర! 13

గీ. శస్త్రసాధ్యంబుగాని రక్ష్యమును విడువఁ, దలఁగిపోవునొకో ధనుర్ధరుల కీర్తి
యొపిన కొలంది గురుభక్తి చూపినట్టి, నీకు సిగ్గేల యింకబొమ్ము నెలవుసేర 14

క. మృగరా జిట్లు వచించిన, ప్రగల్భవాక్యములు విని నృపాలుండు నిజా
శుగ మిట్లడఁగుట శివుచే, తఁ గదాయని విడిచె నాత్మఁదగిలిన రీథన్. 15

గీ. అతఁడు బాణప్రయోగభగ్నాదిమప్ర, యత్నుఁడై కులిశంబునేయం గడంగి
నాఁడు ముక్కంటిచూపుచే మ్రోడువాఱు, నింద్రుబలె నిల్చి కేసరి నిట్లుపలికె. 16

క. సింగమ! విను మిబ్భంగిని, భంగంపడినట్టి యేను బల్కెడినుడి న
వ్వంగఁ దగినదియ; యైనఁ బ, రేంగిత మీ వెఱుఁగుదానవే యని వినుతున్. 17

ఆ. జగములెల్లనేలు చంద్రమశ్భూదుఁడో, యన్న! నాకుఁ బూజ్యుఁడగును గాని
యాహితాగ్ని గురుని యా విట్లుత్రుంగుచు, నెదుటనుంటసూచి యెట్లు సైఁతు.  18

గీ. అట్లగుట నీవు నా దేహ మారగించి, యాఁకటిం బాపికొమ్ము; సాయంతనమున
కమ్మకొఱకు నంబాయని యఱచు లేఁగఁ, దలఁచి వీడుము ఋషికులోత్తమునిసురభి.

క. ఒదయని యీపల్కులు విని, పదఁకులచీకటులు తొలఁగఁబాఱ న్నగి య
వ్వెదఁదమొగంపు మెకం బీ, వదువున వాక్రుచ్చె నవనివల్లభుతోడన్. 20

ఆ. ఎదురుగొడుగులేని యేలికతనమును, గ్రొత్తజవ్వనంబు గొనబుమేని
నల్పమైన లాభ మాసించి విడిచెద, వెంత మూఢబుద్ధి వీవు నృపతి! 21

గీ. భూతదయ నీకుఁ గలదేని జేతమందు, నరయు మీపల్కు; నీవు మైఁ దొరఁగ నొక్క
మొదవె జీవించు నటుగాక బ్రదుకుదేని, జనకువలె నెల్ల ప్రాణుల సాఁకనోర్తు. 22

గీ. గురుఁడు శిఖితుల్యుఁ డతని కొక్కొండె మొదవు, దాని విడిచిన నతనిశాపానఁ బడుదు
నంచు వెఱచెదె తద్రోషమార్పుపొంటె, నీకు మందలు లేవె దుగ్ధాకరములు. 23

గీ. అట్లగుట నెల్లశుభముల ననుభవించు, నీ బలిష్ఠశరీరంబు నిలిపికొమ్ము
మనుజనాథ! భూస్పర్శనమాత్రభిన్న, శాతమన్యవపదము రాజ్యం బనంగ. 24

గీ. సింగ మిటుపల్కి విరమింప శీతగిరియు, జనవరేణ్యున కట్ల యుచ్చైస్స్వనమునఁ
జెప్పెనో యనఁ గందరాసీమవలన, మూరిబోవుచు వెల్వెడె మాఱుమ్రోఁత. 25

క. శివకింకరుఁ డిట్లన మా, నవనాథుఁడు భీతలోచనమ్ములతోఁ ద
న్నవలోకించెడి గురుధే, నువుపైఁ గడు జాలి నొంది నుడివె మృగుడన్. 26

క. క్షత్రపదమ్ము గదా మద్, గోత్రమ్మునపేరు; దీని గుట్టెఱిఁగియు నా
వీ త్రోవ నుండ విడిచి ధ, రిత్రీ రాజ్యంబు నెటు వరింతు మృగేంద్రా! 27

గీ. లాఁతిమొదవుల నొసఁగి యేరీతిఁ దబిసి, మంట చల్లార్తు నిది వేల్పుదంటగిడ్డి
కంటె వెల్తిదిగాదు ముక్కంటికరుణ, యుంట నీ తొడుకుం బట్టుకొంటి వీవు. 28

క. నా యొదలి న్వెలగా నిడి, యీ యావుం బ్రోచుటొప్పు నిటు లొనరింపన్
నీ యశనా ర్తిచను న్మని, రాయని హోమాదివిధుల రాయిడి తొలఁగున్. 29

గీ. రక్ష్యమును మిత్తికిడి శరీరంబు గాయ, పదని సేవకుఁ డెటు నిల్చుఁ బ్రభువు నెదుట
నీవు నొకయయ్యకదఁ గొల్పు నెఱపపోటు, లేదె నీకును నా కావులీల మ్రాఁకు. 30

గీ. ఏ నవధ్యుఁడ నని యెంతువేని మ ద్య, శోంగరక్షణ సేయు మీ యంగ మంది
బుద్బుదప్రాయమును బంచభూతమయము నైన మేనిపై మముబోఁటు లాసపడరు. 31

ఆ. మాటలాడికొంట మైత్రికి మూల మా, మైత్రి పాదుకొనియె మనకు నిచటఁ
గాన మిత్రుకోరికను జిన్నపుచ్చుట, నీకుఁ దగదు భూతనేత్రదాస! 32

గీ. అనుడు నుప్పొంగి విడిచె సింహంబు కుత్తి, నపుద నృపబాహునిర్బంధ మడఁగె-నంత
ముక్తశస్త్రుఁడు నిజదేహమును మృగేంద్ర, మున కొసఁగె రాజు మాంసంపుముద్దఁబోలె

గీ. అపు దధోముఖుఁడై నరేంద్రాగ్రసరుఁడు, ఘోరసింహనిపాతమ్ముకొఱకు నెదురు
సూచుచుండఁగ నతనిపై నేచి కురిసె, నమరహస్త విముక్త లతాంత వృష్టి 34

గీ. అంత లేవఁగదోయివత్సా యటంచు, నమృతమయి వాణి చెవిసోఁక నవనిభర్త
లేచి పొల్చేపి తన తల్లిలీల నున్న, సురభిఁ గనె మ్రోల సింగంబు సురిఁగిపోయె 35

ఉ. ఎంతయు నబ్బురంపడు నరేంద్రునకిట్టులు పల్కు గోవు నీ
స్వాంత మెఱుంగ సాధుజనసత్తమ! సింగమనైతి నేన న
న్నంతకుఁడేని దాయ భయమందు ఋషీంద్రుని శ క్తి నేన నిం
కెంత తదన్యఘాతుకము; లించుక నీవ తలంచి చూడుమా 36

క. నీ దయకును గురుభక్తికి, నాదగు హృది పల్లవించినది దుగ్ధంబే
కా దెట్టి కోర్కినేనియు, నీఁదగుదుఁ బ్రసన్ననైన నేను గుమారా! 37

చ. పదపడి మానితార్థి నిజబాహుసమార్జిత వీరశబ్దుఁడై
పొదలిన యవ్విభుండు కరము ల్మకుళించి కులాభివర్ధనున్
సదమల నిత్యకీ ర్తివిలసచ్చరితున్ సుతు నిమ్మటంచు న
మ్మొదవును వేఁడె నేఁడువ్రతముల్ ఫలియించెనటంచు నుబ్బుచున్ 38

క. మెచ్చితిఁ గుమార! నీ వర, మిచ్చితి నని పల్కి ధేను విదె త్రావుము నా
వెచ్చని పాలని మేలని, సచ్చరితున కానతిచ్చె జనపాలునకున్ 39

# అవివేకము

చ. నుడువక మాను టెట్టులు తెనుంగునపుస్తక మచ్చుకూటపుం
గడపను దాఁటుచుండఁగనె కట్టలు కట్టలు ముష్టిజాబు లీ
యడిగెడువారు గ్రంథనిలయంబుల నేలెడుసార్వభౌము లీ
చెడుపని మెచ్చుకున్న వికసింపదఁటే మనబాస లేశమున్. 1

ఉ. ఒక్కవివేకము తఱిఁగియున్నది గాని తెలుంగువానిలో
జిక్కదు లౌఖ్య మౌషధముసేయుటకున్; సిగరెట్టుముక్కకే
చెక్కులుమార్చు నాతఁ, డొకచిన్నయెలెక్షనుకాండలో సివం
బెక్కిన వేలువేలు బలియిచ్చును బుచ్చినవక్కలట్టులన్. 2

చ. కవులఁ గలంచుమార్గ మది కాదు తదీయకటాక్షసంపదల్
లవమును లేనినాఁడు శుభలక్షణముల్ పదిలక్ష లుండుఁ గా
కెవఁడు గడించుఁ గీర్తి గడియించెనపో మఖఁ బుట్టి పుబ్బలో
సవచెడి పోవుఁగాని మనఁజాలునె తా నమరత్వ మేర్పడన్. 3

28-9-38



# కృతమెఱుక

క. ఏఁడాదినాఁటి కథ యిది, నాఁడు పురాపాపఫల మనం దగురుజ కే
నోడి పరిణామశూలకు, గోడు గుడుచుచుంటి నెదురుకొనుచుంటి విధిన్. 1

క. ఏడేండ్లు నన్ను నలిపిన, గాడిద యిది సమసిపోయెఁగా యనుకొంచున్
మూఁడేం డ్లీడ్చితి బుగిలిన, మ్రోడే చివురించి నేఁడు మొగ్గలుతొడిగెన్. 2

క. గుఱితప్పనిపోట్లు తెరల్, తెరలుగ నెసరేఁగు నొప్పి తీవ్రతరంబై
నెఱఁకులు చూడెడిమంటయు, హరిహరి! యీనరక మొల్ల నసుహృత్తునకున్. 3

ఆ. సంధివాతపీడ సరిపోవ దని ఘోర, మూలరోగబాధ చాల దంచు
నిది ప్రయుక్తమయ్యె విధి యింత కఱకరి, వృత్తి నెట్లు వలచె వ్రీడలేక. 4

క. ఆ మం దని యీ మం దని, యేమందుఁ జికిత్స లప్పు డెన్నో నడిచెన్
హేమంబు వినా జాఠర, మామయ మదఁగారదయ్యె నావంతేనిన్. 5

క. వ్యాధులకు ఘనితాతల, కాధులకుం జిక్కి యిర్వదాఱేండ్ల మహా
బాధలు గుడిచితి నిస్సీ, మాధుర్యలవమ్ము లేని మనుగడ గంటిన్. 6

క. దేశంబులు తిరిగితినా, యాశంసితమైన భుక్తి నాపోయితినా
దేశికులఁ గొల్చి కవితా, కౌశల్యము గంటినా సుఖం బంటితినా. 7

ఆ. చెలిమికాండ్ర - చుట్టముల - పెండ్లపేద్మల, ననుభవింపఁ గంటినా జగమ్ము
పెద్దపీఁటవైవఁ బిలిచినరచ్చల, కరిగి కరఁగినాఁడనా పొగడ్త. 8

క. ఈ పాటుపోట్ల కగపడి, నా పొందని చెట్టలుండునా జనిరాశిన్
బాపగ్రహమ్ము కేతువు, కాఁపుర మొనరింప నాదుగతి వేఱగునా. 9

క. అవిరతచింతావశు ననుఁ, గవితాలలితాంగి వలచి కరుణింపనిచో
భవ మిది మఱెంత వ్రేఁగై, నవతాలేశమ్ము లేక నవయించెడిదో. 10

గీ. ప్రాఁబడినపున్నె మింటనో పరమధర్మ, మూర్తి నాతండ్రి యోటనో మూరిఁబోవు
కలిమి నేలెడువారి క్రేగన్ను వలచు, కక్కసము లేమియున్ నన్నుఁ గాచె నింత. 11

క. ప్రకృతమ్మున కిఁక వచ్చెద, నొక మిత్రుఁడు నా లిఖించు నుత్తరమున మా
మక మీ తెవులుం గనుఁగొని, వికలాత్ముఁ దవార్యహార్దవేల్లితుఁ దగుచున్. 12

క. "ఏలా భేషజ మలమట, పాలై రేలుం బవళ్ళు పనవుట మేలా
హేలగదా గోదుమ కీ, శూలాహంకార మాఱఁజూచుట యన్నన్. 13

క. క్షారామ్లము లుడుఁగుము గో, క్షీరంబులు క్రోలు మిదియె సిద్ధౌషధమై
నీ రుగ్భరమ్ము డించు న, పార మనామయము నగ్గపఱుచున్ నీకున్" 14

ఆ. అనుచుఁ గమ్మనంప నాతఁ డాయుర్వేద, వేత్త యగుట వాని యుత్తరంబు
నాదరించి నాఁడె గోదుమ లార్జింపఁ, గడఁగి హట్టమెల్ల నడిగినాఁడ. 15

క. ధరణీఖండము లన్నిట, విరిసి విలయతాండవంబు వెలయించెడు దు
ర్భర సంగ్రామము దెచ్చిన, కఱవున సుమనమ్ములేద క్రయ్యం బచటన్. 16

క. కర్తవ్య మేమి యిఁక నీ, యార్తిం దరియించు టెట్టు లని యెంచునెడన్
*మూర్తిపురి నది ఫలించిన, వార్తన్ హితుఁ డొండు వినిచె వనటం దొలఁచెన్. 17

* భట్టుమూర్తి

ఆ. పిలిచి పంపవయ్య వెలకేమి గోదుమల్, కాకుమానిలోనఁ గలవఁ టంచు
నప్పికట్ల నున్నయనుఁగు కుఱ్ఱసుబ్బ, రాయకవికి లేఖ వ్రాసినాఁడ. 18

క. *నా యన్నినుండి యచటికిఁ, బోయెడు మోటారు నెక్కిపోవు పథికుచే
నీ యుత్తర మిడ ఘట్టము, దాయం జని కొంతతడ వట న్నిలఁబడితిన్. 19

గీ. అంత గునగున గర్తపుర్యాశనుండి, చిన్నకా రొండు వచ్చి నా యున్న చోట
నాఁగె నది *మృగయాపల్లి కేగు టెఱిఁగి, కమ్మ నిచ్చితి నందున్న కర్షకునకు. 20

క. మఱవకు బాబూ! మీ చను, తెరువునఁ గల దప్పికట్ల దీని నచట నె
వ్వరి కిచ్చినఁ జాలు నను, స్మరణం బని సేరికొంటి సదనంబునకున్. 21

క. ఆసమెయిన్ మఱుసటి నాఁ, దాసాయము కాచుచుంటి నా సాయమ్ముకై
నా సంకటపా టింతల, కోసరునా యంచు సెజ్జ నొదిఁగిలఁ బడితిన్. 22

క. మెలివేయు కడుపునొప్పికి, విల విల పోవుచుఁ గసాయివిధి దూఱుచు బి
డ్డలఁ జూచి వెచ్చనూర్పుచు, నలందురుచు నుండ నక్త మర్థము కడచెన్. 23

క. తలవాకిట నపు డెవరో, నిలిచి ననుం బిలుచునట్టి నినదము వెడలెన్
మెలమెల్లన పర్యంకము, వలనన్ డిగి వచ్చి యెవరువా రని యంటిన్. 24

గీ. తిల్లికనుబెంచి వాకిలి తెఱచి నిలిచి, లేఁతజాబిల్లి జిగిఁ బుక్కిలించి యుమియు
కదరువల్వాల కొకవింతకాంతి నొసఁగు, నగుమొగమువానిఁ గంటి న స్గదియువాని. 25

క. ఇతఁ డెవ్వఁడు ననుఁ బిల్వం, గతమేమి యంచు నైకగతులన్ జనితిన్
నతులు కవీంద్రుల కని విన, మితుఁడై యతఁ డిట్లు పల్కె మృదువాక్స్ఫురణిన్. 26

క. చౌదరిగారూ! తమ కా, పాదించితి నోవి నిద్రపట్టినవేళన్
నాదెస మన్నన చూపుఁడు, మీ దర్శన మౌట నధిగమించితి ముదమున్. 27

క. మీ బాధ యెట్టు లున్నది, బాబూ! జఠరార్తి కగ్గపడితిరె విధి మీ
కీబెడఁద గూర్చి పై వడె, నాఁబోతుం జేసి మురియు నది కట్టఱవన్. 28

క. ఇవి గోదుమ లవి మిమ్మున్, నవయించెడు తెవులు నణఁచెనా రుగ్ణుఁడు స
త్కవి కింత మే లొదవె నని, మివులం దనివోదు మాప్తమిత్రులతోడన్. 29

---

* అప్పటి నాయున్కి నిడుఁబ్రోలు వేఁటపాలెము

క. అని చేతిమూట నా ముం, దునిచిన నత్యద్భుతం బహో! యే మిది యీ
నను మెచ్చు గఱువచరితం, బనఁ గీదృశ మంచు నెదఁద హాళహాళి వదుచున్. 30

క. ఏ నాతని కిటు లాడితి, మీనామం బేమి యేది మీయున్కి యగున్
గ్లానుం డితఁ దే(క్రియ మీ, మానసమున కంటె గోదుమ ల్గానితేరన్. 31

ఆ. ఇం(ద్రజాల మాయె నీ కథ నా పాలఁ, గలయె నిక్కువంబొ కాననైతిఁ
దెలుపుఁదయ్య నన్నుఁ గలరూపు వక్కణ, చేసి యనుడుఁ దనకు దాసి యతఁడు. 32

గీ. అప్పికట్లకు నిన్న మీ రనుచునట్టి, కమ్మ నందినవారు మా కారువారె
దారిలో దాని విచ్చిన నేర మొందు, కలదు మాపట్ల సైరింపవలయు మీరు. 33

క. *మీ కృతిని దానయాఖ్యుఁడు, స్వీకృతి గావించునెద రచించిన కవనం
బా కమ్మకు వెలుపల మధు, రాకృతిమై మెఱయుచున్నయది ము(ద్రితమై. 34

క. ఆపద్యంబులపైఁ గల, తీపియ మ మ్మింతదనుకఁ దెచ్చెను వానన్
మీ పొలకువ గని లేఖయు, మీ పంచిన దగు నటంచు మే మారయుచున్. 35

క. మీ రచనమ్ముదెసం గల, గారవమునఁ జేసి తగవు గాకున్నను బ
ల్మా అది చదివితి మెఱిఁగితి, మాఱని గోరంబు మిమ్ము నలఁచుట సుకవీ! 36

క. జాతికిఁ (బాణము వోసిన కైతను సృష్టించినట్టి కవితల్లజుఁ డీ
రీతిం గుములునె దైవం, బేత(త్కియ కెట్టు లోర్చె నిసిరో యంచున్. 37

క. మాసాహు సాహితీ కవి, తా సంగీత (ప్రియుం డుదారాశయుఁ డాం
(ధ్రీ సంతత సేవా(వ్రత, వాసజ్జీవితుఁడు పెద్దవనటం దగిలెన్. 38

క. కవి బుధ గాయక గోష్ఠీ, భవితవ్యసమాత్తహర్ష పరవశుఁ దగుచున్
దినములు రా(త్రులు రసిక, (ప్రవరుం దతఁ డొక్కలిప్త పగిదిన్ గడపున్. 39

క. మీ కృతులు పతి(వ్రత లని, మీ కవితా(పౌఢి నిరుపమేయం బని మీ
వాకు లవి బాఁకు లని మీ, పోకద నార్జవము ననయుఁబో! యని మెచ్చున్. 40

క. మెచ్చునివాఁ డెవ్వఁడు కలఁ, దచ్చపు టొయ్యారమునకు నాదరువై వె
ల్గిచ్చిన మీ కృతి-నీర్ష్యకు, మచ్చరమున కంజలించు మానిసి తక్కన్. 41

* ధర్మజ్యోతి

మ. మఱుమ్రోయు స్గద తెల్గువీణియల యుష్మద్రాష్ట్రగానమ్ము మీ
కొరడాదెబ్బకు దద్దఱిల్లిపడి తెల్గుల్ మేలుకొన్నా రహో!
పురుషోత్తంసు కథన్ రచించితిరి మా పుణ్యాలకుం బంటఁగా
మఱవంజాలరు మీరు దేశమును ధర్మంబున్ గవిగ్రామణీ! 42

ఆ. పరులసిరుల కాసపడి కైత కొగ్గరు, పరమధర్మసేవ మరగి కాక
జగము పల్లుపులిసి సొగసెంబో కృతు లిచ్చు, పట్ల మీ వెలార్పు పాడి నరసి 43

గీ. గర్తపురి నుండు మేము సత్కీర్తి గన్న, మద్దివంశమునం బుట్టె మా వణిక్కు
అతఁడు వేంకటసుబ్బరా వనెడు పేర, జేర మొనరించు నెల్లసర్కారులందు 44

గీ. నన్ను, రాజయ్య యంద్రు ప్రాణమ్మువోలె, నుండు నాతని సరస మిత్రుండ నగుచు
రాణకెక్కిన మాధవరడ్డి వంశ, మస్మదీయమ్ము వలతుఁ గవ్యర్చ సతము 45

ఆ. ఇచటు వీడి నిన్న యే మప్పికట్లలోఁ, బత్ర మిచ్చి వేఁటపాలె మేగి
వలయుపనులు సూచి వర్జీనియా పొగా, కచటి తిమ్మసంద్రమందు విలిచి 46

చ. మది నొకమూల దాఁగిమము మాటికి మాటికి హెచ్చరించు మీ
వ్యథను దలంచి గోదుమలు పండినవా యిట నంచుఁ గాఁపులం
బదుగురఁ బల్కి వాని నొకపట్టునఁ గాంచి సుమేరుపాదముం
గదిసినయట్ల హర్షణము గంటిమి కొంటిమి నేఁటిమాపటన్ 47

గీ. ఇపుడ కొనిపోయి సుమనమ్ము నిచ్చి రమ్ము, కస్తి నున్నారు చౌదరిగా రటంచు
బచ్చుతేఁ దంద నిలిచి కా రిచ్చి నన్నుఁ, దఱుమ నిటు వచ్చితిం గవితాతపస్వి 48

గీ. కవులు మిముఁబోనివారు సంఘమునకెల్ల, నర్హణీయులు నిలువేల్పు లగుటఁ జేసి
చంద్రునకు నూలిపో గన్నచంద మరసి, యిచ్చు నుడుగర దీని గ్రహింపరయ్య 49

గీ. అనుదు నివ్వెరపడి తేఱుకొని యుదారు, లెంద ఱున్నా రకారణబంధువులు భ
వాదృశులు కవితాకలాప్రవణు లిట్టి, మీకుఁ జెల్లింతు మన్ననోవాకశతము 50

క. గాలించియు నొకరూకకు, సోలెఁడు గోదుమలుకల్మి చూడని యీ దు
ష్కాలమ్మునఁ బదిసేరులు, నాలోఁగిట గ్రుమ్మరించినారా యవురా 51

గీ. మద్దివారికి సిరులలో నుద్దిలేని, వారి కిది భ్రాంతి గాకపోవచ్చుఁ గాని
యదుగకయ మున్న పంపినయట్టియీవి, కెంచి వెలకట్ట నోపువాఁ డెవఁడు గలఁడు?

ఆ. వానిజీవనమ్ము వంధ్య మా జంతువు, కలిమి రిత్త యతనితెలివి చెత్త
క స్తి నున్నవారిఁ గని విని యెవ్వాఁడు, వెన్న కన్నయై ద్రవింపకుండు 53

సీ. నెల యేల యల్లు వెన్నెలతీవపందిళ్ళు, రవి యేల పఱపు నాఱని వెలుంగు
పిక మేల క్రోల్చుఁ దేనెకుఁదేనె యగుపాట, ఘనుఁ దేల చల్లు ముక్కారుజల్లు
విరి యేల పంచు మైమఱపించు నెత్తావి, ధ్రమా నేలకాచుఁ గమ్మనిఫలంబు
కవి యేల పల్కుఁ జక్కఁదనాల కబ్బమ్ము, గా ద్పేల విసరు లోకము చివుర్పఁ
ఆ. గోరువారిదెసన కురిసిరా యీ మేలు, మెఱల నేమి కొంచెపఱిచినారె
సాధుశీలురకు నిసర్గ మభ్యర్థితుల్, గాకమున్న తనివి కలుగఁజేఁత 54

క. ఈ ఋణము నీఁగరానిది, మీ రమణీయాశయమ్ము మీఁగడకంటెన్
దేఱిన కీ ర్తిస్ఫూర్తికిఁ, గారణమై సభల మెప్పుగనునట్టి దగున్ 55

క. ఏ కవనమ్మున మీరలు, నాకవన మ్మగుచు నిట్లు ననుఁ దన్పితి రా
నాకవనం బిది కూర్మిం, జేకొనుఁడీ నెనరుపాలిచిన్నెగ నిత్తున్ 56

గీ. అని వచించుచు నస్మదీయమ్ము లయిన, కృతులు సుకృతికి మాధవరెడ్డివంశ
వనధిరాజున కర్పించి వినయపూర్వ, కాంజలులు మద్ది సుబ్బారాయనికిఁ బల్క 57

చ. ఇది కొసరాజువృద్ధు జగదీద్యగుణోదయుఁ దేలు శీలసం
పద గల గుచ్ఛమా పఱిగపంట యనం దగుకావ్యమా సుధా
సదనము నీ రొసంగినప్రసాదము నీపఱిగన్ భజించి పెం
చెద నిఁకఁ బుట్టుపుట్టు కవిసింహ! సమున్నతభావరత్నముల్ 58

గీ. అని వినీతుఁడు రాజయాహ్వయుఁడు శబ్ద, మాధురీ సాధురీతులు మల్లడింపఁ
బలుకరించుచు విశ్లేషభరము సైఁప, లేకసైఁచుచు వేఁటపాలెమున కరిగె 59

క. అపకారము దిగ్రమింగుట, యుపకృతి బాహిరముసేఁత యుచితం బని ధీ
నిపుణులు సెప్పుట వాణీ, కృప నీకథ కక్షరత్వ మీయంగంటిన్ 60

క. కావించుమేలు మఱచెడు, దేవానాంప్రియుల కవమధీబద్ధుల కీ
త్రోవ భయప్రీడా స, ద్భావశ్రీజనక మొజ్జబంతియు నగుతన్ 61

ఆ. జయ మొసంగుఁ గాత సర్వదా శారదా, పాద కటకనాద సాధుమాధు
రీ ఝరీ ప్రసూ వరీయోంధ్రకవితా మ, హోవిధాతృ పూజనోత్సుకులకు 62

27-1-46



# తపస్సిద్ధి

## నివేదనము

తెలుఁగువారి యౌచిత్య రాసిక్యము లిటీవల వెల్లివిరిసి కనకాభిషేకాదులతో నన్ను నిడుఁబ్రోలిలో సత్కరించుట జగ మెఱింగిన వార్తకదా!

ఆనాఁటి (29–1–49) మహాపరిషత్తులో, ఆ యపూర్వ దృశ్యములో, ఆ మధుర మధుర సన్నివేశములలో, ఆ సమ్మానస్వీకృతిలో, నాహృదయము నుండి పొంగిపొరలి జాల్వాఱిన రసోద్రిక్త భావనాశిల్పమే యీకావ్యము.

కృతజ్ఞతాబద్ధమైన డెందముతో, భక్తి సంపన్నమైన కైమోడ్పుతో, దీని నాంధ్ర భారతీ చరణపీఠికపై నొక పూజాపుష్పముగా సమర్పించుకొనుచున్నాఁడను

విధేయుఁడు
**తుమ్మల సీతారామమూర్తి చౌదరి**

# తపస్సిద్ధి

మ. తెలుఁగుందేవతలెల్ల వచ్చి నిడుఁద్రోల్ తీర్థమ్ముగామాఱె నా
తెలుఁగుంగొల్వున కాటపట్టయిన యీ దేశమ్ములో, సాధ్వియౌ
తలి జన్మించినగడ్డలో జయజయ ధ్వానమ్ములం గంటి నా
తొలినోముల్ ఫలియించెనేఁడు పితృపాదుల్ పెంచుధర్మంబులున్. 1

ఉ. నాజనకుండు పావనగుణ స్తవనీయుఁడు నారయార్యుఁ దే
తేజమునందొ నాదయిన దృష్టికినందక డాఁగియుండఁగా
నాజనయిత్రి నాయెదఁద నమ్మినదేవత చెంచమాంబ యీ
రోజున నాసిరుల్గని విరుల్ కురియించె మదీయ భాగ్యముల్. 2

శా. ఈపుంభావసరస్వతుల్ సుకవిమత్తేభంబు లీకృత్స్ను వి
ద్యాపారంగతు లీజగద్ధితులు సౌహార్దంబు గుప్పించుటన్
నాపాండిత్యము నాకవిత్వమును ధన్యంబయ్యె నివ్వేటిలో
నీపర్వోద్గతి నీసదస్యులకు ముం దే నర్థిమై మ్రొక్కెదన్. 3

శా. ఏ సద్దేశిక సర్వతోముఖకలా హేవాకరోచి స్తతిన్
నాసాహిత్యమెలర్చె నద్రితనయా నాథార్చనాధీనధీ
వాసున్ వాగపరావతారు నతనిన్ వర్ణింతుఁ దాదేపలి
శ్రీసంతత్యుదితున్ గృపాప్పతి నఘుచ్ఛి ద్వేంకటప్పార్యునిన్ 4

శా. రాశీభూతములర్థముల్ తురగముల్ రాజ్యమ్ము లూర్జమ్ము లే
యే శక్తుల్ తనకుండుఁగాక పురుషుం డెవ్వాఁడు రాణించు నీ
యాశీర్వాదము లేనినాఁడు భవదీయాభ్యర్చనాసత్క్రియా
వైశారద్యము రానినాఁడు కవితావాణీరతీ! భారతీ!! 5

శా. నాచిన్నప్పటినుండి నిన్గొలుచుచున్ నానాఁడు నీసేవలో
ధీచైతన్యమునంది దెందమెటు లుద్రేకించి నర్తించు న
వ్వీచీనాదమునన్ శ్రుతిన్గలిపి దేవీ! యాడితిం బాడితిన్
బ్రాచీనాధునికాంధ్రవాఙ్మయ మహా పాథోధిలో నీఁదుచున్ 6

మ. ఎదియో వ్రాసితి నిచ్చవచ్చినది యం దేదోకవిత్వమ్ము నీ
పదమంజీర ఘులంఘులామధురశబ్దస్ఫూర్తి నర్తించుచు
న్నది యంచున్ రసలుబ్ధలోక మిటు లానందించి సంధించు నీ
పదవిం జూచెద నీదువైభవముగా బ్రాహ్మీ! దయాంభోనిధీ! 7

ఉ. రూకలతీపిలో మనుజరూపము గన్నునిశాటు, నుగ్రద
ర్పాకరు; లోకమాన్యపదవీచ్యుతు నెన్నఁడు మెచ్చలేద! య
ఖ్యాఁకలకోడి మైలపడినట్టిపదమ్ముల నంటలేద! త
ల్లీ! కరుణించి నీవిడిన యెల్లయు మల్లియ పోలెఁ బెంచితిన్ 8

చ. కళకొఱకే కవిత్వమని గంతులువేయక, రోఁతరోఁతగా
వలపులునింపి కబ్బములు వ్రాయక, విశ్వజనీన బోద్ధృతా
లలిత, ముదారవృత్తము, కలాకమనీయము, సంస్కృతిప్రభా
మిళితము నైన సృష్టి నెద మెచ్చితి జాతికిఁ గాన్కలిచ్చితిన్ 9

శా. నన్నున్ మించిన సత్కవిప్రభువు లున్నా రెందఱో నేఁడు వి
ద్వన్నాథుల్ మఱియెందఱో కలరు తత్కారుణ్య సంపత్తి యే
మున్నై నిల్చుట నిట్టిగౌరవము నా మూర్ధమ్మునం దాల్చితిన్
పున్నెంబుల్ ఫలియించి వచ్చుటను నీ పూజారినై నిల్చితిన్ 10

ఉ. అంచితు లైనవారు కొనియాడిరి, బంగరుపూలజల్లులో
ముంచిరి, గండపెండియరమున్ ఘటియించిరి, యేన్గుమీఁద నె
క్కించిరి, హైమకంకణము నిచ్చిరి, వేలకొలంది కానుకల్
నించిరి యే వలక్ష్యములు నీ కృప గల్గిన యట్టి వారికిన్ 11

మ. జగదానందక రాప్పికట్ల నగరీ సత్కారపూరమ్మునన్
జిగురెత్తించితి వస్మదీయహృదయ శ్రీకుంజ మానాఁడు నేఁ
డగురా! క్రొవ్విరిగుత్తు లొత్తుకొనఁగా నత్తావు నెత్తావికిన్
జగిలెంజేసితి యుష్మదీయములు వాత్సల్యంబు లేపాటివో! 12

చ. చెళపిళ విశ్వనాథ కవిసింహులు వేలురి వాసిరెడ్డి పె
ద్దలు మఱి బాషువాదికవితల్లజు లుల్లము విచ్చి మాధురీ
కలితకవిత్వముల్ కురిసి కమ్మనిసంపుట మిచ్చి మెచ్చి రీ
కలిమికిఁ జాలునా యితర గౌరవముల్ పదివేలుదక్కినన్ 13

ఉ. ఏనుఁగుమీఁదనెక్కి పురమేగుతతిన్ దెరువెల్లదిక్కులన్
మానవులే! యిదేమి యభిమానమొ! యేమియుదారభావమో!
నానిఖిలమ్ము వీరిచరణమ్ములపై నెపుడుంచి నమ్రతా
స్థానమనై ఋణచ్యుతపదమ్ము గడించెదనో! సరస్వతీ! 14

ఉ. ఏనుఁగునెక్కుటన్న నదియేమొ మదాత్మ 'ససేమిరా'యనెం
గాని సమ స్తధర్మపరిణద్ధమనస్కులు మిత్రు లాప్తులున్
దానికి నొప్పకుంట జనతాకుతుకంబు నవార్యమౌటఁ ద
ల్లీ! నినుఁజేర్చినట్టులె మదేభముమీఁదికి నన్నుఁజేర్చితిన్ 15

చ. మును పాకరాజులే సుకవిముఖ్యులన్ ధనధాన్యవస్తు వా
హనములు కాన్కవెట్టి కవితార్చనసల్పిరి; రాజధర్మముల్
జనులకు సంక్రమించిన ప్రజాయుగ మియ్యదియౌట లోకమే
మునుపడివచ్చి నీకొలువుమోసల నౌదలవంచె భారతీ! 16

మ. తనవాఁ డెంతమనీషియైన, సముదాత్తప్రాభవోపేతుఁ డై
నను మన్నింపఁడు తెన్గువాఁ డనెడి నిందన్‌మోసె నీజాతి; నేఁ
డనవద్యస్థిరభక్తి యోగమున ని న్నర్చించి మెప్పించుటన్
జననీ! యంధ్రసరస్వతీ! తుడిచె మచ్చున్ విశ్వవిఖ్యాతమై 17

ఉ. దేశముకొఱకైబ్రతికి ధ, నాశలు దిగఁద్రావి యెవ్వఁ డంచిత ధర్మా
వేశుండగుకవి, యతఁడె ప్ర, జాశంసాపాత్రుఁడనుట సత్యంబయ్యెన్ 18

ఉ. నాకవనమ్ము రేకులు తనర్చెడి ప్రొద్దుల భారతావనిన్
నాకవనమ్మువోలె సుజనప్రియమంజుల సౌరభమ్మునన్
బ్రాఁకిన గాంధిధర్మ మొకపాటిగఁ బ్రాక్తనపుణ్యముంటచే
నాకు రుచించి తెల్గులకు నన్నొక విందునొనర్చె భారతీ! 19

శా. ఈ సన్మానములోన మైమఱచి యేనేదో యహంకార ధీ
దాసత్వంబున కిచ్చ సేయక జడత్వంబూన కీప్రాణముల్
నీసేవావ్రతదీక్షలో విడుఁతుఁ దల్లీ! త్వత్కృపాసంపదల్
రాసుల్ రాసులు వీనిపైఁ బఱపు మారాధింతు వాగీశ్వరీ! 20

ఉ. ఏను నిమిత్తమాత్రుఁడుగ నింతటిపండువు నీకొనర్చె, నేఁ
డీనిఖిలాంధ్రలోక; మిట నేచిన కావ్యకలానురక్తిఁ ద
ల్లీ! ననువంటి భక్తులు మఱెందఱుపేరనొ త్వన్మహోత్సవ
శ్రీనిచయమ్ము లీ తెలుఁగు సీమ ననంతములై చెలంగుతన్ 21

శా. సాక్షా త్పావకమూర్తి, విశ్వకవితా సౌందర్య రేఖారహో
వీక్షాదక్షమనీషి, మాతృజగతీ విజ్ఞాన పీఠప్రథా
రక్షాశీలుఁడు, కట్టమంచికులమూర్ధన్యుండు, నన్మెచ్చున
ధ్యక్షుండయ్యె, నిఁక కేమికావలయు నంబా! నా తపస్సిద్ధికిన్ 22

ఉ. తిక్కన కైతలోఁతులు మథించిన రెడ్డి మదీయవాగ్ధునిం
బుక్కిటిబంటిగా మునిఁగి పోయెనటే! "కనులున్నఁ గానరో
చక్కని కొమ్మపోరు" లనిచాటె నిజానుభవమ్ము; సాహితీ
రుక్మమనీయ వైభవ నిరూఢున కీతని కంజలించెదన్ 23

ఉ. రెడ్డికిఁ దోడుగానిలిచి రెడ్డికి దీ టనిపించి యీఁదినాఁ
డొడ్డులుదాఁక నాంధ్రకవితోదధి పింగళి; తచ్చమత్కృతుల్
జడ్డలుజడ్డలై విరియ సాగి సభాస్థలియెల్ల వింజ మాఁ
కిడ్డటులయ్యె నెంతటిమహిష్ఠుని గాంచితివమ్మ భారతీ! 24

శా. పారిశ్రామికమంత్రి నాదు కవితాపట్టాభిషేకోత్సవ
ప్రారంభమ్మొనరించుటన్ గవనశిల్ప శ్రామికానందముల్
పారావారములయ్యెఁ గోర్కులెపుడుం బండించి యేతాదృశో
దారున్ రెడ్డివరేణ్యుఁబ్రోవఁగదె సీతారాము వాగీశ్వరీ! 25

మ. అసదృశదీక్ష గ్రందుకొన నాంధ్రమహాసభనేలు సాహితీ
రసికుఁ డుయూరుసీమయువరాజు గుణమ్ములప్రోవు మత్కృతి
ప్రసవసమర్పణోత్సవసభాపతిగా దయచేసెనట్టె! నా
దెస ననురక్తిగా నభిమతించెనొ నీ దెసభక్తి భారతీ! 26

మ. కృతికర్తల్ కృతిభర్తలున్ రసికతాకేంద్రమ్ము లాంధ్రక్షమా
పతిచూడామణులున్ వెలింగినమహావంశమ్మునం బుట్టి మత్
కృతిదానోత్సవసత్సదస్సుఁ దొలుతంగీర్తించె నెవ్వండు, సం
స్తుతిగావించెద వాని శాసనసభేంద్రున్ రామకృష్ణప్రభున్ 27

క. ఇతఁడు ప్రజాహృది నెఱిఁగిన, కతనన్ బ్రజమెచ్చుకొన్నకవి యని న న్నా
దృతిసేసిన దేవులపలి, నుతి నూటికినూఱుపాళ్లనున్ నిజమగుతన్ 28

శా. రంగాయంతటివాఁడు రివ్వుమని చేరన్వచ్చి యూరెల్ల మా
తంగ ప్రాగ్రసరుండుగా వెలసి మత్కావ్యప్రశంసల్ సభా
రంగంబెక్కి వెలార్చి భూరిసుమనోరాశిన్ ననున్ దేల్చి స
ర్వాంగీణమ్మగు శోభదెచ్చెను మదీయం బిమ్మహోలక్ష్మికిన్ 29

మ. కడపన్ నిద్దురలేచి, హస్తిపురిలో కాఫీని సేవించి, చే
రెఁడురొట్టెన్ కెయిరో కడన్నమలి, పారిస్ పూఁటకూటింటిలోఁ
గడుపున్నింపి, హితోక్తులాడును ట్రుమన్ కల్పించు దర్బారులో
నిదుఁబ్రో లీసుతుఁ డెట్లు వచ్చెజననీ! నీశక్తిఁ గాకుండినన్ 30

శా. తా రాకుండిననేమి రాష్ట్రసచివత్వవ్యాపృతిన్ మున్ని క
ల్లూరి శ్రీకులచంద్రమౌళి; తన వెల్గుల్ మామకీనోత్సవ
శ్రీరంగస్థలిదాఁకఁ బర్వులిడి వచ్చెన్ సారకర్పూర నీ
హారోదారసుధోపహారములు సభ్యప్రీతి సంధింపఁగన్ 31

శా. తల్లీ! తెల్గును నేర్పు నాదగు నుపాధ్యాయత్వముం బెంచు మా
జిల్లాబోర్డు మదీయ సత్కృతుల కాశీర్వాదముల్ పంపె నీ
యెల్లన్ రాష్ట్రమునేల్ గవర్నరును దానిచేఁత నగ్గించె రం
జిల్లెన్ నేఁడు ప్రజాభిమానముల కుజ్జీలై ప్రభుత్వాదృతుల్ 32

మ. ఒక సాహిత్యవిభూతి ప్రబ్బుటయ కా దోతల్లి! యినాఁడు తా
వకసంగీత విభూతియున్ జతపడెన్ వాసంతవేళాపిక
ప్రకటారావమునించి నాగయ నినున్ బ్రార్థించి కీర్తించుచో
గకుబంతమ్ముల నేతదీయ పరిషద్ గాథాళి మార్మ్రోఁగుచోన్ 33

క. జగడము నొల్లని నారద, భగవానుఁడు తెల్గుగడ్డఁ బాయని త్యాగ
య్యగదా! చిత్తూరినాగయ, సొగసితి నీతని సుహృత్తసొగ సిట్లొదవన్ 34

గీ. ఏమహావాదిగాయకస్వామి మధుర, మంజుసంవాదినాదంబు మామకీన
కావ్యకన్యకా కల్యాణకాల మంగ, ళాచరణ మాయె నతని నప్పార్యునెంతు 35

క. మణిదీపమ్ముల భూభృ, న్మణి వాఙ్మయపోషణాత్తమంజుయశశ్శ్రీ
ఘృణి నీకు నివాళించెను, జననీ! ముక్త్యాలవిభుఁడు సంసన్నుతుఁడై 36

ఆ. ఏమిభక్తితల్లి! యిది యుష్మదుద్భవ, శ్రీగనంగనెట్లొ చేరికొనియె
తనువు పండిపండి తాత యయ్యును యార్ల, గడ్డ రంగనాయక ప్రభుండు. 37

ఈ సభలో శ్రీ ఎర్నేని సుబ్రహ్మణ్యముగారికి నా "ఆత్మకథ" సమర్పించుటయొఱుంగుఁడు

* * * * *

శా. లోనై దీర్ఘతరప్రయాసలకుఁ దెల్గుంగైతకున్ గౌరవ
స్థానంబిచ్చుట సంతరించుకొని రీ సమ్మానసంఘమ్ము వా
రీ నిర్వ్యాజకళాభిమానమున కే నెంతే వినీతుండనై
ధ్యానింతున్ నిరతంబు వీరి మధురౌదార్యమ్ము సౌజన్యమున్ 38

మ. తనకుం గూర్చునమాత్ములై కవిజగత్తారుణ్యకల్యాణకృ
ద్గుణులై తుమ్మల వృష్ణిలాన్వయమణుల్ కోటయ్య నాగయ్యలు
క్కున దీపింప నిదంవిధోత్సవము తెల్గుక్షోణి కక్షీణము
స్థనముం గూర్చినవాని మెచ్చెదను సీతారామ ధీమద్విభున్ 39

ఉ. పత్రికలో నితండు తన పండువ కొగ్గుట జూచి "భారతీ
మాతృపసేవనమ్ము పదిమందికి నిష్టమకాని పుష్పమో
పత్రమొ చాలు నర్పసలుపన్, శ్రమలీవుసహింపఁజాల, వో
మిత్రమ!" యంటినైన నదిమెచ్చఁద యిమ్మహితాత్ముఁ డింతయున్ 40

మ. అహముల్లిప్తలు, విస్మృతాంశములు నిద్రాహారసౌఖ్యంబు, లి
మ్మహికంపింప గమించురైళ్ళు జదధర్మక్షేత్రము ల్గాఁగ లో
కహితావేశము నూఁది వైభవమిటుల్ కల్పించె "నుత్సర్పిణీ
మహతాంప్రార్థన" యన్న సూక్తి కితఁడే మాచూపుతార్కాణయై 41

క. వెలువోలు వంగసమ్మున, వెలసిన యీధర్మమర్మవేది తనూదు
ర్బలుఁడయ్యు నాత్మబలమున, నిలిచిగెలిచె నేఁటియజ్ఞనిర్వహణమునన్ 42

ఉ. అంటినఁగందుమేను, వెల కందనిసంపద రాజభోగమున్
గెంటుసుఖానుభూతి, పరికీర్తితదర్పసమృద్ధి కల్గియున్
గంటికి నిద్రలేని తమకమ్మున నియ్యెడఁ గోటయాఖ్యుఁ డిం
టింటికిఁ బర్వులెత్తె నది యెంత కలాపరతంత్రశీలమో! 43

ఉ. కల్పము లెన్ని రేఁగినను గందని కుందని వీరమూర్తియై
జల్పము లెన్ని మ్రోఁగినను జంకని గొంకని కర్మయోగియై
నిల్పె నెవండు కావ్యరమణీవిజయధ్వజ మిందు; సిద్ధసం
కల్పుఁడు నాగయాఖ్యరసికప్రియుఁ డాతని కాయురున్నతుల్ 44

క. అంతశ్శుద్ధుఁడనై య, గ్గింతు నజాతారి శేషగిరిరాణ్మిత్రిన్
చింతలపూఁడి వనమ్మున, నెంతటితియ్యనిరసాల మేచి తలిర్చెన్! 45

క. పిన్నమనేనికులేందుఁడు, పున్నయ పదునాలుగుళ్ళ పూజరి యయ్యున్
మున్నై సభారమా విభ, వోన్నతికై పెనఁగె సాటియొజ్జలు మెచ్చన్ 46

ఉ. అస్మ దఖండ సత్కృతి మహఃపరిలబ్ధి విధావిరుద్ధ వి
ఘ్నస్మయ భంజకప్రధన కౌశలముం బ్రకటింప నేర్చుటన్

విస్మయమయ్యెఁ గ్రొత్తపలి వేంకటరత్న మనీషి దీక్ష, కీ
సస్మితమూర్తి నాహృదయశయ్యఁ దొఱంగని వియ్యమయ్యెడిన్ 47

క. మధుమధుర భావసేవధి, కధరాపుర శేషగిరి సమాహ్వయునకు మ
త్పథ మెంత తనివి గూర్చెనొ, పృథులాదృతి గురిసె నాదుపేర్మికి మురిసెన్. 48

క. దానయచౌదరి నాకై, ప్రాణంబులు పంచు నాత్మబంధువు; నేఁ డీ
యేనుంగు నెక్కినాతఁడు, తానా నేనా యటన్న తర్కమువొదమెన్ 49

క. ప్రబ్బిన కలావిమృష్టత, సుబ్బిన కవితామహత్త సొంపులతో న
న్నుబ్బించు కుఱ్ఱ వేంకట, సుబ్బారావునకు సకలశుభసిద్ధియగున్ 50

ఉ. నన్నపనేనిసత్కులుఁడు నాగయచౌదరి యేలుప్రోలికిం
గన్నదదేవరాయకటకమ్మున కబ్బినకీర్తి దక్కె నీ
పున్నెము పంటకై సుకవిపూజలకై మహనీయుఁ డీతఁ డె
న్నెన్ని బెదంద లెత్తిన సహించి వహించె నుదాత్తధర్మమున్ 51

ఉ. వంటకమయ్యె మీ రలసి వచ్చిరి మాసుకృతమ్ము నేఁటికిన్
బంటకుఁజొచ్చె లెందని సభాసదులన్ బతిమాలి గేస్తు లిం
టింటికిఁబిల్చుకొంద్రు మదికించిన విందులొనర్తు రెచ్చటం
గంటి మిదంవిధాదరవికాసము లీనిడుఁబ్రోలు దక్కినన్ 52

శా. పొన్నూరున్నిడుఁబ్రోలు నొక్కపురిగాఁ బొల్పొంది పేరందుటన్
న న్నిచ్చోట బహూకరించుసభ నానాదీప్తులన్ గంటకున్
బొన్నూరున్ బ్రియతించెఁ దత్పురవిభున్ గొప్పొక వెంకయ్యన
స్కన్నప్రీతిఁదలంతు సత్కవిసమర్చా నిఘ్నలిప్సాఖనిన్ 53

శా. అనాఁ డీవు ప్రతిష్ఠచేసితివి న న్నాచార్యపీఠమ్ముపైఁ
దానై వచ్చిన కైత తద్బలమునన్ దారాపథంబంటె న
ద్దానన్ దెల్గులకూడెముల్ సలిపితిన్ ధన్యుండ నైతిన్ భవ
ద్ధీ నైర్మల్యము సంస్మరింతు గుణవార్ధీ! కుప్పుసామి! యిటన్ 54

చ. "అలఁతియలంతిగాఁ దొదర కన్యదురాసదపూజనమ్ములం
గొలువుఁడు తిక్కనార్యు; నెదికోరినఁజేయఁగలాఁడనే; నితం
దలఘు కవిత్వశిల్పచణుఁ దౌటయకా దనఘుండు" నంచు నన్
బలికిన కృష్ణచౌదరికి భద్రము! పాములపాటిమేటికిన్ 55

క. న న్ననుజుంబలెఁ జూచుచు, మన్నిపుణత వలచు ప్రాజ్ఞమణి దాసరి శ్రీ
మన్నారాయణ చౌదరి, ప్రసన్నఁదనం బెంతు సౌఖ్యభర మాసింతున్ 56

సీ. అధ్వర్యుఁడై వాణి కర్పగావించె శే, షాచార్యుఁ దార్షధర్మాభిరతుఁడు
వలగొని మ్రొక్కిదివ్యచ్ఛత్రభోగమ్ము, నిచ్చె ముప్పాళ్ళ నాగేశ్వరుండు
వేవేలుక్రొంగ్రొత్త విరులదండలుగూర్చెఁ గోటయ్య పాములపాటి మొలక
మస్తకమ్మున రత్నమయ కిరీటమునిల్పెఁ, గొసరాజు కృష్ణుండు గుణపయోధి

గీ. క్రొత్తపల్లి రాధాకృష్ణుఁ దత్తుకొన్న, భక్తిమై జయగీతమ్ము పల్లవించె
ప్రాజ్ఞు లీదృక్షు లెందఱో బలసికొలువ, నొదవెఁ గవితాసవిత్రీ మహోదయమ్ము 57

* * * * *

గీ. ఆంధ్రజననీసమార్జితానంతసుకృత, మధురఫలమూర్తి కౌచితీమానితునకు
స్వాగతము! గోగినేనివంశప్రశస్త, వనవసంతున కౌదార్యవాసితునకు 58

శా. ఓహో! వేంకటసుబ్బయార్య! సుకవివ్యూహంబె తత్తన్మహీ
మాహాత్మ్యమ్మున కాదిహేతువని ధర్మప్రీతి నేత త్సుఖ
శ్రీహాసమ్ములుకోరి వేలొసఁగు నీ చిత్తోన్నతిన్ మెత్తు నీ
మాహారాజిక సంపదల్ వెలయు నమ్లానమ్ము లిద్ధమ్ములై 59

ఉ. లక్షలుగల్గువారు బహులక్షలు, వారలలోన దాతృతా
దీక్షితు లెందఱోకలరు ధీనిశితత్వము చూపి సత్కలా
పక్షము మ్రొగ్గి, నీవలె నపారధనమ్ము లొసంగి పొంగువా
రీక్షితి నెందఱుందురు మహిష్ఠులు? వేంకటసుబ్బయాభిధా! 60

మ. నను నిచ్చన్ గనకాభిషేకమున సన్మానించు నీ చేఁతలోఁ
దనువెల్లం బులకించెఁ గాని కవితాదక్షంబు శ్రీనాథతన్
గనఁగాఁ జాలితినంచు నించుకయు నే గర్వింప; గర్ణాటనా
థునిగామాత్రమ నిన్ను మెచ్చి వినుతింతున్ నీదు రాసిక్యమున్ 61

చ. తెలుఁగుమహాప్రజా నయనదీధితిలోకములో సహస్రరీ
తుల భవదీయదానకరతోయజరేఖలు తాండవించె నీ
వెలఁదివెలుంగు వెల్లువలు విశ్వము నిల్చినయంతవట్టు ను
జ్జ్వలములు పొమ్ము నీజనువు సార్థకత న్గడియించెఁ జౌదరీ! 62

సీ. విన్నారమనవేమవిభుని దాతృత్వంబు, జలజల నొదనెల్లఁ బులకరింప
పఠియించితిమి సార్వభౌము వాచావీథి, హరిహరేంద్ర త్యాగనిరతి పెంపు
తెలిసికొంటిమి గుంటుపలి రాయనామాత్యు, భాస్కరు వితరణ ప్రాభవంబు
విశ్వసించితి మాత్మ వేంకటాద్రినరేంద్రు, సడిసన్న యౌదార్య సాహసమ్ము
గీ. నేఁటి కాంధ్రులభాగ్యంబు నెఱయఁబండి, చూచుటయ కల్గె లోకవిశ్రుతము సాధు
హితము నై పొల్చు నీవదాన్యతను; దాన, వీరునకు నీకు విజయాభివృద్ధిరస్తు 63

క. కలిమిని సత్సంతానము, కలిమిని వితరణగుణమ్ము కలిమిని గవికో
కిల కులము కాకలీ కల, కలముల నీ కుదురె కుదురుగా రవణించున్ 64

* * * * *

ఉ. బంగరుగండపెండెరము పాదమునం దొడి నన్ను సాహితీ
రంగము నెక్కఁజేసి శివరామవిభూ! కవిజాతిపట్ల నీ
కుం గల మక్కువన్ దెలిపికొంటివి తావకకీర్తినర్తకీ
భంగిమ కాంధ్రలోకము సెబాసనుచున్ దలయూఁచె ముగ్ధమై 65

చ. మనుచరితమ్ము సెప్పి నృపమండలమండనుఁడైన కృష్ణరా
యని మురిపించి బంగరపుటందియ నందెను బెద్దనార్యుఁ, డే
ననితరలభ్యపుణ్యుని మహోత్మునిగాధను సర్వకాలమున్
మను చరితమ్ముఁజెప్పి నృపమండన! పొందితి నీ బహూకృతిక్ 66

ఉ. పాలకపాలితుల్ గలసభన్ బ్రభుకుంజర! నీవు వంగి నా
కాలికి నందెవైచి కవిగౌరవమున్ గొనియాడుపట్ల నీ
శీలముముందు సభ్యులు విశిష్టమతుల్ తలయొగ్గ మోదభా
రాలసచిత్తవృత్తిని జొహారులుపెట్టితిఁ దల్లి కాంధ్రికిన్ 67

చ. "ఇతఁడు కవీంద్రు దంచు నుతియించుట నాపనిగాదు, నా కయా
చితముగ రాష్ట్రగానమిడి చిక్కని చిక్కనికీర్తిగూర్చి య
ద్భుతమిది మద్గృహాంగణము త్రొక్కఁడు ప్రార్థితుఁడయ్యు నిమ్మహా
మతి" యని నన్ను నీవు బహుమానముసేయుట చాలు భూపతీ! 68

* * * * *

క. ముంజేతి కమృత భాషా, సంజీవి సదస్సువారి స్వర్ణవలయమా?
మంజుల కవితా దీక్షా, వ్యంజక మిది నాదువృద్ధికై తోడగుతన్ 69

శా. విద్యాదేవికిఁ బీఠమై యమృతలూ ర్వేవేలుగా వైదుషీ
సద్యోగాంచితులన్ సృజించుకొని మత్సాహిత్యమున్మెచ్చఁగా
నుద్యోగించుటనాయదృష్ట మది గా కోహో! మహోత్యాగ సం
పద్యుక్తుందు నుతించుటా శరణు రామస్వామి నాసేవలన్ 70

మ. ఒకసమ్మానపుఁ బత్రమిచ్చుటను లేదోతృప్తి, ఖర్జూర పే
టికతో దాని బహూకరించి పరిపుష్టింగూర్తు రౌదార్యల
క్ష్మికి నాత్మీయకు; మంచిపట్లఁ గదుమంచింజూపి విద్వత్కవి
ప్రకరప్రస్తుతి పాత్రులయ్యెదరు కారంచేదు పౌరాగ్రణుల్ 71

ఆ. ప్రేమనించి నన్నుఁ బెంచి రిన్నాళ్ళు నా, చిత్ర మిడిరి పెద్దచేసి యిపుడు
తనివి ప్రబ్బెఁ గాని యెనమలకుదురువా, రెలయ నేమియిడెద నెడఁదఁ గాక 72

* * * * *

మ. అది నీకేతగునమ్మ "మాతృహృదయం" బావిష్కరింపంగ నే
యెదురున్ లేని మహాకవీంద్రుఁడును దా నీ చక్కనల్ చూచునా?
ముదిమిన్ దాసిన నే మఱొక్కపరి నీ మూలంబునన్ నాదు బా
ల్యదశావాసితమాతృ మాధురులు క్రోలంగల్గితిన్ సోదరీ! 73

మ. కృతికర్తృత్వమునన్ గడించినవి మత్కీర్తుల్ చిరస్థాయులై
బ్రతుకంగల్గు నటంచు ధైర్యమును జెప్పంజాలఁగానీ! భవత్
కృతిభర్తృత్వమునన్ మదీయయశముల్ క్రీడించు నాంధ్రీకవో
లతటీనిత్యవినూత్న సాధుసుషమాలావణ్యరేఖాకృతుల్ 74

మ. అనసూయాహృదయమ్ముపోలె మధురంబై స్వచ్ఛమై సత్కవి
ప్రణుతిన్ నోఁచిన నీకవిత్వమిడి నా భాగ్యంబు పండించితో
*యనసూయా! భవదాదృతిన్ మఱవలేనమ్మా! జగన్మాన్యవై
మనుమమ్మా! కమనీయకావ్యతనయా మాతృత్వ సంపత్తితోన్ 75

* * * * *

ఉ. నాకద నీవునేర్పినవి నాలుగుముక్కలు; నీకునీవుగాఁ
బ్రాఁకి గడించుకొన్న ప్రతిభాఫలముల్ శతముల్ సహస్రముల్
చేకొనివచ్చి కానుకలు చేసితి నాకిపు డీయుదారతా
శ్రీకృతి కన్మదాత్మ వికసించెనురా •పలునాఁటిసత్కవీ! 76

* శ్రీమతి దొప్పలపూఁడి అనసూయాదేవి • శ్రీ కన్నెగంటి వీరభద్రాచార్యులు

ఉ. ఎట్టురచింతువోయి! బిగువించుకజాలదు వీరభూమిలోఁ
బుట్టిన నీకు నిట్టినుడిపొంకము సాజమ! శిల్పివీవు చే
పట్టిన వస్తువెల్ల రుచిబంధురసుందర రూపకల్పనా
హట్టముగా రసజ్ఞహృదయాబ్జము లాఁచికొనున్ గవీభమా! 77

ఉ. అంజెదవేల పేదనని యాడెద వేల మహోజ్ఞ మీ "సువ
ర్ణాంజలి" నిచ్చుచున్; వినయమాయిది? యౌ నది యుగ్గుఁబాలతో
నంజినవిద్య నీయెడ; వినమ్ర రసాలముకాదె మాధురీ
మంజులముల్ ఫలంబు లిడి మానసమున్ దనియించు నెచ్చెలీ! 78

* * * * *

క. ఆయత్తము శైష్యోపా, ధ్యాయిక మనపట్ల నది సమంచిత కవితా
శ్రీయోగంబిడి *రామా, రాయకవీ! నీకు నాకు రాణ ఘటించెన్ 79

శా. నాకుంబిడ్డలు పెక్కురుండినను ప్రాణంబెల్ల నీమీఁదికే
ప్రాఁకున్ దేశికులెందఱుండినను నీభావంబు నామీఁదికే
దూఁకున్ నీకును నాకు నేర్పడినబంధుత్వంబు లేనాఁటివో
యీకొమ్మల్ మఱి చిల్వపల్వలుగ నిట్లే సాగి వాసించుతన్ 80

గీ. నీ హృదయపద్మవీధిలో నెగసి చిందు, "తేనెచుక్కలు" గురున కందించుకొంటి
శాబకా! తన్మధూత్సవాస్వాదనమున, నితఁడు బంభరమై విశ్వహితము మొరయు 81

28-1-49



## విజయవాణి

(తెలంగాణా విముక్తివిని)

ముత్యాలసరాలు :

విజయవాణీ మధురఘోషము, విరిసెరా మన వాడవాడల
కుజన కుటిలవ్యూహ కుడ్యము, కూలిపోయెనురా 1

ముసురుకొన్న రజఃప్రవృత్తులు, మూలమూలల ముడుచుకొన్నవి
కొసరి మన సంగ్రామకేళీ, రసము పొంగెనురా 2

* శ్రీ లేళ్ళ వేంకటరామారావు

వాడిపోయిన తల్లి మొగమున, నాదెరా జాబిల్లి రేకలు
మూఁడుకోట్ల తెలుంగు లిప్పుడు, ముక్తినందిరిరా 3

లోకమాన్య క్షాత్రమూర్తులు, కాకతీయుల గుండెమంటలు
చీఁకుచింతలు నేఁటితో ని, శ్శేషమయ్యెనురా 4

తెలుఁగుజెండా కెదురులేదని, తెలుఁగునాఁటికి సాటిలేదని
తెలుఁగురక్తము పొంగిపొరలఁగ, నిలిచిపల్కు మిఁకన్ 5

నదులు కొండలు తోఁట లడవులు, నగరములు పల్లెలు పయోధులు
పదుగురౌ నని మెచ్చు ప్రజ నీ, పాలి సంపదరా 6

సొగవోయి! మహాంధ్రజగతీ, చక్రధౌరంధర్యమునకై
మ్రోఁగుచున్నవి తూర్యరవములు, మోహనారభటిన్ 7

దుష్టశక్తులు తొంగిచూదని, త్రోవలో నీ రథము తోలుము
సృష్టి నీపై సురభిసుమనో, వృష్టి కురియంగన్. 8

25-9-48



# పీఠిక

శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు అభినవ తిక్కన బిరుదాంకితులు. తెలుఁగు దేశములో నేఁడు ప్రసిద్ధులైన గొప్ప కవులలో వీరు నొక్కరు. ఆధునికాంధ్రమునఁ బ్రసిద్ధులైన కవులలో నందఱును దలాయొక కవితాగుణము చేతఁ బ్రసిద్ధిలోనికి వచ్చిరి. కవితా గుణములు వేఱు. భాషా పాండిత్యము వేఱు. పరమేశ్వరానుగ్రహము, పూర్వజన్మ సంస్కారము కవితాశక్తికి హేతువులుగాఁ జెప్పుదురు. పాండిత్యమునకుఁ గూడ నివి కారణములు కావనుటకు వీలులేదు గాని, పాండిత్యమును గూర్చి వీని నెక్కువగాఁ జెప్పరు. ఈ ప్రసిద్ధులైన కవులలో నేకొందఱు మాత్రమే సుష్ఠువైన భాషాపరిజ్ఞానము కలవారు. భాషాపరిజ్ఞాన మనినతోడనే యది లేకుండ కవులెట్లగుదురని ప్రశ్నవచ్చును. కవులు వాడెడు భాష కొంత భాషాపాండిత్య స్ఫోరకముగా, భాషా స్వభావ రమ్యముగా నుండును. కొంతభాష తదితరముగా నుండును. పూర్వకవులను జదివి వారి గ్రంథములయందుఁ జక్కఁగా వాడఁబడినభాషను వాడెడు కవి యొకఁడు. వారిలోనున్న కొన్ని పలుకుబళ్లు తీసికొని మాత్రమే తన రచనకు మెఱపులు తెచ్చెడివాఁడొకడు. పూర్వకవుల భాషతో సంబంధము లేకుండ లోకమునందు వాడెడు భాషను దీసికొని దానిని బ్రకృతి ప్రత్యయ సాధువుగాఁ జేసి వాడెడువాఁ డొకఁడు. ఒక కవి వ్రాసిన గ్రంథము చదివినంతనే యితఁడు పూర్వకవుల భాషాసౌష్ఠవ మెఱిఁగినవాఁడా కాఁడా యన్న ప్రశ్నకు సమాధానము బుద్ధికిఁ గలుగును. ఈ యీ శబ్దములు వాడుట చేతనని గాని యీ యీ పలుకుబళ్లుపయోగించుట చేతనని గాని చెప్పుట స్థూలరూపము. ఒక కవియొక్క గ్రంథము రమణీయముగా నుండదు. అది రమణీయముగా లేకపోవుట చేత నొక విమర్శకుఁడు దాని యందు దోషములు చూపించును. సామాన్యముగా శబ్దదోషములు నిలువవు. ఈ సంగతి నేఁటి పత్రికలలోని విమర్శ ప్రతివిమర్శలవలనఁ బాఠకులు తెలిసికొనవచ్చును. యాథార్థ్య మేమనఁగా ఆ కవి రచన రమణీయముగా లేదు. ఆ రచన కవితాశబ్దవాచ్యము కాదు.

శ్రీ చౌదరిగారి రచన యిట్టి దోషములకుఁ దా వీయదు. చౌదరిగారు నిర్దుష్టమైన సుష్ఠుభాష వ్రాసెడి కొలఁది మందిలో నొకఁడు. వీరి భాష మిక్కిలి సంప్రదాయసిద్ధమైన భాష. వీరి కవితాశక్తి శబ్దమును విడిచి చిందులు త్రొక్కదు. పాఠకుని విపరీత బుద్ధిమీఁద వీరి కవితాశక్తి యాధారపడి లేదు. అందుచేతనే వీరి యభినవతిక్కన బిరుదము సార్థకమైనది.

ఈ గ్రంథము పేరు శబల. శబల యన గోవు. బహు వర్ణములు కలది. ఇందు బహు విషయములను బురస్కరించుకొని వ్రాసిన శీర్షికలు కలవు. వీనిలో 'సంక్రాంతి తలఁపులు'

పరమోత్తమమైన కవితాఖండము. దీనిముందు నిలిచెడి కవితా ఖండ మీ గ్రంథములో లేదు. ఇది కవియొక్క స్వానుభవము.

కవిత్వమనఁగా ననుభవ పరమార్థము. ప్రతివాఁడును దన యనుభవమును జక్కఁగాఁ జెప్పఁగలఁడు. వేఱొక కథ తీసికొన్నప్పుడు ఆ కథలోనున్న వ్యక్తియొక్క యనుభవము తన యనుభవములో నుండినఁగాని చక్కఁగాఁ జెప్పలేఁడు. మహాకవి భావనాపరమావధి భూతమైన బుద్ధితో వాని యనుభూతిని దా నవగతము చేసికొని తన యనుభూతిని, తాను చెప్పెడి ఫణితిని జోడించి లోకోత్తరత్వమును సంపాదించి మహాకవి యగును. కవి తన యనుభూతిని దానే చెప్పునప్పుడు శబలమైన భాషకలవాడైనచో మహాకవికి సన్నిహితుఁడగును. తన కావ్యమునందలి యొక పాత్రయొక్క యనుభూతిని భావించి తనది చేసికొనవలసిన బాధ్యత లేకుండఁ దనకు సహజమైన మార్గమునందుఁ బోవును. తేలికగా నతనికి మహాకవి పదవి సిద్ధించును. అల్పప్రయత్నముతో నధిక ాభము కలిగెడి స్థలమిది.

'సంక్రాంతి తలఁపులు' చిత్రమైన కావ్యఖండము. ఇందు రైతు జీవితము పరమరమణీయ ముగా వర్ణింపఁబడినది. కవి చిన్నప్పుడు రైతు. కుప్పలు నూర్చినవాఁడు. గడ్డికోసినవాఁడు. వెంటికట్టినవాఁడు. పదిమోపుల గడ్డిపనలనెత్తిన రెట్ట బలము కలవాఁడు. తరువాతఁ దెనుఁ గు పండితుఁడై కవియైన వాఁడు. కవిగా నంతపంటయుఁ బండించుకొన్నవాఁడే. కాని తొలినాఁ టి పంటమీఁద వలపుకలవాఁడు. ఈ పంట గాలి పంట. ఆ పంట భూమి పంట. భూమి పంట బ్రదికినన్నాళ్లు సుఖపెట్టునది. శరీర సౌష్ఠవము చెడనీయనిది. ఈ కీర్తి పంట బయటఁ బల్లకీలమ్రోఁత, యింటిలో నీఁగల మ్రోఁత. రైతు 'పుచ్చిన కొయ్యలోఁ జిగురుపుట్టునటుల్ వలిపాట' పాడునఁట. ఈ శీర్షికలో నొక పద్యము బాగున్నదని, యొక పద్యము బాగులేదని లేదు. సర్వ మనుభూతివిశేషమగుట చేతఁ బ్రతి పద్యము స్వాదువుగా నున్నది. వెంటికట్టుటలోని కృషికుని శిల్పము వర్ణింపఁబడిన మూఁడవ పద్యము చూడుఁడు. మొల త్రాడువలె బుడుపులు లేకుండఁ బదిచేతుల వెంటిని కట్టఁగా సిదమువలె నిల్చినదఁట. ఆనాఁటి భోజనసౌష్ఠవము, ఆనాఁటి తృప్తి, యీనాఁటి యనారోగ్యస్థితి. ఆనాఁటి బలము, ఈనాఁటి బలహీనత. కవి చిన్నప్పుడు బండి తోలుకొనిపోవుచున్నాఁడు. చక్ర మూబిలో దిగినది. అఱ్ఱుపులిసిన గిత్త లాగలేకపోయెను. కవి గిత్తనూడఁదీసి కాడి తానే మెడమీఁద వైచుకొని లాగెను. ఆ కవి నేఁ డు కడవెఁడు నీళ్లు తోడలేఁడు. ఓహో! రైతు జీవనములోని మాధుర్య మంతయుఁ దెలిసినవాఁ డీ కవి. అట్టి జీవనమును వదలిపెట్టి దూరపు కొండల నునుపు చూచి యొజ్జతనమునకు దిగిన యీ స్థితిని పంచదార యనుకొని చేఁదును మెక్కితి ననుచున్నాఁడు. 'ఒక మరకైవడిం గదలుచున్న యొడల్ కురిచీకిదత్త' మైన దనుచున్నాఁడు. ఓయి నాగరకులారా! కృషీవలజీవన విముఖులారా! ఈ మహాకవిని వినుఁడు. నాగరకతా భ్రాంతిని వదలించుకొనుఁడు.

ఇఁక మాఱినజీవిత మెటువంటిదో చెప్పుచున్నాడు. పదిమందికిఁ గాదు ఇర్వదిమందికిఁ గాదు బుద్ధిలేని యేఁబది మందికిఁ బ్రొద్దుగ్రుంకులు నఱపవలయును. కాకులకు, పెండ్లి కట్నాల చదువుకోరెడి చట్టులకుఁ జదువు చెప్పవలసి వచ్చినది. ఈ చదువుచెప్పుట యెట్టిది ? కంకులు నూర్చుట కాదు, చెత్తనూర్చుట. ఈ చెత్తలో నుండి ధాన్యమును నూర్చవలయునఁట. అని కోరెడివా రెవరు ? జీతమునిచ్చు నేలికలు. చెత్తలో గింజరానిచో నూర్చినవాని లోటఁట. ఇదియంతయు నేఁటి చదువునకు వ్యాఖ్యానము. ఓయి నేఁటి విద్యావేత్తలారా! ఓయి నేఁటి విద్యా పాలకులారా! ఓయి నేఁటి విద్యాపద్ధత్యభిమానులారా! రైతు జీవితములోని మాధుర్య మెఱిఁగి, యెదో యున్నదని యిచ్చటికివచ్చి కదగండ్లు పడుచున్న రైతుకవియైన యీ యభినవ తిక్కన మాటలు వినుఁడు. మీ పద్ధతులను సంస్కరించుకొనుఁడు. మీరట్లు చేయరు. ఈయన గొప్పకవి యని మీకుఁ దోఁచినచో మీ రాజకీయము లనుకూలించినచో నాయన కింతధన మిత్తురు. బిరుదు లిత్తురు. ఎదో యుద్యోగ మిప్పింతురు. అంతియేకాని యీ మహాకవి యొక్క వాణిని విని మిమ్ము మీరు చక్కదిద్దుకొనరు. పైఁగా మీరు మీ మార్గములు బాగుగానున్న వన్న కవిని గౌరవింతురు. అట్లు వ్రాసినవాఁడే కవి యందురు. కవి యట్లే వ్రాయవలయు నందురు. మహాకవి చేసిన హితోపదేశమును మీరు వినరు. అతనిని బాటించరు. పాటించు నేర్పున్నచో అభినవతిక్కన మాటలు వినుఁడు. ఈయన కెట్లోయొకట్లు సాగుచున్నది. 'బికారికిఁ బెట్టఁగ నిల్లు నెట్టఁగాఁ' దండ్రి యిచ్చిన భూములు, బుఱ్ఱలునున్నవి. ఇందులో 'బికారికిఁ బెట్టఁగ' నన్న మాట యున్నది. ఈ కవి పరమ దయాసముద్రుఁడు. పదిమందికిఁ బెట్టెడివాఁడు, పెట్టించెడివాఁడు. ఈ మహాగుణము నేఁటి యితరకవులలో నింకొకరికి లేదనవచ్చును. ఆయన దాత. ఆయన వన్నియు గుప్తదానములు. ఈ సంగతి లోకమునకుఁ దెలియదు.

ఈ యుద్యోగవృత్తి యెవ్వరు సేయవలయునని ప్రశ్న వచ్చినది. ఈ వృత్తి కూటికిలేని సోమరులకఁట. రైతుకాని వాఁడు సోమరియని దీని వ్యాఖ్యానము. సోమరికానివాఁడొక్క రైతే. తక్కినవారందఱును రైతు కాయకష్టపడి పండించుచుండఁగా మనోవృత్తి ననుభవించెడివారు. ఆ రైతు కూడ నింటిదగ్గఱఁ గూర్చుండి వ్యవసాయము చేయించెడి రైతు కాదు. నిజమయిన రైతు. పదునేనెకరములు మించని సేద్యకాఁడు. రెండవరైతు పాలేరు. తక్కిన వారు కూటికిఁ గల సోమరులు. ఈ కావ్యము పేరు సంక్రాంతి తలఁపులు. ఇది నేఁటి యాంధ్రభాషా కవిత్వములో శిరోభూషణమైన కవితాఖండము.

ఇక రెండవది 'నా కథ – సీత' యన్న శీర్షికను విచారింతము. ఇది యాశువుగాఁ జెప్పిన కావ్యము. ఏఁబదియొక్క పద్యములు గలది. ఇందులో నీయభినవతిక్కన యొక్క నేర్పు చూతము. కవిత్వమునకు మొదటిది భాష. రెండవది భావము. ఈయన భాష నిర్దుష్టమైనదని చెప్పితిని గదా! పాండిత్యస్ఫోరకమైనదికూడను. 'సుందరపద్యన్నడిపెన్ స్వయంవరము – నా చారుమూర్తి మధురశ్రీ చిక్కణపేటి – ముగురత్తలు నేరాంఁడ్రొక ముగురును' ఇట్టి మాటలు కవి యొక్క

పాండిత్యమును స్ఫురింపఁ జేయును. ఇట్టివి పుస్తకములోఁ జాలఁగలవు. నేనీ శీర్షికలోనివి మాత్రమే తీసితిని. సీత తన కథ చెప్పుచున్నది. 'ముగురత్తలు నేరాండ్రొక ముగురున్ లభియించి హర్షమున ముంచిరి నన్' ఇది చమత్కారమైన రచన. ఏరాండ్రు – తోడికోడండ్రు. ఆ ముగ్గురు తోడికోడండ్రు సీత యొక్క చెల్లెండ్రే. సీత వారి నేరాండ్రుగానే చెప్పుచున్నది. ఇది యత్తవారింటి కాఁపురములోని నియమములను ఒద్దికలను చిత్రముగా ధ్వనించుచున్న వాక్యము.

"సౌమిత్రియండ కల్గుట
రామునకున్ నాకు వని పురంబయి తోఁచెన్
నా మగఁడే దేవుండని
ప్రేమించెడి ఋషులఁ జూచి పెరిఁగితి నేనున్"

ఈ పద్యమొక లోకోత్తరమైన పద్యము. తన భర్తను లోకులు గౌరవించుచుండఁగా స్త్రీ యెటువంటి యనుభూతిని పొందునో ఆయనుభూతి యిందు వ్యంగ్యమై పరమ రమణీయముగ నున్నది. తరువాతి పద్యము కూడ నిట్టిదే. ఒక గొప్ప పురుషుని చేపట్టిన స్త్రీ యొక్క అనుభవ విశేష మిందు ధ్వనితమై యీ యాశుకావ్యమును రత్నపేటికగాఁ జేయుచున్నది. ఈ చిన్నకావ్యము లోని సీతసృష్టి యొక వివేకవతియైన, మంచియింటఁబుట్టి మంచి యింటికి వెళ్లిన తెలుఁగు బాలిక యొక్క జీవితమును ధ్వనించుచున్నది.

ఈ కవి సంప్రదాయాభిమాని. అందుకనియే వీర పూజలో నన్నయ, తిక్కన, శంభు దాసులను 'నానావిధ వైదికార్చనల' భజింతుననెను. కర్ణుఁడన్న శీర్షికలో 'అనుకంపా నిఘ్న చిత్తము – అన్యాయ్యము –' మొదలైన సంస్కృతములోని గడుసు ప్రయోగములు చేసెను. 'పశువైద్య' మన్న శీర్షిక మఱల నీయన యొక్క రైతుఁదనమే తెలుపుచున్నది.

'అంధ్రీ చిరోపవా సావిర్భవత్తపః క్రతుఫలము' ఇట్టి సమాసములు చక్కఁగా సంస్కృత భాష నెఱుఁగనివాఁడు చేయలేఁడు. ఈయన అభినవతిక్కన యెందుకైనాఁడు ?

"కర్ణాటీ నవహీరహారము త్రిలింగక్ష్మాసతీ మల్లికా
పూర్ణోద్యానము ఘూర్జరీ ముఖకళాపుంజంబు విశ్వక్షమా
స్వర్ణద్యంబర చుంబివాః పటలమై సభ్యప్రపంచమ్మునన్
వర్ణింపంబడు నీయశంబు మృదుభావా! భారతీవల్లభా!"

ఈ పద్యమును జూడుఁడు. ఇది యచ్చముగా సంస్కృత పదభూయిష్ఠమైన పద్యము. ఇది శ్రీనాధుని మార్గమును చుంబించుచున్న రచన. ఈ పద్యము రంగాగారిమీఁద వ్రాసినది. ఆయనను 'భారతీ వల్లభా' యని సంబోధించుటలోఁ గలిగిన శ్లేష హేతుకమైన విచ్ఛిత్తి యట్లుంచి యీయన తలఁచుకొన్నచో నితరులవలె నిట్టి రచన చేయఁగలఁడని రుజువగుచున్నది. కాని యీ కవి శ్రీనాధుని మార్గముకంటెఁ దిక్కన్న మార్గము గొప్పదియని తెలిసికొనినవాఁడు.



'శబల' కృతిస్వీకర్త

శ్రీ జాస్తి వేంకట నరసయ్యా

అందుచేతఁ దెలుఁగు మాటలు నింపి రచన సేయుటయే తెనుఁగు కవితయొక్క రమ్యత యని యాయనయొక్క నిష్కర్ష.

> మోసులెత్తిన వేలుపుంబాసమీఁది
> తగులమునఁ జేసి తెల్గును దెగడువారు
> వ్రాయుదురుగాక తెలుఁగు కావ్యమ్ము - లినుప
> సుద్దలేకాని యవి లద్దుముద్దలగునె ?

సంస్కృత పదభూయిష్ఠమైన తెలుఁగు కవిత్వము ఇనుప సుద్దలు. తెలుఁగు నుడుల ప్రోవులైన తెలుఁగు కవిత్వము లద్దుముద్దలు. ఇది యాయన తీర్పు. ఓహో! తెలుఁగు కవీ! తిక్కన గారు తెనుఁగు భాషకుఁ జేసిన మహోపకారమును నీవు కీర్తించి యా మార్గమున నడచిన వాఁడవు. నిజముగా నీ వభినవ తిక్కనవు. కవులయొక్క శక్తి సగానికి సగము కాదన్నచో నూటికిఁ దొంబదిపాళ్లు వారి భాషయందును, వారి శైలియందును గలదు. వట్టి భావము లెవరికి లేవు ? భావము లందఱికిని గలవు. అందఱకుఁ గల భావములను, వ్యక్తిగాఁ దనకుఁ గలిగిన విశేష భావములను కవి తానెఱిఁగిన భాషలో తాను నేర్చిన భాషలో, పరమేశ్వరుఁడు తన కనుగ్రహించిన శైలిలోఁ దీర్చి చెప్పును. నీవలెఁ దెనుఁగు బాసయందే యింత యధికాదరము కలవారు నేఁటి కవులలో లేరు. ఒక ప్రత్యేకమైన శైలియం దభిమానము కలవారున్నారు. ఆ మార్గములోఁ దెలుఁగుమాట లెక్కువ రావచ్చును. అదివేఱు. నీ యొక్క తెలుఁగు బాసయందలి యభిమానము విలక్షణమైనది. అది నీ సర్వకావ్యమునందున్నది. అదియే నిన్ను అభినవతిక్కనను జేసినది.

ఇతరములైన బహుశీర్షికలలో నందందు వీరి రచనా శక్తి సమృద్ధిగా గోచరించును. గాంధిజీని 'ఎరవాడ శ్రీ మందిరయోగి' యనుట యొక రమణీయమైన కూర్పు. గాంధిజీ సర్వ కాలములయందును ఎరవాడ జైలులోనే లేఁడు. కాని ఆయన అహింసా సిద్ధాంతము ననుసరించి భారతజాతికి స్వాతంత్ర్యము తీసికొనివచ్చు ప్రయత్నములో చెఱసాల యందుండుట, అందును చాలదినములుండుట సంభవించినది. ఆయన సాహాయ్య నిరాకరణోద్యమమునకు, చెఱసాలకు అవినాభావ సంబంధముగా భావనచేయఁబడి సర్వకాల సర్వావస్థలయందును చెఱసాలయందే యున్నాఁడన్న యొక భావము నాశ్రయించి యీ కూర్పు చేయఁబడినది ఇది నిజముగా యథార్థము కాదు. హృదయనిష్ఠమైన యొక భావముననుసరించి పరమయథార్థము. కవిత యిట్టి స్థలములయందే అధికరమణీయతను సంపాదించును.

ఆంధ్ర చరిత్రలో బ్రాహ్మణులు సేనానాయకులై చక్రవర్తులై మనిన ఘట్టము లనేకములు కలవు ఈ కవిమనస్సులో నదియొక గొప్పవిషయము. ఆంధ్ర నాయకుడన్న శీర్షికలో ఆంధ్రుల లోని విశేషములు చెప్పుచు 'ఘోరకదనవ్యాపార పారీణులై నుతికిఁజాలిన భూసురుల్లలరె తెన్గుం గడ్డ వర్ధించినన్' - అని వ్రాసెను. నేఁటికవితలో నిది యొక ఆశ్చర్యకరమైన విషయము

'ఎంత మొగమోటయున్న సాహిత్యమర్మ రసికులీ సీమవా రౌట రక్తిసెడదు' ఇది యొక యధార్ధకథనము. నేఁటి తెలుఁగునాఁటఁ గవితాభావుకత మొగమోటము నాశ్రయించియే యున్నదనవచ్చును. కాని సాహిత్యమర్మ వేత్తలు కలరు. కావుననే మహాకవులు మహాకవులుగా భాసించుచున్నారు. దానిని చౌదరిగారు రమ్యముగాఁ జెప్పిరి.

ఇందులో వినోబాభావేను గూర్చి చెప్పిన శీర్షికకు 'అతఁడు' అని పేరు. ఈ పేరు పెట్టుటయే చమత్కారముగా నున్నది. భావే తచ్ఛబ్దవాచ్యుఁ డన్నమాట. ఈ కవి సహజముగా సాధువు. భారతీయసంస్కారాభిమాని. బుద్ధుఁడు, గాంధి - వారి సిద్ధాంతములకు రసించిపోయెడి ఆర్ద్రమైన ప్రకృతి గలవాఁడు. తత్త్వము వారి యందే కలదని నిశ్చయము కలవాఁడు. గాంధిజీ తర్వాత మరలఁ దత్సిద్ధాంతములు సర్వంకషముగా ననుసరించుచున్న వినోబాభావేను తచ్ఛబ్ద వాచ్యునిగాఁ జెప్పుట యీ కవి యొక్క హృదయమర్మమును విప్పి చెప్పుమాట. అతని చేతికదురు 'ఒక మహాశాస్త్రమర్యాద నొంది వెలసెను'. ఆ శాస్త్రమునునిర్మించిన ఋషి గాంధిజీ. దానికి సూత్రకారుడు గాంధిజీభాష్యకారుఁడగు వినోబా. ఈయన కొన్ని వేదభాగములు తన మాతృ భాషయగు మహారాష్ట్రములోనికి భాషాంతరీకరించెను. ఈ విషయమును చౌదరిగారు చాల సొగసుగాఁ జెప్పిరి. 'ఒక మహావేదఋక్కు వానికిఁ గరంగి చల్లచల్లని దేశియై వెల్లివిరిసె'.

ఈ వినోబా యొక్క సిద్ధాంతము చౌదరిగారికి నచ్చినది. ఆ సిద్ధాంతము ననుసరించిననే కృతయుగమువచ్చును. కృతయుగ స్వరూపము తత్సిద్ధాంతము యొక్క ఆచరణదశ. దీనినే యీ పద్యములోఁ జెప్పుచున్నారు.

'కోటి కొకఁడైన వీనికి దీటువచ్చు
పురుషుఁ డుండిన మహికి రాచతిక మేల
శాసనము లేల యస్త్రశస్త్రమ్ము లేల
ధర్మదేవత నాల్గుపాదముల నడువ'

కవులు సామాన్యముగా నేదియో యొకసిద్ధాంతమునందిష్టము కలవారే! ఉత్తమ కవుల కేదోయొక సిద్ధాంతము తప్పకుండనుండును. ఆ సిద్ధాంతముల ననుసరించి ఆ కవుల కవిత్వము నకు కొంతమర్యాదయు కల్గుచుండును. సీతారామమూర్తి చౌదరిగారు గాంధీజీ యొక్క సిద్ధాంతానుమాయి.ఇది వారి కవనమునకు పట్టుఁగొమ్మ. వారి 'బాపూజీ-ఆత్మకధ' యే దీనికి సాక్ష్యము. ఈ సిద్ధాంతము వారి సర్వకవిత్వమునందును మణులలోని దారము వలె అనుస్యూత ముగా వచ్చుచునే యుండును. ఇది వారి కవితాసరస్వతికి జయపతాక.

**విశ్వనాథ సత్యనారాయణ**

# మా శబల

మా నరసయ్య "మామయ్యా! జంకుచునే యడుగుచున్నాఁడను. నీ కృతి నొకదానిం జేపట్టు భాగ్యము నాకుఁ గల్గునా ?" యని యైదాఱు నెలలనాఁడు లేఖ వ్రాయుదనుక నీ శబల యునికి నెఱుంగను.

ఏదియే నెన్నఁడుం గోరని మేనల్లుని కోర్కిని మన్నించుటెట్లా ? యని యేను మానసించి చిల్లరకొట్టుం దెఱచిచూడఁగా బ్రచురణార్హమగు రచనలు కొన్ని నా కంటఁబడినవి. "మావాని యభిలాషముం దీర్ప వీనినే యేల ప్రకటింపరాదు ? ఇది ఖండ కావ్య యుగమే కదా!" అని తలంచి యా యా సందర్భములం దిటీవలవ్రాసిన 'అతఁడు' మున్నగు మఱికొన్ని ముక్కలను సైతము వానితోఁ జేర్చి యొకరూపముం దీర్చి నేఁటి కిట్లు వెలువరించితిని. విషయవైవిధ్యమును బట్టి యీ సంపుటమునకు 'శబల' యనుపేరుంచితిని.

ఇందు సమకాలిక వ్యక్తుల నుద్దేశించి రచియించిన ఖండములు విస్తృతికిం గాకున్నను సంఖ్యకు హెచ్చుగాఁ గలవు. ఈ వ్యక్తులలోఁ గొందఱు మహాకవులు, కొందఱు మహానటులు, కొందఱు తాత్త్వికులు, కొందఱార్త బంధువులు, మఱికొందఱు రాజకీయ నాయకులు. వీరందఱు ప్రజాసేవ కంకితమైనవారు, ప్రపంచ కల్యాణము నాకాక్షించువారు. కావుననే వీరి చరిత్రలు నాకవితా వస్తువులై నిస్స్వార్థ ప్రశంసల నందుకొన్నవి. ఇట్టి చరిత్రలు సర్వసారస్వతములకును మూలబంధములనుట నిర్వివాదవిషయము. ఉదాత్తమగు నాంధ్రలోకము నా యితరకృతులకుంబలె దీనికిని స్వాగతము పల్కునని విశ్వసింతు.

ఈ సంకలనమున కలంకారముగా విపులయైన పీఠికను వ్రాసి నన్నాదరించిన కవి సమ్రాట్టులు, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారికి నా కృతజ్ఞతా పూర్వక నమోవాకములు సమర్పించువాఁడ.

తెనుఁగు లెంక

**తుమ్మల సీతారామమూర్తి చౌదరి**

# ఈవి

శా॥ నామేనల్లున కిల్లు వాకిలియుఁ గాంతావిత్తముల్ కామ్యముల్
గామిన్ జెద్దకలంగి డీల్పడుదు రక్తస్పర్శ మూలమ్ముగన్
సీమల్ దాఁటిన తద్విరాగము కృతిస్వీకారభోగాహిత
ప్రేమంబై వడితగ్గి నా మదికిఁ దృప్తింజూపె నీ నాఁటికిన్ 1

చ॥ ప్రతిభకు గాదు, నేరిచిన ప్రజ్ఞకుఁగాదు; వయఃప్రమాణ గ
ణ్యతకును గాదు; లౌకికమహత్తకుఁ గీర్తికి మూర్తికేని గా;
దితని జితేంద్రియత్వమున కేను గరంగి కృతిప్రదాతనై
సతత సుఖాయురున్నతి వశంపడ దీవనలిత్తు వీనికిన్ 2

ఉ॥ ఈతని తండ్రి సద్గుణ మహిష్ఠుఁడు; పండితుఁ, దస్మదీయ ధీ
చాతురి కాదితీర్థ; మభిజాతుఁడు సుబ్బయ మామకీన మీ
రీతి నెఱింగి పొంగు నను దృష్టియు నేత దుపాయనం బిడన్
హేతువు; పుత్రరూప గురుఁడేకద! వీఁడు శ్రుతిక్రమమ్మునన్ 3

క॥ అటు గురునిఋణము దీర్చుట, కిటు సోదరి బిడ్డవలపు నీడేర్చుట కొ
క్కటి చాలున్ బని యని వేం, కటనరసయ కితని కిడెదఁ గవితన్ శబలన్ 4

సీ॥ పతితోడ నపవర్గపదముఁ బాలించు నీ, జనని శేషమ్మ వత్సలత నింపి
కృతికన్య నన్ను కిచ్చితి మని దివినున్న, యనుఁగు జెల్లెలు ✦ రాఘవమ్మ పొంగి
నీ కాఁపురంపు వెన్నెల వెల్లిఁ దోఁగి మా, తామహి చెంచమ్మ తనువు వడసి
తనకుదు ర్వెలయింపఁ దలకొన్న నిన్నుఁ బౌ, త్రుఁదలంచి చల్లయార్యుండు సొగసి
గీ॥ తరుణ తరుణ, కుంకుమహరిద్రా సువర్ణ, శబల, సురభిళ, సుమన - యాసారధార
లెసఁగ దీవింప నిత్యసాహిత్య రాజ్య, రమను గైకొమ్ము జాస్తి వంశమణిదీప! 5

ఉ॥ శిక్షితచిత్తవృత్తిని వశీకృత వైదుషిఁ గావ్య శిల్ప స
ద్గక్షమధీ నుదారత నిరర్గళ దేశికతన్ స్వదేశ దా
స్యక్షతికై చెఱన్ బడిన యార్తి పరంపరఁ గన్నకీర్తి నీ
యక్షర సంప్రదాన మసువై నిలుపన్ బొలుపందు మల్లుఁడా! 6

---

✦ ఈమె నా మొదటి యిల్లాలు

# శబల

## సంక్రాంతి తలఁపులు

ఉ॥ వెచ్చని గడ్డిపై నడుగువేయుచు మంచు మొయిళ్ళ బంటుగా
వచ్చిన సీతురక్కసికి వంగక గిత్తలబంతి దోలుచున్
బుచ్చినకొయ్యలోఁ జివురుపుట్టునటుల్ వలిపాట పాడుచున్
రెచ్చిన జవ్వనంబును స్మరించెద నీ మకరోత్సవమ్ములన్ 1

చ॥ రెపరెప సెజ్జవీడి నిదురించు నెలంతను మేలుకొల్పి వం
ట పనులు దెల్పి జాలి నిగుడన్ ననుఁజూచు వెలంది సెట్టెటో
కృపకు దవిష్ఠఁ జేసి నడిరేయికడన్ బసితోడ నేగి రేఁ
గి పడుగునూర్చినాఁడఁ బరికింప నదెంత కఠోరనిష్ఠయో 2

చ॥ పడు గటు నల్లుచుండ నిటు పాఁతఱసంగతి నెంచి గింజలం
బిడిచిన నేకె నేర్చి సరిపెట్టి నెఱామొలత్రాడు కైవడిన్
బుడుపులురాని శిల్పములప్రోవును వెంటిని దీర్చి నిల్పినన్
సిడమువిధాన నిల్చెఁ బదిచేతుల పాటిది యయ్యు నయ్యెడన్ 3

చ॥ అరుణమయూఖబింబ ముదయాద్రికిఁ జేరకమున్నె పొట్టలో
నెరగలిసాగెనప్పు డది యేమి బుభుక్షయొ; కూటికావడుల్
దరిసెన మిచ్చుదాఁక నయధాతథమై నయనద్వయమ్ము నాఁ
డఱిముఱిపడ్డతీరు తెలియంగలవా రొకకాఁపులే కదా! 4

ఉ॥ బట్టన వ్రేళ్ళతో నదిమిపట్టిన మిర్యపుఁగాయ నంజుచున్
దెట్టలు తెట్టలై మిసిమిదేలిన మజ్జిగబువ్వ దోసిటం
బట్టి బుభుక్షతీవ్రతలు పాయఁగ జుఱ్ఱిననాఁటి తృప్తి నా
పొట్టకు ముట్ట దీ ముదిమిప్రొద్దుల సాపడు పిట్టమేఁతలన్ 5

శా॥ ఊరుంగాయలు పచ్చడుల్ పులుసు లేవోకూర లైదాఱు సాం
బారున్ మీఁగడ లప్పడాలు వడియాల్ వడ్డించినన్ నేఁ డిసీ
చేరెండన్నములోనికిన్ దిగ; దహెూ! చిన్నప్పుడే నొక్కగోం
గూరన్ గుండెఁడుకూడు మెక్కితి నెఱాగోతాలతో దూఁకితిన్ 6

ఉ॥ గట్టితనమ్ముచిందఁ బిడికట్టకు సాగిన దెబ్బదెబ్బకున్
బుట్టెఁడు రాలి రాశివడెఁబో! కుసుమల్; కడియమ్ము మీఁదికిం
బట్టినగడ్డి నొడ్డి పనపంజినచోఁ బదిమోపు లుందు నా
రెట్టబలమ్ము నేఁడు సయిరింపదు వీసెఁడుకూర లెత్తఁగన్ 7

ఆ॥ అఱ్ఱుపులిసి గిత్త యంకెవైచినతతి, నడుముగట్టి పట్టె మెడకుఁదార్చి
యూబిలోనిబండి నూఁపి లేపిన మొన, గాఁడ వెఱితు నిపుడు కడవఁదోడ 8

ఉ॥ ఆ బల మాజవమ్ము సగమైనను లేమికి నా వయస్సులో
నేఁబది రెండువత్సరము లేగుట కారణమౌనె ? తాతలై
ప్రాఁబడినట్టి కర్షకులు బంధుజనుల్ పిడిఱాళ్ళకైవడిన్
రేఁ బవలింట దుర్భరపరిశ్రమ కోర్చుచు నార్చుచుండఁగన్ 9

శా॥ ఈ దౌర్బల్య మకాలవార్ధకము నా యీకొన్న పీరమ్ముతోఁ
బ్రాదుర్భూతములయ్యె నొజ్జన మెదో భాగ్యంబుగా నెంచి నా
పాదెల్లన్ గదలించుకొంటిని రుజాభారమ్ము నార్జించితిన్
జేఁదున్ మెక్కితిఁ బంచదారయని సీ సీ ధర్మమున్ దక్కితిన్ 10

చ॥ ఒక మర కైవడిన్ గదలుచున్న యొడల్ కురిచీకి దత్తమై
సకలజవమ్ము గోల్పడియె సంధులు గ్రంధులు త్రుప్పువట్టెఁ బొ
ట్టకు శని దాపురించె నకటా! నికరమ్ముగు క్షుత్తు వోయె సం
దుకొనెఁదెగుళ్ళు మందులనుదోఁగితి వేఁగితి నొవ్వుక్రొవ్వులన్ 11

ఉ॥ రొక్కములేనినాఁడు కొమరుల్ తలచూపనినాఁడు వైదుషీ
రుక్కులు రానినాఁడు పదురున్ గొనియాడనినాఁడు గద్దియల్
దక్కనినాఁడు మానిసి వెతంబడ నొల్లకపోవుఁగాక వాఁ
డుక్కునఁ బేదయై రుజల కోడిననాఁడు తపింపకుండునా ? 12

ఉ॥ అన్నముఁ దిన్న చేతితడి యాఱియు నాఱకముందె వేళ పై
కొన్నఁ బ్రమాదమంచుఁ బరుగుల్ నురుఁగుల్ వెడలించి రొప్పుచు
న్నన్నినవేసటన్ నిలువఁబట్టుచుఁ దిన్నది గొంతుదాఁటి పో
కున్నను బారముల్ నుదువుచుండవలెన్ విధి కంజలించుచున్ 13

చ॥ అటు నిటు నేగివచ్చి గడియారపుఱంకెల కోహటించి యాఁ
కటినెగు లెంతయున్న నరికట్టి హుటాహుటి దుమ్ముఁగాళ్లతో

జొటజొటజాఱు క్రొంజెమరుఁజుక్కలతో బడికేగి నాయికా
నటనలు సెప్ప లంకణమునన్ మఱుగల్పు తెఱంగు కన్పడున్ 14

కII పదుగురకుఁగాదు మతి యి, ర్వదిమందికిఁగాదు బుద్ధి బలశూన్యుల కేఁ
బదిమందికి వినఁబడున, ట్లదలింపవలెన్ గళంబు నాసాయమ్మున్ 15

చII వలచి పఠించువారు పదివందలు వచ్చిన ముద్దుముద్దుగాఁ
దెలిసినవట్టు నేర్పి పరితృప్తి వహింతు సహింతుఁగాని కా
కులు వరశుల్కపుంజదువు గోరెడి బొట్టెలు చట్టు లైనచోఁ
గలఁగి నలంగి నెవ్వగలఁ గందక కుందక యుంట శక్యమా ? 16

ఉII మూఁగిన యూర్పుతోడఁ దలమున్కల వేదనతోడఁ బారముల్
వాఁగినఁ జాలునా ? పొరలివచ్చు పరీక్షలు లక్షదోసముల్
రేఁగిన వ్యాసముల్ పొరిఁబొరిన్ సవరింపకతప్ప దొజ్జకున్
మూఁగినపాప మీ చెనఁటిమందలవ్రాఁతల దిద్ది తీర్చుటల్ 17

ఉII చర్చలు చేసిచేసి, గురుసత్తములం గొనియాడియాడి, నా
నేర్చిననేర్పలంతి యననేరను; సోమరిఁగాను; బల్మిపో
నార్చితి నిన్నినాళ్ళు తుద కబ్బిరి నల్గురు మేటిశిష్యు లే
నోర్చిన తక్కునోవి యిసిరో! వితయైనది చెత్త నూర్చుటై 18

ఉII కూఁతురు వంజయౌట కనుఁగోక మగంటిమి లేనివాఁడు జా
మాత యటన్నటుల్ పనికిమాలినశుంఠలు తోఁకలేని యీ
క్రోఁతులు నెగ్గకున్న నది కోవిదులోటని తేల్చి వానికిన్
వాతలు పెట్టఁ జూతు రనివార్యులు జీతము నిచ్చు నేలికల్ 19

ఉII ఇంత శ్రమించి యీ తొడుగునీడ్చి గడించెదు సంబళంబు వా
రాంతము రాకమున్నె వ్యయమై చను నెంత బిగించిపట్టినన్
సంతనచేసి మత్పిత యొసంగినభూములు బుట్ర లుంట నా
గంతులు సాగుచున్నవి బికారికిఁ బెట్టఁగ, నిల్లు నెట్టఁగన్ 20

ఉII నెట్టిక సీల నొజ్జను గణించుట మెచ్చుట కల్గినప్పు డీ
పొట్టకు బట్టకైన సరిపోవని రాబడి కియ్యకొందు; మై
గట్టితనమ్ము క్రక్కదలి గాసికి దాసుఁడనౌట సైత మె
ట్టెట్టొసహింతుఁగాని పరు వెంత వశంపదు నయ్యవారికిన్ ? 21

ఉ॥ కూటికిలేని సోమరులకున్ సరిపోవును గాని సేద్యపుం
బాటునమున్గి తేలు బలభద్రులకున్ బడికొల్వు గిట్ట, దీ
మాటలు త్రచ్చి సెప్పితిసుమా! యివిఋక్కులమీఁది ఋక్కు; లీ
బాటకు రండు మోహ మెడఁబాసి సుఖింపుఁడు కర్షకప్రజల్! 22

ఉ॥ "పంతుల వౌట నీకవిత పండె, సముజ్జ్వల కావ్యసృష్టికిన్
సంతనకట్టి గెల్చితి, ప్రజల్ ప్రభువుల్ కనకాభిషేక భా
స్వంతు నొనర్పఁ గుల్కితి, వసత్యమె యీపలు" కందురేని రా
ద్ధాంతముజోలికేగ, వినయమ్మెసరేఁగ శిరమ్ము వంచెదన్ 23

(22-12-53)



## వీరపూజ

మ॥ జయనాదమ్ములు, హస్తచాలిత ధనుర్జ్యావల్లికా టంకృతుల్
వియదగ్రమ్ములఁదాఁకఁ, బూజ్యులు పురావీరుల్ పునారూపముల్
గయికొన్నట్లు తెలుంగు ప్రాంగణములం గ్రైసేయుచున్ నిల్చి త
న్మయతంగూర్చు నొయారిపాపలకగున్ బ్రహ్మాయురారోగ్యముల్ 1

చ॥ నిజసుఖ ముజ్జగించి, ధరణీహిత ధర్మభరమ్ము సైఁచి, దు
స్త్యజములు రాగవైరముల కానలువెట్టి, జగజ్జనమ్ము ల
క్కజపడ నిల్చి గెల్చి నుతి గాంచిన వీరుల కంజలించి, యీ
విజయ మహాఃఫలం బనుభవింతు శరన్ముఖ రమ్యవేళలన్ 2

సీ॥ తన సవ్యసాచిత్వమున గర్వితారాతి, సంహర్తయై లోకశాంతి గూర్చి
తన మేనిమాంసమ్ము తతిగి త్రాసునఁ బేర్చి, యార్తరక్షాదీక్ష కల్లువెట్టి
తన జీవమునకు జీవనమైన కవచమ్ము, కోసి దాతృప్రథాకోటి కెక్కి
తన ప్రాణ మల్లాడి తల్లడంపడువేళ, జతపడ్డ కూడు నీ రతిథి కొసఁగి

గీ॥ వీరతాపూరితంబైన భారతమ్ము, సృష్టిచేసిన పార్థుని, శిబిని, గర్ణు,
రంతిదేవుని హృన్మందిరాంతరమున, నిలిపి కవితా ప్రసూనముల్ నినిచి కొలుతు 3

చ॥ పుట్టినయింటి రాచసిరిపొంగులు, జవ్వనపుంబసందు. చే
పట్టిన రాణి చక్కనలు, పాపనితీపి దొఱంగి దైన్యపుం
గుట్టలు గూల్చి లోకమునకున్ సుఖశాంతులుగూర్పఁ గావులం
గట్టిన శాక్యసింహుని వికస్వర వీరగుణంబు మెచ్చెదన్ 4

సీ॥ ఉత్తమవాగ్మినా నొప్పారె నురక గ, ర్జించియా కాదు వర్షించి నుడులు
అతిలోకబల సమంచితుఁ డయ్యెఁ గండలు, పెంచియా కా దలయించి యొడలు
చిరజయశ్రీ ధురంధరుఁ డయ్యె రిపుల ఖం, డించియా కాదు పండించి కృపలు
అమృతత్వమందె యాగము లాచరించియా, కాదు నిష్కామయోగము వరించి
గీ॥ యతఁడు సామాన్యుఁడెట్లు ? వీరత కపూర్వ, జీవములు పోసి వాసి దెచ్చిన మహాత్ముఁ
డతని నడిచిన బాటలయందు నడిచి, పందయును సత్యవిక్రమాస్పదుఁ డయ్యె 5

ఉ॥ కావిరిచీఁకటుల్ దెసలఁ గ్రమ్మిన ప్రొద్దుల వ్యాసవాఙ్మయ
శ్రీవెలుఁగుల్ తెలుంగున సృజించి విశంకట వీరమార్గ మాం
ధ్రావలికై వెలార్చిన మహాకవిభాస్కరులన్ భజింతు నా
నావిధ వైదికార్చనల నన్నయ తిక్కన శంభుదాసులన్ 6

ఉ॥ పొత్తులలోనికూనకును బుస్తె బిగించి యనాథ పెండ్లి పే
రెత్తిన మందు ఛాందసుల యేల్పడిపై నసిదూసి దుర్భ రా
పత్తుల కోర్చి నెగ్గిన యపారపరాక్రముఁ గందుకూరి వీ
రోత్తము నెంచెదన్ నవయుగోదయకారణు సాహితీరణున్ 7

సీ॥ తరతరాలచరిత్ర త్రవ్వి యెత్తిన వీర, భద్రున కారతిపళ్లెమెత్తి
విజ్ఞానచంద్రికల్ వెదచల్లి నుతిగన్న, కొమరరాజున కణంకువలు చాటి
వేనోళ్ళ జాతీయవిధు లుగ్గడించిన, నాగేశునకుఁ బాలభోగ మొసఁగి
ఆంధ్రోద్యమ స్యంద నాదిచోదకుఁడైన, వెంకటప్పకు నెఱావిరులు చల్లి
గీ॥ యాంధ్రి కభినవభారతమందు మన్న, నలు గడించిన ✦ యన్నపూర్ణమకు నెరఁగి
వీరపూజానురక్తి నుద్వేలమైన, యస్మదావేశమునకు ధన్యతను గూర్తు 8

---

మాగంటి అన్నపూర్ణాదేవి
(ఆలిండియా రేడియో – విజయవాడ కేంద్రమువారి సౌజన్యముతో)

ఉ॥ జాముని కొక్కముక్క వరుసన్ దనువంతయు రాష్ట్రసిద్ధికై
హోమముచేసి లోకములనూఁపి యభీప్సితమందుకొన్న శ్రీ
రాములు వందవందల తరాలకుఁగా నొకసారి పుట్టు స్వ
క్షేమమునెంచి తాదృశులశీలము జాతి జితించుకోవలెన్ 9

గీ॥ ధనువు లమ్ములు హనుమ కేతనము లూని, శూలచిహ్నితమంజులాంశుకము లూని
"వీరకొలుపు"లు సాగించు పిన్న పెద్ద, లద్దములు తెల్గుజాతిమర్యాద వెలయ 10

**(10-9-54)**



## కర్ణుఁడు

శా॥ దీక్షన్ బాండవ ధార్త రాష్ట్రులకు సంధింగూర్చి; విశ్వప్రజా
రక్షం జేయఁ దలంచి; కౌరవసభారంగమ్మునన్ నీతివాగ్
దక్షత్వంబును జూపి శౌరి తనవాదంబెల్ల వమ్మౌట స
ర్వక్షోభంబులు నీకుఁ దప్పవని రారాజున్ దుటారించుచున్ 1

చ॥ అరదమునెక్కి పోవుసమయంబున నంబుజనాభువెంట సు
స్థిరతరభక్తిఁ గుంభజనదీసుతముఖ్యులు రా ముకుందుఁ డా
దరమున వారలన్ నిలిపి, ధన్యుని గర్ణుని జీరి తేరిపై
సరసను నిల్పి యిట్లనెఁ బ్రసన్నవచోవిభవాభిరాముఁడై 2

శా॥ "కర్ణా! నీవఖిలార్థవేదివని పల్కంజెల్లదే యైన నా
కర్ణింపందగు నాదుపల్కు; లవి మేల్గావించు; భాస్వద్వరో
దీర్ణత్వంబున నీవు పుట్టితివి కుంతీకన్యకుం దొల్లి; సం
పూర్ణప్రేమను సూతదంపతులు నిన్ బోషించి రిన్నాళులున్ 3

క॥ ఆ కారణమున ని న్నీ, లోకులు సూతుఁగ మనమ్ములో నెంతురు; సు
శ్లోకుండగు కౌంతేయున, కీ కరణిన్ నీచనామ మేలా ? చెపుమా ! 4

శా॥ దుష్టాగ్రేసరు ధార్త రాష్ట్ర నిటు లెంతో భక్తిసేవించి; నీ
శిష్టత్వంబునకుం గళంకమిడి, వాసింబాసి భూభృత్కృపా

దృష్టింగోరుదువేని ధర్మరతులై దీపించువా రిస్సిరో
కష్టాచారుఁడు భానుసూను వని శంకంబాసి నిందింపరా? 5

శా॥ రాజద్భారతసార్వభౌమపదవిన్ రాజించి సర్వక్షమా
రాజస్తోమకిరీట సంఘటిత సద్రత్నప్రభాపుంజ వి
భ్రాజత్పాదుఁడవై సమస్తజన సంభావ్యుఁడవై వెల్గిన
ట్లేఁ జేయించెద నీదు సోదరులచేఁ; నేతెమ్ము కుంతీసుతా! 6

ఉ॥ తమ్ములఁగూడి యెంతయు ముదమ్మున భారతసార్వభౌమ పీ
ఠమ్ము నలంకరించి నికటమ్మున ధర్మసుతుండు చామరం
బిమ్ముగవీవ, వాయుసుతుఁ డెల్లిసిబట్టఁ, గిరీటి సారథి
త్వమ్మొనరింపఁ, గుఱ్ఱలిరువంకలఁ గొల్వ, వెలుంగుటొప్పదే ? 7

సీ॥ అఖిల లక్షణ లక్షితాంగి పాంచాలి నీ, న్నారువ భర్తగా నభిమతించు
నినుఁ గన్నతల్లి కుంతీదేవి దీనికై, యెంతేని మదిలోన సంతసించు
నిఖిల బాంధవమిత్ర నివహంబు నీరాక, కనుపమానందంబు ననుభవించు
లోకైకశౌర్యు లస్తోక సద్గుణధర్యు, లగు పాండవేయు లాహా! యటందు
గీ॥ రిందులకు నించుకేనియు సందియంబు, చెందఁ బనిలేదు రాజ్యలక్ష్మీకరాబ్జ
సంగ్రహం బొనరించి శశ్వద్విభూతి, నతులవిఖ్యాతి గాంచవయ్యా ! సునీతి !” 8

మ॥ అనినం గర్ణుడు కృష్ణుఁగాంచి వినయవ్యాపార మేపార ని
ట్లను “దుర్వాసు మునీంద్రునింగొలిచి, తా నాదిత్యమంత్రంబు నే
ర్చి, ననుంగన్నియనాఁడు గొంతి కనె నన్ వృత్తాంత మొక్కింత నే
వినియున్నాఁడ మహాత్మ ! సర్వజగతీవిద్యోతితప్రాభవా ! 9

శా॥ కన్యాత్వంబున కంతరాయ మకటా కల్గెంగదాయంచు సౌ
జన్యశ్రీనిధి కుంతి చింతవడి, వాత్సల్యంబువోనాడి, న
న్నన్యాయ్యంబనుచుందలంపక ప్రవాహంబందు వైవన్ జగ
న్మాన్యుం దత్తటిఁ దెచ్చె సూతుఁ డనుకంపానిఘ్న చిత్తంబునన్ 10

క॥ అల్లారుముద్దుగాఁ దన, యిల్లాలును దాను బుత్త్రుఁ డీతండని నన్
జల్లగఁబెంచెను మేనం, బెల్లుగ మలమూత్రరాశి పెనఁగొనుచుండన్ 11

శా॥ కుంతీపుత్త్రుఁడ క్షత్త్రవంశజుఁడ నాకు న్మీకు సంబంధ మా
వంతైనంగలదా? యటంచు నను బాల్యంబాదిగాఁ బెంచి య

త్యంత ప్రేమముఁజూపువారి నిపుడన్యాయ్యంబుగా వీడి ని
శ్చింతన్ బాండవులందుఁ జేరిన జనుల్ "ఛీ" యంచు నిందింపరే? 12

శా॥ బద్ధప్రేమ నితండు సూతుఁడనుచుం బాటింప కత్యంత సం
శుద్ధస్వాంతతఁ జేరఁదీసి ధరణీశుంజేసి దుర్యోధనుం
డిద్ధత్వం బొనగూర్చి నన్ సచివుఁగా నేలంగ యుద్ధంబు సం
సిద్ధంబైనతఱిన్ విరుద్ధమతి నిస్సీ వీడి రాఁజెల్లునే ? 13

ఉ॥ ఏను గిరీటి నోర్తునని యెంతయునమ్మికఁ గౌరవేంద్రుఁ డ
ప్పూనిక నాపయి న్నిలిపి పొంగుచునుండు నిరంతరంబు, న
ద్దానిని వమ్ముచేసి దురితంబున కి ప్డొడిగట్టి పాండు భూ
జానికుమారులం గలియు సాహస మెట్లొనరింతు? మాధవా! 14

శా॥ దుర్వారోద్యమశౌర్యవీర్యవిలసద్దోర్గర్వమేపార, గం
ధర్వాదుల్ దివిఁ బాద, సంగరకళాతత్త్వంబు దీపింపఁగా
సర్వోర్వీశులు మెచ్చఁ బార్థుని మహోత్సాహంబునం దాఁకియు
ద్ధోర్విన్ గ్రీడయొనర్పకున్న నగరాక్కో? లోకు లీ కర్ణునిన్ 15

శా॥ నేనున్నాఁడ నిఁకేమిలోటనుచుఁ దా నిర్భీతిమై నాజికిం
బూనెం గౌరవభర్త పాండవులతోఁ బోటెత్తి; యిప్పట్టునం
దే నేరీతి సుయోధను న్విడుతు? నీ యెగ్గెట్లు సైరింతు? నా
హా! నట్టేటను బుట్టిముంచుపని యార్యశ్రేణి మన్నించునా ? 16

మ॥ ప్రజకుందల్లియుఁ దండ్రియున్ గురుఁడు భూపాలుండెకా! వానిపై
నిజభక్తిం బ్రకటించునెవ్వఁ డతఁడే నిక్కంబుగాఁబుణ్యుఁ, డా
సుజనుండేతగు నిందునందును సుఖస్తోమంబునందంగ, దా
స జనాధీన! యెఱింగి యేపగిది రాజద్రోహముం బూనుదున్ 17

మ॥ చతురంభోనిధి మేఖలాఖిల మహీసామ్రాజ్య సింహాసన
స్థితుఁ గావించెద రమ్మటందు; విపు డిస్సీ! లజ్జకుం బాసి దు
ర్మతినై స్వార్థమునందుఁజిక్కి, యవమారంభంబులంబూని శా
శ్వత దుష్కీర్తిగడింతునా? రవిసుతవ్యాపార మీపాటిదా? 18

మ॥ శరదంభోధర చంచలాచపలమీసామ్రాజ్యభోగంబు కుం
జరకర్ణాంతవిలోల మంగ మిఁక నాసంవర్తకాలంబు సు

స్థిరమై ప్రస్తవనీయమై విమలమై చెల్వొందు నకీర్తి యిం
దరయన్ దేనిఁ బరిగ్రహింపఁదగుఁ గృష్ణా! యానతీయంగదే 19

శా॥ ఇన్నాళ్లాతని యుప్పుఁ బప్పుఁ పులు సెంతే మెక్కితిన్; బాస లె
న్నెన్నోచేసితిఁ; "బ్రాణమానములు నీవే నమ్ము" మంచంటి నో
యన్నా! యిత్తటి నక్కుదుప్రవరు నన్యాయ్యంబుగా దుఃఖ సం
పన్నుంజేసిన ఘోరదుర్గతులు సంప్రాప్తింపవా? నొంపవా? 20

శా॥ అక్షీణంబగు దీక్ష నన్మనిచి, విద్యాబుద్ధులంగూర్చి, స
ర్వక్షేమంబు లొసంగినట్టి నృపతిన్ వర్జించి, దుర్వృత్తి నీ
రక్షఃకృత్యమొనర్తునేని తుదకున్ రాఁబోవుమేలెద్ది ? సీ !
భిక్షావృత్తిఁ జరించుటొప్పదె గుణాబ్ధీ ! లోకముల్మెచ్చఁగన్ 21

శా॥ స్వామిద్రోహ మొనర్చి, సర్వధరణీచక్రంబుఁ బాలించి, మ
ర్త్యామోహంబును బెంచి, నింద్యమగు పేరార్జించి జీవింపఁగా
నేమాత్రంబును సమ్మతింప; దనుజారీ ! రాజభక్తి ప్రియుం
డీమాన్యుండనఁ బేరుగాంచెదఁ; బవిత్రేచ్ఛన్ బ్రవర్తించెదన్ 22

ఉ॥ పాండవధార్తరాష్ట్రులకు భండన మయ్యెది తప్పఁబోదు; త
ద్భండనసీమ ధర్మజుఁ డపారజయంబును గాంచి సౌరవే
దండ వియద్ధునీ గిరిసుతాప్రియ కుంద మరాళ చంద్రికా
పాండురకీర్తి సంపదల భాసిలు; నందియమేల? మాధవా! 23

శా॥ తమ్ముల్ ఋత్విజులై వెలుంగఁగ, నుపద్రష్టృత్వముందాల్చి హ
ర్షమ్ముంజూపుచు నీవునిల్వ, దృఢదీక్షాకంకణంబూని తే
జ మ్మేపారఁగ ధార్త రాష్ట్రపశుహింసన్ భీమసంగ్రామ యా
గమ్ముం జేయును ధర్మపుత్రుఁడు జగత్కల్యాణసంధాతయై 24

ఉ॥ భాసురపుణ్యమూర్తులగు పాండుకుమారులుగాక దూషితా
భ్యాసులు కౌరవుల్ రణమునందుజయింతురె? ధర్మమెచ్చటన్
వాసిగనుండు నచ్చట ధ్రువంబు జయం బనరొక్కొ పండితా
గ్రేసరులైనవారు నృహరీ ! పెఱమాటలు వేయునేటికిన్ ? 25

క॥ ఎన్నఁడొ కన్నెతికంబున, నన్నుంగని గొంతి విడిచె నదిఁ, బాండవు లీ
యన్న మొగం బెఱుగరు, "మీ, యన్నయ్య" నటంచు నిప్పు డనిన న్నగరే ?" 26

చ॥ సదమల ధర్మమూర్తియు నజాతవిరోధియునైన ధర్మజుం
డిది వినునేని రాజ్యరమ నేల గ్రహించును నా కొసంగ క
య్యదితగునే మహామహుఁ డనంతగుణాఢ్యుఁ డతండు సత్యసం
పద లలరార లోకపరిపాలన సేయకయుండు టొప్పునే 27

మ॥ కరుణాపూరితమైన చిత్తమున మత్కల్యాణముంగోరి యి
త్తటి నీవాడిన మాటలన్వినక యీ దాసుండు మాఱాడె నే
వెరవుం దోఁపమి; దీని కల్గకు ననున్ వెన్నాడి నీచక్రియా
చరణాసక్తునిగా నొనర్పకు నమస్కారంబిదే మాధవా? 28

గీ॥ ఇంక నొకమేలుసేయు మో పంకజాక్ష !, యుష్మదస్మత్ప్రసంగంబు నొక్కమాట
నైన నొరులకుఁ జాటక మానసంబు, నంద నిలుపుము పరమరహస్య మగుట 29

చ॥ సెలవు నొసంగవయ్య యదుశేఖర ! నేనిఁకఁ బోయివత్తు నన్
దలఁపున నిల్పవయ్య భయదంబగు సంగరసాగరంబు ను
జ్జ్వల భుజశౌర్యనౌక నిరపాయగతిన్ దరియించి నిన్ను న
వ్వలఁగనుఁగొందుఁగానియెడ స్వర్గమునం గనుఁగొందు మాధవా! 30

క॥ అకలంక రాజభక్తిం, బ్రకటించుచుఁ గర్ణుఁ డిట్లు పలికిన విని నం
దకుమారుఁ డద్భుతానం, ద కీర్ణహృదయంబుతోడఁ దా నిట్లనియెన్ 31

చ॥ బళిబళి మెచ్చితిం గమలబంధుకుమార! యుదార! నీ సము
జ్జ్వల హృదయంబెఱుంగ నిటుపల్కితి నల్కవహింపకయ్య నీ
విలసితవృత్తమున్గని వివేకులహెూ! యనకుందురయ్య ని
ర్మల నిరవద్య కీర్తి నసమానుఁడవై మనవయ్య ధీనిధీ ! 32

క॥ అని కర్ణుమెచ్చి కృష్ణుం, దనఘు నతని వీడుకొల్పి యర్కజుచరితం
బున కెద నబ్రంపడుచున్, జనెఁ బాండవులున్న యెడకు సరభసగతితోన్ 33

(10-12-26)



# హరిసర్వోత్తమరావు

(గీతమాలిక)

కదలుకొని దాస్యశృంఖలా కాళరాత్రి, ముసురుకొల్పు తపస్సులో మునుఁగుదిద్ది
కాలు ఓగఁదన్ని రేలు పగళ్లు మఱచి, తరతరమ్ములు శతశతాబ్దములు దాఁటి
గుబ్బువెట్టుచునున్న తెల్గుఁదోలమ్ము, దశదిశల నొక్కపెట్టున దద్దరిల్లఁ
గొనరి మేల్కొల్పు పాడిన కోడిపుంజు
నీచ పరతంత్రతాపిశాచీ చిరత్న, గర్వనిర్వాస నారబ్ధ కదనకేళి
నోడిగిల్లని రక్త మెవ్వాఁడు మోయు, నతఁడు కశ్మలజలవాహియైన యలంతి
గుంటయని వీరగీతమ్ము క్రోల్చిక్రోల్చి, కులము చెవిత్రుప్పు దుల్పిన కోకిలమ్ము
రగలిరగిలి పైకొన్న పరప్రభుత్వ, రోష దావానలచ్ఛటా రుంద్రఘాటి
కోహటిల్లక పిడుగుల నురవడించి, గర్జవేసిన తొలుతెల్గు కాఱుమబ్బు
తూర్పుపడమర లెఱుఁగక తొలకరించు, మార్పు తెలియక వేఁడినిట్టార్పు లూర్పు
తెలుఁగుసంసారమును గాంచి కలముపూని, సార విజ్ఞానచంద్రికాపూర మాంధ్ర
జగతి వెల్లిగొల్పిన కళాసాగరమ్ము
శారదాపాద హైమమంజీరనాద, కాంచికారత్నకింకిణీ క్వణనినద
పులకితమ్ముల జనపదమ్ముల రచించి, లలితవిశ్రుతి నార్జించు తెలుఁగువీణ
పేరుపెంపులు లేక యేఁకారుచున్న, యఱవపితలాటమున నిచ్చ లణఁగుచున్న
కష్టజనకంబు నుమ్మడికాఁపురంబు, నీఁదలే కాదరించు దిక్కేదియున్న
తల్లిదైన్యమ్ముసూచి స్వార్థమ్ముఁద్రోచి, రాష్ట్రనిర్మాణ దీక్షారిరక్ష నాంధ్ర
జనమహోద్యమ స్యందన సారథిత్వ, భరము పూనిన తెల్గులపసిఁడికొండ
గాడిచర్ల కులార్ణవ కౌస్తుభంబు, తెలుఁగుఁదోఁటను విరిసిన వెలఁదిమల్లె
యగుచు మన హరిసర్వోత్త మాభిధానుఁ, దఱువదివసంతముల పెంపు ననుభవించి
మూఁడుకోట్ల తెలుంగు లీనాఁడు పొంగఁ, బంచి పెట్టెను సంక్రాంతిపర్వసుఖము
వీరపూజా మహోత్స వావిష్టులగుచు, నారతులు పట్టి రాంధ్రులు దారమతులు
జయజయారావ మింటింట సందడించె, నక్ష రానంద మింటింట నవతరించె
మాతృసేవాపరాయణ మనసుఁ డగుచు, దేశగౌరవరక్షణోద్రిక్తుఁ డగుచు
లోకకల్యాణకృత్క్రియా లోలుఁడగుచు, నీదృశమహోత్సవంబు లెన్నేని బడసి
తెలుఁగువీరుఁ డితండు వర్ధిల్లుఁగాక !, తెలుఁగుతల్లికిఁ దనివి సంధించుఁగాక !

(10-1-46)



# మెచ్చుకోలు

(కొప్పరపు సోదరకవులు బాపట్లలో ఆశుకవిత్వము చెప్పినతఱి)

(ఉత్పలమాలిక)

మిన్నులుముట్టె హర్షము సమీహితముల్ ఫలియించెఁబో! సుధీ
సన్నుతసాహితీబల వశంవదసత్కవితా సమార్జితా
భ్యున్నతకీర్తులార! కవిపుంగవులార! నట న్నగాత్మజా
హృన్నలినార్కశీర్ష లుర దీడిత గాంగఝురీపరంపరా
సన్నతరాశుకావ్యకృతిచాతురి సూపిన మిమ్ముఁ గాంచి మా
పున్నెము పంటపండెఁ - గృతబుద్ధులు సిద్ధులు తెల్గుభూమిలో
నెన్నికగన్న సత్కవు లనేకులు పుట్టిరి గాని యాశువుం
బన్నెదు చాకచక్యమున బందసమస్యలగుండె నుగ్గుగాఁ
దన్నెదు నేర్పులోనఁ దమధాటికిఁ జాలినవాఁడు లేఁడహో !
యెన్నిభవంబులన్ దొరకె నింతటిభాగ్యముమీకు - మిమ్ములం
గన్న తెలుంగు శారదకు గౌరవభారపు గర్వభారపున్
బ్రన్నన హెచ్చె - నన్నకవిపల్కు నెదిర్చి రసాలవాల మై
మన్ననగన్న కావ్యము కుమారుని పుట్టువు పల్కి తెల్గులో
మున్నుగఁ జెప్పనోఁచు కవిముఖ్యుఁ డనందగు నన్నెచోడఁడున్
సన్ననిజానుఁ దెన్గుల పసందులు విందులు గూర్చి తద్దయున్
విన్నను వొప్ప భారతకవిత్వము సెప్పినతిక్క నార్యుఁడున్
దిన్ననికూర్పులోఁ గృతులు దీర్చిన నేర్పరి శంభుదాసుఁడున్
గన్నదదేవరాయ పరికల్పిత హేమమయాభిషేక సం
పన్నుఁడు భారతీకృతతపః ఫల మక్కవిసార్వభౌముఁడున్
జున్నులుమీఁగడల్ మెదిపి చుబ్బనచూఱ లొనర్చె నెవ్వఁ డా
తెన్నలి రామకృష్ణుఁడు సుధీపరినందిత కల్పనౌచితీ
మ న్నవకావ్యకర్తృపదమాన్యుఁడు పింగళిసూరనార్యుఁడున్
గన్నులు వేయిగాఁగ మిముఁగాంతురు మీకవితాప్రభావముల్
కిన్నరసిద్ధ సాధ్యసురఖేచరకోటికి విప్పిచెప్పి య
న్నన్న! సెబాసు! మమ్ముఁ గనినట్టిది గుంటురుమండలంబు కీ
ర్తి న్నిలఁబెట్టినట్టికవిధీరులు కొప్రపు వీరు లంచు న
వ్విన్నన నిల్చి కల్పతరువీధుల పువ్వుల మిమ్ము ముంతు - రీ
తెన్నును గంటిరే - పరిణతింగనె మీసుకృతంబు - వాసికిన్

వన్నెకుఁ జేసుగన్న కవివర్యులు మీవిజయధ్వజాళి వి
ద్వన్నికరంబు మెచ్చ వసుధాస్థలి నారవితారకంబుగాఁ
జెన్నువహించుఁ గాక! మనచెల్మికిఁ జేర్మికి నెల్ల లేమిచే
త న్నెఱమెచ్చుసేంత యుచితంబగునాయని మానసోత్థమీ
పెన్నుబలాట మి ప్పడిమిపెట్టెద, నింకొకనాఁటిసత్కృతిన్
మ న్నిరవద్యపద్యపటిమం బ్రకటింతు రసోల్బణంబుగన్

**(10-5-40)**



## పశువైద్యము

ఉ॥ పాఁడియుఁ బంటయున్ బ్రథమభాగ్యముగా మదినమ్మినిచ్చలున్
వాదని దీక్షతో సురభివంశము నేలుచు నేలమన్నుచున్
నాఁడును నేఁడు శాంతిసదనమ్ముగ భారతిజాతి వెల్గు నీ
పోఁడిమి రాదు రాదు పరభూముల కెన్నియుగాలు దాఁటినన్ 1

శా॥ డబ్బారేకులు, గాజుగొట్టములు, ఘంటాయంత్రముల్, కత్తెరల్
రబ్బర్‌తిత్తులు, గుండుసూదులు, కెమేరాఫిల్ములున్, సబ్బులున్
రిబ్బన్లున్ సృజియించు దేశములు సర్పిస్సుంది రాజాన్నముల్
ప్రబ్బంజాలిన భారతమ్ముఁ గని యుత్పాదించు నిశ్వాసముల్ 2

ఉ॥ మీఁగడమెక్కుచున్ బసులమేపెను మాపెదవేల్పు, మూఁపుపై
నాఁగలి మోపి శాత్రవగణమ్ము నదల్చె నొకయ్య, గిత్తపై
సాగుచు నొక్కవేల్పు జలసంపద పంచును సేద్యగాంధ్ర కీ
భోగము యోగమున్ భరతభూమికిఁ దక్కె నగణ్య పుణ్యమై 3

ఉ॥ పావన జీవనాభిరుచి పంది జగద్ధితబుద్ధులైన మా
యావుల పాలు ద్రావిన మహర్షులు క్రోల్చిరి ధార్మిక ప్రభా
జీవములైన వేదములు, సెప్పిరి గీతలు, చేసి రిద్ధ వా
ణీవరణీయ శిల్పసరణిన్ మధురామర కావ్యసర్గముల్

చ॥ నిశలు పగళ్ళు గాసివడి నేలనగల్చుచు వ్రేఁగు నీడ్చుచున్
గృశతలఁ దూల్చు దుగ్ధ మొలికించుచు నుర్వికి జీవగఱ్ఱ లౌ
పశువుల హర్షముల్ నరుల పండువులౌ టరుదా? గదాళికిన్
వశపడి మూల్గుమంద మన వాసికి వన్నెకు మచ్చయౌఁ గదా! 5

ఉ॥ భోగము లాసచేసి పలుపోకలఁ గుత్తుకబంటి మెక్కుచున్
రోగములన్ దగుల్పడు నరున్ బ్రతికించు భిషక్కుకంటె బా
గోగులు చూడ కింత తృణమో కణమో తిని మర్త్యపాలి క
ల్పాగమమై శ్రమించు పసి నారయు వెజ్జు గరిష్ఠుఁడౌఁ గదా! 6

చ॥ పశువుల పెంపు కర్షకుల భాగ్యము; కర్షకతుష్టి సర్వ లో
క శుభము; లోకశాంతి ప్రభుకామ్యము కానఁబ్రభుత్వపీఠముల్
వశపడియుండు నెవ్వరికి వారు పశూన్నతిఁ గోరి వాని దు
ర్దశలఁ దొలంగఁ జేయు కవిరాజుల నెల్లెడ నిల్పు టొప్పగున్ 7

చ॥ పసరపు మూఁగబాస విను ప్రజ్ఞలు నేర్చి తదీయ సేవకున్
విసుగక మందు మాఁకులిడు వెజ్జులు, భూతదయారసార్ద్ర మా
నసులు, సమస్త కర్షకజన ప్రియబంధువు లాయు రున్నతుల్
పొసఁగ సుఖింత్రుగాక ! మన భూమికి నేర్పడుఁగాక! భద్రముల్ 8

**(21-12-53)**



## రంగా

కII నిను దేశభక్తుఁగా మె, చ్చినవారలు కలరు మహి నశేషప్రజ; లీ
వొనరించిన భాషా సే, వ నెఱింగినవార లెన్నివందలు కలరో ! 1

గీII చక్రవర్తుల ముత్యాలశాలలందు, నగ్రహారాల నదిబొడ్డులందుఁ గులుకు
కవులు కనలేని తెలుఁగుచక్కందనమ్ము, చూఱలాడిన శారదాసుతుఁడ నీవు 2

ఆII పల్లెటూరఁ బుట్టి, పల్లెల సేవించి, పేదవారి కులము పేదవారి
పలుకు గు ట్టెఱింగి పసగల జాతీయ, రచనసేయు సుకవిరాజ వీవు 3

గీII తెలుఁగునుడికారమందున్న మెలపు నెఱిఁగి
తెలుఁగు హృదయంబునందున్న తీపి నెఱిఁగి
తెలుఁగుసంస్కృతియందున్న చెలువ మెఱిఁగి
తెలుఁగునకు నీవు సరిక్రొత్త వెలుఁగు లిడితి 4

గీII మోసులెత్తిన వేలుపుం బాసమీఁది, తగులమునఁజేసి తెల్గును దెగడువారు
వ్రాయుదురు గాక తెలుఁగు కావ్యమ్ము లినుప, సుద్దలే కాని యవి లద్దుముద్ద లగునె 5

(16–3–42)

సీII అఖిలభారత కర్షకానీకముల కన్ను, విప్పి వెల్గులుపంచు వేగుఁజుక్క
సకల కార్మికలోక సంతాపదావాగ్ని, చల్లార్చు నాషాఢజలద రేఖ
ఆంధ్రీచిరోపవాసావిర్భవత్తపః, క్రతుఫలంబైన బంగారుబిడ్డ
సతతప్రజాహిత వ్రతదీక్షలోఁ బండి, కమ్మతావులు చిమ్ము కర్మయోగి
గీII తెలుఁగుఁదోఁటను మూఁడుపూవులకు నాఱు, కాయ లందింపఁ జాలిన గడుసుమాలి
రంగనిజయంతి నవ్యభారతముపాలి, మధురపర్వమ్ము హర్ష సామ్రాజ్యరథము 6

కII రంగఁడు మావాఁడంచుఁ దె, లుంగులు మోహమ్ముపెంపులో నెంతురు, ధా
త్రింగల వారికి నెల్లను, రంగఁడె వేల్పని జగమ్ము రచ్చలఁ దేల్చున్ 7

శాII కర్ణాటీ నవహీరహారము, త్రిలింగక్ష్మాసతీ మల్లికా
పూర్ణోద్యానము, ఘూర్జరీ ముఖకళాపుంజంబు, విశ్వక్షమా
స్వర్ణద్యుంబరచుంబివాఃపటలమై సభ్య ప్రపంచమ్మునన్
వర్ణింపంబడు నీ యశంబు మృదుభావా! భారతీవల్లభా! 8

కII ఒక భారతికిన్ నాథుఁడ, వొకభారతి కర్చకుండ; వొకనాఁటికి నం
దక పర్వులెత్తుచుట్టమ, వొకనాఁటికి లెంక; వెట్టివోయీ! లీలల్ 9

ఉII ఈ నిఖిలావనిన్ జయ జయేతిరవమ్ముల నిండి నేఁడు నీ
జానుషవాసరోత్సవ మెసంగుచునున్నది యట్టె! యిట్టి స
మ్మానము లొక్కవేయి మతిమాటకువచ్చిన రెండువేలు నీ
కౌను గదోయి! లోకమున కౌనుగదోయి! మహాఃపరంపరల్ 10

ఉII రాచతికమ్ముసేయుటకు రైతొకఁడే తగునంచు, ధర్మముం
బ్రోచునతండ యంచు, మన పూజలు కొన్న గురుండు కాయముం
ద్రోచుచుఁ బల్కె గాంధి; ఋషితుల్యుఁడతండు మనమ్ములో నినుం
జూచియ చెప్పెనట్లనుట సూనృతమోయి ! జగద్ధితాగ్రణీ ! 11

మII రమణీయమ్ము లపూర్వసౌరభపరీరంభమ్ము లుత్ఫుల్లముల్
సుమముల్ దండలుగట్టి తెల్గురమ చూచున్ నిన్నుఁ గైసేయఁగన్
సుముహూర్తంబును దాసె మాతృకను శుశ్రూషింతువో హస్తినా
రమ! నీవే సముపాసితవ్య వని యారాధింతొ మాతామహిన్ 12

ఆII కన్నతల్లి నీదు కా ఖా ల వయసులో, నమరవతికి నేగినట్టికతనఁ
బేర్మి నించి నిన్నుఁ బెంచిన దమ్మమ్మ, యగుట నిట్టిశంక కగ్గపడెద

మII మనయోర్గల్లు బరంపురమ్ము తుముకూర్ మాగాణిచాందాలిఁకన్
దెనుఁగైపోవుటతప్పదోయి! విరివిన్ ధీసంపదన్ సంపదన్
జనసంఖ్యన్ మనకే లభించు భరతక్ష్మా నగ్రతాంబూల; మీ
ఘనతన్ నిల్పుటకై యొడంబడుము రంగా! కొన్ని యేండ్లేనియున్ 14

**(6-11-48)**



# తత్త్వానందము

ఆ॥ యతులు గతులు దప్పి కితవులు పిత్తాభి, రతులు కామదాస్యరక్తులైన
వేళఁ గొండిపర్తి వీరభద్రుండు కావి, గట్టి నిల్పె వంది గౌరవంబు 1

క॥ పతిత ప్రజావికాసో, న్నతి కేర్పడె నాశ్రమంబు నాల్గవయది; భా
రతభూమి తద్బలంబున, బ్రతికెన్ బరధర్మమెంత పైకొనుచున్నన్ 2

క॥ ఇచ్చటు విద్యారణ్యుం, దచ్చోటు సమర్థ రాముఁ దబ్బొటన కదా
మచ్చు యెఱుంగని సంస్కృతి, నుచ్చైర్దశ వదసె జగమహో! యన మెఱసెన్ 3

క॥ ప్రాచీన పరివ్రాణ్మధు, రాచారము లూని మానవాభ్యుదయకర
శ్రీ చిక్కణ సేవావ్రత, రోచిష్ణుత నితఁడు యతివరుం దన నెగడెన్ 4

ఉ॥ చిక్కినజాతిఁ జూచి వగచెంది తదున్నతి గోరి వైదుషీ
రుక్కమనీయ వైభవ నిరూఢుఁ డితండు; తెలుంగు బాసలోఁ
ద్రొక్కనిదారిలే; దితని దొడ్డతనమ్మునకున్ విధేయులై
మ్రొక్కనివారు లేరు జనమోహన ధర్మపథానువర్తికిన్ 5

ఉ॥ ఔచితిగు ట్టెఱింగిన మహాశయుఁ దౌట నితండు బాపుజీ
గీచినగీఁత దప్పు కవగీర్ణత నంది స్వతంత్ర భారత
శ్రీ చివురించుపొంటెఁ దన జీవన మర్పణ చేసి త ద్రుచుల్
సూచి సుఖించి ప్రావెలుఁగుఁజుట్టముగా వెడలెన్ దలిర్పుచున్ 6

క॥ తన తృప్తికిఁ బరతృప్తియుఁ, దన ముక్తికి నితరముక్తి తావల మని న
మ్మిన తత్త్వానందుఁ డితం; దనవద్యం బితని చరిత మాదర్శ మగున్ 7

**(24-2-53)**



## ఉలుపా

ఉ॥ నీ కవితామహత్తకు ననేకశరత్తులనాఁడె సమ్మద
శ్రీకలితుండనై చెలిమి చిందఁగ నుజ్జ్వలమైన భావి నీ
కై కల దంచు నుత్తరము నంపితి నింపితి నాశిషమ్ము నా
లేక ఫలించె నేఁడని చలింపని గర్వము గంటి సోదరా! 1

మ॥ ఎపుడీ పండుగ వచ్చునో తెలుఁగునాఁడేనాఁడు నీనాణెముల్
విపులాసక్తిని మెచ్చునో యనుచు నువ్విళ్లూరు నస్మాదృశుల్
తపముల్ పండినయట్లు పొంగి రఖిలాంధ్రక్షోణియున్ నీకు నేఁ
డుపదల్ పెట్టి వివేకమున్ గురిసె నీయోగమ్మె భోగమ్మురా! 2

మ॥ భవదీయం బగు వీర భారత మహో! ప్రత్యక్షరప్రౌఢమై
నవలావణ్య శరణ్యమై ఋషివరుల్ నన్నయ్యభట్టాది స
త్కవిమూర్ధన్యుల శిల్పసంపదలకున్ గాణాచియై యుంట నీ
భవమున్ ధన్యముఁగాఁ దలంతురు రసప్రాణుల్ కళారాధకుల్ 3

ఉ॥ కారెమపూఁడిరంగమునఁ గయ్యము రేఁగిననాఁడు పౌరుష
శ్రీరుచిరుండవై రిపులఁ జెండినయోద్ధవునీవు; నాఁటి నీ
దారుణఖడ్గ మానిశితధర్మము వీడని గంటమై పురా
వీరపరంపరా ప్రధనవిక్రమరేఖ వెలార్చు నేఁటికిన్ 4

గీ॥ పద్యమున గద్యమున గేయపద్య నొఱపు, నెట్లువడసితి నరసయా! యిది పురాణ
పుణ్యములు సంతరించిన పొలి యటంచుఁ, దలఁచి పులకింత్రు సాహితీతత్త్వవిదులు 5

క॥ ఒసపరితెలుంగు నీ కై, వసమ్మురా! నీ వచించు వాణికి ననువై
పసగుల్కున్ నుడికారము, ప్రసన్నమై రసికభావ పర్వోదయమై 6

ఆ॥ ఏను దిక్కనాఖ్య నెసఁగుటఁ దత్ "కవి, బ్రహ్మ" పట్ట మీవు పడసియుంట
నేన నీవు నీవ యే నైతి - మగుట నీ, గరిమ నాదుగరిమగా సుఖింతు 7

**(22-4-49)**



# పుట్టుపండువు

(ముక్త్యాల రాకొమరునిది)

(చంపకమాలిక)

"హిమకరుఁబొట్టి, పూరు భరతేశ కురుప్రభు పాండుభూపతుల్
క్రమమున వంశకర్త లనఁగా మహి నొప్పిన యస్మదీయ వం
శమున" నటన్న భారతవిశాంపతిఁగన్న చళుక్యవంశ - మాం
ధ్రమునకు విశ్వతోముఖ ముదాత్తత నించినవంశ - ముత్తమో
త్తమనరపాలవంశము పదంపడి తావకవంశమయ్యె నం
చమలమతుల్ పురాంధ్ర చరితాంతర వేత్తలు నిర్ధరించుటన్
సముచితమై తనర్చెఁగద! చంద్రకుమార మహీశ! నీదు పే;
రమృతమయూఖసంతతికి నక్షరజీవిత మబ్బు టబ్రమా
కమలయనుంగుటల్లుని కఖండధనప్రతిపత్తి చోద్యమా
ప్రమధుల నేలు సామితలపైఁ గులుకంగలవాని చొక్కపుం
గొమరుఁడు లోకమాన్యతను గొంట విచిత్రమె? యోషధీశువం
శమున కనామయప్రభ లెసంగుట విస్మయమా? బుధానుజుం
దమరకవిత్వసాహితుల కాకరమౌ టది యద్భుతంబె? చం
ద్రమునిసుతుండు విశ్వజనతాపరితాపములార్చి పూజ్యతా
క్షముఁడగు టేమిలెక్క? సడిసన్న కలానిధివంశ మందచం
దములకు నిక్కయౌట యరుదా? వరణీయగుణంబులెల్ల సా
జములయిపొల్చె నీ; కిఁక నొసంగెడి దీవనయేమి? ధన్యతా
సముదయమూర్తివీవు; ప్రభుచక్రవతంసుల శాతవాహ భూ
రమణులదండఁ గొల్వయి పురామహిమమ్ములు నాఁచికొన్న రా
జ్యముగద నీది; సహ్యతనయాలహరీ పరిశీతవాతముల్
దిమిదిమిసేయఁగా నివతళించుఁగదా భవదుర్వి; దుర్విధిం
జమరి నితాంతనిర్వృతు లొసంగి జగంబుల నేలు వేలు పా
నమదమరుండు వేదగిరినాథుఁడు నీ మొగసాల పారిజా
తముగద! సర్వమంగళవిధాయి భవాని భవన్నిలింపర
త్నముగద! రామభారతకథాకలితాంధ్రమహాకృతిద్వయీ
రమణుఁడు నీకుఁ దాతగద! రాజకులంబున కోజబంతియై
క్షమఁగల విద్వదగ్రణుల సత్కవిసింహులఁ బిల్చి మెచ్చి వి

త్తములిదు రామకృష్ణవసుధాపతి తండ్రి గదయ్య నీకు; ని
ట్లమరిన యాభిజాత్యలత కల్లిక పెట్టెదవీవు; నీకథా
క్రమములు భవ్యకావ్యములుగా సుకవుల్ సృజియింత్రు రాట్సుతా!

**(22-12-44)**



## పాములపాటి

సీ॥ పాలించితివి గర్తపత్తనమండలం, బఖిలాంధ్రజయరవాభ్యంచితముగ
నెలకొల్పితివి సీమఁగల పల్లెపల్లెకు, నున్నతవిద్యా ప్రయోగశాల
పోషించితివి నైకభాషా మనీషుల, నుద్యోగ సద్యోగయుతులఁ జేసి
చిత్రించితివి ప్రజాసేవానురక్తుల పాలింటి, యొజ్జయౌ మేలిబాట
గీ॥ గడనచేసితి హరిదంతకరి కపోల, తటసర ద్వాఃకణప్రీత చటుల మధుప
గీతము యశమ్ము వేంకటకృష్ణసుకృతి !, తావకము జీవనం బహెూ! ధన్యతమము 1

చ॥ హితమిది మాతృభూమి కని యెంచుట నించుట నాంధ్రమండలీ
ప్రతినిధివై సమస్త సదుపాయములన్ సమకూర్చి కర్షక
వ్రతములు పండఁ దెచ్చితివి ✦ భావపుర వ్యవసాయపీఠ; మీ
చతురత కీయుదారతకు సర్వజగమ్ములు పొంగె ధీనిధీ ! 2

**(5-12-46)**



✦ బాపట్ల వ్యవసాయ కళాశాల.

# వివేకానందుఁడు

మ॥ "పదునేనాఱు వసంతకాలము లనల్ప శ్రీవికాసమ్మునై
పొదలంగాఁ దగు తావి గల్గిన మహాబోధ ప్రసూనమ్ములన్
వెదచల్లంగనినాఁడ నీతను విఁకన్ వేసారినన్ జాతినన్
గొదవే మ" న్న దయన్మనోంబుజమె మాకుం బ్రాపు యోగీశ్వరా ! 1

ఉ॥ కూటికి నన్నురుస్సురని కుంచెడి కందెడి కుక్షియేని యా
నాఁటి నొకండు కంటఁబడినన్ ముసుముండుగ దాని నేర్పు నా
రాటముఁదీర్చుటేమతమురా! యని పాయనిధర్మతత్త్వమున్
జాటిన నీవివేకము ప్రసన్న మొనర్పుఁగదే! జగద్గురూ! 2

ఉ॥ తీయని మన్ననల్ కురిసి తేర్చి యధఃపతితప్రజాళికిన్
బాయని బాంధవుండవయి భారతజాతి భవిష్యభాగ్య సం
ధాయకుఁడౌ మహాత్మున కుదారచరిత్రునకున్ దరిద్ర నా
రాయణసేవ నేర్పితివిరా! పరమార్థఖనీ! మహామునీ! 3

శా॥ "మావిద్వాంసులు తార్కిక ప్రవరు లస్మద్విశ్వవిద్యాలయ
శ్రీ వాలించుగురూత్తముల్ శ్రుతిశిరస్సీమంతినీ పాద సం
సేవాపూర్ణుఁడవైన నీయెదుటఁ గించిన్మాత్రులే" యంచు హ
ర్షావేశమ్మున మెచ్చిరా! నిను యతీంద్రా! యెల్లపాశ్చాత్యులున్ 4

(29-10-52)



# ఆర్తబంధువు

చ॥ కలిమికి నాటపట్టు లనఁగా మనభూముల నెంద తెందతో
వెలసిరి గాని చేపడినవిత్తము నర్థులపాలుసేయు దా
తలు మనకెంద ఱుందురు ? వదాన్యులలో నినువంటి దీనబం
ధులు కరుణావిధేయమతిధూర్వహు లెందఱు? గ్రంథిసత్కులా! 1

ఉ॥ ఎక్కడఁగన్న నోట్లకొఱకే చెరలాడుచు మేడమిద్దెలున్
రొక్కము చేను చెట్టు పదిరోజులగద్దెకు ధారవోయు తి
ర్యక్కులు పొంగి పొర్లు సమయమ్మున నీకు ననాథబాష్పపుం
జుక్కలు చుక్కలై వెలుఁగుచూపినవా! ✦ వరదాఖ్యసత్కృతీ! 2

ఉ॥ వెన్నవలెన్ ద్రవించి గుణవృద్ధులహెూ! యన నార్తసేవకున్
బన్నితివా! నినుం దలఁచుపట్టున గౌతమబుద్ధమూర్తి నా
కన్నులముందు నిల్చి పులకల్ గదియించు సబర్మతీసరిత్
సన్నిధి నున్నయోగి వికసన్ముఖుఁడై తనపజ్జ నిల్వఁగన్ 3

ఉ॥ పాయనిదీక్షమైఁ దనదుప్రాణములన్ సిరులన్ దరిద్ర నా
రాయణసేవ కిచ్చి యమరత్వము నందినగాంధి కోవ నీ
దై, యిటివంటి ధన్యతకు నర్హునిఁగా నినుఁ దీర్చె; 'గ్రంధి' కా
దోయి! భవద్గృహాంక; మిఁక నుజ్జ్వలమౌనది 'గాంధి' సంజ్ఞమై 4

మ॥ ఎదికర్తవ్యము విత్తవన్మణుల, కీహిందూమహీశాంతిసం
పదకుం దావలమెద్ది, పుణ్యరమకుం బ్రాసాదమై వొల్చు నె
య్యది, కస్తూరిమగందునేర్పిన మహీయ స్తారకం బేది, నీ
వది చేకొంటి వనాథసేవ, మహితాత్మా ! నీకు దీర్ఘాయువుల్ ! 5

చ॥ తన కగపడ్డసంపదలు తాన భుజింపక లేనివాని కా
ధనమునఁ బాలువెట్టు టుచితం బనుపాఠము నేర్పి తీవు నీ
మనుగడబాట నూటఁ బదిమంది వరించిన వర్గభేదముల్
పెనఁకువ లుండునా? ప్రళయభీకరతాండవ ముర్వి నిండునా ? 6

✦ వీరు చిలకలూరిపేటలో 'అనాథ శరణాలయము' నిర్మించిరి.

కు॥ హైందవ సంస్కృతి చేత, సౌందర్య మఖండతత్త్వసంపన్నత నీ
యం దొడింగి నిన్ను జగదా, నందకరున్ మధుర జీవన పరున్ జేసెన్ 7

మ॥ వరదయ్యా ! నిను గద్యపద్యములతో వర్ణింతు రాపన్నులై
తెరువుంగానని పేదలన్ మనుపు నిన్ దీవింతు రావెన్క నీ
పరమాదర్శము నియ్యకొన్నసతికిన్ బ్రత్యేకశంసా బహూ
కరణం బిచ్చెద రాంధ్రు; లేమనెద నీకల్యాణిభావోన్నతిన్ ? 8

ఉ॥ సంతతిలేక నెవ్వగల స్రగ్గి, నిరాశలంగ్రుంగిదుర్భర
ధ్వాంతమువోని జీవనముపై రుచిదప్పి తెగించి యావికిన్
సంతనకట్టువారుగల జాడ లెఱుంగుడుంగాని మీవలెన్
సంతునమున్నియున్ బెఱలసంతును మోసెడివార లుందురా ! 9

ఉ॥ తల్లులు తండ్రులై పరమదైవములై యొకదిక్కులేని యా
పిల్లల నుద్ధరింపుం దీంకం బెట్టనికోటలు మీరు వీరికిన్,
ముల్లెలమూల్గులం దనియు మొండికి రిత్త పిసాళి వెచ్చముల్
చెల్లుట మెచ్చు సాహునకుం జెప్పనిబుక్కులు మీచరిత్రముల్ 10

ఉ॥ దాతల, నేతలన్, బుధవతంసుల, మంజులకావ్యశిల్ప ని
రాత్మల, గీత వాద్య చతురత్వవిధాతల, నార్తమానవ
త్రాతలంగన్న గర్తపురధాత్రి తెలుంగుల రాజధానియై
నూతనశోభంగుల్కు నింక నోములుపట్టుందు మీరు దంపతుల్ ! 11

కు॥ ఉత్తమశీలురతలంపు లు, దాత్తచరిత్రుల తపమ్ము తప్పక పండున్
రిత్తలు వల్కుట కన్మ, చ్చిత్తము సైరింప దేను శిష్టుంద నగుటన్ 12

**(15-10-53)**



# నాగయ్య

సీ॥ తెలుఁగు భాగవతమ్ము తెరదీసి నిద్రాణ, జాతి మేల్కొల్పిన పోతరాజు
ఆటవెలంది యొయ్యారమ్ముతో నభి, రామసంస్కృతి పంచు వేమయోగి
స్వరరాగమూర్తియై స్వర్గాపవర్గమ్ము, కనులకుంగట్టు త్యాగయతపస్వి
శీలమ్ము సడలిన జీవి కోల్కొనఁదన్ను, రాణ దెల్పిన శివరామభోగి
గీ॥ రాకచే వచ్చెఁ గోదండరాముఁ డిటకు, నిచట బంగారుపండె నైదేటు లుబికె
సాధుతరధర్మరేఖ సాక్షాత్కరించెఁ, గలిమి ఫలియించె నేఁ డప్పికట్లపురికి 1

మ॥ ఎవ రీనాగయ ? మా త్రిలింగనటరాజే యంచు మాజాతి వై
భవమే యంచుఁ దెలుంగువారు జయగర్వస్ఫూర్తిమన్మూర్తులై
చివురుల్ వెట్టఁ "గలామయుం డితఁడు మాసీమన్ గదాపుట్టె" నం
చివతాళించెద మేము మాసుకృతసాహిత్యంబు కొండాడుచున్ 2

చ॥ కవివరులున్ నటాగ్రణులు గాయకముఖ్యులు జాతిసంస్కృతి
చ్ఛవులు సృజించువా రనుటఁ జాటు నఖండమహీచరిత్రముల్
కవితయు నాట్యకౌశలము గానపటుత్వము నిన్నుఁ జేరి నీ
కవిరతకీర్తి గూర్చెఁ జరితార్థుఁడ వీవుకదయ్య! నాగయా ! 3

ఉ॥ లక్షలు తెచ్చి తావక కలారమ నిన్ యజియింప నీ వహో!
భిక్షలు మెచ్చి దైన్యపరిపీడితులన్ భజియింతు; వీ కృపా
దీక్షకు ముగ్ధమయ్యె జగతీవలయంబు వదాన్యమౌళి! నీ
పక్షమునందె సత్కవులు పల్కెద; రంజక సాగిపో మ్మిటుల్ 4

గీ॥ సాగినది తెల్గుతల్లి కాంచనరథమ్ము, పండినది తెల్గుజాతి నిర్భరతపమ్ము
సోదరాంధ్ర వికాసముల్ ప్రోదిసేయ, వలయు నాకల్పము నటింపవలయు నీవు 5

**(23-5-53)**



✦ శ్రీ నాగయ్య గారిని బాపట్ల తాలూకా "అప్పికట్ల" పౌరులు సమ్మానించినతఱి

# నాకథ - సీత

(ఆశువు)

కీ॥ వసుధాసవిత్రి నన్నుం బ్రసవింప మదీయపుణ్యపరిపాకమునన్
వసవడితి యోగవిద్యా, రసికుండు జనకునకు జనక రాగము వదయన్ 1

చ॥ జనకుఁడు కన్నబిడ్డవలె సాఁకి ననున్ గమముద్దుసేయ మ
జ్జననము సార్థకం బనుచు సంబరమందితి నందచందముల్
పెనఁగొన నెల్లవిద్యలను బెంపువహించితి నస్త్రశస్త్రముల్
గని నెఱనేర్పు లందితి జగమ్మునవారు సమాదరింపఁగన్ 2

క॥ కదచినది నాదుబాల్యము, పొదమెను జవ్వనము వీరపురుషోత్తము నా
యెదయనిఁ గావింప గురుం, మమగని తలపోఁత మునిఁగె నురలెడి కూర్మిన్ 3

క॥ శివుఁ డెపుడో తద్భూపతి, భవనమ్మున విడిచె ధనువు; ప్రాఁతదిమైనన్
లవమాత్రమ్మును సదలక, హవణిల్లుచునుండె నది నవాతినవంబై 4

మ॥ హరకోదండము దాని నెవ్వఁడు సముద్యద్బాహువీర్యమ్మునన్
విఱుగంజేయు నతండ మత్ ప్రియుఁడుగాఁ బృథ్వీశుఁ డూహించి యా
ధరలోనం గల రాజనందనుల వందల్ వేలు రావించి సుం
దరపద్యన్ నడిపెన్ స్వయంవరము పెద్దల్ పిన్నలున్ మెచ్చఁగన్ 5

క॥ ధరణీఖండము లన్నిట, నెఱిగల నృపసుతులువచ్చి నిక్కిరి; గర్విం
చిరి; శివునివింటిముంగదఁ, బరాక్రమముసూపి రెల్లపాటులతోడన్ 6

క॥ ఒకనిబడి నొకఁడుగా వ, చ్చి కరోద్ధతి చూపి పరువుసెడెనే యనుచుం
గకవికలు సెంది సభ్యులు, పకపక నవ్వంగ ఱిచ్చపడి రవ్వేళన్ 7

గీ॥ జలధరశ్యాముఁ డొక్కఁడాసభకు వచ్చె, నపుడు చూపఱకన్నులాహా! యనంగ
వీరరాఘవుఁ డతఁడు తద్విక్రమమ్ము, సకలరాజకుమార విస్మయకరమ్ము 8

క॥ బెండువలె నతఁడు వింటిని, రెండుగ నొనరించి శౌర్యరేఖ వెలార్చెన్
బండువు చేపడె నాకున్, దండిగ ముద మొదవె జనకధరణీపతికిన్ 9

క॥ తూర్యములు మొరసెఁ; గవితా, ధుర్యులదీవనలు కురిసె; ద్రుహిణాదుల ము
చ్చర్యలు విరిసెం; బురము న, వార్యంబై కౌతుక ప్రవాహం బొరసెన్ 10

ఉ॥ మంగళగీతికల్ మధురమంజులరీతుల సాగ నప్పయో
దాంగుఁడు మత్కరంబును సమాదరబుద్ధి గ్రహించినంతఁ బే
రంగద నున్నలోకమున కగ్గపడెన్ బ్రమదమ్ము, రక్కసుల్
భంగపడంగఁ దగ్గతతి వచ్చెనటంచుఁ దలంచి రెల్లరున్ 11

క॥ "నాపొత్తులేని శౌర్యా, టోపం బది యెంతయున్న దొంగను, దనుజున్
బాపాత్ముని రఘురాముఁడు, రూపడఁపంగలఁడె నిర్జరులు జయపెట్టన్ 12

క॥ సతితోడు లేని వేళలఁ, బతి యెంతటివీరుఁ డైనఁ బండితుఁడైనన్
నుతికెక్కఁగలఁడె" యని నా, మతి నెన్నోతలఁపు లపుడు మల్లడిగొనియెన్ 13

క॥ నోఁచిననోములు పండెను, దాఁచినధనమెల్లఁ గరగతంబయి నిల్చెన్
నా చారుమూర్తి మధుర, శ్రీ చిక్కణపేటి వీరసింహుఁడు దొరకన్ 14

ఆ॥ మగనితోడఁ గూడి మనిచినవారికై, నతులు సెప్పి చెలులమతులు తేర్చి
యత్తవారియింటి కపుడు పయనమై, వచ్చుచున్నదాన వనపథాన 15

క॥ "మానిత విక్రమబంధురుఁ, డే నుండఁగ నీతఁ డెవ్వఁ డీశ్వరచాప
శ్రీనడఁప" ననుచు భార్గవ, సూనుం డెదిరించె రక్కసులబలుగొంగన్ 16

ఉ॥ ఆముదివగ్గు రాముఁడన నర్భకుఁ డంచుఁ దలంచి శౌర్యమున్
స్థేమముఁ జూపి శస్త్రవితతిన్ బరఁగించెనకాని యెవ్వ రీ
భూమిని మత్ప్రియుం బొదివి పోవఁగలా రసుకోటితోడ ? లే
రీమహిఁగాదు లోకముల నెందయినన్ విభు నోర్చుపోటరుల్ 17

గీ॥ పరశురాముఁడు వితథమై పాదువడిన, తనమగంటిమిఁ దలఁచి సిగ్గున మునింగె;
వలదు వలదు ప్రభూ! లజ్జవలదు నీ ప్ర, సాద మిది యంచుఁ బలికె భూజనిమౌళి 18

క॥ ఆ వినయ మాసుశీలత, యా విక్రమలక్ష్మి భార్గవాత్మజునకు మో
దావహ మయ్యెను బతిపై, దీవనలన్ గురిసె నతఁడు దివ్యులు కులుకన్ 19

గీ॥ అఖిలసభ్యజనారాధ్య యగు నయోధ్య, కపుడుసేరితి మేము రావమ్మ! యనుచు
నాపసిండి! యటంచు హృత్తాప మెడసి, యత్త నునుఁ గౌఁగిలించె రేకెత్తుప్రేమ 20

క॥ కౌసల్యకు మామయ్యకు, నాసలు పండినవి నాఁడు; "నాకేశునకే
నీ సంతోషము కలదా ?, త్రోసితి నఘ" మంచు దశరథుఁడు కదు సొగసెన్ 21

కII “కొడుకునకుఁదగ్గ కోడలిఁ, బడసితిఁ బరిమళము పొడమె బంగారునకున్;
గడగండ్లతోడఁ దపముల, బడలి బడలి కంటి నిట్టిభాగ్య” మటంచున్ 22

ఆII మామగారు తనదుమది పొంగ మంగళా, రవము లెల్ల యెదలఁ జెవులపండు
వులు ఘటింపనుత్తముల విప్రులను బిల్చి, పండితులను జేర్చి ప్రభ్బుకొన్న 23

కII కౌతుకముతోడ వస్తు, వ్రాతమ్మును కాన్కవెట్టి వరణీయాన్న
శ్రీతతు లొసంగి మఱి కా, ఫీ తేనీ రిచ్చి పెద్దవిందులు నడిపెన్ 24

గీII ఒక యయోధ్య కనా నేల యుర్వికెల్ల, నవ్యసంక్రాంతి యయ్యె నానాఁడు; దశర
థేశునింటన కా దెల్లయిండ్లయందుఁ, జక్కఁగాఁ జాగినవి పెండ్లిసంబరములు 25

కII రామునితోఁ దత్సోదరు, లా ముప్పురు పెండ్లియాడి రంచితశీల
శ్రీ మెఱయు నూర్మిళాదుల, రామారత్నముల మధుర రాగాంచితలన్ 26

కII ముగురత్తలు నేరాంద్రొక, ముగురున్ లభియించి హర్షమున ముంచిరి నన్ ;
జగదేకవీరుఁ దగువిభుఁ, దగపడె మామయ్య పూజ్యుఁ దక్కెను దనకున్ 27

కII అల్లారుముద్దుగా నా, యిల్లున్ దిద్దుకొనుచుంటి; నిట్లుండ మహీ
వల్లభుఁడు జరావృతుఁ డై, డిల్లపడె నిలా భరణ పటిష్ఠత సడలన్ 28

ఆII పెద్దకొడుకు ననుఁగుబిడ్డను రాఘవు, నఖిలశాస్త్రవేది నంచితాత్ము
నధిపుఁ జేయనెంచె నపుడు వసిష్ఠాది, మునులు మెచ్చి రతఁడు కనిన తెఱఁగు 29

గీII రామ పట్టాభిషేక కార్యము సమీప, మయ్యె “నే రాణి నౌదు” నటన్న వేడ్క
ననుఁ బెనంగొనెఁ గాని తిన్నందనమ్ము, నెడసి విధి యింతలోఁ గొరిప కెసరువెట్టె 30

కII మామయ్య మున్ను దనుజ, స్తోమమ్మును ద్రుంచుపట్ల సుడివడఁ గైకా
భామిని సంగ్రామకలా, శ్రీ మిగులన్ గాసెకట్టి జీవితనాథున్ 31

ఆII మృతికి దూరుఁజేసి మెప్పించెనఁట – మామ, యపుడు రెండు వరము లామె కిచ్చె
నఁట – తదీయశక్తి నాయమ్మ “నాసుతు, భరతు రాజుఁ జేయవలయు” ననుదు 32

ఆII పెద్దవాఁడు, వాసి తద్దయుఁ గలవాఁడు, రాముఁ డుండఁగా భరతున కెట్లు
రాజ్య మిత్తు; నవ్వరా ప్రజలిది విన్న ?, నని కలంగె దశరథావనిపుఁడు 33

కII లోక మెటు లాడుకొన్నను, వాకును దప్పంగ నర్కవంశ్యుల కగునా ?
యీ కార్యము తప్పని దని, యేఁకారుట మానె మానవేశ్వరుఁ డంతన్ 34

ఆ॥ కన్నకొడుకు లేఁడు కావుట చాలక, యధిపు వనికిఁ బంపి రత్తగారు ;
జంటవిడక మగని నంటి జీవించుటే, పడఁతిధర్మ మన్న పాడి నెఱిఁగి 35

చ॥ తొనఁకక యేనునున్ మగనితో వనభూమికిఁ బైనమైతిఁ గా
ననములు శైలరాజము లనంతమరుక్షితులున్ గ్రమించి యొ
య్యన చని దండకావనమునందు వసించితి మెల్ల మెల్ల మా
యునికి నెఱింగి సర్వ మును లుబ్బి రహో! విడరాని బంధులై 36

క॥ అన్నదెసభక్తి నాతని, వెన్నడి లక్ష్మణుఁడు వచ్చె విపినమ్ములకున్
నన్ను రఘురాము నిచ్చలు, కన్నుల నిల్పికొని పూజ కావించుకొనెన్ 37

క॥ సౌమిత్రియందు కల్గుట, రామునకున్ నాకు వని పురంబయి తోఁచెన్
నామగఁడే దేవుం డని, ప్రేమించెడి ఋషులఁ జూచి పెరిఁగితి నేనున్ 38

ఉ॥ "దేవుడు రాముఁడైన మతి దేవి మహీజయకా" యటంచు నే
భావమునం దెలర్చితిఁ; "దపంబులు పండుటఁజేసి రాఘవ
క్ష్మావరుకేలు పట్టితి; యశమ్మునుగంటి; నయోధ్యయైన నా
కీవనమైన నొక్క తెఱఁగే" యను తృప్తిని గంటి నవ్వలన్ 39

క॥ తనయనుజన్ దనమిత్రులఁ, దనబంధులఁ జంపె రామధరణీశుఁ డటం
చెనలేని రోసమున రా, వణుఁ డసురుసురయ్యె 'నెంతవచ్చె' నటంచున్ 40

క॥ లోకములనెల్ల గెల్చిన, నాకా యిటుఁసేఁత యల్పనరుఁ ? డంచు మదో
ద్రేకమున లేచి యపర పి, నాకివలెన్ సాహసించి నాథుని కుటికిన్ 41

ఉ॥ బంగరులేడిగా నొకయభాగ్యుని దానవుఁ బంపి భర్తకున్
భంగము తెచ్చి లక్ష్మణుని ప్రాపును గోల్పడి యేను బేలనై
యంగద నుండునట్టు లకటా! వలపన్ని పిసాళిజోగి రీ
తింగొని నన్నుఁ జేరి వితథీకృతనీతి యతం డతంద్రుఁడై 42

ఆ॥ దిక్కులేని నన్నుఁ దక్కొని లంకకుఁ, జేర్చినాఁ డఘమ్ము పేర్చినాఁడు
దయఁదొఱంగి కొఱవిదయ్యాల నాచుట్టుఁ, బెట్టినాఁడు దనుజుఁ డెట్టివాఁడొ 43

చ॥ "జగముల గెల్చినట్టి రణశౌండుఁడ, సర్వదిగీశవర్గముల్
పగవిడి నన్నుఁ గొల్చు, ననపాయము రాజ్యము నాది, రాముఁడా
మగఁడగు నీకు? నీమధుర మంజులరూప మదేద? వానిపైఁ
దగుల మదేద? బుద్ధివలదా యిటువంటి మనోజ్ఞమూర్తికిన్? 44

ఆ॥ నీకుఁ దగినమగండ నేనని పడితలల్, కలవు నా కటంచు గర్వ మెగయ
నను బలాత్కరింప నానాశ్రమల్ పడి, నాఁడు జీవ్వపోయినాఁడు తుదకు 45

క॥ లతఁడు హరుఁడైన నేమీ, పతివ్రతను ధిక్కరించు బలసంపద నే
గతి వదయు? నస్త్రజాలము, నతి సేయఁగవలయు సాధునారీమణికిన్ 46

క॥ ప్రాణేశుకొఱకు వార్చుచుఁ, బ్రాణమ్ముల బిగ్గఁబట్టి పరమకిరాత
శ్రేణుల జంకెనలం బడి, గ్లానిన్ గాలమ్ము నెట్లొ కడపితి లంకన్ 47

ఆ॥ అంత హనుమ వచ్చి కాంతునిజాడ నా, చెవిని వైచి లంకచెలువ మార్చె
వనధిఁగట్టి మగఁ డవారితుఁడై దశ, గ్రీవుఁ దునిమె సమరకీర్తి వెలయ 48

క॥ రామునితో నతదేవ, స్తోమునితోఁ బురికిఁ జనితి దుఃఖము లడఁగన్
మామయ్య లేమిఁ దలఁచితి, నేమీ ద్వంద్వములు తప్పవే యనుకొంటిన్ 49

క॥ పట్టాభిషిక్తుఁడై విభుఁ, డిట్టలమగు నెమ్మి నవని నేలుచునుండన్
నెట్టిక సీలతనమ్మును, బట్టి రఘుప్రవరు నేను బాయక కొల్తున్ 50

క॥ ఇది నాకథ – కౌసల్యా, సుదతీసుతుఁ డాదరించు సుకృతము నాపా
లిదిగా నిది గాంచితి రా, ము దయన్ భువనములకెల్ల ముదము లొదవుతన్ ! 51

**(29-5-53)**



ఇది మిత్రుల ప్రాంతకు వీలుగా చింతాయ
పాలెము సభలో అరగంటలో చెప్పఁబడినది

## శాంతిగీతము

(గీతమాలిక)

బానిసము దుర్భరంబు దుర్భర మటంచుఁ, గాయము తటిచ్ఛలం బతిహేయ మనుచుఁ
దగదు రౌలటుచట్టంబు తగ దటంచు, జాతిగౌరవ రక్షణాసక్తు లగుచు
నేలప్రొద్దు లెతింగిన నేత లగుచు, శాంతిసమరాంగణమున నిశ్చలత నిల్చి
దయ్యరు తుపాకినుండి 'ధాంధా'మ్మటంచు, గుములుకొని దూఁకు నగ్నిగోళములధాటి
కెదురుగా ఱొమ్ములను జాఁపి బెదరులేక, ప్రాణములు ధారవోసిన ప్రభువులార !
పుణ్యభూములు త్రొక్కిన పురుషులార !, శాంతులా మీరు ? వీర పాంచాలురార!

మఱచితిని మీ యనుంగుసోదరులు దాస్య
భారమున గ్రుంగి కుములు నంబను స్వరాజ్య
సింహపీఠికపైఁ బ్రతిష్ఠించుదనుక
నబ్బునా చిత్తశాంతి మీ కన్నలార !

నాఁడు 'జలియనువాలా' వనమ్మునందు, నగ్గలంబైన త్యాగమ్ము నవధరించి
మార్గదర్శకులైనారు మాకు మీరు, మఱవఁ దరమౌనె మీమేలు మాన్యులార !

సన్నగిలుచున్న వహ్ని కాజ్యంబువోలె, వాడి చెడుచున్న కయ్యకు వానవోలె
సాయపడె మాకు మీ సముజ్జ్వల చరిత్ర

ధీరజాతీయభావముల్ తేజరిల్ల, హిందువులు ముస్లిములు నేఁడు విందు లగుచు
నెన్ని రాపిళ్లు మూఁడిన వెన్నుచూప, కరుల నూఁగింతు రచలసత్యాగ్రహమున
బళిరె! యెన్నాళ్ల నుండియో పండకున్న, తలఁపులు ఫలించె మాకు మీ త్యాగమహిమ
'భారతీయుండ నే' నని పల్కరించు, మనుజుఁ డున్నంతకాలంబు మాసిపోని
కీర్తి గద! మీది శూరతామూర్తులార!

సర్వశక్తి పరీతుఁ డీశ్వరుడు కరుణ, నిమ్మహాదేశమును స్వతంత్రమ్ముఁ జేసి
మీమదికి శాంతి నొదవించి మీకు మాకుఁ, దరుణ సమ్మదలక్ష్మీప్రదాత యగుత !

**(22-4-25)**



# రైతు మొఱ

(మంజరీ ద్విపద)

జగదీశ ! దీనరక్షా లగ్నబుద్ధి, నీ వవతారమ్ము లెన్నేని తాల్చి
దుష్టరాక్షసకోటిఁ ద్రుంచితి కాని, కటకటా ! యక్కటికములేని నరుల
నేల మన్నించితో యెఱుఁగ కున్నాము, కటికిగుండెలకు నగ్గంపడి చెడిన
యీనాఁటి మాబ్రదు కీక్షింప వేమి?, నిందారు కూర్మిపై నేమును నీకు
రక్షింపఁదగినవారము గా మటయ్యి?

ప్రభువరా ! మమ్ము నొంపనిభయం బేది ?, బాబయా ! మముఁ గలంపని కస్తి యేది ?
యాగర్భభోగుల నల్లాడఁజేయు, దుష్కాల మరుదెంచె దుర్భరం బగుచు
నడఁగారదయ్యె మా యశ్రుూర్మిపటలి, బ్రదుకఁగా వెరవు కన్పదదయ్యె మాకు
నీనాఁడు నీవుగా కెవరు మాదిక్కు ?, మాతప్పు లున్నచో మన్నింపు ! దేవ !

మృగములు విహగమ్ము లేబాధలేక, తమపొట్ట నిండించి తనివి నందెడిని
బగలెల్ల మాబండిబరు వీడ్చి యాడ్చి, మంచిమేఁతలు మేయు మాపులం దెడ్లు
కష్టించి కడపకుఁ గడపకుం దిరిగి, కుక్కలుం దమపాలికూటి నార్జించు
నీపాపమేమొ ! తండ్రీ ! ప్రాణతతికి, నన్నంబు సృష్టించునట్టి మాజాతి
కఠినోపవాసముల్ గావింపవలసె, వెచ్చవెచ్చనియూర్పు వెడలింపవలసె

ఓనాథ ! విను మొకానొకనాఁడు రైతె, భారతావని 'నార్య' పదవాచ్యుఁ డయ్యె;
'నన్నదాత' యటన్న యాఖ్య యానేల, నితనికే సిద్ధించు; నెల్ల రౌ ననఁగ
జనకునింబోని రాజర్షిసత్తముఁడు, దున్నె లాంగలము దుర్దుఃఖాబ్ధికలము
సాధ్వీమతల్లి నాఁ జాలిన సీత, కలిగె మా పసిఁడినాఁగటి చాలునందె
పతితపావనుఁడైనబలభద్రమూర్తి –, మూఁపుపైఁ గుల్కె మా ముద్దునాఁగేలు
మాయింటి పాపఁడై మలక్రయ్యలందు, నాలమందల మేపె హరి గంతులిడుచు
మా చరిత్రల కేమి మా పేర్మికేమి, దీనతానిధుల మైతిమిగాని నేఁడు
మా మూలమున సభామాన్యత వడసి, వన్నె వాసి గడించువారలే మమ్ముఁ
గడుఁ జుల్కపాటుతోఁ గాంచుచున్నారు, మా యొనర్చినమేలు మఱచుచున్నారు
పన్నులబ్రేఁగు పైఁబడి క్రుంగుచున్నఁ, జదువుసంధ్యలు లేక స్రగ్గుచునున్న

దారిడొంకలు లేక తలఁకుచునున్న, మందుమ్రాఁకులు లేక మల్లాడుచున్నఁ
ద్రాగునీళ్లను లేక తపియించుచున్న, మాగోడు నెత్తరీ మానవోత్తములు
మాకీడు త్రోయరీ మకుటాలవారు, రంగదుత్తుంగ తరంగయై గంగ
చెంగటఁ బెనుమ్రోఁత సేయునే కాని, బీటెండతాఁకున బీఁటలువాతి
మానంజ మాపుంజ మలమలమాడె; మాపాఁడి మాపంట మఱుఁగునం బడియెఁ;
గృషిజోలికిం బోని యేలిక లేల?, నీవుండఁగా దిగుల్ నెగులు మా కేల?
రానిమ్ము రానిమ్ము రతనాలజల్లు, చేకొమ్ము ! చేకొమ్ము ! జేజేలపెల్లు.
పల్లెపట్టే కదా! భరతోర్వియన్నఁ, గమ్మతీఁడే కదా! గ్రామంబటన్నఁ
గర్ష కానందమే కద! జగత్తుష్టి, రైతే కదా! దేశరమకు వెన్నెముక
కాఁపేకదా! లోకకల్యాణదాత, సేద్య గాఁడేకదా! జీవన మ్మిలకు
నీకర్మయోగిపెం పించుచందాన, నీహాలికుని మెప్పు లెనయుచందాన
నీనగ్నసత్యమ్ము నెఱుఁగుచందాన, మానేతలను దిద్దుమా గుణోద్దామ !
మాభ్రాతలను దేర్పుమా దయాధామ !

**(4-11-29)**



శ్రీ మైథిలీశరణగుప్త హిందీకృతి 'కిసాన్' ఛాయలతో

# కృతజ్ఞత
### (అప్పికట్ల సమ్మానములో)
### (ఉత్పలమాలిక)

ఓసుగుణాఢ్యులార ! మహిమోన్నతులార ! సదస్యులార ! వి
ద్యా సముదీర్ణులార ! కవితావనితాపరిరంభణ ప్రభూ
తాసమకీర్తులార ! రసికాగ్రణులార ! నమస్సహస్రముల్
చేసెద మీకు; నన్నొకవిశిష్టునిగాఁ గొనియాడి క్రొవ్విరుల్
దోసిటనెత్తి సత్కృతివిధుల్ పచరించుటఁజేసి నిర్భరో
ల్లాసముకల్గె, మైపులకలన్ మునిఁగెన్, సకలేంద్రియమ్ముల
భ్యాసములేనిసంతసము నందె, నహో ! సరిక్రొత్తపుట్టువున్
మోసితిఁగాని విశ్వజనమోహన సత్కవితా మనీషితా
భాసురులైన యిట్టికవిపండిత శేఖరులున్న కొల్వులో
గాసటబీసటల్ చదివి కావ్యకలాచతురత్వ మర్మముల్
వీస మెఱుంగలేని యవివేకికి నా కిటువంటిమెప్పు లే
లా సెలవిందు ! మీరు మధురాశయు లౌట నుదారు లౌట న
న్నీ సభలోన మెచ్చితి రిదే కదునిక్కముగాఁ దలంప నిం
డీ; సమయమ్మునందు జనియించె నొకానొకశంక, "నిందు సా
వాసముచే నవజ్ఞయ ధ్రువమ్ముగ నబ్బు" నటన్న మాటలో
దోసముచూపి బాంధవముతోఁ జెలికారముతో నెసంగు న
న్నీసరిలేనిమన్ననల నెట్టులు తన్పిరొ? యప్పికట్లవా -
రీ సుజనత్వ మెందుఁగలదే వలదేయిటువంటిబుద్ధి - వి
ద్యాసముపేతులై, సుకవితానిధులై తగు పున్నయాదికుల్
కైసరు లున్న పట్టణమె కానుక లిచ్చుటఁజేసి తద్దయున్
వాసిగడించె నీసభ - యవారణ మేత దఖండ వైభవం
బీ సకలాంధ్ర దేశమున కెక్కె, మనుష్యున కేనిఁకేని ప్రా

గ్వాసన లున్నఁగాని యిటువంటికృతుల్ పచరించుకోర్కి రా
దోసుకవీంద్రులార ! వినయోక్తులు కా వివి నా సమగ్ర వి
శ్వాసముమై బయల్పఱుచు వాక్కులయా ! భవదీయనిస్తులా
శాసనగీష్పరంపరల సాయమునన్ రసవత్ ప్రబంధముల్
వ్రాసెదనేమొ, వెండి యనవద్యసవర్య లొనర్చి యాంధ్రవా
ణీసతి కిత్తునేమొ వరణీయవిభూషలు, సత్కవిప్రధా
వాసితజీవనమ్ము నడుపంగలనేమొ, తదీయనైపుణం
బే సమకూడునట్లు జగదీశ్వరుఁడున్ గరుణించుఁగావుతన్ !

**(12-7-42)**

# చంద్రమౌళి

గీ॥ అన్న ! కల్లారికులజ ! నా కన్న తెలుఁగు, పెద్ద లీయెల్ల సీమలఁ బెక్కు రున్న
నవశమై ములుసూపు నాయాత్మ నిన్నుఁ, జూచినంతన నీదెస కేఁచి యేఁచి 1

ఆ॥ ఏమి యీరహస్య మేలాజనించె నీ, పక్షపాత మని పరీక్షసేయ
నిక్క మెఱుకపడియె నీ వజాతవిరోధి, వగుట యొండె హేతు వయ్యె నిచట 2

క॥ త్యాగములు సేయవచ్చును, భోగమ్ములు రోయవచ్చుఁ బురుషుఁ డధర్మ
ప్రాగల్భ్యముగల రిపునెడ, రాగమ్మును బఱుపలేఁడురా నిర్మముఁడై 3

క॥ ప్రత్యపకారము నైనను, మత్యంచితు లైనవారు మరగరు, సాధు
స్తుత్యం బీదృశభావం, బత్యర్థతపః ఫలంబయి నినుఁ గదిసెన్ 4

క॥ నీ మనుగడ కెరవాడ, శ్రీమందిరయోగ్యత్రోవ జీవము నొసఁగెన్
నీ మేలిమేలి కొల్వుల, నామెతలం బడసెఁ గాంగ్రె సాంద్రధరిత్రిన్ 5

శా॥ వేలల్ దాఁటిన దేశభక్తి నినుఁ గవ్వింపన్ బ్రజాసేవలో
వేలున్ లక్షలు లెక్కసేయ వని నే విద్యారముం జెంద న
ప్పోలీస్‌రక్కసి ✦ నాఁడు కన్నుఁగవ నిప్పుల్ రాల నిన్‌గిట్టి దా
కేలన్ గుత్తుకనొత్తి యెత్తినను గాంగ్రెస్ వీడమిన్ మెచ్చెదన్ 6

ఉ॥ నీ వొకమంత్రి వైనను జనింపదు నూతనతుష్టిమాకు, రాఁ
బోవదు నీకుసైతము ప్రభుత్వము దక్కినఁ గ్రొత్తపొం; గహో !
లేవు భవన్నిఘంటువున లెంకయు తేఁ దను రెండుమాట, లీ
పావనజీవనమ్ము సిగబంతిగదా! జగదాప్తకోటికిన్ 7

ఆ॥ రామకథకు నిగ్గు రా భాష్యమును దీర్చు, చంద్రమౌళి ! నీకు జయము ! జయము !
సచివబుద్ధి కింత సారస్వత ప్రీతి, కుదిరనపుడ పుడమి కొదవు లగ్గు 8

(7-1-55)

---

✦ ఉప్పుసత్యాగ్రహము తఱి.

# అంటరాని వారా ?

## (గీతమాలిక)

అంటరానట్టివా రని యాదరాని
వా రనియు నుందురా నరుల్ వసుధలోన
నిల్చునా సభలం దిట్టి నిర్ణయమ్ము
గెల్చునా తమ్ములం ద్రోయు కృపణబుద్ధి
సోదరుల మాలలను దయాశూన్యవృత్తి
నణఁగఁద్రొక్కుట పాడిగాదయ్య ! మనకు
నరయ మన మెల్లరము వేల్పునను@గుబిడ్డ
లము గదా! మన కిన్ని భేదములు తగునె
మనము మనవారి నిట్లవమానపఱిచి
గట్టి బానిసపుంద్రాళ్ళఁ గట్టివైచి
యొరులతోడ స్వరాజ్యమ్ముకొఱకుఁ బోరఁ
దలఁపు లీడేరునా యెన్నితరము లైన
'నాత్మవ త్సర్వభూతాని' యన్న పరమ
ధర్మసూత్రంబునం గల మర్మ మేమి?
యేల పెడదారిపట్టెద? రింకనైనఁ
దెలివి తెచ్చుకొనుండు సందియము లుడిగి
యజ్ఞతను దూల్చు గాంధిమహాత్ముపల్కు
మస్తమునఁ దాల్పుఁ దమ్లానమాలవోలె
దాస్యమును బాయుఁ దుత్తమోత్తములు కందు
పుణ్యరతులార ! భారతపుత్రులార !

**(7-1-55)**



# ఆంధ్రనాయకుఁడు

చ॥ ఎవఁడురవాఁడు ✦ తెల్గులకు సింతయుఁ గట్టిద లేవటించు, వా
రవగుణులంచు, నొక్కడొరయాజ్ఞకు లోపడి మేలికార్యముల్
తవిలి యొనర్పరంచు నొక తత్త్వవిదుంబలె నంధ్రపూరుష
శ్రవణ విదారకమ్ముల నసత్యములన్ సభలందుఁ గూసెడిన్ 1

ఉ॥ పందలమాటకున్ విలువపట్టునె? సాహసమూర్తు లాంధ్రుల
స్పందపరాక్రమక్రమవిశారదులై మొనమొన్నదాఁక మ
ధ్యందిన భానుమండలవిధమ్మున వెల్గిరి; దక్షిణాపథం
బుం దమబాహువప్రమునఁ బ్రోచిరి; మోచిరి కీర్తిభారముల్ 2

ఉ॥ చావున కెన్నఁడున్ మదిని జంకరు; యాచకదైన్యభారమున్
మోవఁగలేరు; నీచులకు మ్రొక్కరు చిక్కరు; నిత్యకౌతుక
శ్రీవిభవాభిరాములు విశిష్టయశోభిరతుల్ స్వతంత్రతా
సేవకె ధారవోయుదురు జీవధనంబుల నాంధ్రసోదరుల్ 3

ఉ॥ ఆఁడుది తెల్గుజాతిది యొయారము లూరెడి జవ్వనంబుతోఁ
గూడి సమస్తభోగములకున్ గుదురైనది సంగరమ్ములో
నోడిన జీవితేశ్వరుని యుల్లము గాయము చేసి వెంపియున్
వేఁడిమి దెచ్చి మెచ్చి రణవీథికి నాథుని సాగనంపదే 4

ఉ॥ బెబ్బులికబ్బయౌ తెలుఁగుబిడ్డమగంటిమి మొన్న సైతమున్
బొబ్బిలికోటలో నుబికి పొంగి పరాసుల ముంచి ముంచి త
బ్బిబ్బొనరించి శాత్రవులబిట్టుపొగడ్తలఁ గాంచదా? జగం
బబ్బురమంద నాఁచికొనదా శరదిందువికాసకీర్తులన్ 5

ఉ॥ శ్రుతులన్ గ్రోలిచి, ధర్మమర్మములు సంశోధించి, బోధించి, గా
ఢ తపశ్చర్యల ముజ్జగమ్ము వడఁకాడంజేసి నానాధ్వర
వ్రతులై పొల్చుటగాక ఘోరకదనవ్యాపారపారీణులై
నుతికిం జాలిన భూసురు ల్గలరె? తెన్గుంగడ్డ వర్ధించినన్ 6

---

✦ అనాంధ్రనాయకుఁ డొకఁ డీ నిందగావించె

ఉ॥ చాలినజాతిరా ! తెలుఁగుజాతి నిరంకుశవీరజాతిగా
నేలిన జాతిరా! విధిసహింపనిదై పెడచూపుఁజూచుటన్
గూలెఁ దెనుంగుతేఁడు తలికోటరణమ్మున; నాఁటినుండి యీ
నేలకుఁ దగ్గ వాఁడిగల నేత లభింపఁ; డిఁ కేమి సెప్పుదున్ 7

ఉ॥ కమ్మని మాట లాడి నయగారము సూపినమాత్రఁ జచ్చు పె
ద్దమ్మలనాయకత్వ మిసుమంతయు నోర్వఁడు తెల్గుబిడ్డ; శౌ
ర్యమ్మున కంచితాశయపరంపరకున్ గుదురైన తేనికై
క్రుమ్మరుచుండె వాఁ, డతనికోరిక లెన్నఁటికిన్ ఫలించునో ! 8

**(23-5-38)**



## హెచ్చరిక

ఉ॥ దేశహితైకకార్యముల దీక్షవహించినవాఁడ, నెన్నఁడో
యాశలు త్రెంచినాఁడఁ, దను వర్ధము చంచల మంచు ధార్మికా
వేశము గొల్పుచున్ బ్రజలవిత్తము నల్లన లాగి దాని మాం
సాశనవృత్తి స్వార్థమునకై దిగమ్రింగెద వేల సోదరా ! 1

ఉ॥ మాలల నంటరాదు కసుమాలపుజాతి యటంచు వారి నీ
లీల బహిష్కరించి మతిలేక "దురాత్ములు దక్షిణాఫ్రికా
నేలెడివారు హైందవుల నెంతయు నీచులఁగా గణింతు" రం
చేల విచారమందెద విసీ ! నిను నే మనువాఁడ? సోదరా ! 2

ఉ॥ నీతిని జాతినిన్ మఱచి, నీ వణుమాత్రయు సిగ్గులేక ప్ర
ఖ్యాతి నడంచి, బుద్ధిబల కాయబలమ్ముల రూపుమాపి, నీ
చేతికిఁ జిప్పనిచ్చు మధుసేవకు లోపడి, రచ్చలందు మా
తాతలు సోమపీథులని దర్పము లాడెదవేల? సోదరా ! 3

ఉ॥ కూడు రవంతలేక మదిఁగుందుచు "బాబయ దండ" మంచు నీ
తోడినరుండు వెంటఁబడి దోసిలి యొగ్గి నుతింప వాని పెన్
గోడు నొకింతఁ జూడ కెదఁ గొంకక జంకక పానశాలలో
మాదలఁ బాడుచేసె దిది మానవధర్మ మటయ్య? సోదరా ! 4

**(10-11-27)**



# అన్వేషణము

మ॥ అకలంకాత్మలమై నిశీథమున నిద్రావస్థలో నున్న మ
మ్మొకగీతమ్మును బాడి మేల్కొలిపి యెందున్నాఁడవో కాని కం
టికిఁ గానంబడ వింతవింత కలదా ? నీకేల యీపంత మీ
సకియల్ కుందిననాఁడు నీకు ముదముల్ సంధిల్లునా ? మాధవా ! 1

ఉ॥ పట్టితి మెట్ట కేలకుఁ దపస్వులు యోగులు నెన్నినాళ్ళకున్
బట్టఁగలేని నీ విమలపాదయుగమ్మును; దీనికిం బతుల్
కొట్టినఁ దిట్టినన్ వెనుకకున్ జనఁజాలము తేటికొమ్మ లె
ప్పట్టుననైన వీడునొకొ పంకజగర్భమరందమాధురుల్ 2

శా॥ కాళిందీతటినీజలమ్మున మముం గాసింపఁగా ముగ్గితో
లీలన్ దూఱితివో నికుంజములలో; లేకున్నఁ బున్నాగ స
త్సాలాగ్రమ్మున దాఁగితో వలవ దీచందంబు చాలుం బ్రభూ !
జాలం బేటికి రమ్ము రమ్ము మురళీ సంగీతముల్ గుల్కఁగన్ 3

ఉ॥ నిక్కి గళమ్ముసాఁచి ప్రజ నిద్దురకుం జెడి దద్దరిల్లఁగాఁ
"గొక్కొరొకో" యటంచుఁ దొలికోడి చిటుక్కునఁగూసెనింక నీ
టక్కరిచేఁత లేటి కకటా ! మగవారలు మందఁజేరఁగాఁ
బ్రక్కలనుండి లేచెదరు భంగము గూర్పకురా దయాకరా ! 4

**(1-10-25)**



# దేశభక్తుఁడు

ఉ॥ మచ్చు యొకింతలేని ఋజుమార్గము నీది; వరాలు వేలువే
లిచ్చెడు వృత్తి దేశహిత మెంచి త్యజించినమేటి వీవు; నీ
పచ్చనిపంటగాఁ దెలుఁగుబంటులు లక్షలు లక్షలై జగం
బచ్చెరువందఁ గాంగ్రెసుమహారథచోదకులైరి ధీనిధీ ! 1

శా॥ నీ వాంధ్రోద్యమ జీవదాతవు కదా! నిద్రాణమై దీనమై
చేవంబాసిన తెల్గుజాతి వికసించెన్ నీప్రభావమ్మునన్;
నీవృన్మండలినెల్ల వెల్లిగొనుచున్ నిండారె నంధ్రక్షమా
దేవీకీర్తులు నీసపర్యకతనన్ దివ్యాపగావేణికల్ 2

ఉ॥ గండరగండవై భరతఖండ సముద్ధరణైకదీక్షలోఁ
బండితి వీవు; గాంధిగురుపాదు లొసంగు శుభాశిషమ్ములన్
నిండితి వీవు; బొంకు నవినీతి నధర్మము నూఁచముట్టుగాఁ
జెండితి వీవు; కొండకులసింధుమహోదయ ! వెంకటప్పయా ! 3

చ॥ ఎనుబదియేండ్లు నిండి యొద లిట్లు కృశించిన నేమి? నేఁటికిన్
రణరణితమ్ము విన్న నపరాజితవిక్రమమున్ వెలార్తు వీ
మనుగడ సాగి సాగి శతమానము నందునటుల్ నినున్ జగ
జ్జనకుఁ డనుగ్రహించు గుణసాగర ! త్యాగరమాధురంధరా ! 4

**(12-1-47)**



# తెలుఁగు పెండ్లి

గీ॥ కట్నములులేని పెండ్లి, బాకాలదండు, సందడులు లేనిపెండ్లియు జరుగుఁగాక !
పద్యములు లేని సాహితీప్రభలు లేని, పెండ్లిగా దాంధ్రభూమిలోఁ బేదకైన 1

ఉ॥ ఈ కవితానురాగ మెటు లేర్పడెనో? పలుచోట్లవారి కీ
పోకడ లేదు; సత్కళలపొత్తునెడన్ రతిలేదు; భూములున్
రూకలు గానివన్నియు విరోధులు వారికి వీరి ప్రాక్తన
శ్రీ కుసుమించెఁ గానఁ గుదిరెన్ మధురాశయ మివ్విధమ్మునన్ 2

మ॥ నవతాప్రీతి నితాంతమౌట నిట నేనాఁ డెవ్వరో పల్కిన
ట్టి వచస్సుల్ వినిపించు వైదికునికంటెన్ బ్రౌఢిమైఁ గ్రొత్తక్రొ
త్తవిధానన్ గృతిసృష్టిసేయు కవిమూర్ధన్యుండు సంభావ్యుఁ డీ
యవనిం బుట్టినవారి మెచ్చెద మృదువ్యాహార ధారాగతిన్ 3

గీ॥ చలిదికైతలతో బట్టుసరణితోడ, గజ్జెకట్టెడి కవులునుం గలరు మనకు;
నెంతమొగమోట యున్న సాహిత్యమర్మ, రసికు లీసీమవా రౌట రక్తి సెడదు 4

(5-5-54)



## ఉపద

చ॥ జయ ! జయ ! లక్ష్మీకాంతకవిసత్తమ! పింగళివంశవర్ధనా !
జయ ! జయ ! వేంకటేశకవిచంద్రమ! కాటురివంశమండనా !
నయనమహస్సుగాఁ దెనుఁగునాఁడు సమస్తము నేఁడు మీమహో
దయమును గాంచి ధన్యతకుఁ దావలమయ్యె రసప్రశస్తమున్ 1

ఉ॥ వా గపరావతార మన వచ్చిన వెంకన పల్కుఁ దేనియల్
వాఁగులు వాఁగులై తెలుఁగు వాడల సాగినవాఁడు పుణ్య పుం
దీఁగలు మీవి పూచినవి దీవ్య దఖండ కవిత్వభావ నో
ద్వేగము నిండి వాఙ్మయసవిత్రికి మీ రుడిగమ్ము సల్పఁగన్ 2

ఉ॥ వందలు వేలుగాఁ గృతులు వ్రాయరు మీ – రటులైన నేమి మీ
సౌందరనంద మొక్కటియ చాలును జాతికి నెల్లకాలమున్
విందులుసేయ, ధర్మపదవీ నదవీయసియైన బుద్ధి నీ
యం, దురితమ్ముఁ ద్రోయ, సకలాధిలతల్ మొదలంటఁ గోయఁగన్

చ॥ మఱచిన బుద్ధగౌతముని మాటలు బాటలు, కంటిముందటన్
జరిగిన బాపుజీబ్రదుకుచందము లందము లొక్కతావునన్
మెఱయునటుల్ మహామతులు మీ రొనరించినసృష్టిలో వినూ
త్న రుచినిధానమై యొక సనాతనధర్మము గోచరంబగున్ 4

(1-1-55) (కావలి సమ్మానము)



## ఆతఁడు

గీ॥ ఆతఁ డుగ్రతపః కృశీభూతుఁ డాతఁ, డున్నత శరీరయష్టిసంపన్నుఁ డాతఁ
డాత్మసందర్శ నోజ్జ్వల దక్షియుగళుఁ, డాతఁ డార్షమహస్సున కానవాలు 1

గీ॥ అతఁడు నేర్వని విద్య లే ద; తని కగ్గ, పడని భాషయు లేదు; ప్రాక్పశ్చిమ ప్ర
పంచసంస్కృతి పుక్కిటఁ బట్టె నతఁడు, నిఖిల మానవతా ప్రతినిధి యతండు 2

గీ॥ దుర్భ రావేశమునఁ దప్పుత్రోవఁబట్టు, దేశభక్తిని గాంధేయదిశకు మలఁచి
సత్యసంసక్తిమై నహింసాప్రవృత్తి, మై గరిష్ఠతఁ గను కర్మయోగి యతఁడు 3

గీ॥ జగతి యింద్రియసుఖ లాలసతకు లోఁగి, కామ్యకర్మానుగతికమై కదలువేళ
నిత్య నిరవద్య నిగ్రహనిష్ఠ కంద, దండమై నిల్చు నూర్ధ్వరేతస్కుఁ డతఁడు 4

గీ॥ పరమగుహ్యమ్ము గీతా నిబంధితమ్ము, బ్రహ్మవిద్యను బసులకాపరికి సైత
మెఱుకపడునట్లుగా నింత లింత లైన, కథలుగాఁ బ్రవచించిన బుధుఁ డతండు 5

గీ॥ వ్యక్తి సత్యా గ్రహ ప్రధనాంగణమున, నిలువఁజాలిన మొదటిసైనికుఁడుగా మ
హాత్మునుల్లము లోఁగొన్న యనఘుఁ డతఁడు, వీరులకు వింతగొల్పిన వీరుఁ డతఁడు 6

గీ॥ ఒక మహాశాస్త్రమర్యాద నొంది వెలసె, నతఁడు చేపట్టినంతన యలఁతికదురు
ఒక మహావేదబుక్కు వానికిఁగ రంగి, చల్లచల్లని దేశియై వెల్లివిరిసె 7

గీ॥ కుత్తుకలు గోసి నెత్తురుకూడు గాదు, తృష్ణలను ద్రుంచి యమృత మందించు నతఁడు
విప్లవము కాదు వానిది విశ్వశాంతి, కాదరువుగా నెసంగు సర్వోదయంబు 8

గీ॥ జనచయమ్ములు దేవతాగణము లయ్యె, దాత లెల్లరు హోతలై తరలివచ్చి
రుభయతారక మగుశాంతి యురలి పొరలె, నతఁడు భూదానయజ్ఞ దీక్షితుఁడు కాఁగ 9

గీ॥ కలిమి నిచ్చిరి ముక్కారుపొలము నిచ్చి, రొదలి నిచ్చిరి బ్రదుకిచ్చి రోట లేక;
బాపురే ! వానిపయనించు బాటలందు, నిండె నీవులు పుణ్యముల్ పండిపోయె 10

గీ॥ కానరాఁ డిఁక బాపుజీ కనుల కనుచు, శోకమయమూర్తియై క్రుంగు లోకమునకుఁ
బట్టుఁగొమ్మగ నిల్చినయట్టి దీన, బాంధవుఁడు పావనుఁడు 'వినోబా' యతండు 11

గీ॥ కోటి కొకఁడేని వానికి దీటువచ్చు, పురుషుఁ డుండినమహికి రాచఱిక మేల
శాసనము లేల యస్త్రశస్త్రమ్ము లేల, ధర్మదేవత నాల్గుపాదముల నడువ 12

**(5-2-55)**



# జయ సంక్రాంతి

(గేయము)

జయ ! జయ ! జయసంక్రాంతీ ! జగ దాహిత సుఖశాంతీ !
జయ ! మహేంద్ర సదన సదన సంవర్ధిత నవ్యకాంతి !
యుగ యుగములనుండియు నీ యుదయము మా కానందమె
అగును గాని యిప్పటి నీ యందము పరమానందము

మా పెంచిన యీరసముల, మాతగుండె నారసముల
నీపుట్టువు పెకలించెను, తాపాలను వదలించెను
సీమలు తెచ్చిన కయ్యము, చెఱిచెను మా నెఱి నెయ్యము
నీముందట నిలువలేక, నీల్గిన దా పెనుదయ్యము

పోరునష్టి పొందు పుష్టి, కారణ మను దీర్ఘదృష్టి
నీరాకదతోడ మాకు, నివ్వటిల్లె నిదేతుష్టి
వాఁకలతో వఱదలతో, నేకమై త్రివేణి కదలె
మా కెదురై గెలువ నేర్చు, మగ లెవ రీజగమం దిఁక

గాంధేయుఁడు శ్రీరాములు, కరుణించిన దీ రాష్ట్రము
గాంధేయ పథమ్మునందె, గడియించు నఖండజయము
మా కవచము సత్యదీక్ష, మా కస్త్రం బగు నహింస
మా కామ్యము మా గమ్యము చీఁకు చింతలేని క్రాంతి

**(10-1-55)**



# విషయ సూచిక



## ఉదయగానము

# సమీక్ష

మా అభినవతిక్కనగారి కవిత్వము స్పష్టముగ వాణీవరప్రసాదితము.

వారిమూర్తివలె నదియు స్వచ్ఛాంధ్రతా స్ఫోరకము. అంతియకాదు; పరిణత భావసము పేతముకూడ. ఆ నడకలోని హుందాతనము, పలుకులోని గభీరత, పదప్రయోగములోని యౌచిత్యము వీరికావ్యముల కొక విశిష్టత నొడగూర్చినవి. వీరికృతులలో ముందుగా కన్పట్టునది నిండుఁదనము, అంతకుమించిన తెలుఁగునుడికారపుసొంపును. భావపుష్టికిఁ దగిన భాషాసమృద్ధి వీరిసొమ్ము.

కవితకు వీరుంచుకొన్న యవధులు పరమోత్కృష్టములు. చూడుఁడు!

"జాతికిజీవగఱ్ఱలు ప్రజాహృదయమ్ములు నిర్వ్యళీకరేఖాతతముల్ సహేతురచనాంచితముల్ పరిశుద్ధభారతీ కేతువులైన కబ్బములకే ప్రసవమ్ములు చల్లవలె" ననునది వీరినిర్ణయము. ఈ మహాకవి దృష్టిలో తెలుఁగు కావ్యమునం దెల్లయెడలను "తెలుఁగుఁదనమ్ము క్రందుకొన" వలయును. తెల్గుకృతులు "తిక్కన సూరన వెంకనాది కవులు మలపిన బాటలో నడుచు మంజులశిల్ప"ములుగా నుండవలయును. అవి కేవలము పాండిత్యప్రకర్షకు చిహ్నములుగా మాత్రము కాక స్వతంత్రములును, వినూత్నములును, విశ్వకల్యాణాత్మకములు నగు భావములకు ప్రోదులు కావలయును. ఈ మహదాశయసిద్ధి మాట యటుండ, అవలంబనముకూడ సామాన్యుల కలవిగానిదియ. సుశిక్షణమును, భగవత్కృపాలబ్ధియును గల కర్మయోగికే యివి సులభములు. ఔను మఱి!

"నలకథ, సంధితంత్రము లొనర్చిన కృష్ణుచరిత్ర, రుక్మిణీలలన వాహమున్, గజకులప్రభు మోక్షము, దైత్యసూతి నిశ్చలహరిభక్తి, వామనవిశంకటవిక్రమగాథ"లు వీరి రసనాంచలమ్మున పిన్ననాఁడే నటించినవి. ఈయన బాల్యమునుండియు శిష్టానుసరణము, గాంధిమతావలంబనము గల సుకృతజీవి. కావుననే వీరి కవితకు మహోన్నత భావ విలసనము, అంతకుమించిన విషయోన్నతియు సమంచితముగ సమకూడినవి.

అభినవతిక్కనగారు యుగపురుషుఁ డగుమహాత్ముని "ఆత్మకథ"ను తమ కవితావస్తువుగా నెంచికొని ఆంధ్ర సాహిత్యలోకమున తమకును తమ కావ్యమునకును శాశ్వతము, ఉన్నతము నైనస్థానము నార్జించుకొని ధన్యులైనారు. "ఆత్మకథ"రచనలో "కావ్యసృష్టి సత్యసీమలను దాఁటకయే రసపుష్టి చేకూర్చుకొనఁగల" దని వీరు నిరూపించినారు. ఇది సత్యనిరతు లగు మహాకవులకే సాధ్యము. "పఱిగపంట"యం దెన్నియో సామాన్యవిషయములకు జీవముపోసి అవి కావ్యజగత్తున మఱవరాని దివ్యస్మృతులగునట్లు కావించిరి. "ఆత్మార్పణము"న

మానవహృదయమును కూఁకటివేళ్లతో కదలించు కరుణరసమును అత్యద్భుతముగా పోషించి యాదికవి వాల్మీకితో పొత్తుకల్పించుకొనినారు. "ధర్మజ్యోతి" యందు తమ పితృపాదుల ధర్మైకసక్తతను నిరూపించుటతోపాటు తమధర్మపక్షపాతమును ఆత్మగౌరవాభిరతిని చాటినారు.

శ్రీ చౌదరిగారి హృదయము విశ్వకల్యాణాత్మకము. అందు గాఢమగు దేశభక్తి, లోఁతైన జాత్యభిమానము వెల్లివిరియుచుండును. కావుననే వీరి "రాష్ట్రగానము" ఆంధ్రోద్యమమున కాలంబముగా తెలుఁగునాఁటి నలుమూలలకును ప్రాఁకి తెలుఁగువారిలో జాతీయావేశము కల్గించినది. అంతియకాదు కవిత్వపుఁదీరులో శయ్య నమర్చుకొనుటలో పాకముతీర్చుటలో సమాసఘటనలో తెనుఁగునుడికారమునకుం గుదురైన పదములు ప్రయోగించుటలో కవిత్రయమువారి – అందు ముఖ్యముగా తిక్కనపెగడగారి – బాణిలను పుణికిపుచ్చుకొనుటలో కవిగా రీకృతిలో నెంతదిట్టతనము చూపఁగల్గిరో, సమకాలికాంధ్రసమాజ మనోవ్యాపారులను నిశితముగా విమర్శించి కర్తవ్యనిరూపణ మొనర్చుటలోసైత మంతగట్టితనము చూపఁగల్గి నారు. ఇప్పట్టున వీరి వైఖరి వేమన్నను జ్ఞప్తికితెచ్చును. కావుననే వీరు రాష్ట్రగానమునందలి వైఖరి వేమన్నను జ్ఞప్తికితెచ్చును. కావుననే వీరు రాష్ట్రగానమునందలి "సంస్కరణ" సర్గమున ఆంధ్రుల సామాజికైకమత్యమునకు భంగకారులుగ నున్న వివిధ వ్యవస్థలను పేర్కొని "ఝుంఝూటము" నాడినారు. "పశ్చిమాంధ్ర"ప్రకరణమున పశ్చిమాంధ్రులకును కోస్తా తెల్గుల కును గల పొత్తులను గ్రుచ్చిచూపి "మాకున్ మీకును లేదు భేదము"లని యెలుఁగెత్తి చాటినారు. "అకలంకమ్మగు నాంధ్రసంస్కృతికి నేఁడాధారమే లే"దని విలపించినారు. "మాతృభాషారమణిన్ భజించుటకు సంబరమందని చచ్చుజాతికి ఊరక రాష్ట్ర మూడిపడ" దనియు పుట్టుగతులు లే వనియు హెచ్చరించినారు. "మాతృభాష" శీర్షికలో వర్తమానాంధ్ర శిష్టుల మనోవృత్తిని గికిలించి గిచ్చి మర్మోద్ఘాటనము గావించినారు. తన్నుఁ దా నెఱుఁగని వికృతదశలో నున్న ఆంధ్ర పుత్రునికి "నీపుట్టినగడ్డపయిన్ దీపించెడి ప్రత్యణువున్ నీపాలిటి వేల్పుగా గణింపు"మని హెచ్చరిక పల్కినారు.

**"ఏపుణ్యలేశమ్ము నాపాలి దాయెనో**
**నాపూజ కేలోకనాథుండు పొంగెనో**
**నీపావనోదర శ్రీపరంపరలలో**
**నీపదార్చకులలో నేను నొక్కఁడనైతి"**

అని ఆత్మశౌచము నార్జించుకొని

"గిరిలోక రాజమంబరచుంబిశిఖరంబు వింధ్యంబు ఛత్రమై వెలుఁగుచుండ చలదూర్మికా హస్తముల మోచికొని తెచ్చి కడలిరత్నచ్ఛటల్ కాన్కవెట్ట గౌతమీ కృష్ణవేణీ తుంగభద్రలు ముత్యాలసరములై మురువుసూప కవికుమారులు హృద్య గద్యపద్యమ్ముల నిజవైభవంబు వర్ణించుచుండ

**"గుణములకొటారు లైన ముక్కోటిబిడ్డ**
**లడుగు దాఁటక యూడిగ మాచరింప**
**చెన్నపుర హేమపీఠికాసీన యగుచు**
**దేశముల నేలుఁగాక! మా తెలుఁగుతల్లి"**

అని నిరవధిక జాత్యాభిమానముతో మహాసంకల్పము చెప్పికొని ఆమంత్రణముకావించి మాతృభాషామతల్లిని సుమనోహర పద్యసుమములతో నర్చించి.

**"నాకేకాదు భవచ్చరిత్రము లనన్యప్రాప్య ధారా రస**
**శ్రీ కందమ్మన నందగించుకవితన్ జిత్రించుభాగ్యంబు ను**
**ద్రేకస్ఫూర్తియు నస్మదీయమగు పుత్రీపుత్రకశ్రేణి కీ**
**వాకల్పాంత మనుగ్రహింపఁగదవమ్మా! ఆంధ్రవీరప్రసూ!"**

అని మంత్రాక్షలు చల్లినారు

**"దీక్షంబూనితి నాంధ్ర రాష్ట్రమును సాధింతున్ దదీయక్రియా**
**రక్షన్‌జేసెద నెట్టికష్టమయినన్ రానిమ్ము! కానిమ్ము! మా**
**తృక్షోణీయశ ముద్ధరింతు**"నని "రాష్ట్రగానము"లో ఆంధ్రపుత్రులచే శపథము చేయించినారు.

ఆనాఁటి సంకల్పబలము, శపథపరిపూర్తియే నేఁడు "ఉదయ గానము"లో ప్రతిఫలించిన యీ రాష్ట్రసిద్ధి. కాని యీ రాష్ట్రస్వరూపము, సముద్వేగము, మనఃప్రవృత్తులు శ్రీ సీతారామమూర్తి గారు వాంఛించినట్లు సత్యసుందరములుమాత్రము కావు. "చెన్నపుర హేమపీఠికా" సీమ మనకు దూరమైనది. "సహ్యసుతాతటంబునన్" గూడ ఆంధ్ర రాజ్యలక్ష్మి అధివసింపలేదు. తుదకు ఆయమ "శుద్ధసత్త్వమూర్తి సుతుఁ డొక్కఁ డాహుతివోవుదనుక" తరలి రానేరాలేదు. ఆ మంగళమూర్తి దర్శనమొందుటకుముందు ఆంధ్రపుత్రీపుత్రులకు "అలమట'కూడ తప్ప లేదు. 'రేవుకొఱకుఁ బాడితావుకొఱకు రాజధానికొఱకు నభ్రవాణికొఱకు" అభియోగము లుప్పతిల్లెను. అంతర్వివాదములతో స్వార్థాభిమానములతో, కుల వర్గ ప్రాంతీయ రభసలతో అధికారపదములకేర్పడిన అహమహమికలతో తెలుఁగులు "లుకలుకలై పొంగినమచ్చరాలతో తెకతెకలైరి." ఆంధ్ర రాజకీయరంగ మొక బీభత్సరంగముగా రూపొందినది. అందులకే యీమహాకవి పరితపించి పరితపించి తుదకు

**"మూఁడుకోట్లప్రజలు మూఁగినయింటిలో**
**మంచిపీఁటలెంతమంది కుండు**
**చాఁపనున్నవారు నాఁపలా? సైరణ**
**చూపువారె కీర్తికోపువారు"**

అనెడి విశ్వసత్యమును ఆంధ్రహృదయములం దూకొల్పి మందలించినారు. అధికార వ్యామోహమున కర్తవ్యతావిమూఢత నందిన ఆంధ్రపుత్రునికి

"రాజులేనిప్రొద్దురా! యిది, యీ నాఁడు
ప్రెగడబ్రదుకు నమ్మఁదగనియదుకు;
ఏటియొడ్డుబిడ్డ యీఠీవి, దీనిపై
రాగ మూడ్చి కర్మయోగి వగుమ!"

అని ప్రబోధించి అలనాఁటి కురుక్షేత్ర గీతప్రదాతవలె ఈ నాఁటి ఆంధ్రక్షేత్రప్రవక్త యీ యుగసంధిలో తన దివ్యసందేశమును ముక్తకంఠముతో పాడినాఁడు. "మొగపీఁటలె కావు కీర్తి ముట్టెడి బాట" లనెడి సబర్మతీఋషిపుంగవుని సిద్ధాంత వర్తనములను పునరుద్ఘాటించి నాఁడు.

ఆంధ్రపుత్రు లంతర్వివాదమగ్నులై తమసత్వమును గోల్పోవుచుండ తఱియెఱింగి "పొలి మేర" లను దొంగిలింప నుద్యుక్తులైయున్న ద్రావిడ, కన్నడ, ఓఢ్రసోదరులకు తెలుఁగుగడ్డ పరిమితిని సోదాహరణముగా నిరూపించి వారి నుద్దేశించి "మీరును మేము రేపు మొగముల్ మొగముల్ తిలకించుకోవలెన్"అని హితము సెప్పి "పాఱఁజూడుఁడీ" యని హెచ్చరించిన ఘట్ట మహో! రమ్యాతిరమ్యము! విశ్వసౌభ్రాత్ర తత్వనిరూపకమును!

"విశాలాంధ్ర" శీర్షికలో శ్రీ చౌదరిగారు పేర్కొనిన

"కమ్మమె ట్టోరుఁగల్ తెలంగాణమెల్ల
నీదిరా గోలకొండ నీపాదురా త్రి
లింగజగ మోయి! కోలారు బెంగుళూరు
నేల మాలూరు వేలూరు చెన్నపురము

లోకవిశ్రుతులౌ మనకాకతీయు
లేలురాజ్యమురా బస్త; రెఱిఁగియుందు
నాంధ్రతాముద్ర పింపిసలాదు నిమ్ము
నాగపూరాశ్రితమ్ము చాందాస్థలమ్ము"

అను నిర్వచనమును కాదని అనలేము గాని "విశాలాంధ్రమునకు భాగ్యకేంద్రమునకు" పరుగు లెత్తించు వీరి అమోఘ గీతారవమునకు మాత్రము నే నపశ్రుతిని మేళవింపక తప్పదు. "నా కిఁకన్ గొఱంత యొకండ నిల్చి కలఁగున్ మది, యీ సకలాంధ్రఖండముల్ బెరసినఁ గాని తేఱ దది పెం పిది సూచుముహూర్త మెప్పుడో" అనెడి యిమ్మహామహుని గాఢవాంఛి తము నకు ప్రతిచెప్పుచున్నందులకు మన్నింతురుగాక! రాజకీయచర్యలకు దిగుటకు నాకిది అనువుగాని చోటు. అయినను

"చూతును బృహదాంధ్రము నెవ
రేతంత్రము పన్నినను జయింతును దెనుఁగుం
గేతనములు చాందా గుడి
యాతములన్ నాటి నాఁటి నలరింతుఁజుమా!"

అను కవిగారి శపథమునకు ఇది ప్రజాపరతంత్రయుగము గాన ప్రతిశపథము నొడ్డఁబోను గూడ.

దక్షిణాంధ్రులసమస్యను తడవి శ్రీచౌదరిగారు

**"మాయింటి మీయింటి మైత్రిని జాటు**
**మాయమ్మ మీయమ్మ మైత్రిని జాటు**
**మాయోజ మీయోజ మైత్రినిజాటు**
**మాయాత్మ మీయాత్మ మైత్రినిజాటు"**

నుదాహరణము లెన్నియో పల్కి

**"తనజాతిన్ దనపల్కును**
**దనసంస్కృతి నుద్ధరించుతగులము వలయున్"**

అని ప్రబోధించి తుదకు

**"మన పెద్దతలల కీమాటలే క్రొత్త**
**తెనుఁగేమి టనువారిఁ దెలుచుటేరిత్త"**అని నిస్పృహచెందిరి.

"రాచవీడు" భాగములోని

**"ఎవఁ దరికట్టినన్ బ్రజలయాప్సిత మాఱడి వోక కల్ల ధ**
**ర్మవ తుదకున్ జయించు ననిరుద్ధము నానుడి ప్రాక్తనాంధ్రభూ**
**ధవులకు రద్దిఱస్త్రఁదుల కుదాత్తచరిత్రులు వాసిరెడ్డి రాట్**
**ప్రవవరుల కాశ్రయంబయిన తావె యగున్ మన రాజధానిగన్"**

శ్రీ చౌదరిగారి హృదయము సువిశాలము; భావము లత్యున్నతములు. వీరికి కులతత్వ ములు, సంపన్నతాదరిద్రతాభేదములు కిట్టవు. శ్రద్ధాళువు శ్రేయఃకామియు నైన కృషికునకుం బలె "నాఁప" తనము వీరి కెందును కన్పింపరాదు. కావుననే వీరు సంకుచిత భేదభావము లను నిరసించుటేకాక తెలుఁగుబిడ్డలు మాతృభాషపట్ల కన్పఱచుచున్న యుదాసీనతను లఘు భావములను వేయికంఠములతో విమర్శించి చీల్చి చెండాడినారు. ఈ మా ఆఱవ ఆంధ్ర సంస్కార సంఘర్షణక్షేత్రమున సైతమానాఁటి మాచదువులు సంప్రదాయసిద్ధముగా పెద్దబాల శిక్షతో ప్రారంభమై శతకవాఙ్మయమును దాఁటి బాలరామాయణము, అమరము, ఆంధ్రనామ సంగ్రహాదులను వల్లెవైచి బాలవ్యాకరణసూత్రములను లఘుచ్ఛందస్సును కంఠపాఠముచేసి మను, వసుచరిత్రాదికముల నర్థయుక్తముగ పఠించుటనేర్చి రామాయణ భారత భాగవతముల లోని రసవద్ఘట్టములను ఏనాలుగైదు రాగములతోనైన కూలంకషముగా గానముసేయఁ గల్గినఁగాని పూర్తియైనట్లు పరిగణింపఁబడెడివి కావు. ఇంత చదివి చాపల్యవశమున నేదే నొకపద్యము నల్లినచో "దుక్కిలేకయే విత్తు నాటుట" అని మా గురువు సాతాని శేషయ్యగా

రాక్షేపించెడివారు. కాని యిప్పటి చదువులకు వానితో నిమిత్తమేలేదు. అట్లగుట

"ఏదీ యీపస నేఁటికుఱ్ఱలకు? వా రెన్నాళ్ళు వేసారినన్
రాదే పద్య మొకండుసైత మింకవీరా? తెల్గుసాహిత్యపుం
బాదుల్ దిద్దెడివారు తాదృశులు సేబా సన్నమాత్రాన దు
ర్వాదంబుల్ సబలప్రమాణ మగునా? వర్ధిల్లునా? చెల్లునా?"

అని యీ యభినవతిక్కనగారనిన "తప్పేమి? యొప్పేయగున్!" అని పింగళిసూరనార్యుని నుడికారముతో సమర్థింతును.

మఱియొక విషయము. పరభాషాసక్తి తెలుఁగుబిడ్డలను వమ్ము చేయుచున్న దని కవిగారి భావము. వాడుకభాష ప్రచారమునకును గీర్వాణవాణీవిజృంభణమునకును హిందీ ఇంగ్లీషుభాషలకును చక్కనిచిక్కని తెల్గుపల్కును బలివెట్టరా దని వీరివాదము. అట్లని అందఱును మాతృభాషకే అంటిపెట్టుకొని పరభాషలవంకకు పోరాదను సంకుచితదృష్టి వీరికి లేదు. "ఇంటగెలిచి రచ్చగెలువు"మనుటయే వీరియాదేశము.

"ఓపికయున్నవాఁడు తగునొజ్జలఁగొల్చి సహస్రభాషలన్
నైపుణిఁబొందవచ్చు నది నాగరకత్వమ యౌను గాని తా
రేపవలుం బ్రయాసముభరించి వరించి నిజోక్తి పైఁ గడున్
జూపిడి తద్విశిష్టతకుఁ జోటయినప్పుడ రాణకున్ దగున్"

అనెడి యీసూనృతమూర్తి దివ్యవాణితో నేనును శ్రుతి గలిపెదను. మీఁదుమిక్కిలి పరిణతి నందిన విశ్వసాహిత్యపుఁ దోఁటలలో విహరించి అందలి భావసంస్కారములను నిత్య సత్య నిర్వచనములను తెలుఁగువాఙ్మయారామమున విరివిగ నాటుకొనుఁడని తెలుఁగు బిడ్డలను మఱి మఱి పురికొల్పుదును. ఈ సందర్భమున

"ఉత్తమకావ్యసృష్టి నభియుక్తులమెప్పులు వొంది జాతికై
నెత్తురుధారవోయు కవినీరజగర్భులతీరుపై సదా
చిత్తమునిల్పి వారువికసించుట యాత్మవికాస మన్న లో
కోత్తరధర్మమున్ బ్రెగడయున్ బ్రజయున్ దలఁదాల్చు టొప్పగున్"

అనెడి సీతారామమూర్తిగారి నిర్దుష్టసూత్రమును పాటింపవలసిన యావశ్యకమును ఉద్ఘాటింతును. మఱి తెల్గుకావ్యములలోని మేలిమి నితరభాషలలోనికిఁ గొనిపోయి ఆంధ్రకవి పుంగవుల ప్రతిభా ప్రభావములను కకుబంతములదాఁక వెలయింపుఁ డని ఉద్బోధింతును.

ఈ తెల్గుకవి ఆంధ్రత్వమును మాత్రము కాదు, ఆంధ్రుని సర్వతోముఖ సమృద్ధినిగూడ కోరును. "ఢిల్లీబంగరుకోటలో సచివపీఠిన్ దెల్గువాఁడుండెనా?" యని ప్రశ్నించుకొనును. "ఎల్లల్దాఁటిన రాయబారులెవరోయీ" యని వాపోవును. "అఖిలభారత పరిపాలనార్హమైన తెలివికిం జాలఁ డీనాఁడు తెలుఁగువాఁడు" అని కుంది కుములును. "కడకు రాష్ట్రమ్ము

సాగించువాడుపుసైత మెఱుంగ డెఱిఁగిన దొక్కటే విఱుగఁబాటు" అని తెలుఁగుబిడ్డలకు మర్మోద్ఘాటన మొనరించును.

ఇట్టే వ్రాసికొనుచుఁ బోయిన నిది పెద్దగ్రంథ మగునేమో! నిజమునకు ప్రతిపద్యమునకు నొక యధ్యాయముచొప్పున వ్యాఖ్య వ్రాయఁదగిన విషయగభీరత గల్గినది వీరికావ్యము. శ్రీ చౌదరిగారి కావ్యమునఁ నెందెందుఁ జూచినను - వెదకికాదు సుమా - అందందే నిత్య సత్యములు కుప్పలుతెప్పలుగా చిప్పిలుచుండును. కావ్యము పఠింపఁబూనిన నిఁక విసువు రాదు. విరామమును మన స్వంతకు ముందే సహింపదు. కోరదు. ఈ "ఉదయగానము" ఆకృతిలో చిన్నదియ. కాని దీనిప్రభావ మతివేలము. ఇందు సానదీర్చిన జాతిరత్నములున్నవి. వానికి మెఱుఁగుబంగారపు హవణికలును అమర్పఁబడినవి. ఈ కావ్యము తెలుఁగువారి తీరును సామాజిక పరిస్థితులను ప్రస్ఫుటముచేయునొక జాతీయతాఘట్టమును నిరూపించున దగుట సాహిత్యలోకమున శాశ్వతస్థానము నందఁగలదు. అలనాఁటి "కర్ణాటాంధ్ర" సామ్రాజ్య లక్ష్మిని సాఁకి తీర్చిదిద్దిన విద్యారణ్యుని సూత్రములకును ఈనాఁటి ఆంధ్రప్రజారాజ్యమును తీర్చిదిద్దఁ జాలిన శ్రీ సీతారామమూర్తిగారి సూక్తులకును లక్ష్యమొక్కటే! చౌదరిగారు తమ కవితాశక్తిని స్వీయరాష్ట్ర సర్వతోముఖాభ్యుదయమునకు వినియోగించుట మనభాగ్యము. పద్య రచనలో ఇట్టి నూతనపథము త్రొక్కినందులకు వారిని హృదయపూర్వకముగా అభినందించుచు అనన్య సామాన్యధారాశుద్ధిగల తమకవితాస్రవంతిని చౌదరిగారు బహుముఖమ్ములఁ బ్రవహింపఁజేసి విశ్వకల్యాణమునకు దోహద మొసంగుదురుగాత మని యభ్యర్థించెదను.

ఇరువది సంవత్సరములనాఁడు సాహిత్యవీధినుండి మరలిన నా కలమును ఈ సమీక్ష నెపమున మరల నొక్కసారి ఆ వంకకు త్రిప్పిన శ్రీ సీతారామమూర్తిగారి కెంతయు కృతజ్ఞుఁ డను.

రామనగరము
తిరుత్తనిమార్గము
చిత్తూరుమండలము

**పి.వి.సుందరవరదులు**
ఎం.ఏ.,ఎల్.ఎల్.బి
5-11-54

# ఎఱుక

తెలుఁగునాటి యభ్యుదయముపట్లఁ దెలుఁగువారి కెల్లరకు నాదరానురాగము లుంట సాజము. అది ధర్మము కూడను. నే నీ ధర్మమును గవితారూపమునఁ బాలింపఁ జూచితిని. రాష్ట్రసిద్ధికై పరితపించుచు నానాఁడు రాష్ట్రగానము నాలాపించితిని. రాష్ట్రవృద్ధికై యువ్విళ్లూరుచు నీనాఁ డీ యుదయగానమును బాడితిని.

మహావీర పొట్టి శ్రీరాములు గారి బలిదానముతో రాష్ట్రోదయమైనది. దీనితో నుదయగానమును సాగినది. కావున నాఁటినుండి మొన్న మొన్నటి (25-10-54) దనుక మనగడ్డలోఁ దలయెత్తిన రాష్ట్రీయ సమస్యలు కొన్నింటి యోగామి లిందుఁదడవితిని. దేశవికాసమునకై నాకుఁదోఁచిన సూచనలును గావించితిని. మన రాష్ట్రము భాషా మూలక మగుటం దెనుఁగు బాస పెంపుసొంపులఁ గూర్చియు నిందుఁజర్చించితిని. కాన ఈ కృతి రాష్ట్రగానమునకుఁ జెలియలు. అక్కగారికి దక్కిన కీర్తియీమెకును దక్కునుగాక !

తుమ్మల సీతారామమూర్తి

10-1-1955

## సూడిద

చ. మనయెడ నుత్థితంబయినమైత్రి పొరిన్ బొరిఁ దీవతీవలై
పెనఁగొని నీకు నాకు నొకభేదము లేమి ఘటించె; సాహితీ
జనిత మదీయ మంజులయశఃపరితృప్త విశాలచిత్తునిన్
నినుఁ గనినంత నాకడుపునండినయ ట్లనిపించు నాగయా ! 1

చ. ఇది యుపచారవాక్య మని యెంచవేని తెవుళ్ల ఁజిక్కి యం
దదుకులమగ్గదన్ బడి నిరాశల భ్రుంగినయేను గ్రమ్మఱన్
బదపదమందు నుత్సుకత పైకొని లేఖిని పట్టుటెట్లు ? మున్
వదలిన బాపూజీకృతిని వ్రాసి ముగించుటయెట్లుదాత్తమున్ 2

చ. అలఁతియలంతి నేర్మిదెస నాదటసూపవు, నేర్మి యెంతగాఁ
గులికినఁ బేర్మిలేనియెడఁ గూర్మి వెలార్పవు, నీదుకూర్మికిన్
నెలవగుచోట దేశికమణీ ! భవదీయ విశిష్టభావనా
బలమున సృష్టిచేసెదవు బంగరుపువ్వుల వానజల్లులన్ 3

ఉ. నీకడనున్న మేలుము లనేకము లయ్యును భ క్తిగౌరవో
త్సేక వినమ్రమదృ క్కలితశీలమునన్ ననుఁజూచుకొందు, వీ
వ్రేఁకన సైఁచు టెట్టులని వేమఱు వెల్వెలఁబోవుచుందు నే
నీ కొకముక్క నేర్పినమనీషినిసైతము గామి నెంచుచున్ 4

ఉ. ఇంతటి నీయుదారతకు నీఁదగుసూడిద లేదు గాని నా
చెంతకు నిన్ రసజ్ఞకులశేఖరుఁ జేర్చినకైత నంధ్రతా
క్రాంతము కాంత మౌ నుదయగానముఁగా వినిపించియైన నా
స్వాంతము తేటకొంట కొకసత్కృతి సల్పెదఁగాక చౌదరీ ! 5

ఉ. నీకును నాకు మాతృధరణీ మహనీయతపట్ల వాఙ్మయా
లోకముపట్లఁ దెల్గునుడిలోఁ గలతియ్యన లెంచుపట్ల భా
వైకత గూరియుంట నుభయాశయముల్ సఫలమ్ము లౌటకై
నాకృతి కీవు శ్రోత వయినాఁడవు నేఁటికి నుప్పలాన్వయా ! 6

# ఏటికోళ్లు

సీతారామమూర్తి గారూ !

తాము రచియించిన 'ఉదయగాన' మను కృతిరాజమునకు నన్ను శ్రోతను గావించి తమయుదారత చాటితిరి. కావ్యము సమగ్రముగా అచ్చుయినపిదపఁగాని నా కీవిషయము తెలియదాయెను. మీ యపరిగ్రహసిద్ధాంత మిందులకు హేతువని యనంతరము నా కెఱుకపడియెను. నాఁటినుండి నా కృతజ్ఞత నక్షరరూపముననైనను దెల్పికొనవలయునని యారాటపడుచుండఁగా నేఁ డీ కావ్యము పునర్ముద్రణము నందుచున్న శుభవార్త చెవికివచ్చి ధన్యోస్మియనుకొని నాకర్తవ్యమున కుపక్రమించితిని.

పురాకృతిసుకృతముననో, మిమువంటి సజ్జనులతోడి సాంగత్యమువలననో నాకబ్బిన సారస్వతాభిరుచిని, కవితానురాగమున మీరు గోరంతలు కొండంతలుగా ప్రశంసించినన్నీ కావ్యరత్నముతో ననుసంధించితిరి.

సారస్వతవ్యవసాయమున మీ కజరామరమగు యశము దక్కినది. మీ రాష్ట్రాభిమానము, జాతీయతానిష్ఠ, గాంధేయతత్త్వానురక్తి, సర్వోదయాభిరతి, "విశ్వజనీనబోధ్ధృతా లలిత, ముదార వృత్తము, కలాకమనీయము, సంస్కృతిప్రభామిళితము నైన" మీ కవితాసృష్టియు ననితరదుర్లభములు.

ఉ॥ మీఁగడజుంటి తేనియల మించినతీయనిపల్కునన్, లస
ద్ధీగరిమన్ మహాంధ్రకవి తిక్కనకున్ సరివారు మీరు; మీ
సాగినబాటలో నడుగు సాగదు నేఁటికవీంద్రకోటి; కే
యోగమొ మీ ప్రశంసలకు యోగ్యు నొనర్చె ననున్ మహాకవీ !

చం॥ నిరుపమపాండితీగరిమ నిస్తుల సార కవిత్వసంపదల్,
గరువము లేని పోకడలు కల్ల లెఱుంగని శీలసంస్కృతుల్
నిరతము పంచు మీ కెడఁద నిండిన భక్తిభరమ్ముతోడఁ జం
దురునకు నూలిపోఁగు నిడు త్రోవ నొసంగెద నేటికో ళ్లిటన్.

ఉప్పల నాగయ్య

**14-1-1973.**

# ఉదయగానము

## వేగుఁజుక్క

శా. నీ పే రాంధ్రచరిత్రలో నమరమై నిల్చెన్, దపశ్శీలమౌ
బాపూధర్మము నుద్ధరించి దురహంభావోద్ధతుల్ తాంత్రిక
వ్యాపారప్రియ లాత్మదర్శన దవీయాంసుల్ త్రపావీచులన్
ద్రోపాడంబడున ట్లొనర్చితవి సాధుల్ మెచ్చ శ్రీరాములూ ! 1

మ. జతనంబుల్ పొనరించి రన్నలు స్వరాష్ట్రప్రాప్తికై నల్వదేం
డ్లితరుల్ నవ్వుటకాక వచ్చినది యేమి? సత్యమున్ ధర్మమున్
వితథంబయ్యెనో! యటంచుహృదయోద్వేగంబునన్ వచ్చిదూఁ
కితె! సత్యాగ్రహయజ్ఞకుండచటులాగ్నిన్ లోక ముఱ్ఱూఁగఁగన్ 2

శా. మున్నీ వెవ్వఁడవో యెఱుంగనిప్రజల్ మూర్తీభవత్త్యాగమై
యన్నా! యామరణోపనాసభర మీవై జాతికై పూనుటన్
గన్నుల్ విప్పరె! ప్రాణముల్ పణముగాఁగన్ నీవు దివ్యత్వమీ
కొన్నంతన్ జకితాత్ములై సొగసి నీకున్ జోత లర్పింపరే! 3

చ. ఒకదెస గాంధితత్త్వమున కూపిరివోసిన వాసి గంటి; విం
కొకదెస నంధ్రజాతికి మహోదయ పర్వవిధాత వైతి; వే
టికిఁ బదికోట్లమంది వికటీకృతబుద్ధులు? నిన్ను వంటి సా
ధకుఁ డొకరుండు సాలునుగదా ! కనిపెంచిన తల్లి తృప్తికిన్ 4

చ. పదుగురు కర్మయోగులు భవాదృశు లబ్బినచో స్వరాజ్య సం
పద నొకయేఁటఁ దెత్తుననిపల్కఁడె మున్ను మహాత్ముఁ;డబ్ర మె
య్యది కల దించు ? రెండునెలలైనను నిండని నీతపస్సుతో
నెదురయివచ్చె నాంధ్రవిజయేందిర; మెంతటినిష్ఠరా ! ప్రభూ ! 5

చ. సిరులను ద్రోయవచ్చు, నిరసింపఁగవచ్చు సుఖానుభూతి, రా
చఱికము రోయవచ్చు, నిజసంతతి నింతని వీడి సంయమ
స్థిరత వనాంతరమ్ముల వసింపఁగవచ్చునుగాక, తాముగా
నెఱిఁగి యెఱింగి ప్రాణముల నెంద ఱిటుల్ బలియిత్తు రుర్వికిన్ 6

చ. బలియు దధీచియున్ శిబియుఁ బ్రాంతయుగమ్ములనాఁడు ప్రోఢలై
యలయక ధర్మరక్షణకుఁ బ్రాణము లొడ్డి రటన్నమాటకున్
వెల నిడలేని వెట్టికి వివేకము సెప్పితివే ! తెలుంగువా
రల కిఁక నీవ రాముఁడవురా ! యవురా ! యవిరామసత్ కృతీ ! 7

గీ. పరుల యాచింపనొల్లని, పక్షపాత, మిచ్చగింపని, కికురింతమచ్చలేని
యడుగులకు మ్రొక్కు శిరముపై హజ్జ నిడని, పొట్టి వయ్యు మిన్నందిన దిట్ట వీవు 8

ఉ. కోమటి భారతప్రజలకున్ ఘటియించెను రాజయోగమున్
గోమటి వీవు తెన్గుప్రజకున్ గడియించితి రాష్ట్రభోగమున్ 9
భూమి వణిజ్యతంత్రమున బ్రుంగి కలంగునెడన్ విముక్తికిం
గోమటిగా కొరుం డెటు తగున్, జరితార్థము నీ కులం బహో! 10

ఆ. ఓ తెనుంగురాష్ట్రమా! తుట్టతుద కెంత, కడిఁదిపనికిఁ బాలుపడితివమ్మ !
శుద్ధసత్త్వమూర్తి సుతుఁ దొక్కఁ డాహుతి, వోవుదనుకఁ దరలిరావు నీవు 11

## అలమట

గీ. నలువదేండ్లతపస్సు లీనాఁడు పండి, తరతరాల తపస్సులు విరిసి విరిసి
యిదె సమీపించె నాంధ్ర రాజ్యేందిరావ, తరణ సుముహూర్త మఖిలార్థకరణమగుచు 1

ఆ. మఱుఁగువడిన తెలుఁగు మన్నెతికపుఁ గోర్కి, నిల్లి కోర్చి త్రవ్వి యె త్తినట్టి
జాతి హితుల మఱవఁజాల సీతారామ, యతివరిష్ఠు బసవకృతిగరిష్ఠు 2

గీ. జొన్నవిత్తుల గురునాథసూరి లేని, వేంకటప్పయ్య పానుగల్విభుఁడు లేని
రుచిరశీలుఁడు నాగేశ్వరుండు లేని ,పండువై వచ్చె రాష్ట్ర మిప్పటికి నకట ! 3

ఆ. దుక్కి దున్నిదున్ని మొక్కలు నాటి నీ, ర్వోసి వోసి నవసి పోయి రన్న ;
లిపుడు తోఁట కాచి యింటికి వచ్చిన, మావిపండ్లు తినుట మనకు దక్కె 4

గీ. వచ్చినది రాష్ట్రము; సరే !, హెచ్చినదా యింతమాత్రనే మనభోగం ;
బచ్చపు రాగము, త్యాగము రెచ్చిననాఁడేకదా తరింతురు తెల్గుల్ 5

ఆ. తనకుఁ బనికిరానితరు వాంధ్రునకు నేఁడు, కల్పవృక్షమేని కలుపుమొక్క ;
యెడ్డెలై తెలుంగుబిడ్డలు, దొడ్డలు, తన్నుకొంద్రు కచటతపల వోలె 6

ఆ. రేవుకొఱకుఁ బాడితావుకొఱకు రాజ, ధానికొఱకు నభ్రవాణికొఱకు
నెదురుసూచుచున్న వెన్నో వివాద లీ, యగ్గు లెవ్వఁ డోర్చి యార్పఁగలఁడొ ? 7

చ. లుకలుకలైరి నేఁటికిఁ దెలుంగులు ; పొంగిన మచ్చరాలతోఁ
దెకతెకలైరి ; జాతికొకతె న్నొకతీరును లేమి లేకులున్
బకబక నవ్వసాగి ; రిటు పండినపాపము సైఁపరాని; దీ
తికమకలూడ్చి సంఘమును దిద్దనిచో మన కేమిలగ్గగున్ ? 8

క. సది కోర్వనేర్చి పగతుఱ, యదుగులకున్ మదుఁగు లొత్తినట్టి ప్రబుద్ధుల్
మడిగట్టుకొనిరి నేఁటికిఁ, గుడియెడమల దేశభక్తి ఘుమఘుమలాడన్ 9

గీ. మూఁగలై యింతకాలంబు మూల డాఁగి, రెవ్వ రాయన్న లీనాఁ డదేమిరాష్ట్ర
భక్తియో పొత్తు కలియనిపాట కదుగు, ద్రొక్కుచున్నారు జలధు లద్రులు వడంక 10

గీ. ఏల మురిసెద వీ సెలయేటి చిలిపి, గంతులకు నొజ్జలగు మాటకాండ్రఁ జూచి
చేఁతలం గాక మ్రోఁతలచేత నొఱగు, లెస్స లేదోయి ! జాతికి లేశమేని 11

## పిన్నలు

ఆ. పెత్తనంబు వలచు పెద్ద లూరూర బా, కాల నూఁదుకొంద్రు గగన మదర
నిక్కమైనసేవ నెఱపెడి పిన్నలు, కంటఁ బదరు సెనగపంటవోలె 1

చ. తలఁకక తెల్లునీరు తమతాతలసొత్తని త్రుళ్ళువారి కు
ట్రలుగని నందికొండ నికటంబునఁ గృష్ణను గట్టుకట్టదల్
వెలువడుదాఁక లక్షలను వీసములట్లు విదిల్చి జాతికై
నలఁగిన వాసిరెడ్డి నరనాథున కెవ్వనిమెప్పు కావలెన్ 2

ఆ. జాతిపెంపు నాకుఁ జాలును జాతీయ, గౌరవంబు నాదు గౌరవంబు
జాతిసేవ నాదుజన్మంబునకు ఫలం, బని పెనంగె నిమ్మహామహుండు 3

ఉ. చల్లనికోటలో వలపుజల్లులు పైకొనుతోఁటలో మరు
ద్వల్లభున ట్లఖండసుఖవాహిను లీఁదు నృపుం డితండహో !
తల్లికి ముప్పురాఁ గదలి దానిని దీనిని గాదు కేంద్రమౌ
ఢిల్లినె యూఁపె రాచసిరిరీవులు చూపె జగజ్జనాళికిన్ 4

గీ. తలలుకూడని తెల్గుసర్దార్లు నంది, కొండకై యొకత్రాటిపై నుండి రనిన
రిపులు కంపిల్లఁగా బొబ్బరించి రనినఁ, జెప్పుమా హేతు వీతనిసేవ గాక 5

ఆ. ఎల్ల దెసలవార లెల్ల వర్గాలవా, రేకమైరి యితనివాకు మెచ్చి
యేల శిరమువంప దిమ్మహి లాభలో, భప్రసక్తిలేని ప్రాజ్ఞునెదుట 6

చ. అఱవల నక్క జిత్తులకు నాహుతియై తెలుఁగుంబ్రజాళి ది
క్కఱి చెడి యాఁకటన్ నకనకంబడి మూల్గి నశించు దుర్దశల్
విరిసినవేళ నీతఁడు త్రివిక్రముఁడై సకలాంధ్ర బాంధవ
స్థిరత గడించె నీదృశులజీవనముల్ శతధాకృతార్థముల్ 7

మ. హిమధామ ప్రథమానవంశతిలకం బీ 'రామగోపాలకృ
ష్ణమహేశ' ప్రభు మౌళి, ముక్తిపుర రాజ్య శ్రీ విభుం డెంత ని
ర్మముఁడై యున్నను మామకీనకవితా మంజూ క్తి నేఁ డిట్లు చం
క్రమణంబుల్ పచరింపనోర్చె గుణసక్తంబై నిరాఘాటమై 8

మ. మతములు వర్గముల్ కులసమాజము లన్న విభేద మీ జగ
ద్ధితునకు నీ యుదాత్తగుణదీప్తున కాదృతిసేయుపట్ల నా
హతమగుటబ్రమా? కువలయాప్తున కెవ్వరు కాన్క వెట్టకుం
ద్రు? తుదకు నూలిపోగయిన దోయిట నెత్తక నిల్వనేర్తురా ? 9

గ. నాయకు లధికార సభా, గాయకు లీకర్మయోగి కఱపినబాటన్
బోయినచో సేవావిధిఁ, బాయనిచో మనకు నెన్ని పర్వము లగునో ! 10

క. పెద్దలతో స్వార్థప్రియ, బుద్ధులతో మనశిరమ్ము బొప్పులుగట్టెన్
రద్దియెఱుంగని పల్లెల, నిద్దఱ కిద్దఱకు నడుమనెగసెఁ గటారుల్ 11

క. పిన్నలలో నాయకుఁడు, త్పన్నుఁడు కావలయు, నంధ్రపౌరుషరోచి
ష్పన్నుండు ధర్మరమా సం, పన్నుఁడు రావలయు, జాతి బలపడవలయున్ 12

## పదవులు

గీ. సోదరా ! విక్రమౌదార్య వేది వగుచు, నీతికిని జాతికిని హిత భ్రాతవగుచు
మాతృసేవాపరాయణామ్లానదీక్షఁ, గదలుమా వీరముద్రికల్ ఘల్లుమనఁగ 1

క. మాకోవ మంత్రి లేఁడని, మా కులమున కూరు పేరు మన్నాయని యు,
ద్రేకించు వారిచెల్మికిఁ, బోకుము, పాలన్ విసమ్ముఁ బోయకు మన్నా ! 2

ఆ. మూఁడుకోట్ల ప్రజలు మూఁగిన యింటిలో ముంచి పీఁట లెంతమంది కుండుఁ
జాఁపనున్న వారు నాఁపలా ? సైరణ, చూపువారె కీర్తి కోపువారు 3

ఆ. దొడ్డతలఁపు లున్న రెడ్డికైనను మాల, బిడ్డకైన నిమ్ము పెత్తనమ్ము
కులము లింక నిల్వఁగల వఁటోయీ ! వేరు, పురువు పడియె వాని పరువు పెడియె 4

ఆ. కులమువారికెల్లఁ దలపుండ్లు కడిగించి, కూడు వెట్టు మంత్రి కాఁ డెవండుఁ
బదవి కొఱకుఁ బుట్టినది కులతత్వ మీా, తంత్ర మరయుమా స్వతంత్రబుద్ధి 5

చ. మును పాకమంత్రి రాచతీకమున్ గని చుట్టల నాఱువేలమం
దిని గరణాలఁజేసెనని తెల్పుకథల్ నిజమౌనుగాక, త
ద్దినములు నేఁడురావు, ప్రగతిప్రియమైన ప్రజాయుగమ్మురా
మనది ; ఫలించునే దురభిమానము లిత్తఱి నెంతనిక్కినన్ 6

ఆ. రాజులేనిప్రొద్దురా యిది – యీ నాఁడు, ప్రెగడబ్రదుకు నమ్మఁదగని యదుకు ;
ఏటియొడ్డుబిడ్డ యీ రీవి ; దీనిపై, రాగ మూడ్చి కర్మయోగి వగుమ ! 7

గీ. రాజులు, మంత్రులు, మతి నే, ఆజోదులు, పుట్టరా తరతరమ్ములుగా
నీ జగతి వార లందఱుఁ, బూజితాలా ? బూఁజువట్టిపోరా ? పలువుర్ 8

క. ఓజన్ దప్పక యెవఁడు స, మాజాభ్యుదయమునకై శ్రమంపదు నతఁడే
రాజైనను బంటైనను, రాజిల్లుఁ జరిత్రలో జరామృతు లెడయన్ 9

క. జగమేలిన దుర్యోధనుఁ, బొగడితిమా? ప్రభుతలేని బుదుత విర్ణుం
దెగడితిమా ? వేయేటికి, మొగపీఁటల కావు కీర్తి ముట్టెడి బాటల్ 10

ఉ. గద్దియ నెక్కఁదగ్గ మొనగాఁ డెపుడున్ జటిచాఁప నుంటయే
పెద్దతికమ్ము ; తంత్రములు పెంచిన క్రించులు కొంద తెట్టెటో
గద్దియ కెక్కి నిక్కెదురు గాని సమాజము బుఱ్ఱ లేనిదా ?
బ్రద్దలుచేసి తీరు నలుప్రక్కలఁ దీర్చిన గాలిమేడలన్ 11

క. ఫలతృష్ణ లేని సేవలు, వలచినవాఁడే జయించు వసుమతి నెల్లన్
నలఁగి నలఁగి యీ సత్యమ, తెలిపెనురా ! మును సబర్మతీఋషి మనకున్ 12

క. నాకేలా రాచతికము, పాకీపని చాలు నన్న ప్రభు వాతఁడు ; త
ద్వాకుం దలఁదాల్చి ప్రజా, నీకమ్మున కూడిగంబు నెఱపుము కుఱ్ఱా ! 13

క. మకుటములు దక్కలేదని, తికమకపడి, దారితప్పి, తిరిగెడి తమ్ముల్
సుకపద రింతయు నకటా !, సిక పెంచినయతి కెవర్త సేసలువోయున్ 14

మ. మతమేలా కులమేల కల్పితము లీ మర్యాద లీ శాస్త్రముల్
కత లంచుం బ్రవచించి, పెత్తనమురాఁగా నాకు నామామకున్
బితకుం బిడ్డకు బావకున్ మఱఁదికిన్ బీరంబు దెమ్మంచు సి
బ్బితివో నాడినవాఁడొకండ మన కస్పృశ్యం దవాచ్యం డిఁకిన్ 15

## రాష్ట్రోదయము

ఉ. పాడిన రాష్ట్రగానములు పాకమునం బడి తెల్గుజాతిలో
వాడిన దీక్షకున్ నవనవత్వము సత్వము సంతరింప రా
పాడిన విష్ణు రాజులకు నన్నలు పిన్నలు ప్రాణవిత్తముల్
సూడిదవెట్ట నేఁడు తలచూపిన వాంధ్రమహీప్రకాశముల్ 1

సీ. విత్తునాటిన జొన్నవిత్తుల కులమౌళి, గురునాధునకు నేటికోళ్ళు పల్కి
పాదుకట్టిన తెల్గుబంగారుకొండకు, వేంకటప్పయ కర్షవిధులు దీర్చి
నీర్వోసి పెంచిన నెఱదాత కాశినా, ధునకు భక్తిప్రపత్తులు వెలార్చి
బదలెఱంగని కాపుగడ కోర్చి నిల్చిన, పానుగంటికి బరాబరు లొసంగి
గీ. సాఁగిసాఁగిన యీ తెన్గుఁదీఁగచివరఁ, దళుకు లెగ ఁజిమ్ము విరికి నెత్తావి యైన
పొట్టిరామయ్య కారతి పట్టవోయి !, తమ్ముఁడా ! నూత్న రాష్ట్రావతరణవేళ 2

ఉ. రెండుతరాలవీరులు పోరింబోరిగాఁ దలక్రిందులై, తప
శ్చండిమ చూపియున్ బదయఁజాలనిసిద్ధి గడించె, నెమ్ములున్
గండలు రక్తవాహినులు గా కసువుల్ బలివెట్టె నీతఁ ; డీ
పండువు సత్యదేవతకుఁ బండువు, పండువురా యహింసకున్ 3

ఉ. త్యాగధనుల్ తపోనిధులుదాత్త చరిత్రులు నీకుఁ గూర్చి రీ
భోగము ; రాగ వైర పనరిభూతమనీషకు దవ్వుదవ్వులన్
సాగుము ; నీ ప్రభుత్వ మొక చల్లని తెమ్మెరయై మహాంధ్ర వ
ర్షాగమమై ప్రమోదకలమాంచితమై నడుచున్ సుభిక్షమై 4

మ. కకుబంతమ్ములదాఁక నాంధ్రులపతాకల్ ప్రాఁకి పై కొన్న యా
శకముల్ జ్ఞప్తికి వచ్చి యద్యతన రాష్ట్రప్రాప్తి వేళా సము
త్సుకతల్ పొంగులువాఱి మై పులకరించున్ ; విశ్వకల్యాణ ల
బ్ధికి నాత్యోన్నతి కేతదీయమగు నావేశంబుతో డయ్యెడిన్ 5

సీ. శాతవాహన సర్వసర్వంసహాపతుల్, వలచి నేర్పిన సాధువర్తనమ్ము
చాళుక్యమేదినీపాలకుల్ గఱపిన, స్వస్థానవేషభాషా రిరక్ష
కాకతీయ క్షమాకాంతసంతానమ్ము, మప్పిపోయిన విక్రమక్రమమ్ము
సాహితీ సంగ్రామ సార్వభౌములు రాయ, లొసఁగిన రసికతామసృణబుద్ధి
గీ. వలసినంత పురాతనవైభవమ్ము, కలదు, కమనీయసంస్కృతి కలదు నీకు
నడుపఁగదవోయి ! విజయఘంటా నినాద, మేదురం బగు త్రోవలో నీదు రథము 6

చ. మనప్రజ నాల్గుకోట్లపరిమాణము గన్నది ; శేముషీబలం
బనవధికంబు ; సంతతపయఃపరిపూర్ణ ఝరీపరంపరల్
మననదు; లిన్నియున్ నియతమార్గమునం బయనించునేని యీ
తెనుఁగువసుంధరా సుకృతదీప్తులు నల్గడ నెంతయొప్పునో 7

ఉ. 'లోకులు దద్దఱిల్లఁగఁ దెలుంగులు దూఁకుటెకాని వాంఛిత
శ్రీకులు గాకమున్నె వివశీకృతులై దిగజాఱుచుండ్రు, తా
టాకులమంట వీరిహృదయం' బని పల్కెద రన్యు ; లీసడిన్
గూఁకటివేళ్లతో వెడలఁగొట్టక నిద్దురపోకు తమ్ముఁడా ! 8

మ. అది సర్వోదయసారభూత, మది హింసాతీత, మన్యోన్య సౌ
హృదమూలం, బది సత్యశీల, మదిసాహిత్యంబు, నిత్యంబు, ధీ
సదనుల్ మెచ్చిన గాంధిధర్మమది, తచ్ఛాయన్ బ్రయాణించుచో
నెదిరింపంగలవాఁడు లేఁ డొకఁడు నిన్నీ విశ్వవిశ్వంబులన్ 9

ఉ. కాకుళమందు, ధాన్యకటకంబున, రాజమహేంద్రవీటిలో,
నేకశిలాపురాన, విజయేందిరకున్ గుదురైన హంపిలో
నీకు లభించినట్టి మహనీయత నందుము తెల్గుతల్లి ! య
స్తోకదయార్ద్రమై కనకదుర్గకటాక్షము నిన్నుఁ జేరఁగన్ 10

గీ. తమ్ముఁడా ! నూత్న రాష్ట్రావతరణ పర్వ, జనిత హర్షానుభూతిలో మునుకలిడుచు
మేలుమేల్ ! కట్టితే మొగసాలమీఁద, నాంధ్ర లక్ష్మీపతాక, కల్యాణరేఖ 11

ఉ. నాఁ డల తళ్ళికోట కదనమ్మున వాలిన తెల్గుబావుటా
నేఁడు తళ త్తళల్ గురిసె నింగిని ; మంగళగీతవాద్యముల్
వాడలవాడలన్ విరియ వచ్చిన దాంధ్రమహస్సు ; జాతి కీ
వేడుక సంఘటించిన పవిత్ర చరిత్రుల కంజలింపుమా ! 12

గీ. ఆంధ్రుఁ డెవ్వఁడు? మద్రాసివా ? యటంచు, నొరు లిఁకన్ నినుఁ జిన్నపుచ్చరుగదోయి !
తేజములు చింద భారత రాజకీయ, పటమునం దీవు కన్పించు భాగ్య మొదవె 13

క. పరుల దయాధర్మమ్ముల, కొఱకు నిరీక్షించు పీడ కొఱవడె నీకున్
దొరవైతివి నేఁ ; డిఁక నీ, గరిమకు నవనతికి నీవె క ర్తవు సుమ్మా ! 14

ఉ. రాచతికమ్ములో ననుచరత్వములో నొక తారతమ్యమున్
జూచుట విస్మరించి నిజసోదరసేవకు నెల్లప్రొద్దులున్
వేచు నెవండు మండలవివిక్తత వర్గకులాది భేదముల్
రాచు నెవండు వాఁడుగదరా! రపియపుత్రుఁడు మాతృభూమికిన్ 15

చ. ప్రజల నధఃకరించి పరిపాలనసేయుట కెట్టి దిట్టయున్
గిజగిజలాడు కాల మిది ; కేవలతంత్రము లెల్లవేళలన్
గజిబిజిలేని వైభవముఁ గల్పనసేయవు ; సంతత ప్రజా
విజయపతాకవై యనుభవింపఁగదోయి ! మహోన్నతస్థితిన్ 16

(మొదటి పది పద్యములు ఆలిండియా రేడియో విజయవాడవారి సౌజన్యముతో)

## విశాలాంధ్రము

ఆ. ఓరుఁగంటిసీమ, యొరియాలు కన్నదు, లఱవ లాఁచికొన్న యాంధ్రభూమి,
మధ్య రాష్ట్రమునఁ గుమారిల్లు నీగడ్డ, లేక నీపతాక లెస్సయగునె ? 1

ఆ. చాఁప చినిఁగి చినిఁగి చద రైనటుల్ బరం, పురము లేని చెన్నపురము లేని
రాచకొండ లేని రాష్ట్రంబ వచ్చె నీ, సొగసె చూచి పొంగి సొగసి పోకు 2

గీ. కమ్మమె ట్టోరుఁగల్ తెలంగాణమెల్ల, నీదిరా, గోలకొండ నీ పాదురా, త్రి
లింగజగమోయి ! కోలారు బెంగుళూరు, సేల మాలూరు వేలూరు చెన్నపురము 3

గీ. లోక విశ్రుతులౌ మన కాకతీయు, లేలు రాజ్యమురా బస్త ; రెతిఁగియుందు
వాంధ్రతాముద్ర పింపిసలాడునిమ్ము, నాపురసవధమ్ము 'చాంద' స్థలమ్ము 4

ఆ. నడుము కట్టవోయి ! నా తమ్ముఁడా ! విశా, లాంధ్రమునకు భాగ్య కేంద్రమునకు
నిన్ను బెరసి నడువ నున్నారు సోదరుల్, గోలకొండవారు కోటిమంది 5

చ. పరులకు లొంగి భంగపడు భారతజాతి స్వతంత్రమై జగ
ద్గురుతవహింపఁగంటిఁ గనుఁగొంటిని రాష్ట్రమురాక – నాకిఁకన్
గొఱఁతయొకందనిల్చి కలఁగున్ మది ; యీసకలాంధ్రఖండముల్
బెరసినఁగాని తీఱదది; పెంపిది సూచుముహూర్త మెప్పుడో ! 6

గీ. "మా తెలంగాణమును బృథక్కేతనమ్ముఁ, జేయుఁ"దని పల్కు వారు నేర్చినదె చదువు
ముగ్గురే నల్గురే యటుమొగ్గి రనుట, కాదు–రావచ్చునా ? యిట్టి కటికి ద్రోఁత 7

క. చూతును బృహదాంధ్రము–నెవ, రేతంత్రము పన్నినను జయింతును–దెనుఁగుం
గేతనములు చాందా, గుడి, యాతములన్ నాటి నాటి నలరింతుఁ జుమా ! 8

## ఎల్లలు

గీ. కలరు పొలిమేరదొంగలు, కలరు తేనె, పూఁతపూసిన కత్తులు, నీ తెలుంగు
గడ్డకై యెందఱెందఱో పెద్దవారు, వేచియున్నారు కనుగల్గి కాచుకొమ్ము 1

ఉ. తేతలి కామిరెడ్డి మన తెల్గులపాలి బళారిగడ్డకున్
నేతలు చెట్టసేయఁ దన నెట్టికసీలతనమ్ము తెల్ల మా
రీతిని జాతికై యవధరించె నుదగ్రతపస్సు ; తాదృశ
భ్రాత లపేతకల్మషులు పండిన ప్రన్ననిపంట లమ్మకున్ 2

ఉ. ఒప్పము–కన్నతల్లి యొడి నుబ్బెడిపాపల నేకెపంచకో
రొప్పుట సైఁప–మా ప్రళయరుద్రుఁ డెదిర్చిన వీరతాయెతుల్
విప్ప–మటంచు బొబ్బలిడు వీరుల దొడ్డబసప్ప మేటి గం
గప్పల రాష్ట్రభక్తి గొనియాడెదఁ బాడెద మేనుసొక్కఁగన్ 3

మ. తెలువుల్ నేర్చిన ద్రావిడుల్ మన ధరిత్రిన్ జిత్తురాంతర్గతన్
గల వైదార్థమపల్లెలంచుఁ బొలికేకల్ వైతు ; రీ ధర్మమూ
ర్తులహో ! చెంగలుపట్టు సేలముల నాంధ్రుల్ నిండుకొన్నాళ్లు వ

మ. గుడిగంటల్ మొరయించి, పంటలకు నీకోల్పూపి, కాఁపుంబనుల్
వెడబేరమ్ము లొనర్చి, వీ రిచట జీవింపంగ విచ్చేసి, నేఁ
డడియాసంబడి తిన్నయింటి గడకొయ్యల్ లెక్కవెట్టంగఁబా
ల్పడి, రేమందుఁ గృతజ్ఞభావ, మది యిప్పాటన్ బ్రవర్తిల్లెడిన్ 5

ఆ. నేర్పు లేని యోర్పు నెతిలేని జాతీయ, దృష్టి లేని మంత్రపుష్టి లేని
తెలుఁగువారి బ్రదుకుఁ దిలకింప నెత్తిపైఁ, గొమ్మువచ్చె వీరి కోపుహెచ్చె 6

క. కాకున్నచోఁ దిరుత్తని, మాకంద్రిక యనుచు వీరు మల్లాడుదురా ?
శ్రీ కార్వేటిపురాంధ్ర, క్ష్మాకాంతుల ముద్దుబిడ్డగద యిది కుఱ్ఱా ? 7

శా. ఆ రాజేంద్రుల దానధర్మములు భోగాభోగముంగూర్ప రో
చీ రంగమ్మగు నిందు వెల్గు నెవఁడా *చెంగల్వరాయండు తత్
కారుణ్యాంబుధి తెల్గు దేవరకదా ! కాదాడువారల్ చిర
శ్రీ రంజిల్లెడి శాసనచ్ఛటలు వీక్షింపందగున్ దాంతులై 8

చ. వెనుకటి సుద్దులెల్ల నడివీథిని బెట్టను-మీరు మేమిఁకన్
మనవలె నెయ్యతియ్యముల-మచ్చలు వెచ్చలు లేని చూపులన్
మన కొకరచ్చయేల ? పదిమందికిఁజెప్పఁగలార, మోర్మిఁ బా
యని పెదపెద్దలై తమిళులార !కడంగుఁడు పంపిణీలకున్ 9

ఉ. మీరును మేముఁగన్నదులు మీననులున్ దొలునాళ్ల నొక్క సం
సారమునంద యుంట యొక సంతతిగా మనియుంట నిక్క, మీ
కూరిమి నెంచి చెట్టునకు గుట్టకు మూరకు బారకున్ వృథా
పోరకుఁడయ్య ! రేపు మొగముల్ మొగముల్ తిలకించుకోవలెన్ 10

చ. తడికలు పెట్టి ప్రొయ్యి నొకదానిని బెంచినమాత్ర నన్న త
మ్ముఁడు సెడఁదమ్ముఁడన్న సెడ ముచ్చటఁజూపునె, మీకునూక లె
ద్దడి కద, కోక లెద్దడి కదా మతి మాకుఁ, బరస్పరాదరం
బడఁగిననాఁడు లగ్గు గలదా మన ? కన్నలు ! పాఱఁజూడుఁడీ ! 11

* ఈయన పేరు "సుబ్రహ్మణ్య స్వామి" యనియు

# దక్షిణాంధ్రులు

చ. పెఱిలకుఁ జిక్కి పెల్లు దురపిల్లుచు నెల్లలుత్రొక్కి యున్న కొం
దఱు మనయింటిబిడ్డ లొకనాఁటికి గెల్తురుగాని, ద్రావిడుల్
పొరలెడిగడ్డపై నిలిచిపోయిన నల్వదిలక్షలాంధ్ర సో
దరులఁ దలంచినంతన బదాబదలై హృదయమ్ము దస్సెడిన్ 1

మ. తెలుఁగుంగత్తి తళ త్తళల్ తమిళధాత్రిన్ముంచునాఁడాంధ్రరా
ట్తిలకమ్ముల్ రఘునాథరాయముఖ పృథ్వీవల్లభుల్ చోళమం
దలమం దాజ్ఞలు పెట్టునాఁడు, జయఘంటాపాణి వెంకన్నకై
తలలో శ్లేషలు చిందునాఁడు మనతాతల్ సాగి రాగడ్డకున్ 2

శా. పొంగుల్వాఱిన గానమాధురుల సొంపుల్ నింపి యచ్చోటనే
శృంగారమ్మును భక్తి నేలిరిగదా క్షేత్రయ్య త్యాగయ్య ; లీ
సంగీతమ్మున కంజలించెను సమస్తద్రావిడక్షోణి ; యీ
బంగారమ్ముఁ దెలుంగుబిడ్డలె సృజింపంజాలి రవ్వారిగన్ 3

శా. తంజావూరి సరస్వతీభవన మాంధ్రస్వమ్ము, వాణీమణీ
మంజీరధ్వను లొక్కనాఁ డచట సమ్యగ్ఘోరణిం గుల్కె, ధీ
మంజూషల్ తెలుఁగుం బొలంతులు కవీ మత్తల్లికల్ పల్వు రా
మంజుక్షేత్రమునంద పుట్టిరిసుమా మన్నింపు మా తీర్థమున్ 4

ఆ. విరిసెఁ దెనుఁగుఁదోఁట సరిక్రొత్తపువ్వుగా, నచట రుచులుచిందు వచన కవిత ;
కలన మునిఁగితేలు తెలుఁగురాహుత్తుల, కత్తి గంటమైన కాలమందు 5

ఉ. రాయలుపోయి తెల్గుకవిరాయలు మిన్నులు సూచువేళ భ
ద్రాయిత బుద్ధులై మధురఁ దంజపురిన్ నెలకొన్న నాయకుల్
పాయనిభక్తి నాంధ్రి కులుపా లిడి పాలిడినట్లు జాతికిన్
దీయని కైతలిచ్చి పరితృప్తి ఘటించి గడించి రాదృతుల్ 6

ఉ. గొబ్బురి జగ్గరాజు వెదకుట్రలతో మన రంగరాయలన్
సిబ్బితిమాలి చంప వెడసింగములో యన దక్షిణాంధ్రులా
గబ్బుదొరన్ వధించి కదఁకన్ బెనుఁగొండ కదాని గద్దెపై
నుబ్బుచు రంగరాట్తనయు నుంచిరి కీర్తి జగాన నుబ్బఁగన్ 7

చ. పదుగురు నూర్వురై పొదలి ప్రన్ననఁగుల్కుచు, నీదులేని సం
పదల సుఖించుచున్, బ్రజలమన్ననలన్ గనుచున్న వీరికే
కొదవయు లేదుగాని తెనుఁగుంబతి వీడునవస్థ వచ్చె ని
య్యది భరియింపరాని చెదుగై ననుఁబట్టి కలంచు నిచ్చలున్ 8

ద్వి. మన తెల్గుబిడ్డ రామస్వామి రెడ్డి, మననేత్రువిందు కుమారప్రభుండు
లే రిట్టిదొర జగానేరుపుల్ గన్న, వా రిట్టి దొర సాధువర్తన మున్న
దొరలంచు నెల్ల జాతులు ముద్దుసేయ, సరిలేని తనివిమై జనము లుప్పొంగఁ
బెద్దప్రెగ్గడరాచపీఁటపై నిలిచి, గద్దతి మద్రభూఖండమ్ము నేల
మావారు మీరు మా మక్కువల్ మీరు, మావాసి నిల్పిన మగలు మీరనుచు
మనము పేర్కొనునాఁడు మన రెండుకోట్ల, తనువులు పులకించి తలఁకించునాఁడు
నగుమొగమ్ములతియ్యనల నగు నంచుఁ, దగు నెయ్యములు పంచి ధైర్యము మెఱసి
మీ తమ్ములను మేము మిమువీడి తమిళ, జాతిపొత్తునఁ గాఁపు సాగింతు మేము
చిత్తూరు తిరుతని శ్రీకాళహస్తి, పుత్తూరు కోదూరు ప్రొద్దుటూర్ గండి
కోట కందెనవోలు గుత్తి బళ్లారి, పాటూరు నెల్లూరు పరుచూరు ప్రత్తి
పాడు కార్యమపూఁడి పణిదము కొండ, వీ డమరావతి విప్పర్ల పరిమి
గుడివాడ బెజవాడ గొల్లప్రోల్ గురజ, పెదన బందరు కాజ పెయ్యేర్ కొడాలి
యేలూరు రాజమహేంద్రవరమ్ము, సాలూరు మాడ్గుల ఛత్రపురమ్ము
వదలివచ్చిన తెల్గువారల మేము, ప్రిదిలివచ్చిన తెల్గుబిడ్డల మేము
సాయపనేని పచ్చా పూససాటి, రాయదుర్గము పెమ్మరాజు ముప్పాళ్ల
రావెళ్ల పెమసాని రావూరి మన్నె, కావూరి తుమ్మల కాకర్ల మద్ది
పసుపులేటి కటారి పరుచూరి ముప్వ, ముసునూరి దువ్వూరి మున్నగు నుదులు
మాయింటి మీయింటి మైత్రిని జాటు, మా యమ్మ మీ యమ్మ మైత్రిని జాటు
మా యోజ మీయోజ మైత్రిని జాటు, మా యాత్మ మీ యాత్మ మైత్రిని జాటు
మఱచిపోకుఁడు మమ్ము మా మేలుగీళ్లు, పరువుబన్నాలు మీపాలివ యంచుఁ
దలపోయుఁ దని పల్కఁ దలఁకుచున్నారు, కెలనివారలఁజూచి కిగ్గుచున్నారు
తమ తెనుంగుఁదనమ్ము తగ్గింపకున్నఁ, దమకు లౌకికమాన్యతలు ముట్ట వనుచు
వెనుఁబడుచున్నారు వీరిఁ గారించు, వనట నూటాడించు వార లెవ్వారొ ?
మన పెద్దతలల కీమాటలే క్రొత్త, తెనుఁగేమి యనువారిఁ దెలుచుటే రిత్త 9

ఉ. ఏఁటికి నొక్కనాఁడయిన నీ బలఁగంబును బల్కరింప న
చ్చోటికిఁ జేరవోయి ! మన చుట్టఱికమ్ములు చాటి యాంధ్రతా
వాటిక తిక్కనార్యకృతవాఙ్మయ పేటిక విప్పి చెప్పి ము
ప్పూఁటలు విందులంది మనభూమికిఁ గ్రమ్మఱవోయి!తమ్ముఁడా! 10

ఉ. అచ్చటి తెల్గుతల్లులకు నంజలిపట్టి నమస్కరించి వా
రిచ్చెడిదీవనల్ వడయు ; మిప్పటికిన్ బసివాంధ్ర కుగ్గుతో
నచ్చపుఁదెల్గు తేనెలిడు నమ్మలువారు ; త దాశ్రయమ్మునన్
నొచ్చియు నొవ్వకున్నది తెనుంగుఁదనమ్ము కవేరజాతటిన్ 11

క. తనజాతిన్ దనపల్కును, దన సంస్కృతి నుద్ధరించు తగులము వలయున్
వినుమన్యుని బాధింపని, "తన" యిది ; చేకొమ్ము సముచితం బీ సేవన్ 12

## రాచవీడు

చ. పరులకు నంధ్రజాతి ఫలభాగ్య విరోధుల కాత్మశూరతా
గరిమలుచూపి రింతదనుకన్ దెనుఁగుల్ ; మఱినేఁడు రాచక
క్కుఱితికిలోఁగి కుట్రలఁ దగుల్కొని కుక్కలు చింపుకొన్న వి
స్తరి నొనరింతు రేమొ వసుధన్ ; మొలకెత్తెను దుర్నిమిత్తముల్ 1

చ. ఇది నడిబొడ్డు తెల్గునకు, నిచ్చట నచ్చపుఁ దెల్గునాలుకల్
కదలును, గూడుగుడ్డలకుఁ గందని తావిది, భారతీ మహా
స్పదమిది, సంస్కృతిచ్ఛవు లెసంగినచోటిది-యంచుఁదేల్చి త
త్పదమున రాచవీడు నిలుపన్ దలపోయ రదేమి సోదరుల్ 2

ఆ. నగ్నసత్య మెఱుఁగ నటనలు వలయునా, యిరుగుపొరుగు జాతు లేవపడఁగ ;
మాకు రాజధాని మాకు మాకని తెల్గు, లింత స్వార్థనిరతి కేల తెగిరొ ? 3

చ. మనకు సమాత్ముఁడై తెనుఁగుమానిసి యేదెసవాఁడువచ్చినన్
మునిఁగెడిదేమికాని నలుమూలల వారికి నందిపుచ్చుకో
నను వొకయింతలేని గహనాంతర భూమికి రాజధాని ని
చ్చిన జనతాసముద్రమునఁ జిచ్చులు రేఁగక మెచ్చులూరునా ! 4

క. కోరిక లపమార్గమ్ముల, కూరక పరువెత్తువేళ నుచితానుచిత
ప్రారంభ విమర్శన కెవఁ, దారాటంపడును ? జాతి కాయాసపడున్ ? 5

చ. ఎవఁ డరికట్టినన్ బ్రజలయాప్తిత మాఱడివోక కల్ల, ధ
ర్మువ తుదకున్ జయించు, ననిరుద్ధము నానుడి, ప్రాక్తనాంధ్రభూ
ధవులకు రడ్డితేఁడుల, కుదాత్తచరిత్రులు వాసిరెడ్డిరాట్
ప్రవరుల కాశ్రయం బయినతావె యగున్ మనరాజధానిగన్ 6

ఉ. ప్రాణము తెల్గుసీమ కిది, పాయని చుట్టము జాతికిన్, దను
త్రాణము తెన్గుసంస్కృతికి, దైవము పౌరుష మేకమై తెలం
గాణము హత్తునాఁడు నొడిగా నెగడున్ బృహదంధ్రధాత్రి ; కీ
నాణెము లేమగున్ బ్రజల నైతికశక్తికి నూర్పు లుండఁగన్ 7

ఉ. కాకుళమందు ధాన్యకటకమ్మున సహ్యసుతాతటమ్ములన్
జోకలకుం గొటారులగు చోటులనేకద ! నైకవర్షముల్
లోకము బాపురే యనఁ దెలుంగుపతాక నటించె – నన్ని నా
ళ్లేకద నిల్చె నాంధ్రభువనేశ్వరి కన్పడవా చరిత్రముల్ ? 8

## సంక్రాంతి వేదన (విజయ)

శా. ఈ నా జీవనయాత్రలఁ దరలి పోయెన్ బెక్కు సంక్రాంతు లా
యా నాళ్లన్ మధురానుభూతులకు లోనై లోకసంభావ్య న
వ్యానందమ్ముల నేలుకొంటి, నిపు డేలా హర్ష రేఖా దరి
ద్రాణత్వమ్ము ఘటిల్లె నాకు ; భయ ముత్పాదిల్లె నేలా హృదిన్ 1

ఉ. పంటలు పండె, గిత్తలును బత్తెలు గొత్తెలు బల్మికల్మిమైఁ
గంటికి విందుసేయుఁ, దటకా పదఁదగ్గ ఋణాలు లేవు, వా
ల్గంటియు బిడ్డలున్ సుఖవికస్వరమూర్తులు, మాకరోత్సవం
బింటికివచ్చె, నేఁడు తపియించు నిదేల మదాత్మ భుగ్నమై 2

ఉ. నెయ్యము లేక, తియ్యము గణింపక, నిక్కము నొప్పుకోక, రా
కయ్యము పెంచి, జాతిని గకావికలం బడవైచి, దేశమున్
వ్రయ్యలు సేయ నా తెలుఁగువారలు కోఱలుదీటువేళ నే
దయ్యక క్రుయ్యఁబాఱ కకటా ! యన కెట్లు సహింతు వేడుకల్ 3

ఉ. రామునిలక్ష్యమైన మదరాసును ద్రోసి, రిసీ! బళారి మా
భూమిది కాదులే యనిరి, పోయిన బ్రహ్మపురమ్ము చేకొనం
బో మని, రింతయేల నడిబొడ్డునఁ దల్లికిఁ బీఁట వెట్ట మా
రాములు పట్టి రన్న ; లదిరా ! మన సుద్దు లిఁకేమి త్రవ్వెదన్ 4

చ. అటు కరినోపవాసదహనాహుతియై తనజాతి కింక సం
కటములు రావటంచు దివిఁగన్న వెలుంగు తెలుంగు రాముఁ డీ
కుటిలతఁ జూచి యీ చెదు తెగుళ్ల ఁగనుంగొని దుఃఖబాష్పముల్
జొటజొటరాల డీల్పడుచు స్రుక్కుచు వెక్కుచు నెంత పొక్కునో ? 5

చ. పదవుల కారటంపడి సభాపరిగర్హణ కోర్చి జాతికిం
గొదవల నంటఁగట్టు ననుఁగుం దెనుఁగుం బ్రజలార ! సత్యముం
జదువుఁడు, నిత్యమున్ నిలువఁ జాలవు గద్దెలు మేడ మిద్దెలున్
బ్రదికిన నాల్గునాళ్లు గుణభద్రులరై యశము న్గడింపుఁడీ ! 6

చ. నటునివిధాన, గంటకొక నాలుగువేసము లూనువాని కె
ప్పటికిని ముక్తిలేదు, నరపాలునకున్ సనసన్న లెంకకున్
జటిలునకున్ గృహస్థునకుఁ జక్కటి యొక్కటి లేనిచో జగం
బిటికల రువ్వకున్నను సహింప దహో! యని పూలుచల్లఁగన్ 7

ఉ. అన్న మటన్న బ్రహ్మ, మఖిలాన్నములం దెదియైన నేమి రా
జాన్నమె నాకుఁ బెట్టుమని యాదుదినాలు గతించె, వీనులున్
గన్నులులేని దద్దమలు గా రఘునాతను, లావులించుచో
నెన్నఁగలారు ప్రేవులు ; జయింపవు నేఁడు పురాణదంభముల్ 8

చ. అడఁకువ నేర్చుకొండు, మన యర్హత లెట్టి వటన్న చర్చకుం
గడఁగుఁడు, వ్యక్తిలాభమును గాక సమాజశుభమ్ము నీకొనం
దొడఁగుఁడు, ధర్మదేవతకు దోయిలిపట్టుఁడు, లోకమెల్ల మీ
నడవడి ముద్దుసేయ సుగుణమ్ముల కిమ్ములుగండు సోదరుల్ ! 9

చ. పొరపులు పోరులు న్మఱచి, బుద్ధులు శుద్ధియొనర్చి, పూర్వపుం
గరిమఁ దలంచి, దేశహితకాంక్షల కూపిరిపోసి, పాలనా
పరిణతి సంతరించి, ప్రతిభల్ వెదచల్లుచు, జాతివైభవ
స్ఫురణకు వీరగంధములుపూయుఁడు కమ్మఁదనమ్ము నిండఁగన్ 10

క. పదవికి సిద్ధాంతమ్మును, వదలిన రావుతులగతులు వగ నిదు-నైనన్
బదవిని సిద్ధాంతమునకు, వదలెడి సర్దారు లాంధ్రవసుధకు లేరా ? 11

# క్రొత్తవెలుఁగులు

ఉ. అబ్బెను రాష్ట్రమాంధ్రులకు, నందు సమస్తవిధావికాసముల్
ప్రబ్బెనయేని నాఁడు మనభాగములన్ విడఁగొట్టుకొంట కా
గుబ్బుగ నుద్యమింతమని ఘూర్జరముఖ్యులు వేచియుండి, రే
సెబ్బరలేనిబాట కెడసెప్పక పొమ్ము యశమ్మునిండఁగన్ 1

ఉ. మాననిమచ్చరాల మనమండలముల్ తెగి తన్నుకొన్నచో
నైనది సంబడంబని కటా ! యెకసక్కెములాడ ద్రావిడుల్
పూనిక నున్నవారు, మనపోకడయున్ బరిహాస్య మంట స
త్యానకు దవ్వుగాదు, శతధా కృషిసల్పఁగదోయి పేర్మికిన్ 2

క. విడఁదీసి యేలు నేల్బడి, కదు నింద్యము ; తెల్లవానికన్నిట్టిదటం
చెడ పెడ చెడనాడితి ; మా, పొడ కన్పడరాద తెల్గుపోకడల నిఁకన్ 3

క. దిట్టతనమున్న నాఁడి, పట్టుదలల్ తెలుఁగువారిపాలం బడె; నీ
యట్టు సెడదేని రాముని, పుట్టెఁదు త్యాగమ్ము రిత్తపోవును గుఱ్ఱా ! 4

మ. సకలాంధ్రమ్ము నిరర్థవాదముల నీర్ష్యన్ గాఱుఁజీకట్ల దం
డకయైపోవుట కోర్వఁజాలక మహిష్ఠస్థైర్యసంపన్న ధా
ర్మికదృష్టిన్ గుణకోటిఁబ్రోయ నిజమాతృక్షోణికిన్ సౌహృదాం
శుకముల్ క్రొత్తవెలుంగులిచ్చు రఘురామున్ గొల్చి రాణింపుమా 5

క. వసవలపు లుజ్జగిల్లని, నిసుఁగుగదా ! రాష్ట్ర ; మెంతనెఱియున్న నెదో
దొసఁ గుంట తప్పు ; దిప్పుడు, రుసరుసపాల్గాక మంథరుఁడ వగు మన్నా ! 6

చ. రవరవ లెట్టి వున్న మనరాష్ట్రము రేపు సమస్తభారత
స్తవము గడించినిల్పు మృదుసఖ్యమునన్ సముదారభావ వై
భవమున మంత్రతంత్రపరిపాకమునన్ నిరవద్యసంపదన్
నవనవశేముషీబలమునన్ గమనీయ కళాదరమ్మునన్ 7

ఆ. అమ్మబొజ్జలోనఁ దొమ్మిదినెల లున్న, నిసుఁగుబ్రదుకె వేయినెలలు దాఁట
నలువదేండ్లు నిల్చి తలచూపినట్టి యీ, పట్టి బ్రదిమి కానకట్ట కలదె ? 8

## మగువలు

చ. తెనుఁగుచరిత్రలో నతివతేజము దొడ్డది, జాతిపేర్మికై
మనవనితల్ వెలార్చి రతిమానుషశౌర్యము, త్యాగలక్ష్మికిన్
జననులు తెల్గుజోటులు, ప్రశస్తచరిత్రలు, వారిడెందమున్
దనిపిననాఁడె రాష్ట్రము సదాతనమై హవణిల్లుఁ దమ్ముఁడా ! 1

మ. అటు వంగం బిటు రంగ మెల్లలుగఁ బ్రాజ్యంబైన సామ్రాజ్య ము
త్కటధీశ క్తి భరించినట్టి మనరుద్రన్ గానరో తెల్గు లు
ద్భటు లీనాఁ, డిదియేమివింత ప్రజలం బాలించుపీఠాల నొ
క్కొటియున్ జానల కీయరైరి తగదా *కోటమ్మ యీ పాటికిన్ ? 2

చ. వెలఁదులు తాల్మివీడి కనువిచ్చినచో మనవారిబింకముల్
గెలుచునె ? యోటురాజ్యమిది, కేవలకాంతలె పూరుషప్రజన్
గెలుతురు సంఖ్యలో, సతులకే కరమెత్తెడిభర్త లెందఱో
కలరు, సహోదరుల్ గలరు, కన్నసుతుల్ గల, రప్పు దేమగున్ ? 3

క. తెగుదాఁక లాగరాదని, మగవార లెఱుంగవలయు ; మగువలుఁ దామున్
సగము సగమ్ముగ రాష్ట్ర, ప్రగతియెడన్ బడవలయు బ్రదుకులు వెలయన్ 4

## విద్యార్థులు

క. అద్దమునుబోని పోకడ, విద్దియలన్ గలితనమ్ము విరియువిధానన్
బెద్దలు బుదుతలబుద్ధులు, దిద్దనిచో రాష్ట్ర మెట్లు తిరపడుఁ జెపుమా ! 1

క. బొద్దూదనిపోఱఁడు తన, జద్దంతయు రాజకీయచర్చకు బలిగా
నొద్దగెడవైన చదువుల, గొద్దాసల బుట్టిగోఁకికొను నేఁ డిచటన్ 2

ఉ. ఒప్పునిదారికై నఁ దలయూఁచి పరీక్షల కొగ్గి యెట్టిటో
ముప్పది యంకముల్ వడసి ముంగమురారి ధరించెఁగాని నో
ర్విప్పుట కేమివచ్చు మనపిన్నకు ? నన్నలు దుర్వివాదముల్
మప్పి కలార్థి నిట్లు కొఱమాలినవాని నొనర్చి రక్కటా ! 3

---

* నాఁటిశాసనసభా సభ్యురాలు

ఉ. రేపు జగమ్మునేలఁగల రేఖలుమీవి, తదీయ నైపుణుల్
చేపడకున్న మీరు వికసింపరు, లెండని, పెత్తనాలపైఁ
జూపడి రేపవల్ బడలు జోదులు మచ్చు లెఱుంగ లేని లేఁ
బాపల నూఁపియూఁపి తమ బట్టులఁ జేసి రిఁ కేమి సెప్పెదన్ 4

ఆ. దేశభక్తియన్న తెరదీసి పగటి వే, సాలుకట్టి తందనాలుపాడి
గద్దెవలచు నాయకమ్మన్య లీ నేలఁ, జెఱచినారు విద్యగఱచువారి 5

ఆ. వసుధ కెట్టి చెట్టవచ్చినఁ బసివాని, ముట్టరాదు రెచ్చఁగొట్టరాదు
విలువ హెచ్చుఁగాక విలయంబ యగుఁగాక, విత్తనాలసంచి విప్పరాదు 6

ఆ. చదువుసన్నగిల్లె సంస్కారమా చెడెఁ, బనికిరాని బిరుసు పాదుకట్టె
వెఱ్ఱిముదిరె నేఁటివిద్యార్థి కేమి కా, నున్న వాఁడొ వీఁడు తెన్నుదప్పి 7

గీ. లక్షసిద్ధాంతములలోని లగ్గు లెగ్గు, లెఱుఁగనగుఁగాని విద్యార్థు లిదియ లోక
తారక మటంచు నొకదానఁ దగిలి తగిలి, పరుగు లిడరాదు దస్త్రముల్ పాఱవైచి 8

ఆ. బానిసమునఁ గ్రుయ్యు భారత మెట్టిటో, ముక్తమయ్యెఁ ద్యాగములు ఫలించి
నెఱయవలయు నిచట నీతి, విజ్ఞాన ; మీ, పొలికిఁ బిన్న వాంఛ్రపూట హెచ్చు 9

గీ. అఖిలభారత పరిపాల నార్హమైన, * తెలివికిం జాలఁ డీనాఁడు తెలుఁగువాఁడు
కడకు రాష్ట్రమ్ము సాగించు నొడుపుసైత, మెఱుఁగఁ డెఱిఁగిన దొక్కటే విఱుగఁబాటు 10

క. * సాంకేతికనైపుణి మన, యంకెకు రానట్టినేర్మియై బెడసెఁ గదా !
యంకిలిగానని తమిళుల, పొంకము సూచినను సిగ్గుపుట్టద మనకున్ 11

---

* ఐ. ఏ. ఎస్. మున్నగు పరీక్షలలో నెగ్గుట
* ఇంజనీరింగులో నేర్పు

## వినాయకులు

ఉ. పాపటదువ్వి, చెల్వములుప్రబ్బిన వల్వలు దాల్చి, నాఁడెముం
జూపు నలంకృతుల్ దొడిగి, జోకలు వాఁకలుగట్టఁ బొల్తురే
పాపలు వార లక్కరముపట్టని గిట్టని దుర్విదగ్ధ లీ
క్రేపులు రచ్చలెక్కి తలక్రిందుగఁ బ్రతికఁ జూడ నవ్వగున్ 1

క. గద్దిదిని మేరదప్పిన, వడ్డీలు గడించి కన్నవా రుప్పరిగల్
గుడ్డము లిడ సిరిపొంగొక, గ్రుడ్డితనం బిడ నటించుక్రోఁతులు వీరల్ 2

ఆ. బావిలోనికప్ప లావంత సంస్కృతి, నెఱుఁగ రైననేమి తఱుగు లేని
పొగరు తమకుఁగూర్చు ప్రెగడగా నెగడఁగాఁ, బల్లెపట్ల నేలు ప్రభులు వీరు 3

క. పెత్తనము లెల్ల వీరే, గుత్తగొనం జూతు, రథమగుణవత్త సదా
మెత్తురు, మహత్తదెసకున్, జిత్తమువోనీ, రిఁకేమి సెప్పెద వీరిన్ 4

గీ. అన్నదమ్ముల నెడసేయ, నాలుమగల, చివురుఁగాఁపురములఁ దీయఁ, దివురుచుందు
రకట ! వీరికి శాంతి ప్రాణాంతకంబు, పండి పై కొన్న పొందికల్ గుండెబరువు 5

చ. మతములనెత్తి, విత్తపరిమాణములన్ వివరించి, కోవలన్
వెతకి, కులమ్ములం దడవి, వీధుల నూరు–సివారు చూపి దు
ర్మతులగు వీరు లోకము నమాయికమున్ గికురించి నాయక
స్థితిని గడించి పల్లియలచెట్టకు నాదరువౌదు రక్కటా ! 6

క. గ్రామములు భారతీరుచి, ధామము లైనపుడె వీరు తలఁగుట, జనతా
క్షేమము, లొదవుట, రాష్ట్ర, శ్రీ మెఱయుట పొసఁగు ; మధురజీవిక లెసఁగున్ 7

## పేదలు

ఆ. పేద కడుపుమంట పెరిఁగిన కాలాన, సాదు కంటినీరు సాగినపుడు
కాలుమోపఁగలరె కరటక దమనకుల్, పొంగిపోవఁగలరె పింగళకులు 1

ఆ. లక్షలున్న వాని లాలించి లాలించి, బక్క వానిఁ గొంచెపఱిచి పఱిచి
పోటుమగలు బిక్లబీటుగాఁ బడిరయా !, యోటురాక నిలువఁ జోటులేక 2

గీ. మేడకు మిద్దెకు గుడిసెకు, నూడలవ్రేలాడుచున్న యుట్టికిఁగల దీ
నాఁ డోటు; తత్ కృపార్థులు, గూడెమ్ములవారి సేవకుం జనవలయున్ 3

ఆ. ఓటువలచువార లొక్కరకా కాత్మ విలసనమ్ము వదయఁ దలఁచువారు
నెల్లవారిపెంపు నీకొన్న వారును, గదలవలయుఁ బేదబ్రదుకుదిద్ద 4

## తెనుఁగుతీపి

ఆ. తల్లి బాసతీపి తగులని మానిసి, దేశకవితనిగ్గు తెలియనతఁడు
జాతిరుచులు కానఁజాలని యంబేద, కాఁడు కాఁడు నాయఁకరము పడయ 1

ఉ. నన్నయసూక్తి తిక్కన యనర్గళశిల్పము సార్వభౌమ పో
తన్నలశయ్య సూరనమహాకవికల్పన మాదరింపలే
రన్నలు ; లాఁతి బాసలకు నంజలిపట్టెద రీవిపత్తి పో
కున్నఁదెనుంగు రాష్ట్రమున కున్నతియున్ గతియున్ హుళిక్కిరా ! 2

చ. అఱవము కన్నడమ్ము మళయాళముసంస్కృతమాంధ్రపండితుల్
కఱచుట లెస్సయన్న నది కాదనరెవ్వ ; రిదేమిసూత్రమో
యెఱుఁగఁ దెలుంగుసెప్పుటకు నింగిలిపీసున వ్రేలువెట్టు ట
క్క ఱయఁట నన్న చిన్నయల గాదిలి చుట్టలె కీట్సు రెన్నలున్ 3

ఉ. ఉత్తమకావ్యసృష్టి నభియుక్తుల మెప్పులువొంది, జాతికై
నెత్తురుధారవోయు కవినీరజగర్భుల తీరుపై సదా
చిత్తమునిల్పి, వారు వికసించుట యాత్మవికాస మన్న లో
కోత్తరధర్మమున్ బ్రెగడయున్ బ్రజయున్ దలఁదాల్చుటొప్పగున్ 4

ఉ. పట్టము లేనివాని ప్రతిభాచతురత్వము లెంత మింటికిన్
దొట్టిననేమి వాని నొకదూలముఁగాఁ దలపోఁత తెల్లవా
ర్పెట్టినభిక్ష ; వచ్చినపరీక్షలకా వెలజాతె ; వీనికే
బొట్టిడిరేని జాతి చెడిపోవును దుర్బలధీవిశిష్టమై 5

ఉ. జాతికి జీవగఱ్ఱలు ప్రజాహృదయమ్ములు నిర్వ్యళీక రే
ఖాతతముల్ సహేతురచనాంచితముల్ పరిశుద్ధభారతీ
కేతువు లైన కబ్బములకే ప్రసవమ్ములుచల్లు, మన్యముల్
నీ తలక్రింద ద్రిండులయి నిల్చుటకున్ దగవోయి తమ్ముఁడా ! 6

చ. పలుకులలో సమాసమున భావపథమ్మున నన్వయమ్మునన్
దెలుఁగుఁదనమ్ము క్రందుకొనఁ దిక్కన సూరన వెంకనాదికుల్
మలపిన బాటలో నడుచు మంజులశిల్ప పరిష్కృతుల్ కృతుల్
పొలుపు గడించుచున్ రసికభోగ్యములై రవళించు నిచ్చలున్ 7

చ. తెనుఁగుమఱుంగెఱుంగుటకుఁదెన్గు మెఱుంగుహొరంగు గంటకు
న్దెనుఁగునెదంద చాటుటకుఁ దెన్గునకైతలు వెల్వరింతకున్
మన యెకసక్కెముల్ వదయు మాలల కాఁపులతోడి చెల్మిలో
మునుఁగుట లెస్స ; యీనుడికి మూదలయైరి నియోగికైసరుల్ 8

చ. చిన పెద రాచకార్యములు జీవిక లౌట నియోగించెంగటన్
మనవులవారు, దస్త్రముల మాదల మోసెడివారు, బారులై
దినముదినమ్ము ప్రబ్బి నునుఁదెల్గులు పల్కుచునుంట కుబ్బి తి
య్యనికవితల్ రచించి నుతులందిరి ప్రెగ్గడ లగ్గలమ్ముగన్ 9

ఉ. ప్రెగ్గడజాతి కప్పువడెఁ బెద్దయుఁ దెల్గుజగమ్ము, వన్నియల్
కగ్గని జిల్గుఁదెల్గునుడికారపు సొంపులపెంపులన్ నెఱా
పగ్గెలు చింద నాంధ్రి కులుపాలిడి మేలొదఁగూర్చి నారిలో
ముగ్గుర కిద్దఱై బిరుదుమోసిరి యీసిరిగన్నకైసరుల్ 10

క. ఒక తిక్కన సాలఁడె యీ, సకలాంధ్రమునకును జీవసంపద నొసఁగన్
వికసించినట్టి తప మి, ట్టి కొడుకుగా నవతరిలె నటే ! కొమ్మనకున్ 11

శా. కొమ్మన్నా ! నిను మెచ్చుటన్ దనియ నీకుంగూర్చునిల్లాఇ నా
యమ్మంగొల్చెద నన్నమాంబను, దెనుంగాటాడు గుంటూరిలోఁ
గమ్మంగాఁపుర మూని యా వెలఁది యీకన్నయ్య పెన్నాఁకటిన్
జిమ్మన్ ఱొమ్మిదునాఁడె చేఁపినదిరా! చిన్నారి తెల్గుంబసల్ 12

చ. ఒగుదయి కుందు నాటినుడి కూఱట సెప్పి మహాకవిత్వ దీ
క్ష గొని పదేనుపర్వములు సాత్యవతేయకృతిన్ దెలుంగుపెం
పుగునియఁ బల్కినట్టి కృతపుణ్యుని తిక్కనపుట్టుగడ్డ యీ
నగరము గుంటవీదు తొలునాళులఁ బట్టినసోము లెట్టివో 13

ఉ. కూఁకటిసొంపులన్ బెరుఁగు కొట్టరుతిక్కన కృష్ణగట్టునన్
దూఁకుచు, మేనమామలు కుదుర్కొనివెల్గెడి వెల్లటూరఁ దా
టాకులమీఁద వ్రాసికొనె నక్కరముల్ పదముల్ ; తదుర్వి నన్
సాఁకినకాణయాచి సరస న్గల దంటకు మేనుపొంగెడిన్ 14

చ. తనదెస దండనాథుఁ డయి తన్ను గదించిన కొమ్మమంత్రికిన్
దనయుఁడు తిక్కనార్యుఁ డుపధాపరిశుద్ధచరిత్రుఁ డౌట న
మ్మనుమవిభుం డెఱింగి బతిమాలి మహామతి నీతనిన్ నిజ
ప్రణిధి ఫలింప నిల్పుకొనెఁ బజ్జల నుజ్జ్వలకీర్తి దక్కఁగన్ 15

ఆ. కొఱటిపాటిరెడ్డి గుంటూరి ప్రెగ్గడ, యేటుకూరి కాఁపు పాటిమాల
గారపాటి కమ్మవారి నెన్నుడి కవి, బ్రహ్మనోట మొరసె భారతముగ 16

ఉ. తోఁచినతావు, దేశికులతో శ్రుతిశాస్త్ర పురాణ కావ్యముల్
లోఁచినతావు, తెల్గునుడిలోఁతులు సూచినతావు, జవ్వనం
బాఁచినతావు గర్తపుర ; మైనను గొమ్మనపట్టి గంటముల్
సాఁచినతావు మన్మనృపసత్తమునోలగ ; మేమి సెప్పుదున్ 17

ఉ. చుక్కలమేలుముల్ గననిచోటులు, భానుమయూఖమాలికా
రుక్కులు సోఁకి వెల్గుట యెఱుంగని తావులు, నుండుఁగాక స
మ్యక్కవితానిరూఢము, సమంచితధర్మరమాశ్రయమ్ము మా
తిక్కనభారతమ్ము నినదింపని తెల్గుపొలమ్ము లేదురా ! 18

ఉ. "తిక్కనకంటె మిక్కిలినదిట్టను మత్కృతు లొండు రెండుగన్
లెక్కకునంద, వొక్కదెస నిల్పితినా పెనువామి లేచు ; నా
యక్కున కెవ్వఁడడ్డ" మని హుంకృతిసేయుమగండు తాల్మికిన్
దక్కి గణించుటొప్పుఁ గవితన్ దనదానిఁ బరించునాల్కలన్ 19

ఉ. తిక్కనముద్దుపట్టి సుకృతిప్రవరుండగు కొమ్మమంత్రికిన్
దక్కినకూఁతు నాంధ్రవనితామణిఁ జిట్టమాంబికన్
మక్కువఁ బెండ్లియైన బలుమానిసి యల్లదమంత్రి కృష్ణ తెన్
దిక్కున వెల్గు "రావెల" కు దేవర గర్తపురాదవిష్టకున్ 20

గీ. ప్రెన్నగట్టునఁ దాఁ గుదుర్కొన్న నేమి, చుట్టపక్కాలు గుంటూరిఁ జుట్టియుంటఁ
గొమ్మనామాత్యుఁడిట్లు వీయమ్మునెఱపె, నైనసంబంధ మెవరు పోనాడుకొంద్రు ? 21

ఉ. తిక్కనమన్మరాలికి సతీహిత కయ్యలమంత్రి పుట్టి ధీ
చిక్కణుఁడై వదాన్యకులశేఖరుఁడయ్యె ; నతండ త త్త్వపుం
జిక్కులు విప్పినట్టికవి సింగనకుం బిత ; సోమయాజి నె
త్రిక్కవిపాల నుంట నితఁడేలె నుదాత్తకవిత్వయోగమున్ 22

శా. నాఁడున్ నేఁడున్ దెల్గుజాతి కొకవిన్నాణమ్ము సంధించి సై
దోడుల్ సూడిదవెట్ట గర్తపుర ముద్యోతించు నల్వంకలన్ ;
ప్రోడల్ దాతలు ప్రెగ్గడల్ కవులు వీరుల్ మేదినీచంద్రమ
శ్చూడుల్ పుట్టినసీమరా యిది యశశ్శోభానివాసమ్మురా 23

ఉ. ఎక్కడివాఁడు నన్నెకవి ? యెఱ్ఱనకొల్వెది? సార్వభౌముఁ డే
దిక్కునఁ దోఁచె? వాఙ్మయయుధిష్ఠిరుఁడై తగు భట్టుమూర్తి, స
మ్యక్కవితాప్రవీణపదమాన్యులు సూరన రామకృష్ణ లే
చక్కి జనించి ? రీసకలసపదకున్ గని గర్తభూమిరా 24

క. ఎలకూచిపండితుఁ డహో, బలుఁ, దప్పకవీంద్రుఁ డాంధ్రభాషాకృతి కా
నలు వెట్టినదిట్ట లిటన్, బొలిచిరిరా యిచటి గాదుపులు పీల్చిరిరా 25

ఉ. అచ్చపుఁదెన్గుఁబల్కు దెస నాదటపుట్టినవారు కొన్ని నా
ళ్ళిచ్చటనుంట లెస్స ; వెదయేసలవాసనపొత్తు లేని తె
న్గెచ్చటికేగినన్ గులుకు నిమ్మహిఁ; గమ్మదెలుంగుమల్లియల్
విచ్చినతోఁటరా యిది సవిత్రికి నున్ మగఱాలపీఁటరా 26

ఉ. మున్నటి తిక్కనాదికవిముఖ్యు లొసంగినవాసి నిల్పంగాఁ
గన్నిది, కబ్బముల్ నుదుపుకైసరు లీసడిసన్న సీమ నీ
పున్నెపునేల మాధృశులు పొల్తురు నేఁదు ; తెలుంగుబాస కీ
యన్నలు సేయు నూడిగము లచ్చము లగ్గలముల్ నెఱాసరుల్ 27

చ. తెనుఁగును విస్మరించి యిది తెల్గనిపల్కుచు బుంగపోఁత వో
సినగతి సంస్కృతమ్ము పదఁజిమ్మెద రేమి కవీంద్రు లక్కటా !
మనజన మెల్ల మేఘమును మాఘము నేర్చునె! నేర్వనేల? రా
జనములు మూల్గుచుండఁ జెయిసాఁచుటయేటికి వెల్వదాలకున్ 28

ఉ. పల్లెకుఁ బట్టణమ్మునకుఁ బ్రాఁకినవంచు నిలింపవాక్కులన్
బెల్లుగవాడి తెల్గు మఱపించుట దోసము ; తెల్గువానికిన్
దెల్లముగాని తెల్గయినఁ దెల్గుకవిత్వము సెప్పువాఁడు కో
కొల్లగ వాడుటొప్పు ఁ ; బ్రజకున్ హితమౌ నది సొంతకల్మియై 29

ఉ. ఇంచుకసందుఁ జూచి తలయెత్తిన క్రొత్తమతమ్ముతోఁ బ్రవే
శించెను సంస్కృతంబు మన సీమకు సత్తులుచిత్తు లెన్నుచున్
మంచిదటంచు నాదికవి మక్కువసూపి తదీయవాణిలో
ముంచెను దెల్గుభారతము ; మోసినదయ్యది పల్లెపల్లెలన్ 30

ఉ. నన్నయ తెల్గుభారతి కొనర్చినసేవకు నంజలింతుఁగా
ర్కొన్న మొగుళ్ళఁజీల్చి తెలుఁగుంజదలింట నతండ మున్నుగాఁ
బ్రన్నదివ్వ పెట్టె ; నది పల్మఱు మెచ్చెదఁగాని తెల్గుపై
గన్నిదలేకపోయె ; నిది కాలమహత్త్వమొ? తత్వభేదమో ? 31

చ. ఎఱుఁగనిపల్కుగాదు తెలుఁ గీకవిమౌళికి ; సోమయాజులన్
మఱచువిధానఁ దాఁ దెనుఁగుమాటల తేట లొకొక్క తావునం
బఱపెను ; గాని తెన్గులకుఁ బల్కెడికైతల నెంతసంస్కృతం
బురలిననేమి యన్న తెఱఁ గొక్కటినేర్పె ; నిదెంతపాడియో ? 32

చ. డు ము వు లు సేర్చినంతన, పుటుక్కున ముక్కులుగిల్లినంతనే
సమకుఱునా తెనుంగుసిరి సంస్కృతవాణికి ఁ; బాణినీయ సూ
త్రములకుఁ దెల్గుకబ్బము లుదాహరణమ్ములె? తెన్గునెత్తురీ
క్రమమున కోర్చునే ? యుడికి గంతులువేయక నిబ్బరించునా ? 33

శా. గీర్వాణోక్తిమహత్త్వ యే నెఱుంగుదున్, గృత్స్నావనీభాషలన్
సర్వాంగీణసమృద్ధిగన్నుడి నా శంకింప నీపల్కు ; నం
తర్వాణుల్ కవితాసుధాబ్ధులు ప్రచేతస్తోకముఖ్యుల్ కలా
పర్వానందవిధాత లందుఁగల, రప్పా ! కాళిదా సల్పుఁడా? 34

ఉ. చక్కనికైతఁ బేర్వడిన సంస్కృతికవాఙ్మయమున్ బఠించి ధీ
రుక్కులఁ బొందవచ్చు ; నెవరున్ దెగనాడరు దీని ;కమ్మహా
వాక్కులసారమున్ దెలుఁగువారికిఁ దెల్గులుసెప్పునప్పుడీ
తిక్కలుసెల్లునా? గొనబుఁదెన్గున కందనిసొంపు లుండునా ? 35

ఆ. ఏనువేఱ తెలుఁగుమానిసివే అను, వాఁడు సొచ్చెఁ దెనుఁగువాడలోని
కతఁడు పొంచిపొంచి యందాలవెల్లి నా, తెలుఁగుతల్లి వెలఁది వెలుఁగు డించె 36

ఉ. నీరము సూప మం చనక నీరని ప్రప్పని కూడు వెట్టు చి
న్నారి వచించునేని సహనమ్మును వీడి "తుధూ నిషిద్ధ మా
హారము పొమ్ము నీకుఁదెలుఁగంటు తగుల్కొనె మున్గు" మంచున
న్నారఁట కొందఱంధ్రు లొకనాఁ ; డిపుడున్ గల రేమొ తాదృశుల్ 37

చ. మగఁడని పెండ్లమం చనిన మన్నన వోయెను భర్త, భార్యనాఁ
దగునని, రంగుకంటెను విధానము తెల్లమియయ్యెఁ; దియ్యముల్
మగుడుటఁ బెద్దకున్ బృథువు మాతృకయయ్యెఁ ; దెనుంగు బాసలో
సగము నశించెఁ ; దక్కినది చచ్చియుఁ జావనిదై వగర్చెడిన్ 38

ఉ. చావని తెల్గుపల్లెకుఁ జాగినచో వినిపించు ; గంజికిన్
ద్రోవలులేక విద్యలనుదోఁగక నాగరకత్వ మింతయుం
బూవనితావులం బెరుఁగుపూపలు, పెద్దలు, తాత, లవ్వలున్
గావలియుంద్రుదాని ; కది కావలెఁ! గైతకువెల్గు లీవలెన్ 39

ఉ. “దీపము-సంస్కృతోక్తి, యది తెల్గున కార్యులతోడవచ్చెఁ, ద
ద్రూపమునుండి దివ్వెయను రూ పుదయించెఁ, దదర్థ మిచ్చటం
జూపెడి తెల్గు లేమి మనచుట్టలు పూర్వులు దివ్య లేనిక్రీఁ
గాఁపుర మోపియుం” డని యొకండన నవ్వయ చూపెఁదిల్లికన్ 40

ఉ. అవ్వలబాస పండితుల కర్థముగా ; దల తిక్కయజ్వ యా
మవ్వపుఁదెల్గు నేర్చెఁ ; గవిమండనుఁ డాతనిక్రొత్తముట్టుతో
నివ్వెఱపాటు సెందిన మనీషుల కెవ్వరుకన్నువిప్పి రా
యవ్వలుకారె ? వారికడ నంజలిపట్టి శిరమ్మువంపుమా ! 41

క. వఱువాత సేగి యూఱట, మెఱవడి గోరాలు తీనె మేఁగూలి యటం
చెఱుకులు మొఱకులు వల్కెద, రెఱుఁగరు పండితుల కవుల యిట్టి తెలుంగుల్ 42

చ. మొదట నిలింపవాణి తన ముక్కడితొత్తు నొనర్చె ; నవ్వలన్
గదిమెను గోరి ఖిల్జి సరకారునుదుల్ కదలేని జంకెలన్
బదపడి యింగిలీసు మన పాపఫలమ్ముగ వచ్చి రెచ్చి యె
ల్లిదమునుజేసె ; హింది యదలించెడి నేఁడు తెలుంగు నక్కటా ! 43

క. ఆనాఁటికి నీ నాఁటికి, నానుడికిం దప్పదయ్యె నవఁత ; భరింపం
గానిది యీనెగు; లస్మత్, ప్రాణమ్మునుబోని పల్కుబడు కిట్లగునే ! 44

చ. తెనుఁగునఁ దీపిసూపినకృతిం గని నివ్వెఱపోయి, మాయురే
మనపలుకా యి దంచు, ననుమానమునంబడి, కాదు కాదు పొ
మ్మని పరిహాసముల్ వలుకునయ్యలు నేఁడు తెలుంగుగడ్డలోఁ
గనబదుచుం, డ్రిసీ ! కొలఁదిగా ననఁజెల్లదు పల్కురుండఁగన్ 45

చ. అఱవల నిందుమెత్తుఁ ; బొరుగమ్మలువండిన పుల్లగూరపై
మరులిడి లొట్టవేయు నపమార్గము నొల్లదు వారినాల్క యా
కఱ వొక తెల్గుమానిసి మొగంబుననే తలయెత్తి ; బాసనే
చెఱుచుటకాదు వీరు తమ చిన్నెల నన్నిటిఁ ద్రోసి రక్కటా ! 46

చ. తెలుఁగుఁదనమ్ము పై కొనినతీరులు కన్పడువ్రాయసమ్ములే
తల, వల - నాఁటినుండి బుదుతల్ చదువందగు నిందు; నిట్టివా
కలిమికి నేలనేలునధికారులు పూనవలెన్, ప్రభుత్వ మీ
మెలఁకువనుండున ట్లనునిమేషము దేశము చూచుకోవలెన్ 47

క. నిజమైన తెలుఁగు కఱవై, గజిబిజిబాసలు నటించు కైతలదెసకున్
బ్రజ లిఁక నేగంజెల్లదు, గిజగిజ లాడింపవలయుఁ గింగిరికవులన్ 48

ఉ. ఊరికి నొక్క లెంకవలయున్ దెలుఁగమ్మ ; కతందు నిచ్చలున్
సూరెలవారి నోటిదెసఁ జూపిడి, వీనిడి, నానుదుల్ చమ
త్కారములూరు పల్కుబయకారము నెప్పటి వప్ప పట్టి బం
డారము నేర్పరింపవలె; దస్సినబాసకు బల్మిఁదేవలెన్ 49

గీ. ఏలపాటలు సుద్దులు జోలపాట, లేటిపాటలు తుమ్మెదపాట లచటి
తెలుఁగుఁదోఁటలు - వాని మేల్ వలపు లేని, బాస దయ్యాలబాస, రాకాసిబాస 50

గీ. బాసచెడెనేని కవితా, వాసనచెడు ; నాత్మధర్మవత్సలత సెడున్
వేసము చెడు, రోగము చెడు, మీసము చెడు, నెట్టియెట్టి మెఱుఁ గైనఁ జెడున్ 51

ఉ. అచ్చపుఁదెల్గునం బలుకు టర్హమునాకు ; నట్లైనఁ దెల్గువాఁ
డుచ్చునఁబడ్డరీతి జడియున్ బెడియున్ ; గథ యిట్టులైన నా
నొచ్చుట కేమిలగ్గని తెనుంగు కడల్కొనునట్లు లాఁతి ప
ల్కచ్చటనచ్చటన్ మొరయునట్లు రచింతుఁగృతుల్ జగద్ధితల్ 52

ఉ. వారక తెల్గునాఁటఁ బదివందల యేడులనుండి నిండివి
ప్పారిన సంస్కృతంపునుడి యంతలనింతలఁ దగ్గ, దస్మదా
చారమునూఁది తెల్గుకవి సాగినచో నయిదార్తరాల కీ
భారముతూలి తెల్గులకుఁ బ్రన్నని తెన్గుపసల్ వశంపడున్ 53

ఉ. ఆకుల మీకులం బనక యన్నికులమ్ముల తెల్గువారికిన్
వేకువనుండి లౌకికపు వెంపరలాట యొకండె చొక్కపుం
బోకదయాట, నేఁడు గుడిపొట్టకు మాలయు వచ్చుచుంట, నా
జూకుఁదెలుంగు లెల్లరకుఁ జొప్పదవచ్చు నిఁకన్ సజీవముల్ 54

ఆ. తెలుఁగువానికైత దేశ దేశాలకు, నొజ్జబంతి యగుచు విజ్ఞుఁగాక
ప్రాజ్ఞుఁడై కలాతపస్వియై విశ్వ సా, హిత్యరాజ్య మాంధ్రుఁ డేలుఁగాక ! 55

## వాడుకబాస

ఉ. వీదుల నేగుపట్ల మనవీనుల కెక్కినపల్కు లన్నియున్
సాదు లటంచుఁ, బద్యకృతి సర్గ మనర్థమటంచు–నొండె–య
త్యాదులనిల్పు రిత్తపని యంచుఁ, గడున్ రగడల్ పొనర్చు దు
ర్వాదుల కొక్కదండ మిడి వారలనేరిమికై తపింపుమా ! 1

చ. బడిఁగలపిల్లవాండ్రు పరభాషలపై గుఱినిల్పినట్లు క
న్నిడరు తెలుంగుపట్ల ; నిదియే మనుదున్ మనబాసకై వెతల్
పడవలెనా యటండ్రు ; పలుభంగుల మ్రోసెడి తల్లిబాసలో
మడుఁగగురూపు దేల్చుటన మాటలె? కుఱ్ఱ లెఱుంగ రింతయున్ 2

ఉ. వాడుకబల్మి "మీ రలసివచ్చి" రటం చొకనాఁడు పల్కితిన్
బ్రోడలు చెళ్ళపిళ్ళకవిభూపులు "గెల్వుఁడు గెల్చిరే" నటం
చాడిరి, నేర్చి నేర్చి యిటు లైతిమి మే ; మిది దేశభాషలో
మూడునవస్థ ; కానఁగనుమూయక యుంట శుభమ్ముపొమ్మిటన్ 3

ఉ. నాలుకకొక్క మైఁ దెలుఁగునాటనుడుల్ రవళించుఁ, జాలునున్
మూలము లేని యీ తెలుఁగుముక్కలు వాఙ్మయవీధి కెక్కినన్
మే లదియేమి ? నల్దెసల మేరలువెట్టిన కావ్యభాషపై
ఱాలను రువ్వఁ జెల్ల ; దిది రాచఱికం బగునోటు ? తమ్ముఁడా ! 4

ఉ. రాచఱికమ్మునందుఁ బ్రభురాజ్యము లేచు, నసిప్రభుత్వముల్
లేచును, గాఁపుపెత్తనము లేచును, బీదలపాలియేల్బడుల్
లేచు నొకొక్క వేళ; నిటులే కృతిరూపున మార్పుపుట్టుచో
లోచెడిపోవుఁ గాని కదలుంబలె సాహితి పొంగనేర్చునే ? 5

ఉ. నన్నయ తిక్కనాదికవినాథులు వాడుకబాసలోఁ గృతుల్
పన్నిన వాని నిప్పు పెఱ బాసలకబ్బము, లంట తప్ప ; దా
తెన్నులు నేఁడు లేవు, పలుతీరుల మాఱెను, మాఱు నిట్లె రే
పు, న్నిజ మిచ్చటం బలుకుపూఁటలు చెక్కినశాసనచ్ఛటల్ 6

ఉ. నన్నయకైత మప్పటిజనమ్మునకున్, గవితిక్కనార్యు వా
కొన్నది నాఁటితెల్గుప్రజకున్ బలియై కదచన్న నీకు నా
కున్నది యేమి సెప్పు ? మది యొప్పరికించుట కల్పభాగ్యమా !
పున్నెము పండి పండి మనభూమి కవిత్రయమున్ గడించెరా ! 7

ఉ. కావున బాసపట్ల నొకకట్టడ తప్పదు ; ప్రొద్దుప్రాలిసన్
దేవురుగొట్టులా కథలఁ దెల్పెడిపత్రిక లెట్లు వోయినన్
బోవఁగవచ్చు ; దీన మనపుట్టి మునుంగదు కుఱ్ఱవాండ్రకున్
దీవరపాటు హెచ్చయినఁ దేఱి మథింతురుగాక సత్యమున్ 8

ఉ. ఇంతికి నందచందముల నింతకొఱంతయు లేదు, రత్నపుం
గాంతులసొమ్ములున్నవి, జగావలువల్ గల, వైన నేమి ధీ
మంతులు మెచ్చుశీల మణుమాత్రము లే; దిఁకనాకె యేల ? సి
ద్ధాంతము లుజ్జగించి కృతి యన్నది తాదృశయౌటెఱుంగుమా ! 9

ఉ. వాడుకబాస కారతులు వట్టినవారలలోఁ దెలుంగు వా
ప్రోడతనమ్ముపొంటె నలపుల్ సయిరించినదిట్ట లెందఱో
చూడుము లెక్క ; నక్క తనచూఱల కందనిద్రాక్షపండ్ల నో
నాడినగాథ నీ వెఱుఁగవా ? తగవా ? యిటులౌట తమ్ముఁడా ! 10

చ. పిలిచి బజారునన్ నిలువఁబెట్టి, సవా లొనరించి "యేది మీ
తెలివి ? యలంతిగద్యమును దిన్ననితెల్గునవ్రాయుఁ" డంచు జ
గ్గులు సెడఁ దెల్గుఁబత్రికలఁ గూర్చువలంతుల నిగ్గఁదీసినన్
వెల వెలఁబోని గుండెగల వీరులు నూటికి నల్గురుందురా ? 11

ఉ. కట్టడ లేని లేకినుడి గ్రామ్యము పెక్కుర కర్థమై నెఱా
చుట్టముగా రుచించు నని సుద్దులు పల్కెద రీప్రబుద్ధు ; లీ
చట్టము నూఁది వేఁకిఁబడి జాతినరోగికి నూనెగారెలం
బెట్టిన మెక్కఁడా ? తిరినపిమ్మట నక్కలగద్ద కెక్కఁడా ? 12

ఉ. వారికి నింగిలీసునుడి వచ్చిన వచ్చునుగాక ! దానఁ జే
కూరునె తెల్గుపైఁ జనవు? కూడనిపెత్తనమేల ? యాసకున్
మేరలు లేవె ? బాస కిది మేలగునా? యగునేని "యాంగ్లపుం
దీరులు మార్పుఁ" డన్న వెనుదీసెద రేల బియేలు? తమ్ముఁడా ! 13

చ. పెఱనుడి కింగులీసునకుఁ బెట్టిన యూఱటచిన్నె సైతముం
జెఱుపరు, తల్లిబాస నిటు చిందఱవందఱపాలుసేఁతకున్
వెఱపడ; రైనవారలకు విస్తరివేయుట, కానివారికిన్
గరగరయైన క్రొంబసిఁడికంచమువెట్టుట, యెట్లుసైఁతురో ? 14

ఉ. ఓపికయున్నవాఁడు తగునొజ్జలఁ గొల్చి సహస్రభాషలన్
నైపుణిఁ బొందవచ్చు ; నది నాగరకత్వమయౌను ; గాని తా
రేపవలుం బ్రయాసము భరించి, వరించి నిజో క్తిపై c గదుం
జూపిడి తద్విశిష్టతకుఁ జో టయినప్పుడ రాణకున్ దగున్ 15

ఉ. ఇంపున కింపు కంచుఁ, జదివిచ్చె నటంచు, మహాకవుల్ ప్రయో
గింపఁగవచ్చుఁ గక్కుతితికిన్ బొరపాటునకున్ విధేయులై ;
కొంపలుగూల వింతన, దిగుల్పడ దాంధ్రి, "హాహ" శ్లటం చిసీ !
దుంపకు ముప్పుదెచ్చుపని దోసము, వీసములగ్గు లే దిటన్ 16

మ. మనవిద్వత్క వులందుఁగొందఱుప్రజల్ మాటాడుగ్రామ్యంబుపై
నెనరుం జూపుచుఁ జిన్న చిన్న కథలన్ నిర్మింతురే కాని వా
రనవద్యస్థిరధర్మముల్ నుడువుకావ్యప్రక్రియల్ సంతప
ల్కున కర్పించిరె? సత్యమిచ్చుటన తేలున్ దాల్మిమైఁ ద్రచ్చినన్ 17

ఉ. ఏఁబదియేండ్లనుండి మన యీ తెలుఁగుందొర లాంగ్ల వాణికిం
బ్రాఁబడి, మాతృభాషకు నిరాకృతిసల్పిరి ; తెల్గుపండితున్
ద్రాబను జేసి ; రాంధ్రమునఁ ద ప్పిది యొ ప్పిది యన్న తెల్వి లే
కీబడిఁ బెట్టి ; రున్న కిటు కియ్యదిరా ! పలుమాట లేటికిన్ 18

చ. మును మనపల్లెకూటముల మోసినయొజ్జలు నన్నపార్య తి
క్కనకవి పోతరాజ కృత కావ్యములన్ దమశిష్యకోటికిన్
వినిచిరి, విప్పి చెప్పిరి ; కవిత్వపుసొంపులుగుల్కు పద్యముల్
దినదిన మప్పగింపుఁ దని తీర్పులొసంగిరి ముద్దుముద్దుగన్ 19

చ. నలకథ, సంధితంత్రములొనర్చిన కృష్ణచరిత్ర, రుక్మిణీ
లలనవివాహమున్, గజకులప్రభుమోక్షము, దైత్యసూతి ని
శ్చలహరిభ క్తి, వామన విశంకటవిక్రమగాథ, నాఁటి బొ
ట్టెల రసనాంచలమ్ముల నటించెఁగదా పెదవార లుబ్బఁగన్ 20

గీ. ఆటవిడుపుల వల్లింపు మనుచు, మేలు, బంతి యిది యంచు, గురుఁడు నాపాలి కిడిన
పద్యములు హృద్యములు ధర్మబద్ధములు శ, తాధికమ్ములు నానేర్మి కాదరువులు 21

చ. అమరము వల్లెవైచి, శతకావళిలో నుతులందికొన్న ప
ద్దెము లొకవేయిపాడి, నెఱ తెల్గునిఘంటువు లప్పగించి, యా
దిమకవి బాలరామకథతీరు లెఱింగి, తెలుంగుబాస క
బ్బము లయిదాఱునేర్చి, యెడఁబాసితి నే నయగారి నాద్యునిన్ 22

గీ. అతఁడు కావూరి - శ్రీరాము లచ్చుశీల, రాశి యార్వేలకులజుఁ డారాధనీయుఁ
డపుడు పల్లెలఁ దాదృక్షు లధివసించి, తెలుఁగుపస చూపి కుఱ్ఱల దిద్దువారు 23

శా. ఏదీ! యీపన వేఁటికుఱ్ఱలకు, వా రెన్నాళ్లు వేసారినన్
రాదే! పద్య మొకండుసైత, మిఁకవారా ? తెల్గుసాహిత్యపుం
బాదుల్ దిద్దెదువారు? తాదృశులు సేబా సన్నమాత్రాన దు
ర్వాదంబుల్ సబలప్రమాణ మగునా ? వర్ధిల్లునా ? చెల్లునా ? 24

గీ. ప్రాథమిక పాఠముల కున్నపంతు లెంత, నేర్చె నీనాఁడు ? బుడుతఁ డీ నేర్పు లేని
యొజ్జకడ నేమివడయు ? ధీ విజ్ఞునట్లు, చాలువా ర్యూడరేని దేశము కృశించు 25

ఉ. ఒత్తులతీరు వర్ణములయోజ లెఱుంగఁడు, శబ్దరీతి కిం
చిత్తు గ్రహించిపల్కఁడు, విశేష్య విశేషణభేద మెన్న లేఁ
డి త్తఱిఁ బల్లెకూటముల నేలుగురుం ; డిఁక వాని శిష్యు ధీ
మత్త వచింపనేల ? యపమార్గమునంబడె నేఁటివిద్దియల్ 26

ఉ. ఉత్తమసాహితీబల సముజ్జ్వలుఁడౌ గురునిల్పి, వానికిన్
బత్తెము లెస్సగానొసంగి, పల్లెబడిన్ సవరించుపొంటె భూ
భృత్తులు పూనుటొప్పు ; నిలఁబెట్టినకంబము పాఁతుచాలదే
నొత్తగిలున్గదా! చిఱుతయున్ దొలువిద్యయు నిట్ల నాఁదగున్ 27

ఉ. ఉన్నతవిద్యపై ఁ దగులముంచినపిల్లల కచ్చులైన రా
కున్న నెవండునేర్చు ? నట నొజ్జలు సెప్పెడి విద్యవేఱు, వా
రన్నది చక్కవ్రాసికొనునర్హత వీరికిలేనిచో ఁ దరా
లెన్నిగతించినన్ తెలివియేర్పడునా తలయెత్తి నిల్వఁగన్ 28

చ. మొదటిది తెల్గుబాసయఁట! మూఁడవపల్క ఁట యింగిలీసు!మం
చిదె యిది, కాని చిత్రములఁజిత్రము, దోసములందుదోస, మీ
తుదినుడివారి పెత్తనముతో బడిసాగుట, వారిజీత మా
మొదలిటిబాసవారి కిడుముల్లెకు ముబ్బడియుంట ; తమ్ముఁడా ! 29

క. ఈ నేతిబీఱ మన్నన, యీ నీచపుసంబళంబు నిడక వివేక
శ్రీ నేర్చి, తెలుఁగురాష్ట్రము, నానారాష్ట్రముల కొజ్జనము సల్పవలెన్ 30

ఉ. మాయనిమచ్చగా విబుధమౌళికి మున్ భృతి నాలుగైదు రూ
పాయలొసంగి, యాతఁ డలుపమ్ముగ మన్గడఁద్రోయఁ బుచ్చువం
కాయలశాస్త్రిగా రని పకాపకనవ్విరి తెల్గు, లీ దుర
న్యాయమ పీఁట వెట్టుశనియై ప్రజలన్ గలఁగించు నేఁటికిన్ 31

ఉ. లోఁతులుసూచినన్ గొఱఁతలున్ వెతలున్ శతముందుఁగాక!పెన్
దాతలు నిండుకుండలుగఁ దారు చరింతురుగాని దీనులై
చేతులుసాఁపలేరు గురు శేఖరు; లాఁకలగెల్చి యంబలిన్
సైఁతురు, పూరికొంపలను సైఁతురు, సైఁతురు నాలిపీలికల్ 32

చ. అలఁతి వలంతి విద్యలకు నాంధ్రమునన్ దలయెత్తుసంస్థలన్
దెలుఁగుమఱుం గెఱింగిన సుధీమణి యేల్బడిసేయునప్పు, డ
య్యలఘునకిచ్చు గౌరవ మనాంధ్రము లాంధ్రుల కంటఁగట్టిన
య్యల కిడుదానికంటె నుర వైనపుడున్ మనజాతి పైకొనున్ 33

ఉ. ఇంతలు నంతలైన మనయేలికలందఱు తెల్గువ్రాఁతకున్
సంతనకట్టి తీర్పవలెఁ జట్టము లానలు; పాడిపట్టునన్
గంతులు వేయుచున్ దెనుఁగుగద్దెనుదుల్ వొగడందుకోవలెన్
వంతలుతీఱ నంచుఁ బెఱవాయి నెఱుంగనివారు నావలెన్ 34

చ. తెలుఁగుదివాణమందుఁ బరదేశపువాణికి వాసిముట్టుచో
వలచిన రాష్ట్రమేల ? యదివచ్చుటకున్ మనపెద్ద లక్కటా!
బలియగుటేల ? యిట్టిదొరపాడియుఁ గానవివారు పెత్తనం
బులకుఁ బెనంగ నేల ? వనభూములకుం జనరాదె మౌనులై 35

ఉ. రావలెఁదెల్వి తెల్గులకు, రక్కసబాసలమీఁది నెయ్యముల్
సావలెఁ; దెల్గుకైతకు హసాదు లొసంగెడి తీరుతియ్యముల్
గావలెఁ, దెల్గుఁబల్కు c జెలి గజ్జెలఘల్లు లింటికింటి కి
మ్మావలె, నావలెన్ దెలుఁగులెల్లరు తల్లికి వాసిదేవలెన్ 36

## కదంబము

ఆ. కోటిమంది ప్రజకుఁ గుత్తుకబంటిగాఁ, గూటినొసఁగు నందికొండమడుఁగు
బయలు మెఱసెనిట నపశ్రుతు లేలొకో, మాయకుండుఁగాక ! మన యశస్సు 1

గీ. వండి పంపెడివారుండఁ దిండిలేక, మొగమువాఁచిన నాదారుమూఁక లుండ
నడుమ వడ్డించువారి కీ జడిమ యేల ?, యన్నదమ్ముల కూర్మి వెన్నాడనేల ? 2

క. సిరి రా మోఁకా లొడ్డక, కొఱవడ్డ మెఱుంగు రాకకున్ బదలఁ దగున్
బరికించిన మనకుం గల, నెఱి నేఁ దది యెంతకలదు ? నెచ్చెలి ! సెపుమా ! 3

శా. ఢిల్లీబంగరుకోటలో సచివపీఠిన్ దెల్గువాఁ డుండెనా ?
యెల్లల్ దాఁటిన రాయబారు లెవరోయీ ! సెప్ప నీవారిలోఁ?
జెల్లంజాలని దమ్మిడీ లయిరి సీ ! సీ ! తెల్గు లీనాఁటి, కీ
క్రుళ్లున్ వాకొన రోఁతఁగాదు కడుపుంగోఁతన్ గుమారిల్లుదున్ 4

మ. ఒకరో యిద్దఱొ ధీనిధుల్ మనకుఁ నేఁ డున్నన్ దదీయ ప్రథా
వికలత్వమ్మున కెంతవిత్తమయినన్ వెచ్చించు, నన్యాయముల్
సకలాసత్యములున్ సహించుఁ దెనుఁగుంజాతం; బసూయావశం
బకృతారంభమునైనసంఘమున కెట్లాసాధ్యముల్ భద్రముల్ ? 5

క. ఇంటన్ గెలువనిమానిసి, కంటదురా రచ్చగెల్చుననువున్ జనవున్
వింటివె పొత్తుంబోలిన, పంట కనంబడదు నరుఁడు పదుసేద్యమునన్ 6

ఉ. విత్తమ సర్వసిద్ధియని వెంపరలాడుచు, ధర్మదేవతా
దత్తముగాని కాసునకు దాయుచుఁ, దెక్కలిమేఁత మేయుచున్
ముత్తెములట్లు పండిన ముముక్షువులంబలెఁ గానిపించుచున్
వత్తులుమ్రింగువారు మనవాడల నుంద్రు పరాకు తమ్ముఁడా ! 8

ఉ. చీఁకటి బేర మెందనుకఁజేసిరొ లంచములెన్ని మెక్కిరో
వాకున కెక్క రాని యలవాటుల కెన్నిటికిన్ దెగించిరో
లేకులు పాకలన్ గెడపి లేపిరి మేడలు, చంద్రశాలకున్
బ్రాఁకిరి, కొయ్యమోర నడిబాటల నెత్తి; రిఁకేమి సెప్పెదన్ 8

ఆ. ఓనమా లెఱుంగఁ, దొరిమయు గరిమయు, నానవా లెఱుంగఁ, దైన నేమి
గీఁత మంచిదగుటఁ గిగ్గాడి చామీక, రాంగదముల వచ్చె రంగమునకు 9

క. సుడిదిరిగి తప్పుగాడ్పులు, కడుకొని వెదమనిసినొసటఁ గ న్నొకనాఁ డే
ర్పడుఁగాక వాఁడు శివుఁడా ?, చెడగరమై మిడిసి కూలు శిశుపాలుఁ డయా ! 10

ఉ. ఆతఁడు కొమ్ముపట్టిన మహామహుఁడై, యొకనాఁడుదారుడై
పూతచరిత్రుఁడై, జగముపొంగ వెలింగెనుగాక కాఁక యే
దో తఱచై తెగించి పెడత్రోవలు పట్టినపట్లసైత మా
భ్రాతనుమెచ్చఁబోకు; తలఁపంజన విచ్చుటఁ బూర్వవాసనల్ 11

ఉ. చుట్టమటంచు మిత్రుఁడనుచున్ మొగమోడక యెవ్వఁ డెప్పు డే
కట్టిఁడిచేఁత సల్పినను గాదనిపల్కుము; జాతిపేర్మికై
కట్టలఁతల్ భరించిన మగండు రిపుం డగుఁగాక వానికిం
బట్టము పూల దోసిళులు బ్రహ్మరథమ్ము జగమ్మహో ! యనన్ 12

ఆ. ధర్మువునకు సూనృతమునకుఁ గాక నీ, కేల జంకువలయు నితరమునకు
మంతుగన్నవారు మన్నించినట్టి దీ, తెరువ పొమ్ము త త్త్వ మరసికొమ్ము 13

గీ. తగవు నిక్కమ్ము కలుచకు దబ్బఱకును, లోఁగి కొఱవోవుతతి వానిసేగి నడఁప
దిట్ట తెగఁడేని యది వానిచెట్టగాక, పాడికి నిబద్ధి కోట రానీఁడు వేల్పు 14

క. విత్తమునఁ గామసుఖ మగు, విత్తము ధర్మువున వెల్లివిరియును గానన్
గ్రొత్తలు ప్రాఁతలు పాడికి, నుత్తమపీఠమ్ము నొసఁగి రుచితజ్ఞమణుల్ 15

క. ఏకర్జ మొరుఁడు సల్పిన, నీకుం గన లామతిల్లు నీ వొరుదెస నె
ప్డాకర్జము గావింపమి, చేకొనుమా, పుడమియెల్ల జేజేల నిడన్ 16

ఉ. నేతలువచ్చి ధర్మువులు నింతురు మంతురు చింతలన్నిటిన్
ద్రోతురు పాతు రం చెదురుత్రోవలుసూడక నీదులెస్స కీ
వే తగు యత్నముల్ సలుపు, మేల్బడి చేపడకున్న నేమి ? ధీ
చాతురి లేరె నీకు శతజన్మఫలమ్ము ? తెలుంగుతమ్ముఁడా ! 17

గీ. కుక్కగొడుగులచందానఁ బెక్కుదెసల, లెక్కలేనన్ని వర్గాలు లేచె నిపుడు
గుట్టు తెలియక బంగారు కొట్టటంచుఁ, గదలకుము కాకిపసిఁడి దుకాణమునకు 18

ఉ. వచ్చెఁ బ్రజాయుగమ్ము, పదివందలయేండ్ల పిసాళిసంకెలల్
విచ్చె, సమస్తఖండముల విప్లవరేఖలు భారతోర్వికిన్
జొచ్చె, స్వజాతిసంస్కృతికిఁ జుట్టములై పొగడొందుధర్మువుల్
మెచ్చుచు, నచ్చపుందెలుఁగు మేలిమి చాటఁగదయ్య తమ్ముఁడా ! 19

ఉ. నీకు రుచించుమార్గమున నీవు ప్రయాణము సేయవచ్చుఁ గా
నీ ! కలనైన సత్యము నహింసయు లేబరమైనత్రోవకుం
బోకుము, నిల్వనేర దవిపోయిన సంఘము, గెల్వనేర దా
రేకలు లేని సంస్కృతి చరిత్ర వెలార్చినసాక్ష్య మీనుడుల్ 20

క. ఔచితి నెఱుఁగనివారికి, నైచికి నదలించి శునికి నతు లర్పింపం
జూచెదువారికి, ధర్మువుఁ, ద్రోచెదువారికి నొసంగుదురె దొరతనముల్ ? 21

క. కారాగారములకుఁ జని, గారెలు మెక్కినవలంతికా క్రిమిరాసుల్
పేరినపులుసుం ద్రావిన, వీరునకా విరులదండ వేయుట? సెపుమా ! 22

క. లాటీరక్కసి రక్కెస, పోటులకున్ వ్రస్సి త్రెస్సిపోయినయొడలిం
జాటు నెఱజోదులను దెర, చాటునకున్ ద్రోయుజాతి చక్కంబడునే ? 23

ఆ. తోరణాలుకట్టి, తోమాలియలు వైచి, పొగడు ప్రజలఁజూచి పొంగిపడక
పదవిలేనినాఁడు పదిమంది మన్నించు, వదు వెఱింగి, బ్రదుకవలయుఁ బ్రెగడ 24

క. దినగండము నూతేఁడుల, మనువైనది తెల్గువారి మన్నెఱికం, బీ
యనయమ్ము నోర్వఁదలఁచిన, మన గఱువతనమ్ము వేయిమడుఁగులు వలయున్ 25

క. కలమెత్తిన హలమెత్తిన, మలమెత్తినవారి నొక్క మైఁ జూడవలెన్
వలఁతియు నలఁతియు లే దిటఁ, బలువృత్తులు సాగినపుడె బ్రదుకులు సాగున్ 26

క. తననేర్మిన్, దనయోర్మిని, దనపేర్మిన్, బెత్తనమ్ముఁ దనపల్కుపసన్
దనకల్మిని, దనబల్మిని, దనబ్రదుకున్ గఱువ పెఱలతనివిక పంచున్ 27

క. మన కాంధ్రత్వము ప్రాణము ; , తనువుసుమీ ! భారతీయధర్మము; యావ
న్మనుజాభ్యుదయ ప్రవణత, యనుజా! విను వజ్రకవచమై దిట వొసఁగున్ 28

క. దేవుఁడన మాతృ దేశము, దేవత లనఁ బ్రజల, యజ్ఞ దీక్ష యనంగా
సేవావ్రత నిష్ఠయ, యివి, జీవనసూత్రములుగాఁ బ్రసిద్ధిం గనుమా ! 29

క. నీ కొఱకుఁ గాక జాతి, శ్రీ కొఱకే దస్సి దస్సి జీవింపుమయా !
నీకీర్తి విరియువెన్నెల, ప్రాఁకి దెసల్ - కొసలు చివురుపట్టి రహింపన్ 30

క. మేలు తెలుఁగుం బతాకకు, జే లాంధ్రప్రజకు మాతృసేవారతకున్,
శ్రీలు తెలుఁగుం గృతికి, జే, జే లాంధ్రతపస్వి పొట్టి శ్రీరాములకున్ 31



# లఘుటీక

| | | | | | |
|---|---|---|---|---|---|
| అంగు | = | రీతి | ఓజ | = | క్రమము |
| అదవిష్ఠ | = | సమీపస్థ | ఓట | = | భయము |
| అనయము | = | కీడు | ఓటు | = | ప్రశ్నార్థకము |
| అలఁతి | = | అల్పము | కట్టిఁడి | = | క్రూరము |
| అసిప్రభుత్వము | = | సైనికరాజ్యము | కడలు | = | అల |
| ఆఁక | = | ఆటంకము | కడల్కొను | = | అతిశయించు |
| ఆఁచిన | = | నిలిపిన | కదాని | = | |
| ఆదట | = | ప్రేమ | మేలిమిబంగారు | | |
| ఆమతిల్లు | = | పుట్టు | కడిఁది | = | కఠినము |
| ఆఱడి | = | వ్యర్థము | కనలు | = | కోపము |
| ఇట్టిదొర | = | ఇట్టిమాదిరి | కఱద | = | నీతి,బుద్ధి |
| ఇమ్ము | = | శాంతి | కలితనము | = | నేర్పు |
| ఇల్లి | = | ఉపవాసము | కలుచ | = | పాపము |
| ఉప్పరిగ | = | మేడ | కవీ | = | కవయిత్రి |
| ఉరలిన | = | దొరలిన | కవేరజ | = | కావేరి |
| ఉరవు | = | అధికము | కాపుగడ | = | కావలి |
| ఉలుపా | = | కానుక | కారించు | = | బాధించు |
| ఉల్ప | = | కానుక | కింగిరి | = | అల్పము |
| ఊఁది | = | అవలంబించి | కికురింత | = | మోసము |
| ఊటాడించి | = | పోఁగొట్టు | కిగ్గాడి | = | అసమర్థుడు |
| ఊఱటచిన్నె | = | కామా (,) | కిగ్గు | = | జంకు |
| ఎడ | = | లేఁత, దవ్వు | కుమారిల్లు | = | కుములు |
| ఎడయన్ | = | తొలఁగన్ | కృతి | = | పని |
| ఏటికోళ్లు | = | నమస్కారము | కృత్స్న | = | సమస్త |
| ఏస | = | వికృతోచ్చారణ | కెడపి | = | త్రోసి |
| ఒండెన్ | = | లేక | కెలనివారు | = | ఇరుప్రక్కవారు |
| ఒడుగు | = | ఎండినయాకు | కోవ | = | కులశాఖ |
| ఒడ్డగెడవు | = | బోల్తా | క్రించు | = | అల్పుఁడు |
| ఒరిమ | = | ఐకమత్యము | క్రీఁగాఁపురము | = | పేదకాఁపురము |

| | | |
|---|---|---|
| క్రుయ్యు | = | కృశించు |
| క్రేపు | = | దూడ |
| గద్దతి | = | సువిశాలము |
| గబ్బు | = | పొగరు |
| గరగర | = | నిర్మలము |
| గఱువ | = | గొప్పవాఁడు |
| గుడ్డము | = | చేను |
| గునియు | = | నర్తించు |
| గోరాలు | = | ఆపదలు |
| చనువు | = | అధికారము |
| చూఱ | = | దోఁపిడి |
| చెదగరము | = | క్రూరుఁడు |
| జంకె | = | బెదరింపు |
| జగా | = | గొప్ప, మంచి |
| జగ్గు | = | కాంతి |
| జడిమ | = | మాంద్యము |
| జడ్డు | = | ఆసక్తి |
| జాతము | = | సంఘము |
| జోక | = | అందము |
| తటకాపడు | = | చేష్టలు దక్కు |
| తలఁకక | = | భయపడక |
| తలఁకించు | = | చలించు |
| తీనె | = | తిన్నె, అరుగు |
| తెక్కలి | = | మోసము |
| తెన్ | = | దక్షిణము |
| తెలుచుట | = | ప్రసన్నత నొందించుట |
| తొట్టు | = | వ్యాపించు |
| తోఁచిన | = | పుట్టిన |
| తోమాలియ | = | వనమాల |
| దవీయాంసులు | = | దవ్వయినవారు |
| దివ్వ | = | దీపము |
| దేవర | = | ప్రభువు |
| దొర | = | మాదిరి |
| ద్రాబ | = | పనికిరానివాఁడు |
| నవఁత | = | కృశించుట |
| నవసి | = | కృశించు |
| నాదారు | = | లేమిగల |
| నాఁడు | = | కాలము, దినము |
| నాడు | = | దేశము |
| నాయఁకరము | = | ప్రభుత్వము |
| నెగులు | = | దుఃఖము |
| నెట్టికసీలతనము | = | సదాచారము |
| నెఱ / నెఱా | = | మిక్కిలి, ప్రసిద్ధము |
| నెఱాసరుల్ | = | ప్రౌఢములు |
| నెఱి | = | గొప్పతనము |
| నేర్మి | = | నేర్పు |
| నేఱా | = | లోటులేని |
| నైక | = | అనేక |
| నైచికి | = | మంచిపాఁడియావు |
| నోనాడిన | = | దూషించిన |
| పఱి | = | రీతి |
| పాడితావు | = | కోర్టు |
| పాడు | = | మాలపల్లె |
| పాతురు | = | తొలఁగింతురు |
| పూఁట | = | బాధ్యుఁడు, బాధ్యత |
| పూవని | = | వికసింపని |
| పేర్మి | = | గొప్పతనము |
| పొంటెన్ | = | కొఱకున్ |
| పొలము | = | ప్రదేశము |
| పొలి | = | లాభము |
| పోఱఁడు | = | బాలుఁడు |

| | | |
|---|---|---|
| ప్రణిధి | = | ప్రార్థన |
| ప్రన్నన | = | సొగసు |
| ప్రబ్బు | = | వ్యాపించు |
| నెట్టికసీలతనము | = | సదాచారము |
| ప్రాఁబడి | = | సుపరిచితుల |
| బయకారము | = | కులుకు |
| బయలుమెఱసె | = | వెల్లడియయ్యె |
| మదుఁగు | = | శుద్ధము |
| మనువు | = | బ్రదుకు |
| మన్నెతికము | = | ప్రభుత్వము |
| మీఁదు | = | దుడుపు |
| ముంగమురారి | = | ముంజేతికడియము |
| ముక్కులు | = | కొసలు (దీర్ఘములు) |
| మూదల | = | తార్కాణము |
| మెఱవడి | = | ఊరగింపు |
| మేఁగూలి | = | (మేం+కూలి) పండించిన వాని కూలికై పంటలో నతని కొకమేర నిర్ణయించుపద్ధతి |
| మొగుళ్లన్ | = | మేఘములను |
| రక్కెస | = | యుక్తముగానిది |
| రవళించు | = | ధ్వనించు |
| రాణ | = | గౌరవము |
| రావుతు | = | వీరుఁడు |
| లగ్గు | = | మేలు |
| లెంక | = | సేవకుఁడు |
| లెస్స | = | మేలు |
| లేబరము | = | శూన్యము |
| లోఁచిన | = | వంగఁదీసిన |
| వడువు | = | రీతి |
| వనట | = | బాధ |
| వలంతులు | = | దిట్టలు |
| వలఁతి | = | గొప్ప |
| వలపు | = | వాసన |
| వాకలిమి | = | నోటి (మాట) నేర్పు |
| వాగ్ప్రోఢతనము | = | మాటనేర్పు |
| విజు | = | వ్యాపించు |
| వెంపరలాట | = | త్రొక్కులాట, అశాంతి |
| వెద | = | అల్పము, నీచము, వ్యర్థము |
| వెలఁది | = | శుద్ధమైన |
| వేఁకి | = | జ్వరము |
| సంబళము | = | జీతము |
| సడి | = | నింద |
| సిబ్బితి | = | సిగ్గు |
| సుబ్బుట | = | బయల్పడుట |
| సూడిద | = | కానుక |
| సూరెలు | = | పార్శ్వము |
| సేగి | = | కీడు |
| సొగసి | = | పరవశించి |
| సోమించు | = | అతిశయించు |
| సోము | = | సుఖము |
| స్వము | = | సంపద |
| హజ్జ | = | పాదము |
| హసాదు | = | చిత్తము ; చిత్తము ;అనుట |
| హొరఁగు | = | విలాసము |




'సర్వోదయ గానము' కృతిస్వీకర్త - శ్రీ తుమ్మల బసవయ్య, వారి సతీమణి దుర్గాంబ

# పీఠిక

శ్రీ సీతారామమూర్తిగారి కవిత స్వతంత్రమైన మాధుర్య సౌరభ్యములు వెదఁజల్లఁగలది. సౌలభ్య గాంభీర్యములు దాని మూలద్రవ్యములు. వారి నెఱుఁగని వా రుండవచ్చును; గాని వారికవిత నెఱుఁగని వారు తెలుఁగునాట నుండరు – అనఁగా సాహితీ రసికులలో నన్నమాట. ఎవరైన నుండిరా వారిని దైవవంచితు లనవలయు నంతే.

కవులనుగూర్చి యీయన యీ 'సర్వోదయగానము'న చెప్పిన పదునెనిమిది చిన్న పద్యములు కవితా వ్యాసంగమునకు దిగిన వారందఱును మంత్రములుగా జపింప వలసినవి. అందలి యర్థ భావములు శ్రీ భావేమునీశ్వరునివే కావచ్చును. కాని వానిని జీవరత్నములుగాఁ దీర్చి యందిచ్చిన పుణ్యము శ్రీ సీతారామమూర్తి గారిది. దాని ఫలము ననుభవించు భాగ్యము తెలుఁగువారిది. కవితాకళ వట్టివినోదముగానో, జీవికగానో ఉండఁదగినది కాదని, కవితల మీఁదిబరువు చాలగొప్ప దని, పైపద్యములు మూర్తిగారి పరాయణమును పలుదెఱఁగులుగా చాటుచున్నవి. కవి ప్రజా జీవితమును సంస్కరించి నడపు నాయకుఁడు అతనివాక్కు అతని 'జీవితనిష్ఠను ప్రచురించును'. అతని 'బ్రదుకు పల్కులు రవియున్ రుచియుంబలె నొండొంటికి నుచితాశ్రయ మగుచు నుండు నుడుగని మైత్రిన్'' కనుకనే,

**'సంఘమునకుఁ బుష్టి, సంతుష్టి నొదవించు, వెలఁదిపల్కు వాడ వలయుఁ గృతులఁ;**
**జిత్తశుద్ధి తపము జిజ్ఞాస నేర్వని, కవి కుదాత్తవాణి కానఁబడదు.'**

'వెలది' అనుమాటకు నిర్మలము అను సామాన్యార్థము కంటె నిర్మలయైన స్త్రీ అనునర్థమే యెక్కువ వాడుకలో నున్నది. స్త్రీల పలుకు తన విశిష్ట విభూతులలో నొకటిగా శ్రీ కృష్ణ భగవానుఁడు వెలయించినాఁడు, 'వాక్చనారీణాం' అని. (గీత. అ.10) మనకు పుష్టి సంతుష్టు లను ప్రసాదించుట స్త్రీ ధర్మము, స్త్రీ స్వభావము. త్యాగశీలమైన ఆ ఉదాత్తత స్త్రీల స్వరమందే మాటలందే సర్వదా ప్రతిఫలించు భగవత్తత్త్వము. మూర్తిగారి యీ 'వెలఁదిపల్కు' కావ్యము 'కాంతాసమ్మితము'గా రూపొందవలె నన్న ప్రాచీన కావ్యలాక్షణికులమాటకు చక్కని టీక. వెలఁది- నిర్మలశీల – కాని స్త్రీ గూడ 'కాంత'గాఁ దోఁపవచ్చును – ఎవరికైన, ఎప్పుడో యొకప్పుడు. అటువంటి 'కాంత' కావ్యములు నాఁటికి నేఁటికి ఎన్నియో పుట్టినవి, పుట్టు చున్నవి, పుట్టఁగలవు గూడ. కాని వానియందు ఉదాత్తత యుండదు. నైర్మల్యములేని స్త్రీ విషకన్యగా పరిణమించునట్లు ఉదాత్తత లేనికవిత విషవాక్కుగా ఏర్పడును మనపాలికి. కనుక,

**'నియమబద్ధమ్ము మధురమ్ము నిపుణమైన, పలుకుతో సాహితీసృష్టి సలుపవలయు;**
**రాగరోషాది దుర్వికారములు లేని, కవులకే తోఁచు నిట్టి చక్కని వచస్సు'**

ఇది 'అహింసయైవ భూతానాం
కుర్యాత్ శ్రేయోనుశాసనమ్
వాక్చశ్లక్ష్ణాచ మధురా
ప్రయోజ్యా - ధర్మమిచ్ఛతా'

అను మనుమహాశయుని స్మృతివాక్యరత్నమునకు ప్రదీపనము.

ఇట్టి లోకకల్యాణహేతు వైన కవితకు వలసిన భావనాబలము ప్రజల మేలుగీళ్ళఁబాల్గొను వారికే' లభింపఁగలది. కుక్షింభరులకు లభింపదు. కావున,

**'పంటకాఁపు చేతిపనివాఁడు బైరాగి**
**తక్క నొరుఁడు పల్కఁదగఁడు కైత'**

అని కొంత తీవ్రముగా నియమించినారు మూర్తి గారు.

అసాధారణమైన యీ లోకకల్యాణదృష్టియే, ఈ యార్జవమే మూర్తిగారి సర్వరచనలకును మూలబంధమై బలమునిచ్చి నడిపించినది. వానిలో శ్రీ గాంధిగారి 'ఆత్మకథ' వీరి తెలుఁగు తీపులో మెదిగి మనము మఱచిపోవుచున్న ఆ మహాత్ముని ఆధ్యాత్మిక ప్రభను అప్పుడప్పుడు కన్నులు మిరుమిట్లు గొలుపునట్లు చేయు మహాంధ్రకవితారచన.

మహాత్ముని తరువాత ఆయనయంతటివాఁడు, ఆదివిటీనే ఇంకను ఉజ్జ్వలముగా వెలిఁగించుచు దేశము మూలమూలలను వెలుతురు నించుచున్న బైరాగి, మహామేధానిధియైన తపస్వి, దేశమందలి రాక్షసశక్తులకు సుదర్శనచక్రమువంటివాఁడు - అగు శ్రీ వినోబాభావే గారి ఉదాత్తాత్మ శ్రీ సీతారామమూర్తి చేతికి చిక్కి తెలుఁగుమెఱుపులతో ఇందు మెఱయు చున్నది.

ఆ యిద్దఱు మహామహులందుఁ గల భక్తి, వారి నడవడియందుఁ గల ప్రతిపత్తి, వారి యుపదేశములందుఁ గల ప్రపత్తి - ఇవి నిర్మలములై, ఆనారోపితములై శ్రీ మూర్తిగారికవిత వెన్నువంగక నిటారుగా నిలఁబడునట్లు చేసినవి.

**'బరువుఁజూచి కృతికిఁ బరువు నీకుఁడు, చిన్న, రచనయైననేమి? రాముఁ దండుఁ**
**గానిపించునేని మానవు నది తీర్చి, దిద్దునేని దాని కుద్ది లేదు'**

అను మూర్తిగారి ప్రార్థనను అనువదించుటకన్న ఈ పీఠిక చేయఁ గలిగినది లేదు. -- అస లీపీఠిక దీనికెందుకో శ్రీ మూర్తిగారినే అడుగవలయును! నాకు తెలిసినది నాయెడ ఆయనకుఁ గల అమిత ప్రేమమే. దానికి నా ధన్యవాదములు.

తిరుపతి
15-12-60

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ

# మనవి

సర్వోదయము మహాత్మునిపరమలక్ష్యము. ఆయన తనమనుగడలోనే దీనికై గట్టిపునాదులు వైచెను. త దనుయాయు లెందఱో నేఁ డీలక్ష్యసిద్ధికి శ్రమించు చున్నారు. వీరిలో వినోబాభావే ప్రథమగణ్యుఁడు. సర్వోదయమునకు భావే త్రొక్కిన మార్గము విశిష్టము. ఇది యావత్ప్రపంచమునకు విస్మయము కల్గించుచున్నది. మహర్షియు మనీషిసత్తముఁడును అగు భావే భూదాన యాత్రలో నెడనెడఁ గావించిన ప్రవచనములు విశ్వకల్యాణ సూత్రములు. ఇవి సర్వోదయసాహిత్యము నకు జీవగఱ్ఱలు. వీని ననుసరించి 'భావేచక్కట్లు' వ్రాసితిని. భావేప్రవచనములు విని పెక్కండ్రు కరఁగిరి. వారికథలే 'పవిత్రసన్నివేశములు'. నే నీ రెండుభాగము లందును మూలావిరుద్ధముగా నించుక స్వతంత్రించితిని.

సర్వోదయకార్యకర్తలు శ్రీ వెంపటి సూర్యనారాయణగారు ప్రచురించు 'సామ్యయోగ' పత్రికయు, శ్రీమతి మృదులామూందడా వ్రాసిన 'పవిత్ర సన్నివేశములు', శ్రీమతి నిర్మలా దేశపాండే వ్రాసిన 'వినోబాసన్నిధిలో' అను గ్రంథములును ఈ రచనలో నా కొనర్చిన మేలు మఱవరానిది.

ఆరోగ్య మెంత కొఱవడి యున్నను నా ప్రార్థన పాటించి యీ కృతికిఁ బీఠి కను వ్రాసి నాయెడ వాత్సల్యముం బఱపిన విద్వద్విమర్శకవరేణ్యులు పూజ్యులు శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారికి నా భక్తిపూర్వకనమోవాకములు.

ఈ కృషిపట్ల నాకు వలయుగ్రంథములు పంపి యెనలేని ప్రోత్సాహము నొసంగిన మిత్రులు సర్వోదయసేవకులు శ్రీ వట్టికూటి వెంకటసుబ్బయ్యగారి సౌజన్యము ప్రశంసనీయము.

ఇట్లు

**తుమ్మల సీతారామమూర్తి**

# కానుక

ఆ. దేశమాతృ దాస్యపాశ విచ్ఛేదన, దీక్షమై సబర్మతీమహర్షి
శస్త్రదూరమైన సైన్యము నడిపిన, తొలిదినాల నాత్మఁ దలఁచుకొందు 1

మ. కడిమిన్ దాలిమి నెంతయున్ మెఱసి మా కాణాచి 'కావూరు' ముం
దడుగై నిల్చెను దన్మహోరణమునం; దాయా స్మృతుల్ రేఁగి నా
యొడలెల్లన్ బులకించు నిప్పటికి; నోహో! యెవ్వఁ డాజోదు మా
పడవాలా? యవు నాతఁడే! బసవయా! భక్తి ప్రణామం బిదే 2

ఆ. ఒక్కకుదుటిలోనె యెకయూరనే జని, యుంచినట్టివార మీవు నేను
మనకు 'జాస్తి' వంశమణి సుబ్బయమనీషి, యొకఁడె చిన్ననాటియొజ్జ యయ్యె 3

ఆ. వివిధధర్మతత్త్వవేది పౌరాణిక, యోగరతుఁడు వీతరాగుఁ డతఁడు
నాకుఁ దెలుఁగు నేర్పెనీ కనాద్యంత మై విశ్వమూల మైనవెలుఁగు జూపె 4

ఆ. గ్రామహితము వలచి గ్రంథాలయంబు నే, ర్పఱిచి యోపినంత బదలు మనకుఁ
గలిగె నిర్వరకును గాంధేయ మహనీయ, ధర్మనిరతి పిన్నతనమునందె 5

ఆ. కవితసెప్పి గాంధికథ లల్లి యూరేగి, నాఁడ నేను దెలుఁగువాడలందు
నిశితకర్మయోగనిష్ఠ నొక్కెడ నుండి, యెల్ల యెడలమెప్పు లీవు గంటి 6

ఆ. మాట లెన్నియైన సాటిరా వొకమంచి, చేఁత కనుట నిక్క; మేతదీయ
మర్మ మెఱిఁగి బ్రదుకుమహితాత్మునిన్ నినుఁ, జూచి చూచి యేను సొగయుచుందు 7

సీ. ఆరబ్ధమయ్యె నెయ్యది పుత్తలీబాయి సుతుఁడు వెల్గించినజోతితోడ
అండయై నడిపె నెయ్యది పరాధీనతా వ్యూహభంజక సకలోద్యమములు
ఆశ్రయంబొసఁగె నెయ్యది దురాధివ్యాధి మగ్నయై భుగ్నయై గ్రమగ్గు ప్రజకు
కదలింపనేర్చె నెయ్యది తన్నుఁ దిలకింప రాజర్షి మౌళియౌ రాష్ట్రపతిని
గీ. యోగమున కార్తసేవానురాగమునకు, సదనమై పొల్చె నెయ్యది యది దిగంత
విశ్రుతవికాసఖని వినయాశ్రమంబు, బసవయా! నీ వదాన్యతాఫలము సూవె! 8

ఆ. అంత యింత కాదు సొంత మన్నది యిఁక, సుందరా దటంచు నిందుకలిమి
సకలమాశ్రమంబున కొసంగి నిస్సంగ, సరణి వలచు నీకు సాటి యెవరు? 9

గీ. ఒక్క నీసతి నీ కిట నుద్ది వచ్చు, నేమొ దుర్గాంబ - లోభమ్ము నీసడించి
త్యాగమయ కంటకావృ తాధ్వమ్మునందు, నిడుమలకు నోర్చి నీవెంట నడిచె నీమె 10

ఆ. గురుఁడు గొల్లపూఁడికులుఁడు సీతారామ, శాస్త్రి మిమ్ము దిద్దఁజాలె నిట్లు
నవభగీరథుని మనస్విని బాపుజీ, ఛాత్రమౌళి నితని సంస్మరింతు 11

ఆ. చెట్టునందు ఱాతిగుట్టయందును భవ, ద్దేశికుండు సూచె దేవదేవు
నీవు నెల్లజగము నీశ్వరమయముఁగా, నమ్మి బ్రదుకఁ జాలినాఁడ వన్న! 12

సీ. కడగండ్ల మునిఁగి యట్టడుగునఁ బడియున్న, బడుగులతలపుండ్లు కడిగి కడిగి
నా యన్నదిక్కు గానక యేడ్చునిసుఁగులఁ, బ్రేమామృతమ్మునఁ బెంచి పెంచి
మంచానఁ బడి యుమ్మలించెడు రోగుల, నెనసి విణ్మూత్రంబు లెత్తి యెత్తి
ముదుకబట్టలమూట మోసి నల్లడ నమ్మి, పేదరాలికి బువ్వ పెట్టి పెట్టి
ఆ. యీ సమస్త కార్య మీశ్వరసేవగాఁ, జిత్తగించి తనివిసెందు నిన్నుఁ
జూడఁ జూడ మాదృశుల మస్తకమ్ములు, తమకుఁ దామ యవనతమ్ము లగును 13

ఉ. ఈ సుచరిత్ర మెల్ల నొకయెత్తు తెనుంగుల రాష్ట్రసిద్ధికై
చేసిన తావకీనము విశిష్టతపం బొకయెత్తు; నీవు నా
వ్రాసిన రాష్ట్రపుంగృతికి వన్నెలుదిద్దిన యన్న వైతి; వీ
వాసిని నిల్చుఁగాక! మనవంగడ మాంధ్రమహీసపర్యలన్ 14

మధ్యా. ఈ విచ్చుటయ నేర్చినాఁడ వేనాఁడు నితరు లొసంగు
నీవి యావంతయు నాసచేయమి యింత నిక్కువము
కావచ్చుఁగాక నీ కొక్క కానుక కాంక్షదీఱంగ
నీవలె ననుకొంటి నోయి! కైకోవె! యాకృతి సుకృతి! 15

మధ్యా. భూదానయజ్ఞదీక్షితుఁడు పరమతపోరాశి వేద
వేదాంగవిదుఁడు భావేమహాఋషి వినిచిన నుడులు
పూదండయుంబలెఁ గూర్చి తెచ్చితిఁ బొలుపార దీని
నాదరింపవె! తుమ్మలాన్వవాయసుధాంభోధిచంద్ర! 16

మధ్యా. లోకంబు హింసాకులంబు, సత్యమ్ము లుప్త, మీవేళ
నేకడన్ గన్నఁ జీఁకట్లు తీండ్రించు; నీవిపద్దశను
బోకార్పఁ బెనఁగు నీబోంట్లకుంగాక పూని యెవ్వాని
కీకైత నిడెద? సర్వోదయధ్యేయ! యాకొసంగదవె 17

మధ్యా. నీకీర్తి నమరమ్ముఁగా జగమ్మున నిలుపుటపొంటె
నీకృతి నీకు నీలేద నీత్యాగమే చాలు దాని;
కో కర్మయోగిమూర్ధన్య! కర్తవ్య మొకఁడ ప్రేరింప
నీ కిచ్చి ధన్యుఁడ నైతి జయములు ని న్నొందుఁగాత! 18

# విషయసూచిక

# సర్వోదయగానము

## ఆతఁడు

గీ. ఆతఁ డుగ్రతపఃకృశీభూతుఁ డాతఁ, డున్నతశరీరయష్టిసంపన్నుఁ డాతఁ
డాత్మసందర్శనోజ్జ్వల దక్షియుగళుఁ, డాతఁ డార్షమహస్సున కానవాలు 1

గీ. అతఁడు నేర్వనివిద్య లే దతని కగ్గ, పడని భాషయు లేదు ప్రాక్పశ్చిమప్ర
పంచసంస్కృతి పుక్కిటఁబట్టె నతఁడు, నిఖిల మానవతా ప్రతినిధి యతండు 2

గీ. దుర్భరావేశమునఁ దప్పుత్రోవఁ బట్టు, దేశభక్తిని గాంధేయదిశకు మలఁచి
సత్యసంసక్తిమై నహింసాప్రవృత్తి, మై గరిష్ఠతఁ గను కర్మయోగి యతఁడు 3

గీ. జగతి యింద్రియసుఖలాలసతకు లోఁగి, కామ్యకర్మానుగతికమై కదలువేళ
నిత్య నిరవద్య నిగ్రహనిష్ఠ కండ, దండయై నిల్చు నూర్ధ్వరేతస్కుఁ డతఁడు 4

గీ. పరమగుహ్యమ్ము గీతానిబంధితమ్ము, బ్రహ్మవిద్యను బసులకాపరికిసైత
మెఱుకపడునట్లుగా నింత లింత లైన, కథలుగాఁ బ్రవచించిన బుధుఁ డతండు 5

గీ. వ్యక్తి సత్యాగ్రహప్రధనాంగణమున, నిలువఁజాలిన మొదటిసైనికుఁడుగా మ
హాత్మునుల్లము లోఁగొన్న యనఘుఁ డతఁడు, వీరులకు వింతగొల్పిన వీరుఁ డతఁడు 6

గీ. ఒక మహాశాస్త్రమర్యాద నొంది వెలసె, నతఁడు చేపట్టినంతన యలఁతికదురు
ఒక మహావేదబుక్కు వానికిఁ గరంగి, చల్ల చల్లని దేశియై వెల్లివిరిసె 7

గీ. కుత్తుకలు గోసి నెత్తురుకూడు గాదు, తృష్ణలను ద్రుంచి యమృత మందించు నతఁడు
విప్లవము కాదు వానిది విశ్వశాంతి, కాదరువుగా నెసంగు సర్వోదయంబు 8

గీ. జనచయమ్ములు దేవతాగణము లయ్యె, దాతలెల్లరు హొూతలై తరలివచ్చి
రుభయతారక మగుశాంతి యురలి పొరలె, నతఁడు భూదానయజ్ఞదీక్షితుఁడు కాఁగ 9

గీ. కలిమి నిచ్చిరి ముక్కారుపొలము నిచ్చి, రొడలి నిచ్చిరి బ్రదు కిచ్చి రోటలేక
బాపురే! వానిపయనించుబాటలందు, నిండె నీవులు పుణ్యముల్ పండిపోయె 10

గీ. అతఁడు నిలువెల్ల నర్మిలి, యతఁ డజాత, శత్రు వాతనినుడికి మస్తకము వంచి
మిత్తికిఁ దెగించి గజదొంగ లుత్తచేతఁ, బట్టువడుదురు సర్కారుచట్టమునకు 11

గీ. కానరాఁ డిఁక బాపుజీ కనుల కనుచు, శోకమయమూర్తియై క్రుంగు లోకమునకుఁ
బట్టుఁగొమ్మగ నిల్చినయట్టి దీన, బాంధవుఁడు పావనుఁడు 'వినోబా' యతండు 12

గీ. కోటి కొకఁడేని వానికి దీటువచ్చు, పురుషుఁ డుండినమహికి రాచతికమేల
శాసనము లేల యస్త్రశస్త్రమ్ము లేల, ధర్మదేవత నాల్గుపాదముల నడువ 13



# రామగంగ

గీ. అది తెలంగాణ మది విప్లవాగ్నిశిఖల, మండి మండ్రాడుచున్న నల్గొండసీమ
యది నిరంతరహింసాభయార్త జన స, మాజదుఃఖాశ్రుజలపూర మగ్నభూమి 1

గీ. అది విపన్న ప్రజాహృదయాంధకార, హరణకుశలుఁడు సర్వోదయారుణాంశు
మూర్తి సమతామహాయోగముద్రఁ బూని, తరలి వచ్చిన శాంతియాత్రాపథమ్ము 2

గీ. గ్రామములుకొన్ని కడచి భావేమహర్షి, యల్లనల్లన పోచమపల్లి చేరె
కలిమి గలవారిపన్నీటఁ గా కతండు, లేనివారల కన్నీటితోనె కరఁగె 3

గీ. తీర్చిదిద్దిన మేడమిద్దెలను గాదు, పూరికొంపలఁ దిలకింపఁ బోయెఁ బ్రభువు
పురుటికంపున మునియురంబునకు వచ్చె, నప్పు డొకపాప పూర్వపుణ్యములు పండి 4

గీ. యోగి యెత్తినబిడ్డ పుణ్యోదయంబు, పేదసాదులపాలి భాగ్యోదయంబు
పతితమానవదుర్దశాభంజకమ్ము, ప్రగతిశీల ప్రజామనోరంజకమ్ము 5

గీ. గాలి వెలుతురు సోరని మార్గమునఁ గదలి, గుడిసెలో మూల్గురోగిని గుస్తరించి
కుండనిండని నూకలకూటి నరసి, గురుఁడు తన్మయుఁడై చూచె గూడెమెల్ల 6

గీ. వరము లిడువేల్పు భూమికి వచ్చె ననుచుఁ, గరములు మొగిడ్చి తమకష్టగాథలెల్ల
నెఱుకచేసిరి సామ్యయోగేశ్వరునకు, హరిజనులు భక్తినమ్రతాభరముతోడ 7

గీ. వెచ్చవెచ్చనియూర్పులు వెడల నపుడు, పల్లియకుఁ జేరుకొనె వినోబాతపస్వి
పిన్నలును బెద్దలును వేచి యున్న కతన, నొకసద స్సాయె నాతనియునికిపట్టు 8

గీ. ఓ మహాజనులార! యీయొర నున్న, హరిజనులఁ గంటిరే లేమి నణఁగువారి
దున్ని పండించుకొన నింత త్రోవ నిడిన, బ్రతికిపోదురు వీర లాపదలఁ బడక 9

గీ. ముప్పదికుటుంబములవారిముప్పు తొలఁగఁ, జాలునఁట యెనుబదియెకరాలనేల
యెంతమితవాంఛ! మనతమ్ము లీదరిద్రు, లిచట వీరిని దేర్చువా రెవరు లేరె 10

గీ. పరమయోగీంద్రుఁ డీరీతిఁ బల్కినంత, నోలగము నిస్తరంగపయోధి యయ్యె
నవల నొకతెప్పపాటులో నార్ద్రవాణి, యొకటి యిటు మ్రోసెఁ బరిష త్తహో! యనంగ11

గీ. "అస్మదీయ పితృస్మృతి కంకితముగ, నిదె సమర్పింతునయ్య! నూఱెకరములను"
సాధుతాక్షోణి మనరామచంద్రరెడ్డి, వాణి యిది విశ్వకల్యాణవేణి యయ్యె 12

గీ. 'వెదిరె'వంశజుఁ డీదానవీరుఁ డాది, కారణమ్ముగ భూదానగంగ పుట్టె
వెల్లి యిది పొంగిమిట్టలు పల్లములును, జదును పదు నయి శాంతిసస్యము ఫలించు!13



# భావేచక్కట్లు

## ప్రేమ

ఆ. అన్నలార! మీకునార్తి లేకున్నచో, మప్పుఁదగిన దొక్కమాట లేదు
కలదు కలదు మాకు నలజడి యందురా, వినుఁడు వినుఁడు నేను వినుచుపల్కు 1

గీ. తల్లియై తండ్రియై మన కెల్లయెడల, నండయై దండయౌ దిగుళ్ళంటకుండ
వేయికన్నులతోఁ జూచు వే ల్పటన్న, సత్య మెఱుఁగనివారు విశ్వమున లేరు 2

క. ఏతండ్రియైనఁ గొడుకుల, కూఁతులదెసఁ గీడు కోరుకొనునా మీకున్
గూఁతులు కొడుకులు గలరు గ, దా! తీర్పుఁడు మామకీన మగు నీశంకన్ 3

క. తమబిడ్డల సుఖమునకై, శ్రమలన్నిటి నోర్చుచుంద్రు జననీజనకుల్
సముచితమై తనసంతా, నము కళకళలాడఁగాఁ బెనఁగు నీశ్వరుఁడున్ 4

క. క్షితిపైఁ గల ప్రతి వస్తువుఁ, బ్రతిసంపద నతఁడు కూర్చెఁ బ్రజ లందఱకున్
సుతు లార్తులై తపించుట, కతఁ డీకొనఁ డెన్నఁడును దయామయుఁ డగుటన్ 5

ఆ. జనకుఁ డెన్ని మేళ్ళు సంధించుఁగాక వా, త్సల్య మెంత కురిసి సాఁకుఁగాక
తెలివిలేని కొడుకు బలిమి గడించునే, పాడిలేనికొడుకు బాగుపడునె 6

ఆ. తండ్రి పెంచి పెంచి ద్రాక్షతోఁట నొసంగె, నదను వచ్చి పండె నావనమ్ము
కొడుకు పండ్లు తినక గోస్తనీమద్యమ్ము, దీర్చి త్రాగి త్రాగి తిట్లుపడియె 7

ఆ. తండ్రి గోవు నిచ్చెఁ దనయుఁడు దాని పా, లారగించి బలిమి నందలేక
యావుగొంతు గోసి యామిషమును మెక్కి, చెడియె నరకవహ్నిశిఖల జడియె 8

క. సుతుఁ డిట్లు పతితుఁ డౌటకుఁ, బిత చేసినదోస మొక్కపిసరున్ గలదా
గతిఁ జూపుఁగాని జనకుఁడు, ప్రతిదినమున్ గొడుకుముందు పయనించునొకో 9

క. ఈ దినములఁ గొడు కబ్బయు, వాదిప్రతివాదులైన వార్తలు గల వీ
భేదమ్ముల నీశ్వరుఁడా, పాదించునె ప్రజలు కస్తిఁ బడి దురపిల్లన్ 10

క. ఈగడ్డం గలపల్లెల, రాగద్వేషములు హెచ్చి రాక్షసధర్మం
బాగుబ్బతిల్లు నేఁడీ, యాగడ మీశ్వరుఁడు నేర్పెనా జగమునకున్ 11

ఆ. అతఁ డట్లు సేయఁ డధునాతనసమాజ, దృష్టి యింతచెట్ట దెచ్చిపెట్టె
నరుఁడు దారిదప్పినాఁడు వాఁ డొనరించు, పనులు బెడిసి దుష్టఫలము లొదవె 12

క. ఏ విత్తు నవని నాటిన, నా వృక్షమె పుట్టుఁగాని యన్యద్రుమ మే
లా వెడలు? వేఁపగింజకు, మావిడి నొదవించుతోఁటమాలి కలండే 13

ఆ. ఈశ్వరుండు జగతి కిచ్చెఁ జల్లనిగాలి, యయిన నేమి చోరభయము హెచ్చి
నరుఁడు తలుపు మూయుఁ గరువలికంటె మా, నిసికిఁ దీపి యయ్యెఁ బసిఁడి ముక్క 14

ఆ. ఈశ్వరుండు జగతి కిచ్చెఁ గమ్మనిజలం, బైన నేమి నరుఁడు దానిఁ జెఱచు
నతఁడు సుకృతరంగ మగుగంగ నైనను, గొంకుమాలి కసటుగుంటఁ జేయు 15

ఆ. ఈశ్వరుండు మనకు నిచ్చెను ముక్కారు, పంట నేల నెల్లప్రజలు బ్రదుక
నరుఁడు సర్వభూమి నాకు నాకని గట్లు, వేయుచున్నవాఁడు వెతల కోర్చి 16

ఆ. ఈదురాశకతన నితరేతరస్పర్ధ, పెరిఁగి పెరిఁగి నరులు ప్రేమ మఱచి,
నిత్యకలహమునకు నిర్భరాసూయకు, దాసు లైరి పావరాసు లైరి 17

క. ఇది సృష్టిధర్మమున కెదు, రిది భగవన్మతవిరుద్ధ మీతృష్ణ దురా
పదలకు మూలము మానవు, నిది దానవుఁ జేయు నాత్మహీనుని జేయున్ 18

ఆ. తృష్ణ విడిచి మనుజుఁ డితరులఁ బ్రేమించు, టెఱుఁగవలయుఁ దృష్టి మరగవలయుఁ
బ్రేమ మున్న చోటఁ బీతియు దఃఖంబు, మెలఁగబోదు పోరు కలుగఁబోదు 19

గీ. ఈశ్వరుఁడు రెండుచేతుల నిచ్చె నాకు, నితనికిని రెండుచేతుల నిచ్చె వేల్పు
కలసి మే మిద్దఱము చెలికాండ్ర మైన, వెలయుదుము నాల్గుచేతుల విష్ణుభంగి 20

ఆ. ఎల్లవార లిట్లె యితరేతరప్రేమ, నేర్చినపుడు కినుక నార్చినపుడు
మల్లడించు విశ్వమానవకల్యాణ, మిర్వికెల్ల నూత్నపర్వ మొదవు 21

క. నరు లీచందము నొల్లక, పరస్పరద్వేషములకుఁ బాల్పడి యితరే
తరహస్తఖండనక్రియ, మరగిన నిం కేమి కలదు మసనము తక్కన్ 22

గీ. వ్యక్తిగతయాజమాన్యానురక్తి బలిసి, దేశగత యజమానతాతృష్ణ పొంగి
ప్రజలు ప్రభువులు భౌతికబలము పెంచి, కుడుచుచున్నారు నెత్తురుకూడు నేఁడు 23

క. మనరాచతీకం బకటా!, మొనకై తనయర్ధ మర్ధమును బెట్టు నిఁకన్
దినఁ గట్ట లేని యనదలు, మనుగడ సాగింప నేమిమార్గము చూపున్ 24

క. ఎటు వోయిన లోకమ్మునఁ, గటకటలున్ గంపనములుఁగా కే ముండెన్
మటుమాయమయ్యె శాంతి, స్ఫుటజీవన మింతచెట్ట పుట్టం దగునే 25

ఆ. ఈయశాంతిభూత మిట్లు నర్తించుట, సైఁపలేము విలయ మోపలేము
సర్వసమత గఱచి సర్వోదయమ్మును, వలచినపుడె దీని వంపఁగలము 26

గీ. హరిజనులు బ్రాహ్మణులు మిత్రు లైననాఁడు, హస్తిన కరాచి చుట్టము లైన వేళ
నమెరికారషియాస్పర్ధ లణఁగినపుడు, లోకమున శాంతి యొదవు నస్తోక మగుచు 27

ఆ. ఇరుగుపొరుగువారియెడఁ గూర్మిఁ జూపని, మనుజుదెసకు వేల్పుమమత రాదు
పరులతప్పు నోర్చు నెఱి లేని మానవు, నెగ్గు లెట్లు సైఁచు నీశ్వరుండు 28

గీ. ఆలుబిడ్డలఁ జట్టాల ననుగుఁ జెలుల, నరుఁడు ప్రేమింప నేర్చె నీనాఁటివఱకు
నూరఁ గలవారి నందఱి గారవించు, తెలివి నిఁక నభ్యసింపఁగావలయు నతఁడు 29

ఆ. ప్రేమకొలఁది సుఖము పెరుఁగును దేహికిఁ, బిండికొలఁదిరొట్టె పెరుఁగునట్లు
ప్రేమ నాఁపరాదు పెనువాఁగువలె నది, సాగవలయు దిశల కేగవలయు 30

ఆ. నిలిచి యున్ననీరు మలినమై రోగాలఁ, దెచ్చిపెట్టు వెతల రెచ్చఁగొట్టు
నాఁగి యున్నప్రేమ మది కామమై విష, యాళిదెసకుఁ బఱచు నవనిఁ జెఱచు 31

గీ. ప్రేమగలచోట నీరస పెరుఁగబోదు, ప్రేమగలచోటఁ గత్తి కన్పింపఁబోదు
ప్రేమగలచోట నాఁకటిపీడ లేదు, ప్రేమగలచోటఁ బ్రాణి కేభీతి లేదు 32

క. ప్రతిహృదయమ్మునఁ బ్రేమా, మృతవాహిని పొంగవలయు నీయుగమునకున్
గతి ప్రేమ సుండీ! లోక, స్థితి కోరినవారు దీని సేవింపవలెన్ 33

క. ప్రేమార్చకు లగుట యనన్, రామార్చకు లగుట యిహపరమ్ముల శాంతి
శ్రీమంతు లగుట విగత, వ్యామోహులు పాత్రు లీమహత్త గడింపన్ 34

## చట్టములు

ఆ. కసటుకంపు లేక గరగరయై మేలి, తియ్యమునకు నిండునెయ్యమునకు
విడుపులేని మేటివిడిదియై రాణించు, నెడఁద గాక ప్రజల నేది దిద్దు? 35

ఆ. చట్టములు సృజించి జనతను సవరింపఁ, గడఁగువారు తెలివిసెడినవారు
చట్టమనిన మందుపట్టు సుమా! దానఁ, బుండు మానుఁగాని పోదు తెగులు 36

క. నెత్తుటిలోఁ దెగు లుండఁగ, రిత్తకురిత్తలు గదా! శరీరచికిత్సల్
మెత్తనిపూఁతలకుం గల, పెత్తన మది యెంత రోగబీజము నణఁపన్ 37

ఆ. పూఁతకతనఁ బుండు పోయినట్లే పోయి, వెండియును జనించు నొండుచోట
వ్రణము నుక్కడంపవలెనన్న లోనికి, మందు నంపవలయు మంచి వెజ్జు 38

క. చిత్త మపవిత్ర మగుచోఁ, గుత్తుక రుదురాకదండ కూర్చునె ముక్తిన్
బత్తి వలెఁ గాని వేసపు, గత్తర లవి యేల మోక్షకాముకమతికిన్ 39

గీ. ప్రేమఝరి పొంగిపొంగి పింపిళ్ళుగునిసి, కర్షకులఁ గార్మికుల దిద్దఁగలదు గాని
శాసనము వచ్చి పార్థివసమత దెచ్చి, గ్రామమును దేర్చు ననుమాట గాలిమాట 40

## వర్తకులకు

క. బేరమునకు సూనృతమా, ధారము; సత్యవ్రతమ్ము దప్పనియెడ బే
హోరియును ముక్తి నందు ను, దారతపోధ్యయనధర్మతత్పరుభంగిన్ 41

గీ. సత్యనిష్ఠ దురాశాప్రసక్తిలేమి, కరుణ మున్నగు సద్గుణోత్కరము వైశ్య
వృత్తి కిట జీవగఱ్ఱలై వెలయుకతన, బేర మొకధర్మమై స్మృతిప్రియత నందె 42

క. కరుణాప్రేరితులై మన, ధరణిని మాంసాశనమ్ము తగ దన్న మహా
పురుషులలో వైశ్యులు పె, క్కురు కల రీతెగువ మెచ్చుకొనవలయుఁ గదా! 43

క. ఐనను మానవసంఘము, లో నిర్దయ పెరుఁగుచుంట లోకముతోపా
టీనాఁడు వణిజులందును, గానంబడుఁ గరుణలేమి కడునింద్యంబై 44

ఆ. అగునుగాక! వీరియాత్మలోఁ గృపయును, గలదు కొంత కొంత కలదు మిగిలి
మనవణిక్కులట్లు కనికరమున్ జూపు, బేరులొండుచోట లేరు లేరు 45

గీ. కలరు నిర్మాణకుశలత గన్నబచ్చు, లితరభూముల; నీకుశలతయు దయయుఁ
గలవణిక్కులు మనభూమిఁ గలరు; ప్రజకు, వీర లెనలేనిమేలు గావింపఁగలరు 46

ఆ. కనికరించు టలఁతి గా; దైనఁ గరుణలోఁ, గొదవపడినజాతి బ్రదుకలేదు
రోగి నెవఁడు తేర్చు రోదించుసైనికు, గాయ మెవఁడు కడుగుఁ గరుణ సెడిన 47

క. అనుకంప లుప్త మగుచో, మనుజుని జీవనమునందు మాధుర్యము లే;
దనవధికదయాఖనిఁగా, మనపెద్దలు మెచ్చి రీశుమంగళమూర్తిన్ 48

ఆ. నరుఁడు కొల్వఁదగిన పరమోత్తమగుణమ్ము, కరుణ యనఁగఁ జెల్లుఁ గాని నేఁడు
కరుణ దాసి యయ్యెఁ గటకటా! జగతికి, రాణి యగుచు శక్తి రాణకెక్కె 49

ఆ. ఏ ప్రభుత్వమైన నీనాఁడు నిజదేశ, పటుత వలచి దృష్టి పఱుపుపట్ల
దయను బెంపుసేయఁ దలఁపదు సైనిక, బలము నుద్ధరింపఁ దలఁచుఁ గాని 50

క. తనరాజ్యమ్మునఁ గరుణకు, ననవద్యస్థాన మున్నయపు దుర్వికి నె
ల్లను శాంతి లభించుఁ గదా!, కనికరము జగజ్జయాదికారణము కదా! 51

ఆ. రాచతికములం దొకటియు, నీచక్కనిబాట కేగ దీర్ఘ్యాదు లెదన్
గ్రాఁచుట నస్త్రపిశాచీ, నీచపదారాధనమ్ము నెఱపన్ దివురున్ 52

ఆ. నరుఁడు కరుణ కెంత కరఁగునో తెలియని, గుట్టు కాదు; నేఁడు కోట్లకొలఁది
ప్రజలు క్రీస్తు నేల భావింత్రు గౌతమ, బుద్ధు నేల తలఁచి పొగడుచుంద్రు 53

క. కారుణ్యమూర్తి బుద్ధుఁడు, మారాజ్యమునందె పుట్టి మనుజుల కెల్లన్
దారకము నేర్పెనని మన, వారలు గర్వింత్రు వాదవాదలయందున్ 54

క. సత్య మిట్టిది యైనను శక్తి కగ్ర, పీఠ మిడి నేఁడు మ్రొక్కులు పెట్టుచుంద్రు
కరుణ వైయక్తికోన్నతికారణ మఁట!, శక్తి సామాజికోన్నతిసాధన మఁట! 55

ఆ. ఎంతపడిన విశ్వశాంతి రాదయ్యె నీ, శక్తికతన స్వార్థభక్తికతన
బుద్ధిమంతులెల్లఁ బూని పట్టాభిషే, కము నొనర్పవలయుఁ గరుణ కిపుడు 56

ఆ. దయకు లొంగిలొంగి దాసానుదాసులై, మాంసభక్షణంబు మానుకొన్న
వలఁతు లిచటి వర్తకులు గాక యిం కెవ్వ, రర్హు లిట్టిశాంతియజ్ఞమునకు? 57

ఆ. నిక్క మిట్టు లుండ నేఁటివర్తకు లాత్మ, రక్షకొఱకు శస్త్రశిక్ష గన్న
భటుని బెంచుకొంద్రు పవలింటినిద్రతో, నెలమిలేనిబ్రదుకు నీడ్చుచుంద్రు 58

క. దయగలవారికి నీ య, త్యయ మేల జనించె వీరిదయ లవమాత్రం
బయి పుట్టిన దీ దుస్థితి, దయాళువులపట్ల నిట్టిదందడి యగునే 59

క. అక్కటిక మున్నవానికి, నక్కఱలే దెట్టివెఱయు నాతనిబ్రదుకున్
రొక్కము నెవరున్ జెఱుపరు, మక్కువపడి జగము వానిమంచికె పెనఁగున్ 60

క. చీఁకటి వెన్నెల బాటల, రూకల నార్జించి నూఱురూప్యమ్ములలో
నేకాంశ మర్థి కిచ్చిన, లోకంబిది చూచి తృప్తిలో మున్గునొకో! 61

క. వెచ్చమునకు నంగడిదెస, వచ్చినపసిపాప నైన వంచించుటకున్
జొచ్చెదు బచ్చులు గలమహి, కుచ్చైర్దశ యెట్లువచ్చు నూహింపుఁదయా! 62

ఆ. కూలివాఁడు మూఁడుజాలు కష్టించి రూ, పాయ వదయు టేమి పదులు నూర్లు
వేలు వదయు టేమి వేపారి? యీ బేర, మెట్లుతగును ధర్మ మేదియిచట 63

ఆ. పొందవచ్చు బేరి పొట్టకు బట్టకు, వలసినంతలాభ మలసి యలసి
మితిదొఱంగి వణిజుఁ డతిసంచయమునకు, మ్రొగ్గరాదు నింద కొగ్గరాదు 64

ఆ. లేదులేదు బేరి కాదర మీనాఁడు, వణిజుఁ డిట్టులగుట వంతగూర్చు
నాతఁ డొక్కతఱి 'మహాజన' పదవాచ్యుఁ, డూరికెల్లఁ బ్రాణ మొక్కనాఁడు 65

ఆ. ఇట్టివాని కేల పట్టిన దీపీడ, దొడ్డవాని కేల దూఱువొడమె
గీత మెచ్చినట్టినీతి కీ యవమతి, యేల వచ్చె భీతి యేల హెచ్చె 66

ఆ. భారతీయవణిజులార! మీరిందు స, మీక్షసేయవలయు నిట్టి పనికిఁ
దగినబుద్ధి మీకు భగవానుఁ డొసఁగె లో, కానుభూతి మీకు నగ్గలంబు 67

గీ. తనియకుఁడు మీర లల్పాల్పదానములను, గునియకుఁడు లక్షలార్జించుకొంటి మనుచు
సిద్ధపడుఁడు కృపామయజీవనమున, కాసచేయుఁడు భయదూర మైనసరణి 68

ఆ. పడవలోని కురలిపడు నీటి నిరుగేల, వెలికిఁ ద్రోయులీల నెలవునందుఁ
గుదురుకొనెడి సొమ్ముకూడ దోసిళ్ళతో, నొరులకిచ్చి యింటి నోమవలయు 69

ఆ. ఆటబంతి నందినంతనే తన్నిన, పగిదిఁ దన్నవలయుఁ బసిఁడి నైన
నపుడు సంఘదేహమం దది సొచ్చు స, మాజమునకు నపుడు తేజు వచ్చు 70

ఆ. ధర్మనిష్ఠ మీ కు దాత్తమైకలదు మీ, మంచితనము నెల్లఁ బంచిపెట్టి
లోకశాంతి గూర్పఁ డీకొనుఁడీ ప్రజా సేవనమున కన్యచింత విడిచి 71

క. రందు ప్రజామధ్యస్థలి, కిందు ప్రజాసేవ కాత్మ నిం దాహుతియై
పొం దివ్విధి బలివోయిన, దండి మగం డొకఁడు భారతక్షితిఁ బుట్టెన్ 72

గీ. అతఁడు మీవాఁడె వానిమహత్వమెంచి, శిరము వంపనివార లీధరణి లేరు
పుట్టినది మొద లాప్రాణి గిట్టుదనుక, మదిని దనవైశ్యధర్మంబు మఱవలేదు 73

గీ. అతఁడు గోసేవ గావించె ముతుకబట్ట, నాదరించెను దో లూని యారె పట్టె
మలము నెత్తెను మాలకు మాల వైచె, నార్తులకు నండదండగా నారటించె 74

గీ. అతఁడు కరుణామయుండుగా నవధరించి, నట్టిచేఁతలు వేనవే; లతని మించు
వాఁడు మానవకోటిలో లేఁడు నేఁడు, పిలుచుచున్నాఁడ నాతనిపేర మిమ్ము 75

గీ. అతఁడు గాంధిమహాత్ముఁ డాయన్నవోలె, మీరు కరుణావిధేయులై మెలఁగవలయు
సంఘసేవకు మీదయాచతురతలను, ధారవోయంగవలయు నుదారబుద్ధి 76

క. వైయక్తిక సామాజిక, ధీ యపు దేర్పడదు గుండెదిగు లన్నది లే
కీ యవనీరాజ్యము సు, శ్రేయోరాజ్యమ్ముగాఁ బ్రసిద్ధి వహించున్ 77

క. వినుఁ డెన్నఁటికే నిచటన, యనుకంపారాజ్యతంత్ర మారబ్ధ మగున్
ఘనతరసామ్రాజ్యమ్ములఁ, దృణముంబలెఁ దన్నిపోయి రిచ్చటివారల్ 78

క. ఈనేల సామ్యవాదము, నౌ నని దొరతనమువార లాదృతిసేయన్
రానేరదు కరుణామయు, లైనవణిక్కులకు భీతి యపు డించుకయున్ 79

గీ. సంఘసేవకె బేరముల్ జరుపువారు, భోగములచెంత కేనాఁడుఁ బోనివారు
రవ్వరవ్వకు లెక్కలు వ్రాయువారు, భయముపడనేల ప్రజలకై బడలువారు 80

క. ఓసాహులార! నే నిపు, డాసేతుహిమాచలమ్ము నలయక చనుచున్
భూసంపద నర్థించెద, నా సంప్రార్థనము దినదినమ్ము ఫలింపన్ 81

క. ఇచ్చిరి భూస్వాములు పొల, మిచ్చెద నీపొలము పేద కిది నవరింపన్
వెచ్చింపుఁడు మీవిత్తము, పచ్చనిపై రపుడు విరిసి పంటలు పండున్ 82

ఆ. ఒడ్డెవాండ్రఁ బిల్వఁ దోయన్నలార! నాఁ, గేలు బండి గిత్త గేదె గాదె
పాఱ పలుగు మోకు పగ్గాలు విత్తనాల్, కొనుఁడు పేద నాదుకొనుఁ డొసంగి 83

క. నాపని భూమి గడించుట, మీపని సవరింతసేఁత మీ రిందులకై
యేపూఁట వత్తురా యని, చూపెల్లన్ బఱపి మిమ్ముఁ జూచుచునుందున్ 84

క. నాతో స్పర్ధకు రం డిఁక, మీతలఁ పీధర్మనిష్ఠ మే లన్నతతిన్
భూతల మెల్లను గరుణా, కేతనములనీడఁ జెమ్మగిలి చిగురించున్ 85

# మనుష్యజన్మము

గీ. ప్రాణి పలుపుట్టువుల దస్సి పడసినట్టి, సుకృత ముండినఁ గాక యూరక మనుష్య
జన్మము గడింప దని ధర్మశాస్త్ర మనుట, నిక్క మగుమాట చొక్కమౌనిర్ణయంబు 86

గీ. మానవేతరజంతుసమాజ మెల్ల, ప్రొద్దు లారాటపడుఁ దనపొట్టకొఱకు
స్వార్థమే తక్క నన్యప్రసక్తి లేని, మూఁక యిది; దీన నుర్వి కేమోక్ష మొఱగు 87

క. మనుజుండును దనతిండికి, ననుదిన మల్లాడుఁ గాని యతఁ డొక్కొకచో
దనపొట్ట గట్టుకొని య, న్యుని యాఁకటిమంట లార్పి యుల్లాసపడున్ 88

క. పసరమ్మున కీభోగము, వసపడునా? చావనున్న వానికిఁ బ్రాపై
యసు విడి నరుండు గను సం, తసమునకున్ జాలుసుఖము ధరణిన్ గలదా 89

ఆ. పశుత పాపకర్మఫలమును గుడువంగ, సురత పుణ్యకర్మసుఖము నందఁ
బొసఁగినట్టి పుట్టువులు; పురుషార్థసం, పాదనమున కిందుఁ బట్టు లేదు 90

గీ. ఒక్కనరతయ పో! కర్మయోగమునకు, నర్హ, మిది పాపపుణ్యఫలానుభూతి
కబ్బినభవమ్ముగా; దార్తి నణఁగువాని, సేవ గావింపఁగా లభించినది గాని 91

క. కాననఁ గడుదుర్లభ మీ, మానవజన్మంబు; దీని మన మందియు న
జ్ఞానమ్మునఁ బశువుల చం, దానన్ జరియింతు; మెంత తగు నిది? సెపుఁడీ 92

ఆ. పరులగోడు సుంత పట్టించుకొననిచో, శాంతిలేదు మనకు నింత యైన;
వినుఁడు! తమ్ములార! విశ్వహితార్థు లై, మనుఁడు మంచిబాటఁ గనుఁడు చనుఁడు 93

గీ. ఇదియె సర్వోదయంబు నా నెసఁగు; దీని, నాదరింపుఁడు! లోకసేవానురక్తి
నభ్యసింపుఁడు! సార్థక మగు నరత్వ, మలవఱుచుకొండు! లెండు! మీ కపుడె ముక్తి 94

# కవులు

ఆ. ప్రజల మేలుగీళ్ళఁ బాల్గొనువారికే, భావనాబలమ్ము బలసియుంటఁ
బంటకాఁపు చేతిపనివాఁడు బైరాగి, తక్క నొరుఁడు పల్కఁదగఁడు కైత 95

క. రచయితజీవితనిష్ఠను, బ్రచురించును వాక్కు; బ్రదుకుపల్కులు రవియున్
రుచియుంబలె నొండొంటికి, నుచితాశ్రయ మగుచునుండు నుదుగనిమైత్రిన్ 96

ఆ. సంఘమునకుఁ బుష్టి సంతుష్టి నొదవించు, వెలఁదిపల్కు వాదవలయుఁ గృతులఁ
జిత్తశుద్ధి తపము జిజ్ఞాస నేర్వని, కవి కుదాత్తవాణి కానఁబడదు 97

క ఉదయార్కరుచులు విహగీ, మృదుగానమ్ములును జనుల మేల్కొల్పునటుల్
సదమలసాహితియుం బ్రజ, నిదురన్ దొలఁగించి ధర్మనిష్ఠను గఱపున్ 98

గీ. అము విడనాడి వెదురుత్రుం పైనకవికి, నాశ్రయ మొసంగు భగవానుఁ డాదరమున;
నతని మురళిని జేసి బ్రహ్మాండమెల్లఁ, దనియుచందాన మధురగీతములు పాడు 99

గీ. నియమబద్ధము మధురమ్ము నిపుణ మైన, పలుకుతో సాహితీసృష్టి నలుపవలయు
రాగరోషాదిదుర్వికారములు లేని, కవులకే తోఁచు నిట్టి చక్కనివచస్సు 100

క. తక్కినపెం పెటు లున్నను, నిక్కముపైఁ గవికి దృష్టి నిష్ఠయు వలయున్
టక్కరి కవితా రచనకు, మక్కువపడుఁ గాక లోకమాన్యుం డగునా 101

క. మది వేఱు మాట వేఱై, బ్రదు కీడ్చు పిసాళిపల్కు పసలేని దగున్
బదిమందిని గదలించెడి, చదు రానుడి కబ్బు దెంతసంకటపడినన్ 102

క. త్రికరణశౌచశ్రీ లే, ని కవులు వత్రంబు లెన్ని నింపిన నేమౌ
నకలంకము కవితారస, మొకబిందువుపాటి యైన నూరద యందున్ 103

గీ. వెజ్జుకడ రోగి తనతప్పు లుజ్జగింప, కెల్లయును దెల్పురీతి సాహిత్యకర్త
యీశ్వరప్రతిబింబ మౌ నీప్రజాళి, యెదుటఁ బ్రకటింపవలె సత్య మెట్టిదైన 104

క. అది కావ్యం బది సాహితి, యెది కవియాత్మానుభూతి నెనసినవర్గం
బది ప్రాణికిన్ బవిత్రతఁ, గదియించుఁ గరంచు నది జగంబులనెల్లన్ 105

క సామాన్యజనులలో నొకఁ, డై మను సాహులకు లొంగఁ దార్తిని సైఁచున్
బ్రేమించు గంజి నైనను, రామునకే మ్రొక్కు సుకవిరా జెల్లపుడున్ 106

క. గిఱిగీచుకొన్నకవికృతి, చిరకాలము నిల్వ; దెల్లసిద్ధాంతములన్
దరియించి విప్లవముదెస, కరిగినకృతి సత్యదర్శియై రాణించున్ 107

ఆ. బరువుఁ జూచి కృతికిఁ బరువు నీకుఁడు; చిన్న, రచన యైన నేమి? రాముఁ దండుఁ
గానిపించునేని మానవు నది తీర్చి, దిద్దునేని దాని కుద్ది లేదు 108

ఆ. ఈవికతన నేఁడు జీవితానంద మే, ర్పడును గాన నెవని బ్రదుకునందు
నివ్వటిల్లుచుండు నిర్భరత్యాగ మా, తనికవిత్వమునకుఁ దనియు జగము 109

గీ. ఒకనివాంఛకు నొకనియాజ్ఞకును లొంగి, కలము సారింప నొల్లఁడు కవివరుండు
నిదురయును మెచ్చుఁ దాతఁడు హృదయవీణ, కదలినపుడెల్ల నమరమౌ కవితఁ బల్కు110

గీ. సిరుల కమ్ముడుపోక యీశ్వరుని నమ్మి, నిలిచిన కవీంద్రులే మాననీయదీప్తి
నిడి రయా భారతీయసాహిత్యమునకుఁ, బోతరాజాదు లీకోవఁ బుట్టినారు 111

గీ. అన్నలార! మహీదానయజ్ఞవిజయ, మాసచేయుద మది కృత్యమని కవీంద్రుఁ
డొకఁడు భాషించెనా తన్మహోక్తి జనుల, మెప్పు గనితీరు నవయుగ మప్పు డొదవు112

# కదంబము

ఆ. సైఁపఁజాల నేఁటి సంఘవ్యవస్థ; నీ, యవని రామరాజ్య మమరవలయు
నపుడు రాజు రాముఁ డఖిలప్రజాళియు, రాముఁ డుర్వియెల్ల రామమయమె 113

ఆ. దొంగతనమువంటిదోసమపో! సిరిన్, గూడఁబెట్టి దాఁచుకొనుటసైత
మిది యకృత్య మనుచు నిపుడు గాకున్న రే, పైన లోక మొప్పు నని తలంతు 114

గీ. అడుగు మని నన్నుఁ బ్రేరేచినట్టివేల్పె, యి మ్మనుచు నన్యుఁ బురికొల్పు కేలమాను
బిడ్డ కాఁకలి పెట్టినదొడ్డదేవుఁ, డమ్మతొమ్మున నూరింపఁడా పయస్సు 115

ఆ. దీనజనులు దేవదేవుపాదము లౌట, నార్తసేవఁ బండినట్టిసుజను
లందఁగలరు భగవదంఘ్రిద్వయమ్మును, బట్టి మోఁకతిల్లి పదయుఫలము 116

క. ఈపేదలు మనవేల్పులు, పాపము! వీ రెండి తడిసి వస్తుంది జగం
బాపోవఁ గూడుపెట్టెద, రోపికలో వీరి కుద్ది యుందర యెవరున్ 117

క. పిల్లలు రక్షించెద రని, తల్లి నిరీక్షించు నవ్విధమ్మున మీపై
నుల్లము నిడుకొని కాలము, చెల్లింతురు వీరు జాగుసేయకుఁడు దొరల్! 118

గీ. తడసిన మీదోసము వే, మడుఁగు లగున్ విలయవహ్ని మార్గొను మిమ్మున్
నడిచి నడిచి వచ్చితి మీ, యెదఁదన్ నిదురించునీశు హెచ్చరికింపన్ 119

ఆ. బాపు లేమి నిపుడు బయటికి వచ్చితి, నేతఁ గాను మీకు నేను భటుఁడ
మ్రొక్కుచుంటి భక్తిముగ్ధుఁడనై గుణ, భద్రులార! మత్సపర్య గొనుఁడు 120

ఆ. ప్రేమ పెరుఁగుఁ దెలివి పెరుఁగు నాయుష్యమ్ము, పెరుఁగుఁ బాదయాత్ర జరుపువేళ
నడువ కుండువాఁడు నలువదియేండ్లకే, తాత యౌను లేక ప్రేత యౌను 121

క. పదయాత్ర శంకరాదులు, మది మెచ్చినయాత్ర జనులమనముల కింపున్
గదియించుయాత్ర దీనిని, వదలన్ భావప్రచార వరసాధనమున్ 122

గీ. నిదురఁ గలి నుండు సెజ్జను వదలి కూరు, చున్నచో ద్వాపరమ్మున నుండు నరుఁడు
నిలిచెనా త్రేత నుండు నజ్జలు కదల్చి, త్రోవఁ జనువేళ నతఁ డుండుఁ దొలియుగాన 123

క. ఏనాఁ డపరిగ్రహమును, మానెన్ బాపఁడు తదీయమహిమము సర్వం
బానాఁడె సమసెఁ బ్రాజ్ఞుఁడు, కానీ కెగఁబడిననాఁడు కలఁచున్ బ్రజలన్ 124

క. సుదతులు శూద్రులు వేదము, చదువం జన దనెడిపల్కు సైఁపను, నాకున్
జదు రున్నది శ్రుతివిద్యన్, మది యున్నది దీని నేర్పి మనుజులఁ దీర్పన్ 125

ఆ. అతివయందుఁ బురుషునందు నాత్మ యొకండె, నిలుచు నన్నమాట నిక్క మౌట
బ్రహ్మచర్యదీక్ష పాటింపవచ్చును, సంన్యసింపఁదగును జాన యైన 126

క. దేవుఁడు కలఁ డని నమ్మక, పోవచ్చు నొకండు వాఁడు భూతహితమ్మున్
భావించిన సత్యముతో, జీవించినఁ జాలుఁ బెద్దచేసెద నతనిన్ 127

ఆ. నరున కున్న చేవ పరిమిత మౌటచే, నతనిసేవసైత మవధి నుండు
సేవ కెల్ల యుంట చెల్లును గాని భా, వనకు మేర యుంట పనికిరాదు 128

క. ప్రజకెల్ల సేవచేయుట, నిజమునకు నసాధ్య; మైన నిఖిల ప్రజయున్
స్వజనంబ యని తలంచుచుఁ, ద్యజింపవలె నరుఁడు కులమతాదివివక్షన్ 129

గీ. దేహమను గాను నేను సందీప్త మైన, యాత్మ నని నమ్మవలయు దేహమ్ముపట్ల
నాదరము పెట్టునా వైర మవతరించు, ముక్కలై చెక్కలై యాత్మ ముప్పుదెచ్చు 130

గీ. మనకుఁ జేటుగూర్తురు ముసల్మాను లనుచు, హిందువులు జంకెదరు గాని హిందువులకు
దొసఁగు దెచ్చెడివారు హిందువులు గాక, యన్యులుందరు నమ్ముఁడా యస్మదుక్తి 131

క. కులమతభేదమ్ములపై, వల పుంచిన, నంటరానివాఁ డని యొకనిన్
వెలిపెట్టిన మనమే మన, విలయము సృష్టింతు మొరులవెంపర యేలా? 132

క. వెలుపటిదెస మనశత్రులు, కలరా? మనయెడఁదయందె కల రుద్ధతులై,
యిల మనకున్ నెచ్చెలి కా, వలయు ననన్ జెలిమిఁ జూపవలె మన మిలకున్ 133

ఆ. ప్రేమశుకము కలదు మీమదిలో, దీనిఁ, బఱుపకుఁడు కుటుంబపంజరమున;
నిచ్చవచ్చినట్టు లిది తెక్కలాడింప, నిచట నచట నెగుర నియ్యకొనుఁడు 134

క. ఏ నింతదనుక నొకఖలు, నేని విలోకించియెఱుఁగ నిది విని లోక
జ్ఞానం బబ్బని మూర్ఖుని, గా నను మీ రెంతురేని గా దన నొల్లన్ 135

క. నాత్రోల నెవఁడు నిల్చిన, నామానవునందు వేల్పెయగపడు నాకున్
సామాన్యధర్మ మై చన, నామనుజున కంజలించు నస్మత్కరముల్ 136

ఆ. మన కహింస నియతమార్గ మీబాటను, విడువ కుందుమేని పుడమినెల్ల
నెత్తఁగలము మన మహింసాపతాక లా, నుడువు లెడఁద జీల్చి విడుచుచుంటి 137

ఆ. ఏ నలంతివాఁడ నైన నీశుఁడు బుద్ధ, దేవుపనికి నన్నుఁ దెచ్చి నిలిపె
శాక్యమునిపవిత్రచరణాంకముల నాశ్ర, యించి విధిని నిర్వహించువాఁడ 138

ఆ. జలకణమ్ము వార్థిఁ గలసి పయోధియై, యలరుచందమున నహంత విడిచి
నరుఁడు తన్నుఁ దాను మఱచి విశ్వాకారుఁ, డైనవేల్పునందు నణఁగి వెలయు 139

క. చట్టములు కావు ఋషులే, పుట్టింతురు విప్లవమ్ము బుద్ధుఁడు ప్రభుతా
పట్టమును రోసి కావిం, గట్టి కదా క్రాంతి దెచ్చెఁ గనుఁడీ చరితన్ 140

ఆ. మనకు సత్యనిరతి మప్పె రాఘవుఁడు ని, ష్కామ కర్మనిష్ఠ గఱపెఁ గృష్ణుఁ
డార్త లోక సేవ నలవరించెను బుద్ధుఁ, డీ త్రయమ్మె మనల సృష్టిచేసె 141



# పవిత్ర సన్నివేశములు

## నావంతుకూడ

క. చివురించినదెందముతో, నవయుగనిర్మాణదీక్ష నల్గొండమహిన్
బవ లని రే యని చూడక, భువికై భావేమహర్షి పోవం దొడఁగెన్ 1

గీ. నడిచి నడిచి సూర్యాపేఁటనాఁ జెలంగు, వీటికిం జేరె నతఁడు; తద్విజయ మెంచి
వచ్చి రానాఁడు పల్వు రావసుధ నున్న, కార్యకర్తలు యోగిపుంగవుని కడకు 2

ఆ. వారి నాదరించి వలసిన సందేశ, మిచ్చుగురుఁడు తుదకు నిట్లు నుడివెఁ
"దగఁడు కార్యకర్త తనపా లొసంగక, యుర్వి నిం దటంచు నొరుల నడుగ" 3

ఆ. అనిన వెనుక వింజ మాఁ కిడినట్లుగా, నుండె గోష్ఠి; సభ్యు లొకనిమొగము
నొకఁడు చూడఁ దొడఁగి; రెకరాలు పె క్కున్న, వారు గలరు సభను వందమంది 4

క. ముందటి కొకఁ డైనను రాఁ;, దందఱు సందిగ్ధదశకు నగ్గంపడి; రీ
చందము నోర్వంజాలక, మందస్మితమూర్తి యొక్క మానిసి లేచెన్ 5

మంజరీద్విపద :

అతఁ డిట్లు పల్కె "మాయన్నకు నాకు, నిల నాల్గువందలయెకరమ్ము లుండె
నవిభక్త మస్మదీయకుటుంబ; మైన, నాపాలినేలలో నాకొకసగము
తక్కిన సగము భూదానయజ్ఞమున", కనుడు నోలగమెల్ల నమ్లాన మయ్యెఁ
గరతాళరవము లాకసమున కంటెఁ, గార్యకర్తలలోనఁ గదలిక వొడమె
నెవరిభాగము వార లిచ్చిరి పొలము, భావే తపం బిట్లు పంటకు వచ్చె
నౌదార్యలక్ష్మి యి ట్లవతీర్ణ యయ్యె, మొదటితాంబూలంబు ముట్టెఁ గోదండ
రామరెడ్డికి ధర్మరతునకీనాఁడు;, తమ్ముఁ డిమ్మెయి దానతత్పరుఁ డైన
నన్న మిన్నక యుంట యది యెట్లు పొసఁగు, నిరుగూరి కేగిన యితఁ డెల్లసంజ
తతి కిల్లు సేరి సోదరుఁ దోజ దప్పి, సలిపిన పనికి విస్మయమంది కుంది
తేతి భావేసన్నిధికిఁ జేరి మ్రొక్కి, తొనఁకని పల్కులతో నిట్టు లనియె 6

ఆ. "అయ్య! నేఁటిదనుక నఱ లేక యుమ్మడి, బ్రదుకు బ్రదుకుచున్న కుదురు మాది
తమ్ముఁ డొకఁడు కలఁడు తనకు వాఁ డీనాఁడు, నన్ను వేఱుచేసినాఁ డదేమొ 7

క. మాకున్నభూమిలో సగ, మీక సగమ్మున సగంబ యిచ్చె నతం డీ
పోకడ కె ట్లీకొనెనో, నా కిది తుదిలేని వేదనను గూర్చుఁ బ్రభూ!" 8

ఆ. కన్ను లశ్రువారికలుషితములు గొంతు, గద్గదస్వరాతికంపితమ్ము
మొగము విన్నఁ దనపుముయ్యేలగుట్టగా, రడ్డి యిట్లు పల్కి రచ్చ తనియ 9

గీ. దానపత్రము పూరించి తమ్ముఁ డొసఁగి, నంతపుడమి నొసంగె విశ్వానుభూతి
కొను వెఱఁగేమి యొకకొమ్మ కవతరించు, పండ్లలో రుచిభేద మేర్పడుట కలదె 10

క. పురుషోత్తమరెడ్డి యనన్, ధర నితఁ దన్వర్థసంజ్ఞ దనరు నయారే!
చిఱుత కిటు తగినపే రిడు, నెఱి నేర్చినపితరు లర్చనీయులు గారే 11

## భూదానముతో గోదానము

క. ప్రత్యూషం బది; జనతా, నుత్యంచితుఁ డైన మనవినోబా యపు డా
దిత్యపురిన్ దొఱఁగి నిజా, మాత్యులతోఁ బయనమయ్యె మఱియొకదెసకున్ 12

గీ. అంత నొకయింతి వడివడి నరుగుదెంచి, సంయమికి భక్తియుక్తి నంజలిఘటించి
"బాబయా! నిన్న వింటి నీపల్కు నిచట, నది మహేశ్వరవాణిగా నరసికొంటి 13

క. నీ పలుకున్ దలఁ దాల్చుట, పాపంబుల నణఁచుకొంట పరమేశ కృపా
శ్రీ పొందుట మోహాదుల, ఆ పందక సుఖపరంపరను గంట ప్రభూ! 14

ఆ. లోకశాంతికొఱకు నేకైకమార్గమ్ము, సూచినట్టి దివ్యరోచి వీవు
ఋషుల సుకృత మెల్ల నీవుగా భారత, భూమి నిపుడు వెలసెరా మహాత్మా! 15

ఆ. ఏను బిడ్డలున్నదాన రెండెకరాల, పొలమె కలదు నాకు నలఘుచరిత!
యొక్కయెకర మిచ్చి మ్రొక్కి పో వచ్చితి, నల్పదాన మనక యందుకొనవె! 16

ఆ. ఈదానమునకు బాసట, గోదానము నాచరింపఁ గోరికవడితిన్
లేదూడతల్లి యీగవి, సాదులలో సా"దనెన్ బ్రసాద మొసంగన్ 17

ఆ. యోగి కనుల నశ్రు లురలంగఁ బొరలంగ, నెలుఁగు రాల్పడంగ నిట్టు లనియె
"నింతపేదరాలియీవి పెద్దలఁ గరఁ, గించి తీరు జయము నించి తీరు" 18

## పగ తెగుట

క. తంగెళ్లపల్లి యను నూ, రం గలసోదరుల కిద్దఱకుఁ బో రాదవెన్
మ్రింగె నిది పల్లెనెల్లను, బ్రుంగిరి ప్రజ లిందు రెండుపోకలవారై 19

క. ఒక వర్గమువారిమొగం, బొకవర్గమువారు చూడ నొల్లరు తలఁపుల్
తెకతెక మనఁగా నెయ్యము, లుకలుక మని నరత లోఁతులోఁతుల నొదిఁగెన్ 20

గీ. తమ్ముఁ డింటిని గాదు గ్రామమ్మె వీడి, బ్రదుకుచున్నాఁడు పెఱవారిపంచలందు
నతఁడు తనయింట భావేమహర్షి విడిసి, యుంట విని నిలుపోపక యూరుసేరె 21

క. మీబెడఁద లెట్టివో యని, బాబా ప్రజ నడిగె "నేమిపల్కెదము ప్రభూ!
మాబ్రదుకు లీరసం బను, నూబిం బడి క్రుళ్ళుచుండె నుస్సురు మనుచున్ 22

క. ఈసోదరుల విరోధమె, మాసంసారముల కెక్కె మ మ్మీగతి నా
యాసంపెట్టెడి నీపగ, మాసినచో మావిపత్తు మటుమాయ మగున్" 23

గీ. జానపదు లిట్లు సెప్పిరి; మ్లాన వినత, వదను లైరి సహోదరుల్; వారిఁ జూచి
యోగిచంద్రుఁడు "వింటిరే! యూరివారి, పలుకు? మీ రింతపెదదారిఁబడితిరేమి? 24

క. పగ పగతోఁ జావ దయా!, పగ నణఁచెడిమందు మిత్రభావంబ చుఁడీ!
పగ పెరిఁగినఁ దెగ విఱుగున్, బగ యెంతటిచెట్ట కైనఁ బ్రాపై నిలుచున్ 25

గీ. బాపురే! యొకనెత్తురు పంచుకొన్న, వారుగద మీరు మీ కింతవైమనస్య
మున్న నెందఱుతల్లులో కన్న కోట్ల, కొలఁదిబిడ్డలు మనెదరా కలిసిమెలసి 26

ఆ. మైత్రి లేనినాఁడు మహి నిల్చునా జగత్, ప్రళయహేతువైన పగను వదలుఁ
దన్నలార! సుప్రసన్నులు కందు మీ, చెలిమికై నిరీక్షసేయు నూరు" 27

ఆ. అనుడు నన్నదమ్ము లార్ద్రమనస్కులై, తేఱుకొనిరి మేలు తెలిసికొనిరి
యొకనిప్రక్క నొకఁడు సుకముగాఁ గూర్చుండి, ప్రన్నప్రన్నఁ దినిరి బంతిబువ్వ 28

ఆ. వేల్పుపాట సాగువేళ నిద్దఱు బిగ్గఁ, గౌగిలించుకొనిరి కనులు తడియ
నేమి సెప్పువాఁడ భీమజరాసంధు, లెలసి రామలక్ష్మణులుగ నైరి 29

క. ఇద్దఱు భావేగురునకుఁ, బెద్దయు భూదాన మిడిరి పెం పిది గని యూ
రద్దిర! తపోబలమ్మున, కుద్ది గలదె యని నిరంతరోత్సవ మయ్యెన్ 30

## ఆఱవకొడుకు

క. భూదాన హోమ ధూమ, ప్రాదుర్భూతములు సురభిపవనమ్ములు స
ర్వోదయమూలము లల్లన, రాఁదొడఁగెన్ దెలుఁగునుర్వరకు నల్గడకున్ 31

ఆ. చిన్నపల్లెఁ జేరె శ్రీ వినోబా నల్ల, గొండ నాఁ జెలంగుమండలమున
నతఁడు తెల్గునంద యాయూరివారితో, ముచ్చటింప సాగె ముద్దులొలుక 32

క. ఒక హాలికుఁ గన్గొని నీ, కెకరా లేపాటి యుండె నెఱిఁగింపు మనెన్
బ్రకటించెఁ దొమ్మి దని సే, ద్యకాఁడు; భూదాన మిడితివా? యనె భావే 33

ఆ. నవ్వినవ్వి కాఁపు నా కాస్తి యలఁతిగా, నుండెఁ గొడుకు లేవు రుదితులైరి
లెక్కచూడ వీరి కొక్కొక్కనికి నెక, రాలు రెండుకూడ రావు రావు 34

ఆ. ఇట్టిపేదవాఁడ నే నేడ భూదాన, మేడ; మేడ లున్న యీడువలును
బాడువలును బల్లెపల్లెలో నున్న యా, దొరలుగాక యీవి కొరులు తగరు 35

మంజరీద్విపద :

అని పల్క భావేమహర్షి యి ట్లనియె, "నోతమ్ముఁడా! విను మొకమాట భగవ
దనుకంపమై నీకు నాఱవకొడుకు, జనియించు ననుకొమ్ము జనియించినప్పు
డేమిచేసెదవు 'నీ వింతగా మసలి, పుట్టినాఁడ విదేమి? బుడుతఁడా! నీకు
నాయిచ్చుసిరి లేదు నా నేలయెల్ల, మున్నె భాగించితి ముష్టించెం బూని
పోవోయి! బయటికిఁ బోవోయి!' యనుచు, వెదలింతువా బాలు వేశ్మమునుండి
యదలింతువా పాప నర్మిలి వీడి, చెప్పు ముత్తరము నా చెవులు వేచినవి" 36

ఆ. హలికుఁ డంతఁ బచ్చి వెలగఁ దిన్నట్టులై, కలఁగి నలఁగి హస్తములు మొగిడ్చి
"యుజ్జగింపఁ జాల నున్నంతలో వాని, కింతపాలు పంచి యిత్తు" ననియె 37

క. ఆయెడ భావే యిట్లను "నా యాఱవబిడ్డ నేన యనుకొ మ్మిఁక నా
దాయము నా కి" మ్మన రై, తా యనఘునిమోము తెప్పలార్పక చూచెన్ 38

ఆ. అతని కా మొగమ్మునన్ దనకొమరుఁడే, తోఁచినాఁడొ వేల్పె పూచినాఁడొ
జంకు గొంకు లేక షష్ఠభాగము సమ, ర్పించె యతికి సభ చలించి మెచ్చ 39

## రాష్ట్రపతి దీవన

క. బాపూజీస్మృతిచిహ్నా, స్తూపము యమునాతరంగతోయార్ద్రము ని
ష్పాప మగు రాజఘట్టము, బ్రాపించె మహామహుండు భావే నియతిన్ 40

క. రాజర్షి రాష్ట్రపతి శ్రీ, రాజేంద్రుఁడు వినయమూర్తి రమణీయోక్తి
భ్రాజితసత్కృతిపత్రము, నా జగదాచార్యమౌళి కర్పణచేసెన్ 41

గీ. అది యఖండభారతార్పితసమ్మాన, మది సమస్తభారతాంతరంగ
మది గ్రహించి యోగి మృదువాక్యముల మహీ, దానతత్త్వమెల్లఁ దెచ్చె నపుడు 42

ఆ. "భూమి లేదు నాకు బుదుతలపాలింటఁ, గలదు కొంత, మీకు వలసినంత
వుచ్చుకొనుఁడు దానఁ, బుత్రులు మీకడ్డు, పల్క" రనియె రాష్ట్రపతి కరంగి 43

క. ఆదానం బాదీవన, యాదేశము కాదె భారతావని కెల్లన్
దాదృశగౌరవ మందిన, సాదువినోబాజయంబు సందిగ్ధ మొకో? 44

## మంచిమేల్కొన్నది

గీ. అది గయామండలమ్మునం దలరు పల్లె, యచటు చిన్నజమీన్దారు నాటపట్టు
వచ్చె నట కెండవానల వండ కోర్చి, పేద కాదరువైన భావేదళమ్ము 45

క. ఆదొరయాదరమున్ గని, భూదానము నడుగ మనసు పుట్టిన తత్స
ర్వోదయ సమాజసభ్యుల, కాదట నిట్లనిరి యూరియందలి మిత్రుల్ 46

క. "ఈతేఁడు తులువతనమున, నీరేడుజగాల గెల్చు; నిఁక వీని కిసీ
మైరేయమె యాహారము, వారనిజూదంబె వీనివలపై నడుచున్ 47

గీ. మీరు కా దెవ్వరైన నీక్రూరునదత, మార్పఁ జాలరు వీఁ డొకమనిసి కాఁడు
రిత్తపని యేల వీని దర్శించు టుడిగి, తరలుఁడీ వేగ వేతొక దారిఁ బట్టి" 48

గీ. కార్యకర్తలచేతులు కాళ్ళు చల్ల, పడియె నాసామికొఱగాని బ్రదుకు వినఁగ
నాత్మబల మేచి యున్న యుదాత్తచరిత, విమల యొక్కర్తుకయె పట్టు విడువదాయె 49

మం. ఆయమ్మ దరహాస మలర నెయ్యురను, గని పల్కు "నన్నలు! కనుఁడు సత్యమ్ము
బదలి మానవులలో భగవానుఁ జూడఁ, దలఁచి పైనించుసాధకులము మనము
పరమేశ్వరప్రేమ ప్రాప్తించుదనుక, జగదీశుపుణ్యదర్శన మబ్బుదనుక
గుడి వీడి వెలికి నేగుట పాడియౌనె?, మతిమాలి నిస్పృహ మరగుట తగునె?
మనవినోబాయుద్యమము నవ్వులాట, వంటిదా? యలఁతులవంటిదా? చెపుఁడు
తులలేని లోఁతులోఁతులఁ బాదుకొన్న, మానవతానిష్ఠ మనమూలబంధ;
మానిష్ఠ గల ప్రజ నీక్షింపకున్న, నీ నిష్ఠ గల క్రాంతి నీక్షింపకున్న
మన కేమి ఫలమయా మనకేమి బలము?, మనజన్మమున కబ్బు మాన్యత యేమి?" 50

గీ. ఎంత సెప్పిననేమి యాయింతిమాట, మెచ్చులేక మిత్రులు పొలమేర దాఁటి;
రొక్క విమలయె రవి సెగల్ క్రక్కువేళ, రాజభవనమ్ము సేరె ధీరత వెలుంగ 51

గీ. పంచలోఁ గూర్కుచున్నాఁడు ప్రభువు; తలుపు, నటునిటున్ గదలించె నాయతివమిన్న
యదరిపడి రాయఁ"డెవరువా?"రనుచు నార్చె, "నేను మీచెల్లెల" నటంచు నెలఁత నుడివె 52

క. చెల్లె లనుమాట వినుటనె, త్రుళ్ళిపడెన్ రాజు వెట్టితో నెవ్వతయే
నిల్లుం ద్రొక్కెనె యని మది, కల్లోలమువోలెఁ గదలఁ గాతియచెందెన్ 53

గీ. అంత విమలను జూచి యీయింతి యిచటి, కెట్లు రానేర్చుఁ గారణమేమి దీని
రాకద; కటంచు గొణఁగి యారామ నవల, హెచ్చరించుచు నీరీతి నుచ్చరించె 54

గీ. 'ఏను దుష్టుఁడ నూరెల్ల నెఱుఁగు నన్ను, నొక్కఁడును జెప్పలేదె నాయోజ నీకు
మంచివారికి నావంటి క్రించుతోడ, నేమిపనివచ్చు నీవు రానేల యిటకు 55

క. అదిగాక నీవు చక్కని, సుదతివి జవ్వనపుఁబెంపుసొంపులు నీలోఁ
గుదురుకొనియుండె నీ వీ, సదనము వేవేగ వీడి చను టొప్పుఁ జుమీ! 56

ఆ. అపుడు విమల పల్కె "నన్నయా! నాకు నీ, దుష్టమైనవృత్తితోఁ బనేమి?
ఒక్కమాట కొసఁగు ముత్తరమును నీకుఁ, దల్లిలేదె? చిట్టిచెల్లి లేదె? 57

క. ఆతల్లికి నాచెల్లెలి, కీతావు స్పృశింపరాని దెట్లగు? భక్తిన్
బ్రీతిన్ వారలఁ గనవా?, నీ తులువతనమ్ము వారి నెట్టునె వెలికిన్? 58

క. ఏను నొక క్రొత్త చెలియల, నై నినుఁ గనుఁగొన్నదాన; నాచార్యవినో
బా నెఱుఁగుదువు గదా! యతఁ, డీ నేలకు వచ్చినట్టి యీశ్వరుఁడుగదా 59

క. ఆతని సందేశముతో, నీతలుపుం దట్టితట్టి నిద్ర దొలఁచితిన్
నాతప్పులున్న సైఁపుము, నీతప్పులు నే నెఱుంగరనేరను రాజా! 60

క. ఏ నూరక చనుచెల్లిని, గాను; మహీదానయజ్ఞకంకణ మిది నీ
పాణిం గట్టినవెన్కనె, పైనము సాగింతు నొండుపల్లియదెసకున్" 61

ఆ. రాజునోట మాట రాదాయె; నతఁ డెంత, నింద్యుఁ డైననేమి? నేఁడు వాని
మదిని గుఱ్ఱువెట్టు మంచి మేల్కొన్నది, బ్రదుకు మాఱె నతనిభవము మాఱె 62

క. అతనిపునర్జన్మమునకు, జతపడి యేర్పడిన పురుటిస్నానం బన సం
తతధారలఁ గోష్ఠోదక, తతు లక్షులనుండి వెడలి తడిపెన్ నృపతిన్ 63

ఆ. తేఁడు విమల నాదరించెను లెంకగాఁ, జేయిమోడ్చె నా సుశీలముందు
రమ్ము తల్లి! కృపను రమ్ము లోపలి కని, పెద్దచేసి చెలికిఁ బీఁటవైచె 64

క. "న న్నుద్ధరింపఁగా శ్రీ, మన్నారాయణుఁడు పంపె మగువా! నిను నేఁ
దన్నన్న! నన్నుఁ దేర్చిన, పున్నెము నీపాలి" దనుచుఁ బొగడెను సాధ్వీన్ 65

ఆ. ఊరినెల్లఁ బిలిచె నొకసభ గావించెఁ, దనచరిత్రమెల్ల వినిచి క్రుంగె
సొంతకమ్మతమున మంతుగన్న పొలంబు, పెల్లుగా నొసంగెఁ బేదకొఱకు 66

గీ. ఒక్కతతి దెబ్బదిని డాఁగియుండుఁగాక, మానవునిహృదయమ్ములో మంచి కలదు
పాత్రులగువార లర్థించుపట్టునందు, నుబుకు నువ్వెత్తుగా నది యొదుఁగలేక 67

## నా కొడుకులు సోమరులు కారాదు

క. అది సాగరాఖ్య మగుజన, పద; మచటన్ భూమిదానపరమార్థము కో
విదుఁడు వినోబా చాటెను, గడలెన్ దానములు విశ్వకల్యాణదముల్ 68

క. ఒక ముదుసలి "నాకద నా, ఱెకరాల ధరిత్రి యుండె నిది పేదలపా
లికి నర్పించెద" నన "జీ, విక నీ కెది" యనె గురుండు విభ్రాంతమతిన్ 69

ఆ. "కూలిచేసి కూడు గుడ్డ నార్జింతు నీ, నేల కిచ్చినదియుఁ గూలిసొమ్మె"
యని వచించె వృద్ధుఁ; డాచార్యుఁ "డుంద్రుగా, కుఱ్ఱవాండ్రు నీకుఁ గొంద" అనియె 70

క. "ఉన్నారు నాకు మువ్వురు, పిన్నలు; వారలకుఁ బంచిపెట్టను బొలమున్
నన్నుంబలె శ్రమపడి వా, రన్నము దినవలయు నిష్ట మగు నిది నాకున్ 71

గీ. కొడుకులను సోమరులఁ జేయుకోర్కి లేని, మానిసిని నేను; సోమరి మహికి వ్రేఁగు;
మేలు కీ డెల్ల నరసి యీ నేల నీకు, నిచ్చుచున్నాఁడఁ గొను" మని వృద్ధు పల్కె 72

క. ఈ దానము లోకోత్తర, మీదాతను దొరయువార లెందఱు కల రం
చాదరమేదురదృక్కుల, కాదరువుం జేసి మెచ్చి రాతని సభ్యుల్ 73

## అతఁ డంధుఁడు కాఁడు

క. చౌదరిపురము 'మురాదా, బాదు'నకున్ జెందినట్టిపల్లియ; మన భా
వేదళ మచటికి వచ్చెను, భూదానక్రతుఫలమ్ము పూరించుటకున్ 74

గీ. రాత్రి పదియయ్యెఁ; గార్యకర్తలు సుషుప్తి, కగ్గపడినారు శ్రమమెల్ల డిగ్గఁద్రావ;
వచ్చె నచ్చోటి కెద్దులబండి నెక్కి, రామచరణుఁడు రైతుగా బ్రదుకువాఁడు 75

గీ. అతని దాచెంత సున్నయూ; రర్ధకామ, ములకు ధర్మువు జోడించువలంతి యతండు;
పాప మేనాంటిదో కంటిపాప నణంప, లోకమును గానంగా లేని చీం కతండు 76

ఉ. అద్దమరేయి వచ్చె నతం; డప్పుడు లేకరులందు నొక్కండో
యిద్దఱొ కూర్కు కుంటం దన యీవికిం బత్రము వ్రాసి యిచ్చి యా
పెద్ద గృహమ్ముం జేరె; వినిపించిరి లేఖకు లీవదాన్యతన్
బ్రొద్దున లేచి యొండెడకుం బోవుతఱిన్ బరమోపదేష్టకున్ 77

క. అది విని భావే మ్రాన్పడి, పిదపన్ దేఱుకొని శిష్యబృందముతో ని
వ్విధిం బల్కె "నెంతయద్భుత మిది, యంధుం డటంచు వాని నెట్లందురయా! 78

క. అతం డంధుండు కాండు జగ, త్త్రిత శివుం డటు వచ్చె మనల దీవించుటకున్;
మతి లేనిమనమె యంధుల, మతండంధుండు కాండు నమ్ముం డతండీశ్వరుండే" 79

## అల్పదాన మెట్లిచ్చెదను?

క. కారుణ్యమూర్తి సేవా, భారముతోం దనకుంగూర్చుపరివారముతో
గోరక్షాపురమునకున్, జేరువం గల ఘట్టమునకుం జేరం దొడంగెన్ 80

క. బట్టలతోం బాత్రలతోం, బెట్టెలతో శకటమొకటి వెడలెను; గుంటల్
మిట్టలు సూచించుట క, ప్పుట్టిన నౌకరుండు నడిచె బండికి నెగువన్ 81

క. హరిజనుం డతండు వినోబా, పరమోద్యమ మరసి బాగుబా గనుకొని త
ద్గురుశిష్యు నొకనిం, గని యీ సరణిన్ వచియించె లజ్జ సందడిసేయన్ 82

క. "ఓయయ్య! మహీదానము, సేయుట కేం దగుదునొక్కొ! చిన్నలు పెద్దల్
మాయింటం బన్నిరువురు, పాయక తినవలయు వచ్చు బంధు లటుండన్ 83

గీ. కొలందిగా నైదుబీగాలపొలము మాకుం, గలదు; కూలిసేయనినాండు కడుపు నిండ;
దగుట నీనేల మీకు నీయం దలంతుం, గాని యీయల్పదాన మేకరణి నిత్తు?" 84

ఆ. అతనియడుగుందమ్ము లంటి భావేశిష్యుం, డెఱంగె మేనం బులక లేసరేంగ
"నెంతపుణ్యభూమి యీభారతము! తపో, దానములకు నిది నిధాన" మనియె 85

ఆ. దాతతృప్తి నెంచి యాతనిభూమిలో, నించుకంత గొనె యతీశ్వరుండు
పిదప బండిదోలుపిన్న కీసంగతి, పలుకరింప వానిపండ్లు పులిసె 86

క. తన కున్న దెకర మైనను, వనరక వాఁడొసఁగె నింతవసుధను; భావే
చనుదారి నిట్లు కరుణా, వనవీథులు విరిసి దానవాసన లెగసెన్ 87

## చావునకు భయపడను

ఆ. గయకు దవ్వునందుఁ గలయొకపల్లెలో, నిలిచి యుండె గురుఁడు; నేలనాల్గు
దెసలవారు పంప దినదిన మతనికి, వచ్చు నూర్లకొలఁది వక్కణములు 88

క. గయలోన దిగినలేఖల, రయమున బాబా కొసంగి రా నొక సేవా
మయజీవనుఁ డగుశిష్యుఁడు, పయనము సాగించెఁ బ్రొద్దు పడమటి కొగ్గన్ 89

క. చనుచుండె హుటాహుటి నతఁ;, డినుఁ డస్తాచలముఁ జేరె; నిరు లాముకొనెన్;
వనమునఁ బడె శిష్యుం డవు;, డెను మని యే స్గని గణింపఁ దేకాగ్రమతిన్ 90

ఆ. అడవినడుమ దొంగ లాఁపిరి వానిని;, గ్రుద్ది రసురు లగుచు నుద్దవడిని;
బట్టుదప్పి క్రిందఁబడెఁ గార్యకర్త; త, ద్గళము నొత్తఁ దెగిరి కన్నగాండ్రు 91

క. భావేభటుఁ డవుడిట్లనె, "నావచనం బొకటి వినుఁ డనంతరమున మీ
కేవిధిఁ దోఁచిన నావిధిఁ, గావింపుఁడు; మృతికి నేను గలఁగన్ దొలఁగన్ 92

క. మీరు వినోబాకథ వి, న్నారుగదా!; వారిపని యొనర్చెద నే; నీ
చేరువఁ గలమాయొజ్జకుఁ, జేరుచుకమ్మ లివి; వీక్షసేయుఁడు మీరున్ 93

క. మా కింతనొప్పి కల్గిన, మీ కెంతయు నష్టి కల్గు; మీవలె లేమిన్
జీకాకు సెందుపేదకు, మాకార్యక్రమమె శాంతిమత్త్వము గూర్చున్ 94

గీ. మున్ను వాల్మీకి బోయగా నున్ననాఁడు, చేసె మీవలె నెన్నేని చెనఁటిపనుల
నతఁడె తుదకు రచించె రామాయణంబు, నఖిలపురుషార్థసాధనమై వెలుంగ" 95

ఆ. సిగ్గుపడిరి దొంగ; లగ్గలముగ వారి, కనులవెంట బాష్పకణము లురలె
నొట్టుపెట్టుకొనిరి యెట్టిముప్పుల నైన, నన్యహింస నొల్ల మనుచు వారు 96

క. జే యనిరి కార్యకర్తకు, నాయదవిన్ గడచుదనుక నాతనివెంటన్
బోయిరి మన్నింపుఁడ యని, యాయయ్యకు మ్రొక్కి మ్రొక్కి యరిగిరి బోయల్ 97

# ఇచ్చినది ముట్టను

మం. భూదానయజ్ఞ సంపూర్తి కెవ్వాఁడు, జీవనదానమిచ్చె, నుదారచరితుఁ
దతఁడు జయప్రకాశాఖ్యుఁ దూరూర, సభలు సాగించుచు సంయమీశ్వరుని
సందేశమును లెస్స చాటుచు నొక్క, పల్లెకు వచ్చె; నేర్పడె నందు సభయు;
నావేశపూరిత మగు నుపన్యాస, మాసభన్ వినిచె మహామహుం డతఁడు;
వానివాక్కులు ప్రజావళిడెందములను, గరఁగించె; సంపన్నకర్షకుల్ పలువు
రిచ్చిరి భూములు; నీత్యాగమునకు, నలరక "భగవానుఁ డగు శాక్యమౌని
మెప్పు లందిన గయామేదిని కర్ష, దానమా యిది? దీనతామగ్నజనము
నుద్ధరించుటకు నీయుడుగర చాలు, నందురా? పరికింపుఁ డన్న!" లటంచు
నమ్రతామూర్తియై నారాయణుండు, పలుక వెండియు దానపత్రముల్ దూఁకె
నార్ద్ర మయ్యెను సద; స్సపు డొకమూల, శిర మెత్తి శివధరసింహుఁ డే నాఱు
బీగాలనేల నర్పించితి ననుడు, నొకకార్యకర్త పెల్లుదరి జయప్ర
కాశుతో "నితనికిఁ గల కొంద్రయెల్ల, నిదియె, సర్వ మొసంగి యితఁ డెట్లుబ్రదుకు"
నని మెల్లఁగా నాడ నది విని చకిత, హృదయుఁడై నాయకుఁ డీమహాదాత
తన కున్న పొలమెల్లఁ దలఁకక యిచ్చె, నీయీవి సమ్మాన్యమే యౌను గాని,
యితఁ డేమి తినవలె నిఁక నెల్లినుండి, యింత దెట్లుజీవించు, నెల్లసంపత్తి
నిచ్చుఁగాక గ్రహించు టెంత యౌచిత్య?, మొక్కబీగామాత్ర మొప్పి చేపట్టి
తక్కినదెల్ల నీదాతకే విడుతు", నని సభలోఁ బల్క నది సైఁపలేక
చిడిముడి శివధరసింహుండు లేచి, కైమోడిచి "జయప్రకాశ! నేనిచ్చి
నది ముట్ట నొల్ల, నన్నా! నీదుపల్కు, నిట నొప్పనొల్ల, నా యీ మేని చేవ
సడలిపోలేదు, కష్టము నోర్చుఁగానఁ, గూలితో నాలితోఁ గుక్షి నిండింతు
నిన్నాళ్ళు నాసుఖ హేతు వైనట్టి, యీనేల యిఁకఁ గూటి కేఁకారుననద
హోయికి నాధార మైతీరవలయు, నంగీకరింపవే యస్మదాశయము
తిరుగులే దిప్పట్లఁ దిరుగులే" దనిన, జలదరించె నొడళ్లు సభవారికెల్ల
మోఁకటిల్లెను దాతముంగడ నేత, యెలుఁగు రాల్పడ నాతఁ డి ట్లాడె నపుడు
"శివధరా! నీకు జేజేలు వేవేలు, శిబిగోత్రమున జనించితివి దధీచి
సంతతిలో నీవు జన్మించితివి హ, రిశ్చంద్రుకోవఁ గూరితివి రాధేయు
కుదుటఁ బుట్టితివి నీకు నెవండు సాటి?, నవ్వుచు మేనికండలు కోసి యిచ్చి
కలఁగక వెన్నెముకన్ దూసి యిచ్చి, యతి మానుషత్యాగ మావిష్కరించి
వినుతికెక్కిన దానవీరులకులము, వీన్మిగిలిన దయావీరులకులము
వెలుఁగు గూర్చిన ధర్మవీరుల కులము, నీకులం బనుమాట నిక్క; మీసుకృత
నిధులరక్తమ్ములు నీ మేనిలోని, ప్రతినరమ్మునయందుఁ బ్రవహించుచున్న

వే నజ్జుఁడ రహస్య మిది కానలేక, యేమేమొ నుడివితి నె గ్గొనర్చితిని
నీ మాట కెదు రాడనేర నీతృప్తి, సర్వమానవతృప్తి జగదేకగుప్తి
మన్నింపవే నన్ను మనసారవలచి, దీవింపవే బుద్ధదేవసంకాశ!" 98

## గ్రామ గౌరవరక్ష

ఆ. నేతిబీరకాయ రీతి 'బడాగాఁవు', చిన్నపల్లె యోగిశేఖరుండు
వచ్చె నటకు; నూరివారు తద్వాణికి, లొంగరైరి మహి నొసంగరైరి 99

గీ. ఉత్తచేతులతోడ నీ యూరినుండి, వెడలుచున్నాఁడ నొండొకయెడ కటంచుఁ
బలుకు భావేపదమ్ములు పట్టి యిట్లు, నుడివె హరిజనుఁ డొకఁడు కన్నులుచెమర్ప 100

క. "ఓ ఋషిపుంగవ నిలు నిలు;, మూరక నీ వేగు టొప్పు; నొప్పిన చో మా
యూరికిఁ బే రుండునె? యీ, భారము నే సైఁప దొరలపా టెటు లున్నన్ 101

క. నాకున్న నేల కొంచెము, నీ కప్పనసేయువాఁడ నెమ్మిన్ గొనుమా
అఁకొన్న వారిపెంపున, కేఁకారెడి నీవు వేయియేఁడులు మనుమా" 102

ఆ. ఏలువారి నాశ్రయించి యీతఁడు కాన్క, లిచ్చి యిచ్చి వలచి తెచ్చుకొన్న
గడ్డ యిది; యెదంద కరఁగెనా యెంతటి, యీవి కైన జంకఁ డిట్టిపేద 103

క. మీసాలపొదలు పెంచిన, యాసాములమొగము లప్పుడప్పుడె ముడిఁగెన్
ఏ సుకృత మెవనిపాలో, ఏసత్కారానుభూతి యెవ్వనిపాలో 104

## స్త్రీజాతి యిఁక నిద్రపోదు

క. భూదానయాత్రలో గురు, పాదులు 'ధారోలి' యన్నపల్లెకుఁ జన న
త్యాదరమునఁ గేదారము, లీఁదొడఁగిరి కర్షకులు మహీక్షేమరతుల్ 105

క. అపుడొక సంపన్నకుటుం, బపుఁజెలి తనమేనిమీఁది బంగరురవణా
లపరిమితమూల్యములు చొ, క్కపుదీవులు దూసియిచ్చెఁ గరుణానిధికిన్ 106

గీ. 'చెల్లెలా! మంచిపని యొనర్చితివి కాని యీసమస్తము మఱలఁ జేయింపవుగద?
నిక్క మెఱిఁగింపు' మని యోగి నెమ్మి ననుడు, నతివ గరువమ్ము దొనఁక నిట్లాడె నపుడు 107

క. 'చేయింపను బాబా! యిఁకఁ, జేయింపను నగల; వీనిచే దిగులు వినా
యేయెలమిన్ గననైతిని, నాయుల్లం బిపుడు శాంతినర్తకమయ్యెన్ 108

ఆ. కొంకుమాలి వీనిఁ గొనుము, లోకశ్రేయ, మునకు వెచ్చపెట్టు; మనఘ! నేఁడు
చదువు సంధ్యలేనిచానలోసైతము, పుట్టెలే! వివేక మిట్టలముగ 109

క. మాజాతి నిద్రపో దిఁక, మీజన్నముకతన మేము మేల్కొంటి; మివే
జేజేలు; మీకు మీమఖ, రాజమునకు నభ్యుదయపరంపర లగుతన్' 110

## పంపకము

గీ. మనవినోబాకుఁ గాన్పూరుమండలమున, రెండుపల్లెల బంగారుపండునేల
ముప్పదెకరాల నిచ్చిరి గొప్పకాఁపు, లార్తజనతుష్టి వలచి లౌభ్యమును గెలిచి 111

క. ఆదాతలు మే మిచ్చిన, కేదారము లుర్వి లేక కీడ్పడుప్రజకై
యీ దినమునందె పంచిన, మాడెందము లుబ్బు ననిరి మౌనీంద్రుకడన్ 112

గీ. 'ఏల కా దనవలయు మీయిచ్చ' ననుచుఁ, బంపకమ్మునకుం దలపడియె గురుఁడు
కార్యకర్తలు కంచుఢక్కాలతోడ, వీధివీధికి నీవార్త వినిచి రపుడు 113

క. దాతలు వచ్చిరి యాచకు, లేతెంచిరి సభకు నితరు లెల్లరు నోత
ప్రోతముగఁ జేరి రెన్నఁడు, నేతాదృశ మగు విభాగ మెఱుఁగ మటంచున్ 114

ఆ. నేల దున్ని బ్రదుకునేర్పు, సేద్యమ్మునఁ, బ్రీతి, లాఁతివృత్తి చేతఁగామి
యుర్విలేమి యెవని కుండు నతం డర్హుఁ, డనిరి పెద్ద లీవి నందుకొనఁగ 115

గీ. పాత్రులగువార లారెండు పల్లెలందుఁ, గలరు పన్నిద్ద ఱని లెక్క కానిపించె
నింటి కైదెకరాలుగా నిచ్చుపట్ల, దిగులుతోఁ బోదు రిందులో సగముమంది 116

ఆ. ఎవని కవని యిచ్చి యెవనిని రిత్తగాఁ, బంపవలయు నన్నప్రశ్న వచ్చె
నపుడు పీఁట డిగ్గి యాచార్యుఁ డుర్వి కు, వ్విళ్ళుగొనెడువారివీపు నిమిరి 117

ఆ. అన్నలార! చిక్కు విన్నారుకద మేము, చాల మీసమస్య చక్కఁబెట్ట
నరసి యరసి యెవరు పరమదరిద్రులో, తేల్చి మీరె మాకుఁ దెలుపవలయు 118

ఆ. అనుడుఁ గొంద్ర వదయునాసతో వచ్చిన, మాల యొకఁడు గొంతు రాలుపడఁగ
నిట్లుపల్కెఁ 'దండ్రి! యిబ్బంది నెఱిఁగితి, విన్నవింతు నేను గన్న తెఱఁగు 119

క. 'నాకండల బిగు వున్నది, నాకొడుకులు బట్టకట్టినా రందఱు; మే
మేకూలికైనఁ బోయెద, మాఁకటిచిచ్చునకు లొంగ; మౌఁగాని ప్రభూ! 120

గీ. 'పాప మావృద్ధు నాకంటె బడుగువాఁడు, కూనగుజ్జుకుటుంబముతో నతండు
నలఁగుచున్నాఁడు వానికి నంజ నిండు, వలదు నా' కని యొకదీనువలను సూపె121

ఆ. కనులు చెమ్మగిల్లి తనువులు కాఁకర, గాయలై సదస్యులోయి! నీవు
నిక్కముగ దధీచి విక్కవు కరుణకు, ననుచుఁ బెద్ద మెచ్చి రావదాన్య 122

గీ. ఏలమెచ్చురు నేఁ డెంతనేల యున్న, నెంతసిరి యున్నఁ దనియని జంతువులు జ
గాన మితిమీఱి యుండ నల్లడల నెల్ల, వాఁడు నిరవధికస్వార్థవశత నుండ 123

గీ. ఏలమెచ్చురు నాకంటె నితఁడు దీనుఁ, డితనివెత మున్ను తొలఁగింపుఁడీ! యటంచుఁ
బీలికల మేను తప్పిన కూలివాఁడు, తేపటికి గంజిలేని దరిద్రుఁ డనఁగ 124

ఆ. మానవత్వమునకు నానవా లితఁడు భా, రతధరిత్రి సుకృతరాశి యనఁగఁ
దారకాణ మితఁ డుదారతా రమణీయ, మూర్తి యితఁడు విగతమోహుఁ డితఁడు 125

ఆ. ఇతనియెడఁదపెంపు నుతిసేయుసభ్యుల, కిట్లు నుడివె సంయమీశ్వరుండు
'లెండు తమ్ములార! రం డుర్వి నొసఁగఁగా, మాటలేల పనులు మనకు వలయు 126

ఆ. మంచిసమయ మిది సమంచితఘట్టంబు, మాటిమాటి కిట్టిపూఁట రాదు
పేద కవని పంచి బిడ్డకుఁ బా లిచ్చి, తనియుతల్లివోలెఁ దనియుఁడయ్య!' 127

క. నావుడు నొకహలికుఁడు ధ, ర్మావేశం బెసఁగ నొసఁగె నై దెక రాలన్
నావైదు నావి యైదని, యావల భూస్వాము లిరువు రర్పించి రిలన్ 128

క. 'ఇఁక ముప్వురుపేదల నూ, రక పంపుట పాడి యందురా? మఱి మీ రిం
చుక మ్రొగ్గిన సర్వంబును, సుకరంబగు' నని గురుండు సూచెన్ గొలువున్ 129

ఆ. కరఁగి సన్నగారుకాఁపు లించించుక, నేల యిచ్చి; రంత 'నేల యింత
బెదఁద? లోటువడినపుడమినెల్ల నొసంగు, వాఁడనే' నటంచు వచ్చె నొకఁడు 130

క. సభ జయజయరావమ్ముల, నభమున్ వణఁకించె 'వలదు నా' కని కరుణా
ప్రభ గురిసిన పాణిసికిని, లభియించెఁ బొలమ్ము గురుతలన్ ముంచె విరుల్ 131

ఆ. అద్భుతం బుదాత్త మగు నీదృశపవిత్ర, సన్నివేశమునకు 'నన్ను మాని
వాని నుద్ధరింపవలె నన్న నిఱుపేద, కాక వేఱెవండు కారణంబు? 132

క. నిఱుపేద కాఁడు వీఁ డొక, నెఱదాత; భరింపరానినెవ్వం బడియున్
బెఱవానిదీనతం గని, యెరిసి యెదన్ వెన్నఁజేయ నితనిక చెల్లెన్ 133

గీ. అచ్చమగు కర్మయోగమ్ము నాశ్రయించి, ఫలము నొల్లనియోగి నా వలయు నితని
నొల్లకున్నను ఫలము సంధిల్లి కర్త, కిహపరానంద మిడు నంట కితఁడు సాక్షి 134

గీ. ఇతనిలోఁ గంటి మీశ్వరు నితనిరూపు, గట్టి భారతీయాత్మ సాక్షాత్కరించె
నోట లేదిఁక సర్వోదయోద్యమంబు, సాగి సాగి సృజించులే! సత్యయుగము' 135

# హృదయ పరివర్తనము

క. బలియామండలమునయం, దలరారున్ గ్రామ మొకటి 'అజంగడ' నా
నలఘుచరిత్రుఁడు భావే, యిలకై చనుదెంచె నటకు హితమండలితోన్ 136

గీ. "మీరు మాపని సేయుచున్నారు, గెలుపు, వసపడుత మీకు" ననుచుఁ గాంగ్రెసును గొల్చు
వారలు, సమాజవాదంపువారు వచ్చి, యిడిరి సమ్మానపత్రముల్ వృద్ధఋషికి 137

క. కమ్యూనిస్టులు నపు డా, సామ్యవిధారతున కిడిరి సమ్మానము; నీ
రమ్యత గని సభ ముత్పా, రమ్యము గనెఁ జంద్రుఁ జూచురత్నాకరమై 138

క. "మీదారికి మాదారికి, భేదము కల; దైన మీకు బెదఁదలు కూర్పం
గాఁ దలఁపము బాబా! యది, కా దని భావింతు" మనిరి కమ్యూనిస్టుల్ 139

క. ఈపాటి చాలులే యని, బాపూశిష్యుండు తృప్తిపడె; నతఁ డవలన్
బ్రాపించె మైనపురి నా, దీపించెడిసీమ యజ్ఞదీక్షావశుఁడై 140

క. అమండలమునఁ గల యొక, గ్రామంబున దప్పి నణఁపఁగా నతఁ డాఁగెన్
గ్రామీణ తరుణ వృద్ధులు, సోమించినభక్తి నతనిఁ జూచుచునుండన్ 141

మం. ఆసీమఁ బేరందినట్టి కమ్యూనిస్టు, వచ్చి వినోబాను మెచ్చి వినయ
వినమితగాత్రుఁడై తనవంతుకాన్కగా, నిచ్చె బీదలకు రెండెకరములను 142
మునుముందు మీయత్నమున కండగా నుందు, నమ్ముఁడా! యని యతి కిమ్ము గూర్చు
నితఁడు పాలీవాలు; కృతమతు లీదృశుల్, పలువురు భావేతపమ్ము పండ 143

గీ. నగ్గలిక చూపి; రార్తసేవానురక్త, మతికి నెవ రడ్డుసెప్పెద; రతనిబాట
నిర్నిరుద్ధము; వానివాణికి సమస్త, లోకము విధేయమై భక్తి మోఁకరించు 144

# ఎవరింటికి?

ఆ. కమ్మతీఁ దతండు గయసీమవాఁడు వా, ర్ధకభరమ్ము హెచ్చి దయ్యువాఁడు
దీనజనులఁ దేర్ప దీక్షితుఁ డైన మ, హర్షిజయము కోరునట్టివాఁడు 145

క. అతఁడు తనమండలమ్మున, యతి యున్నాఁ డన్నవార్తనాలించి సమా
హితచిత్తవృత్తిమైఁ జని, యతిలోకచరిత్రు గాంచి యాదట మెచ్చెన్ 146

గీ. మెచ్చి యూరక నిల్చెనా యిచ్చెఁ దనదు, నవనియెల్లను విశ్వకల్యాణమునకు
నదియు ముక్కారుపంటల కనువు గలది, యదియు నర్వదియెకరాలయవధి గలది 147

ఆ. అతనిదానధార యామాత్ర నాఁగెనా, పండ్లతోఁటదెసకు బావిదెసకుఁ
జక్కఁ గట్టినట్టి సౌధమ్ము దెస కాల, దెసకు దుక్కిటెద్దదెసకుఁ జనక 148

క. పూచికపుల్లయుఁ దన కని, దాఁచెనె సర్వస్వమిదె నతం డార్తుల; కా
శౌచనిధి నాఁటినుండియు, నాచార్యునిపజ్జఁ దిరుగ నారంభించెన్ 149

గీ. కడచె దినములు వారముల్ కడచె నెలలు, గడచె; నవ్వల నొకకార్యకర్త యతని
"నిచట నెన్నాళ్ళు నిల్చెద వింటి కేగు, టెప్పు"డని ప్రశ్నసేయఁ గాఁ బిట్లు నుడివె 150

గీ. "ఇంటికా యెవరింటి కి దేమిప్రశ్న, కలదె నా కిల్లు వాకిలి కలదె కొంద్ర
యిచ్చు వచ్చినయన్నినా ళ్ళిచట నుందు, గురుని సేవించుకొందు నీశ్వరుని గందు 151

క. నాయుల్లము తనిసిననాఁ, దేయెడకో పోదుఁ గాని యే నెన్నఁటికిన్
దాయను ముట్టను మెట్టను, నాయిచ్చిన మందిరమును సంజను బుంజెన్" 152

ఆ. బుడుత దస్సి దస్సి బొమ్మరిల్లు సృజించి, యంతలోన దాని నణఁచినట్లు
సిరులు కూర్చి కూర్చి తతిఁజూచి విడిచిన, మేటిదాత కితని కేటికోళ్లు 153

## అవ్యక్తమే గొప్పది

క. సురభి యను వీటికిం జనె, గురువర్యుఁడు; వారు వీరు కూడిరి పౌరుల్
మరియాదలెల్ల జరిపిరి, పరమర్షికి నార్తలోక బాంధవమణికిన్ 154

క. దేశికుఁ దుర్వీదాన, ప్రాశస్త్యము నుగ్గడించెఁ బ్రార్థనవేళన్;
దేశముఖు లెందఱో విని;, రాశయ మిది చాలమంచి దని రుత్సుకులై 155

క. ఉచ్చండమైన మేఘము, వచ్చి తుషారంబె రాల్చి వాసినభంగిన్
మెచ్చి కదుమెచ్చి సభవా, రిచ్చినపాలమెల్ల నాలుగెకరాలె చుఁడీ! 156

గీ. అచటి కామదదవ్వునం దలరు నూర, నున్నకర్షకు లిద్ద ఱాపన్నహితుఁడు
వచ్చె ననువార్త విని మేఁడి వదలి కదలి, సురభికిం జేరి బాబాను జూచిమ్రొక్కి 157

క. నలువదినాల్గెకరమ్ముల, పొల మిడి తమపల్లె కపుడ పోయిరి; భావే
పలు కెన్నఁడు నాలింపని, హాలికులు వీ రింతయొసఁగ, నార్భాటముననన్ 158

గీ. సభకు వచ్చి యాలించినజనులు పుడమి, నెంత యొసఁగిరి? మన కిది వింత; కాని
వ్యక్తమునకంటె నవ్యక్త మధిక మన్న, తత్త్వ మెఱిఁగించె నపుడు విద్వత్ప్రభుండు 159

## కీర్తికాంక్షలేదు

ఆ. విదుషి సత్యబాల వెడలె భావేయజ్ఞ, కార్యనిరతి నొక్కగ్రామమునకుఁ
గండపట్టినట్టి కమ్మతీంద్రకు నది, మనికిపట్టు సిరుల కునికిపట్టు 160

క. భూదానమహత్త్వము నా, సోదరి వివరించి పల్కుచోఁ గిరితిపై
నాదటపడి దానం బిడఁ, గా దని యది సాత్త్వికమ్ము కా దని చాటెన్ 161

గీ. ఇచ్చువాని కహంకృతి పుచ్చుకొనెడి, వాని కిసుమంతదైన్యము లేనియావి
యుత్తమోత్తమ మని పల్కె నువిదమిన్న, సభ ముగిసెఁ గాని దానవాసన హాలికి162

క. ఈపూఁట పేరుకొన్నను, ఱే పీడెందములు కరఁగి ప్రేమస్రోతో
రూపము ధరింపవా యని, యాపొలఁతుక బసకుఁజేరె నాఱనిదీక్షన్ 163

గీ. అంత నొకవృద్ధకర్షకుఁ డావెలంది, కుఱఁగటికి వచ్చి యణఁకువఁ గురిసి 'నేను
నలువదెకరాలవాఁడ నానంజ పుంజె, యెల్ల నిచ్చితిఁ గైకొమ్ము తల్లి!' యనియె 164

క. ఆసాధ్వి విస్మయంపడి, యీ సత్కృతి సేయవైతివేమీ సభ నాఁ
గాసంతయశము నొల్లని, మాసి యితం డనియెఁ గాఁపు మానిని క్రుంగెన్ 165

గీ. ఫలము నొల్లనికర్మమే వలఁతిచేఁత, గీత సెప్పిన వెలలేనినీతి యిదియె
విశ్వహితశీలుఁ డైన భావేమహర్షి, కతన నీయోగమునకు సంక్రాంతి వచ్చె 166

## గ్రామ దానము

గీ. 'మంగరౌటు' హమీర్పురమండలమునఁ, జెలఁగునొకయూరు; శత్రుఘ్నసింహుఁ డచటి
ప్రజలకై తనబ్రదుకెల్లఁ బంచిపెట్టి, యూడిగముసేయు నుత్సాహ మురవణింప 167

క. ప్రతిజాతీయోద్యమమున, నుతిగనె నాపల్లె; యిఁక వినోబాక్రతు వి
స్మృతి కిది సాయంపడు ట, ద్భుతమా? లోకైకదానధూర్వహ మగుచున్ 168

గీ. 'వచ్చుచున్నాఁడు భావేప్రవక్త' యన్న, వార్త వినినంత నాయూరివారు కదలి
యెదురుచని తోడి తెచ్చి ఋషీంద్రుమెచ్చి, యిచ్చి రణఁకువ మీఱ నూ ఱెకరములను 169

క. ఆదానము గైకొనుతఱి, నేదో భావించి యోగి యిట్లను 'నయ్యా!
మీ దాతృత్వము జగమున, కాదర్శం బగువిధమ్ము నరయుఁడు మీరల్ 170

గీ. ఇంచుకించుక పుడమి నా కేల యిత్తు?, రూరఁ గలకొండ్ర యంతయు నూరిపాలి
నేలగాఁ జేయరాదె? యీ నిర్ణయింబు, సముచితము కాదె! కనుఁ' డంచు సాగిపోయె 171

క. ఇచ్చితి మను సంతోషము, విచ్చెను గ్రామీయులకు; వివేకము, త్యాగం
బుచ్చైర్దశకుం జనఁగాఁ, ద్రచ్చిరి వా రపుడు ధర్మతత్త్వము నెల్లన్ 172

క. లోకోత్తర వితరణమున కీకొనిరాప్రజలు; సంయమీంద్రునికడకున్
దూఁకి; రిదె గ్రామదానము, కైకొనుఁ డని పత్ర మిడిరి కరుణానిధికిన్ 173

గీ. ధర్మము జయించెఁ, దనిసె సత్యమ్ము, పట్ట, భద్ర యయ్యె నహింస, విశ్వము వినూత్న
యుగమునకు వచ్చె ననె యోగి, సొగసి రచటి, పారిషదులు, చల్లనిగాలిఁ బంచెఁ బ్రకృతి 174

క. ఆదర్శగ్రామముగా, నేదిగు లేనెగులు లేని యిలగా భావే
యాదరమున నేర్పడఁగా, రాఁదొడఁగెన్ జగము మంగరౌటును గనఁగా 175

ఆ. ఏమి? మంగరౌటులో మనవంటి మా, నవులు గాక వెలసినారె సురలు
ప్రజల దిద్దితీర్చు బంటు శత్రుఘ్నుఁ డా, యూర నుంట నిట్టియొఱపు వచ్చె 176

ఆ. నేల లేనివాఁడు నేఁ డొకఁడైన న, చ్చోటఁ గానరాఁడు, కూటికొఱకు
నొరుల దేవురించు నరుఁడు లేఁ; డానంద, సదన మెల్లవానివదన మచట 177

గీ. నలువదెకరాల వానికి నాలు గిచ్చి, సంతసము గూర్చుశక్తి యేచట్టమునకుఁ
గలదు? ప్రేమశాసనమె యీయెలమి నొసఁగు, వలఁతియై చెల్లు; దీనికి వందనములు 178

క. లోక మిది మారకాస్త్ర వి, షాకీర్ణం బైననేమి? యపు డామిత్తిన్
డీకొనుఁ బ్రేమతరంగము, లాకసమున కెగసి మెఱపులై దొంతరలై 179

క. ప్రాదుర్భవింపవలె స, ర్వోదయరాజ్యమ్ము;? పండియున్నది మహి; నేఁ
డాదేష్ట వచ్చె; శౌచ వి, భాదీప్తము కార్యకర్తృవర్గమె వలయున్ 180

# రామగంగాస్మరణము

ఆ. మొదటిదాత జన్నమున కాదిహోత యౌ, కాఁపుఁ జూడ జగము కదలె; నైన
నొక్కసారి యిచ్చి యూరకుండెనె రామ, చంద్రరెడ్డి యీవి నింద్రుగిద్ది 181

క. ఇచ్చెను జయప్రకాశుఁడు, వచ్చినతతి నుర్వి; కేశ వసుధీమణి రా
నిచ్చె మహి; పెద్దలెవ్వరు, వచ్చిన రిత్తగ నితండు పంపఁడు వారిన్ 182

ఆ. ఓలి నోలి నొసఁగె నాలుగువందల, యొకరములపొలమ్ము; నిపుడు రెడ్డి
యనుభవించునేల యెనుబది యెకరాలె, యెల్లి దీనిమేర యెంతడిగునొ 183

గీ. మొన్న నొకకమ్మఁ బంపె నాపన్నలోక, బాంధవుఁడు రామచంద్రునిపాలి కర్థి
నది పఠించిన రెడ్డి నెయ్యమునఁ బిలిచి, యూరివారికి వినిపించె నొజ్జపల్కు 184

గీ. ఆపలుకు గ్రామదానంబు నాసచేయు, పలుకు రద్దిని దనిపెడిపలుకు; కాని
కాఁపులందఱు మెచ్చినఁగాక యిది ఫ, లించునా రామచంద్రుఁ దగ్గించినంత 185

క. కావున నతఁ డాసభలో, నీవిధి వచియించెఁ, గ్రాంతి యిది మంచిది, మీ
భావము లనుకూలమ్ములు, కావలయును దీని, కేను గవ్వింప మిమున్ 186

ఆ. అన్నలార! తడవుఁ దౌగాము లాశుభ, వేళకొఱకు నేను వేచియుందు
నంతదనుక నాకు నబ్బెడిపంటలో, షష్ఠభాగ మిత్తు సవనమునకు 187

గీ. మఱియు నీయూరిసేవకై మామకీన, జీవితము నేఁటినుండి యిచ్చెద; మదీయ
జాయ తలఁ పెట్టిదో' యన నాయుదాత్త, చరిత నిలఁబడి సభకు నంజలిఘటించి 188

ఆ. 'సీతవోలె రాముఁ దేతెంచుబాటలో, నడుగువైతు నింతి కర్త మిదియె'
యనుడు రచ్చపొంగె; నాఱవపా లుర్వి, యిచ్చి రెల్లకాఁపు లిచ్చగించి 189

గీ. మనఋషికి మున్ను టెంకాయమాత్ర మిడిన, శాస్త్రి యెన్మిదియెకరా లొసంగె నేఁడు,
మంచిదె! పునాసకాపు వక్రించుఁగాక, చాలదా పైరపంట లెస్సగ ఫలింప 190

గీ. కమ్మఁ దెచ్చిన యోగీంద్రుకార్యదర్శి, భూమిపుత్రులఁ జూచి భావేమఖార్థ
మంతయో యింతయో మీరు నర్థదాన, మీయవచ్చు ననన్ వార లివతళించి 191

క. 'మా కలవియైన దేదో, వాకొనుఁ' డన 'మీరు కల్లు వదలమి వింటిన్
నాకీవ్యసనము నిం డిది, లోకోత్తరదాన' మనుపలుకు నతఁడాడెన్ 192

గీ. హరిజనులు కల్లుసారాల నంట మనుచుఁ, బ్రతినచేసిరి, పోచమపల్లిలోన
మూఁతవడె మద్యశాల, యీరీతి నిత్య, నూత్న చైతన్య మాయూరు నూలు కొల్పు 193

# పేదలు

గీ. "ఆత్మవత్సర్వభూతాని" యన్న పలుకు, మనది "సహనౌభున" క్తన్న మినుకు మనది
బోయ కాతిథ్య మిచ్చినపుల్గు మనది, శాంతికై మీఁదుకట్టిన జగతి మనది 1

చ. ఎముకలగూఁడులై బ్రదుకు నీడ్చుట కొల్లక త్రెళ్ళలేక శో
కములఁ దపించుచున్ సెగలు గ్రక్కుదరిద్రులఁ ద్రోసిపుచ్చు కా
లము చనె, విప్లవాగ్ని దెసలన్ గబళింపకముందె యందలా
లమరినవారు మేల్కొని యహంకృతి నుజ్జనసేఁత ల గ్గగున్ 2

ఆ. 'నేను' విడిచి 'మనము'పై నిచ్చ నిదనిచో, దేశ మెక్కిరాదు లేశమేని
క్రొత్తకథద గాదు ముత్తాతలే యిది, చెప్పినారు కన్నువిప్పినారు 3

ఆ. చదువు లేక గ్రుడ్డిబ్రదు కీడ్చుమానిసి, మందు లేక రుజలఁ గుందుపేద
కూడు లేక రాలువాఁ డున్నగడ్డకు, శాంతి లేదు జీవకాంతి రాదు 4

క. సో మెఱుఁగక బా మరయక, వేమఱు చెమరోడ్చువారు వెడపొట్టలతో
నేమహి నుందురు తన్మహి, సోమించుట కల్ల నిత్యశోభావృతమై 5

క. ఆఁకొన్నపండితునిగతి, ప్రాకెన్నలవిందు లుఱని పామరుచందం
బీకొన్న రాష్ట్ర మేటికి, లేకుఁన్నఁ గోఱంత లేవి లేచున్ వేఁచున్? 6

క. తెగఁదిని తెగుళ్లఁ బడి మూ, లుగువారున్ మెతుకు లేక లోచెడి చెడి నీ
లుగువారున్ మనకంటికి, నగపడఁ జెల్లదు స్వతంత్ర మగుదేశమునన్ 7

క. సోలుచుఁ గూలికి నేగిన, మాలెత పొలమందె గొబ్బిమందలనడుమన్
బాలకుని గనియె నతఁ డీ, నేలకుఁ బిడుగో వచింపు నిక్కపునిసుఁగో? 8

ఆ. నెలలు నిండి రొప్పునెలఁతను వరికోఁత, కంపురాజ్య మెట్లు పెంపువదయు
మాట లేల మన సమాజవ్యవస్థలో, మార్పు వలయు దిద్ది తీర్పు వలయు 9

క. సంపన్నులు తమబంగరు, గంపలకున్ దాము ధర్మకర్తల మని భా
వింపవలయుఁ బేదలసిరి, పెంపవలయుఁ ద్రుంపవలయుఁ బిసిడితనమ్మున్ 10

ఆ. తనివి నతకరింపఁ దగుకల్మి, పిసినారి, తనము నతకరింపఁ దగినలేమి
లేమి నిక్క; 'మౌనులే!' యనుచున్ నరుఁ, డిచట దారిదప్పు నెంతవెడఁగొ 11

ఆ. ఉన్నవారు తెల్వి యున్నవా రగుచు స, ర్వోదయమ్ముదెసకు నొగ్గరేని
లేనివారు తాల్మి లేనివా రగుచుఁ దీం, డ్రింపఁగలరు కట్లు త్రెంపఁగలరు 12

క. గజగజతో నెడచిక్కని, గజిబిజితోఁ బ్రాపులేని కాఁపురములతో
గిజగిజలాడిన ప్రజలే, నిజమైన జగచ్చరిత్ర నిర్మింతు రయా! 13

ఆ. నరుఁడు తెచ్చి పెట్టినది గాన లేవడి, యతని కణఁపరాని దగుట యరిది
యిది యెఱింగి సిరుల నేలుదొరల్ పేద, లెదురకుండుమేర నొదుఁగవలయు 14

క. భూదానయజ్ఞ మని గురు, పాదులు దేశాలుపట్టి బడలుట విలయాం
భోదము గర్జింపమికే!, పాదులుచెడి సంఘు మార్తిపడకుండుటకే! 15



## క్రొత్త సంక్రాంతి

ఆ. ఏఁటి కొక్కసారి యేతెంచుసంక్రాంతి, యుగయుగాలనుండి యున్నకాంతి
యెన్నినాళ్ళు దీని మన్నించు లోకమ్ము, ప్రాఁతవడియె దీనిప్రాభవమ్ము 1

ఆ. పూఁట కొక్క సారి పొడతెంచుసంక్రాంతి, కెదురుసూచుచున్న దీజగంబు
ఇన కరాళివోలె నింటింట వెలయు సం, క్రాంతి వలయు లోకశాంతి కిపుడు 2

గీ. లోభము నశించి భయ మది లుప్తమైన, మస్తహృదయాంతరములఁ బ్రేమప్రవాహ
వీచికామాలికలు పొంగువేళ నొదవుఁ, గ్రొత్తసంక్రాంతి యిది శుభోదాత్త మగుచు 3

క. బాపూ వలచినపండువు, పాపంబుల నెల్లఁ దూల్చుపండువు భావే
శ్రీపదయాత్రాతపమున, రూపెత్తెడిపండు విది నిరూఢం బగుచున్ 4

ఆ. భోగిమంటలందు గోఁగుఁబుల్లలఁ గాదు, కామరోషములను గాల్పవలయుఁ
గ్రొత్తపబ్బమందుఁ గోడిపుంజులఁ గాదు, దురభిమానములను ద్రుంపవలయు 5

ఆ. నూఱుమతము లైదునూర్లకులమ్ములు, వేయితెగలు రెండువేలనడత
లైదువేలబాస లార్వేలవేసాలు, లేనిపండు విది ఫలింపవలయు 6

ఆ. బిచ్చగాఁడులేని ముచ్చు లేని కటారి, లేని దొరతనమ్ములేని కుట్ర
లేని యీరసమ్ములేని దేశావధి, లేని పండు విది ఫలింపవలయు 7

ఆ. చూరునీటిచోటు మూరెఁడా? జేనెఁడా?, తీర్పుసెప్పుఁ డనుచు దెసలుపట్టి
కోర్టువెచ్చమునకుఁ గొంప నమ్మెడిమూర్ఖు, లేనిపందు విది ఫలింపవలయు 8

ఆ. మేడప్రక్క గుడిసె మేలిమిబంగారు, పట్టువలువ సరసఁ బ్రాఁతగోఁచి
తనివిచెంత నింత తఱుగని కన్నీరు, లేనిపందు విది ఫలింపవలయు 9

ఆ. కుక్కలను గదల్చి ముక్కడిపందుల, మందలించి కడుపుమంట లార్ప
నెంగిలాకు నాకు నేనాదిమూఁకలు, లేనిపందు విది ఫలింపవలయు 10



రచన : 1958-60

# అర్థములు

క్షోణి = ధ్వనించునది

వెలఁదిపల్కు = శుద్ధమైన వాక్కు

ఆదిత్యపురి = సూర్యాపేఁట

క్రించు = నీచుఁడు

బీగా = 63 సెంట్లు

కూరితివి = పుట్టితివి

పాణసి = మాల

ముత్పారమ్యము = సంతోషాధిక్యము

కమ్మతము = సేద్యము

కమ్మతీఁడు = సేద్యగాఁడు

నంజ = మాగాణి

పుంజె = మెట్ట

ఏటికోళ్లు = నమస్కారము

కాదు = తగదు

భూమిపుత్రులు = హరిజనులు

మీఁదుకట్టుట = ముడుపుగట్టుట.

సోము = సుఖము

సోమించుట = వృద్ధిచెందుట

ప్రాకెన్న = సదస్యము

ఉఱని = లెక్కసేయని

పిసిడి = లోభి

అతకరింప = తిరస్కరింప

అరిది = అశక్యము

# తిలకరేఖ

అనువాద మసిధారావ్రతము. కవి కగ్నిపరీక్ష. మూలమున కన్యూనానతిరిక్తమై వ్యర్థపదప్రయోగరహితమై యుండవలె నను కఠోరనియమములతో ననువాదకుఁడు గజ్జెకట్టి నిలుచును. కాని యడుగు కదలించినది మొదలు ప్రతిపదస్ఖలనముతో నతఁడు క్రిందుమీఁ దగుచుండును. నిలువఁద్రొక్కికొనుటకు భగీరథప్రయత్నములు సాగించి విఫలుఁడగును. ఈ స్థితిలో నతఁ డేర్పఱుచుకొన్న కట్టడలు చెదరును. అపు డారచయిత కింకర్తవ్యతా మూఢుఁడై యెక్కడి కక్కడ సరిపెట్టుకొని తృప్తుఁడగును. అయినను దనస్ఖాలిత్యము లెఱుఁ గును. విమర్శకునికలము తనపాలి ఖడ్గమగుట యెఱుఁగును. ఎఱిఁగి చేయఁగల్గినది లేదు. ఇది యనువాదకుని స్థితి.

విమర్శకున కీగొడవ యక్కఱలేదు. తాను శస్త్రచికిత్సకుఁడు. ధర్మాధికారి. గుణదోషములు పృథక్కరింపఁగల రాజహంసము. రత్నపరీక్షకుఁడు, వాఙ్మయకోశరక్షకుఁడు. సాహితీసామ్రాజ్య శోధకుఁడు. దయాదాక్షిణ్యములతోఁ దనకుఁ బనిలేదు. స్వపరభేదము లేదు. మోమోటము లేదు, హేయోపాదేయములు లేవు, తాను నిర్లిప్తుడు. ద్రష్ట, కుండ బ్రద్దలుకొట్టినట్లు చెప్పుట తనవిధి. తన్నిర్వహణమున జంకుగొంకు లుండరాదు. ఇంతటి కర్తవ్యపరాయణుఁడగు విమర్శకుని కట్టెదుట ననువాదకుఁ డెక్కడ నిలువఁగలఁడు?

కాని విమర్శకుఁడు కవియెడఁ జూపవలసిన యౌదార్యమును మఱవక కవి పరిశ్రమమును గుర్తించి యతఁ డెంతవఱకుఁ గృతార్థుఁడయ్యె నన్నది పరిశీలింపవలయును. స్ఖాలిత్యములు శోధించుటతోపాటు కవి చూపిన వ్యక్తిత్వమును సైతము సహృదయుల యెదుట నిడవల యును.

ఒక భాషలోని రమణీయభావమును భాషాంతరమునకుఁ దెచ్చుట యనువాద లక్ష్యము. మూలమునందలి పదము లన్నింటి ననువాదకుఁడు దిగుమతి చేసెనా? లేదా? మూలమున లేని పదములు ప్రయోగించెనా? అలంకారమును విపర్యస్తము గావించెనా? అన్నది సరియైన విమర్శము కానేరదు. మాతృక యందలి రామణీయక మనువాదమున నెంతవఱకు వచ్చినది? వ్యర్థపదప్రయోగ మెంతవఱకుఁ బరిహృత మైనది? అన్నది ముఖ్యము. వ్యర్థ పదములు పానకములోని పుడకలు. కవి యశక్తతకు సాక్షులు. అనువాదముననేమి, స్వతంత్ర కావ్యమున నేమి వ్యర్థపదప్రయోగము సుతరాం పనికిరాదు. మూలచమత్కృతిపరిపుష్టికై యనువాదము కొంత స్వాతంత్ర్యము వహించుట దొసఁగు కాదు. మూలమునకు మెఱుఁగులు గూర్చు సందర్భములు విరళముగా నుండును. మూలముతో సరితూఁగలేని యనువాదములు పెక్కు. ఔను! ఒకరిభావము నొకరు చిత్రించుట మాటలా? తమభావమునకే రూప మొసఁగలేనికవు లెందఱు లేరు? కాఁబట్టి యనువాదము బహుముఖప్రజ్ఞాశాలికిఁ దక్క నన్యులకుఁ గొఱకరాని కొయ్య.

అనువాదమున నింకొక కిటుకున్నది. మూలము తత్కాల దేశ భాష సంప్రదాయాను గుణమై యుండుట నైజము. దానిని "తు,చ" తప్పకుండ ననువదించనిచో నది యాబాస కెబ్బెట్టుగాఁ గనిపించును. కావున ననువాదకుఁడు మూలభావమును స్వదేశ భాషాను రూపముగ మలఁచుకొని యనువదింపవలసి యున్నది. అట్లయినచో నది స్వతంత్ర రచనముగానే భాసించును. ఈ విషయమును గుర్తింపని యనువాద మదుకుల బొంత. అస్తు!

గీర్వాణభాషనుండి కావ్యనాటకాదు లనేకముల తెనుఁగునకు దిగినవి. అట్టివానిలో 'భర్తృహరిశతకత్రయ' మొకటి. మూల మాణిముత్తెముల కూర్పు. ఆ సొగసునకు మురిసిన పలుబాసలు దాని ననువదించుకొన్నవి. తెనుఁగుకవులు సైత మాతేనెపెర పిండుకొనిరి. అందు ముఖ్యులు పుష్పగిరి తిమ్మన, ఎలకూచి బాలసరస్వతి, ఏనుఁగు లక్ష్మణకవి. వీరి యనువాదములలో బహుళవ్యాప్తి గన్నది, ఆబాలగోపాల మెఱిఁగినది లక్ష్మణకవి కృతి. తెనుఁగున భర్తృహరి సుభాషితముల కింతవఱకు నది ప్రామాణికము, తలమానికము.

"కాలో హ్యయమ్ నిరవధి ర్విపులాచ పృథ్వీ"

అభినవతిక్కన కృత మగు నీ "తెనుఁగునీతి" భర్తృహరి నీతిశతకమునకుఁ దెనుఁగు సేఁత. ఈకవిని గూర్చి వ్రాయుట సూర్యుని దివిటీచేఁ జూపుట. తత్కవితావిమర్శము కడలి కేతా మెత్తుట. ఇంకేమి వ్రాయవలయును? అయినను వ్రాయక తప్పదు. అది వారి యాజ్ఞ.

ఈకవి తెనుఁగుఁదన మీకృతిలో నాద్యంత మనుస్యూత మైనది. నీతిశతకమునకుఁ దాను "తెనుఁగుముద్ర" వైచినాఁడు. అందుచే నది "తెనుఁగునీతి" యైనది. కానిచో తెనుఁగునీతి, అఱవనీతి-అని యుండునా?

ఈకవిచంద్రునిభావమునఁ దా నొక తెనుఁగువాఁడుమాత్రమే కాఁడు. పలుదెసలఁ జెదరియున్న ముక్కోటి తెనుఁగుబిడ్డల ప్రతినిధి. ప్రతిరూపము. తెనుఁగువాఁ డెచట నున్నను దెనుఁగువాఁడుగా మనవలయును. వేషభాషల యం దేమి, ఆచారవ్యవహారములం దేమి తెనుఁగుఁదనము లేని తెనుఁగువాఁ డీకవిదృష్టిలోఁ దెనుఁగువాఁడే కాఁడు. తానే తెనుఁగు గడ్డ. తానే తెనుఁగు బాస. తానే తెనుఁగులెంక. అట్టితనకృతి "తెనుఁగునీతి" కాకపోవుట యెట్లు?

ఇఁక నీకావ్యమునకు వెలకట్టవలె నన్న మూలమును, ప్రసిద్ధానువాదమగు లక్ష్మణకవి కృతిని ముందిడుకొని ప్రతిపద్యమును దూఁచవలసి యున్నది. ఆపనికిఁ బూనినచో నుపోద్ఘాతము కావ్యమునకు ముబ్బడి యగును. కావున స్థాలీపులాకము తక్క మార్గాంతరము లేదు.

అంధతమసమునఁ దారకలు సారించు వెలుఁగు కొంతకుఁగొంత మార్గదర్శక మగుట సత్యము. కాని జాబిల్లి మింట వెలసినవేళ మనకు స్పష్టతర వస్తుపరిజ్ఞానము కలుగుచున్నది.

పూర్వస్థితికంటె నిది ల గ్గనుభావము కల్గుట సహజము. అంతమాత్రమునఁ దత్పూర్వదశపై మనకు నిరాదరము లేదు. తారకలకు న్యూనత లేదు "మేర గలదె వలఁతివారినెఱికి". లక్ష్మణకవియెడ మాకుఁ గలగౌరవమునకుఁ గొఱంత లేదు. తత్కావ్యాపకర్షము సిసాధయిషితము కాదు. కాఁగా లక్ష్మణకవ్యభినవతిక్కనల కృతులను నిర్లిప్తభావమునఁ దూఁకమువేయ వలయును. అప్పుడుగాని వారి వ్యక్తిత్వము మన కర్థము కాదు.

లక్ష్మణకవి యథాశక్తి మూలమునందలి శబ్దార్థముల ననువాదమున స్వీకరించుటకుఁ బ్రయత్నించెను. ఇతని వాక్యనిర్మాణపద్ధతి సంస్కృతసంప్రదాయానురూపము. వృత్తముల నీకవి హెచ్చుగా వాడెను. అగుటచేఁ బద్యపూరణమునకై వ్యర్థపదప్రయోగములు, వ్యర్థవిశేషణ ప్రయోగములు నందందుఁ బొడసూపినవి.

అభినవతిక్కన యిట్టిలోపములఁ జక్కఁగా గుర్తెఱిఁగి జాగరూకత వహించెను. వీరి రచనలో మూలములోని శబ్దార్థములు గుణీభూతములై భావము ప్రాధాన్యము నార్జించుకొన్నది. తెనుఁగుఁదన మాద్యంతము కూలంకషమై జాలువాఱినది. శైలి గభీరరమణీయము. కవితకుఁ బ్రసాదగుణముతోపాటు జిగిబిగువులు హెచ్చు. కావ్య మామూలాగ్రము శోధించినను వ్యర్థ పదము కలికమున కైనను గానరాదు. గీతకందము లీకవికిఁ బెంపుడుచిలుకలు. వీనిని దాను వలచినట్లు పలికించును. వివక్షితార్థ మసందిగ్ధముగాఁ జెప్పుటలో నీకవి కనన్వయ మన్వయించును. పైవిషయములు సోదాహరణముగఁ బరిశీలింతము.

**"విద్యా నామ నరస్యరూప మధికమ్"** అను మూలశ్లోకమునను, లక్ష్మణకవికృత మగు తదనువాదమునను విద్యాపద మసకృత్ప్రయుక్తమై పద్యమును బృంహితము నొనర్చెఁ గాని చమత్కృతిని బెనుపలేదు. ఈపద్యమున కభినవతిక్కన యనువాదము పరికింపుఁడు.

**"అది దాఁచినసిరి నరునకు, నది సొగ సది కీర్తి సౌఖ్య మది గురు వది ప్రా**
**పది రాజపూజ్య మది వే, ల్పది చదు వది; చదువు లేనియతఁ డెద్దుగదా"!** (16)

'విద్యా' పద మసకృత్ప్రయుక్తము గాక సర్వనామవాచ్య మగుటయు, నంతటిపద్య మింతది యగుటయు నీకవి గడుసుఁదనమునకు సాక్షులు కాక పోవుట యెట్లు?

**"కాంతాకటాక్షవిశిఖా నఖనంతి యస్య"** అను శ్లోకమునకు

**"జవ్వనిచూపుందూపున, కెవ్వనిమది ప్రిదుల దల్క నెరియదు కోర్కుల్**
**కవ్వింప నోటువడ దతఁ, డువ్వెత్తుగ ముజ్జగమ్ము నోర్చున్ బేర్చున్"** (75)

అని యభినవతిక్కన యనువాదము. ఇది మూలమునకు సూత్రీకరణమో, భాష్యప్రవచనమో యేమని చెప్పవచ్చును?

**"శిర శ్శార్వమ్ స్వర్గాత్"** అను శ్లోకమునకు

**"గంగ దివిని వీడి కఱకంఠు తల వీడి, యద్రిపతిని వీడి యవని వీడి**
**జలధి వీడి తుదకుఁ జనెఁ బాఁపగడ్డకుఁ, దెలివిసెడినవారి యలఁతలిట్లె".** (9)

మందాకిని దిగుట కనువగు సోపానపంక్తియే కదా యీ పద్యము నందలి శబ్ద సముచ్చయము.

**"జాతి ర్యాతు రసాతలమ్"** దీనికి

**"మాకు రూక చాలు మగఁటిమి వలదు స, చ్చరిత వలదు వంగసమ్ము వలదు**
**కులము వలదు సొమ్ము కొఱవడ్డనాఁ డివి, గడ్డిపోఁచ కైనఁ గావు కావు".** (31)

అని యీకవి తెనుఁగుసేఁత.

**"య స్యాస్తి విత్తమ్ స నరః కులీనః"** ఈ శ్లోకమునకు

**రొక్కమున్నవాఁడె చక్కనివాఁడు స, త్కులమువాఁడు చదువుకొన్నవాఁడు**
**మెఱుఁ గెఱుంగువాఁడు నెఱపల్కువాఁ డగు, నెల్లపసలు పసిఁడి నెనసియుండు".** (32)

అని వీరి యాంధ్రీకరణము. ఇం దనువాద సహజలక్షణములు మందునకేని గలవా?

ఈశ్లోకమునకే లక్ష్మణకవియనువాదమును బరికింపుఁడు.

**"ఏనరునకు విత్తము గల, దానరుఁడు కులీనుఁ డాఢ్యుఁ డధికుఁ డతండే".**

వాక్యనిర్మాణమున యత్తచ్ఛబ్దప్రయోగము సంస్కృతమర్యాదానురూపము. కాని తెనుఁగుబాస కిది బరువుచేటు. యచ్ఛబ్దోపక్రమణమునఁ దత్తద్గుణ విశిష్టవిశేష్య ముపక్రాంతమై కడపటివాక్యమునఁ దచ్ఛబ్దపరామృష్టమై యుపసంహృతమగుపద్ధతియందుఁ బైవిధానము హృదయంగమము. ఉదా॥ **"ఎవ్వనివాకిట నిభమదపంకంబు రాజభూషణరజోరాజి నడఁగు"** (తిక్కన భారతము). ఇట్లే తక్కినచరణత్రయమున యచ్ఛబ్దోపక్రాంతుఁ డగు ధర్మసూతి **"అతఁడు భూరిప్రతాపమహాప్రదీప"** అనునెత్తుగీతమునఁ దచ్ఛబ్దోపసంహృతుఁ డగుటలో నొకవిచ్ఛిత్తి యున్నది. ఇం దట్టిది లేదు. ఇది మూలమును మక్కికి మక్కిగా ననువదించుటలోఁ దెనుఁగుసంప్రదాయమును విస్మరించుట.

మఱియు లక్ష్మణకవి రచనలో

**"దానము భోగము నాశము, పూనికతో మూఁడుగతులు భువి ధనమునకున్"** (34)

ఈ చిఱుపద్దెమున "పూనిక, భువి" యను వ్యర్థపదములు వచ్చి పీఁటవెట్టెను.

**"జానుగ భూతికిం దొడవు ... ... ... పూనికతోడ**
**సర్వగుణభూషణ మెన్నఁగ శీలమే సుమీ".** (80)

ఇందు "జానుగ, పూనికతోడ, ఎన్నఁగ" అనుపదములు పద్యమును నింపుటకు ముధా ప్రయుక్తము లాయెను. "దాక్షిణ్యమ్ స్వజనే" (18) అను శ్లోకమున కీయన కావించిన యనువాదములో మిక్కిలి కా లొకటి మొలచెను. ఏనుఁగువారికృతియం దిట్టి వట నటఁ గనిపించును.

అభినవతిక్కన యిట్టి మర్మముల గుర్తెఱిఁగి కృత్యాద్యంతము జాగరూకుఁడై మసలెను. అంతియ కాదు. కొన్నియెడల మూలమునందలి యస్పష్టతను బరిహరించెను. కొన్నిపట్టుల మూలమునకే మెఱుఁగులు పెట్టెను. ఇది యీకవి సిద్ధహస్తతకుఁ దార్కాణము. "ఆరంభగుర్వీ క్షయిణీ క్రమేణ" అను శ్లోకమునను దానికి లక్ష్మణకవి కావించిన యనువాదమునను గల యథాసంఖ్యము విషయావగతికిఁ గలిగించిన యంతరాయమును దొలఁగించిన యీకవి యెట్టి చిక్కుముడు లైనను విప్పఁగలఁడు. చూడుఁడు.

**"పగటి మొదటి నీడపగిది దుర్జనమైత్రి, తొలుత హెచ్చి యవలఁ దొలఁగఁ బాఱుఁ**
**బగటిచివరనీడపగిది సజ్జనమైత్రి, ముందు తగ్గి వెనుక ముమ్మరించు".** (49)

"అంభోజినీవనవిహారవిలాస మేవ" అను మూలశ్లోకమునఁ బ్రకృత విషయము లేమిం జేసి ప్రకరణాన్వయమునకుఁ బఠిత శ్రమింపవలయును. కాన నీ సందర్భమున **"నృపుఁడు రేఁగి బుధుల నెడసేయుఁగాని తత్ప్రతిభఁ బాపఁగలఁడె"** (14) అని మూలాతిరిక్త మగు ప్రాకరణికార్థము పాఠకున కందిచ్చుట యీ కవికే తగినది. **"సేవాధర్మః పరమగహనో యోగినా మప్యగమ్యః"** ఇది మూలము. **"రాజులం గొలుచుట శక్యమా? నొసట, గొమ్ములు సాగిన యోగికేనియున్"** (47) అని యీకవి యనువాదము. నొసటఁ గొమ్ములు సాగిన కవులకేని యిట్టి యనువాదము శక్యమా? యని నాయనుమానము.

అనౌచిత్యపరిజిహీర్షువగు నీ కవికి **"సురతమృదితబాలవనిత"**యు (35), **"అనంగకలహ క్రీడ"** యు (94) దూరముగాఁ దొలగిపోయెను. అనువాదమున నీ కవి చూపిన యిట్టి స్వేచ్ఛయే యీ కృతి సర్వాంగసుందర మగుటకుఁ గారణమైనది.

లక్ష్మణకవి యనువాదమున నిరతిశయ సౌందర్యమందిరము లగు పద్యములు పెక్కులు కలవు. నే నీ విషయము వాకొనకనిఁడు పక్షపాతి నగుట నిక్కము. అంతటియవసరము నా కేమి గలదు? "తుమ్మల" మడిమాన్యము లిచ్చెనా? 'ఏనుఁగు' ఎగ్గొనరించెనా? ఏదియు లేదు.

**"తనిసిరే వేల్పు లుదధిరత్నములచేత, వెఱచిరే ఘోరకాకోలవిషము చేత**
**విడిచిరే యత్న మమృతంబు వొడముదనుక, నిశ్చితార్థంబు వదలరు నిపుణమతులు".** (71)

ఇది చక్కని యనువాదము. ఇట్టిపద్యములు లక్ష్మణకవికృతియం దెన్నియేని గలవు. ఐనను నాముద్ర కేమి? సహృదయహృదయము కదా ప్రబలప్రమాణము.

**"రససిద్ధులు సుకృతులు కవి, రసాధిపులు నిత్యవిజయరాజితులు గదా!**
**మసలితనమ్మును జావున్, బొసఁగవు తత్కీర్తికాయమున కెన్నఁటికిన్."**

నల్లూరు
20-3-61

యార్లగడ్డ వెంకటసుబ్బారావు

# మనవి

మానవుని దిద్దితీర్చురచనలలో 'భర్తృహరి' నీతిశతక మగ్రగణ్యము. ఏనుఁగు లక్ష్మణకవి, ఎలకూచి బాలసరస్వతి, పుష్పగిరి తిమ్మన దీని నాంధ్రీకరించి తెల్గువారికిఁ గావించిన మేలు మఱవరానిది. అందును లక్ష్మణకవి పద్యము లాబాలవృద్ధము నిత్య పఠనీయములై ప్రసిద్ధికెక్కినవి. ముప్పదిమూఁడేండ్ల యొజ్జనము సాగించిన నేను వేర్వేఱు తరగతుల విద్యార్థుల కీపద్యముల నెన్ని విడుతలు బోధించితినో చెప్పఁజాలను. నిరంతర మగు నీ కృషియే న న్నీ నూతనానువాదమునకుఁ బురికొల్పినది. దీని యావశ్యకమును నిర్ణయించు నధికారము తెనుఁగువారికే కలదు. ఏది యెట్లున్నను "భర్తృహరి నీతిశతకము నెవ రెవరు తెనిఁగించిరి?" అను ప్రశ్న ముదయించినపు డీ తెనుఁగులెంకపేరు సైతము రవళించునుగదా. నా కిదియ చాలు.

ఈ కృతికి 'తిలకరేఖ' దిద్ది క్రొత్తచెలువుంగూర్చిన శ్రీ యార్లగడ్డ వెంకటసుబ్బారావుగారికి నా కృతజ్ఞతాపూర్వక ప్రశంసలు. వీరు "సాహిత్యవిద్యాప్రవీణ" పట్టభద్రులు. వీరి వైదుష్యము విశ్వతోముఖము. కవితయు నుదాత్తము. అయినను సన్నిహిత మిత్రులు మాదృశులు కొంద ఱకుం దక్క వీరి పెక్కువ యెల్లరకుం దెలియదు. ప్రసిద్ధులకుఁ బాఠములు చెప్పఁగల యేతాదృశు లెందఱో కలరు. వీరియెడ నాకుంగల గౌరవమే శ్రీ సుబ్బారావుగారి పీఠికను గోరుటకు నన్నుం బ్రేచి సంతృప్తుని గావించె. కావున శ్రీ యార్లగడ్డవారికి మఱల నా యభి నందములు చెల్లింతు.

వాస్తవిక దృష్టితో మూలార్థమును జూడం జూడ నీ రెండు పద్యముల నిట్లు వ్రాయసము సముచిత మని తోఁచినది. పాఠకులు వీనినే పాటింపుఁడు.

**శేషుఁ డిలను సైఁచు శిరమున; వానిఁ దా, మేటిమేటి వెన్నుమీఁద మోచు;**
**నతని లోఁచు నెదకు నలపోక జలరాశి; మేర గలదె వలఁతివారినెఱికి.** (27)

**గొప్పవా రాపదలఁ గలంగుటఁ గనంగ, జడవిధీ! పూనకుము రిత్తజతన మేల**
**కల్పమున నిజస్థితిఁ దప్పు నల్పగిరులు, కారు, క్షుద్రసముద్రముల్ గారు వారు.** (89)

**తుమ్మల సీతారామమూర్తి**

# సమర్పణము

నాతల్లి చెంచమాంబకు
నీతను విడి నాకు లోకహిత కవితా వి
ఖ్యాతి ఘటించిన తెనుఁగుం
జోతికి నీకృతి నతిప్రసూనం బగుతన్!

నా నుడిలో నడలోఁ గల
దేని ఋజుత్వమ్ము దాని కెల్లను శౌచ
శ్రీనిధి మజ్జనయిత్రి ని
దానం బని యెంతు భక్తితత్పరమతినై

అయ్యఋణము చేతనైనంతగా నీఁగఁ
బెనఁగినాఁడ *నతనిపెంపు సెప్పి;
తల్లిఋణము కబ్బ మల్లినఁ దీఱునే?
అమ్మపేర్మి కవిత కగ్గపడునె?

* ధర్మజ్యోతి వ్రాసి

# విషయసూచిక

# తెనుఁగు నీతి

ఆ. జ్ఞానమయము శాంత మానందమయము ది, క్కాలవస్తువుల నగమ్య మనఘ
మనుభవైకవేద్య మగువెల్గునకు భక్తి, నంజలింతు మంగళార్థి నగుచు.

## మూర్ఖపద్ధతి

గీ. పండితుల కీరసము హెచ్చు, పార్థివులకు, నగ్గల మహంత, ప్రజకు లేదయ్యెఁ దెలివి
నిక్కమిది యౌట నాలించుదిక్కు లేక, యడఁగినది మేలిపల్కు నాయెడఁద యందె. 1

ఈరసము = ఓర్వలేనితనము, పార్థివులకు = ప్రభువులకు, అగ్గలము = అధికము, అహంత = గర్వము, మేలిపల్కు = సుభాషితము, నీతి, ఎడఁద = హృదయము.

క. మొఱకున్ దెలుపుట చుల్కన, నెఱవాదిన్ దేర్ప నొక్కనిముసమ చాలున్
గఱచియుఁ గఱవనిమానవు, సరిదిద్దం జాలఁ డంత చదివిన విధియున్. 2

మొఱకున్ = మూర్ఖుని, తెలుపుట = ప్రబోధించుట, దిద్దుట, నెఱవాదిన్ = నేర్పరిని, తేర్పన్ = దిద్దుట, కఱచి = నేర్చి, విధి = బ్రహ్మ.

ఆ. మొసలి పంటి పగడమును లాగవచ్చు ను, దగ్రమైన జలధి దాఁటవచ్చుఁ
గసరుచిలువ నలరుఁగాఁ దల నిడవచ్చు, నజ్ఞుతీరు మార్ప నలవి గాదు. 3

ఉదగ్రము = భయంకరమైనది, చిలువన్ = పామును, అలరుఁగాన్ = పూవుఁగా, అజ్ఞుతీరు = మూర్ఖుని నడవడి.

గీ. వాలుకను బిండి తైలమ్ము వడయవచ్చు, నానవచ్చు మరీచికలోన జలము
శ్రమపడి గడింపవచ్చును శశవిషాణ, మద్దిరా! మూఢచిత్తమ్ము దిద్దలేము 4

వాలుక = ఇసుక, ఆనవచ్చున్ = త్రాగవచ్చును, మరీచిక = ఎండమావులు, గడింపవచ్చును = సంపాదింపవచ్చును, శశవిషాణము = కుందేటి కొమ్ము, అద్దిరా = ఔరా!

గీ. కరిని బిసతంతువునఁ గట్టు దిరిసెనంపు, టలరుతో వజ్రమును గోయు నబ్ధిజలము
తీయపడ నొక్కచిఱుబొట్టు తేనెచల్లు, నజ్ఞు సవరింప మధురోక్తు లాడునతఁడు 5

బిసతంతువునన్ = తామరతూఁడునందలి దారముతో, అలరు = పూవు, అబ్ధి = సముద్రము, మధురోక్తులు = తియ్యనిమాటలు.

(ఏనుఁగును బిసతంతువుతో బంధించుట మొదలగు పనులెట్లు వ్యర్థములో మూర్ఖుని మంచిమాటలతో సవరింపఁబూనుటయు నట్లే వ్యర్థమని తాత్పర్యము నూహించునది.)

క. లోపడి ప్రజ్ఞాపాటవ, లోపమ్మును గప్పి విబుధలోకమునెదుటన్
ప్రాపై నగయై తగ భా, షాపతి మౌనమ్ము వెట్టె జడసంతతికిన్. 6

లోపడి = స్వాధీనమై, ప్రజ్ఞాపాటవలోపమ్మును = బుద్ధిబలము లేక పోవుటను, విబుధలోకము = పండితసమూహము, ప్రాపై = అండయై, తగన్ = ఒప్పునట్లుగా, భాషాపతి = బ్రహ్మ, జడసంతతికిన్ = మూర్ఖుల సమూహమునకు, మౌనము = పలుకకుండుట.

ఆ. ఎఱుక యింత లేనితఱిని సర్వజ్ఞుఁడ, నని గజమ్మువోలె నామకొంటి
నేడు కొంత నేర్చి నేనెంత యని సుఖం, పడితి జ్వరమువోలె మదము విడువ. 7

ఎఱుక = తెలివి, అమకొంటిన్ = గర్వించితిని.

ఆ. ఎఱచి వోయి మురిగి పురుగులబుంగయౌ, ఖరమునెముక నొత్తి కొఱకువేఁపి
యింద్రుఁ డెదుట నున్న నిస్సిరో జంకదు, లేకి వలపు విలువలేని తలఁపు 8

ఎఱచి = మాంసము, ఖరము = గాడిద, వేఁపి = కుక్క, ఇస్సిరో = ఛీ ఛీ, లేకివలపు = నీచుని కోరిక, తలఁపు = కోరిక

ఆ. గంగ దివిని వీడి కఱకంఠుతల వీడి, యద్రిపతిని వీడి యవని వీడి
జలధి వీడి తుదకుఁ జనె బాఁపగద్దకుఁ, దెలివి సెడినవారి యలఁత లిట్లె. 9

దివిని = స్వర్గమును, కఱకంఠుతల = శివునిశిరము, అద్రిపతిని = హిమవంతుని, పాఁపగద్ద (పాము + గద్ద) = నాగలోకము, పాతాళము, అలఁతలు = బాధలు

ఆ. నీట నగ్ని, గొడుగునెఱి నెండ, బరిగోల; నేన్గు, బడియదెబ్బ నెద్దు, ఖరము,
మందుకతనఁ దెగులు, మంత్రమ్మున విషమ్ము, లొంగుఁగాని మొఱకు వంగుటెట్లు 10

నెఱిన్ = గొప్పతనముతో, బరిగోలన్ = అంకుశముతో, బడియ = దుడ్డుఁగఱ్ఱ, తెగులు = రోగము, మొఱకు = మూర్ఖుడు.

## విద్వత్పద్ధతి

సీ. వైదుషీమూర్తు లేరాజు వసుధ నర్థ, హీనులైయుందు రదిచాటు తేని జడత
బుధులు నిఱుపేద లయ్యు సంపూజ్యులగుదు, రజ్ఞుఁ డడఁచిన మణుల మూల్యమ్ము సెడదు 11

వైదుషీమూర్తులు=గొప్పపండితులు, చాటున్ = వెల్లడించును, జడతన్ = అజ్ఞానమును, అజ్ఞుఁడు = మూర్ఖుఁడు, అడఁచినన్ = తగ్గించినను, మూల్యంబు = వెల.

గీ. ద్రుచ్చునకు రాని యీవిచే లొచ్చువడని, చెడని సుఖకీర్తికరభంగి విడని గుప్త
ధనముకద విద్య తద్ధనోదాత్తులైన, వారికడ నిక్కకుండు చక్రవర్తులార! 12

ఈవి = ఇచ్చుట, లొచ్చువడని = తగ్గని, గుప్తధనము = దాఁపఁబడినసొమ్ము, తత్ధన ఉదాత్తులు = ఆ ధనముచే గొప్పవారు.

**క. పరమార్థవిదుల బుధులన్, నిరసింపకు రాజ! వారు నీబండారం
బరయుదురు గతికముక్కగఁ, గరికిన్ బిసతంతు వద్దుగా దెన్నఁటికిన్ 13**

పరమార్థవిదులన్ = శ్రేష్ఠమైన యర్థము లెఱిఁగినవారిని, బుధులన్ = పండితులను, నిరసింపకు = తిరస్కరింపకుము, బండారంబు = ధనమునుంచు కొట్టు, బిసతంతువు = తామరతూఁడు.

**ఆ. నృపుఁడు రేఁగి బుధుల నెడసేయుఁ గాని తత్, ప్రతిభఁ బాపఁగలఁడె బ్రహ్మ కినిసి
హంస కబ్జసరసి నాఁకట్టుఁ గాని పాల్, నీరు చీల్చునేర్పు నిలుపఁగలఁడె. 14**

నృపుఁడు = రాజు, రేఁగి = కోపించి, ఎడసేయున్ = తొలఁగించును, ప్రతిభన్ = అప్పటప్పటికి వికసించుబుద్ధిని, పాపన్ =తొలఁగింపన్, అబ్జసరసిన్ = పద్మములకొలనిని, ఆఁకట్టున్ = అడ్డగించును.

**ఆ. బాహుపురులు విరులు బన్నసరుల్ నెఱుల్, గందపూఁత యొడలికడుగు నరున
కందమిడునె వెలఁది యగుపల్కు గాక - యీ, నగయె నిల్చి తక్కునగలు పొలియు 15**

బాహుపురులు = భుజకీర్తులు, విరులు = పూలు, బన్నసరుల్ = మణిహారములు, నెఱుల్ = వెంట్రుకలు, ఒడలికడుగు = స్నానము, వెలఁది = పరిశుద్ధము, తక్కునగలు = ఇతరభూషణములు, పొలియున్ = నశించును

**క. అది డాఁచినసిరి నరునకు, నది సొగ సది కీర్తి సౌఖ్య మది గురు వది ప్రా
పది రాజపూజ్య మది వే, ల్పది చదు వది చదువు లేనియతఁ డెద్దుగదా! 16**

డాఁచిన = దాఁచిన, ప్రాపు = దిక్కు, వేల్పు = దైవము

**చ. కవనమె రాజ్య, మోర్పుటయె కంకట, మాప్తుఁడె మందు, వ్రీడయే
రవణము, విద్యయే సిరి, దురాశయుఁడే భుజగంబు, కిన్కయే
పవతుఁడు, పాలివాఁడె వనపావకుఁ; డీకవనాదు లున్నచో
నవసర మేమికల్గు మనుజావలికిన్ బ్రభుతాదికమ్ముతోన్. 17**

కంకటము = కవచము, ఆప్తుఁడె = మిత్రుఁడె, వ్రీడ = సిగ్గు, రవణము = నగ, దురాశయుఁడే = చెడ్డతలంపు గలవాఁడే, భుజగంబు = పాము, కిన్క = కోపము, పవతుఁడు = విరోధి, పాలివాఁడె = భాగస్థుఁడే, వనపావకుఁడు = అడవియందు రేఁగినమంట, అవసరము = అక్కఱ, మనుజావలితోన్ = మనుష్యుల సమూహముతో, ప్రభుతాదికము = రాజ్యము మొదలుగాఁగలవి

**ఉ. లెంకకు జాలి, వైరి కవలేపము, తేనికి నీతి, కూళకున్
బెంకెతనమ్ము, స్త్రీకి మదిబింకము, పెద్దకు నోర్మి, ధర్మికిన్
వంకరలేనిచెల్మి, బుధవర్యున కొయ్యన, బంధుకోటికిన్
బొంకము చూపు నేర్పుగల పూరుషులే మహి నిల్వ హేతువుల్. 18**

లెంక = సేవకుఁడు, అవలేపము = గర్వము, కూళ = దుష్టుఁడు, మదిబింకము = దిట్టతనము, ఒయ్యన = తిన్నన, మంచితనము, పొంకము = పొందిక, ప్రేమ.

**ఆ. మంచివారి చెలిమి మాన్పు నేరమిని, ద, బ్బఱ నడంచుఁ బేర్మిఁ బంచు, నఘము నీడ్చుఁ, బేరు దెచ్చు, నెడఁ దేర్చు; నది మాని, సికి నొసంగలేని సిరి హుళిక్కి. 19**

నేరమిని = అజ్ఞానమును, దబ్బఱన్ = అసత్యమును, పేర్మిన్ = గౌరవమును, అఘమున్ = పాపమును, ఎదన్ = మనస్సును, తేర్చున్ = శాంతిపఱుచును, హుళిక్కి = లేనిది (లేదు).

**క. రససిద్ధులు సుకృతులు కవి, రసాధిపులు నిత్యవిజయరాజితులు గదా ముసలితనమ్మును జావున్, బొసఁగవు తత్కీర్తికాయమున కెన్నఁటికిన్. 20**

రససిద్ధులు = శృంగారాది రసములు కలవారు, సుకృతులు = మంచి కావ్యములు గలవారు, కవిరసాధిపులు = కవిరాజులు, రాజితులు = ప్రకాశించినవారు.

# మానశౌర్య పద్ధతి

**ఆ. ముదిమి నున్న నెంత గొదగొన్న దిగజాతి, యున్న నుసురు వదలుచున్న సమద హస్తికుంభమాంస మాసించు మానవ, న్మౌళి సింహ మంటునా తృణమ్ము. 21**

గొద = ఆఁకలి, సమదహస్తి = మదముతోఁ గూడినయేనుఁగు, మానవత్ మౌళి = ఆత్మగౌరవము గలవారిలో మేటి, తృణమ్ము = గడ్డి

**క. వెడయెమ్ము నియ్యకొను శుని; కడుఁజేరువనున్న జంబుకము నంటక రూ పడఁచున్ గేసరి కరి; ని, వ్వడువున సత్త్వానురూప వాంఛలె పుట్టున్. 22**

వెడయెమ్ము = పనికిమాలినయెముక, శుని = కుక్క, చేరువ = సమీపము, రూపడఁచున్ = చంపును, కేసరి = సింహము, ఇవ్వడువునన్ = ఈరీతిని, సత్త్వానురూపవాంఛలు = శక్తికిఁదగిన కోరికలు.

**ఆ. వేఁపి నోరు పొట్ట చూపుఁగాల్గొట్టుఁ దోఁ, కార్చుఁ జలిదివైచు నతనియెదుటఁ గరి గభీరదృష్టిఁ బఱపి మావటి బతి, మాలి యొసఁగ మెసవు మేలితిండి. 23**

వేఁపి = కుక్క, ఆర్చున్ = ఆడించును, పఱపి = ప్రయోగించి, మేలితిండి - మంచితిండి, మెసవున్ = తినును.

**క. పరివర్తనశీలము సం, సరణం; బెవఁ డిందు డింది జనియింపఁ? దన శ్వరయశ మన్వయమున కే, నరుఁ డిదు నుత్పన్నుఁ డని యనన్ దగు నతఁడే! 24**

పరివర్తనశీలము = మాఱుటస్వభావముగాఁగలది, సంసరణము = సంసారము, డింది = చచ్చి, అనశ్వరయశము = నశింపనికీర్తి, అన్వయము = వంశము, ఉత్పన్నుఁడు = పుట్టినవాఁడు.

**క. అలరునకుబలె మనస్వికిఁ, గలవు గతుల్ రెండు; మనుజగణశీర్షమునన్ నెలకొనుట యొండె, నటవీ, స్థలమునఁ బడి యెండి చివికి సమయుట యొండెన్ 25**

అలరునకుబలె = పువ్వునకువలె, మనస్వికి = మానశౌర్యములున్న వానికి, శీర్షము = తల, నెలకొనుట = నిలుచుట, ఒండెన్ = కాని, సమయుట = నశించుట.

**ఆ. గ్రహము లెన్ని యున్న రాహు వన్నింటితోఁ, బెనఁగులాడ నొల్లఁ దనుపమాన**
**దీప్తి వెలయు నంబుజాప్తచంద్రములనే, మ్రింగఁజూచుఁ దలయ మిగిలి సెడియు. 26**
అనుపమానదీప్తిన్ = సాటిలేనికాంతితో, అంబుజాప్తుడు = సూర్యుఁడు, చంద్రముఁడు = చంద్రుఁడు

**ఆ. శేషుఁ డఖిలజగము శిరమున మోచుఁ దాఁ, బేటిమేటి వానిఁ ద్రేఁగు సైఁచు**
**నతనిఁ బంట నెత్తు నలపోత్రి; గఱువల, నెఱికి నెల్ల లేమి నిజము! నిజము! 27**
ద్రేఁగు = బరువు, పోత్రి = వరాహము, గఱువలనెఱికి = గొప్పవారి శక్తికి, ఎల్ల = హద్దు, లేమి = లేకపోవుట.

**గీ. శక్రవజ్ర మవక్రమై చఱవఁ జావు, గనుట మైనాకునకు లగ్గు కాని దాని**
**యుదుటుతోఁ దంద్రి మూర్ఛిలి యున్నవేళ, బ్రదుకుఁదీపి నతం డబ్ధిఁబడుట తగునె28**
శక్ర = ఇంద్రుని, అవక్రమై = తిరుగులేనిదై, చఱవన్ = కొట్టఁగా, లగ్గు = మేలు, ఉదుటు = తీవ్రత, అబ్ధిన్ = సముద్రమున.

**గీ. అరుణకాంతము జడ మయ్యు నంశుమాలి, పదము తన కంటెనా మండిపడఁ దొడంగు**
**నౌను! బగవాఁడు త న్నవమానపఱుప, నిబ్బరించునె తేజస్వి నిముసమేని. 29**
అరుణకాంతము = సూర్యకాంతశిల, జడము = ప్రాణములేనిది, అంశుమాలిపదము = సూర్యునికాలు, నిబ్బరించునె = సహించునా, తేజస్వి = పరాక్రమము కలవాఁడు.

**ఆ. చిన్నకూన యయ్యు సింగ ముద్ధత గజ, శ్రేణిపైకి దుమికి చీల్చు నొడలు**
**సత్త్వమున్నవారితత్త్వ మి ట్లుండు వి, క్రాంతికారణమ్ము కాదు వయసు 30**
ఉద్ధతగజశ్రేణి = గర్వించిన యేనుఁగుల వరుస, సత్త్వము = శక్తి, తత్త్వము = స్వభావము, విక్రాంతికారణము = పరాక్రమమునకు హేతువు

## అర్థపద్ధతి

**ఆ. మాకు రూక చాలు మగటిమి వలదు స, చ్చరిత వలదు వంగసమ్ము వలదు**
**కులము వలదు సొమ్ము కొఱవడ్డ నాఁడివి, గడ్డిపోఁచ కైనఁ గావు కావు. 31**
మగటిమి = పౌరుషము, వంగసము = వంశము, కొఱవడ్డ = లోపించిన, కావు – తగవు

**ఆ. రొక్కమున్నవాఁడె చక్కనివాఁడు స, త్కులమువాఁడు చదువుకొన్నవాఁడు**
**మెఱుఁ గెఱుంగువాఁడు నెఱపల్కువాఁ డగు, నెల్లపసలు పసిఁడి నెనసి యుండు 32**
మెఱుఁగు = నాణెము, నెఱపల్కు = మంచిమాట, ఎల్లపసలు = అన్నిగొప్పతనములు, ఎనసి కలసి

చ. మదిరను లజ్జ లౌల్యమున మస్కరి లాలనచే సుతుఁడు ప్రాఁ
జదువులు రామి విప్రుఁ డపసంతతిచేఁ దెగ దుష్టమంత్రిచే
నధిపుఁడు నీచసేవ నుచితాశయ మప్రణయానఁ జెల్మి నీ
తి దొఱఁగుటన్ విభూతి గణుతింపమిచే హాలికత్వమున్ జెడున్. 33

మదిర = కల్లు, లౌల్యము = ఆశ, మస్కరి = సంన్యాసి, లాలన = బుజ్జగింపు, ప్రాఁజదువులు = వేదములు, అపసంతతి = చెడ్డసంతానము, ఉచితాశయము = మంచితలఁపు, అప్రణయము = నమ్మకములేకపోవుట, తొఱఁగుట = వదలుట, విభూతి = ఐశ్వర్యము, గణుతింపమి = పరామర్శనము లేమి, హాలికత్వము = సేద్యము

క. ఇచ్చుటచేఁ గుడుచుటచే, ముచ్చిమిచే నడఁగు సిరులు; మొదలిటిరెంటన్
వెచ్చపడకున్న కల్ములు, పచ్చెమునం దొలఁగు నెట్టిపాఁతఱ నిడినన్. 34

కుడుచుట = అనుభవించుట, ముచ్చిమి = దొంగతనము, వెచ్చపడక = ఖర్చుకాక, కల్ములు = సంపదలు, పచ్చెము = దొంగతనము

క. ఒరపిళ్ళఁ బడినమణి నె, త్తురు కార్చినజోదు మదముఁ దొఱఁగిన కరి పెం
పఱిన శరన్నది యీవిని, సిరి వోయినవారలును రుచింతురు కృశతన్. 35

ఒరపిళ్ళన్ = రాపిళ్ళయందు, జోదు = యుద్ధవీరుఁడు, తొఱఁగిన = విడిచిన, పెంపఱిన = కృశించిన, శరత్ నది = శరదృతువునందలి యేరు, ఈవిని = త్యాగముచే, రుచింతురు = ఇష్టమగుదురు, కృశతన్ = చిక్కిపోవుటచే

క. సిరి చెడఁ జేరెఁడుగింజల, కొఱ కారట మందుఁ బసిఁడి కూడిన వసుధన్
గతిక వలెఁ జూచు నిక్కపు, నెఱి నెఱుఁగఁడు ధనికుఁ డర్థనిచయము పట్లన్. 36

నెఱి = గొప్పతనము, విలువ, అర్థనిచయము = ధనసమూహము

ఆ. వసుధ గోవు, జనము వత్స, మీయావుపాల్, త్రాగ నెంతువేని లేఁగ బ్రదుకు
మఱవఁబోకు మోయి! మనుజేశ! పుడమి నీ, కపుడె కల్పశాఖియై ఫలించు 37

వసుధ = భూమి, వత్సము = దూడ, శాఖి = వృక్షము, మనుజేశ = ఓరాజా, పుడమి = భూమి

ఆ. కల్ల - నిక్కువమ్ము, కఱకు - మెత్తఁదనమ్ము, హింస - కరుణ, లోభ-మీవిపెంపు,
ముమ్మరించువెచ్చమును - రాబడియుఁ గల్గి, వెలయు రాజనీతి వేశ్యరీతి 38

ఈవిపెంపు = గొప్పత్యాగము, ముమ్మరించు వెచ్చము = అధికమగు ఖర్చు, రాబడి = ఆదాయము

ఆ. శాసనము యశమ్ము సజ్జనపాలనం, బీగి భోగ మిష్టహితము సేఁత
లేని తేని కంజలించి గడించు మే, లేమి కలదు సెప్పవే మహీశ! 39

శాసనము = చట్టము, యశము = కీర్తి, ఈగి = ఇచ్చుట, ఇష్టహితము సేఁత = మిత్రులకు మేలుచేయుట, అంజలించి = మ్రొక్కి, గడించు = సంపాదించు, మహీశ = రాజా.

ఉ. వారిజసూతి నీనుదుట వ్రాసినవిత్త మెడారినైనఁ జే
కూరును మేరుశైలమునకున్ జనినన్ లవమేని హెచ్చు రా
నేరదు గాన దిట్టవయి నిల్వుమ, నీటిని బావియం దకూ
పారమునందు నొక్కమెయిఁబట్టు పనంటితెఱం గెఱుంగుమా 40

వారిజసూతి = బ్రహ్మ (పద్మజుఁడు) విత్తము = సొమ్ము, అకూపారము = సముద్రము, మెయి = రీతి, పనంటి = కడవ, తెఱంగు = పద్ధతి

# దుర్జనపద్ధతి

క. కఱకుఁదన మురకపోరుట, పెఱలసిరిన్ బరులసతులఁ బ్రేమించుట స
త్పురుషుల బంధుల నీర్ష్యన్, బరికించుట దుర్జనులకుఁ బాయనిగుణముల్ 41

ఉరక = నిష్కారణముగా, పెఱలసిరిన్ = ఇతరుల సొమ్మును, ఈర్ష్యన్ = ఓర్వలేనితనముతో, పరికించుట = చూచుట

గీ. అఖిలవిద్యాసమగ్రుఁడై యలరుఁగాక, ఖలుఁడు మన్నింపఁ దగువాఁడు కాఁడు కాఁడు
మణిమయూఖచ్ఛటాశ్లిష్టమస్త మౌను, గాక భుజగంబు ప్రాణాంతకంబు గాదె 42

సమగ్రుఁడై = నిండినవాఁడై, అలరున్ = ఒప్పును, ఖలుఁడు = దుష్టుఁడు, మన్నింపన్ = గౌరవించుటకు, మణిమయూఖ = మణుల కాంతుల, ఛటా = సమూహముచే. శ్లిష్ట = చుట్టఁబడిన, మస్తము = తలగలది, భుజంగము = పాము

చ. ఖలమతి సిగ్గరిన్ జడునిగా వ్రతనిష్ఠుని దంభిఁగా రణా
స్ఖలితుఁ గఠోరుఁగా బలిని గర్వినిగా ముని మూఁగవానిఁగా
వలఁతితనమ్మునం బలుకువానిని బ్రేలరిఁగాఁ దలంచు; నీ
తులువ మ తెట్టివాని గుణధూర్వహుఁగా గణుతించి మెచ్చునో 43

ఖలమతి = దుర్బుద్ధిగలవాఁడు, దంభి = టక్కరి, రణఅస్ఖలితున్ = యుద్ధమునుండి తొలఁగని వీరుని, వలఁతితనము = నేర్పు, ప్రేలరి = వదరుఁబోతు, గుణధూర్వహుఁగా = మంచిగుణములు గలవానినిగా

గీ. అపయశము సూచకత్వ మత్యాశ యున్న, మృతియు దురితమ్ము దుర్గుణంబేల సత్య
శౌచ సౌజన్య మాన్యతల్ జతనువడినఁ, దపము తీర్థమ్ము బలము సౌందర్య మేల 44

సూచకత్వము = కొండెము చెప్పుట, శౌచము = పవిత్రమగు మనస్సు, సౌజన్యము = మంచితనము, మాన్యత = గౌరవము, జతను వడినన్ = లేర్పడినచో, తీర్థము = పుణ్యక్షేత్రము

**చ. పవలిటి దెబ్బదిన్న శశి ప్రాయముజాతిన కాంత సారస**
**చ్ఛవి కెడయైన పెంగొలను చక్కనివాని యనక్షరాస్యమున్**
**ద్రవిణపరాయణప్రభువు దమ్మిడియున్ గఱవైనసాదు భూ**
**ధవు కడనుండు కూళయు నెదన్ గలఁచున్ శరసప్తకంబనన్** 45

శశి = చంద్రుఁడు, సారసచ్ఛవి = పద్మములశోభ, ఎడ = దూరము, పెంగొలను = పెద్దసరస్సు, అనక్షరాస్యము = చదువులేని నోరు, ద్రవిణపరాయణ = ధనలోభముగల, కూళ = దుర్జనుఁడు, కలఁచున్ = క్షోభపెట్టును, శరము = బాణము

**ఆ. కినుక పొంగి పొరలు జనపతి కాత్మీయుఁ, దెవఁడు కలఁడు నవసి తన్నుఁ**
**దనుపుహోత నైనఁ దాఁకిన నోర్చునా, కరుణ లేని యగ్ని కాల్చుఁ గాని** 46

కినుక = కోపము, ఆత్మీయుఁడు = తనవాఁడు, చుట్టము, నవసి= కృశించి, తనువు = తృప్తిపఱుచు, హోత = యజ్ఞముచేయించువాడు

**చ. పలుకక యున్న మూఁగ మఱి పల్కిన జల్పకుఁ డంతికస్థలిన్**
**బొలిచినఁ గొంటె దవ్వులకుఁ బోయిన దేబె సహింపఁ బంద నిం**
**దలదెసఁ దాల్మి వీడ ననుదాత్తకులుం డగు లెంక; రాజులన్**
**గొలుచుట శక్యమా నొసటఁ గొమ్ములు సాగిన యోగికేనియున్** 47

జల్పకుఁడు = వదరుఁబోతు, అంతికస్థలిన్ = సమీపప్రదేశమున, పొలిచినన్ = కనఁబడినచో, పంద = పిఱికివాఁడు, తాల్మి = ఓర్పు, అనుదాత్తకులుండు = నీచకులమువాఁడు, లెంక = సేవకుఁడు

**గీ. తులువలకు గద్దెలొసఁగి హద్దులు తొలంగి, కుక్క వలె మున్ను కుడిచిన కూడు మఱచి**
**గఱువలను ద్రోసి క్రొవ్విన కసటుదొరను, జేరి తనిసినవార లేసీమఁ గలరు** 48

తులువ = దుష్టుడు, గఱువ = గొప్పవాఁడు, కసటు = పాపము, తనిసిన = తృప్తిపడిన, సీమన్ = దేశమున

**ఆ. పగటి మొదటి నీడ పగిది దుర్జనమైత్రి, తొలుత హెచ్చి యవలఁ దొలఁగబాఱుఁ**
**బగటి చివర నీడ పగిది సజ్జనమైత్రి, ముందు తగ్గి వెనుక ముమ్మరించు** 49

పగిదిన్ = రీతిని, అవలన్ = పిమ్మటన్, ముమ్మరించున్ = అతిశయించును, వెనుకన్ = తరువాత

**ఆ. అడవి గడ్డిమేయు హరిణాదులను బోయ, జాలునీట బ్రదుకు మీల బెస్త**
**తనివితో సుఖించు ననఘులఁ గొండీఁడు, కలఁచు నేఁచుఁగద యకారణముగ** 50

హరిణాదులను = లేడి మొదలగువానిని, జాలు = ఏరు, మీలన్ = చేపలను, తనివి = తృప్తి, అనఘులన్ = పాపరహితులను, కొండీఁడు = చాడీలు చెప్పువాఁడు, కలఁచున్ = కలఁతపెట్టును, ఏఁచున్ = బాధించును

# సుజన పద్ధతి

ఉ. సజ్జనసంగ మన్యగుణసంపదపై ననురక్తి భక్తిమై
నొజ్జను గంట విద్యలకు నొగ్గుట నిందకు జంకు చిత్తపున్
జజ్జు రవంత లేమి తనజవ్వనిపైవల పాస్తికత్వమున్
విజ్జినజీవనమ్ము గలవిజ్ఞులకున్ దల వంచి మ్రొక్కెదన్ 51

సంగము = పొత్తు, అన్య = ఇతరుల, ఒజ్జ = గురువు, జజ్జు = దౌర్బల్యము, విజ్జిన = వ్యాపించిన, భక్తిమై = భక్తితో

చ. ఇడుమల నిబ్బరంబు సిరి హెచ్చిన నుద్ధతి లేమి రచ్చలో
నుడిపస యాహవస్థలి ననూనపరాక్రమరేఖ కీర్తికై
విడుమరలేని యారటము విద్యలకున్ దుదిలేని దీక్షతో
బడలుట మేటిమానిసికిఁ బాయని తీయని చందముల్‌గదా! 52

ఇడుమలన్ = ఆపదలలో, ఉద్ధతి = గర్వము, నుడిపస = మాటనేర్పు, ఆహవస్థలిన్ = యుద్ధరంగమున, అనూన = అధికమగు, విడుమర = విశ్రాంతి, బడలుట = శ్రమపడుట

ఉ. చేతికి నీవి నిక్కమును జెప్పుట మోమున కొజ్జయజ్జసం
గాతము కల్మి యౌదలకు గట్టితనమ్ము బుజాల కాత్మకున్
బూతమనీష వీనులకుఁ బుణ్యకథాశ్రవణమ్ము సొమ్ములై
ఖ్యాతి ఘటించుఁ బెద్దలకుఁ గాసులు రాసులు లేకపోయినన్. 53

ఈవి = దానము, ఒజ్జ ... కల్మి = గురువుపాదములతోడిచెలిమి కల్గుట, పూతమనీష = స్వచ్ఛమగుబుద్ధి, శ్రవణము = వినుట

గీ. ఒరుల నొంపమి పరవిత్త మొల్లకుంట, సత్యము వితీర్ణి లాలసాజయము ధర్మ
నిష్ఠ గురుభక్తి పరతరుణీకథా ని, వృత్తి సర్వమతప్రీతి యిడును శుభము 54

నొంపమి = బాధింపకుండుట, లాలస = అత్యాశ, కథానివృత్తి = కథలనుండిమరలు, ఇడును = ఇచ్చును, వితీర్ణి = దానము

ఆ. క్రొత్తకలువ కరణి మెత్తనిదై మహా, పురుషచిత్త మలరు సిరులు బెరయ
వెతలు చుట్టుకొన్నవేళలఁ బెనుఁగొండ, ఱాతివోలెఁ గఠినమై తనర్చు 55

కరణిన్ = రీతిని, అలరున్ = ఒప్పును, బెరయన్ = కూడఁగా, తనర్చున్ = ఒప్పును, వెతలు = ఆపదలు

ఉ. పాడిదొఱంగ నొల్ల రసుభంగము వచ్చినఁ దుచ్ఛమార్గముం
జూడరు వేఁడఁబోరు గుణశూన్యుల దైన్యము రెచ్చినన్ ధృతిన్
వీడరు లోకమాన్య పదవీనదవీయసియైన వృత్తి పో
నాడరు కత్తిపై నడుతు రార్యులు వీరికి నొజ్జ లెవ్వరో. 56

పాడితొఱంగన్ ఒల్లరు = ధర్మమును విడువనిష్టపడరు, అసుభంగము = ప్రాణహాని, రెచ్చినన్ = హెచ్చినను, ధృతిన్ = ధైర్యమును, లోక....నదనీయసి = లోకముచే గౌరవింపఁదగినబాటకు దూరముకానిది, పోనాడరు = వదలరు, ఒజ్జలు = గురువులు

ఉ. వేఁడఁగ వచ్చువానిఁ గని విచ్చినమోమునఁ బిల్తు రెవ్వరుం
జూడనిభంగి నిచ్చెదరు సుంతయుఁ జెప్పరు తా మొనర్చు మే
లోడక వెల్లడింత్రు తమ కొడ్డులు సల్పినలగ్గు నిందప
ల్కాదరు కత్తిపై నడుతు రార్యులు వీరికి నొజ్జ లెవ్వరో 57

విచ్చిన = వికసించిన, ఓడిక = సంశయింపక, ఒడ్డులు = ఇతరులు, లగ్గు = మేలు, ఉపకారము

ఉ. కాలినతేకుపైఁ బడి పొకారు జలం బది తామరాకుపై
వ్రాలి వెలందిముత్తెము తెఱంగున రంగులు చిమ్ము శుక్తిగ
ర్భాలయమందుఁ జేరినపు డయ్యది ముత్యమయై వెలుంగు నీ
లీలఁ బొసంగు లబ్ధులు మలీమసు మధ్యము నుత్తమున్ గనన్ 58

పొకారున్ = నశించును, వెలంది = శుద్ధమైన, శుక్తి = ముత్తెపుఁ జిప్ప, పొసంగున్ – ఏర్పడును, లబ్ధులు– లాభములు, మలీమసున్ – నీచుని, లీలన్ – విధమున

ఆ. తన సుచరిత్రచే నెవఁడు తండ్రిని దన్పు నతండపో! సుతుం
దనిశ మెవర్త భర్తృహితయౌ నదెపో! మగనాలు వేద్కలన్
వనటల నెవ్వఁ డొక్కమెయి వర్తిలు నాతఁడపో! సుహృత్తు చే
సిన సుకృతమ్ము లున్నతతిఁ జిక్కెద రీముగురున్ జగత్తునన్ 59

తన్పున్ = తృప్తిపఱచునో, అనిశము = సదా, ఎవర్త = ఏ స్త్రీ, మగనాలు = మగఁడు గల యాఁడుది, వనటలన్ = ఆపదలందు, సుహృత్తు = మిత్రుఁడు, సుకృతము = పుణ్యము

చ. అణఁకువచేత నుచ్చదశ నందుదు రన్యగుణ ప్రశంస కీ
కొని తమపెంపు లోకమునకుం బ్రకటింతురు లాఁతిమేలికై
పెనఁగి స్వకార్యసిద్ధి యొదవింతురు తిట్టినయట్టివారి నో
ర్మిన పనవింతు రద్భుతచరిత్రులు పూజ్యులు గారె సజ్జనుల్ 60

అణఁకువ = వినయము, నుచ్చదశ = చాల గొప్పతనము, ప్రశంస = పొగడుట, ఈకొని = ఇష్టపడి, పెంపు = గొప్పతనము, లాఁతిమేలికై = ఇతరుల క్షేమముకొఱకు, ఒదవింతురు = కల్గింతురు, ఓర్మిన = ఓర్పుచేతనే, పనవింతురు = ఏడ్పింతురు, పెనఁగి = తంటాలుపడి

# పరోపకార పద్ధతి

**ఆ. పండ్లు విరియుకొలఁదిఁ బనస వినమ్రమౌ, మొయిలు మింట వంగి ముసురుపట్టు**
**గఱువ సిరులపెంపు గని పొంగఁడు పరోప, కారు లిట్టు లుండ్రు గర్వపడక 61**

విరియ = అధికమగు, వినమ్రము = వంగినది, మొయిలు = మేఘము, గఱువ = పెద్ద, మింటన్ = ఆకాశమున

**గీ. కరుణ గలవారివీను చౌకట్లఁ గాక, శ్రుతముచే వెల్గుఁ గంకణద్యుతులఁ గాక**
**దానమున వెల్గుఁ జేయి చందనముకతనఁ, గాక మెయి వెల్గు లోకోపకారముననె 62**

వీను = చెవి, చౌకట్లన్ = నాల్గుముత్యాలు బిగించిన పోఁగులతో, శ్రుతము = శాస్త్రము, ద్యుతులన్ = కాంతులతో, చందనముకతనన్ = గంధముతో, మెయి = శరీరము

**గీ. వేఁడకున్నను రవి తమ్మివిరి నలర్చు, నడుగకున్నను శశి కల్వ కిడును విప్పు**
**కోరకున్నను మేఘుండు కురియు వాన, తనిపెద రుదారు లన్యులం దమకుఁదామె 63**

రవి = సూర్యుఁడు, తమ్మివిరిన్ = పద్మమును, అలర్చున్ = సంతోష పెట్టును, శశి = చంద్రుఁడు, విప్పు = వికసించుట, తనిపెదరు = తృప్తిపఱుతురు, ఉదారులు = దాతృత్వము కలవారు

**చ. తనపని మానియుం బరహితక్రియ కీకొను నుత్తముండు నే**
**ర్పునఁ దనలగ్గు మానక పరున్ దనియించును మధ్యముండు లాఁ**
**తిని జెడఁగొట్టి తాఁ గుడిచి త్రేఁచు నిసీ యధముం, డిఁకన్ వృథా**
**పెనఁగి పరార్థముం జెఱిచి పేర్చు నొకం డతఁ డెవ్వఁడోకదా! 64**

పరహితక్రియ = ఇతరులకు మేలుచేయు పని, ఈకొనున్ = ఇష్టపడును, లగ్గు = మేలు, తనియించును = తృప్తిపఱుచును, లాఁతిని = ఇతరుని, పరార్థమున్ = పరుల మేలును, పేర్చున్ = విజృంభించును

**గీ. కలుషమున కొగ్గనీఁడు మేల్ గఱపు నుడువ, రానికథ డాఁచుఁ గడగండ్లలోన విడువఁ**
**దక్కఱ నెఱింగి వలసినయర్థ మొసఁగు, మిత్రుఁ డీతని మెత్తు నామ్రేడితముల 65**

కలుషము = పాపము, నుడువరాని = చెప్పఁదగని, కడగండ్లు = ఆపదలు, ఆమ్రేడితములన్ = రెండుమూఁడు మాఱులు పలుకఁబడినమాటలతో

**ఉ. ఇచ్చెను దుగ్ధ మాత్మగుణ మెల్ల నిజాప్తత గన్నవారి కా**
**నెచ్చెలి క్రాఁగుటన్ గలఁగి నీరము నిప్పుల దూఁకె నీ రిటుల్**
**సచ్చుట కోర్వ కగ్నిఁ బడసాగిన పాలు జలమ్ము చేరుటన్**
**చెచ్చెరఁ దేఱె నుత్తముల చెల్మితెఱం గిటు లుండు నబ్రమై 66**

దుగ్ధము = పాలు, ఆత్మ = తన, నిజాప్తత = తన పొత్తు, వారి = నీరు, చెచ్చెరన్ = శీఘ్రముగా, తేఱెన్ = శాంతించెను, అబ్రము = ఆశ్చర్యకరము, తెఱంగు = విధము

చ. హరి శయనించు నొక్కదెస నాతనిశత్రువు లుందు రొక్కచో
గిరు లొకమూల దాఁగు శతకీలము బాడబ మొక్క తావునం
బరఁగు విశాల మూర్జిత మపారభర క్షమమౌ నయారె! సా
గరము; గరిష్ఠుఁ డాశ్రయముగా నగు నిమ్మెయి నెంతవారికిన్ 67

శతకీలము = పెక్కుమంటలుగలది, బాడబము = సముద్రము నందలి యగ్ని, ఊర్జితము = దిట్టతనముగలది, అపారభరక్షమము = గొప్పబరువును సహించునది, అయారె = ఆహా, సాగరము = సముద్రము, గరిష్ఠుడు = గొప్పవాఁడు, ఆశ్రయము = ఆధారము

చ. అడుగున నిల్చి నేలబరు వానెడు కచ్ఛపరాజు మింటిపై
విడిసి రవీందులన్ నడుపువేల్పు ధ్రువుండును ధన్యజన్ము లీ
నడుమఁ జరించువారు నలినప్రభవాండపు టత్తిపండులోఁ
బొడమి నశించు ప్రువ్వులను బోలుదు రెందును గానివారలై 68

కచ్ఛపము = తాఁబేలు, విడిసి = నిలిచి, రవీందులన్ = సూర్యచంద్రులను, నలిన టత్తిపండు = బ్రహ్మాండమను మేడిపండు, పొడమి = పుట్టి, ప్రువ్వు = పురుగు, కానివారలై = తగనివారై

గీ. ఆస విడు మోర్మి పూను మహంత వదలు
మలఁతిపని మాను మిజంబ పలుకు మార్య
సరణిఁ బొమ్ము బుధున్ గొల్వు మరిని సైఁపు
మడఁకువ యశమ్ము కరుణయుం బడసి మనుము 69

ఓర్మి = ఓర్పు, అహంత = గర్వము, అలఁతిపని = నీచమగుపని, ఆర్యసరణిన్ = పెద్దల మార్గమున, అరిని = శత్రువును, అడఁకువ = వినయము, మనుము = బ్రదుకుము, పడసి = సంపాదించి

ఆ. మనసు మాట చేఁత మాన్యమై తగ నొడ్ల, మేలు మరగి పెఱల మేటితనము
కొంచెమైన దానిఁ గొండంత సేయుచు, నెలమి వడయు పెద్ద లెంద ఱుంద్రు 70

చేఁత = పని, మాన్యము = గౌరవింపఁదగినది, ఒడ్ల = ఇతరుల, ఎలమి = ఆనందము, ప(వ)డయు = పొందునట్టి, మరగి = కోరి

## ధైర్యపద్ధతి

గీ కౌస్తుభముఁ జూప సంతృప్తి గనరు సురలు, కాలకూటార్చి రేఁప గగ్గోలుపడరు
కడలి యమృతమ్ము నిడుదాఁక విడరు పట్టు, దిట్ట లాఁగరు లక్ష్యమ్ము గొట్టువఱకు 71

కౌస్తుభము = ఒక మణి, కాలకూట అర్చి = విషాగ్ని, రేఁపన్ = రెచ్చఁగొట్టఁగా, గగ్గోలు = కలఁత, భయము, కడలి = సముద్రము

గీ. విఘ్నముల నెంచి పనిఁ బూన వెఱచు నధముఁ
దాఁకలకు లొంగి విడుచు మధ్యముఁడు తొడఁగి
యుత్తముఁడు చిక్కు లెన్ని తన్నొత్తుఁగాక
మొదలుపెట్టిన పని మానఁ డొదవుదనుక 72

విఘ్నము = ఆటంకము, ఆఁక = ఆటంకము, తొడఁగి = ప్రారంభించి, ఒదవుదనుకన్ = ఉపయోగపడువఱకు

చ. ఒకతతి గడ్డలం దొదిఁగి యొక్కతతిన్ సుమతల్పశాయియై
యొకతతి నాకులన్ మెసవి యొక్కతతిన్ సరసాన్నఖాదియై
యొకతతి గంత గప్పుకొని యొక్కతతిన్ మృదువస్త్రధారియై
యొకవిధిఁజూచుఁ గష్టసుఖయోగముఁ గార్యరతుండు ధీరతన్ 73

సుమతల్పశాయి = పూలసెజ్జపైఁ బరుండువాఁడు, మెసవి = తిని, ఖాది = తినువాఁడు, విధిన్ = రీతిని

గీ. నీతినిధి రోయుఁగాక మన్నించుఁగాక, కలిమి సకలమ్ము చెడుఁగాక నిలుచుఁగాక
యపుడ మృతి వచ్చుఁగాక దవ్వగునుగాక, పాడిదప్పఁడు ధీరుఁ డెప్పట్లనైన 74

రోయున్ = నిందించును, మన్నించున్ = గౌరవించును, మృతి = చావు, దవ్వు = దూరము, ధీరుఁడు = ధైర్యశాలి

క. జవ్వనిచూపుందూపున, కెవ్వని మది ప్రిదుల దల్క నెరియదు కోర్కుల్
కవ్వింప నోటువడ దతఁ, డువ్వెత్తుగ ముజ్జగమ్ము నోర్చున్ బేర్చున్ 75

జవ్వనిచూపుందూపునకున్ = యువతియొక్క చూపసెడి బాణమునకు, ప్రిదులదు = బ్రద్దలుకాదో, ఎరియదు = మండదో, ఓటువడదు = ఓడిపోవదో, ఉవ్వెత్తుగన్ = నిశ్శేషముగా, ఓర్చున్ = ఓడించును, పేర్చున్ = విజృంభించును

ఆ. విధికి లొంగుఁగాక వీరుండు తనగుండె, బిగువు దొఱఁగ నొల్లఁ డెగయునగ్నిఁ
బట్టి యెంత క్రిందుపతిచిన మీఁదికే, లేచు నతనిమంట లేచియేచి 76

తొఱఁగన్ = విడుచుటకు, ఏచి = పెరిఁగి

ఆ. కొండనుండి జాతి ఘోరాహినోటిలోఁ, జేయి వెట్టి వహ్నిశిఖల దూఁకి
మేను విడువవచ్చుఁ గాని సౌశీల్యంబు, విడువరాదు నరుఁడు వీసమేని 77

ఘోర అహి = భయంకరమగు పాము, వహ్ని = అగ్ని, సౌశీల్యంబు = మంచినడత, మేను = శరీరము

ఉ. వానికి నగ్గి నీర మగు వారిధి చింకయగున్ నగమ్ము పా
షాణ లవంబగున్ ద్విరదశత్రువు జింకయగున్ భుజంగ మ
మ్లాన సుమస్రజం బగు హలాహలధార సుధారసం బగున్
మానవుఁ డెవ్వఁ డార్యజనమాన్యపథమ్ము దొలంగకుండునో 78

చింక = చిన్నకాల్వ, ద్విరదశత్రువు = ఏనుఁగునకు విరోధి, సింహము, అమ్లాన = వాడని, సుమస్రజంబు = పూదండ

ఆ. తెగినచెట్టు మరలఁ జిగురించుఁ గుందిన, చందమామ మగుడ నందగించు
నిది యెఱింగి పెద్ద లిక్కట్లలోఁ గ్రుంగ, రెల్లి మంచి సేయదే యటంచు 79

కుందిన = క్షీణించిన, అందగించున్ = చక్కఁబడును, ఇక్కట్లలోన్ = ఆపదలలో, ఎల్లి = రేపటిదినము మగుడన్ = మఱలన్

చ. తెలివికి శాంతి యేల్బడికిఁ దిన్నన నేర్పున కోర్పు దట్టపుం
గలిమికి నర్థదానము మగంటిమికిన్ మితభాష పాండితీ
బలమునకున్ వినమ్రత తపమ్మునకున్ గసిలేమి పాడి క
చ్ఛలతయు భూషలై వెలయు సత్పురుషుల్ గడియింతు రీనగల్ 80

ఏల్బడి = రాచఱికము, తిన్నన = మంచితనము, మగంటిమి = పౌరుషము, వినమ్రత = వినయము, కసిలేమి = కోపము లేకుండుట, అచ్ఛలత = కపటము లేమి, గడియింతురు = సంపాదింతురు

## దైవ పద్ధతి

చ. అడిద మకుంఠితాశని బృహస్పతి యొజ్జ దివమ్ము కోట త
మ్ముఁడుహరి సైనికుల్ త్రిదశముఖ్యులు వాహము దిగ్గజమ్ముగా
నదరుబలారియున్ రిపుల కగ్గపడెన్ జెడెఁ గాన దైవ మొ
క్కఁడె శరణం బిసీ! పురుషకార మసారమ యెంత చూచినన్ 81

అడిదము = ఖడ్గము, అకుంఠితఅశని = మొక్కపోవని వజ్రాయుధము, దివమ్ము = స్వర్గము, త్రిదశముఖ్యులు = మేటిదేవతలు, వాహము = వాహనము, అదరు = అతిశయించు, బలారి = ఇంద్రుఁడు, రిపులకు = శత్రువులకు, అగ్గపడెన్ = లోపడెను, శరణంబు = దిక్కు, పురుషకరము = పౌరుషము, అసారమ = సారములేనిదే! (పనికిరానిదే!)

ఆ. పొట్టకొఱకు నెలుక బుట్టను గొఱికి యం, దలమటించు చిలువ కగ్గపడియెఁ
ద్రాఁచు దాని మెక్కి తరలె నాక్రంతనే, మేలుగీళ్లు గూర్చుమేటి విధియె 82

అలమటించు = దిగులుపడు, చిలువ = పాము, అగ్గపడియెన్ = చిక్కెను, విధి = దైవము

ఆ. విధిని విశ్వసించు విబుధుండు పడుఁగాక, బంతివోలె మగుడఁ బైకి లేచు
దైవదృష్టి లేని దద్దమ్మ పడి లేవ, లేక మట్టిముద్దలీల నుండు 83

విధిని = దైవమును, విశ్వసించు = నమ్మునట్టి, విబుధుండు = పండితుఁడు, లీలన్ = రీతిని

ఆ. తాటిచెట్టునీడఁ దల దాఁచుకొనె నెండ, నెవ్వ కోడి బోడినెత్తివాఁడు
రాలె నపుడె పండు ప్రీలె నాతనిశిరం, బదిర! దైవహతుని వదల దార్తి 84

నెవ్వకు = బాధకు, ప్రీలెన్ = పగిలెను, అదిర = ఆహా, దైవహతుని = దైవముచేఁగొట్టఁబడినవానిని, ఆర్తి = దుఃఖము

గీ. పాము లేన్గులు పుల్గులు బందిఁ బడుట, యర్కుఁ డిందుఁడు నీచగ్రహార్తిఁ గనుట
కోవిదులు కూడు లేక మూల్గుటయుఁ జూచి, విధి బలీయంబ యని సదా విశ్వసింతు 85

బందిన్ = చెఱయందు, అర్కుఁడు= సూర్యుఁడు, ఇందుఁడు = చంద్రుడు, ఆర్తిన్ = దుఃఖమునందు, కోవిదులు = పండితులు, బలీయంబ = మిక్కిలిబలముగలదే, సదా = ఎల్లప్పుడు, విశ్వసింతున్ = నమ్మెదను

ఆ. సకల గుణ ధన్యు జగతికి వెల్గులు, పంచువాని విధి సృజించుఁ గాని
యక్కటకట! యతని నల్పాయువుం జేయు, నేమినేర్పు వీని దేమితీర్పు 86

సకల ధన్యున్ = అన్ని మంచి గుణములచే పుణ్యము సంపాదించిన వానిని, విధి = బ్రహ్మ

ఆ. చంద్రుఁ దమృతరాశి శతభిషగన్వితుఁ, డోషధీశుఁ డీశ్వరోత్తమాంగ
భూష–యైన నేమి పొగులును దగ్గచే, నెవఁడు విధికృతార్తి నెదురఁగలఁడు 87

శతబిషక్ అన్వీతుఁడు = నూర్గురువైద్యులతోఁ గూడినవాఁడు, (శతభిషమను నక్షత్రముతోఁ గూడిన వాఁడు) ఓషధీశుఁడు = మందుచెట్లకు రాజు, ఉత్తమాంగభూష = శిరమున కలంకారము, పొగులును = బాధపడును, విధికృతఅర్తిన్ = దైవముచేఁ గల్పింపఁబడిన బాధను

క. కుమ్మరివలె విధి నాదు మ, నమ్మును మృత్పిండముఁగ నొనర్చి విపద్దం
దమ్మున బాఁది వ్యథాచ, క్రమ్మున నిడి త్రిప్పు నేమి కావించుటకో 88

మృత్పిండము = మట్టిముద్ద, విపద్దండమ్మునన్ = ఆపదలను కఱ్ఱతో, వ్యథా చక్రమ్మునన్ = దుఃఖములను చక్రమందు

ఆ. గొప్పవారిగుండె ముప్పులలో దస్సి, త్రెస్సి తునుఁగు ననుచుఁ దెలివిలేని
దయ్యమా! తలంప కియ్యబ్ధి లీగిరుల్, వెలితివడవు ప్రళయవేళనైన 89

త్రెస్సి = తెగి, తునుఁగున్ = ముక్కలగును, దయ్యమా = దైవమా, వెలితివడవు = తగ్గవు

ఆ. ప్రాపు లెట్టి వున్నఁ బ్రాణికి విధికృతం, బెంత కలదొ యంతయే లభించుఁ
గసరు ముసురు పట్టుఁగాక చాతకపక్షి, నోటిపాలు రెండునీటిబొట్లె 90

ప్రాపులు = అండలు, విధికృతంబు = దైవముచేఁ జేయఁబడినది

# కర్మపద్ధతి

ు. వేల్పులను గొల్తునా వారు విధికి లెంక, లగుట విధి నాశ్రయింతునా యది యొసంగు
ఫలము కర్మవిధేయమై వెలయుఁ గాన, నంజలించెద నిఁకఁ గర్మపుంజమునకె 91

లెంకలు = సేవకులు, కర్మవిధేయము = కర్మమునకు లోపడినది, అంజలించెద = నమస్కరించెద, పుంజము = సమూహము

ఋ. తెఱపికి వాఁచి కుమ్మరిగతిన్ జతురాస్యుఁడు సృష్టిసేఁతయున్
హరి పదిమార్లు పుట్టి వెత లందుటయున్ గిరిశుండు పుఱ్ఱెతోఁ
దిరియుటయున్ సదా గగనదేశమునన్ రవి పర్వుదీఁతయున్
దరిచినఁ గర్మనిఘ్నతఁ గదా కొనియాడెద నట్టికర్మమున్ 92

తెఱపి = విశ్రాంతి, చతురాస్యుఁడు = బ్రహ్మ, గిరిశుండు = శివుఁడు, తిరియుట = బిచ్చమెత్తుట, కర్మనిఘ్నతన్ = కర్మమునకులోపడుటచేత,

వ. పలువను సాదుఁగా రిపుని బంధువుఁగా ములుచన్ మనీషిఁగా
మలుచును గాలకూటమును మార్చి సుధం బొనరించు నింద్రియా
వలి కనలేనివస్తువు నవశ్యము చూపు నుదాత్తకర్మ; మే
ఫలమునకేని దీని నలుపం దగు విజ్ఞుఁ డనన్యచిత్తుఁడై. 93

పలువను = దుర్జనుని, సాదుఁగా = సజ్జనునిగా, రిపుని = శత్రువును, ములుచన్ = మూఢుని, మనీషిఁగా = పండితునిగా, మలుచును = మార్చును, కాలకూటమును = విషమును, సుధన్ = అమృతమును, పొనరించున్ = చేయును, ఇంద్రియావలి = కన్ను మొదలగు వాని సమూహము, ఉదాత్త = గొప్పదియగు, విజ్ఞుఁడు = నేర్పరి, అనన్యచిత్తుఁడు = ఇతర విషయములందు మనసు లేని వాఁడు

ఉ. చేసినపుణ్యకర్మమునఁజేసి హరుల్ కరు లంగనామణుల్
భాసురసౌధముల్ పరమభాగ్యము రాజ్యము వచ్చుఁ గాని త
ద్వాసన సన్నగిల్ల నలువంకలకున్ బరుగెత్తి యీసుఖా
లీసిరులున్ నశించుఁ దెగి యీడిన హారపు ముత్తియమ్ములై 94

హరుల్ = గుఱ్ఱములు, సౌధముల్ = మేడలు, వంకలకున్ = దిక్కులకు, ఈడిన = జాఱిన

క. ఏపని కైనను దూరపుఁ, జూపు వలయు వెనుక ముందు చూడనిపనిచేఁ
బ్రాపించుకీడు నరునెద, లోపల నలుఁగై ప్రవర్తిలున్ మృతిదనుకన్ 95

ప్రాపించు = కల్గు, ఎద = హృదయము, అలుఁగై = బాణమై, దనుకన్ = వఱకున్

చ. ఘనమణికుంభమం దతఁడు గందపుఁజెక్కల నూవుఁబిండి వం
దెను గదళీతరుల్ నఱికి నింపెను గంచెల నాళ్లచేనికిన్
గనకహలమ్ముతో నలంత గానక జిల్లెడు దూదికై మహిన్
దునియెను గర్మభూమి నిటఁ దోఁచి తపం బెతఁ డాచరింపఁడో 96

ఘనమణి = మేఘము (ఉఱుము) వలనఁబుట్టుమణి, వైదూర్యము ('వైదూర్యమయ్యాంస్థాల్యాం' అని మూలము), కదళీతరుల్ = అరఁటిచెట్లు, నింపెను = నిండించెను, అళ్లు = ఆరుగలు, కనకహలమ్ము తోన్ = బంగారు నాఁగటితో, అలంత = శ్రమ, దునియెను = దున్నెను (చూ. శల్యపర్వము 2–215 తిక్కన), తోఁచి = పుట్టి, ఎతఁడు = ఎవఁడు

ఆ. చక్కఁదనము చదువు జాతి శీలము రాచ, కొలువు తీర్పలేవు కోరికలను
బూర్వపుణ్య మొకఁడె పురుషునకున్ దగు, వేళ ఫలము నిచ్చు విటపివోలె 97

ఒకఁడె = ఒకటియె, విటపి = చెట్టు

ఉ. నీరధి మున్గుఁగాక గిరినెత్తము ద్రొక్కునుగాక మింటిపైఁ
బేరెముదీఁయుగాక మగపెంపున శత్రుల నోర్చుఁగాక బే
హార మొనర్చుఁగాక కళ లన్నియు నేర్చునుగాక కర్మ మా
ధారముగాఁగ వచ్చునది తప్పదు రానిది రాదు ప్రాణికిన్ 98

నీరధిన్ = సముద్రమున, గిరినెత్తము = కొండపైభాగము, పేరెముదీయున్ = పరుగెత్తును, మగపెంపునన్ = పౌరుషముచే, ఓర్చున్ = ఓడించును, బేహారము = బేరము, కళలు = విద్యలు

క. వనమున జలమునఁ జిచ్చున, రణమున శిఖరమున నిద్దురన్ మఱపున నె
ట్టినెగుళ్ల నున్న మును చే, సిన శుభకర్మంబు రక్షసేయున్ బురుషున్ 99

చిచ్చునన్ = అగ్నియందు, శిఖరమునన్ = కొండకొమ్మునందు, నెగుళ్లన్ = ఆపదలయందు

క. పున్నెముతో నుదయించిన, యన్నకు గహనంబు నగర మగు జగమెల్లన్
బ్రన్ననిచుట్టం బగు నెట, దున్నిన మహి రత్నరాశితోఁ గనిపించున్. 100

గహనంబు = అడవి, ప్రన్నని = చక్కని.



ఆ. భర్తృహరికృతమ్ము పరమార్థశరణమ్ము, నీతిశతక మాంధ్రజాతికొఱకు
నొసఁగెఁ దుమ్మలాన్వయుండు సీతారామ, మూర్తికవి తెనుంగుఁదుర్ర వైచి.

రచన : 1956–57

# మొగమాట

ఐ దా తేండ్లనాఁడు నే నొకపనిగల్గి యొక యధికారిని సందర్శించి నమస్కరించి నిలిచితిని. ఆయన నన్ను జంకెనచూపులతోఁ జూచుచు "Who are you" అనెను. వెంటనే నేను

"రాష్ట్రసిద్ధికొఱకు రక్తమ్ము గార్చిన
కవిని నేను గాంధికవిని నేను
బడలి బడలి తల్లిబాస కూడెము సేయు
కవిని నేను దేశికవిని నేను"

అని సడలింపులేని బిగువుతో నాశుకవితారూపమున నుత్తరించితిని. ఈ ప్రయోగము ఫలించినది. అధికారి ప్రసన్నుఁ డాయెను. "అహో! కవితా సరస్వతీ! నీ శక్తి కెన లేదు కదా!" యని తనిసితిని.

అపుడపుడు నా కీపద్యము తలఁపునకు వచ్చుచు, వచ్చినపుడెల్ల నొక యపూర్వానందమును గూర్చుచు నిట్లే నా జీవిత కవితా నిష్ఠలనుగూర్చి మఱికొన్ని పద్యములు వ్రాయవలయు నను కాంక్ష నొదవించెను. కలము పట్టితిని. మెల్ల మెల్లగా నీరచన కావించితిని.

ఇది యచ్చులోనున్నతఱి మహాకవి కాటూరి వేంకటేశ్వరరావుగారు పరమ పదించుటయు వారి ద్వాదశాహస్సునకు (5-1-1963) నేను 'కాటూరు' వెళ్లుటయు జరిగెను. నాఁటిసభలో వేంకటేశ్వరరావుగారియెడ నాకుఁగల గౌరవాభిమానములకు నడియాలముగా నీకృతిని వారికి సమర్పించి నా సంతాపభారము కొంత తగ్గించుకొంటిని.

అప్పుడే వెలువడవలసిన యీగ్రంథ మాయా చిక్కులవలన నేఁటికి వెలుఁగునకు వచ్చినది. సహృదయులు దీనిని సమీక్షింతురుగాక!

సీతారామమూర్తి
25-11-1963

# ఉడుగర

క. ఆ కాలమ్మున గౌతముఁ, డీకాలమునందు గాంధి యిద్దఱు హింసా
వ్యాకులజగతికి శాంతి, శ్రీకరులు దయావిధేయ జీవననిరతుల్ 1

క. అన్నా! వారలతెన్నులు, కన్నులు బాష్పాంబుఝురులు గాఁ గరఁగించెన్
నిన్నును నన్నును; నివి మన, పన్నినకైతలకు మూలబంధము లయ్యెన్ 2

గీ. పసిఁడిమేడలఁ దలిరాకుఁ బాన్పులందుఁ, గననిసౌఖ్యము గుడిసెలోఁ గటుతరార్త
సేవలోఁ గన్న లేజంట దేవునట్లు, వెలసె నింటింట నీ తెన్నుఁబలుకుపంట 3

గీ. పిండితివి రావణుని ఱాతిగుండెనుండి, భక్తిరసమును; హరిజనప్రాభవాను
రక్తిమై నీవు పల్కినసూక్తు లెల్ల, నంధ్రవాగ్దేవిగుడిగంట లగుచు మొరసె 4

క. ఓహో! కవిలోకమణీ!, జోహారులు కొనుము! చంద్రచూడ సపర్యా
దోహలుఁ డెట్టిన మధుర, వ్యాహారము నీకుఁ దక్కె వంశానుగతిన్ 5

క. ఈసర్వము నొకయెత్తుగ, నీసునకున్ గర్వమునకు నెంతయు దవ్వో
నీసుజనత యొకయెత్తుగ, దాసినచుట్టంబ వైతి ధర నెల్లరకున్ 6

గీ. ఒండొరులు చేరినపుడు "కాటూరి" కులుఁడు, మిక్కిలిగ నన్నె నన్నె ప్రేమించు ననుచుఁ
బెనఁగుదురు నీప్రసక్తిలోఁ దెనుఁగు వార, లెంతపండి తహో! వేంకటేశ్వరకవి! 7

ఆ. కదలినాఁడ వీవు వదలి యీజంజాట, మిటకుఁ దిరిగిరానియెడకుఁ గడకు;
నిన్ను మఱవఁజాలకున్నారు మాదృశుల్, మదిని ముమ్మరించు మమతకతన 8

క. నీ సంస్కృతి చిహ్నముగా, నీ సత్కృతి నీ కొసంగి యే నిపుడు సమా
శ్వాసిత చిత్తుఁడ నయ్యెద, నో సుకవీ! స్వీకరింపు ముడుగర దీనిన్ 9



# నేను

ఆ. రాష్ట్రసిద్ధికొఱకు రక్తమ్ము గార్చిన, కవిని నేను గాంధికవిని నేను
బడలి బడలి తల్లిబాస కూడెము సేయు, కవిని నేను దేశికవిని నేను 1

ఆ. కల్ల కసటు లేనిపల్లెలో నాఁగలి, దున్నువారు నన్నుఁ గన్నవారు
మడికి నొక్కపూఁట బడి కొక్కపూఁటగా, దాఁటినాఁడఁ జిన్నతనము నేను 2

ఆ. హలము మాని, కలము నందితి నిటఁ గీడు, మేలు నుడువలేనివేల నైతి
హలము మాని రోగినై కలంగితిఁ గానఁ, గలము నంది కీర్తిఁగంటిఁ గాన 3

◆ ◆ ◆

క. ఒకతిమ్మఁదనము ద్రిక్కన్, సకలశ్రీ లొసఁగె నాకు సర్వేశ్వరుఁ; డా
యొకటియు నొసఁగిన గర్వా, ధికతన్ జెడియుందునేమొ ధిక్కృతవిధినై 4

ఆ. పప్పు, పెరుఁగు, దుంప పద; దావ, గుమ్మడి, యెదురుదిరుగు; దీని కేమిగాని
వింగడించు నాకు గోంగూరముద్దయుఁ, బంతగించి 'శూల' యెంతచేసె! 5

ఆ. అకట! తెల్గునేల, నందును గుంటూరు, మండలమునఁ బుట్టు మానవుండు
కొసరి కొసరి యింత గోంగూర దిననిచో, నేమిమెతుకు వాని దేమిబ్రతుకు? 6

క. ఈ మే నెంత నలంగిన, నామనుగడ లోకసేవనమ్మున కిడెదన్
సామాజిక కల్యాణము, కామించెద నవ్యభవ్యకవితాసృష్టిన్ 7

ఆ. కవిత నాకు మందు, కవిత నా కాపోక, నొసఁగువిందు, పద్య మొకటి వ్రాసి
మంచిరచన యని తలంచితినా నన్నుఁ, గదియు నపుడు భద్రగజబలమ్ము 8

క. నాకవితారీతిం గని, లోకమ తలయూఁపెనా! విలుప్తం బగు నా
చీకుం జింతయు నొక్కట; వ్రేఁకన లన్నియును వెంటవెంటన సడలున్ 9

క. కవితాసృష్టి నిరంతర, నవతాసంధాత్రి యగుట నవఁతం గన; నీ
భవమున నా కజుఁ డిచ్చిన, భవికమ్ముల నిదియ మేలుబంతిగ నిలుచున్ 10

క. సరసోక్తులతో నెయ్యురఁ, గరఁగించెద బుడుతవోలె గంతుల నిడెదన్
మఱి పెఱుఁగను విధి వీడను, జర కోడను గైతబలిమి సమకుఱి యుంటన్ 11

◆ ◆ ◆

ఆ. ఎట్టు లుండుఁగాక యేను వృద్ధుండన, కాని మామకీనకవిత ప్రౌఢ;
యెనిమిదేండ్లమాత్రమే యిది నా కంటెఁ, జిన్న; దైన నేమి చెన్ను విడదు 12

క. నాపాలిదేవి యిది మ, త్తాపమ్ముల నణఁచు మలయతరుశాఖ గదా!
రే పవలు దీని విడువక, ప్రాపించెదఁ బుష్టి బుధసభాసుమవృష్టిన్ 13

ఆ. కవిత నుజ్జగింపఁ; గాని గంటకు నొక, వందపద్యములను వ్రాయ నొల్ల;
నిలిపి నిలిపి కూర్తు నెల కొండు రెండైన, వాపు గాదు బలుపు వలయు నాకు 14

ఆ. ఆశుధార నైన నవధానముల నైనఁ, జప్పచప్పకైత కొప్ప నేను
గుంటువడనినడక దంటల రంజించు, పద్యమే వచింతు బ్రాహ్మికరుణ 15

గీ. "వ్రాసినది సవరించునభ్యాస మెపుడు, లేదు నా" కను కవి నెట్టు లాదరింతు
గణము లిమిడిన యంతన కైత యగునె, యౌచితీశౌచముఖదీప్తు లమరకున్న 16

ఆ. క్రోఁతికొండముచ్చు కుప్పిగంతులు వోయి, ప్రాణి మానుషత్వ మూనుకరణి
మాఱి మాఱి కవిత మహనీయతన్ గని, వాసికెక్కు నమరవాణి యగుచు 17

గీ. మాటమాటయు వాగ్దేవికోట గాఁగ, గోటలోఁ దావు లెగఁజిమ్ముతోఁట గాఁగఁ
దోఁట నురలెడి క్రొందేనెతేట గాఁగఁ, దీర్చినది కైత మెఱుఁగుదిద్దినది కైత 18

క. "కారణజన్ములదెస కీ, తీరుపు చన" దన్న ననుమతించెద; గానీ
కారణజన్ములు దినదిన, మూరుదురా? నేఁటి కిద్ద ఱొదవిరి మనకున్ 19

◆ ◆ ◆

క. నైతికపునరుజ్జీవన, జాతీయవికాస, విశ్వజనతాశ్రేయః
ప్రీతము ముచ్చేతము; నా, కైతము తద్దర్పణమ్ముగా నుదయించున్ 20

క. ఉపదేశైకపరాయణ, మపవర్జితలాభలోభ మస్మత్కవనం;
బపథప్రతిరోధక మీ, తపమని భావించి పట్టుదప్పక నిలుతున్ 21

ఆ. కృతిని జీవగఱ్ఱగతి నుపదేశమ్ము, -కుదురుకొనుట మేటి గుణము గాన
జాతి కుపకరించు సందేశమును గళా, న్వితముగా వచించువితము నాది 22

గీ. "ఇన్ని నీతులు సెప్పితి, నింత వెక్కి, రించితిని ధర్మువున్ గికురించువారి,
నన్ను నే దిద్దుకొంటినా" యన్న మథన, మేను విడువ కించుక తలయెత్తఁగంటి 23

ఆ. నిత్యసత్యవచననియతిమై బుధసమా, రాధనేచ్ఛమై నిరంతరేందు
మకుటచరణభక్తిమైఁ గాక యలవోక, వినుతికెక్కెనా కవిత్రయమ్ము 24

క. శోకము శ్లోకంబయి వా, ల్మీకి మహాకవిపదాన మెఱసె నటన్నన్
లోకమునార్తి నిజార్తిగ, నీకొనుకవి గెల్చు ననుటయే తేటపడున్ 25

క. "మీపద్య మొక్కటియ నా, లోపలి చీఁకటిని జీల్చి లోకశ్రేయో
వ్యాపృతుని జేసె న"న్న ని, కాఁ పొకరుఁడు తన్ను మెచ్చుఁగా బ్రొన్పడితిన్ 26

గీ. వదలె నధికారవాంఛ, సంపన్మదమ్ము, వదలె, లోభాది వికృతులు వదలె నితఁడు
కదలె భూదానకర్తగా గ్రామసేవ, మరగి మల మెత్తుమనిసిగా మనసు పండి 27

క. దొప్పలపూఁడికిబలె మన, కుప్పమ్ములకెల్ల నిట్టిగుణనిధి ప్రజకై
రొప్పెడివాఁ డొక్కొక్కఁడు, చొప్పడునే నవని దివిని జులుకన్ గనదే 28

ఆ. 'వట్టికూటి' వారివంశాన 'వేంకట, సుబ్బ' యాఖ్య నలరు సుకృతి యిఁతడు
త్రెళ్ళఁజేసెనంట* 'క్రుళ్ళిన యెముకకై'' యనెడుపద్య మితని యవగడముల 29

ఆ. కవిత కింతచేవ కలదె? యొ నొకనాఁడు, తిక్కయజ్వ కాకతీయనృపతి
నాంధ్రభారతోక్తి నలరించి కరఁగించి, నిజమహీశుపరువు నిలుపలేదె! 30

క. "నిలు! నిలు! రాజా! తెఱచిన, యిలు సొచ్చెదుకుక్క వౌదువే?" యని యలనాఁ
డలసానిసుకవి పల్కిన, వెలవెలనై యొద్దెతేఁడు వెనుకకుఁ జనఁడే 31

ఆ. అదిర! శబ్ద మెంతయద్భుత మిది పైర, గాలివంటి దయ్యుఁ గన్నెకలువ
తేకువంటి దయ్యు లోకాల నదలించు, పిడుగు నణఁచికొట్టు పిట్టపిడుగు 32

క. ఎట్టిపిదు గైన నే మిది, పుట్టింపద చెట్ట; దీనిపోయిన బాటన్
నెట్టుకొని పొంగు నెయ్యము, చుట్టము లయ్యేదరు పగల స్రుక్కెడివారున్ 33

ఆ. నిశితసంయమమ్ము నిర్భరసత్యమౌ, వాకు గెల్చు నెల్లలోకములను
వాకుబలిమి లేనివాఁ డవివేకి యై, బాఁకుబలిమి కాసపడి నశించు 34

క. సత్యానుచరము సాహితి; నిత్యము నమృతాంశు వెంటనే కదలుచు సౌ
హిత్యము నిడి యజడ జడ, క్షిత్యవనము సేయు చాంద్రికిన్ సవ తిదియే 35

* ఈ పద్యము నా 'అమరజ్యోతి' లోనిది.

ఆ. నరుల సురలఁ జేసి నందనసుమన స్స, ముగ్ధసౌరభముల ముంచియెత్తుఁ
దత్త్వవిదులఁ జేసి తనియించు నక్షరా, నంపదముదెసకు నడిపి కవిత 36

గీ. బాహిరం బైనప్రకృతికి భయదశాస, నము సృజించి భూపతి సమాజమును గాచు
నాంతరంబైన ప్రకృతికిఁ గాంతవోలె, హితము వినిపించి కవి ప్రోచు నీ జగమ్ము 37

ఆ. కవియు ఋషియు నొక్కగతినుందు; రిద్దఱు నిర్వికారు లయ్యు దుర్వికార!
దళితలోకమునకు ద్రష్టలై బోద్ధలై, లగ్గు గూర్తు రని తలంతు నేను 38



గీ. బీరమును మెత్తుఁగాని సింగారమును గ, ణింప నోదెద వస్తువున్ నెమకుపట్ల
గుణమునకు లోపడెదఁ గాని కులమతాది, పరిధులకుఁ జిక్కి నగుఁబాట్లపాలు గాను 39

క. నెఱిఁ దక్కి జక్కితోఁకకు, బిఱబిఱఁ గళ్ళెమ్ము వెట్టి పెడసర మొల్లన్
దఱిఁ దప్పక లోకముతోఁ, బరుగెత్తెదఁ గాని బోర్లపడ నొకనాఁడున్ 40

ఆ. నేల విడిచి సాము నెఱపిన య ట్లుండు, సంఘగతికి దవ్వుసాగి ప్రాఁత;
యుక్తిచణత గాదు యుగలక్షణము గుబా, ళింపవలయుఁ గావ్యలేఖనమున 41

క. పన్నాలవారి మేఁకల, జన్నము గా దిపుడు సర్వసమతాయోగ
స్విన్న మగుబ్రదుకె జన్నము, ప్రన్నని కృతు లీపథానఁ బల్కుట వలయున్ 42

గీ. ప్రాఁత దన్నది సర్వంబు రోఁత గాదు, క్రొత్త దన్నది సర్వంబు గుణము గాదు
ప్రాఁతక్రొత్తలలో మేలిరీతు లెఱిఁగి, చేయవలయును సాహితీసృష్టి సుకవి 43

క. దేవుఁడు కలఁ డని చెప్పిన, ప్రావక్కణ వలయుఁ గాని బాఁపలు మాలల్
దేవునిగుడి కర్చకులై, పోవచ్చు నటన్న క్రొత్తబోధయు వలయున్ 44

ఆ. మనువు చెప్పె ననుచు మాతాతమేనత్త, పాడె ననుచు మొండిపట్టు తగదు
మనువుమాట తనసమాజమునకు; మన, మాట యన్న మనసమాజమునకు 45

గీ. ఎన్నిమార్పులు వచ్చెనో యింక నెన్ని, వచ్చునో మార్పులు సమాజవర్తనమున
మార్పు వల దనువారు గోమాంస మేల, మెక్కరొకనాఁడు మనఋషుల్ మెక్కినట్లు46

ఆ. రాజ విష్ణు వన్న రక్కెసనుడి నేఁడు, ప్రజయ రా జటన్నఁ బ్రన్నపలుకు
కనులు చెవులు నుండి కనలేని వినలేని, మాసిమాట కేమి బోసిమాట 47



గీ. కృతిపతిత్వము కీర్తికి హేతు వగుట, నీశ్వరుఁడు కీర్తిమయుఁ డౌట నేను భగవ
దంకితము సేయ నొడఁబడ నస్మదీయ, కావ్య మాస్తికధర్మానుగామి నయ్యు 48

గీ. ఈశ్వరుని జాటఁగా మర్త్యుఁ డెవఁడు? వీని, కైత కతఁ డుబ్బు ననుటయుఁ గల్ల కాన
హేమగిరికి వరాటిక నిచ్చినట్లె, నరుఁడు తనరచనమ్ము నీశ్వరున కిడుట 49

క. శమమున దమమున భక్తి, క్రమమున హరికరుణ చిక్కుఁగాని మహాకా
వ్యము లెన్ని సమర్పించిన, సమకుఱునా దైవతప్రసాదము కవికిన్? 50

క. అయ్యైతెన్నుల విశ్వ, శ్రేయము సంధించునరుని శ్రీమత్కవితా
నాయకు నొనర్చి తద్యశ, మాయుష్మంతముగఁ జేఁత యక్కఱ కవికిన్ 51

ఆ. నరునిపేరు నిల్పునది కైత గాక వే, ఱొండు కలదె కవిత నొదిఁగి మెఱయు
పురుషుఁ జూచి యొరులు పూనెద రుత్తమా, చార; మది శుభం బొసంగు నిలకు 52

ఆ. కవు లుపేక్షసేయఁగా నెందఱెందఱో, మాననీయు లవని మఱుఁగువడిరి
యేను బూనకున్న నెవ్వ రా *కొసరాజు, లక్ష్మయ ప్రథన్ దలంచువారు? 53

ఆ. కావ్యబాంధవమ్ముకతన రారాజులే, కాదు నిల్చినారు పేదలైన
నెవ్వ రెఱుఁగకుంద్రు గువ్వలచెన్నప్ప, నదిర! కావ్యశక్తి కెదురులేదు 54

ఆ. కృతిని సుకృతి కోరఁ; డతఁడు ఫలాసక్తి, లేని లోకసేవలో నలంగు;
నతని వెదకి కావ్యపతిఁ జేసి కృతకృత్యుఁ, డగుట వలయుసాధు వైనకవికి 55

క. హితులకుఁ బరార్థఘటనా, వ్రతులకుఁ గృతు లిత్తుఁ గాని వారివరాలన్
మతిసేయను సంఘఋణ, చ్యుతికింబలె నిట్టిపనికి నుద్యోగింతున్ 56

ఆ. ఇతని కున్నకల్మి కీ తలబిఱు సేమి, యనుచు నన్నుఁ జూచి సణుగు నొకఁడు
లేవు లేవు కలిమిలేములు పరితృప్తి, గన్నవాని కనుచుఁ గరఁగు నొకఁడు 57

♦ ♦ ♦

ఆ. అర్థమైనఁ గామ మైన ధర్మువునకు, దూరమైన రోసి త్రోసివైతు
నిప్పువంటివారినెఱి గుఱిగా నిల్పి, పిన్ననాఁటినుండి పెనఁగుచుందు 58

క. ఆసకు లొంగక తొమ్మిది, వీసెలపైచిలుకు పరులవిత్తము వసిఁడిన్
ద్రోసిన మత్పిత నారయ, వాసియ నను దిద్ది యింతవానిని జేసెన్ 59

* నా 'పఱిగపంట' కృతిపతి

ఆ. నీతి నేర్పె ధర్మనిరతి నేర్పె నుదార, సరణి నేర్పెఁ జదువు సంధ్య నేర్పె
నేర్పరింప నేది నేర్పఁడు నాకు నా, రయ్య సకల సుగుణ రత్నరాశి? 60

క. నారయ్యదీప మని త, త్కారుణ్యముకతనఁ బెంపు గాంచినపేదల్
మూరింబోవు కృతజ్ఞత, నౌరా! యొకదివ్య నిడుదు రన్వహ మింటన్ 61

గీ. అప్పు చెల్లించుపస లేనియతని కావు, పెయ్య నిడు దూడపాలి కీయయ్య పిలిచి
మమ్మ! యధమర్ణుఁ డాదూడ నమ్మి ఋణము, దీర్చుకొని విచ్చు నాతండ్రితీరు మెచ్చు 62

క. వేఁబోక భాగవతమున, సాఁబాలు పఠించు నితఁడు సంయతమతియై
నాబాల్యం బీవినుకలి, లోఁ బడసెన్ భక్తి నఘువిలుంఠకశక్తిన్ 63

గీ. రాముఁడూ! కలయందైన రాచబాటఁ, దప్పఁజన దని సెప్పినయప్ప యేను
వీనుమిగిలిన బంగారువేళ లేమిఁ, దద్ద వగచెద నిది నాకుఁ బెద్దచీకు 64

క. నా పితయుఁ బితామహులున్, శాపానుగ్రహసమర్థ సచ్ఛీలవిభా
దీపితు లయ్యు నెఱుంగరు, కోపము, కరుణాగుణానుకూలత దక్కన్ 65

క. నాతల్లి చెంచమాంబయు, సీతాసతివంటి వహ్నిశిఖ; తత్పయ ఉ
ద్యోతిత మస్మన్మతి; యీ, మాతకు నా పితకు మన్నమస్యలు దీర్తున్ 66

గీ. ఈవు శక్తికి మించినయీవి నేర్చి, తజ్ఞ! యని నన్ను జగము కొండాడుఁ గాని
వట్టిపిసినారి వని దెప్పివైచుఁగద యు, దారతానిధి మత్సతి యన్నపూర్ణ 67

ఆ. లావుఁ జూచి సొల్వులను జూచి పె ల్లుబ్బి, యేను పదుల వంద లిత్తుఁ గాని
గరితవోలె ననద కడగండ్లు చూచి ద్ర, వింపఁ జాల నెనరు నింపఁ జాల 68

క. క్షమకుం గరుణకు నెలవై, శమితావమకామయై ప్రసన్నవచశ్శ్రీ
రమణీయతకుం గుదురై, కమనీయప్రథను గన్న కాంతను మెత్తున్ 69

క. తనయశమ నాయశ మ్మని, మనుగడ సాగించు మగువమానిక మిది నా
కనురక్త యయ్యె నన్మ, జ్జననాంతర గణ్యపుణ్య సంభారమునన్ 70

ఆ. నెలఁత పెద్ద చదువు నేర్వదు గాని, నీ సరణి దిద్దుచదువు చాల నేర్చె
వినయ మార్దవాదు లెనలేని చేవగా, మోచి మోచి నన్ను లోఁచె నబల 71

ఆ. తులసిపూజ దీర్చి నిలిచి నిమీలిత, నయనయుగళితోడ నలినమిత్రు
దెసకుఁ గేలుమోడ్పు దేవికి నవశత, నంజలింతు నెదఁద ననుదినమ్ము 72

గీ. జగము నలరించు గాంధేయసౌరభమ్ము, వలచి మాయూరు కావూరు వాసికెక్కెఁ
దొలుత నీతావి బసవయ్య నెలవునందుఁ, గదలి పదపడి యింటింటఁ గదలుకొనియె 73

ఆ. విశ్వవికసనార్థి వెంపటి సూర్యనా, రాయణుండు నెయ్యుఁ డాయె నాకు
నన్యునార్తి చూడ నక్కఱ లే; దది, విన్నఁ జాలు నితఁడు వెన్నకాఁగ 74

గీ. మేలుచేసియుఁ జెప్పఁ, డాకీ లెఱింగి, మెచ్చినపు డుబ్బఁ దస్మదమేయ సుకృత
ఫలముగా నన్నుదిద్దిన పనితధీ వి, రాజి దువ్వూరి వేంకటరమణశాస్త్రి 75

ఆ. నరున కింటితావి యిరుగుపొరుగుతావి, కూర్చువారితావి గురులతావి
యంటితీరుఁ గాన నతనిమేల్గీడుల, కవియె కారణమ్ము లగుట నిజము 76



ఆ. బ్రదుకుపట్ల బాసపట్లఁ బూనిన దీక్ష, నియతు లొక్కొకపుడు నిర్భరార్తి
కారణమ్ము లగుటఁ గలఁగుదుఁ గాని ని, గ్రహము నూఁది యూఁది కదు సుఖింతు 77

ఆ. చెమట నోడ్చి యోడ్చి చెట్టునీడకుఁ జన్న, హలికునకుఁ బ్రలోభముల నెదిర్చి
కడిమిఁ జూపినట్టి కవితాతపస్వికి, నగ్గపదు సుఖాన కవధి గలదె 78

ఆ. వేఁడునట్టివాఁడు కాఁడు తుమ్మలకవి; యితని కీమి నన్ను నేఁచు ననుచు
వెఱఁగు వొడమ నాకు వేయాఱు లంపిన, కుప్పుసామి యెంతగొప్పవాఁడొ! 79

గీ. విత్త మిది తెచ్చు నినగంటి వేంకటప్ప, యాఖ్యఁ దైన నలంతియా? యాకు, వక్క
విరులు, పన్నీరు, ఫలములు వెండితట్ట, తనవిగాఁ దెచ్చి యిచ్చి నన్ దనిపె మెచ్చి 80

గీ. హైదరాబాదురాబాట నరుగునన్నుఁ, జూచి కా రాఁపి వినయమంజులత వెలయ
మ్రొక్కి 'చిఱుకాన్క' యని పెద్దమొత్త మొసఁగె, నగుర! సుగుణాలగూఁడు ముక్త్యాలతేఁడు 81

గీ. ఎదురుగా వచ్చుకవిఁ జూచి యేన్గు డిగ్గి, పెద్దచేసినరాయల కుద్దిఁ జేసి
రామగోపాలకృష్ణు సారస్వతాను, రాగరోచిష్ణు నిమ్మహీరమణు మెత్తు 82

క. ఉదుగరగా జగ మిచ్చిన, విడిముడి చేపడిన విఱ్ఱవీఁగక ముడిపై
ముడివేయక పదు రౌ నను, వడువున వెచ్చించి కవులవాసిన్ బెనుతున్ 83



గీ. తొలుత జీవనసరణికిన్ విలువచూచి, మాట కవ్వల వెలకట్టుమతము నాది
పిన్నలే కాదు కొందఱుపెద్ద లైన, నన్నుఁ గని జంకుటకుఁ గారణం బి దేమొ 84

క. ఒక వర్గము కావలె నని, మకుటం బిడి పొగడఁ బనికిమాలిన వానిన్
గికురింత లేల యాసల, తికమకలం బడుట కనుమతింపని కవికిన్ 85

ఆ. సత్యనిష్ఠ నాకు సాజము గాన మో, మోట లేని కూచిమాట నాది
మాట కూచియైన మది మెత్తనిదియౌట, జగము నన్ను హితునిపగిదిఁ జూచు 86

క. నను దిద్దెను నను మెచ్చెను, ననుఁ బ్రాణమువోలెఁ జూచె నావైభవమే
తనవైభవమని పొంగెను, దెనుఁగుజగం; బీఋణమ్ము దీర్పంగలనా 87

క. భవభూతి చేమకూరల, అవఅవ లే నెఱుఁగ నద్దిరా! ప్రజలు మహా
కవుల సమకాలికులు మ, త్కవితం గొనియాట వింటిఁ గంటిన్ సభలన్ 88

గీ. జగము నాదెస మెఱయుప్రసాద మెల్ల, భగవదనుకంప యని ముదంపడెద నెదఁద
జగమునకుఁ జేయుసేవ యీశ్వరునిపట్ల, నప్పనయొనర్చునూడిగ మని తలంతు 89

గీ. వలవ కున్నను గుప్పతెప్పలుగ వచ్చు, మెప్పులకు డిల్లవడి సదా మిన్నుచూతు
నెంత యొదుఁగుదునో జగమంత కైదు, రెట్లుగా నన్నుఁ జాటుచో నెట్లు సైఁతు 90

గీ. ఏను గాంధిమహాత్మునాస్థానకవి న, టంచు, నేతత్పదము నిత్య మనుచుఁ గట్ట
మంచిరెడ్డి, విమర్శకమౌళి, నలువ, పదఁతిమగరూ పనుట కదున్ బరువు నాకు 91

ఆ. మెచ్చి తెనుఁగుదిట్ట లిచ్చిన "యభినవ, తిక్క" నాంక మనుమతింప నిపుడు
తిక్కనకు సముండు తిక్కన గా కొండు, మూఁడుప్రొద్దులందు లేఁడు గాన 92

క. తిక్కనధర్మాద్వైతము, చిక్కినదా మార్గదేశిశిల్పముల జగా
పెక్కువ నా కబ్బినదా, నక్క యెచట నాక మెచట నాయము సెపుఁడీ! 93

క. తిక్కనబాటయు మాటయుఁ, జక్కన నాపాల నున్న జగ మిది కవితా
రుక్కమనీయత నెఱుఁగని, మొక్కలమా యేల రిత్తమోపిది నాకున్ 94

ఆ. పొగరు బోసితనము పోవ నేనై లెస్స, యరసి "తెనుఁగులెంక" నైతి నేఁడు
లెంక నా నెవండు? కింకరుఁడే సుఁడీ!, రాజు గాఁడు రాజరాజు గాఁడు 95

ఆ. మంచిలగ్న మరసి కించిజ్ఞుఁడును జగా, బిరుదు దాల్చి కులుకు పిదపగడియ
లావరించె నేఁడు నావంటికే కాదు, తగినవాని కైనఁ దగదు బిరుదు 96



. పెక్కు బాసల కెగఁబడి యొక్కనుడియు, రాని దుర్గతి కలవాఁడఁ గాను నేను
నేర్చినయొకండు గట్టిగా నేర్చినాఁడఁ, గూర్చినరవంత తిన్నగాఁ గూర్చినాఁడ 97

. "అచ్చమగు తెన్గునోరు నీ కగ్గపడియె, నన్వయాపత్తి లేనివాక్యమ్ము నీది
మేలు! మే!" లని బుధులు నన్ మెచ్చ హేతు, వేమి? నా కన్యభాషలు రామి గాక 98

ı. సంస్కృతం బన్యభాష నాఁ జనదు మనకు, నదియు నొకకొంత వలయుఁ గావ్యము రచింప;
నన్నయాదులు త్రొక్కినతెన్ను వట్టి, వచ్చి కూర్చుండె నది తెన్గువాణిసరస 99

ı. "సంస్కృతం బలవడినచోఁ జాలుఁ, దెనుఁగు, వచ్చినట్ల" యటంచు వాక్రుచ్చువారి
"కల్లముండినచోఁ జాలు బెల్ల ముండి, నట్ల" యనువారు సోదరు లని వచింతు 100

ఆ. బాస వేఱు పలుకుబడి వేఱు కారక, రీతి వేఱు వాక్యసృష్టి వేఱు
తీరుతెన్ను వేఱు తెనుఁగున; కిదియును, బదలి నేర్వకున్నఁ బట్టువడదు 101

♦ ♦ ♦

ఆ. ఎవ్వరెంద ఱెంత దవ్వైన నేను భా, షావిపర్యయమ్ము సైఁపలేను
సాధుశీల మాభిజాత్యమ్ము చెలువమ్ము, ననసి మెఱయువనిత నాదుకవిత 102

క. నన్నయ తిక్కన యెఱ్ఱన, మున్నగు నాచార్యకవులముద్ర వదనిప
ల్కెన్నఁడు మెచ్చను నాలోఁ, జిన్నయ కొల్వున్నవాఁడు జీవాత్మవలెన్ 103

క. మివిలినలక్షణ మార్య, వ్యవహారమ్ముల నెఱుంగ నగు నని విద్వత్
ప్రవరుఁడు చిన్నయ సెప్పుట, తవు నని భావింతుఁ గొన్ని తావులయందున్ 104

గీ. కావలె, మఱాకు మని యాదికవియు సోమ, యాజియును బల్క వీనిఁ జిన్నయ్యతీర్పు
తడవలే దని కాదాడఁ దగునె మనకు, లక్షణమపో! మహాకవి లక్ష్య మేని 105

ఆ. భావవిప్లవమ్ము పచరించుకవి శాబ్ద, విప్లవమున కంగవింపఁదేని
గెలువఁ దని బిభీషికలు కొట్టువారు నా, సృష్టిఁ జూచి యేమి సెప్పఁగలరొ 106

గీ. గాంధికంటె వినోయోగికంటె నధికుఁ, డుండునా విప్లవవిధాతృమండలమున
నేతదీయాశయాళి గా కేది కవిత, కస్మదీయకు నాలంబ మన్నలార! 107

ఆ. గఱువతనపుదీవి కమనీయశిల్పసం, గతము హృద్యగానగతి సమృద్ధ
మిద్ధరసము విశ్వహితము సమస్త కా, లముల నిల్చునది సలక్షణోక్తి 108

గీ. దొరకె జాతీయ మని దానిదుమ్ము దులుప, కొదలం దాల్ప 'నింటిల్లిపాది' వంటి;
'నిల్లిపాది' యపభ్రంశ; 'మెల్లపాదు'', సాధురూపముగా నెంచి సంస్కరింతు 109

ఆ. మూఁకనోరు శబ్దమునకు దురాకార, ముద్ర వైచుదనుక నిద్రపోదు
తీవరింప కిచట దేశిమర్యాదలఁ, గాచుకవులు వేయికనుల నుంద్రు 110



గీ. ప్రాసమునఁ గూర్తు నణల నేరాశి వైన, నీఁతకును దాత కీపొత్తు నిదుట కోర్తు
వడికిఁ బ్రాసకు నుభయరేఫములఁ జేర్తు, నుత్తమకవిప్రయోగము లున్న కతన 111

గీ. దథలకున్ బ్రాసమున మైత్రి తగు నటంచు, నెవ్వరో కాదు నన్నయ్యయే ఘటించె;
నర్ధబిందు వున్నట్టి లేనట్టి నుడుల-, నణల-సడి నింతవెర్మి యున్నదె వినంగ 112



క. సుకృతమ్ము పండి పలుగుం, ద్రకు నందని తెనుఁగునుడుగునన్ జనవు గడిం
చి కవిశ్రేణిం జేరితి, వికత్థనపరంపరలకు వినతుఁడ నైతిన్ 113

క. తిక్కన్నకుఁ జిన్నయ్యకు, మ్రొక్కెద, నాపాలితెనుఁగుముద్రకు వీరే
దిక్కైరి, యెంతపలుకుం, జక్కన మెఱయించె సూరి శాస్త్రమునందున్! 114

క. తెలివిడికి సూరి చూపిన, పలుకులలో నెంతతెనుఁగు ప్రబ్బె! నయారే!
తెనుఁగునదుర్గము చిన్నయ;, పొలియదు తద్వర్గ మెట్టిపోరాటములన్ 115

ఆ. వెఱ్ఱిముదిరి ముదిరి వెలగలతెల్గును, మఱచినారు పెక్కుమందికవులు
కవులఁబట్టి లోక మవమతిపాల్ సేయ, నకట! నేతిబీర యయ్యెఁ దెనుఁగు 116

ఆ. జీడిపప్పు వలయు జేజేలబాసయు, వలయుఁ బాసెమునకుఁ దెలుఁగునకును
దూలి తూలి దేనిపాలు హెచ్చించిన, రుచు లడంగి రెంట రోఁతపుట్టు 117

క. నాచెప్పెడికబ్బమునన్, బైచేయిగ నుండుఁ దెనఁగుఁబ; ల్కది శౌచ
శ్రీ చిక్కణమై పున్నమ, పూచినజాబిల్లివెలుఁగుపోలువుం దెలుపున్ 118



గీ. తప్పువ్రాయని యొప్పులకుప్ప ననుచు, రిత్తమాటలు నే వెల్వరింపఁ జాలఁ
బెద్ద లిది దోస మన్నచో దిద్దుకొందు, నిట నహంకృతి లేదు నా కించుకయును 119

గీ. పెద్దలను వెక్కిరించుచోఁ బేరు పెంపు, వచ్చు నను వెఱ్ఱి వాడమనివాఁడ నేను
బ్రదికినన్నాళ్లు విద్యార్థిపగిది నుంట, వలయు నని విశ్వసించినవాఁడ నేను 120

ఆ. అంతు లేదు విద్య, కెంత వేసారినఁ, జక్కఁబడవు పెక్కుసందియములు
ప్రాజ్ఞు లేగుత్రోవఁ బయనింతుఁ గాన నేఁ, గానిపింతు లెస్స కఱచినట్లు 121

క. మున్ను నడిసన్న పెద్దలు, నన్నులఁతిగఁ జూడఁ గినిసినాఁడను; నేఁడో
పిన్నలు నీ చదు రే మని, యన్నను మునినై యొనర్తు నాత్మపరీక్షన్ 122

ఆ. పచ్చి కాయవంటి ప్రాయమ్ముఁ గడచి నా, బ్రదుకు వచ్చె నాఱుపదులదనుక
ముసలితనపువలపు మూచూద నోడి క్ర, క్కదలె నేమొ హృద్వికారచయము 123

ఆ. ఓసరిల్లెనొక్కొ మీసాలవెన్నెల, తెలివు సోఁకి దెబ్బదిని తమస్సు
పలితకేశ మింతఫలము నొసంగఁగా, స్రుక్కు నేమి దీనిఁ జూచి నరుఁడు 124

♦ ♦ ♦

ఆ. దారు లెట్టివైన రార మ్మటంచు నన్, గారవించు కవిని గౌరవింతు
నెడఁదపెంపు లేని వెడమాసి యీగుట్టు, గానలేక తద్ద కళవళించు 125

గీ. గ్రామ్యవాదులు నాస్తికుల్ గాంధిసరణి, మెచ్చ మనువారు గలరు నా మిత్రులందు
నద్దగించునె సిద్ధాంత మచ్చమైన, ప్రేమ గల రెండుగుండెలు బెరసినపుడు 126

గీ. ఈసునకు దాసుఁ డైనవాఁ డెంతనిజము, నరయు? జీవాతు వాతని కనృతవాక్కు;
కామలారోగ మంటినకంటి కవని, యెల్ల గన్నేరుపూ వగు టేమివింత? 127

గీ. చెట్టసేయనియిట్టిపై సెలను విడిచి, తనియు నితఁ డక్కటా! బోయతనము వలచి
చెల్లియుండియు సైరణ చేయువాఁడు, పందగాఁ దోఁచు నీతనిడెందమునకు 128

క. రంజింపలేఁడు గావున, రంజిల్లఁగలేఁడు వీఁడు; రాత్రిందివమున్
గింజుకొను నిఁతడు నరముల, గుంజెడు నీర్ష్యకు నసూయకున్ బలియగుచున్ 129

ఆ. ఇతనికేని ప్రేమ నిచ్చె నీశ్వరుఁ; డది, యిల్లు దాఁటి పోవ నొల్ల డితఁడు
కదలకున్న ప్రేమ కలుషమై క్రుళ్ళెత్తి, యిరుగుపొరుగువారి కేవగూర్చు 130

క. జజ్జరలవారిపొత్తున, జజ్జుకొనున్ గాని నరుఁడు చక్కంబడునా
సజ్జనసంగతి కావలె, ముజ్జిడ్డులు వాసి మాసి మొగమెత్తుటకున్ 131

క. త్రికరణశౌచము నీకొని, యొకనికి మేల్చేసి తనిసి యొద్దులచదు రా
వకుఁ దగ్గఁగాక కొండం, తకుఁ దెచ్చి నుతించువానిదాస్యము వలతున్ 132

♦ ♦ ♦

గీ. వృత్తములత్రిక్క వాదముచో నెల్లదప్పి, గుప్పవలె సంస్కృతము; దీని కొప్ప నేను
జాతి నుపజాతిని దెనుంగు చక్క నిముడుఁ, గాన నవ్వారిగా వీని గారవింతు 133

ఆ. పలుకుబడులు సామెతలు నానుడులు తేనె, వంటివోని తెలుఁగుపంట యెల్ల
నొదుఁగఁ దగినశయ్య నొయ్యారములుగుల్కు, నాటవెలఁది కవులనీటుకొలఁది 134

ఆ. మఱుఁగువడిన తెన్గుమాటల గాలించి, కుస్తరించి కైతఁ గూర్తు నేను
దారిదప్పినట్టితమ్ముఁ డిప్పట్టునఁ, బదరవచ్చుఁ గాని బెదర నేను 135

గీ. బెదరుటకు సెబ్రయేమి సల్పితిని దెనుఁగు, బిడ్డ కాతనిపల్కె నేర్పితిని గాని
మఱువిచ్చిననాఁడు వాఙ్మయము త్రచ్చి, యే నొనర్చిననుడి పెంపు నెఱుఁగు నితఁడు 136

గీ. ఎంత లోపద్ద గీర్వాణ మేని తెనుఁగుఁ, గబ్బమునఁ బెత్తనముసేయఁ గాదు గాని
యెంత దవ్వైనతెనుఁగుఁ బల్కేని యగ్గ, లించి మనకైతలో రవళింపవచ్చు 137

ఆ. రైలు, కోర్టు, సిల్కు, రైతు మున్నగునుడుల్, తెలుఁగునోట నలఁగి నలఁగి యుంట
నాదరింతు వీని నన్యదేశ్యము లైనఁ, బెఱలఁ జూచి బాసపెంపు వలచి 138

ఆ. వెదకి వెదకి తెల్గు నదికినంతన యది, తెలుఁగు కాదు దాన వెలుఁగు రాదు
జాతి, కారకమ్ము, సంప్రదాయమ్మును, దేశ్య మైననాఁడె తెలుఁ గలర్చు 139

క. తెలుఁ గన్నను దిక్కన్నది, తెలుఁ, గల వేమన్నకవిది తెలుఁ, గప్పటియున్
దెలుఁ గావెంకన్నది – యిది, వలచి తపం బాచరించువాఁడన యేనున్ 140

ఆ. తెనుఁగు తేనెవాఁగు, తెనుఁ గమృతాసార, సారధార; నాకు సంఘటిల్లు
నెల్లపుట్టునందు నిది యుగ్గుగాఁ బెట్టి, తల్లి యొదవి కరుణ చల్లుఁగాక! 141

♦ ♦ ♦

క. తెలియని దెంతో కల దని, వలఁతులకడ మస్తకమ్ము వంచెద; నన్నుం
గొలుచుట ల గ్గని వచ్చిన, యలఁతులదెస వెల్వరింతు నచ్చపునెనరున్ 142

ఆ. "మావిపండులోనిమధురము, మాధుర్య, భావ, మర్ధరాత్రి, పరమతాల్మి,
వారువచ్చె, వీరి వాటింతు, మ్రాను బూ, చినది" యంద్రు కవులు చిన్నవాండ్రు 143

క. ఆహా! సర్వము సముచిత; మోహో! త ప్ప్రాకటి లేనియుత్తమకృతి సం
దేహింపకు మని యనృత, వ్యాహారము సెప్ప నొల్ల నా(శితకవికిన్ 144

క. మాట కొకపూఁట నైనను, దాఁటింతున్ నెరసు లెల్ల దవ్వుల కరుగన్
బూటక మెఱుఁగనిమానిసి, నౌట నిటుల్ బడలుచుందు నబలునిపట్లన్ 145

♦ ♦ ♦

ఆ. ఎన్ని మెఱుఁగు లున్న నేమిపండితి? నార్తి, మూల మైన మమతఁ (దోలనైతి
మదిని గెల్చి తత్త్వ మిది యని కననైతి, జగము నవ్వఁదగినజడుఁడ నేను 146

ఆ. కవిత చెప్పినాఁడఁ గనకాభిషేకాది, పరమగౌరవములు పడసినాఁడ
నేల కులుకవలయు నీ సిరిఁ జూచి నే, నెవఁడనో రవంత యెఱుఁగనైతి 147

ఆ. ముప్పదేండ్లు తెనుఁగుముక్కలు పది నేర్చి, నాఁచికొన్న యొజ్జనము దలంచి
పొంగ దేల నాకు, భుక్తికిఁగాక యీ, చదురు ముక్తి కెంత సాయపడియె? 148

క. అక్కటఁ ఫలాఫలమ్ముల, నొక్కమెయిం జూచి కర్మయోగవిధా స
మ్యక్కౌశల మార్జింపని, మొక్కలి నే నెట్లు దాల్తు ముంగైమురముల్ 149

ఆ. బాగుపట్ల మిడిసిపడకున్న నే మాయె, నోగుపట్లఁ గుందుచుందు నేను
సమత లేని (బదుకుసా రెంత పే రెంత, వలపు లేని పూవువాసి యెంత? 150

ఆ. ఆత్మదెసకు సాగ దక్కట! నాబుద్ధి, యిం(ద్రియాళి బుద్ధి నెనసి నడువ,
దఖిలదుఃఖదమన మైన (ప్రసన్నత, నన్నుఁ గదియ దెంతనవఁత పడిన 151

ఆ. సత్త్వమునకుఁ దపము సల్పెదఁ గాని ర, జస్సు విడువరానిశక్తి యయ్యె
నిఁకఁ దమస్సు లేమియే చాలు ననుకొందు, (గుడ్డికంటె మెల్ల గొప్ప గాన 152

క. ఋతవాక్కుల నస్మజ్జీ, విత కవితా నిభృత నియమ వివృతిని నే నీ
కృతి నొనరించితి సార, స్వతసేవా(వతుల కాత్మచరితార్థులకున్ 153

రచన : 1961-62

# మొగమాట

సర్వోదయతపస్వి వెంపటి సూర్యనారాయణగా రనువదించిన పూజ్య వినోబా - 'గీతా ప్రవచనములు' చదువుటతో భగవద్గీతపట్ల నాకున్న యాదరము హెచ్చెను. తత్ఫలముగా క్రీ.శ. 1957లో గీత నుండి దాదాపు 250 శ్లోకముల నేటి తెనుంగు పద్యములుగా వ్రాసి యాపద్యములను 'భూదాన' పత్రికలో వెలువరించితిని. వానినే 1959లో 'గీతాంగణ' మనుపేర నొకగ్రంథముగాం బ్రచురించి శ్రీ సూర్యనారాయణగారి కంకితముచేసి తనిసితిని.

సహృదయు లీరచనము నాదరించినకొలంది గీత నెల్ల ననువదింప వలయు నన్న కాంక్ష నాలో నుదయించెను. నేంటి కిది 'గీతాదర్శము'గా రూపెత్తినది. ఈపని నాతలకు మించినదే - ఐనను భారతీయమగు నాయాత్మ నాకవితాత్మ నిట్లు ప్రేచినది. ఎట్లో గట్టెక్కితిని.

భగవద్గీత సర్వమత దర్శనము. సకలధర్మ సమన్వయక్షేత్రము. ఐహికాముష్మిక విజయములకు నుత్తమ సాధనము. విశేషించి హృదయ దౌర్బల్యముచేం గ్రుంగి కుతిలపడుచున్న మానవుని దేర్చి ధర్మవీరునిగాం దీర్చుటలో నిది సాటిలేనియొజ్జ.

లోకమాన్యతిలక్, మహాత్మగాంధి - వీ రిరువురును భగవద్గీత కీయుగ మునం దిచ్చిన ప్రాధాన్యము, తెచ్చిన ప్రచారము కొలందుల కందరానిది. గీతాపఠనమున నెందఱో భారతీయు లుత్తేజితులై స్వాతంత్ర్యసమరమున దూంకి లోకోత్తరత్యాగముల కోర్చి మాతృదేశవిముక్తిని సాధించిరి. మొదటి నుండియు జాతీయోద్యమానుసారిగాం గవితాసృష్టి కావించుచున్న నే నీ యుద్యమములకు నాలంబమైన గీత ననువదించి కృతకృత్యుండ నైతి నని తలంతు.

**సీతారామమూర్తి**

17-12-1963

# పురస్కృతి

క. భావే 'గీతాప్రవచన', మీవు తెనుఁగుచేసి బాస కేవో మెఱుఁగుల్
కేవల లాక్షణికమ్ములు, కావలె నని నన్ను నిన్నుఁ గలిపితి వెపుడో. 1

క. నా మూలమున భవత్కృతి, కేమెఱుఁగులు వచ్చె దైవ మెఱుఁగును గానీ
నీమూలమ్మున మన్మతి, లో మెఱుఁగులు వచ్చి బ్రతుకులోఁతులు కంటిన్. 2

ఆ. కైతవలపు డించి గీతను జదివించి, నన్నుఁ దేర్చినట్టి యన్న వీవు
ఇంత చేసిచేసి యెంతసౌశీల్యమో, నన్నుఁ బెద్దసేయు పిన్న వీవు. 3

ఆ. గీత చదువఁ జదువఁ గైతయు నవశమై, పొంగివచ్చి నన్ను లొంగఁదీసె
గీత నేను గన్నరీతి 'గీతాదర్శ', మనెడుపేర నిట్టు లవతరించె. 4

గీ. గాంధికవిని నేను దదాత్మకథను మున్ను, వ్రాసితిని దెల్గుబాసలో వాసికెక్క
నీకథకుఁ బ్రాణమౌ గీత నిపుడు తెనుఁగు, సేఁత మత్పరమప్రీతిహేతు వయ్యె. 5

క. గీతార్చకు నిను ముఖ్య, శ్రోతను గావించి మెఱయఁజూతును దీనిన్
నా తలఁ పిది పాటింపుమ!, నా తృప్తికి సాధుసాధనముగా నగుమా! 6

గీ. ఏమి ఘనకార్య మిది బ్రదుకెల్ల నార్త, సేవకై ధారవోసిన జీవిపట్ల
సూర్యనారాయణా! సుధాంశునకు నమృత, మిచ్చినాఁడను నాయీవి కెంతవిలువ? 7

క. పైచూపు వలచు ప్రాణికి, లోచూపునుసైత మొసఁగి లోకస్తుతికిన్
నోఁచిన చికిత్సకమణీ!, శౌచఖనీ! సామ్యయోగసాహిత్యధునీ! 8

క. జయ! జయ! వెంపటివంశజ!, జయ! జయ! సర్వోదయప్రచారస్విన్నా!
జయ! జయ! భావేప్రియపథ!, జయ! జయ! గాంధేయధర్మసత్యపతాకా! 9

# గీతాదర్శము

## 1. అర్జున విషాదయోగము

*ధృతరాష్ట్రుఁడు :*

గీ. సంజయా! సంగరక్రియాసంగ మొదవ, నగ్గలించి ధర్మక్షేత్ర మనఁగఁ జెలఁగు
నిలఁ గురుక్షేత్రమునఁ గూడి యేమి చేసి, రస్మదీయులు పాండవు; లది వచింపు! 1

*సంజయుఁడు :*

గీ. మోహరించిన ధర్మజుమొనలఁ జూచి, బాణవిద్యాగురుం డైనద్రోణుఁ గదిసి
నమ్రతాభారమున మహీనాథ! యిట్లు, పలికె దుర్యోధనుఁడు వచఃప్రౌఢి వెలయ. 2

క. ఆచార్య! భవచ్ఛిష్యుఁడు, ధీచతురుఁడు, ద్రుపదసుతుఁడు, ధృష్టద్యుమ్నుం
డేచి నియమించి నిల్పిన, యీ చక్రము పాండవేయ మీక్షింపఁగదే! 3

ఆ. బిరుదు లిందుఁ గలరు పెనువిలుకాండ్రు భీ, మార్జునులకు నుద్దియైన యోధు;
లతఁడు వీరమౌళి యగుసాత్యకి విరాటుఁ, డతఁడు ద్రుపదుఁ డమ్మహారథుండు. 4

ఆ. అతఁడు ధృష్టకేతు, వాతఁడు చేకితా, నుండు, కాశిరా జతండు దిట్ట,
యతఁడు కుంతిభోజుఁ, డాతఁడు పురుజిత్తు, శైబ్యుఁ డతఁడు పురుషసత్తముండు. 5

ఆ. ఆతఁ డుత్తమౌజుఁ, డతఁడు యుధామన్యుఁ, డాతఁ డలసుభద్ర కనుఁగుబిడ్డ
వారు ద్రౌపదీకుమారు, లీపోటరు, లంద అందతే మహారథికులు. 6

క. మనమొనలో నుత్తములై, మనరాణువ కాజ్ఞపెట్టుమగలై నుతికె
క్కినవారి నెఱుకచేసెద, విను మస్త్రకలాశరణ్యా! విప్రవరేణ్యా! 7

గీ. ఈవు, భీష్ముఁడు, కర్ణుండు, కృపుఁడు, సమర, జయుఁడు నీపుత్రుఁడు, వికర్ణసౌమదత్తి
సైంధవులు నస్మదీయ మీసైన్యమునకుఁ, బ్రాణములవంటివారు సంభావ్యచరిత! 8

ఆ. మఱియుఁ బెక్కుమంది మగ లిందుఁ గల రస్త్ర, శస్త్రవిదులు సర్వసమరనిపుణు
లస్మదీయవిజయ మర్థించి బ్రతుకుపై, నాసవిడిచి వచ్చినట్టివారు. 9

ఆ. మాననీయ! యిట్టిమనసేన వీరమూ, ర్ధన్యుఁ డైన భీష్మురక్ష నున్న
ననిలతనయపాలితాహితసైన్యమ్ము, కరణిఁ బెంపుతోడఁ గానఁబడదు. 10

క. పాయక మీ రందఱు మొన, కాయువుప ట్లైనతావులందు నిలిచి గాం
గేయుని సర్వధ్వజినీ, నాయకు రక్షింపవలయు నానావిధులన్. 11

ఆ. అనిన రాజరాజు నలరింప విక్రమ, నిధి పితామహుండు నేల నింగి
వణఁక సింహనాద మొనరించి సైనిక, శ్రేణి సిద్ధపడఁగఁ జింద మొత్తె. 12

క. పదపడి కౌరవసైనికు, లుదితోత్సాహమున సంకు లూఁదిరి దంకా
మొదలగు వాద్యములన్ దెస, లుదరన్ దాడనమొనర్చి రొక్కుమ్మడిగన్. 13

క. అవ్వలఁ దెలిమావులతోఁ, గ్రొవ్వెలుఁగులు చిమ్ముతేరఁ గుదిరినహరియున్
గవ్వడియు దివ్యశంఖము, లువ్వెత్తుగ నొత్తి రహితు లులుకన్ దలఁకన్. 14

క. మురవైరి పాంచజన్యము, మొరయించెను దేవదత్తమున్ నరుఁ దూఁదెన్
గరువలికొమరుం దతిభీ, కరకర్మప్రవణుఁ డొత్తె ఘనపౌంద్రంబున్. 15

ఆ. అంత నూఁదెఁ బాండవాగ్రజన్ముఁ డనంత, విజయశంఖ; మతనివెనుక వీర
మానితులు సుఘోషమణిపుష్పకమ్ముల, నొత్తి కవలు ముదితచిత్తులైరి. 16

క. వెండియుఁ గాశీపతియు, శి, ఖండియు, ననివార్యశౌర్యఖని ధృష్టద్యు
మ్నుండును, విరటుఁడు, యదువ, ర్యుం దగుసాత్యకియు సంకు లూఁదిరి పెలుచన్. 17

క. ద్రుపదుఁడు, ద్రౌపదిపుత్రులు, కపికేతనతనయుఁ దాదిగాఁ గల్గు పరం
తపు లందఱు వేవ్వేఱుగ, నృపతీ! పూరించి రపుడు నిజశంఖములన్. 18

క. ఆ నినదము సంకులమై, భూనభముల మాఱుమ్రోఁత పుట్టించుచు నీ
సూనులు సుయోధనాదుల, మానసముల వ్రక్కలించి మల్లడిగొలిపెన్. 19

ఆ. అంత దురము సిద్ధ మగుడు నుద్యుక్తులై, యెట్టయెదుట నిల్చినట్టి నీదు
సుతుల నర్జునుండు సూచి తానును శరా, సనము నెక్కుపెట్టి చక్క నిలిచి. 20

ఆ. వసుమతీశ! వినయ మెసఁగంగ నివ్విధిఁ, బలికె నపుడు చక్రపాణితోడ;
అర్జునుఁడు :
అచ్యుతా! రథమ్ము నాఁపవే సమరేచ్ఛ, రెచ్చి యున్న మొనలురెంటినడుమ. 21

ఆ. ఈ రణమ్మునందు నే నెవ్వరెవ్వరి, నెదురవలయుఁ బగఱ నెంతలోన
నిలిచియున్న లెస్స తిలకింపనేర్తు నీ, వంతలోన రథము నాఁపుమయ్య! 22

ఆ. దుష్టబుద్ధియైన దుర్యోధనునకు నీ, బవరమందు సాయపడఁ దలంచి
యెవ్వరెవ్వ రిటకు నేతెంచి రవ్వారి, నరయునట్లు రథము నాఁపుమయ్య! 23

సంజయుఁడు :

ఆ. పార్థుఁ డిట్లు తన్నుఁ బ్రార్థింపఁ గృష్ణుఁ డా, రథికుమాట కాదరంబు మెఱసి
రెండుమొనలనడుమ నుండున ట్లాతని, తేరు నడిపి దూరదృష్టిఁ బఱిపి. 24

ఆ. ఎట్టయెదుట గంగపట్టియు ద్రోణుండు, తోఁచునట్లు హరుల నాఁచి ధార్త
రాష్ట్రసైన్య మది పరంతపా! పరికించి, చూడు మనియె నుదులప్రోద యగుచు. 25

ఆ. అంత నచటఁ బార్థుఁ దయ్యలఁ దాతల, గురుల మేనమామవరుసవారి
భ్రాతృపుత్రపౌత్రబంధము గలవారి, సఖులఁ జూచె నుభయసైన్యములను. 26

ఆ. మఱియు నతఁడు సూచె మామల నిస్స్వార్థ, తృష్ణఁ దార్కొనిన సుహృజ్జనములఁ
గుంతికొమరుఁ డిట్లు ఘోరాహవక్రియా, సక్తసర్వబంధుచయముఁ జూచి. 27

ఆ. మిగుల జాలిచెంది మొగము వెల్వెలఁబాఱ, విన్నవించె నిట్లు వెన్నుతోడ
అర్జునుఁడు :
ఏమిసెప్పువాఁడఁ గృష్ణ! యీనిల్చిన, చుట్టములను జెలులఁ జూచుకతన. 28

ఆ. అకట! పట్టుదప్పె నస్మదంగమ్ములు, నాల్క పిడుచకట్టె నుల్కు వొడమెఁ
గాయమెల్ల వడఁకె గగ్గురుపాటు వా, టిల్లెఁ జెమట లూరి వెల్లివొడిచె. 29

గీ. అవశమై చేతినుండి గాండివము జాఱె, నెరియుచున్నది మే నగ్నిఁ బొరలినట్లు
మదియు సుడివడు నిదియేమి మాధవా! ర, థమ్ముపై నిల్వలేనిదుర్దశ ఘటిల్లె. 30

గీ. కేశవా! పెక్కు లేర్పడెఁ గీడు దెల్పు, శకునములు నేఁడు; నే నిష్టజనులగొంతు
గోసి యేశుభముల్ కనుఁగొందునయ్య!, రేసి దుష్కృత మె ట్లొనరింతునయ్య! 31

ఆ. వలదు గెలుపు నాకు వనజాక్ష! వసుధయు, వలదు, భోగమేని వలదు వలదు,
సకలబంధుకోటి చచ్చినపిమ్మట, నేల యేల బ్రదు కదేల చెపుమ! 32

ఆ. ఎవరికొఱకు రాజ్య మెల్లసుఖమ్ములు, వలయు మనకు, వారు వసువునందు
నసువునందు నాస లఱచి పేరమ్ములు, వదల వేచియున్నవార లిచట. 33

గీ. ఇతరు లెవ్వరు కల రిందుఁ బితలు సుతులు, తాత లొజ్జలు మామలు మాత తోడఁ
బుట్టువులు మన్మలు మఱందు లిట్టి బీర, కాయపీ చనఁ దగువారు గాక చెపుమ! 34

ఆ. నన్నుఁ జంప వచ్చినను వీరిఁ జంప, లో, కములు మూఁడు దక్కుఁగాక చంప
నిఁక వచింపనేల యీనేల నీయల్ప, సంపదను వరించి చంప ననుచు. 35

ఆ. ఏమిలగ్గువొడము నీధార్తరాష్ట్రుల, మడియఁజేసినంత మన కనంత!
యెంతకుమతులైన నిష్టబంధులఁ జంప, నవధిలేనిదురిత మలముకొనదె. 36

గీ. అగుటఁజేసి స్వబాంధవులగు సుయోధ, నాదులను జంపుపని మన కనుచితమ్ము
స్వజనమును గూల్చి దుస్సాహసము వెలార్చి, యెట్లు సుఖ మందెదము హృషీకేశ! మనము. 37

ఆ. వంశహానికతనవచ్చు - మిత్రద్రోహ, మునఘటిల్లు పాపములఫలమ్ము
పరమరాజ్యలోభ పరిభూతమతులు దు, ర్యోధనాదు లెఱుఁగకుంద్రుగాక. 38

ఆ. నీరజాక్ష! యింతనేర్చినమన - మన్వ, యక్షయమ్ము వలన నామతిల్లు
ననయమెల్లఁ గన్న మన మీయఘమ్ము వ, ర్జింపఁ దగినదని గ్రహింపవలదె. 39

క. కుల మంతరించినంతన, నలియగు వంశోచితము సనాతనధర్మం;
బలఘుమతీ! ధర్మువు సెడ, నలుపంబై కులము సర్వ మపగతిఁ బట్టున్. 40

క. ఆచారములు నశించిన, నీచస్థితి కిచ్చగింత్రు నెలఁతలు; కులకాం
తాచయము పతిత మగుచో, రాచుఁగదా వర్ణసంకరం బది జాతిన్. 41

గీ. సంకరము వంశమునకు వంశఘ్నులకును, దుర్గతి ఘటిల్లఁజేయుఁ; దద్దురితరతుల
పితరు లపుడు పిండోదకవిధులు లేక, పతితు లయ్యెద రక్కటా! వెతలఁ బడుచు. 42

ఆ. కులముఁ జెఱుచువారు కూర్పఁగా సంకర, హేతువైన కలుష మిది తనర్చి
శాశ్వతముగ వచ్చు జాతిధర్మము కుల, ధర్మ మస్తమించు దనుజవైరి! 43

క. కులధర్మముల నణంచిన, కొలగల మానవులు నరకకూపమునందున్
గలకాలము నివసింపఁగ, వలె నని విందుము మనీషివర్యులనోటన్. 44

ఆ. ఎంతపాపమునకు సంతనకట్టితి, మకట! దొరతనమ్ము సుకము వలచి;
బంధువుల వధింపఁ బాల్పడితిమె! లోభ, మింతసేయునే! దురంత మగుచు. 45

క. పట్టను ధనుస్సు, కొట్టినఁ, గొట్టను శాత్రవులఁ, గత్తిగొని నిర్దయులై
యిట్టినముఁ గౌరవులు తుద, ముట్టింతురుగాక దాన ముదమే కుదుతున్. 46

సంజయుఁడు :

ఆ. శోకచలితచిత్తుఁడై కుంతికొమరుఁ డీ, కరణిఁ బల్కి సశరకార్ముకంబు
నట్టె విడిచి సంగరాంగణమునఁ దన, తేరఁ గూలఁబడియె ధారుణీశ! 47

# 2. సాంఖ్యయోగము

సంజయుఁడు :

ఆ. బంధువుల వధింప భయపడి దీల్పడి, కరుణ పొంగి పొంగి కరఁగి కరఁగి
యశ్రుపూర్ణనయనుఁడై కుందు ఫల్గునుఁ, దేర్ప నిట్లు వాసుదేవుఁ డనియె. 1

కృష్ణుఁడు :

క. ఈ మోహ మీవిపద్దశ, నేమెయి ని న్నలమెఁ బార్థ! యిది పామరులన్
బ్రాము నపకీర్తి దెచ్చును, గామాదులు మప్పి పుణ్యగతి కడ్డుపడున్. 2

ఆ. తగదు విహ్వాలింపఁదగ దీవు; నీవంటి, దండి కిట్లు పితికితనము తగదు
వదలు మధమమైన హృదయదౌర్బల్యంబు, లెమ్ము రిపుభుజావలేప మడఁప. 3

అర్జునుఁడు :

క. దనుజాంతక! కులవృద్ధుని, గుణవృద్ధుని భీష్మ నెట్లుకొట్టెద? నాచా
ర్యునిదెసకు నమ్ము లెమ్మెయిఁ, బనిచెద? నర్చింపఁదగిన భవ్యులు వారల్. 4

క. ఈగఱువల నెత్తుటిలోఁ, దోఁగినభోగమ్ములేల దురము వదలి భి
క్షాగతము నిర్మలం బగు, నోగిరమున మనుట మనకు నుచితము కాదో! 5

ఆ. ఐన నెవరు గెల్తురో నిర్ణయించుట, యరిది; గెల్పు మనది యగునుగాక
యెవరి నణఁచి బ్రదుక నిచ్ఛగింపమొ వార, లెదుటఁ గలరు కౌరవేంద్రముఖులు. 6

క. దీనుఁడ నీశిష్యుఁడ నిది, యౌ నిది కా దని వచింప నసమర్థుఁడ ని
న్నే నమ్మితిఁ గర్తవ్యవి, ధానం బెఱిఁగించి నన్నుఁ దనుపవె తండ్రీ! 7

ఆ. కలన గెల్చి రాచకలిమి గడించినఁ, బచ్చి యేను సురలసరస నున్న
గురుల బంధుజనులఁ గూల్చితి నని కుంద, వలయు నీయలంత వాయు టెట్లొ. 8

సంజయుఁడు :

ఆ. రిపుభయంకరుఁడు కిరీటి గోవిందున, కిట్లు నుడివి పిదప నిఁక దురమ్ము
నొల్ల నని వచించి యూరకుండెను మహీ, కాంత! యెంతవింతకథ ఘటిల్లె! 9

గీ. రెండుసేనలనడుమ నీరీతి భీతి, పడి విషాదించుచున్న యప్పార్థుఁ జూచి
దేవకీనందనుఁడు కృపాధీనుఁ డిట్లు, పలికెఁ జిఱునవ్వు వెదలించువానివోలె. 10

కృష్ణుఁడు :

ఆ. కుందఁదగనివారిఁ గూర్చి కుందెద వహో!, గొప్పగొప్పమాట లప్పగింతు
వర్జునా! మనీష లడలుదురా చన్న, వారికొఱకు నున్నవారికొఱకు. 11

ఆ. నేను నీవు వీరు నేఁటివారమె కాము, యుగయుగాలనుండి యున్నవార
మెఱుఁగవోయి పార్థ! యీమేను కూలిన, వెనుకనైన మనము వెలయఁగలము. 12

ఆ. ఆత్మ కీశరీరమందుఁ బిన్నతికంబు, జవ్వనంబు ముదిమి యెవ్విధాన
వచ్చు నవ్విధాన వచ్చు దేహాంతర; మిది యెఱింగి ప్రాజ్ఞుఁ డుదిలపడఁడు. 13

గీ. ఒసఁగు సుఖదుఃఖములను శీతోష్ణగతుల, నింద్రియార్థము; లివి నిల్వ వెల్లకాల;
మంటుకొనుచుండు మఱల దవ్వగుచునుండు, నర్జునా! వీని సైరింపు మాత్రపడక. 14

క. ఎతఁడు సుఖవేదనాది, ద్వితయమ్ముల నొక్కరీతి వీక్షించి సమా
హితచిత్త వృత్తిమై మను, నతఁడు సుమా! ముక్తి వడయ నర్హుఁడు పార్థా! 15

ఆ. పొలియుదేహమునకు నిలుకడ లేదు, లే, దమరమైన యాత్మ కస్తమయము
తత్త్వవిదులు దీనిఁ దలఁచి నశ్వరమైన, యొడలు పోవుపట్ల నడలుకొనరు. 16

ఆ. అఖిలజగమునందు నలమినయాత్మకు, లేదు లేదు చావు లేదు పార్థ!
చావులేని దీనిఁ జంపువాఁ డెవఁడును, లేఁడు లేఁడు బెగ్గలింపకోయి! 17

గీ. నిత్యమై యప్రమేయమై సత్యమైన, యాత్మకు నుపాధులైన కాయములు సమయు;
నర్జునా! నీటిబుడగ లయ్యవి; రహస్య, మిది యెఱింగి కదంగుమా! కదనమునకు. 18

ఆ. ఒకనిఁ జంప కాత్మ యొకనిచేఁ జావక, కర్తృకర్మగతులు కడచి యుండు
నిది వికారదూర మీగు ట్టెఱుంగని, వారు తెలివిలేనివారు పార్థ! 19

గీ. పుట్టుటయు నిల్చుటయు వృద్ధిపొందుటయును, మాఱుటయు సన్నగిలుటయు మడియుటయును
గలుగ వాత్మకు; నొడలు పోకారినంత, నాత్మ చావదు; నిత్య మియ్యది కిరీటి! 20

ఆ. ఆత్మ నిత్య మనియు నది చావ దనియును, బుట్ట దనియుఁ గృశత పొంద దనియు
నెవఁ డెఱుంగు నాతఁ డెవనిఁ జంపించు నె, వ్వానిఁ జంపు నోయి! మానమహిత! 21

గీ. ప్రిదిలి చినిఁగిన వస్త్రముల్ వదలివైచి, క్రొత్తవలువల నరుఁడు చేకొనువిధాన
నాత్మయును జీర్ణమైన దేహముల వీడి, యవధరించు నవీనకాయములఁ బార్థ! 22

గీ. కఱకుఁగత్తులు దేహిని నఱుకలేవు, శిఖిశిఖాజాలములు బూదిసేయలేవు
ముసురుకొని పొంగువెల్లువల్ ముంపలేవు, అంపిలిన వేఁడిగాడ్పు లెండింపలేవు. 23

గీ. త్రుంపఁగాఁ గాల్పఁ దడుప నెండింప నలవి, గానిదై నిత్యమును సర్వగతముఁ దిరము
నచలమును సనాతనము నైనట్టి దాత్మ; దీనికై కుందనేల కుంతీకుమార! 24

గీ. అంద దీయాత్మ చక్షురాదీంద్రియముల, కిది మనస్సునకును జిక్క దెట్టివికృతి
లేని దిది, ఫల్గునా! దీని లెస్స తెలిసి, మానుము విషాద, మూనుమీ మగతనంబు. 25

గీ. అర్జునా! యొకవేళ నీ వాత్మ మాటి, మాటికిని బుట్టు ననియును ద్రుంగు ననియుఁ
దలఁచెదవుగాక యపుడైన నలమటింపఁ, దగినయక్కఱ లేదుగదా! రవంత. 26

గీ. జననమందినవానికిఁ జావు తప్ప, దస్తమించువానికి నుదయంబు తప్ప
దిది నివారింపరానిమా; ర్నీవు బుధుఁడ, వేలశోకింతు విప్పట్ల బేలవోలె. 27

గీ. మిత్రమా! వర్తమానచరిత్ర తక్క, భూతముల పూర్వచరిత మజ్ఞాతవిషయ;
మివి నశించిన పిమ్మట నెట్టు లగునొ, యదియు నజ్ఞాత మిఁక వీని కదలనేల? 28

ఆ. అబ్బురముగ నొక్కఁ డాత్మను వీక్షించు, నొక్కఁ డట్లె దాని నుగ్గడించు
నాలకించు నొక్కఁ డారీతినే దాని, నొక్కఁ డెఱుఁగ డెంత కోర్చి వినియు. 29

గీ. ఎల్లమేనులయందు రాజిల్లునాత్మ, చంపరానిదిను మ్మది శాశ్వతమ్ము
నిక్క మిది యౌట నర్జునా! నీవు కుంద, వలవ దీభూతముల కెదో వచ్చు ననుచు. 30

క. అదిగాక రాచబిడ్డవు, కద నీవు, రణంబు నీకుఁ గార్యంబు కదా
యిది తక్క క్షత్రియున కె, య్యది మే లిదు? నేల బేలవై వగతు విటన్. 31

క. తెఱచిన స్వర్గద్వారము, కరణిన్ గోరక లభించుఁ గదనము పుణ్య
స్థిరులైన రాచవారికిఁ, బరికింపుము ధర్మబద్ధపథము కిరీటీ! 32

ఆ. ఇపుడు రణము సేయవేని స్వధర్మంబు, వదలినట్టి చెనఁటివాఁడ వగుదు,
వపుడు ముట్టడించు నపకీర్తిఁ గాక దు, ష్పాపభరము నీవు సైఁపవలయు. 33

ఆ. కథలు గాథ లల్లి కలకాల మెల్లరు, తేజుసెడిన నిన్నుఁ దెగడుచుంద్రు
చావుకంటెఁ జెట్ట నా వచ్చు విఖ్యాతి, నందినట్టివాని కపయశస్సు. 34

ఆ. ఇంతదనుక నిన్ను నిద్ధవిక్రమునిగా, నెంచి మెచ్చినట్టి యా సుయోధ
నాదు లకట! యిఁక ననాదరించెద రాహ, వమును విడిన పిఱికివానిఁ జేసి. 35

క. నీశత్రువు లిఁక నీరణ, కౌశలమున్ జులుకఁజేసి కవ్వడి! నానా
దేశముల వెక్కిరింత్రు దు, రాశయు; లీసడిని మించు నంగద కలదా? 36

క. చచ్చినచో స్వర్గము రిపు, వ్రచ్చినచో వసుధ నీవు వదయుదు, విఁక నీ
ముచ్చుముదుంగుట వదలుము, రెచ్చి ధనూరవము నాచరింపుము పార్థా! 37

ఆ. అస్త్రవిన్మణీ! జయాపజయమ్ముల, సుఖసుఖేతరములఁ జూడు సమత;
నవల విక్రమింపు మాహవ మొనరింపు; మపుడు నిన్ను దురిత మంట వెఱచు. 38

ఆ. ఇంతదనుక నీకు నెఱుకచేసితిఁ జుమా!, యాత్మతత్త్వమునరహస్య మెల్ల;
నుగ్గడింతు నిఁకను యోగంబు; నిది కర్మ, బంధములను ద్రెంచు, బలిమి నించు. 39

ఆ. ఇదియె కర్మయోగ; మిది కొంతలో నాఁగుఁ, గాక రిత్తవోదు క్రందు నిదదు
సమయఁజేయు బహుళసంసృతిభీతి నీ, ధర్మ మల్పమైన శర్మకరము. 40

క. రాగద్వేషాదులదెస, కేగని పరిపక్వబుద్ధియే నిలఁబడు నీ
యోగమ్మునఁ; బలుగొమ్మల, సాగెడి వెడతెలివి నిలువఁజాలదు దీనన్. 41

ఆ. వేదవాదపరులు వెడఁగులు కామ్యక, ర్మంబె కర్మ మని నిరంతరమ్ము
ఫలము లీనివిరులఁ గులుకువల్లరివంటి, పలుకు పల్కుచుంద్రు పాండుతనయ! 42

ఆ. వారు స్వర్గరతులు వారు కామాత్ములు, వారు జన్మకర్మఫలదవిధుల
భోగవైభవములఁ బొసగించుపనులు కృ, త్యంబు లంద్రు తత్త్వ మరయలేక. 43

గీ. వారినుడిఁ జిక్కి భోగముల్ వలచి కామ్య, పద్ధతులఁ బోవుమూర్ఖులబుద్ధి నిశ్చ
యాత్మకము గాక సాంఖ్యమునందుఁ గర్మ, యోగమునయందు నిలువలే కోహటించు. 44

గీ. శ్రుతులు బోధించుపనులు సంసృతికి నాది, కారణమ్ములు; కాన నిష్కామవృత్తి
నేర్చి, సుఖదుఃఖముల దాఁటి నిత్యసత్త్వ, నిష్ఠమై నాత్మతత్త్వంబు నీవు కనుము. 45

గీ. బావిచేఁ గల్గునర్థ మపారమైన, మడుగుచేఁ గల్గుమేళ్లలో నడఁగినట్లు
శ్రుతుల నగు బాగు జ్ఞానమ్ముకతన బ్రహ్మ, విదున కొనగూడుముక్తిలో నొదిఁగియుండు. 46

ఆ. కర్మమందె నీకుఁ గల దధికారంబు; లేదు ఫలమునందు లేశమేని;
ఫలము వలచి నీవు సలుపకుమీ కర్మ; మియ్యకొనకు కర్మ మీసడింప. 47

గీ. సంగమును వీడి యోగనిష్ఠను వహించి, సఫలతన్ విఫలత నొక్కసరణిఁ జూచి
కర్మము లొనర్పవోయి! యోగం బటన్న, జయపరాజయములపట్ల సమత గనుటె. 48

గీ. సమతమై నొనరించు కర్మమునకంటె, నింద్యము ఫలానురక్తితో నెఱపుచేఁత;
శోచనీయులు ఫలదృష్టి స్రుక్కువార; లగుటను సమత్వబుద్ధి నీ వాశ్రయింపు! 49

గీ. అర్జునా! సమతాబుద్ధి నలరువాఁడు, పాయు నీలోకమునఁ బుణ్యపాపములను;
గాన యోగమ్మునకు నీవు కదఁగు టొప్పు, యోగ మనఁ గర్మములపట్ల నొదవుచదురు. 50

గీ. ప్రాజ్ఞు లిటు సమతాబుద్ధి పట్టి కర్మ, ఫలము నొల్లక సంసారబంధముక్తి
పడసి కుంతీసుతా! నిరుపద్రవంబు, నిత్య మగు మోక్షపదమున నిలువఁగలరు. 51

గీ. ఎపుడు నీబుద్ధి ఫల్గునా! హేయమోహ, కలుషతను దాఁటి నైర్మల్యగరిమ నందు
నపుడు విన్నది వినఁదగినట్టిదియును, నీకు నిష్ఫలమని తోఁచి నిందు నెఱుక. 52

గీ. అదియు నిదియు వినుట నర్జునా! నీబుద్ధి, కుదురులేని దయ్యె నిది సమాధి
నెపుడు పీఁటవెట్టు నపుడ నీ వీమహో, యోగఫలము నెఱుక నొందఁగలవు. 53

అర్జునుఁడు :

ఆ. మధురిపూ! సమాధిమగ్న స్థితప్రజ్ఞు, భాషయేది? యేమిపలుకు నతఁడు?
వానియునికి యెట్లువర్తిల్లు? నాతని, నడత యెట్టులుండు? నుడువుమయ్య! 54

కృష్ణుఁడు :

గీ. ఎవ్వఁడు మనోగతంబగు నెల్లవలపు, లవ్వలికి నెట్టి యాత్మచే నాత్మయందు
తుష్టి గని బాహ్యసుఖలాభదృష్టి విడుచు, నతఁడు పార్థా! స్థితప్రజ్ఞుఁ డనఁ జెలంగు. 55

గీ. ఇడుమకుం జిక్కి బెంబేలుపడనివాఁడు, సుఖముపట్ల ననాసక్తి చూపువాఁడు
వలపు గగ్గోలు రోసంబు వదలువాఁడు, పార్థ! నుడువఁబడున్ స్థితప్రజ్ఞుఁ డనుచు. 56

గీ. తనువుపై జీవనమ్ముపైఁ దగులు నిడక, శుభము లొదవిననాఁడు మెచ్చునకు దిగక
కీడు పైకొన్నపట్టునఁ గినుకపడక, చెలఁగు మునిబుద్ధియే ప్రతిష్ఠిత కిరీటి! 57

ఆ. కూర్మ మంగములను గుదియించుగతి విష, యేచ్ఛపైఁ జరించు నింద్రియముల
నెల్లదెసలనుండి యెవఁడు కుంచునొ స్థిత, ప్రజ్ఞ సుమ్ము వానిప్రజ్ఞపేరు. 58

ఆ. కూడు నీరు మానుకొన్న దేహికి విష, యములు తొలఁగుఁ గాని యాస తొలఁగ,
దతఁడు తత్త్వదర్శి యైననాఁ డాసయు, నుపశమిల్లి పార్థ! యపసరిల్లు. 59

ఆ. ఆత్మదర్శనమ్ము నర్థించునరుఁ డెంత, నేర్చుఁగాక యెంతపేర్చుఁగాక
యింద్రియములు చిత్తహింసాసమర్థమ్ము, లతనిమదిని బల్మి నాహరించు. 60

ఆ. అట్టియింద్రియముల నరికట్టి మనసు నా, వలన నిల్పి యుండవలెను యోగి
యెవని కింద్రియమ్ములు వశమ్ములో స్థిత, ప్రజ్ఞసుమ్ము వానిప్రజ్ఞపేరు. 61

ఆ. విషయముల నెవండు విడువక చింతించు, నతని కందు సంగ మంకురించు
సంగమునఁ గిరీటి! జనియించుఁ గామంబు, కామమునకు రోష మామతిల్లు. 62

గీ. అర్జునా! రోషమున మోహ మవతరించు, మోహమునఁజేసి మఱు పది మోసులెత్తు
మఱపుచే బుద్ధినాశమ్ము జరిగితీఱు, బుద్ధినాశమునన్ జెడిపోవు నరుఁడు. 63

ఆ. మనసు నణఁచిపట్టుమానిసి తనయాన, కగ్గపడిన యింద్రియములవలనఁ
దనువు నిల్పుకొఱకుఁ దగుపాటిసుఖములు, పొందినను బ్రసాద మందఁగలఁడు. 64

గీ. ఉల్లము ప్రసన్నమైన నయ్యోగి కుడుచు, బాధలు పరంతపా! పటాపంచ లగును
గలఁతలేనిమనమ్ముతో నలరువాని, ధిషణ యాత్మాభిముఖమై ప్రతిష్ఠిత మగు. 65

గీ. ఎడఁద నోర్వనివాని కేర్పడదు బుద్ధి. భావనయు నట్టివాని కేర్పడుట కల్ల
భావనాసిద్ధిలేక చేపడదు శాంతి, శాంతి కఱవైన సుఖ మెట్లుసంభవించు? 66

గీ. ఇచ్చవచ్చినగతిఁ బోవు నింద్రియముల, సరసఁ బయనించుచిత్తమ్ము పురుషబుద్ధి
నర్జునా! సంద్రమున నౌక నాహరించు, కొంటెగాలికైవడి నీడ్చి కుందుపఱుచు. 67

గీ. కావున నెవండు విషయసౌఖ్యములదెసకుఁ, బరువులిడు నింద్రియమ్ముల గరువమెల్ల
నణఁచి మరలింపనేర్చునో యట్టివాని, ప్రజ్ఞను ధనంజయా! స్థితప్రజ్ఞ యంద్రు 68

గీ. అజ్ఞుల కగోచరంబగునట్టి యాత్మ, నేమఱక చూచు మౌని, మోహితులదృష్టి
కర్థమై తోఁచు నింద్రియార్థాళిఁ గనక, యోగి నిద్రితుచందాన నుండుఁ బార్థ! 69

ఆ. ఎన్నినదులు సొచ్చి యెంతపెం పొదవిన, నుదధి యింత తొణఁక కుండునట్లు
కోర్కు లెన్ని చుట్టుకొన్నఁ జలింపని, వాని వలచు శాంతి, వలవ దొరుని. 70

గీ. ఎల్లవాంఛల వదలి నిస్పృహత నేర్చి, యెవఁ డహంకారమమకారలవము లేక
సంచరించు నతండపో! శాంతిఁ బడయు, ఫల్గునా! నిశ్చలానందపదముఁ బడయు. 71

క. ఇది బ్రహ్మనిష్ఠ; దీనన్, గుదురుకొనిన మోహ మంటుకొనలేదు సుమీ!
తుదిగడియ నైన నీస్థితి, యొదవినపురుషుండు ముక్తి నొందుఁ గిరీటీ! 72

## 3. కర్మయోగము

అర్జునుఁడు

గీ. కర్మమునకంటె నెఱుకయే గణ్య మనుట, యచ్యుతా! నీకు నభిమత మయ్యేనేని
కటకటా! ఘోరమైన సంగ్రామకర్మ, మాచరింపఁగ నన్నుఁ బ్రేరేచె దేల? 1

గీ. సంశయాస్పదము లనంగఁ జనెడినుడులఁ, గలఁతువా నీవు నాబుద్ధిఁ గమలనాభ!
వలదు నను భ్రాంతిపా ల్సేయవలదు జ్ఞాన, కర్మములు రెంట నెది శుభంకరము సెపుమ! 2

కృష్ణుఁడు

గీ. వెనుక నాపల్కినట్టి వీ విశ్వమునకు, రెండు నిష్ఠలు గలవు కిరీటి! వినుమ!
జ్ఞాననిష్ఠను జెప్పితి సాంఖ్యతతికిఁ, గర్మనిష్ఠను యోగివర్గమున కంటి. 3

గీ. మానవుఁడు సవనాదికర్మములు చేయ, కుండినను గర్మశూన్యత నొందలేఁడు
వాని వర్జించినను సిద్ధి వడయలేఁడు, సిద్ధి యన నర్జునా! చిత్తశుద్ధిఫలమె. 4

గీ. ఒక్కత్రుటియైనఁ గర్మంబు నుజ్జగించు, వాఁ డెవండును సృష్టిలో లేఁడు లేఁడు
ప్రకృతిసిద్ధగుణమ్ముచే సకలభూత, నికర మవశమై కర్మంబు నెఱపునోయి! 5

గీ. ఎవఁడు కర్మేంద్రియమ్ములవృత్తి నణఁచి, మనసుతో నర్థములను వేమఱు దలంచు
నతఁడు దాంభికుఁ డర్జునా! యతఁడు దొంగ, యతఁడ గోముఖశార్దూల మనఁగఁ జెల్లు. 6

క. జ్ఞానేంద్రియముల మదితో, నేనరుఁ దరికట్టి ఫలము నెంచక వాణీ
పాణిపదా దీంద్రియములఁ, బూనున్ గర్మముల నతఁడు పొగడంగఁ దగున్. 7

ఆ. కాన నీవు నియతకర్మ మూనుము పని, మానుకంటె లెస్స పూనుకొంట
చేఁత లేనినాఁడు నీతనూయాత్రయు, సాగఁజాలదోయి! సవ్యసాచి! 8

ఆ. యజ్ఞమునకుఁ జేయునట్టికర్మము గాక, కదమపనులు బంధకారణమ్ము;
లగుట నీవు ఫలము నాసింపక తదర్థ, మర్జునా! యొనర్పుమయ్య! చేఁత. 9

క. మున్న ప్రజాపతి ప్రజలను, జన్నముతో సృష్టిచేసి సవనంబున ను
త్పన్నముసేయుఁడు సుఖ; మిది, యెన్నేనర్థముల మీకు నిడు నని పల్కెన్. 10

ఆ. అధ్వరమునఁ దనుపుఁ డమరుల మీరు, మి, మ్మపుడు తనుపువార లగుదు రమరు;
లిట్లు మీరు వారు నితరేతరానంద, దాతలై కనుం డుదాత్తశుభము. 11

గీ. యజ్ఞభావితులైన యింద్రాదిసురులు, కూర్చెదరు మీకు భోగముల్ కోరినట్లు
వా రొసంగినసంపదల్ వారి కిడక, కుడుచునాతఁడు దొంగ నాఁబడుఁ గిరీటి! 12

ఆ. యజ్ఞశిష్టమైన యన్నము దినువారు, దూరు లగుదు రెల్లదురితములకు
నఘము ననుభవింతు రాత్మార్థముగ వంట, సేయువారు పాండవేయ! వింటె! 13

క. అన్నమునఁ బుట్టు భూతము, లన్నం బబ్దమునఁ బుట్టు నబ్దము యజ్ఞో
త్పన్నము, యజ్ఞము కర్మజ, మన్నా! యజ్ఞంబె విష్ణు వనియున్ గనుమా! 14

క. వేదమునఁ బుట్టెఁ గర్మము, వేదము పరమాత్మవలన వెలువడెఁ గానన్
వేదము సర్వగతంబై, పాదుకొనెన్ యజ్ఞమందుఁ బాయక పార్థా! 15

ఆ. ఇట్లు నడుపఁబడిన యీజగచ్చక్రంబు, ననుసరింపఁ డెవ్వఁ డతనిబ్రదుకు
పాపమూల మైనబ్రదుకు, వాఁ డింద్రియ, దాసుఁ, డతఁడు బరువు ధరణి కనఘ! 16

క. తనయందె రమించుచు నెవఁ, డనయము తనయందె తృప్తి నందుచు విజయా!
తనయందె సంతసంపదు, విను మతనికిఁ జేయఁదగినవిధి లేదు సుమా! 17

ఆ. బ్రహ్మవిదుఁ డతండు పార్థ! కర్మమ్ములు, సలిపి సంతరించుఫలము లేదు,
విడిచి కుడుచునట్టియిదుమును లేదు, భూ, తాళి వాని కొనఁగుమేలు లేదు. 18

ఆ. ముక్తుఁ డతఁడు; నీవు మోక్షార్థి, వగుట ఫ, లాశ విడిచి కర్మ మాచరింపు,
మనఘ! నిష్ఫలేచ్ఛ మగు కర్మ మొనరించు, పూరుషుండు ముక్తి పొందఁగలఁడు. 19

గీ. సిద్ధి నందిరి జనకాదు లిద్ధచరితు, లర్జునా! కర్మయోగమ్ము నాశ్రయించి
యీవు ప్రాజ్ఞుఁడ వైన నయ్యేదవుగాక, చేయవలెఁ గర్మములు ప్రజాశ్రేయ మెంచి. 20

క. ఉత్తముఁడు పోవుదారికి, వత్తురు సామాన్యజనులు; వాఁ డేగుతిపైఁ
జిత్తము నిడు నాగుతిపైఁ, జిత్తము నిడి లోక మెదురుసెప్పక నడుచున్ 21

ఆ. ఏను గోరఁదగిన దేమికలదు? నాకు, లేని దేమికలదు? దేనికొఱకుఁ
బరితపింపవలయు ఫల్గునా! యే?; నైనఁ, బను లొనర్తు లోకభద్ర మెంచి 22

క. ఏ నాదమఱచి యొకనాఁ, డైనను గర్మముల విడుచు టది మూడినచో
మానవు లందఱు తమవిధి, మానుదు రది లోకమునకు మంగళ మిదునే? 23

ఆ. ఏను బని యొనర్పలేని లోకమ్మున, కపుడు లేదు పార్థ! యభ్యుదయము,
వర్ణసంకరమును వచ్చును బ్రజలెల్లఁ, జెడుదు రింతచెట్ట సేయనగునె. 24

క. ఫలవాంఛ పెరిఁగి పామరుఁ, డలయక పను లాచరించునట్లు మనీషా
కలితుఁడు విశ్వహితార్థము, సలుపవలెన్ గర్మముల నజస్రము విజయా! 25

ఆ ఫలము వలచి కర్మములు సేయునజ్ఞుని, బుద్ధిమార్పరాదు బుధుఁడు పార్థ!
శ్రద్ధమై నతండు సలుపుచు సత్కర్మ, మజ్ఞు లాఁగవలయు నతనిగతికి. 26

గీ. ప్రకృతిగుణములె కర్మప్రపంచచలన, కారణము; లైన నరుఁ డహంకారమూఢ
చిత్తుఁడై యెల్లపను లేనె చేసినాఁడ, నేను మొనగాఁడ నని పొంగు నిద్ధచరిత! 27

గీ. ఫల్గునా! గుణకర్మవిభాగతత్త్వ, మెఱిఁగిన మనీషిపుంగవుఁ డింద్రియములు
విషయముల కొగ్గె ననుచు భావించి తా న, సక్తుఁడై యుండుఁ గర్తృతాసరణి మఱచి. 28

గీ. ప్రకృతిగుణములచే మోహపడినవారు, తగులుగందురు గుణకర్మ తతి నొనర్ప
ననఘ! సర్వజ్ఞుఁ డల్పజ్ఞు లైన వీరి, మలఁపరాదు సుమా స్వధర్మంబునుండి. 29

గీ. ఎఱుకమై నీవు నాయందు నెల్లపనుల, నునిచి ఫలవాంఛ మమకార ముజ్జగించి
తాప మించుక లేనిచిత్తమున రణము, సేయుమా! శాత్రవులు గుండెచెదరి పఱవ. 30

గీ. ధీయుతులు శ్రద్ధగలవా రసూయలేని, వారలై మన్మతంబు నీతీరుదాని
నర్జునా! సంతతమ్ముగ ననుసరించు, వారికిని గర్మబంధముల్ వదలిపోఁవు. 31

క. నాయాశయమ్ముపట్ల న, సూయం బ్రకటించువారు సుమతీ! యజ్ఞా
నాయత్తు లని యెఱుంగుము, పాయనిబంధముల వారు పనవుదు రెపుడున్. 32

క. జ్ఞానియును బూర్వజన్మసంస్కారమునకు, లొంగి పెడదారికిం జను; లోకమెల్లఁ
బ్రకృతికి విధేయ మగుట తప్పదు కిరీటి!, యెవ్వ రాఁపిన నిది యాఁగ దించుకేని. 33

గీ. కాచుకొని యుండు నెపుడు రాగంబు ద్వేష, మంచితాచార! సర్వేంద్రియార్థములను
మనుజునకు వైరు లవియ కావున నతండు, వానికి వశంపడక లగ్గ వదయవలయు. 34

ఆ. బాగుగా నొనర్చు పరధర్మమునకంటె, విగుణ మయ్యు లెస్సయగు స్వధర్మ;
మర్జునా! స్వధర్మమం దీల్గినను మేలె, యన్యధర్మ మది భయంకరమ్ము. 35

అర్జునుఁడు

క. ఇది చేయరానిపని యని, మది యెంతగ మొత్తుకొన్న మనుజుఁడు దురితా
స్పదవృత్తి కొగ్గు నిట నె, య్యది వాని బలాత్కరించు యదువంశమణీ! 36

కృష్ణుఁడు

గీ. కామము రజోగుణమ్మునఁ గల్గు నది ని, రుద్ధ మౌనెడఁ గోపంపురూపు దాల్చు
నది మహాశన మది పాపసదన మది వి, రోధి కుంతీసుతా! ముక్తిసాధకునకు. 37

గీ. కీలి పొగచేత నద్దంబు మైలచేత, గర్భ మది మావిచేతను గప్పఁబడిన
పగిదిఁ గామమ్ముచే మూయఁబడిన దెఱుక, ఫల్గునా! కామమును మించు పగతుఁ డెవఁడు?

ఆ. అగ్నివోలెఁ దృప్తినందక నిండింప, నలవిగాక జ్ఞాని కనవరతము
హితముగాక కామ మిది నరునెఱుకను, గప్పివైచి కోరికలను బెంచు. 39

గీ. నతరిపూ! యింద్రియములు మానసము బుద్ధి, యాశ్రయమ్ములు వలపున; కది హృషీక
మానసాదుల, నెఱుకను మాటిమాటి, దేహి నెల్లవిధమ్ముల మోహపఱుచు. 40

ఆ. అగుట నీవు మొదట నఖిలేంద్రియమ్ముల, మురు వదంపవలయు భరతముఖ్య!
పిదప జ్ఞానమునకు విజ్ఞానమున కెగ్గు, సేయుపాపి వలపుఁ ద్రోయవలయు. 41

గీ. ధీరు లీమేనికంటె నింద్రియము లెక్కు, దని వచించెద, రీయింద్రియములకంటె
మనసు దొడ్డది, బుద్ధి యమ్మనసుకంటె, మిన్న, బుద్ధికంటెఁ బ్రసిద్ధిగన్న దాత్మ. 42

ఆ. ఇట్లు బుద్ధికంటె హెచ్చుగునాత్మను, దెలిసి మనసుచే నతీవశక్తి
రూఢ మైన కామరూపశత్రువు నరి, కట్టి నెట్టుమయ్య! ఘనభుజాఢ్య. 43

# 4. జ్ఞానయోగము

కృష్ణుఁడు

గీ. అవ్యయంబగు నీయోగ మనఘ!, సవిత, కేను వినిచితి, సవిత తత్పూను దైనఁ
మనువునకుఁ జెప్పె, మనువు తత్తనయుఁ డైన, వాని కిక్ష్వాకువసుమతీశ్వరున కనియె. 1

గీ. పార్థ! యిట్లు పరంపరాప్రాప్త మైన, యోగమును దీని నిమి మున్నుగాఁ గలట్టి
రాజఋషు లభ్యసించిరి రాను రాను, జెడియె నిది సంప్రదాయవిచ్ఛిత్తికతన 2

గీ. ఈవు మామకభక్తుండ విష్టసఖుఁడ, వగుట నానాఁటియీయోగ మర్జునా! యె
ఱుంగఁజేసితి నేఁడు నీ కంగవించి, యగ్రగణ్యం బిది రహస్య మైనవిద్య 3

అర్జునుఁడు

ఆ. నీరజాక్ష! నీవు నేఁడు పుట్ట యుగాల, నాఁడె జననమందినాఁడు సవిత!
యతని కెట్లు సెప్పి తాదికాలమున? నీ, పలుకుగుట్టు నేను దెలియు టెట్టు? 4

కృష్ణుఁడు

క. నాకును నీకును భవము ల, నేకమ్ము లతిక్రమించె నెచ్చెలి! నా కీ
పోకడయెల్లన్ దెలియును, నీ కిది దుర్గమము ప్రకృతినియతుఁడ వగుటన్. 5

గీ. ఏను జననంబు మరణంబు లేనివాఁడ, భూతములనెల్ల నేలు విభూతివాఁడ
నయ్యు నాప్రకృతిని వంచి యాత్మమాయ, నుద్భవించుచున్నాఁడ నోకిరీటి! 6

ఆ. ఎపుడు ధర్మమునకు హీనత వాటిల్లు, నెపు డధర్మమునకు నేపు వచ్చు
నపుడు నన్ను నేనె యస్మదీయం బగు, మాయచే సృజింతు నోయిపార్థ. 7

క. తగువారిదిగులు దీర్పఁగఁ, దెగి సాధులఁ జెఱుచువారితేజము నార్పన్
జగమున ధర్మువు నిల్పఁగ, యుగయుగమున నే జనించుచుందును విజయా! 8

క. ఎవఁ డ(ప్రాకృత మగు నా, భవమును గర్మము నెఱుంగు వాఁడు శరీరం
బు విడిచి వెండియు నిట ను, ధృవ మందక నన్నుఁ బొందుఁ బాండుకుమారా! 9

ఆ. కోరికలు భయమ్ము కోపమ్ము వీడి నా, యందె మనసు నిల్పి యస్మదాశ్ర
యమ్ము వలచి ఫల్గునా! జ్ఞానతపమునఁ, దేఱి పెక్కు రందినారు నన్ను. 10

గీ. ఎవ్వ రెవ్విధి న న్నాశ్రయించుచుంద్రొ, వారి కారీతి ఫల మిచ్చువాఁడ నేను
బక్షపాత మెఱుంగ నెప్పట్టునందు, నగుట మనుజులు నమ్మి న న్ననుసరింత్రు. 11

ఆ. కర్మములకు ఫలము కాంక్షించువారు దే, వతలఁ గొల్తు రిచట నతవిరోధి!
కలుగుఁ గర్మసిద్ధి కడువేగిరమ్ముగా, సాధకులకు మర్త్యజగతియందు. 12

గీ గుణములును గర్మములును గారణము కాఁగ, నరులలో నేర్పరించితి నాల్గుతెగల
ననఘ! యీమార్పునకుఁ గర్త నైన నను న, కర్తఁగా నిర్వికారునిగా నెఱుంగు. 13

క. న న్నంటుకొనవు కర్మము; లెన్నఁడు నేఁ గర్మఫలము నిచ్ఛింప; నిటుల్
న న్నెవ్వఁ డెఱుంగునొ వాఁ, డన్నా! కర్మములఁ జిక్క దందఁడు భవమున్. 14

ఆ. మున్ను కర్మమును ముముక్షువులుం జేసి, రీరహస్యమెల్ల నెఱిఁగి యెఱిఁగి
పూర్వపురుషకృతము పూర్వతరం బైన, కర్మమునకె నీవుఁ గడఁగు మిపుడు. 15

ఆ. కర్మ మనఁగ నెది యకర్మమునా నెద్ది, యని కలంగుఁ బ్రాజ్ఞుఁ డయ్యు నరుఁడు;
నేఁడు దీనితెఱఁగు నీ కెఱిఁగింతు నీ, వశుభమునకుఁ జిక్క కలరునట్లు. 16

ఆ. కర్మతత్త్వమును, వికర్మతత్త్వంబు, న, కర్మతత్త్వమును దగన్ గ్రహింప
వలయుఁ; గాని చిక్కుగలవిషయం బిది; కాన వినుము సావధానమతిని. 17

గీ. కర్మమునయం దకర్మమున్ గనినవాఁ, డ, కర్మమునయందుఁ గర్మమున్ గనినవాఁడు,
ప్రాజ్ఞుఁ డన యోగి యనఁగఁ గర్మములనెల్ల, నిర్వహించినమేటి నా నెగడుఁ బార్థ! 18

ఆ. ఎవఁడు చేయుచేఁతలెల్లను గామసం, కల్పవర్జితములుగా నెసంగు
నతని బుధులు సూరి యనియును జ్ఞానాగ్ని, దగ్ధకర్ముఁ డనియుఁ దలఁచుచుంద్రు. 19

గీ. కర్మఫలవాంఛ విడి తృప్తి కడు గడించి, యొరుల నాశ్రయింపక యెవ్వఁ డుండు నతఁడు
కర్మమును లెస్సగాఁ జేయుఁగాక లేశ, మేనిఁ జేయనివాఁడ యౌ మానమహిత! 20

ఆ ఆశలనుజయించి యపరిగ్రహము నేర్చి, మనసు నోర్చి యెవఁడు మనుట కొఱకు
వలయుపను లొనర్చు వాఁడు సంసృతిబంధ, రూపదురిత మందఁ డోపృథాజ! 21

గీ. ఎవఁ డయాచితలబ్ధిచేఁ దృప్తి నంది, గెలుపు నోటమి నొక్కమైఁ దలఁచి కష్ట
సుఖముఖద్వంద్వముల దాఁటి సూడు మఱచు, నతఁడు పనిచేయుఁగాక బంధితుఁడు గాఁడు.

క. గతసంగులు జ్ఞానావ, స్థితబుద్ధులు యజ్ఞదృష్టిఁ జేసెడిపని సం
సృతిహేతువు కాదు ఫలా, న్వితముగ నదియెల్ల నడఁగు విక్రాంతినిధీ! 23

గీ. స్రుక్కు బ్రహ్మము, బ్రహ్మంబు స్రువము, బ్రహ్మ, మగ్ని, హుతము బ్రహ్మము, బ్రహ్మ మగు హవిస్సు
బ్రహ్మవిదుఁ డొనర్చెడు నధ్వరం బదెల్ల, బ్రహ్మమే, బ్రహ్మమే దానిఫలముఁ బార్థ! 24

గీ. కర్మయోగులు కొందఱు కవ్వడీ! స, మాచరింతురు జన్నంబు నమరు లలర;
జ్ఞానయోగులు కొందఱు పూని బ్రహ్మ, శిఖిని జిత్తహవిస్సు వేల్చెద రయారె! 25

గీ. కొంద ఱర్జునా! శ్రోత్రాదికేంద్రియముల, సంయమాగ్నుల వేల్తురు సాహసించి;
వేల్చెదరు సుమ్ము శబ్దాదివిషయములను, గొంద ఱింద్రియవహ్నులఁ గొసరి కొసరి. 26

గీ. పూతమై జ్ఞానదీపితమై తనర్చు, నాత్మనిగ్రహ యోగాగ్నియందుఁ బ్రాణ
కర్మముల నఖిలేంద్రియ కర్మములను, వేల్చెదరు కొంద ఱా త్తవివేకవిభవ! 27

గీ. ద్రవ్యదానము యోగమ్ము తపము వేద, పఠనమును శాస్త్రసంప్రాప్తపాండితియును
యతనశీలురు సంశితవ్రతులు కొంద, ఱర్జునా! జన్న మని దాని నాచరింత్రు. 28

గీ. పార్థ! వినుము ప్రాణాయామపరులు మిగుల, గాసి కోర్చి ప్రాణాపానగతుల నాఁపి
ప్రాణము నపానమునయందుఁ బ్రాణమం ద, పానమును వేల్చుచుందు రబ్రమ్ము గాఁగ

గీ. పరిమితాహారు లగుటుఁ గొందఱు కిరీటి!, ప్రాణముల వేల్చుచుంద్రు ప్రాణాళియందు
వినుము వీ రందఱును యజ్ఞవిదులు యజ్ఞ, నిహతకల్మషులై మహామహిమ గంద్రు. 30

గీ. యజ్ఞశిష్టమౌ నమృతంబు నారగించి, పడయుఁ బురుషుండు శాశ్వతబ్రహ్మపదము
యజ్ఞదూరున కిహసుఖ మబ్బ దనినఁ, బార్థ! పరలోకసౌఖ్య మెప్పాట నబ్బు. 31

గీ. వేదముఖమున జన్నముల్ పెక్కులిట్లు, విస్తృతము లయ్యె నర్జునా! వీనిఁ గర్మ
జాతములుగా నెఱుంగు మీసరణి నెఱిఁగి, నట్టివారు భవార్తుల నెట్టువారు. 32

గీ. ద్రవ్యమున నిర్వహించు నధ్వరముకంటె, మాననీయము ఫల్గునా! జ్ఞానయజ్ఞ;
మఖిలకర్మములును జ్ఞానమందె యణఁగు, నెఱుకయే కర్మసంతతికెల్ల ఫలము. 33

గీ. ఈవు బ్రహ్మవేత్తల నాశ్రయించి వారి, యడుగులకు మ్రొక్కి శుశ్రూష లాచరించి
కరుణ నార్జించి యెఱుకను బడయుమయ్య, విడువక సమస్తశంకల నడిగి యడిగి. 34

ఆ. ఎఱుక నందినప్పు డిమ్మోయి వెందియు, మోహపదవు, సర్వభూతములను
నీవు చూడఁగలవు నీయందు నాయందు, నేన సర్వమనియుఁ గానఁగలవు. **35**

క. ఓయి! మహాపాపాత్ముఁడ, వే యగుదువుగాక నీవు వెఱవకు, జ్ఞాన
శ్రేయఃప్లవమునఁ గిల్బిష, తోయధిని దరింపఁగలవు దుర్దమశౌర్యా! **36**

ఆ. ఎగసి మండునగ్ని యెండినకట్టెలఁ, బొడిచి పొడిచి యెట్లు బూదిసేయు
నట్లు బూదిసేయు నర్జునా! జ్ఞానాగ్ని, సంచితాది కర్మసంచయముల. **37**

ఆ. కానఁబడదు పార్థ! జ్ఞానమ్ముతో సాటి, యగు పవిత్రతేజ మవనియందు
యోగసిద్ధపురుషుఁ దాఁగి యాఁగి నిజాను, భవమునందు దీనిఁ బడసి తనియు. **38**

ఆ. ఇంద్రియమ్ములను జయించినవాఁడు, శ్ర, ద్ధాళువైనవాఁ డుదాత్తనిష్ఠ
నేర్చినట్టివాఁడు నెచ్చెలీ! జ్ఞానమ్ము, నంది పరమశాంతి ననుభవించు. **39**

ఆ. ఎఱుకలేనిపురుషుఁ డెఱిఁగినదానిపై, శ్రద్ధలేనివాఁడు, సంశయాత్ముఁ
డిందుకులజ! పొలియు నిందైన నందైన, శంకితునకు సుఖము సాధ్యపడదు. **40**

ఆ. ఎవఁడు యోగదీక్ష నెల్లకర్మంబుల, నడఁచు, నెఱుకబల్మి నఖిలసంశ
యములు విడుచు నెవ్వఁ డాత్మజ్ఞుఁ డాతఁడు, కట్టుపడఁడు పార్థ! కర్మములకు. **41**

ఆ. అగుటఁజేసి యెఱుక యనుకత్తిఁ బూని య, జ్ఞానతిమిరజనిత సంశయములఁ
గోసివైచి ఫలము కోరని కర్మంబు, వలచి నిల్వు మాహవం బొనర్చ. **42**

# 5. కర్మసంన్యాసయోగము

అర్జునుఁడు

క. కర్మములు మాను మని, మఱి, కర్మము లొనరింపు మనెదు కమలేక్షణ! యీ
ధర్మములు రెంట నెయ్యది, శర్మదమో తేల్చి తెలుప సంప్రార్థింతున్. **1**

కృష్ణుఁడు

క. చేఁతలు విడుచుట విడువమి, హేతువులే ముక్తి; కైన నీరెండిటిలోఁ
జేఁతలు విడువమి యుత్తమ, రీతి యనందగుఁ జుమీ! యరిందమబాహూ! **2**

గీ. రాగ మలుకయు లేని కర్మవ్రతుండు, వాసికెక్కును నిత్యసంన్యాసి యనఁగ
సంప్రాప్తద్వంద్వుఁ దగుట సంసారబంధ, ముక్తి నందు ననాయాసముగ నతండు. **3**

గీ. కర్మసంన్యాసరీతియుఁ గర్మయోగ, పద్ధతియు వేఱువే అని పలుకు మొఱకు;
పండితుఁడు పల్కఁ డీమాట; పార్థ! రెంట, లెస్సగా నెద్దిపూనిన లెస్స యొదవు. 4

క. జ్ఞాని గడియించు పరమ, స్థానంబే కర్మయోగిసత్తముఁ దందున్
గాన నెవఁ డీ యభిన్నత, కానంగలఁ డతఁడు ప్రాజ్ఞగణ్యుఁడు విజయా! 5

గీ. కర్మయోగముతో నెడన్ గడిగి దిద్ద, కరినిషూదన! సంన్యాస మందుకొనుట
కష్టమగుచేఁత; నిష్కామకర్మయోగ, కుశలుఁ డచిరమ్ముగా ముక్తిగు ట్టెఱుంగు. 6

ఆ. మనసు నింద్రియముల నణఁచినదిట్ట, ప, విత్రబుద్ధి. భూతవితతి తాను
నొకఁడ యని యెఱుంగుయోగి, కర్మాసక్తుఁ, డయ్యుఁ గర్మములకు నగ్గపడఁడు. 7

ఆ. కనుచు వినుచుఁ దాఁకుచును మూర్కొనుచుఁ దిండి, తినుచుఁ జనుచు నిద్రగొనుచు నూర్చు
చింద్రియాళినడక నీక్షసేయుచుఁ బని, యింత సేయ ననియ యెంచు యోగి. 8

గీ. నుడువుచున్ మలమూత్రముల్ విడుచు చొకని, ముట్టుచున్ గన్నుదెఱచుచు మూయుచున్ ని
జేంద్రియమ్ముల గతులెల్ల నీక్షసేయు, చేను బని సేయలే దని యెంచు యోగి. 9

గీ. ఎవఁ డనాసక్తుఁడై పనులెల్ల నీశ్వ, రార్పితమ్ములు గావించు నతఁడు నీటి
యంటు వడయని తామరపాకువోలెఁ, బరిధవిల్లును గిల్బిషస్పర్శ లేక. 10

ఆ. ఆత్మశుద్ధికొఱకు నర్జునా! ఫలవాంఛ, నీఁగి పనులొనర్చు యోగరతుఁడు
మానసమ్ముతోడ మతితోడ మయితోడ, మమతలేని యింద్రియములతోడ. 11

ఆ. కర్మఫలము విడిచి కవ్వడీ! నైష్ఠిక, శాంతి నందు యుక్తుఁ; డంతరంగ
శుద్ధి లేనివాఁడు బద్ధుఁడౌ గామమ్ము, తఱుమ ఫలమునందుఁ దగిలి తగిలి 12

గీ. వినుము తొమ్మిదివాకిళ్ల వీటివంటి, తనువున మనస్సుతోఁ గర్మతతిని వదలి
కర్తయును గారయితయును గాక నిర్జి, తేంద్రియుండు సుఖమ్ముగా నెసఁగుఁ బార్థ! 13

గీ. ఈశ్వరుఁడు మానవులకుఁ గర్తృత్వమేని, కర్మమేని ఫలంబేని కలుగఁజేయఁ;
డర్జునా! కర్తృతాదుల కన్నిటికిని, బ్రకృతియే కారణమ్ముగాఁ బరఁగుచుండు. 14

గీ అచ్ఛశీలపరా! పరమాత్మ యొకని, కలుషమును గాని పుణ్యమున్ గాని కొనఁడు
జ్ఞాన మజ్ఞానపిహితమ్ము గానఁ దెలివి, సెడినసంసారు లిట మోహపడుదు రకట! 15

ఆ అణఁచివైచు నెవ్వఁ డాత్మబోధమున న, జ్ఞానతమము నట్టివాని కెఱుక
వేవెలుంగువోలె వెలుఁ గిచ్చి కవ్వడీ!, చూపఁగలదు తత్త్వరూపమెల్ల 16

గీ. ఎఱుకచేఁ బాపమును ద్రోచి యెవఁడు సూచుఁ, దత్త్వము నతండు తద్బుద్ధి తన్మనమ్ము
తద్గతాఖండనిష్ఠయుఁ దత్పరాయ, ణత్వమును గల్గి కను నపునర్భవమ్ము. 17

గీ. విద్య వినయమ్ము గల బ్రహ్మవిదుని మొదవు, నేనుఁగును గుక్కనున్ గుక్కయొఱచి మెక్కు
వాని సమదృష్టితోఁ జూచువాఁడు పాండు, రాట్సుతా! పండితుండు నా రాణకెక్కు. 18

గీ. ఎల్లమేనుల నాత్మ రంజిల్లు ననియు, నది పవిత్రం బనియు నమ్మి యఖిలభూత
సమత పాటించువాఁడు బ్రహ్మమున నిల్చు, వాని కీజన్మమందె కైవసము ముక్తి. 19

క. స్థిరబుద్ధులు నిర్మోహులు, పరతత్త్వరహస్యవిదులు బ్రహ్మస్థితు లౌ
పురుషులు ప్రియముం గని సం, బరపడ రప్రియము నంది పనవరు పార్థా! 20

ఆ. విషయభోగములకు విముఖుఁడౌ నరుఁ డాత్మ, నెట్టిసుఖము వడయు నట్టిసుఖమె
పడయు బ్రహ్మనిష్ఠ పాయనియోగియు, వింగడింపరాదు వీరి విజయ! 21

ఆ. విషయములఁ బుట్టుసుఖములు వెతలకెల్ల, హేతువులు రాకపోకల నెనసి యుంట;
నిది యెఱింగినపండితుఁ డిష్టపడఁడు, బుద్బుదప్రాయ మైన యాభోగములకు. 22

ఆ. కామరోషవేగ మేమానవుఁడు మేను, విడుచుకంటె ముందె యడఁచు నిందు
నతఁడె యోగివర్యుఁ డతఁడె జీవన్ముక్తుఁ, డతఁడె నిత్యసుఖము నందువాఁడు. 23

క. తనలో సుఖించు నెవ్వఁడు, తనలోఁ గ్రీడించు నెవఁడు తనలో వెలుఁగుం
గను నెవ్వఁ డతఁడు బ్రహ్మము, ననువుం గని ముక్తి నందు నభినంద్యమతీ! 24

ఆ. లుప్తకల్మషుండు లూనసంశయుఁడు జి, తేంద్రియుండు లోకహితుఁడు నైన
ఋషికి జననమరణఋతి లేని బ్రహ్మని, ర్వాణ మబ్బుఁగల దవార్యశౌర్య! 25

ఆ మనసు నోర్చి కామమును గ్రోధమును వీడి, యాత్మతత్త్వ మెఱిఁగినట్టియతికి
నమరు ముక్తి యిందు నందును ఫల్గునా!, జ్ఞానఫల మటంచు దాని నెంచు. 26

గీ. విజయ! శబ్దాదివిషయముల్ వెలికి నెట్టి, చూపు భ్రూమధ్యమందె నొ వ్వాఁపి నిలిపి
నాసికారంధ్రములు రెంట నడుచుచున్న, ప్రాణము నపానమును సరిగా నొనర్చి. 27

ఆ. ఇంద్రియముల నిగ్రహించి మనస్సును, బుద్ధి నణఁచి మౌనముద్ర దాల్చి
యిచ్ఛ భయము కోప మెడల ముముక్షు వౌ, నతఁడు ముక్తుఁడే నిరంతరముగ. 28

గీ. పార్థ! నే జన్నమునకుఁ దపమ్మునకును, భోక్త నని సర్వలోకప్రభుండ నని స
మస్తభూతమిత్రుఁడ నని మది నెఱింగి, పడయుచున్నాఁడు పురుషుండు పరమశాంతి. 29

# 6. ఆత్మసంయమయోగము

కృష్ణుఁడు ·

గీ. కర్మఫలములయం దాస గనక యెవ్వఁ, డర్హ మగునట్టి చేఁతల నాచరించు
నతఁడు సంన్యాసి యగు యోగి యగును గాని, కృతమతి! నిరగ్నికాఁడు నిష్క్రియుఁడుఁ గాఁడు.

క. ఎది సంన్యాస మనంబడు, నది యోగంబని యెఱుంగుమా! వీరగుణా
స్పద! ఫలసంకల్పమ్మును, వదలక కనలేఁడు యోగిపద మెవ్వాఁడున్. 2

గీ. యోగమున నున్నతస్థితి కేగఁ దలఁచు, వానికిన్ సాధన మసంగమైన కర్మ;
మర్జునా! యోగమున సిద్ధి నందినట్టి, వానికిన్ సాధనము చేఁత మానుకొంట. 3

గీ. పురుషుఁ డెపు డింద్రియార్థముల్ మఱచు నెపుడు, కర్మములు మాను నపుడు సంకల్పచయము
నతకరించినవాఁ డగు నపుడు యోగ, సిద్ధి నందినవాఁ డగు నిద్ధచరిత! 4

ఆ తన్నుఁ దానె యున్నతస్థితికిం జేర్చు, కొనుట వలయుఁ ద్రోసికొనుట తగదు
తనకుఁ జుట్ట మెవఁడు తాఁ గాక తనకు శా, త్రవుఁ డెవండు కలఁడు తాను గాక. 5

గీ. ఎవఁడు శమదమసంపత్తి నెనయు నతని, కింద్రియావలి పరమార్థహేతు వగును
సంయమబలమ్ము నేర్వని జనున కదియె, శత్రువై సకలానర్థజనక మగును. 6

గీ ఒదవు సుఖదుఃఖములను శీతోష్ణములను, గౌరవాగౌరవమ్ములఁ గవ్వడీ! జి
తాత్ముఁడు ప్రశాంతుఁ డందుబ్రహ్మానుభూతి, కెచ్చుతగ్గులు వాటిల్ల వించుకయును. 7

గీ జ్ఞానవిజ్ఞానసంతృప్తమానసుండు, నిర్వికారుఁడు నిర్జితేంద్రియుఁడు యోగి
మన్ను బంగారు నొకరీతి నెన్నువాఁడు, యుక్తుఁ డని పల్కఁ జెల్లు నిర్ముక్తదురిత! 8

ఆ మేలొనర్చు నతని మిత్రు శత్రుఁ దటస్థు, మధ్యవర్తి బంధు మంచివానిఁ
బాపశీలుఁ గినుకపడఁదగ్గ నరు నొక్క, పగిదిఁ జూచువాఁడు పరమయోగి 9

గీ. యోగి యేకాంత మగుచోట నొకఁడె నిల్చి, నియమితేంద్రియుఁడై తృష్ణ నిగ్రహించి
గడన విడనాడి సర్వదా యెదఁద నిల్ప, వలయుఁ బరమాత్మయందు నవార్యశౌర్య!10

ఆ. అచ్చమైననేల నర్జునా! కడుమిఱ్ఱు, మిగులఁబల్లు గానిపగిది దర్భ
లజిన మంశుకమ్ము నానుపూర్విగ సుస్థి, రంబుగా నిజాసనం బమర్చి. 11

గీ అందుఁ గూర్చుండి యోగి యేకాగ్రమైన, మనసుతో నింద్రియక్రియ లణఁచి యణఁచి
పార్థ! యంతఃకరణశుద్ధిఁ బడయుకొఱకు, నభ్యసింపఁగవలయు యోగానుభూతి. 12

గీ. నిశ్చలమ్ముగ సమముగా నిజశరీర, మస్తకగ్రీవము లతం దమర్చి మోయు
చటు నిటున్ గనుఁగొనక యావంత కదల, కాత్మనాసాగ్రమునయందె యక్షి నిలిపి. 13

గీ. అగ్గలంబగు శాంతిమై నాత్మ దనర, నిర్భయత బ్రహ్మచారితానిష్ఠ నేర్చి
మదిని సవరించి నాయందుఁ గుదురుకొల్పి, యుక్తుఁడై నన్ను ధ్యానించుచుంట వలయు. 14

ఆ. కట్టువడినమనసు గలయోగి సర్వదా, మదిని బ్రహ్మమందుఁ గుదురుపతిచి
యమృతపరమ మస్మదనురక్త మైన చి, త్తోపరతిని బడయు నోయిపార్థ! 15

గీ. లెస్సగాఁ దినువానికి లేశమేని, దిననివానికి మిగుల నిద్రించువాని
కోర యంతయుఁ గనుమూయకుందువాని, కర్జునా! యోగనిష్ఠ లభ్యమ్ము గాదు. 16

ఆ. తగినయోగిరంబు తగినసంచారంబు, తగినపనులు సేఁత తగిననిద్ర
తగిన జాగరూకతయుఁ గలవానికే, దొరకు యోగ మఖిలదుఃఖహరము. 17

ఆ. అన్న! యెపుడు నియతమై చిత్త మాత్మపై, నిలిచియుండు నపుడు నిఖిలకామ
విముఖుఁడై నరుండు విద్వజ్జనాళిచే, నుగ్గడింపఁబడును యుక్తుఁ డనుచు. 18

గీ. నియతచిత్తుఁడై యోగంబు నిర్వహించు, నతనిడెందమునకు గాలి యణఁగియున్న
పట్టునన్ దిరమై వెల్గునట్టిదివ్వె, నీడుగాఁ జెప్పవచ్చు నోయీ కిరీటి! 19

గీ. దేనిచే నుపరుద్ధమై మానసంబు, శాంతి గను, దేనిచే నరుఁ డంతరంగ
వీథి నాత్మను జూచి నిర్వృత్తి నందు, నర్జునా! దాని యోగ మటం చెఱుంగు! 20

గీ. దేనిచే మానవుం డతీంద్రియము బుద్ధి, గమ్యము ననంత మైన సుఖమ్ముఁ బడయు
దేనిచే నాత్మఁ గనుచు నింతేని గదలఁ, దర్జునా! దాని యోగ మటం చెఱుంగు! 21

గీ. దేని నార్జించి మనుజుండు ధిక్కరించు, నితరలాభంబు లవి దుఃఖహేతువు లని,
దేన నిల్చి తొణఁక దెంతదిగులు గనియు, నర్జునా! దాని యోగ మటం చెఱుంగు! 22

గీ. యోగ మన దుఃఖదూరంబు యోగ మనఁగ, నాత్మసందర్శనము సంశయార్తి లేని
మనసుతో నాకులము గాని మనసుతో శ్ర, మించి దీని నరుండు సాధించు టొప్పు. 23

గీ. పార్థ! సంకల్పభవములై పరఁగునట్టి, కామములను సమగ్రముగాఁ ద్యజించి
విషయదిశ కేగు నింద్రియవితతినెల్ల, నూఁచముట్టుగ మనసుతో నాఁచి యాఁచి. 24

గీ. మనసు నాత్మస్థమును జేసి మతియొకందు, కొంచెమైనఁ దలంపక కుదురుకొన్న
బుద్ధితో మెల్లమెల్లన పొందవలయు, నుపరతిని యోగసాధకుఁ డో కిరీటి! 25

గీ. చంచలం బస్థిరం బనఁ జనుమనస్సు, మరగి యేయేసుఖాలకై పరుగులెత్తు
నయ్యయిసుఖాలనుండి నే ర్పలర దాని, మలపి యాత్మవశమ్ముగా మార్పవలయు. 26

ఆ. పార్థ! శమితమనసు బ్రహ్మభూతు రజఃప్ర, వృత్తిదూరు ననఘు నిట్టియోగి
నాశ్రయించు నతులమైన బ్రహ్మానంద, మెచ్చి తనకుఁదాన వచ్చివచ్చి. 27

ఆ. ఇట్లు తనమనమ్ము నెల్లవేళల నాత్మ, యందుఁ జేర్చి యోగి యఘము నీఁగి
పదయు నలంతలేక బ్రహ్మానుభవ మనఁ, బరఁగు పరమసుఖము పొందుపుత్ర! 28

ఆ. యోగనిహితచిత్తుఁ డోఫల్గునా! సమ, దర్శనుం, డతండు తన్ను సకల
భూతకోటియందుఁ బొడఁగాంచుఁ దనయందుఁ, గాంచు సర్వభూతసంచయమును. 29

క. అన్నిట ననుఁ దిలకించుచు, నన్నిటి నాయందుఁ జూచునతఁ డెవ్వఁడొ తత్
సన్నిధి నే నుందును మత్, సన్నిధి నతఁ డుండు నెల్లసమయములందున్. 30

ఆ. తనకు నాకు భేద మణుమాత్ర లేమి, యే, నఖిలభూతవర్తి నగుట తెలిసి
నను భజించుయోగి నాయందె నిలుచుఁ గ, ర్మములు పూనుఁగాక మానుఁగాక. 31

గీ. తనకు మేలైనపని లోకమునకు మేలు, తనకుఁ గీడైనపని లోకమునకుఁ గీడు
నిక్క మిదియం చెఱింగి ప్రాణికి విపత్తు, గూర్పక మెలంగుయోగిపో! గొప్పవాఁడు. 32

అర్జునుఁడు

క. సమతాప్రధాన మగు యో, గము సెప్పితి వీవు; దానిఁ గనుఁగొంట యశ
క్యము నాకు; నేను జపలుఁడ, నమరసుతా! చపలుఁ డింత కర్హుం డగునా! 33

ఆ. మనసు చంచలంబు మాధవ! దేహేంద్రి, యముల నిది కలంచు; నవధిలేని
బలము, గట్టితనము కలదు దీనికి, గాలి, వంటిదీని నాఁపు వల నెఱుంగ 34

కృష్ణుఁడు

గీ. సవ్యసాచీ! మన స్సతిచపల మగుట, నిగ్రహింపరానిది యౌట నిజము! నిజము!
గురుతరాభ్యాసబలమునఁ జిరవిరాగ, పాటవమ్మున నిది వశంపడుఁ గిరీటి! 35

గీ. మానసిక నిగ్రహము లేనివాని కంద, రాని దీయోగ, మభ్యాసరతున, కాత్మ
నిగ్రహము గలవాని కీనిష్ఠ యేయు, పాయమున నైనఁ గుదురు విధేయవిమత! 36

అర్జునుఁడు

గీ. శ్రద్ధ యుండియు నిగ్రహశక్తి లేక, సిద్ధి నందకమున్నె లక్ష్మీసనాథ!
యోగచలితమనస్కుఁడై యేగతికి న, రుండు చనుఁ జెప్పవే కృపారూఢమతిని. 37

ఆ. బ్రహ్మపథమునందుఁ బయనించుతఱి దృష్టి, చెదరి దారిదప్పి బెదరువాఁడు
రెండిటికిని జెడిన రేవడయై పాయ, వడిన మబ్బువోలె నడఁగునొక్కొ? 38

ఆ. అస్మదీయసంశయము నూఁచముట్టుగాఁ, దునుమఁ దగుదు వీవు దనుజవైరి!
యేతదీయశంక నెడలింప నీకంటె, నితరుఁ డెవ్వఁ డుండు నీజగాన. 39

కృష్ణుఁడు .

గీ. అర్జునా! యోగచలితుఁ డౌ నతని కిచట, నచటఁ బాటిల్లుచెట్ట యావంత లేదు
మంచిపనుల గావించి కావించుపురుషుఁ, డెవ్వఁడును దుర్గతికిఁ బోవఁ డింత నిజము.

గీ. పుణ్యనిధు లైనవా రుండు భువనమునకుఁ, జేరి పెక్కేఁడు లచట వసించి శౌచ
వైభవము లక్ష్మియున్ గలవారియింటఁ, బుట్టు యోగచ్యుతుఁడు పాండుభూపతనయ!

గీ. అట్లు జనియింపకున్ననాఁ డతఁడు బుద్ధి, మంతులగు యోగులు వెలుంగు మనికిపట్టు
నందు నుదయించు; నీయుదయంబు జగతి,నెంతయును దుర్లభముకదా! కుంతితనయ!

క. తన మునుపటిమేనికిఁ జెం, దిన తెలివిం బడసి యతఁ డతీవశ్రమ మీ
కొని మఱల యోగసిద్ధికిఁ, బెనఁగున్ దొలితావి విడిచిపెట్టనె ప్రాణిన్. 43

క. అతఁడు పూర్వాభ్యాసము, చేతనె యోగమ్ముదెసకుఁ జేరుఁ; దదీయ
ప్రీతి మొలకెత్తినంత న, తీతుఁ డగున్ బ్రకృతి కతఁ డతీవతితిక్షా! 44

గీ. పట్టుదలతోడ యత్నించునట్టి యోగి, పాపములఁ బాసి బహుభవప్రాప్తదీప్తి
కలితుఁడై సిద్ధి నంది సద్గతిని బడసి, యవ్యయానందభాజనుం డగుఁ గిరీటి! 45

గీ. ధీనిధీ! తాపసునకంటె జ్ఞానికంటె, నగ్నిహోత్రాదికర్మము లాచరించు
వానికంటెను యోగి మేలైనవాఁడు, కాన నీవును యోగంబు పూను టొప్పు. 46

గీ. అర్జునా! యోగులందఱయం దెవండు, మద్గతంబగు మనసుతో మహితమైన
శ్రద్ధతో నన్ను భజియించు నిద్ధచరితుఁ, డాతఁ డుత్తముఁ డని మామకాశయమ్ము.47

# 7. విజ్ఞానయోగము

కృష్ణుఁడు

ఆ. నన్ను నాశ్రయించి నాయందుఁ జిత్తంబుఁ, జేర్చి యోగ మభ్యసించుకొనుచు
నెల్లశంక లడఁగ నీవు లెస్సగ నన్నుఁ, గనుతెఱంగు వినుతు వినుము పార్థ! 1

గీ. అనుభవజ్ఞానసహిత మైనట్టిజ్ఞాన, మర్జునా! వివరింతు నీ కగ్గలముగ
దీని నెఱిఁగినపిమ్మటఁ దెలియఁదగిన, యర్థ మెద్దియు లేదు మోక్షాభిరతికి. 2

క. వేయిట నొకఁ డీతెల్వికి, నాయితపడు; నట్టినరసహస్రమ్మున యం
దేయొకఁడో ననుఁ గను దుర్, జ్ఞేయము నాతత్త్వ మల్పజిజ్ఞాసులకున్. 3

ఆ. నేల నీరు నిప్పు గాలి నింగి మనస్సు, ధీ యహంత యన మదీయమైన
ప్రకృతి పార్థ! యష్టభాగములన్ దగు, నిదియె మాయ నాఁగ నెసఁగు నోయి! 4

గీ. ఇది నికృష్టము జడము సంసృతికి హేతు, వర్జునా! దీనికంటె మేలైనప్రకృతి
నాది కల దొండు, జగమున కాదరువుగ, జీవరూపమ్ముగా నది చెలఁగుచుండు. 5

గీ. అపర పర సంజ్ఞలన్ దగునట్టిప్రకృతు, లివియె సర్వభూతోత్పత్తి హేతువులుగ
నెఱుఁగు; మియ్యెడ నేనె యీపృథులభవన, జననమరణమ్ములకు హేతు వనియు నెఱుఁగు!

గీ. కవ్వడీ! వినవోయి! నాకంటె గణ్య, మితర మగు హేతు వీసృష్టి కెదియు లేదు
దారమున మణు లున్నచందమున లోక, మిది సమస్తము నాయందు నొదిఁగియుండు.7

గీ. శుచిమతీ! సలిలమ్మున రుచిని నేను, సూర్యచంద్ర మండలములశోభ నేను
శ్రుతుల నోంకారమును మింట రుతియు నేను, పౌరుషము నేను మానవప్రకృతియందు.

ఆ. వసుధయందు సురభివాసన నే నగ్ని, దేవునందుఁ దీవ్రదీప్తి నేను
దాపసాళియందుఁ దపము నే నెల్లభూ, తమ్ములందు జీవనమ్ము నేను. 9

ఆ. అఖిలభూతములకు నాదిమబీజంబ, నేను బుధులపాలి యెఱుకనేను
దెలిసికొనఁగదోయి! తేజస్వులై నుతి, కెక్కువారితేజ మేను బార్థ! 10

క. బలవంతులు కామాదుల, గెలిచెడిబిగి నేను బాడికిన్ జుట్టముగా
నిలఁగలప్రాణులు కుడిచెడి, వల పే నని యీ వెఱుంగవలయుఁ గిరీటీ! 11

ఆ. సాత్త్వికములు రాజసములు తామసములై, యలరునట్టి భావములకు నేన
జనకుఁడను వయస్య! వినుము వానికి నేను, లెంకఁ గాను నాకు లెంక లవ్వి. 12

గీ. ఫల్గునా! జగమెల్ల నీభావములకు, లొంగి మోహతమమ్మున బ్రుంగి బ్రుంగి
వీనికంటెను బరునిగా వికృతు లాఱు, లేనివానినిగా నన్నుఁ గానలేదు. 13

ఆ. మోహమునకు మూలముగ నస్మదీయమౌ, మాయ కలదు త్రిగుణమయము పార్థ!
యిది తరింపరాని దెవ్వఁడు న న్నాశ్ర, యించు నతఁడె యుత్తరించు దీని. 14

ఆ. మాయకతనఁ దెల్వి మడసి యాసురధర్మ, మాశ్రయించి పాపులైన యధము
లనఘ! నను భజింప నాసక్తిపడరు దు, ర్గతికి దినదినమ్ము గంతులిడుచు. 15

గీ. ఆర్తులకు వ్యాధులకు లొంగి యడలువారు, దారసుతకాంచనాదులు కోరువారు
తత్త్వజిజ్ఞాస కలవారు తత్త్వవిదులు, నను భజింతురు పార్థ! యనారతముగ. 16

క. ఈ నాల్గుతెగలవారల, లో నిశ్చలభక్తిమై వెలుంగుదు రెవ రా
జ్ఞానులు గణ్యులు; వారికి, నే నిష్టుఁడ వారు నాకు నిష్టులు విజయా! 17

గీ. తెలియు మర్జున! యీ నాల్గుతెగలవార, లధికులే కాని జ్ఞాని నా కాత్మసుమ్ము
నియతమానసుఁడై వాఁడు నేన తనకుఁ, బరమగతి యని నమ్మి గు ట్టెఱిఁగెఁ గాన. 18

ఆ. బహుభవమ్ము లైనపదపడి మనుజుండు, జ్ఞానియై సమస్తజగము వాసు
దేవమయ మటంచుఁ దెలిసి ననుం జేరు, నమ్మహాత్ముఁ డరిది యరిది విజయ! 19

గీ. పలుగు రోపార్థ! తమ తొంటిప్రకృతులకు వి, ధేయులై కామములఁ బెంచి తెలివిఁ బాసి
వలయు నారాధనవిధానములకుఁ జొచ్చి, దాసు లౌదురు చిల్లరదయ్యములకు 20

గీ. ఎవ్వఁ డేవేల్పురూపంబు నిచ్చమై భ, జింపఁ దలపోయు నతని కక్షీణమైన
విశ్రుతంబైన శ్రద్ధ నవ్వేల్పునందు, నిలుచున ట్లొనరింతు మానితగుణాఢ్య! 21

క. అతఁ డాశ్రద్ధను దనదే, వత నారాధించు; నతనివల పస్మత్ ప్రే
రితుఁడై తద్దేవత పూ, రితిసేయును భక్తి ముమ్మరించినయంతన్. 22

ఆ. అల్పబుద్ధు లగుచు నన్యదేవతల న, ర్థించువారిఫలము తిరము గాదు
వారు చేరుచుంద్రు వారివేల్పుల, నన్ భ, జించువారు నన్నుఁ జేరుచుంద్రు. 23

ఆ. ప్రకృతిభిన్నమైన పరమోత్తమంబైన, నాశరహితమైన నాస్వరూప
మెఱుఁగలేనిమూఢుఁ డింద్రియాతీతు న, వ్యక్తు నన్ను వ్యక్తునట్లు తలఁచు. 24

ఆ. ఓయిపార్థ! యోగమాయావృతుండనై, యేను గానిపింప నెల్లరకును
జననమరణ రహితు నను మూఢతామగ్న, మీజగం బెఱుంగ దించుకయును. 25

గీ. పుట్టి గిట్టినవానిని బుట్టియున్న, వాని నిఁకఁ బుట్టఁగలవాని నేను సకల
భూతముల నెఱుంగుదుఁ గాని నాతెఱంగు, నెఱుఁగఁజాలినవాఁ డొకఁడేని లేఁడు. 26

ఆ. జననవేళ సర్వజంతువులును సవ్య, సాచి! రాగవైరజనిత మైన
ద్వంద్వ మోహమున నితాంతమూఢత్వము, నంది సంసరణమునందుఁ జిక్కు. 27

ఆ. మంచిమంచిపనులు మరగి పుణ్యములు గ, డించి పాపభరము డించుకొన్న
వారు ద్వంద్వమోహదూరులై నాసేవఁ, జేయుచుంద్రు నియతశీలు రగుచు. 28

ఆ. ముదిమిపీడ చావుము ప్పడఁగింప న, న్నాశ్రయించి యెవ్వఁ డలయుచుండు
నతఁడు బ్రహ్మతత్త్వ మధ్యాత్మతత్త్వంబు, నెల్లపనులతెఱఁగు నెఱుఁగఁగలఁడు. 29

గీ. సాధిభూ తాధిదై వాధియజ్ఞుఁగా నె, వండు నన్ను నెఱుంగు, నవ్వాఁడు మేను
తలఁగునపుడును నియతచేతస్కుఁ డగుచు, నస్మదీయానుభూతిమై నలరుఁ బార్థ! 30

# 8. అక్షరపరబ్రహ్మయోగము

అర్జునుఁడు

ఆ. అజ్ఞ నన్నుఁ దేర్పుమా; బ్రహ్మ మెట్టి? ద, ధ్యాత్మ మనఁగఁ గర్మ మనఁగ నేమి?
బుధులు దేని దేని నధిభూత మని యధి, దైవ మని వచింత్రు? దేవదేవ! 1

క. మధుసూదన! యీతనువున, నధియజ్ఞుఁ డెవండు? నిన్ను యతమానసుఁ డె
వ్విధి నంతకాలమునఁ గను, నిది తెల్లగఁజేసి తేర్పవే ననుఁ గరుణన్. 2

అర్జునుఁడు

ఆ. పరమ మక్షరంబు బ్రహ్మ; మధ్యాత్మ మ, నంగఁ నెల్లతనువులం గలట్టి
ప్రత్యగాత్మ! భూతపటల జనుర్హేతు, వైనమఖము కర్మ మనఁగ జెల్లు. 3

ఆ. అడఁగునట్టివస్తు వధిభూత; మధిదైవ, మన హిరణ్యగర్భుఁ డతఁడె పురుషుఁ
డాతఁడే విరాట్టు; నధియజ్ఞుఁ డన యజ్ఞ, నిరతిమై నొడళ్ల నెగడు నేనె. 4

ఆ. ఎవఁడు మరణవేళనేని పార్థా! నన్నె, యెంచుచున్ శరీర మెడలిపోవు
నతఁడు నాస్వరూప మందుఁజుమా! యిందు, లేదు సంశయంబు లేశమేని. 5

గీ. మనుజుఁ డేరూపమును సదా మరగి తలఁచు, నతని కారూపమే తోఁచు నంత్యవేళ
దానిఁ జింతించుచు నతండు తనువు నూడ్చుఁ, గానఁ దద్రూపమే పొందఁగలఁడు పిదప. 6

ఆ. అగుట నెల్లయెడల నర్జునా! నీవు న, న్నే స్మరింపు! రిపుల నెదిరి చంపు!
నీ మనస్సు బుద్ధి నామీఁద నుంతువే, నందఁగలవు నన్ను నజు ననంతు. 7

ఆ. అన్యచింత లేక యభ్యాసయోగ వి, ధానమగ్నమైన మానసమునఁ
బరమపురుషు దివ్యు భావించునతఁడు త, త్పురుషుఁ జెందుఁ బాండుభూపతనయ! 8

గీ ఎవఁడు కవిని బురాతను సవితృవర్ణు, శిక్షకుని సర్వధాత నచింత్యరూపు
నణువుకంటెను గడుఁ జిన్నయైనవానిఁ, జిమ్మచీఁకటి కవల భాసిల్లు వాని. 9

గీ. మరణకాలాన సడలని మనసుతోడ, భక్తితో యోగబలముతోఁ బ్రాణమెల్ల
భ్రుకుటిమధ్యమునం జేర్చి పూని తలఁచు, నతఁడు పొందును దద్దివ్య నాదిపురుషు. 10

గీ. అక్షరం బని వేదజ్ఞు లనెడితావు, యతులు గతరాగులై చేరునట్టితావు
బ్రహ్మచర్యముతో నరుల్ పడయుతావు, నీకు నెఱిఁగింతు వినుము కుంతీకుమార! 11

గీ. ఇంద్రియద్వారముల మూసి హృదయమందు, మనసు నునిచి ప్రాణమ్మును మస్తకమునఁ
జేర్చి నిష్ఠావిధానమ్ము నేర్చి సుజన, విశ్రుతాచార! యోగము నాశ్రయించి. 12

గీ. బ్రహ్మ మేకాక్షరం బైన ప్రణవ ముగ్గ, డించుచున్ నను నాత్మఁ జింతించుచున్ శ
రీరమును బాయు నెవ్వఁ డప్పూరుషుండు, పరమగతి నందుచున్నాఁడు పాండుపుత్ర! 13

క. ఇతరాసంగము నొల్లక, బ్రతుకున దినదినము నన్ను భావించి సమా
హితచిత్తుఁ డైన యోగికి, నతిసులభుఁడ నేను భారతాన్వయతిలకా! 14

ఆ. పరమపదముఁ బడయుప్రాజ్ఞులు ఫల్గునా!, నన్నుఁ జేరి మఱల నశ్వరమ్ము
సకలదుఃఖములకు సదనమ్ము నగు జన్మ, మునకు రారు వారు ముక్తు లెపుడు. 15

గీ బ్రహ్మలోకమ్ముదనుక నోపాండుపుత్ర!, యెవ్వఁ డేలోకమునకుఁ దా నేగుఁగాక
వాఁడు మఱల జన్మమునకు వచ్చుఁ గాని, రాఁడు నన్నుఁ జేరినవాఁడు రాఁడు రాఁడు.

ఆ. ఎవరు వేయియుగము లవధిగాఁ గల పద్మ, భవునిపగటి నంతపాటిరేయి
నెఱిఁగినట్టివారౌ హితమతీ! కోవిద, మణులు వారె కాలమానవిదులు. 17

ఆ. ప్రకృతినుండి పార్థ! సకలభూతమ్ములు, ప్రభవమందు బ్రహ్మపగటివేళ;
రాత్రివేళ నద్దిరా! వ్యక్తు లెల్ల న, వ్యక్తమైన ప్రకృతియందు నణఁగు. 18

గీ. కర్మవశ మైన తద్భూతగణము మఱల, నస్వతంత్రమై పగలు రా నవతరించు,
నణఁగు నిది వెండి రేయి రా, నణఁగి పుట్టుఁ, బుట్టి యణఁగు జగం బన నిట్టి దోయి!

గీ. తత్ప్రకృతికంటె నన్య ముత్తమ మగోచ, రంబును సనాతనము నక్షరంబు నైన
వస్తు వని యెఱుంగుము పరబ్రహ్మ మనఁగ, నిది చెడదు ఫల్గునా! ప్రాణులెల్లఁ జెడిన. 20

గీ. ఎవఁడు కన్పింపఁ దని నశియింపఁ దనియుఁ, బల్కి రా నన్ను విజ్ఞులు పరమగతిఁగఁ
జెప్పెదరు; పునరావృత్తిచేటు లేని, పరమధామమ్ము నాది పావనచరిత్ర! 21

ఆ. ఎవనియందు నిలుచు నెల్లభూతమ్ము లీ, యుర్వినెల్ల నలమి యుండు నెవ్వఁ
డతఁడు పరమపురుషుఁ; డతని నచంచల, భక్తి నేర్వకున్నఁ బడయలేరు. 22

గీ. అన్న! యేమార్గమున నేగినట్టియోగు, లపునరావృత్తి సౌఖ్యము నందఁగలరొ
యేగతిం జన్నయోగు లావృత్తి నంది, యేద్తురో విను మా దారు లెఱుకపఱుతు. 23

గీ. కవ్వడీ! యగ్నియట్లు చుక్కలవిధానఁ, బగటివలె వెన్నెలంబలె మొగులులేని
యుత్తరాయనముంబోలె నొప్పు నెఱుక, బాటఁ జనువారు బ్రహ్మముఁ బడయఁగలరు. 24

గీ. పొగకు రేయికి నిరులకు నెగయుమబ్బు, గబ్బుగల దక్షిణాయనకాలమునకు
సాటినాఁ దగు నజ్ఞానసరణిఁ బోవు, వారు చంద్రుని గని వెండి వత్తు రిటకు. 25

ఆ. పార్థ! తెల్ల నల్ల బాట లీరెండును, శాశ్వతమ్ములగుచు జగతి నుందు
మొదటిబాట చేర్చు ముక్తికి, రెండవ, బాట జననమరణవాటి కీడ్చు. 26

క. ఈగతులు రెండు దెలిసిన, యోగి యెవండేని మోహ మొందఁడు నీవున్
బాగోగు లెఱిఁగి నిచ్చలు, యోగమ్మును బూని యెఱుక నొందుము పార్థా! 27

గీ. వేదములు జన్నములు తపోవిధులు దాన, కర్మము లొసంగుపుణ్యముకంటె యోగ
మొసఁగుసుకృతమ్ము దొడ్డది, యోగిదీన, నాద్య ముత్తమ మగు తావు నందు విజయ! 28

# 9. రాజవిద్యారాజగుహ్యయోగము

కృష్ణుఁడు

ఆ. నీ కసూయ లేమి నే మెచ్చి కలిత వి, జ్ఞాన మతిరహస్య మైన యెఱుక
యిది వచింతు; దీని నెఱిఁగితివా జన, నాదిపీడ లెడసి యలరఁగలవు. 1

గీ. ఎల్లవిద్యల కేలిక యిది మహార, హస్య ముత్తమము పవిత్ర మవ్యయమ్ము
సుఖము ప్రత్యక్షవేద్యము నిఖిలధర్మ, సమ్మతం బిది వింటివే సవ్యసాచి! 2

క. ఈ యాత్మజ్ఞానముదెస, కేయయ్యలు రారొ వార లిస్సీ! నన్నున్
దాయక మృత్యుఫలం బతి, హేయం బగు భవము నంది యేద్తురు పార్థా! 3

ఆ. ఈ విశాలజగతినెల్ల నవ్యక్తరూ, పమున నలమియున్నవాఁడ నేను
గలదు భూతకోటి కవ్వడీ! నాయందు, నేను లేను భూతనిచయమందు 4

గీ. లేవు నాయందు భూతముల్ నిక్క మరయ; నైనను భరింతు వాని; మదాత్మ భూత
తతిని దా నిలువదు గాని దానివిడని, కారణం బగు; నాపెంపు గనుము పార్థ! 5

ఆ. సకలజగమునందు సంచరించు మరుత్తు, నింగి నెట్లు సతము నిలిచియుండు
నట్లు భరతముఖ్య! యఖిలభూతములు నా, యందు నిలిచియుండు నని యెఱుంగు. 6

ఆ. ప్రళయవేళ నెల్లప్రాణులు మామక, ప్రకృతియందు నణఁగుఁ బార్థ! మఱల
సృష్టివేళ యగుడు నీభూతముల సృజి, యింతు నఖిలజగతి నింతు నేను. 7

గీ. ప్రకృతి కీభూతచయ మగ్గపడిన దగుటఁ, బెత్తనములేని దీనిని వెండి వెండి
యస్మదీయ మాయాతంత్ర మవధరించి, యేను బుట్టించుచుందు నోయీ కిరీటి! 8

గీ. ఇట నుదాసీనువలె నుండి యించుకేని, మమత లేక యీసృష్టికార్యము లొనర్తుఁ
గాన నన్ను బంధింప దీ కర్మచయము, లేదు బంధము సంగములేనినాఁడు. 9

క. సుగుణనిధీ! యధ్యక్షుఁడ, నగు నాచేఁ బ్రకృతి చరము నచరము నగు నీ
జగమున్ గనుచున్నది తత్, ప్రగతియు మత్కారణమునఁ బాటిల్లుఁ జుమా! 10

ఆ. నిఖిలభూతములను నియమించునది సాటి, లేని దైన మామకీనతత్త్వ
మెఱుఁగలేనిమూఢు లీమర్త్యదేహస్థు, నన్ను వెక్కిరింత్రు తెన్నుదప్పి. 11

గీ. వీరికోర్కులు చేఁతలు వీరితెలివి, రిత్తలు ధనంజయా! బుద్ధిమత్త లేని
వీరు మోహము నొదవించు దారుణాసు, రత్వముం దలఁదాల్తు రాఱడులఁ బడుచు. 12

గీ. దైవి యగునట్టి ప్రకృతి యాదరువుగా మ, హాత్ము లగువారు నన్ను భూతాళి కాది
కారణమ్ముఁగ నవ్యయుఁగా నెఱింగి, వేఱుతలఁపులు లేక సేవించుచుంద్రు. 13

గీ. నన్నుఁ గీర్తింత్రు వార లనారతముగ, జతన మొనరింత్రు నిశ్చలవ్రతముతోడ
మ్రొక్కెదరు నాకు భక్తిలో మునిఁగి కరఁగి, నిత్యయుక్తులై నాసేవ నెఱపుచుంద్రు. 14

గీ. కొంద ఱద్వైతబుద్ధి నన్ గొలుచుచుందు, రచ్ఛమగు జ్ఞానయజ్ఞమ్ము నాదరించి
ద్వైతభావమ్ముతోడఁ గొందఱు భజించి, ముదితు లౌదురు ఖండితమోహు లగుచు. 15

గీ. క్రతువు యజ్ఞము శుచియు మంత్రమును నేను, నేయి నే నౌషధంబును నేను బైతృ
కాన్నమును నేను హుతమునే నధ్వరంబు, సర్వమును నేను ఫల్గునా! చక్క వినుము. 16

ఆ. జగతి కేను బితను జననిని ధాతను, దాత నేను దెలియఁదగినవస్తు
వేను శుచిపదార్థ మేను వేదమ్ములు, మూఁడు నేను బ్రణవమూర్తి నేను. 17

ఆ. జగతి కేను గతిని సాక్షిని సామిని, హితుఁడఁ బోషకుండ నింటి నంద
నుదయమను గిరీటి! యునికిని మిత్తిని, నష్టిలేనిగింజ నిష్ఠనిధిని. 18

ఆ. ఎండ నేను వాన నేను వఱపు నేను, బ్రతుకు నేను మృత్యుహతియు నేను
మంచి నేను మిత్రమా! చెడ్డ నేను నేఁ, గాని దీ జగానఁ గానలేవు. 19

గీ. శ్రుతులు మూఁ డెఱింగి సోమపాన మొనర్చి, కలుష మూడ్చి జన్నములను నన్నుఁ
దనిపి దివికిఁ జేరుజను లందుఁ గుడుతురు, దేవభోగముల నతీవశౌర్య! 20

ఆ. నాకలోకసుఖము లందఁగా వెనువెంటఁ, దెచ్చు పుణ్యమెల్ల వెచ్చపడఁగ
మర్త్యగతికి వారు మఱలుదు రి ట్లుండుఁ, గామ్యకర్మరతులగతులు పార్థ! 21

ఆ. అన్యదైవతముల నర్థింప కెవరు న, న్నాశ్రయించి కొల్తు రచలనిష్ఠ
వలచి వలచి యేను వారియోగక్షేమ, భరమునెల్ల సైఁతుఁ బాండుతనయ! 22

ఆ. ఎవరు శ్రద్ధతోడ నేచినభక్తితో, నన్యదేవతలకు నర్చ లిడుదు
రన్న! వారుసైత మవిధిపూర్వకముగా, నన్నె పూజసేయుచున్నవారు. 23

ఆ. నిఖిలయజ్ఞములకు నేనె భోక్తను యజ, మానుఁడను గిరీటి! మన్మహత్త్వఁ
దెలియలేనివారు దివిఁజేరి దిగజాఱి, జననమరణపీడ మునుఁగుచుంద్రు. 24

గీ. సురలఁ జేరును సురలకు నెఱఁగువాఁడు, పితరులను జేరుఁ బితరుల వేఁడువాఁడు
భూతములఁ జేరు భూతాళిఁ బొగడువాఁడు, గుణనిధీ! నన్నుఁ జేరు నన్ గొలుచువాఁడు.

గీ. అర్జునా! భక్తిసంపన్నుఁ డస్మదర్థ, మొసఁగునది పత్రమో పుష్పమో ఫలంబొ
నీరమో యైన నగుఁగాక నేను దాని, నాదరింతు సుఖమ్ముగా నారగింతు. 26

గీ. నీవు కావించుకర్మము నీవు మెసవు, నన్నమును నీవు వేల్చుహవ్యమును నీవు
పంచునీవిని నీ వొనరించుతపము, నర్జునా! నాకు నర్పింపు మదియె పూజ 27

గీ. నెచ్చెలీ! ఫలసంన్యాసనిష్ఠ నిట్లు, తెలిసి నీవు శుభాశుభఫలము లొసఁగు
కర్మబంధములను ద్రెంపఁగలవు పిదప, యోగివర్యుఁడవై నన్ను నొందఁగలవు. 28

గీ. భూతములనెల్ల సమదృష్టిఁ జూతునేను, లేఁడు పగవాఁడు, చుట్టము లేఁడు నాకు
భక్తిమై నన్ను సేవించువాఁడు సతము, నిలుచు నాయందు, వానిలో నిలుతు నేను. 29

ఆ. కుజనుఁ డయ్యు నన్యభజన మొల్లక నన్నుఁ, గొలుచువాని సుజనువలె గణింతు
నతఁడు పరమసత్య మరసి కిరీటి! నా, ప్రాపు వదయ నార్తిపడెఁ గదోయి! 30

ఆ. నన్నుఁ గొలుచువాని కున్న దురాచార, నిరతి పెక్కునాళ్లు నిలువఁబోదు
సరగ నతఁడు ధర్మసరణికి వచ్చు న, శ్రాంతశాంతి వదయు నింత చెడఁడు. 31

గీ. పాపజని గలవారును బడఁతుకలును, వైశ్యులును శూద్రులును న న్నవార్యభక్తి
నాశ్రయించి జనుర్బాధ నతకరించి, పరమగతి నందుచున్నారు పాండుతనయ! 32

ఆ. ఇంక వచింపనేల సుకృతులు భక్తులౌ, పృధివిసురుల రాజఋషుల మాట
నన్ను! నీ వనిత్య మసుఖమౌ భువి నుంట, నను భజించి కను మనంతపదము. 33

గీ. మనసు నాయందు నిల్పుము మామకీన, భక్తుఁడవు గమ్ము మత్పూజఁ బాదుకొనుము
నాకు మ్రొక్కుము వేయేల నన్ను వలతు, వేని నాచెంతనే వసియింతు వీవు. 34

# 10. విభూతియోగము

కృష్ణుఁడు

ఆ. అస్మదీయవాణి కలరుచున్నట్టి నీ, హితము కోరి మఱల నిపుడు కొన్ని
మంచిమాట లాడ నెంచితి వీని నా, లింపుమయ్య! భయముఁ ద్రుంపుమయ్య! 1

గీ. ఎఱుఁగ రీదేవతలు కాన రీమహర్షు, లస్మదీయావతార పద్యారహస్య
మీసురల కీమహర్షుల కేను సకల, విధములన్ భరతర్షభా! మొదటివాఁడ. 2

ఆ. నన్ను నజునిగా ననాదిపూరుషుఁగా మ, హేశుఁగా నెఱుంగు నెవ్వఁ డతఁ డ
పాస్తమోహుఁడై సమస్తపాపమ్ముల, నెడయఁగలఁడు శాంతి పడయఁగలఁడు. 3

గీ. బుద్ధి యెఱుకయు మోహమ్ముపోవుటయును, సత్యము శమమ్ము దమమును సైరణయును
దుఃఖము సుఖమ్ము జనియు మృత్యువును భయము, నభయమును నావలననేకదా జనించు. 4

గీ. సమతయు నహింసయుఁ దపమ్ము సంతసమ్ము, యశము నపయశమును దాతృతాభిరతియు
భూతముల కేర్పడెడి భావపుంజమెల్ల, నర్జునా! నావలననేకదా జనించు. 5

గీ. ఎవరిసంతాన మీప్రజయెల్ల నట్టి, సప్తఋషులు, దేవర్షులౌ సనకముఖ్యు,
లలఘుచరితులు పదునల్గు రైనమనువు, లస్మదీయ మానసపుత్రు లని యెఱుంగు. 6

ఆ. ఎవ్వఁ డీ విభూతి నీ యోగమును మదీ, యమును లెస్సతెలియు నతఁ డకంప
యోగయుక్తుఁ డగుట రాగాదివైరుల, నోర్చుటయును నిక్క మోయిపార్థ! 7

క. జగదుత్పత్తికి విశ్వ, ప్రగతికి మూలంబ నేను; ప్రజ్ఞానిధు లీ
వగ దెలిసి తలఁపు నాపైఁ, దగులన్ ననుఁ గొల్చుచుంద్రు తత్త్వాభిరతిన్. 8

గీ. మనసు ప్రాణంబు నాకు నప్పనమొనర్చి, న న్నెతింగినపురుషు లున్నారు కొంద
ఱర్జునా! యట్టివార లన్యోన్యగురువు, లగుచు నను మెచ్చుచున్ దృప్తి నందుచుంద్రు. 9

ఆ. నన్ను విశ్వసించి నాసేవఁ జేయు ము, ముక్షువులకుఁ దత్త్వదీక్షితులకుఁ
దెలివి నిత్తు నన్నుఁ దెలిసికొనం దగు, బలిమినిత్తు నాదుచెలిమి నిత్తు. 10

ఆ. నన్నుఁ గొలుచువారి మన్నింతుఁ గరుణింతు, వారితలఁపునందుఁ జేరియుందు
నణఁచివైతు వారి యజ్ఞానతిమిరంబు, దీప్తిమయవివేక దీపశిఖల. 11

అర్జునుఁడు

క. పరమాత్మ పరమపురుషుఁడు, పరమపవిత్రుండు పరమపదుఁ డభవుం డ
క్షరుఁ డీశ్వరుండు దివ్యుఁడు, సురవితతిన్ మొదటివాఁడు సు మ్మని నిన్నున్- 12

ఆ. పలికి రెల్లఋషులు పలికెను దేవర్షి, యైననారదుండు నసితుఁ డట్లు
పలికె దేవలుండు పలికె వ్యాసుండును, బలికెఁ గృష్ణ! నీవుఁ బలికె దిట్లె. 13

ఆ. నాకు నీవు పల్కినదియెల్ల నిజ మని, విశ్వసింతు నేను విశ్వసింతు
ధృతగిరీంద్ర! యుష్మదీయస్వరూపమ్ము, గానలేరు దేవదానవులును. 14

ఆ. దేవదేవ! భూతభావన! భూతేశ!, పరమపురుష! విశ్వపతి! మహాత్మ!
నిన్ను నీవ యెఱుఁగనేర్తువు లాఁటివా, రెంతవారలైనఁ గొంతవారె 15

క. ఏ యే దివ్యవిభూతుల, నీయఖిలమునందు నలమి యీ వుందువొ నా
కా యా విభూతు లెఱుఁగం, జేయుము దయఁ జూడుమయ్య! శిష్యుని నన్నున్. 16

ఆ. ఎల్లవేళలందు నెవ్విధి నేను జిం, తింపవలయు నిన్నుఁ దెలిసికొనఁగ;
యుష్మదీయమూర్తు లోహృషీకేశ! యే, వేవి కలవు తెల్పు మెడఁద నిల్ప. 17

ఆ. విస్తరించి పలుకవే వెండియును భవ, ద్యోగమును విభూతి నుదితకరుణ
ననఘ! నీవచస్సు లమృతసమ్మితములై, యెన్నిమార్లు విన్నఁ దృప్తి నిడవు. 18

కృష్ణుఁడు

ఆ. కవ్వడీ! యలౌకికములౌ విభూతులు, నాకుఁ బెక్కు లుండె; నీకు నిందు
నెన్నఁదగినవానిఁ గొన్నింటిఁ దెల్పెద, నాలకింపవోయి! దీలుపడక. 19

గీ. అఖిలభూతమ్ములందలియాత్మ నేను, సకలభూతపరంపరాస్రష్ట నేను
సర్వభూతమ్ములకును బోషకుఁడ నేను, యెల్లభూతములకు హంత నేను బార్థ! 20

గీ. సుకృతి! యాదిత్యులందు విష్ణువును నేను, తేజములలో సహస్రదీధితిని నేను
వాయువులలో మరీచి నౌవాఁడ నేను, తారకలయందుఁ గుముదబాంధవుఁడ నేను. 21

గీ. శ్రుతులలో సామనామకశ్రుతిని నేను, సురసమాజములో శచీవరుఁడ నేను
ఇంద్రియావళిలో మన స్సేను బార్థ!, జంతువులలోని చైతన్యశక్తి నేను. 22

గీ. శంకరుండ నేను రుద్రసంచయమునందు, వసుపతిని నేను యక్షరాక్షసులయందు
వసువు లెనమంద్రయందుఁ బావకుండ నేను, గోత్రములయందు బంగారుకొండ నేను. 23

గీ. అర్జున! పురోహిత శ్రేణియందు నమర, తతికి నాచార్యుఁడగు బృహస్పతిని నేను
దండిమొనకాండ్రలో షణ్ముఖుండ నేను, సరసులందుఁ బయోధి నే నురుగుణాఢ్య! 24

గీ. అనఘ! భృగుఁడను నేను మహర్షులందు, వాక్ ప్రపంచమునం బ్రణవంబ నేను
యజ్ఞజాలమునన్ జపయజ్ఞ మేను, స్థావరమ్ములలో హిమాచలమ నేను. 25

గీ. క్షితిజసంతతిలో రావిచెట్టు నేను, నారదుండ నేను దేవర్షివారమునను
బ్రాజ్ఞ! గంధర్వతతిఁ జిత్రరథుండ నేను, గపిలముని నేను సిద్ధసంఘమ్మునందు. 26

గీ. తురగములయందు నమృతమ్ముతోఁ బయోధి, వలనఁ బుట్టిన యుచ్చైశ్రవంబ నేను
గజములం దమరేంద్రునిగజమ నేను, నరపతిని నేను సర్వమానవులయందు. 27

గీ. శస్త్రసంచయమందు వజ్రంబ నేను, గామధేనువ నేను గోగణమునందు
భవమునకు హేతువైన దర్పకుండ నేను, వాసుకిని నేను విజయ! సర్పములయందు. 28

గీ. స్తుతమతీ! నాగతతిని శేషుఁడను నేను, వరుణుఁడను నేను జలజంతువారమందు
నర్యముండ నేను బితృదేవతాళియందు, శమనుఁడను నేను శిక్షకసముదయమున. 29

గీ. అసురలందుఁ బ్రహ్లాదుండ నౌదు నేను, గాల మేను జ్యోతిషికనికాయమునకు
సకలమృగసమాజమునఁ గేసరిని నేను, గరుడుండను నేను విహగవర్గమ్మునందు. 30

గీ. వాయువును నేను శౌచకృద్వస్తుతతిని, రాముఁడను నేను శస్త్రభృద్రాజియందు
మకరమను నేను మత్స్యసమాజమునను, నదులయందు భాగీరథినదిని నేను. 31

గీ. ఈ మహాసృష్టులకు మొద లేను, నడుము, నేను, దుద నేను, విద్యలనెల్ల బ్రహ్మ
విద్య నేను దత్త్వ మెఱుంగ నుద్యమించి, పండితు లొనర్చువాద మోపార్థ! నేను. 32

గీ. అక్షరములం దకార మౌనతఁడ నేను, ఫల్గునా! సమాసముల ద్వంద్వమను నేను,
హానినందని కాలంబ నేను విశ్వ, తోముఖుండగు వాణినాథుఁడను నేను. 33

గీ. భువనముల నెల్లఁ జంపు మృత్యువును నేను, జచ్చి జన్మింపఁగలవారి జనువు నేను
సతుల కీర్తి సంపద వాణి స్మృతియు ధృతియుఁ, దాల్మియును మేధయును నేను దళితవైరి!31

గీ. సామశాఖలలో బృహత్సామ మేను, మిత్రమా! ఛందములను గాయత్రి నేను
మాసముల మార్గశీర్షాంకమాస మేను, ఋతువు లాతింటిలోఁ బుష్పఋతువు నేను. 32

గీ. వంచకశ్రేణి జూద మౌవాఁడ నేను, దేజమను నేను దేజస్విరాజియందు
గెలుపు నే నుద్యమము నేను గ్రీడి! సత్త్వ, వంతులై వెల్గువారి సత్త్వంబ నేను. 33

గీ. సుమతి! వార్ష్ణేయులందుఁ గృష్ణుఁడను నేను, బార్థుఁడను నేను బాండవప్రకరమునను
మునులయందు వేదవ్యాసమునిని నేను, గవిసమాజమునందు భార్గవుఁడ నేను. 34

గీ. జనుల దండించువారి దండనమ నేను, జయరతులపాలి నీతినై చనెద నేను
గుహ్యముల మౌనమై యెసంగుదును నేను, జ్ఞానవంతుల జ్ఞానంబ నేను విజయ! 35

గీ. ఎల్లభూతము లుదయింప హేతువైన, బీజమును నేను మాటలు పెక్కులేల
యీచరాచరవస్తులం దేది యైన, నేనె, నేఁ గాని దొక్కటియేని లేదు. 36

ఆ ధీనిధీ! మదీయ దివ్యవిభూతుల, కంతు లేమి నిక్క మగుటఁజేసి
సంగ్రహించి కొంత చాటితి నిప్పట్ల, భక్త నిన్నుఁ దృప్తిపఱుప నెంచి. 37

గీ. పలుపలుకు లేల వైభవ బల వికాస, విక్రమ శ్రీ సమృద్ధమై వెలయువస్తు
వేది కల దది నాతేజ మించుకంత, సోఁకి పుట్టిన దనియ యెంచుము కిరీటి! 38

ఆ. ఈవు మద్విభూతి నావంత కాదు కొం, దంత తెలిసికొన్న నందునర్థ
మేమి కలదు పార్థ! యేకాంశమున జగ, మెల్ల నలమి యుంటి నేను వింటె? 39

## 11. విశ్వరూపసందర్శనయోగము

అర్జునుఁడు

గీ. నన్నుఁ గరుణింపఁ దలఁచి కృష్ణా! మహోర, హస్య మధ్యాత్మనామక మైనవిద్య
నెఱుకచేసితి వదిర! నాహృదిని గలఁచు, మోహ మడఁగెఁ బ్రభూ! యూఁచముట్టుగాఁగ.

గీ. ఏను ధన్యుఁడ నీకృప నిపుడు లెస్స, వింటి నీప్రాణిసంతతి నంటియున్న
జననమరణార్తి; వింటి యుష్మన్మహత్త, వింటి నది యవ్యయం బని విశ్వజనక! 2

గీ. నీవు చెప్పినదంతయు నిక్క; మిందు, సంశయంపడఁ గాని నీచాటినట్టి
యుష్మదీయైశ్వరాకృతి నో ముకుంద; కనవలయు నన్న కాంక్ష కల్గినది నాకు. 3

గీ. ఓప్రభూ! భవదీయ స్వరూపవిభవ, మది కనుంగొనుటకు నన్ను నర్హుఁగాఁగఁ
దలఁతువేని యవ్యయమైన దానితెఱఁగు, నాకుఁ జూపవె వేచియున్నాఁడఁ గృష్ణ! 4

కృష్ణుఁడు

గీ పార్థ! నానావిధమ్ములు బహుళవర్ణ, రూపయుతములు దివ్యతారుచిరములు శ
తమ్ములు సహస్రములు మదీయమ్ములైన, యాకృతులఁ జూడు నీకోర్కి నాఁపఁజాల. 5

గీ. అన్న! యాదిత్యులను జూడు మాశ్వినుల మ, రుత్తులను వసువులను రుద్రులను జూడు
మెన్నఁడును మున్ను చూడనిదృశ్యములను, జూడు మత్యద్భుతమ్ముల నీడఁబోక. 6

గీ. అర్జునా! సచరాచరమైన జగము, గనుము, నామేన నొక్కభాగమున నిమిడి
యున్న దియ్యది; మఱియు నీయుల్లమేమి, చూడ నువ్విళ్లుగొను దానిఁ జూడు మిందు. 7

గీ. ఈవు నావిశ్వరూపమ్ము నెట్లు కనెదు, కవ్వడీ! ప్రాకృతంబగు కంటితోడ
నచ్చమగు దివ్యదృష్టి నీ కిచ్చుచుంటి, నిఁక విలోకింపవోయి! మామకమహత్త. 8

సంజయుఁడు

గీ. ఓమహీనాథ! హరి మహాయోగమూర్తి, యవ్విధం బల్కి పదపడి యైశ్వరంబు
పాపహర మగు తనవిశ్వరూపమెల్లఁ, దెల్లముగఁ గానిపించెఁ గుంతీసుతునకు. 9

గీ. హరి కిరీటికిఁ గాన్పించె నపుడు పెక్కు, ముఖము లీక్షణములు దివ్యభూషణములు
దివ్యశస్త్రంబులును గల్గి నవ్య నవ్య, విస్మయావహ మగు తనవిశ్వమూర్తి. 10

గీ. హరి కిరీటికిఁ గాన్పించె నపుడు దివ్య, మాలికా వస్త్ర గంధ సమంచితమ్ము
ధామమయ మనంతము విశ్వతోముఖమ్ము, విస్మయావహమగు తనవిశ్వమూర్తి. 11

ఆ. ఎంత కాంతి వొడము నేకకాలమున స, హస్రసూర్యు లభ్రమందు నెగయ
నంత కాంతితోడ నాదివ్యరూపమ్ము, మెఱయుచుండె నప్రమేయ మగుచు. 12

ఆ. నైకధా విభక్తమై కనిపించు జ, గమ్మునెల్లఁ గృష్ణుకాయమందు
నీక్షచేసె నప్పు డేకస్థముగ పావ, ణిల్లుదానిఁగా వినీతమౌళి. 13

ఆ. అంత నతఁడు మిగుల నబ్బురపడి మేనఁ, బులక లంకురింపఁ బురుషముఖ్యు
విశ్వరూపధరుని వినమితశిరముతో, నెఱఁగి దోయిలించి యిట్టు లనియె. 14

అర్జునుఁడు

గీ. వేల్పులను గంటి నీమేన వివిధజంతు, సంతతులఁ గంటి వారిజాసనుని గంటిఁ
గమలలోచన! ఋషులను గంటి దివ్య, ఫణులఁ గంటిని వాసుకిప్రముఖములను. 15

గీ. పెక్కుచేతులు బొజ్జలు ముక్కులును మొ, గాలుఁ గన్నులుఁ గలనిన్నుఁ గంటిఁ గాని
పాపభంజక మీవిశ్వరూపమునకు, నాదిమధ్యాంతములఁ గాననైతి దేవ! 16

గీ. గద కిరీటము చక్రము గల్గి సకల, దిశల నలమినకాంతితోఁ దేఱిచూడ
రానివాఁడవు దీప్తకృశానుభాను, భాయుతుఁడ వైనని న్నప్రమేయుఁ గంటి. 17

గీ. తత్త్వమవు నీవు తెలిసికోఁదగిన మేటి, వీవు జగతికి నాధార మీవు చెదని
వాఁడ వీవు ధర్మువుఁ గాచుప్రోడ వీవు, తండ్రి! నాదృష్టిలో సనాతనుఁడ వీవు. 18

గీ. ఆదిమధ్యాంతరహితు ననంతవీర్యు, నపరిమితబాహు నర్కచంద్రాక్షు నుజ్జ్వ
లాగ్నిముఖు నిన్నుఁ గంటి దేవా! త్వదీయ, తేజమున వేఁగుచున్నది యీజగమ్ము. 19

గీ. ఒక్కనీ వీ సమస్తరోదోంతరమున, దిక్కులన్నిట అంపిల్లితివి మహాత్మ!
విస్మయకరమ్ము భయద మీవిశ్వరూప, మునకు లోకత్రయమ్మును వణఁకు నకట! 20

ఆ. మహిభరమ్ము డింప మనుజులై యీరణ, క్షోణి నిల్చియున్న సురలనెల్ల
నిఖిలభువనమూర్తి నీయందుఁ జూచెద, వెఱచువారి నిన్ను వేఁడువారి. 21

ఆ. అబ్జనయన! రుద్రు లాదిత్యులు మరుత్తు, లసుర సిద్ధ సాధ్య యక్ష వసువు
లాశ్వినులును బితరు లాదిగా నెల్లరు, నిన్ను వెఱను జూచుచున్నవారు. 22

గీ. బహుముఖమ్ములు జరరముల్ పదము లుగ్ర, దంష్ట్ర లివి యేమి దేవకీతనయ! నీదు
పొడవు గని ప్రాణిలోకముల్ వడఁకుచుండె, నక్కటా! యేనుసైత మల్లాడుచుంటి. 23

గీ. నభము నంటుచు నైకవర్ణముల వివృత, వదనముల విశాలాక్షుల వఱలుచున్న
నిన్నుఁ గని తద్ద బెదరితి నెగులుకంటి, ధృతిని శాంతిని గనలేక తెరలుచుంటి. 24

గీ. దీర్ఘదంష్ట్రాకరాళముల్ తీవ్రకల్ప, వహ్నితుల్యము లైన నీవదనములను
జూచి దిగ్భ్రమ మందితి సుఖము లేశ, మందనైతిఁ బ్రసన్నుఁడ వగుము కృష్ణ! 25

గీ. రాజమండలితో ధార్తరాష్ట్రశతము, సమరనదినందనుఁడు కర్ణుఁ దస్త్రగురుఁడు
నస్మదీయవాహినులఁ బేరందినట్టి, నేత లందఱు మాధవా! నిన్నుఁగూర్చి. 26

గీ. పెద్ద తమకించువారలై భీతిజనక, దంష్ట్రలఁ జెలంగు నీదువక్త్రములయందుఁ
జేరుచున్నారు కోఱలఁ జిక్కి కొంద, ఱదలుచున్నారు నుగ్గునుగ్గైన తలల. 27

గీ. సకలతటినీప్రవాహముల్ సంద్రమునకు, నభిముఖమ్ములుగాఁ గొంద లడవు లతక
రించి పర్వెత్తుగతిఁ బ్రజ్వలించునీదు, నోటఁ జొత్తురు దేవ! యీమేటిమగలు. 28

ఆ. చావుకొఱకు మిడుత లేవిధి నెగమందు, నగ్గియందు దూఁకు నవ్విధాన
మరణమునకు నేఁడు మనుజులు సైత మీఁ, గెదరు యుష్మదుగ్రవదనములను. 29

ఆ. ఈవు నిప్పు లురలు నీవదనాళితో, నెల్లప్రజలు మ్రింగె, దెల్లదెసల
నాస్వదింతు కేశవా! చండమైన నీ, తేజమునఁ దపించు నీజగత్తు. 30

ఆ. నీకు మ్రొక్కువాఁడ నాకోర్కి మన్నించి, సుప్రసన్నమూర్తిఁ జూపుమయ్య!
యెవఁడ వీవు ఘోర మీరూప మేమి ని, న్నాద్యు నెఱుఁగ వలతు నంజలింతు. 31

కృష్ణుఁడు

గీ. బలమిమై లోకములనెల్లఁ బట్టికూల్చు, కాలమను నేను మనముందు కత్తి పట్టి
నిలువఁబడినట్టియోధుల నీవు చంప, కుండెదవుగాక పార్థ! వా రుంట కల్ల. 32

క. కావున లెమ్ము రణక్రియ, కావింపుము, రిపుల గెల్చి గరిమము రాజ్య
శ్రీ వాలింపు; నిమిత్తమ, యీ వగు! మే నణఁచినాఁడ నెపుడో వీరిన్. 33

ఆ. సవ్యసాచి! నేను జంపినద్రోణుని, భీష్ముఁ గర్ణు సింధువిషయపతిని
దక్కుమేటిమగల నుక్కడంపుము! భీతిఁ, దొలఁచి రణ మొనర్పు! గెలువఁగలవు. 34

సంజయుఁడు

గీ. ఫల్గునుఁడు కృష్ణుఁ డాడినపల్కు దీని, విని వణంకుచుఁ గేల్మోడ్చి వనజనాభు
నకు నమస్కృతి సల్పి యెంతయు భయమ్ము, గని వినమ్రుఁడై నుడివె గద్గదిక నిట్లు. 35

అర్జునుఁడు

గీ మేలు! మేలు! ప్రభూ! నిన్ను మెచ్చుకతన, మిగుల హర్షించు, ననురక్త మగును జగము;
దిగులు గని రాక్షసాళి నల్దెసకు నుఱుకు, నెఱుకమై సిద్ధతతులు నీ కెఱఁగి కరఁగు. 36

గీ. ఏల మ్రొక్కరు నీకు దేవేశ! నీవు, బ్రహ్మకును బీజమవు, నాశరహిత మగుచు
మేనికిని జీవునకును వేఱైన దగుచుఁ, దగు పరబ్రహ్మమవు ముకుందా! మహాత్మ! 37

గీ. ఆదిదేవుఁడ వీవు కృష్ణా! పురాణ, పూరుషుఁడ వాశ్రయుండ వీభువనములకు
వేద్యమవు వేత్త వపసర్గవీధి వఖిల, జగతి నలమిన యమర తేజంబ వదిర! 38

గీ. అనిలుఁడవు నీవు యముఁడ వీ వగ్ని వీవు, వరుణుఁడవు నీవు శశి వీవు వనజయోని
వీవు తజ్జనకుండవు నీవు నీకు, మ్రొక్కు లివె కొమ్ము వేనవేల్ మ్రొక్కు లివిగొ. 39

గీ నీవు సర్వస్వరూపుఁడ వీ వనంత, వీర్యుఁడ వపారవిక్రాంతి విలసితుఁడవు
దేవ! నీకు జోహారు వేదెస నొనర్తు? నెల్లదెసల సమర్పింప తృప్తిపడెద. 40

ఆ. ఏను నీప్రభావ మెఱుఁగక నీవు నా, చెలిమికాఁడ వనియు తలఁచి నిన్ను
యాదవా! సఖా! యటంచుఁ బుల్కఁగ నాడి, నట్టినుడులు సైఁపు మాదిదేవ! 41

గీ యును విహారశయ్యాసనభోజనముల, నింట రచ్చను ని న్నెటులెట్లు పరిహ
సించితినొ సైఁపు మాతప్పు లెంచఁబోకు, నేఁ దెఱింగితి మాధవా! నీమహత్త. 42

గీ. ఈచరాచరజగమున కీవు పితవు, పూజ్యుఁడవు మహాగురుఁడ; వీభువనములను
నీకు సరివాఁడె లేఁ, డిఁక నిన్ను మించు, వేల్పు కనిపించునా యెంత వెదకికొనిన?43

గీ. కాన సాగిలి మ్రొక్కి నీకరుణ వలతు, నీశ్వరా! తండ్రి కొమరునియెగ్గు, సఖుఁడు
సఖునిదోసము, చెలువుండు చానదొసఁగు, సైఁచినట్టులు నాతప్పు సైఁపవయ్య! 44

గీ. మున్ను చూడని యీ విశ్వమూర్తిఁ జూచి, తృప్తి నందితిఁ గాని భీతియును గంటిఁ
గానఁ దొల్లిటిరూపంబె కానిపించి, నన్ను సంతుష్టుఁ జేయు మాపన్నశరణ! 45

గీ. మణికిరీటము గద సుదర్శనము దాల్చి, నైకబాహువులను గాక నాల్గుహస్త
ములను ధరియించి యింతకుమున్ను మెఱసి, నట్టిరూపము చూపు నా కదియ వలయు.46

కృష్ణుఁడు

గీ. పార్థ! నీయందుఁ గరుణించి భవ్యదీప్తి, కలిత మింతకు ము న్నొరుకంటఁ బడని
దాద్య మీవిశ్వరూప మే నాత్మయోగ, శక్తిఁ జూపితి నీకు నక్షరము పరము. 47

గీ. ఈజగమ్మున నీరూప మీవుతక్క, నెవరు వీక్షించి! రిది వేద సవన దాన
భీషణతపమ్ములన్ గనిపించురూపు, గాదురా! భక్తిచేతనే కానిపించు. 48

గీ. భయదమైన యీవిశ్వరూపమును జూచి, బాధపడ నేల శాంతి గోల్పడఁగనేల
ఫల్గునా! చిత్తమును జక్కఁబఱచుకొనుము, కను మిదే పూర్వరూపంబు కనుము మఱల.49

సంజయుఁడు

ఆ. అని వచించి కృష్ణుఁ డర్జునకుఁ జతు, ర్భుజ కిరీట చక్రమూర్తిఁ జూపి
వెండి సౌమ్యమూర్తి వెదలించి గుండియ, జాఱియున్న యతని నూఱడించె. 50

అర్జునుఁడు

ఆ. అద్దిరా! ప్రసన్నమై మానుషంబైన, రూపు దీనిఁ జూడఁ దాప మడఁగె
మనసు కుదుటఁబడియె జనులలోఁ గలసితి, నంజలింతు నీకు నాదిపురుష! 51

కృష్ణుఁడు

ఆ. నీవు నేఁడు కన్న నావిశ్వరూప మం,తంతమాత్రఁ గనుట కలవిగాని;
దిది కనంగ నిచ్చ లిచ్చమై నర్జునా!, సురలు సైత మెదురుసూచుచుంద్రు. 52

ఆ. నీవు నేఁడు కన్న నావిశ్వరూపంబు, శ్రుతులకతనఁ దపముకతన నీవి
కతన నధ్వరమ్ముకతనఁ జూచెద మని, బడలువారు వెఱ్ఱివారు పార్థ! 53

ఆ. ఫల్గునా! యనన్యభక్తి చేతనె విశ్వ, రూపు నన్ను జను లెఱుంగఁగలరు
కానఁగలరు పొందఁగల రిది యేకైక, సాధనంబు మత్ ప్రసాదమునకు. 54

గీ. ఎవఁడు మత్ప్రీతికై చేయు నెల్లపనుల; నెవఁడు నను మేలిప్రాపుగా నెంచు నిరత;
మెవఁడు భజియించు, నిస్సంగుఁ డెవఁడు సర్వ, భూతహితుఁ డెవ్వఁ డతఁడె నాపొందు పడయు.

## 12. భక్తియోగము

అర్జునుఁడు

గీ. ఇట్లు సతతంబు నీరూపు నెడఁద నిల్పి, నినుఁ దలంచుభక్తులు గాక నిరత మక్ష
రంబు నవ్యక్తముఁ దలంచుప్రాజ్ఞు లుందు, రిం దెవరు యోగిసత్తము లిందిరేశ. 1

కృష్ణుఁడు

గీ. మనసు నాయందు నిల్పి యేమఱనినిష్ఠ, నంచితశ్రద్ధ న న్నుపాసించువారు
యోగిసత్తము లని పల్కు టొప్పు నిందు, సంశయము లేదు మానితాచారనిరత! 2

ఆ నెచ్చెలీ! ధ్రువం బనిర్వచనీయ మ, వ్యక్త మెల్లదెసల నలముకొన్న
యది యచింత్య మచల మావంత వికృతి లే, నట్టి దై వెలుంగు నక్షరమును- 3

ఆ. ఎవ్వ రింద్రియముల క్రొవ్వెల్ల నణఁగించి, చక్క నన్నియెడల సమతఁ జూపి
యఖిలభూతబంధులై యుపాసింతురో, వారు నన్నె పొందువారు పార్థ! 4

గీ. నిర్గుణబ్రహ్మమున మది నిల్పువారి, కధికతరకష్ట మొదవు; నవ్యక్తమార్గ
మది శరీరాభిమానుల కలఁతి యలఁతి, యిదుమలన్ గనిపింప దోయీ! కిరీటి! 5

ఆ. ఎవరు నన్ను నమ్మి యెల్లకర్మముల నా, పా లొనర్చి సగుణభక్తి నేర్చి
యితరచింత లెవియు నెఱుఁగనియోగానఁ, దలఁచుచుంద్రొ నన్నుఁ గొలుచుచుంద్రొ-6

గీ. అనఘ! నాయందు మది నిల్పు నట్టివారి, జననమరణాది వేదనాజనక మైన
సంసరణవార్ధి బ్రుంగి వేసారువారి, నొడ్డునకుఁ జేర్తు నే నింతజడ్డు లేక. 7

క. నాయందె మనసు నిల్పుము, నాయందే నిల్పు మర్జునా! బుద్ధిని; నీ
వీ యోగ మెఱిఁగినంతట, నాయందె వసింపఁగలవు నమ్ముము దీనిన్. 8

క. ఓపార్థ! నీదుచిత్తము, నాపై లగ్నము నొనర్పనైపుణి నీకున్
జేపడదేని కలంగక, యాపన్నతఁ బడక నేర్వు మభ్యాసవిధిన్. 9

గీ. అర్జునా! నీకు నభ్యాస మరిదియైన, నాచరింపుము నాకొఱ కన్నిపనుల
నాకొఱకు నీవు పనుల నొనర్చినను వ, శంపదును సిద్ధి నీకు నిస్సంశయముగ. 10

గీ. ఈవు మద్యోగమును బూని యిదియుఁ జేయ, జంకెదవయేని మనసును జక్క నోర్చి
సర్వకర్మఫలత్యాగసరణియందుఁ, బయన మొనరింపు! పాండుభూపాలతనయ! 11

గీ. జ్ఞాన మభ్యాసయోగమ్ముకంటె మేలు, జ్ఞానమునకంటె ధ్యానమార్గమ్ము లెస్స
ధ్యానమునకంటెఁ గృతఫలత్యాగ ముఱవు, త్యాగమున సంసరణదుఃఖతతి యడంగు. 12

ఆ. అఖిలభూతములకు నవిరోధి మిత్రుఁడు, కారుణికుఁడు మమతఁ గడచినతఁడు
పొగరులేనివాఁడు దిగులును హాయిని, సమతఁ జూచువాఁడు సైఁచువాడు- 13

గీ. ఉడుగనిముదంబు గలవాఁడు యోగయుతుఁడు, నియతచిత్తుఁడు సుస్థిరనిశ్చయుండు
మనసు బుద్ధియు నాపట్ల నునుచువాఁడు, నాదుభక్తుఁడు వాఁడెపో నాకుఁ బ్రియుఁడు.

ఆ. ఎవనివలన వెఱవ రీప్రజ, లెవ్వఁ డీ, ప్రజలవలన డిల్లపడక యుండు
నెవఁడు హర్షమునకు నీర్ష్యకు భీతికి, నెడసి యుండు నస్మదిష్టుఁ డతఁడు. 15

గీ కోరికలు వీడి శౌచమ్ము గూర్చుకొని స, మర్థుఁడు తటస్థుఁడై దిగుల్ మాని కామ్య
కర్మముల వీడి యెవ్వండు క్రాలు నతఁడు, నాదుభక్తుఁడు వాఁడెపో! నాకుఁ బ్రియుఁడు. 16

గీ. పొంగఁ డెవ్వఁడు వైరంబు పూనఁ డెవఁడు, కుందఁ డెవ్వఁడు ఫలములు కోరఁ డెవఁడు
మంచిచెడ్డల నెవ్వండు మరగఁ డతఁడు, నాదుభక్తుఁడు వాఁడెపో! నాకుఁ బ్రియుఁడు

గీ. ఎవఁడు నిస్సంగుఁడో హితాహితుల నెండ, వానలను గష్టసుఖముల మాననిప్ర
కారముల నెవ్వఁ డొకరీతిఁ గనునొ యతఁడు, నాదుభక్తుఁడు వాఁడెపో! నాకుఁ బ్రియుఁడు.

గీ. ఎతఁడు నిందాస్తుతుల నొక్కగతిఁ దలంచు, మౌనియౌ దన కబ్బినదానఁ దనియుఁ
దిరముగా నెందు నిలఁడు, బుద్ధిని గుదుర్చు, నతఁడు నాభక్తుఁ డతఁడె నా కగుఁ బ్రియుఁడు.

గీ. నను శరణ్యునిగా నెంచి నా వచించి, నట్లు ధర్మానపేత మీయమృతయోగ
మర్థి నెవ్వ రుపాసింతు రట్టిభక్తు, లీడితపరాక్రమా! నాకు నిష్టతములు. 20

# 13. క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగము

కృష్ణుఁడు

గీ. తెలియుమా! జడమైన యీదేహమునకు, క్షేత్ర మనుపేరు చెల్లు; నీ క్షేత్రతత్త్వ
మది సమగ్రముగాఁ గనినట్టివాని, కలరు నర్జునా! క్షేత్రజ్ఞుఁ డనెడుపేరు. 1

గీ. సవ్యసాచి! సర్వక్షేత్ర సంచయమున, నిలుచు క్షేత్రజ్ఞుఁగా నన్ను నీవు కనుము
క్షేత్రమును గూర్చి క్షేత్రజ్ఞుచేవఁ గూర్చి, తెలిసికొనుట, జ్ఞానం బని తలఁతు నేను. 2

గీ. కృతమతీ! క్షేత్ర మన నెద్ది? యేవికార, ముండు దానికి? నది దేనినుండి జనన
మందె? క్షేత్రజ్ఞుఁ డన నెవ్వఁ? డతనిమహిమ, మెట్టి? దిది విను మెఱిఁగింతు నిపుడు తేల్చి.

గీ. పలుతెఱంగుల వేదప్రపంచమందు, నిది మహర్షులచే నిర్ణయింపఁబడియె
నర్జునా! బ్రహ్మసూత్రములందు సైత, మిది సకారణముగ నిశ్చయింపఁబడియె. 4

గీ. దళితదుర్మోహ! పంచభూతము లహంత, ధిషణయును మాయయును రెండుతెగల నుండు
నింద్రియములు మనస్సు జ్ఞానేంద్రియముల, పాలి దైనట్టి శబ్దాదిపంచకమును- 5

గీ. కోర్కియున్ బగయు సుఖమ్ము కుందు గాత్ర, తత్త్వసంధాతృశక్తి చేతనయు ధృతియుఁ
గలసి భరతర్షభా! సవికారమైన, క్షేత్రమగు నం చెఱుంగు మూర్జితమనీష! 6

ఆ. తన్ను మెచ్చుకొనమి దంభ మీకొనమి య, హింస యోర్మి ఋజుత యింద్రియముల
గెలుపు గురుసపర్య మలినతలేమి ని, శ్చలత జ్ఞాన మనఁగఁ జనుఁ గిరీటి! 7

ఆ. విషయవాంఛలెల్ల విడుచుట, వినయమ్ము, జన్మమునను మృతిని జరను రోగ
మున విషాదమునను బెనఁగొన్నచేటు క, న్గొనుట జ్ఞాన మనఁగఁ జనుఁ గిరీటి! 8

గీ. తగుల మొల్లమి తనయ కాంతా గృహాదు, లాసపడమియు, నిష్టార్థ మబ్బునెడ న
నిష్టఫల మంటుతఱి భిన్నదృష్టి లేక, నిలిచియుంటయు నెఱుక నా నలరుఁ బార్థ! 9

ఆ. ఇతరదైవచింత యెఱుఁగక నిష్కంప, భక్తి నన్నుఁ 'గొలువఁ బట్టుగొనుట,
పామర ప్రజాళిఁ బాయుట, విజనోర్వి, నుంట జ్ఞాన మనఁగ నొప్పుఁ బార్థ. 10

గీ. అనయ మధ్యాత్మ మగుతెల్వి నలరుచుంట, తత్త్వ మెఱుఁగుట నొదవునర్థమును గనుట
యర్జునా! జ్ఞాన మనఁ జెల్లు నన్యమెల్లఁ, బరఁగు నజ్ఞాన మనుపేరఁ బలుకరింప. 11

ఆ. ఎది యెఱుంగఁదగిన దెది యెఱింగినవాఁడు, ముక్తి వడయు దాని ముచ్చటింతుఁ
బార్థ! మొదలులేనిబ్రహ్మంబు సదసద్వి, లక్షణంబు జ్ఞేయ మక్షయంబు. 12

గీ. దీని కీలోకమం దెల్లదెసలఁ గాళ్లు, చేతు లుండును గన్నులు శిరము లుండు
మొగములున్ జెవు లుండును జగము సర్వ, మావరించినవస్తు వియ్యది కిరీటి! 13

గీ. ఇంద్రియగుణమ్ము లన్నింటి నిది వెలార్చుఁ, గాని యింద్రియములు లేవు దీని; కిది య
సక్తమగుఁ గాని సకలమ్ము సైంచు; నిద్ది, నిర్గుణము కాని గుణభోక్తనెతి నెసంగు. 14

ఆ. వినుము భూతములకు వెలుపల లోపల, నిది వసించు నచర మిది చరంబు,
కదు నలంతి యగుటఁ గనరాని దియ్యది, దూర మయ్యు సరసఁ దోఁచు నిద్ది. 15

గీ. ఫల్గునా! యవిభక్తమౌ బ్రహ్మ మిది వి, భక్తముంబలె నిల్చును బ్రాణితతిని
భూతముల నిది పోషించుఁ బొలియఁజేయు, మఱలఁ బుట్టించు నెఱుఁగు మీతెఱఁగునెల్ల.

గీ. జ్యోతులకు జ్యోతి యిది తమస్సునకు నవల, నెసఁగు నిది జ్ఞాన మిది జ్ఞేయ మిది సమస్త
భూతహృన్మండలమ్మునఁ బొలుచు నిది మ, హామతీ! జ్ఞానగమ్య మైనట్టిది యిది. 17

గీ. ఏమి ఫల్గునా! క్షేత్రంబు నెఱుక నెఱుఁగఁ, దగినదాని సమాసపద్ధతిని నీకు
బల్కితిని దీనిఁ దెలిసి మద్భక్తుఁ డస్మ, దీయరూపము నంది శాంతిని గడించు. 18

గీ. ప్రకృతియుం బురుషుండును బార్థ! మొదలు, లేనివా రని గుర్తించి మానసాదు
లకు జనించువికారములను గుణాలఁ, బ్రకృతిభవములుగా నొదంబడుము విజయ! 19

ఆ. కార్యకారణములఁ గలుగఁజేయుటయందు, హేతువుఁగ నెఱుంగు మీవు ప్రకృతి
నన్ను! సుఖము దుఃఖ మనుభవించుటయందు, హేతువుఁగ నెఱుంగు మీవు పురుషు. 20

గీ. ప్రకృతియం దుండి పురుషుండు ప్రకృతివలన, నవతరిలు సుఖదుఃఖాదు లనుభవించు;
ననుభవం బిది పురుషున కగ్రనీచ, జన్మముల నంద హేతువై చనుఁ గిరీటి! 21

గీ. తనువు తానుగ నుండియుఁ దత్పురుషుఁడు, తనువుకంటెను వేఱుగాఁ దనరు, నతఁడు
సాక్షి సమ్మతిదాత నియంత భర్త, భోక్త పరమాత్మగా నుండు బుధవిధేయ! 22

క పురుషున్ ద్రిగుణాత్మకమై, పరఁగుప్రకృతి ని ట్లెఱుంగువాఁ డున్నతి కే
వెర వూని యున్న దానన్, జరితార్థత నంది మఱల జన్మింపఁ డిలన్. 23

గీ. కొంద ఱాత్మను శుద్ధమౌ డెందముననుు, ధ్యానమూని కాంతురు తమయందు, గొంద
ఱర్జునా! జ్ఞానమునఁ జూతు; రఫలకర్మ, యోగమునఁ గొంద ఱీక్ష సేయుదురు పురుషు. 24

క. మతికొందఱు ధ్యానాదుల, తెఱఁ గెఱుఁగక ప్రాజ్ఞమణులు తెలుపన్ విని తత్
పరమాత్మను గొల్తురు శ్రుతి, పరాయణులు వారలును భవం బాద్దు రయా! 25

క. స్థావరమో జంగమమో, యీవసుమతిఁ దోఁచువస్తు వెది యైనను గాం
డీవి! యది ప్రకృతిపురుష స, మావేశముకతనఁ బుట్టు నని నమ్ముఁగదే! 26

ఆ. ఈశ్వరుండు జగతి నెల్లభూతములందుఁ, గలఁడు భూతకోటి పొలియువేళ
నతఁడు పొలియఁ డమరుఁ డతఁ డన్నసత్యము, గన్నవాఁడె కన్ను లున్నవాఁడు. 27

గీ. భూతములనెల్ల సమముగాఁ బొలుచు నీశుఁ, జూడనేర్చిన శేముషీశోభితుండు
గుణనిధీ! విను! తన్నుఁ దా నణఁచుకొనఁడు, చేరు నతఁ డూర్ధ్వగతికి నిక్కారణమున. 28

గీ. సర్వకర్మముల్ ప్రకృతియ సలుపుఁ గాని, యాత్మ కావింప దని యర్జునా! యెవండు
తెలియు నాతఁడె నిక్కముం దెలిసినతఁడు - చూచునాతఁడె నిజమును జూచినతఁడు.

క. నానావిధభూతము లొక, దానం గల వనియు దానఁ దద్భూతము ల
న్నా! నెఱయు ననియు నెవ్వఁడు, కానంగలఁ డతఁడు పొందుఁగద బ్రహ్మంబున్. 30

గీ. అర్జునా! యాదిలేనివాఁ డగుటఁ ద్రిగుణ, రహితుఁ డగుట నెన్నఁడు వికారములు లేక
యలరుఁ బరమాత్మ; దేహస్థుఁ డయ్యు నెదియు, నతఁడు సలుపఁడు కర్మఫలాప్తి గనఁడు.

గీ. సర్వగత మయ్యు నభ మతిస్వల్ప మగుట, వస్తుగుణ దోషముల నంటఁబడనియట్లు
నిఖిలదేహములం దాత్మ నిలుచుఁ గాని, యంటఁబడదు తత్సుఖవేదనాదికముల. 32

ఆ. ఇంతవిశ్వమునకు నినుఁ డొకఁడే వెల్గు, నిచ్చుపగిది దేహి యీసమస్త
దేహములకు నొసఁగు దీధితి ఫల్గునా!, యతని తేజమునకు నవధి కలదె? 33

ఆ. క్షేత్రమునకు క్షేత్రికిని గలభేదంబు, ప్రాణి ప్రకృతిపొత్తుఁ బాయుతెఱఁగు
నెవరు జ్ఞానదృష్టి నెఱుఁగుదు రిమ్మాడ్కి, వారు ముక్తి నందువారు పార్థ! 34

## 14. గుణత్రయవిభాగయోగము

గీ మునులు సంసారబంధవిముక్తి నంద, హేతువై జ్ఞానసంతతినెల్ల నగ్ర
గణ్యమై పరమై నుతిగన్నయెఱుక, నర్జునా! వెండియు వచింతు నవధరింపు. 1

గీ భవ్య మీజ్ఞానమును లెస్స పడసి మత్స, మానధర్మము నందినమనుజు లాది
సృష్టితతి నైనఁ బుట్టరు; చేటుగనరు, ప్రళయకాలమునం దైనఁ బాండుతనయ! 2

గీ. ధీనిధీ! త్రిగుణాత్మకమైన ప్రకృతి, యోనిగా నాకుఁ గలదు తద్యోనియందు
గర్భ ముంచెద నేను దద్గర్భమున జ, నించుచున్నది భూతప్రపంచమెల్ల. 3

గీ. సర్వయోనులయందును సంభవించు, తనువు లన్నిటి కర్జునా! తల్లి ప్రకృతి;
యేను దన్మూర్తులందు మే లెంచి యెంచి, విత్తనము చల్లుతండ్రి నోవీరమౌళి! 4

గీ. మూర్తులే కాక ప్రకృతికి ముద్దు గూర్చు, సత్త్వము రజస్సు తమము నాఁ జనెడిబిడ్డ;
లర్జునా! నిర్వికారుఁడై యలరుజీవు, నవి నిబంధించుచుండు దేహమునయందు. 5

గీ. అందు సత్త్వము స్వచ్ఛమై యమితదీప్తి, మెఱయు నిరుపద్రవమ్ముగాఁ బరఁగు నిది సు
ఖానుర క్తి జ్ఞానాసక్తి యవతరిల్లఁ, జేసి బంధించుచున్నది జీవు ననఘ! 6

క. రాగాత్మకము రజ స్సది, భోగాదులమీఁదివలపు పుట్టించుఁ దద
ర్థాగతికి దేహి యది యిది, సాగించుచుఁ జిక్కుఁ గర్మజంబాలమునన్. 7

క. విను మజ్ఞానజము తమో, గుణ; మిది మోహమ్ము గఱపి కుంచును దేహిన్
గునుకుటయు నేమఱిల్లుట, యును మూల్గుటయును గిరీటి! యొదవును దీనన్. 8

ఆ. సుఖమునందుఁ జేర్చుఁ జుమి సత్త్వ మాత్మను, గర్మగతికి నంపుఁ గద రజస్సు,
తమము తెలివినెల్ల దాఁచి ప్రమాదంపు, దెసకు నీడ్చు, నసుర దీనిఁ గొలుచు. 9

గీ. సత్త్వము రజస్సుఁ దమమును జదిపి వెలయు, సత్త్వముఁ దమస్సు నణఁచి రాజసము కుల్కు
సత్త్వమును రజస్సును ద్రొక్కి సాగుఁదమము, సత్త్వసంపాదనము ప్రశస్తము కిరీటి! 10

ఆ. ఈశరీరమందు నెల్లవాకిళ్లఁ బ్ర, కాశరూప మైన జ్ఞాన మెపుడు
వెల్లివిరియు నపుడు పెరిఁగె సత్త్వం బని, తెలిసికొనఁగదోయి కలితధర్మ! 11

గీ. అర్జున! రజోగుణము హెచ్చినపుడు లోభ, మొదవుఁ గార్యప్రవృత్తియు నొదవుఁ గర్మ
ములకు నొగ్గుట యొదవుఁ జెన్కలఁత యొదవు, నొదవు విషయాభిలాషము నుత్కటముగ. 12

ఆ. విను! తమోగుణమ్ము విరిసిననాఁడు వి, వేక మడఁగు నప్రవృత్తి పొదము
ముసురుకొనుఁ బరాకు మోహమ్ము వాటిల్లు, నవల ముప్పులెల్ల నావహిల్లు. 13

ఆ. పార్థ! సత్త్వగుణము బలిసిననాఁడు దే, హమ్ము నూడ్చుజీవుఁ డందు నెఱుక-
పొలుపు లెస్స యున్నపుణ్యు లుందు పవిత్ర, లోకములను విగతశోకములను. 14

ఆ. ఫల్గునా! రజస్సు పైకొన్నకాలానఁ, జచ్చునతఁడు కర్మసంగులందుఁ
బుట్టుఁ దమము పొంగిపొరలుచో మరణించు, నతఁడు మూఢయోనులందు నొదవు. 15

గీ. కంటివే! సాత్త్వికంబగు కర్మమునకు, ఫలము నిర్మలసౌఖ్యమై పరఁగు రాజ
సం బయినపని కార్తి ఫలము తామ, సక్రియకు నజ్ఞత ఫలమ్ము సాధుచరిత. 16

గీ. సత్త్వమున జ్ఞాన మొదవు, రజస్సువలనఁ, బుట్టు లోభము, తమముచే మోహమును బ్ర
మాదమును నజ్ఞతయుఁ గల్గు, మనుజుఁ దజ్ఞుఁ, డైననాఁ డింది నందును గానివాఁడె.

గీ. ఊర్ధ్వలోకమ్ములకు సత్త్వయుతులు చనెద, రుండెదరు రాజసులు మానవోర్వియందు
నింద్యవృత్తులు తామసుల్ నీచనీచ, గతులు నరకాదులకు నేగి వెతలు గంద్రు. 18

గీ. అనఘ! గుణములకంటె నన్యము నెవండు, కర్తఁగాఁ గనఁడొ, గుణాలకంటెఁ దన్ను
నన్యుఁగాఁ జూచునో ద్రష్ట యతఁడు మత్స్వ, రూపమును బొందు నిహతవిరోధివర్గ! 19

ఆ. దేహకారణములఁ ద్రిగుణమ్ముల నతిక్ర, మించి దేహి జన్మమృత్యుబాధ
లుత్తరించి శాంతియుక్తుఁడై నిర్వాణ, పదమునందు నిలుచుఁ బాండుతనయ! 20

అర్జునుఁడు

ఆ. నందనందనా! గుణత్రయాతీతుఁడై, యెసఁగువానిచిన్నె లెట్టు లుండు
నతనినడత లెట్టి వతఁడు గుణమ్ముల, నెట్లు దాఁటు నానతిమ్ము నాకు. 21

కృష్ణుఁడు

ఆ. త్రిగుణభవములైన తెలివియు లోభంబు, నజ్ఞతయు ఘటిల్లినపుడు కినియ
కెడలినపుడు కోర కెవఁ డుండునో గుణా, తీతుఁ డతఁడు విక్రమాతిరమ్య! 22

ఆ. గుణము లెంతపెనఁగినను జలింపక వాని, పనుల నవి యొనర్చుకొను నటంచుఁ
దలఁచి యెవ్వఁ డుండుఁ దాటస్థ్యమున గుణా, తీతుఁడతఁడు విక్రమాతిరమ్య! 23

ఆ. తిట్టు మెచ్చుపల్కు, మట్టి బంగార, ము, నిష్ట మిష్ట, మార్తి హృష్టిపట్ల
నేకరీతి నెవ్వఁ డీకొనునో గుణా, తీతుఁ దతఁడు విక్రమాతిరమ్య! 24

ఆ. మిత్రు శత్రు నొక్కమెయిఁ గని మానావ, మానయుగళి నొక్కమైఁ దలంచి
యెల్లపనులు వదలి యెవఁ డుండునో గుణా, తీతుఁ దతఁడు విక్రమాతిరమ్య! 25

గీ. పార్థ! యవ్యభిచారమౌ భక్తియోగ, మూని యెవ్వఁడు ననుఁ గొల్చునో యతండు
త్రిగుణముల నవలీల నతిక్రమించి, యందుకొనఁ జాలు బ్రహ్మత్వ మనఘచరిత! 26

ఆ. అమృత మవ్యయంబు నగు పరమాత్మకు, దలఁ కొకింత లేని ధర్మ్మునకు
నియతమై తనర్చు నిర్వృతి కాధార, మే నటం చెఱుంగు మానతారి! 27

# 15. పురుషోత్తమప్రాప్తియోగము

కృష్ణుఁడు

గీ. పార్థ! సంసార మనెడు నశ్వత్థమునకు, వేదములు వర్ణములు, దీనివేళ్లు మీఁది
కుండుఁ, గొమ్మలు క్రిందికి నుండుఁ, జెదని, వృక్ష మిది, దీనిఁ గనువాఁడె వేదవిదుఁడు.

గీ. గుణములఁ దనర్చి విషయంబు లనుచిగుళ్ల, దీనికొమ్మలు సాగెఁ గ్రిందికిని మీఁది;
కర్జునా! బంధహేతువులైన పూర్వ, వాసనలు దీని కూడలై వసుధ నూడె. 2

గీ. దీనిరూపము తుద మొదల్ దీనియునికి, కానలే రోయి సంసరణానురక్త
లనఘ! సువిరూఢమూల మైనట్టిదీని, దృఢవిరాగశస్త్రంబునఁ ద్రెంచివైచి. 3

గీ. ఎవనికతన ననాదియౌ వృక్ష మిది యె, సంగె నయ్యాదిపురుషుని శరణుసొచ్చి
మానవుఁడు పునరావృత్తి లేనిచోటు, వెదకవలయుఁ జుమీ! శాంతి విడియుచోటు. 4

క. నిర్మానులు నిస్సంగులు, నిర్మోహులు తత్త్వయోగనిష్ఠులు సుఖదుః
ఖోర్ముల నొకరీతిం గను, నోర్మి గలా రందుకొందు రుత్తమపదమున్. 5

గీ. పరమపద మది రవిసుధాకిరణవహ్ను, లచటికి వెలుంగు నీయలే, రందుఁ జొచ్చు
వారు మఱలరు జన్మాదిభారములకు, నదియ నా మేలితావు శూరాగ్రగణ్య! 6

ఆ. అన్న! మత్సనాతనాంశమె సంసర, ణమున జీవుఁడై తనర్చి ప్రకృతి
నంటియున్న యింద్రియములను మనసును, దివుచు విషయచయముదెసకుఁ బార్థ! 7

గీ. ప్రభువు జీవుఁడు తనువును బాసి తనువుఁ, దాల్చుతఱి గాలి కుసుమగంధమ్ముతోడ
నరుగుచందాన జ్ఞానేంద్రియములతోడ, మనసుతోడఁ జనుం గ్రొత్తతనువుదెసకు. 8

ఆ. జీవుఁ డితఁడు కన్ను చెవి ముక్కు నాలుక, యొదలు మానసంబు నూఁది విషయ
భోక్త యగును గాని పొత్తు లే దితని కిం, ద్రియవికారముల కతీవదీప్తి! 9

ఆ. మేను విడిచి యొండుమేనికిఁ బయనించు, నపుడు మేన నుండునపుడు వెతను
వేద్కఁ గుడుచునపుడు వీని మూర్ఖులు కాన, లేరు కానఁగలరు ధీరమణులు. 10

ఆ. ఉద్యమించి యోగు లో పార్థ! తమయందు, వెలయుజీవుఁ జూడఁగలరు గాని
చూడలేరు చిత్తశుద్ధి నందనివార, లెంత కడఁగి యిదుమ లెన్ని పడిన. 11

ఆ. ఉర్వికెల్లఁ గాంతి నొసఁగునాదిత్యుని, వెలుఁగు నాది చంద్రువెలుఁగు నాది
వినుము! వీతిహోత్రువెలుఁగు నాది కిరీటి!, కాక వీరిపసకుఁ గత మిఁ కేది? 12

గీ. దైవసంపద ముక్తిపదంబుఁ జూపు, నసురసంపద సంసృతి నంటఁగట్టుఁ
గృతమతీ! బెగ్గడిల్లకు మీవు దైవ, సంపదను బుట్టితివి సదాచారఖనివి. 5

గీ. జనులు కొందఱు దైవాంశమున జనింతు, రాసురాంశమునన్ గొంద ఱవతరింత్రు
తెలిపితిని మున్ను మొదటివారలతెఱంగు, నిపుడు రెండవవారితీ రెల్ల వినుతు. 6

గీ. రాక్షసాంశజులందు ధర్మప్రవృత్తి, లే దధర్మనివృత్తియు లేదు శౌచ
నిరతి లేదు సదాచారనియతి లేదు, సత్యసంసక్తియును లేదు సవ్యసాచి! 7

గీ. ఈజగ మసత్య మిద్దాని కీశ్వరుండు, లేఁడు లేఁడు ప్రతిష్ఠయు లేదు మగువ
మగఁడు కూడిన నిది పుట్టు మరులె దీని, వి త్తని వచింతు రసురసంపత్తివారు. 8

గీ. నాస్తికత నిట్లు మరగి నష్టాత్ము లల్ప, బుద్ధులై దైత్యసంపదఁ బుట్టువారు
మహికి హింసాదిఘోరకర్మము లొనర్చి, వైరులై చేటు దెచ్చుచున్నారు పార్థ! 9

గీ. దంభమానమదమ్ములఁ దగిలి తగిలి, సీమ నెఱుఁగనితృష్ణలోఁ జిక్కి జిక్కి
యజ్ఞులై వీరు దుర్విధు లాశ్రయించి, నీచదేవతల భజింత్రు నిధులకొఱకు. 10

ఆ. బ్రదికినన్ని నాళ్లు వదలని యెనలేని, విషయచింత నుంద్రు వెఱ్ఱి ముదుర
నకట! కామసుఖము నతకరించెదు పర, మార్థ మేమి కల దటంద్రు వీరు. 11

గీ. అర్జునా! వీరి బంధించు నాస లెపుడు, వలపు నల్కను వీ రిసీ! వదలలేరు;
తమసుఖమ్ముల కేతప్పుదారి నైనఁ, బరులసిరి గుంజఁ జూతు రీపాపమతులు. 12

గీ. ఈకలిమి నేము కూర్చితి మింతనేల, కధిపతుల మేము మా మనోరథములెల్లఁ
దీఱు నని పొంగుచుందు రీతీరువారు, కామదాసులు వీరు నిక్కము కిరీటి! 13

గీ. ఏను జంపితి నీవైరి నితరశత్రు, తతి నడంచెద నే సమర్థత గలాఁడ
నేను భోగిని బలశాలి నేను బలఁగ, మున్నదొర నంచు నీజాతిదున్న నిక్కు. 14

గీ. కలిమి గలవాఁడ సద్వంశగరిమవాఁడ, నెదురు నా కెవ్వఁ డేను జేసెద మఖమ్ము
నేను దాతను హర్షింతు నే నటంచుఁ, బార్థ! యీతెగవాఁడు దర్పము వెలార్చు. 15

గీ. పలుతెఱుంగులఁ దనమది కలఁగి యుంట, నెట్టుకొని మోహములు తన్నుఁ జుట్టుకొంట
విషయసంసక్తి తన కతివేల మగుట, నీతఁ డిటు ప్రేలి దుర్గతి కేగుఁ బార్థ! 16

ఆ. ఇతఁడు తన్నుఁ దాన నుతిచేసికొను మాన్యు, మందలించు విత్తమదముఁ జూపు
మచ్చరించి నామమాత్రయజ్ఞములకు, మొదలుపెట్టు దంభమునఁ గిరీటి! 17

ఆ. గర్వపాటవములఁ గామరోషంబుల, నాశ్రయించి యాతఁ డాత్మదేహ
పరశరీరములను భాసిల్లు నాయందు, నలుకగొను నసూయ కగ్గపడుచు. 18

గీ. క్రూరుఁడు నరాధముఁడు శుభదూరుఁ డస్మ, దహితుఁ డగు వీని సంసృతి కంటఁగట్టి
యసురయోనులఁ బుట్టింతు ననవరతము, జననమరణాదివేదనల్ సందడింప. 19

క. ప్రతిజన్మమునందు నధో, గతికిం జను వీఁడు నన్నుఁ గనలేఁ డెపుడున్
మతిహీనులబ్రతు కిట్టిది, దితిజాంశజు లైనవారితెఱఁ గిట్టి దయా! 20

క. కామము రోషము లోభము, నా మూఁడుపథమ్ము లుండె నరకమ్మునకున్
ధీమంతుఁడు వీనికి ద, వ్వై మనవలె; నాత్మనణఁచు నరు లివి పార్థా! 21

గీ. అర్జునా! విను మెవ్వఁ డీ యవగుణత్ర, యమ్మునకు దవ్వుగా నుండు నాతఁ డాత్మ
హితము లగు కర్మములు పూని యెలమికెల్ల, నెల్ల యగు ముక్తి నంది రాజిల్లఁగలఁడు. 22

గీ. ఎవఁడు శాస్త్రీయవిధి వీడి యిచ్చవచ్చి, నట్లు వర్తించు ఫల్గునా! యతఁడు సిద్ధి
నొందఁజాలఁడు సుఖములు పొందఁ జాలఁ, దందఁజాలఁడు పరమపదానుభూతి. 23

ఆ. కాన శాస్త్రమునకు గౌరవ మిడి సదా, మంచిచెడ్డపనుల నెంచుకొమ్ము
శాస్త్రవిహితకర్మచణుఁడవై మెలఁగుము, తగుము దైవసంపదలు వరింప. 24

## 17. శ్రద్ధాత్రయవిభాగయోగము

అర్జునుఁడు

ఆ. శాస్త్రవిధిని వీడి శ్రద్ధాసమేతులై, పూజనాదికములు పూనువారి
యునికి సాత్త్వికంబొ యొండె రాజసమొ యొం, డేని తామసంబొ శ్రీనివాస! 1

కృష్ణుఁడు

ఆ. జనుల పూర్వజన్మసంస్కారమునఁ బుట్టి, సాత్త్వికంబు రాజసంబనంగఁ
దామసంబు నాఁగఁ దగు శ్రద్ధ త్రివిధమై, తేటపఱుతు వినుము దీనిఁ బార్థ! 2

గీ. అర్జునా! యెల్లరకును సత్త్వానురూప, మైనశ్రద్ధ జనించు; నయ్యదియె పురుషు
నంటియుండు; నతండు త న్నంటుకొన్న, హేళికిన్ దగు మన్నద నాసచేయు. 3

గీ. సాత్త్వికులు దేవతాపూజ సలుపుచుంద్రు, రాజసులు కొల్చుచుందురు రాక్షసులను
దామసులు ప్రేతములకు భూతముల కర్చ, నెఱపుచుందురు సంభావనీయచరిత! 4

గీ. ఎవరు దంభ మహంకార మెనసి కామ, రాగములఁ బెంచిపెంచి శాస్త్రమును ద్రోసి
తనకు నొరులకు నుగ్రబాధలు ఘటించు, తపముగావింతురో ధీరతానిశాంత! 5

గీ. ఆ వివేకప్రభాశూన్యు లక్కటకట!, మేనియింద్రియములకు లోమేన వెలయు
నాకు నంగద గూర్చుచున్నారు వారి, నిర్ణయం బాసురము జగన్నిందితంబు. 6

గీ. కృతమతీ! యెల్లరకు రుచియించునట్టి, తిండియును ముత్తెఱంగుగా నుండు మఱియు
వారియజ్ఞము వారితపంబు వారి, దానమున్ ద్రివిధమ్ముగాఁ దనరుచుండు. 7

గీ. ఆయురారోగ్యములకు దేహంబునకును, బుద్ధికి సుఖంబునకు నభివృద్ధి నిడుచు
రసమూ చమురు పుష్టియుఁ గల్గి పొసఁగుతిండి, కిష్టపడుదురు సాత్త్వికుల్ శిష్టచరిత!8

ఆ. కార ముప్పు పులుసు మీఱి పెన్వేఁడిమి, చుఱుకు కఱకు గల్గి శోకరోగ
జనకమైన తిండి కనురక్తు లౌదురు, రాజసులు ధనుర్ధరప్రకాండ! 9

గీ. ఆఱినది క్రుళ్లినది రుచి యడఁగినదియు, గబ్బు గలదియుఁ బూజకుఁ గానియదియు
నెంగిలిదియు నౌతిండికి నిచ్చగింతు, రస్త్రవిన్మణీ! తామసు లైనవారు. 10

ఆ. శాస్త్రవిహితమైన జన్నము కర్తవ్య, మని ఫలమ్మునందు నాసలేని
యనఘు లాచరించుయజ్ఞము సాత్త్వికం, బనఁగ నొప్పు నిర్జితారివీర! 11

క. ఫలవాంఛతోడ నైనను, 'నలుగురు కొండాడ వలయు న' న్నని యైనన్
గులుకుచు నుబ్బుచు మనుజుఁడు, సలిపెడిసవనంబు రాజసం బనఁ బరఁగున్. 12

ఆ. శ్రద్ధ లేని శాస్త్రసమ్మతి లేని మం, త్రములు లేని కట్టనములు లేని
కొనకు నన్నదానమును లేనియజ్ఞంబు, చనుఁ గిరీటి! తామసం బనంగ. 13

గీ. వేల్పులన్ ద్విజగురుల సేవించుటయును, శౌచదీక్షయు నార్జవాసక్తతయును
బ్రహ్మచర్యవ్రతంబును బ్రాణిహింస, మానుటయుఁ బార్థ! దైహికమైన తపము. 14

గీ. పెఱలమానసమును బాధపెట్టనిదియు, సరసమును సత్యమును శుభంకరమునైన
పలుకు పల్కుట వేదముల్ పాడుటయును, బార్థ! వాఙ్మయ మైన తపమ్ము సుమ్ము. 15

గీ. అనఘమై సుప్రసన్నమై యలరునెదయు, మృదుతయును మౌనముద్రయు మదిని గెల్వ
నోపుటయు వంచనాదుల నొల్లమియును, మానసంబైన తపముసుమా! కిరీటి! 16

గీ. పార్థ! యెనలేనిశ్రద్ధతోఁ బరమయోగు, లఫలసంగులు కావించునట్టి మూఁడు
తెగలతపమును దీని సాత్త్వికతపం బ, టంచు వినుతురు తత్త్వజ్ఞు లైనవారు. 17

ఆ. ఒరులు సత్కరింత్రు గరువ మిచ్చెదరు పూ, జింతు రనుచు డాబు చెలఁగఁ జేయు
తపము చల మసంతతం బయి రాజసా, ఖ్యఁ దనరు వీరముఖ్యవినుత! 18

ఆ. మొండిపట్టుతోడఁ దిండిలే కెండుచు, నరుఁడు తనదుపెంపుకొఱకుఁ గాని
యొరుని మట్టుపెట్టుకొఱకుఁ గాని యొనర్చు, తపము తామసంబు దళితవిమత! 19

గీ. దాన ముత్తమధర్మ మన్తలఁపుతోడఁ, దగినచోటఁ దగినవేళఁ దగినవాని
కెదురుమే ల్సేయఁజాలని కృపణునకు నొ, సంగుదానము సాత్త్వికసంజ్ఞఁ దనరు. 20

ఆ. ఫలము కోరియొండెఁ బ్రత్యుపకారమ్ము, వలచి యొండె బాధపడుచు నొండె
నొసఁగునట్టిదాన మొప్పును రాజస, దాన మనఁగ సమరతంత్రనిపుణ! 21

ఆ. తగనిదేశమందుఁ దగనికాలమ్మునఁ, దగనివాని కనుచితక్రమాన
విసరి పాఱవేయు విడుపు తామసదాన, మనఁగఁ జెల్లు నోయి! వినయమూర్తి! 22

ఆ. ఒనరు బ్రహ్మమునకు నో మ్మని తత్తని, స త్తటంచు మూఁడుసంజ్ఞ లనఘ
వీనివలన బ్రహ్మవేత్తలు వేదము, లధ్వరములు వెలసె నని యెఱుంగు. 23

ఆ. వేదవిదులు శాస్త్రవిహితమ్ముగా సల్పు, యజ్ఞదానతపము లనవరతము
నడుచుచుండుఁ బాండునందన! యోంకార, మనినవెనుక నుసుఱు కనినవెనుక. 24

గీ. అర్జునా! ముముక్షువులు త త్తని వచించి, ఫలమునం దాస నిల్పక బహువిధాధ్వ
రములు తపములు దానధర్మములు సల్పి, యపునరావృత్తిసౌఖ్యము నందుచుంద్రు. 25

క. 'కల' దనుటకు 'మే' లనుటకుఁ, బలుకంబడు 'సత్' పదంబు ప్రాజ్ఞులచేతన్
బలవద్వ్రతంస! మఱియుం, బలుకంబడు నెన్నఁదగినపనికిన్ జగతిన్. 26

ఆ. యజ్ఞమునఁ దపస్సునందు దానమ్మునఁ, గుదురుకొనెడి నిష్ఠకూడ సత్తె
భగవదాదరమ్ము పడయంగ నొనరించు, కర్మ మైన సత్తె కనుము పార్థ! 27

ఆ. శ్రద్ధ లేక చేయుజన్నము దానంబు, తపము లాఁతిచేఁత తనరుఁ బాండు
నందనా! యసత్తు నా; నివి శ్రేయంబు, నిహపరమ్ములందు నీయలేవు. 28

## 18. మోక్షసంన్యాసయోగము

అర్జునుఁడు

ఆ. వేఱుపఱిచి పల్కవే ప్రభూ! సంన్యాస, తత్త్వ మెల్లఁ ద్యాగతత్త్వ మెల్ల
వేయిమార్లు వీని వింటిని గాని సం, శయ మడంగదాయె మధువిరోధి! 1

కృష్ణుఁడు

గీ. అలకింపుము కామ్యకర్మాళి నెల్ల, వదలివేయుట సంన్యాస; మెద నొకింత
ఫలము గోరక కర్మముల్ సలుపుచుంట, త్యాగ మనఁ జెల్లు నోయి! పృధాకుమార! 2

గీ. కర్మములు దోషమయములు కాన వాని, విడువనౌ నని కొందఱు నుడువుచుండ్రు
దానము తపమ్ము యజనమ్ము మానరాని, పను లనుచుఁ గొంద అర్జునా! పలుకుచుంద్రు.

గీ. పాండునందన! త్యాగమ్ముపట్ల నాదు, నిర్ణయంబును వినుము నే నీకు మున్ను
పలికినట్టి శ్రద్ధాదులపగిది నిదియుఁ, ద్రివిధ మని యెఱుంగుము శుభప్రవణచిత్త! 4

ఆ. ఏను మెత్తు యజ్ఞ దాన తపమ్ముల, నెదయరాని చేఁత లివి కిరీటి!
నిష్ఠతోడ వీని నెఱపువానికిఁ జిత్త, శుద్ధి హెచ్చు జ్ఞానసిద్ధి వచ్చు. 5

క. తగులమ్మును ఫలవాంఛను, దిగఁద్రావి యహంత మాని దృఢమతిఁ జేయం
దగు నీ యజ్ఞాదుల నని, తెగువన్ వచియింతు నేను ధీమత్తిలకా! 6

ఆ. విహితకర్మములను విడువరా దవి బంధ, కారణములు కావు కావు పార్థ!
మోహ మెగసి వీని ముడుఁచుట తామస, త్యాగ మంద్రు ధర్మతత్త్వవిదులు 7

ఆ. మెయి నలంచు ననుచు భయదుఃఖకారణ, మనుచు నెవఁడు కర్మమును ద్యజించు
నతఁడు మోక్షమున కనర్హుఁడు రాజస, త్యాగ మతని చాగ మో గుణాఢ్య! 8

ఆ. నియతకర్మములను నిందింపక ఫలాను, రక్తి లేక సంగసక్తి లేక
యెవఁ డొనర్చు వానియీవికి సాత్త్విక, త్యాగ మన్నపేరు తగుఁ గిరీటి! 9

ఆ. సత్త్వసంయుతుండు సదసద్వివేకంబు, గన్నవాఁడు శంక చన్నవాఁడు
త్యాగధనుఁడు చెడ్డదగుపని కల్గఁడు, మంచి దైనపనికి మరులుకొనఁడు. 10

గీ. ఊఁచముట్టుగఁ గర్మంబు లుజ్జగింప, నలవి కాదు సుమా! దేహి; కతఁడు ఫలము
దెస ననాదరుఁడై కర్మదీక్ష నుండుఁ, గాక కుంతీసుతా! త్యాగిగా సుఖించు. 11

గీ. దుఃఖకరము సుఖకరమ్ము దుఃఖసుఖక, రమ్ముగా నుండు కర్మఫలమ్ము తన్ను
వదలఁ జాలనివారి నవ్వలి భవాన, నంటు; నంటదు వదలినయట్టివారి. 12

ఆ. మనుజుఁ డాచరించుపని సిద్ధి నందఁగాఁ, గారణమ్ము లైదు కల వటంచుఁ
బలికె సాంఖ్యశాస్త్ర మలఘుమతీ! వీనిఁ, దెలిసికొమ్ము చక్కఁ దేటపఱుతు. 13

గీ. ఆశ్రయం బనఁగాఁ గర్త యనఁగ నింద్రి, యాళి యన భిన్నభిన్నచేష్టావలి యన
దైవ మనఁగ నీయైదును దనరుఁ; బూర్వ, జననసంస్కారమే దైవ మని యెఱుంగు. 14

గీ. తనువుతోడను వాక్కుతో మనసుతోడ, మంచిదో చెడ్డదో నిర్వహించుకర్మ
మెద్ది యైనను దానికి నివియె కార, ణము లని యెఱుంగుమా! కదనప్రవీణ! 15

ఆ. నిక్క మిట్టు లుండ నేర్వనివాఁ డెవ్వఁ, డేనె కర్త ననుచు నెగసిపడునొ
యతఁడు కర్మతత్త్వ మరయఁ జాలని యవి, వేకి సుమ్ము నిర్వ్యళీకహృదయ! 16

ఆ. ఏను గర్త ననెడియెగ పెవ్వనికి లేదొ, యెవనిబుద్ధి ఫలము నియ్యకొనదొ
వాఁడు ప్రజలఁ బట్టి బాధించినను దోషి, కాఁడు కలుష మతనికడకుఁ బోదు. 17

గీ. జ్ఞానమును జ్ఞేయమును బరిజ్ఞాతయును ధ, నంజయా! కర్మములనెల్ల నడుపుచుండుఁ
గరణకర్మముల్ కర్త నాఁ గర్మసంగ్ర, హంబు మూఁడువిధంబుల నలరుఁ బార్థ! 18

గీ. వినుము! సాంఖ్యము గుణముల ననుసరించి, జ్ఞానకర్మముల్ కర్తయు మాననీయ
చరిత! మూఁడుతెఱంగులఁ బరఁగు ననియె, వీని వివరింతు నర్థిమై వినఁగ దోయి! 19

క. స్థావరములు జంగమములు, గా వేర్వేఱైన భూతగణముల నవిభ
క్తావికృతబ్రహ్మముఁ గను, ధీ విజయా! సాత్త్వికాఖ్యఁ దేర్చును బుధులన్. 20

క. నానావిధరూపమ్ముల, గానంబడు జగమునందుఁ గల పరమాత్మన్
నానావిధాకృతులు గల, దానినిగాఁ దెలుపుతెలివి తగు రాజసమై. 21

క. ఈతనువే! యీశిలయే!, యీతరువే! జీవుఁడైన నీశ్వరుఁడైనన్;
లోఁతు లిఁక లేవు లే వను, ధీ తామసనామకం బతీవప్రజ్ఞా! 22

గీ. మానితాచార! ఫలతృష్ణ లేనివాఁడు, సంగరహితముగా శాస్త్రసమ్మతముగఁ
గామవైరములకు దవ్వుగా నొనర్చు, కర్మ మది సాత్త్వికంబు నా గణుతికెక్కు. 23

ఆ. ఏను గర్త నన్నయెగపుతోఁ గాని ఫ, లానురక్తితోడఁ గాని నరుఁడు
కష్టసాధ్య మైనకర్మ మెయ్యది సేయు, నది కిరీటి! రాజసాఖ్య నలరు. 24

ఆ. ముందు దాపరించుముప్పు గానక హింస, గనక శక్తియుక్తి గనక మొఱకుఁ
దనముతో నరుండు పొనరించుకర్మంబు, తనరుఁ దామసాభిధాన మగుచు. 25

గీ. సంగము నహంకృతిని వీడి సాటిలేని, ధైర్య మూని యుత్సాహము దాల్చి జయము
నపజయము నొక్కమైఁ జూచునట్టికర్త, కవ్వడీ! చెల్లు సాత్త్వికకర్త యనఁగ. 26

గీ. రాగ మూని కర్మఫలానురక్తి నూని, పిసిడితన మూని హింసాప్రవృత్తి నూని
యశుచి హర్షశోకాన్వితుఁ డైనకర్త, కవ్వడీ! చెల్లు రాజసకర్త యనఁగ. 27

గీ. మదిని గెల్వనివాఁడు పామరుఁడు శఠుఁడు, వినయదూరుఁడు పరులపెం పణఁచువాఁడు
సోమరి విషాదియును దీర్ఘసూత్రి యైన, కర్త తామసకర్త నాఁగను జెలంగు. 28

గీ. అర్జునా! విను గుణముల ననుసరించి, బుద్ధి మూఁడుతెఱంగుల బొదలుచుండు
ధృతియుఁ ద్రివిధమ్ముగా నుండు నిపుడు వీని, విస్తరించి వచించెద వినఁగదయ్య! 29

గీ. కర్మమార్గము ముక్తిమార్గమును బంధ, మోక్షములఁ గార్యము నకార్యమును భయంబు
నభయమును లెస్సగాఁ గనునట్టిబుద్ధి, పార్థ! సాత్త్వికబుద్ధి నాఁ బరఁగు నోయి! 30

గీ. ధర్మము నధర్మమును జేయఁదగినదానిఁ, దగనిదానిఁ బ్రమాదానఁ దగిలి తగిలి
నిక్కమున కెడదవ్వుగా నిర్ణయించు, బుద్ధి రాజసబుద్ధి యౌ నిద్ధచరిత. 31

గీ. గాఢముగ నవివేకమ్ము క్రమ్మియుంట, ధర్మము నధర్మ మని సుకృతమును దుష్కృ
తం బని సమస్తమును విరుద్ధముగఁ జూచు, బుద్ధి తామసబుద్ధి యౌ రుద్ధవైరి! 32

గీ. ఏ చలింపనిధృతిచేత నిద్ధయోగ, బలము నార్జించుకొని మనఃప్రాణములయు
నింద్రియములయు నడతలనెల్ల నరుఁడు, చక్క నిలుపు నాధృతి యొప్పు సాత్త్వికాఖ్య. 33

ఆ. విను! ఫలానురక్తి విడువనినరుఁడు ధ, ర్మార్థకామములకు నతులకాంక్ష
నేధృతిన్ వహించి కృషి సల్పు నాధృతి, రాజసాఖ్యఁ దనరు రథికమౌళి! 34

గీ. తులువ యేధృతిచేత నిద్దురను భయము, నేడ్పును విషాదమును గిరీటీ! మదంబు
నుజ్జగింపఁడొ యాధృతి యొప్పుఁ దామ, సాభిదానమునన్ బ్రాజ్ఞు లపహసింప. 35

ఆ. ఏసుఖమ్ము నంది యాలోక ముల్లాస, పడుచునుండు దిగులు విడుచునుండు
నాసుఖంబుసైత మర్జునా! త్రివిధమై, యుండు వినుము దాని నుగ్గడింతు. 36

గీ. బుద్ధినైర్మల్యమునఁ బుట్టి మొట్టమొదట, విషమువలె బాధపెట్టి యావెనుక నమృత
కల్పమై హాయి నిచ్చుసుఖంబు పొందు, నందనా! సాత్త్వికసుఖంబు నాఁ దనర్చు. 37

గీ. ఏసుఖం బర్జునా! విషయేంద్రియముల, పొత్తునంజేసి సుధవోలె మొదటఁ దోఁచి
పిదపఁ గాకోలముంబలె బెడఁద గూర్చు, నాసుఖంబునకున్ రాజసాఖ్య చెల్లు. 38

గీ. మఱపునను నిద్రచేత సోమరితనమ్ము, వలన నుదయించి యాద్యంతములను నరున
కజ్ఞత ఘటించు నేసుఖ మాసుఖంబు, తామససుఖంబు నాఁబడు దళితవైరి! 39

ఆ. పార్థ! ప్రకృతినుండి ప్రభవించినట్టి స, త్త్వము రజస్సు తమము తగులకుండ
నర జగానఁ గాని సురలోకమునఁ గాని, యొక్కవస్తు వైన నుండ దోయి! 40

ఆ. వారివారి ప్రకృతివలన జనించు గు, ణాల ననుసరించి నాల్గుతెగల
మనుజులకును వీరమాన్య! వేర్వేఱుగాఁ, బనులు వింగడింపఁబడియె నోయి! 41

ఆ. శమము దమము తపము శౌచమ్ము తాల్మియు, నార్జవంబు జ్ఞాన మనుభవంబు
వేదశాస్త్రములను విశ్వసించుట స్వభా, వమునఁ బుట్టుపనులు బ్రాహ్మణునకు. 42

గీ. శూరతయును దేజమ్మును ధీరతయును, దక్షతయు రణస్థిరతయు దాతృతయును
శాసకత్వంబును స్వభావజనిత కర్మ, చయముగా నుండు నర్జునా! క్షత్రియునకు. 43

గీ. వైశ్యునకుఁ గృషి గోరక్ష వర్తకంబు, శూద్రునకు నార్తసేవయు శుచిమతీ! స్వ
భావజము లైన కర్మము; లీవు వీని, మర్మము నెఱింగి కనుము నీధర్మ మెదియొ. 44

గీ. అర్జునా! మనుజుండు తా నాచరింపఁ, దగినపనియందు నిచ్చలు తగుల మూని
యందుచున్నాఁడు సంసిద్ధి; నత్తెఱంగు, చక్క వివరింతు వినుము సంశయము లడఁగ.

ఆ ఎవనివలనఁ బుట్టు నీ భూతసముదాయ, మెవఁడు నిండి యుండు నెల్లజగతి
నతని నీశుఁ దనకు ననుకూల మగు ధర్మ, మున భజించి నరుఁడు ముక్తి వడయు.46

ఆ. బాగుగా నొనర్చు పరధర్మమునకంటె, విగుణమయ్యు లెస్స యగు స్వధర్మ;
మనఘ! తనకు నేర్పడినకర్మము నొనర్చు, నరుని దాఁక దెట్టి దురితమేని. 47

గీ. సహజ మైనట్టికర్మ మోసవ్యసాచి, దోషయుత మైన నద్దానిఁ ద్రోయు టొప్పు;
దగ్ని పొగచేతనుంబలె నన్నిపనులుఁ, గప్పఁబడి యుండు నొక్కొక్కతప్పుతోడ. 48

ఆ. నిఖిలవిషయములను నిస్సంగ మగుబుద్ధి, మదినిగెల్చు, కోర్కి యెదియు లేని
గలనరుండు కర్మఫల ముజ్జగించి స, ర్వక్రియానివృత్తి వడయుఁబార్థ! 49

గీ. వినుము నైష్కర్మ్యసిద్ధి నందినమనీషి, బ్రహ్మము న్గనుతెఱఁగును బల్కరింతు
ధీనిధీ! పరమం బైన జ్ఞాననిష్ఠ, సరణియును సంగ్రహమ్ముగా నెఱుకపఱుతు. 50

గీ. అచ్చ మగు బుద్ధితోడ ధైర్యమ్ముతోడ, మనసును విధించి విషయముల్ మానివైచి
వలపు వైరము నదలించుబలిమి నలరు, వాఁడు బ్రహ్మత్వము న్గనువాఁడు పార్థ! 51

గీ. ఒంటి నిల్చి యించుక తిను టోర్చి మదిని, బలుకు నొడలిని దన కగ్గపఱుచుకొని ని
రంతరధ్యాతయై వీతరాగుఁ డైన, వాఁడు బ్రహ్మత్వము న్గనువాఁడు పార్థ! 52

గీ. ఆము బల్మిని బింకము నపనయించి, కామమును గ్రోధమును బరిగ్రహముఁ బాసి
మమత విడనాడి శాంతిసామ్రాజ్య మేలు, వాఁడు బ్రహ్మత్వము న్గనువాఁడు పార్థ! 53

గీ. అన్న! బ్రహ్మత్వ మంది ప్రసన్నచిత్తుఁ, డైనవాఁడు దుఃఖము నందఁ డాస లెఱుఁగఁ
డఖిలభూతములన్ దనయట్లె చూచు, నుత్తమం బగు మద్భక్తి నొంది తనయు. 54

ఆ. ఇతఁడు భక్తిచేత నే నెంతవాఁడనో, యెవఁడనో యెఱుంగు నవల నాదు
గుట్టునెల్ల నూఁచముట్టుగాఁ గని నన్నుఁ, జేరు నోయి! సమరవీరముఖ్య! 55

గీ. నిరతముగ సర్వకర్మముల్ నెఱపుఁ గాక, యనఘ! న న్నాశ్రయించినయట్టివాఁడు
జననమరణాది వికృతులజడ్డు లేని, శాశ్వతపదమ్ము గను మత్ప్రసాదమునను. 56

ఆ. మనసుతోడ నెల్లపనుల నా కర్పించి, నన్నె పరమగతిగ నమ్మి నమ్మి
బుద్ధియోగ మూని శుద్ధచరిత్ర! నా, యందె మదిని జేర్పు మది శుభమ్ము. 57

గీ. చిత్తమును నీవు నాయందుఁ జేర్చితేని, దాఁటరాని కంచెలనెల్లఁ దాఁటఁగలవు
కాక నీ వహంకారముకతన నన్ను, దుక్తి వినవేని చెడిపోదు వోయి పార్థ! 58

ఆ. ఈ వహంత నాశ్రయించి రణమ్మున, కీయకోలు చూపవేని యది ని
రర్థకప్రయత్న మగు నీస్వభావంబె, పనుపఁగలదు నిన్ను బవరమునకు. 59

గీ. తెలివి సెడి నేఁడు నీ వేది సలుప ననుచుఁ, బట్టుపట్టితివో యది తుట్టతుదకుఁ
బ్రకృతిసిద్ధ స్వకర్మానుబద్ధబుద్ధి, నాచరించెద వవశత్వ మంది పార్థ! 60

గీ. ఫల్గునా! జగదీశుఁ డీ ప్రాణికోటి, హృదయములఁ బీఁటవెట్టినాఁ డిది యెఱుంగు
మతఁడు తనమాయచే యంత్రగతములైన, బొమ్మలంబలె నాడించు భూతములను. 61

గీ. ఎల్లవిధముల నీ వాశ్రయింపు మతని, నాతఁడె శరణ్యుఁ డఖిలభూతావళికిని
దత్ప్రసాదమ్ముకతన నితాంతశాంతి, చెందఁగలవు కైవల్యము నందఁగలవు. 62

గీ. ఇట్లు పరమరహస్యమై యాద్య మైన, జ్ఞానమును నీకుఁ దెల్పితి దీని నీవు
త్రచ్చి తడవి శోధించి నీయిచ్చవచ్చి, నట్లొనర్పుము రథికలోకాగ్రగణ్య! 63

గీ. సర్వ గుహ్యతమంబు ప్రశస్త మైన, యస్మదీయోక్తి వెండియు నాలకింపు
నీవు నానెచ్చెలివి కాన నీహితమ్ము, కోరి యిటు సేయుచున్నాఁడ వీరముఖ్య! 64

గీ. ఈవు నా కిష్టుఁడవు కాన నిది ప్రతిజ్ఞ, చేసి చెప్పెదఁ బార్థ! నీచిత్త మస్మ
దభిముఖ మొనర్పు! నాభక్తినందు! నను య, జింపు! నాకుమ్రొక్కుము! నన్నుఁ జెందఁగలవు.

ఆ. సర్వధర్మములను జాలించి నీవు న, న్నొకని నాశ్రయింపు ముదిలపడక
పార్థ! నిన్ను సర్వపాపముక్తు నొనర్తు, నార్తి నణఁచి నీకుఁ గూర్తు శుభము. 66

గీ. తపము జేయని, భక్తిపైఁ దగులు లేని, శ్రవణవాంఛ జనింపని జనున కెఱుక
సేయకుము దీని నాపై నసూయఁ జూపు, వానికిని దెల్పకుము దీని ధీనిశాంత! 67

ఆ. ఎవ్వఁ డతిరహస్య మీశాస్త్ర మర్థిమైఁ, బలుకు నస్మదీయ భక్తతతికి
నతఁడు పరమభక్తి నార్జించి నిస్సంశ, యముగ నన్నుఁ జెందు సమరకుశల! 68

ఆ. అతనికంటె మనుజులందు నాకున్ బ్రియ, కృత్తముందు చిక్కఁ డిం కొకండు
వానికంటె నాకు వసుధను బ్రియతరుం, డొరుఁడు దొరకఁ డచ్చుతరచరిత్ర! 69

ఆ. ధర్మపథమునుండి తలఁగనిదై మన, చర్చ నొదవినట్టి శాస్త్ర మిది ప
ఠించువానిఁ గవ్వడీ! నన్ను జ్ఞానయ, జ్ఞమునఁ గొల్చువానిఁగా గణింతు. 70

ఆ. అనఘ! శ్రద్ధతోడ ననసూయతాబద్ధ, బుద్ధితోడ నీ ప్రపూతశాస్త్ర
మాలకించు నెవ్వఁ డాతఁడు ముక్తుఁడై, పొందఁగలఁడు పుణ్యభువనములను. 71

గీ. ఫల్గునా! నావచించిన పరమశాస్త్ర, మాలకించితె దీని నేకాగ్రమతిని?
సమసెనే నీకు నజ్ఞానజనిత మైన, మోహ మెల్ల విషాదప్రవాహ మెల్ల? 72

అర్జునుఁడు

గీ. శ్రీహరీ! నీదుకరుణ నామోహ మెల్ల, నష్టమయ్యెను జ్ఞానంబు నాకు నొదవె
సమసె ననుఁ బట్టి పీడించుసంశయంబు, లేను నీపల్కు పాటింతు నిచ్చతోడ. 73

సంజయుఁడు

గీ. అధిప! యేనివ్విధాన మహాత్ముఁ డైన, చక్రపాణి కర్జునునకు జరిగినట్టి
భవ్యసంవాదమును గగుర్పాటుతోడ, విన్నవాఁడ ధన్యత్వము గన్నవాఁడ. 74

ఆ. నృపతి! పరమగుహ్య మీయోగ మేను యో, గేశ్వరుండు కృష్ణుఁ డెట్టయెదుటఁ
బలుకుచుండ వింటిఁ బరమర్షి నాఁ గీర్తి, గనినయట్టి వ్యాసుకరుణకతన. 75

గీ. రాజ! పరమాద్భుతము పవిత్రంబు కృష్ణ, పార్థసంవాదరూపయై పరఁగుదీని
మాటిమాటికిఁ దలఁచి సమ్మదము గందు, మాటమాటకు నిందు మైమఱపు గందు. 76

క. అతివిస్మయకరము ధరా, పతి! కృష్ణుని విశ్వరూపవైభవ; మది నా
స్మృతిఁ బాయక ననుఁ బులకాం, కితగాత్రు నొనర్చు మాటికిన్ నవనవమై. 77

గీ. ఎచట యోగేశ్వరుండైన కృష్ణుఁ డుండు, నెచటఁ బార్థుఁడు నిల్చు వి ల్లెక్కుపెట్టి
యచట సిరి జయ మైశ్వర్య మచలనీతి, యుండు నని విశ్వసించి నాయుల్ల మలరు. 78

రచన 9-9-1963 నుండి 9-10-1963 వఱకు

